

## శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్, విశ్వగురు పీఠాధిపతులు, గుంటూరు.

## దివ్యాశీస్సులు

ఈ సమస్త సృష్టికీ మూలం అమ్మ. నడిపించేది అమ్మ. లయించేదీ అమ్మ. అమ్మ– అనే ఈ రెండక్షరములు అనంతతేజోవిరాజిత అనురాగస్పందనాలు. అమ్మ సకలం, అమ్మ శరణం. అన్ని నేనులు నేనైననేను – అని చెప్పగల గుండెనిబ్బరం ఎవరికుంటుంది ? సృష్టికి మూలమై సర్వాంతర్యామియై విశ్వజనని అయిన దివ్యశక్తికి మాత్రమే ఆ ధైర్యం ఉంటుంది. అట్టి విశ్వశక్తి విశ్వజనీన భావననూ, విశ్వప్రేమనూ విశ్వానికి అందించే నిమిత్తం మానవరూపంలో మన్నవ గ్రామంలో అనసూయగా ఆవిర్భవించింది. జిల్లెళ్ళమూడిలో కాలుపెట్టింది, భూలోక వైకుంఠంగా మార్చివేసింది. అందరూ తన బిడ్డలే అన్నది; తన ఇల్లు అందరిల్లు అన్నది. ఒక్క మెతుకు తాను తినలేదు, కాని అందరినీ కడుపునిండా తినమన్నది లక్షమందికి ఒకేసారి భోజనం పెట్టి ఆప్యాయంగా వారు తింటుంటే ఆనందపడి తృప్తిగా "బ్రేవు"మనే తత్వం అమ్మది.

అంతటి అమ్మకు అసలైన సిసలైన ఉపకరణం అప్పికట్ల కరణం. అమ్మ మాటల్లో చెప్పాలంటే "వాడు అప్పికట్లకు కరణం, నాకు ఉపకరణం" ఆ వ్యక్తి తన హృదయం నిండా అమ్మ ప్రేమని నింపుకుని, అమ్మ అడుగులో అడుగువేసి, అమ్మ ఆశయసిద్ధికై జీవితాన్నే అర్పణచేసిన సౌమ్యశీలి, త్యాగమూర్తి చి॥ కొండముది రామకృష్ణ అమ్మ సశరీరంగా భూమిపై నడయాడినప్పుడు అమ్మను అంటిపెట్టుకుని సేవకునిగా, స్నేహితునిగా, మంత్రిగా, ఆత్మీయునిగా, తనయునిగా సంచరించి అమ్మ చెంత అత్యంత ఆత్మీయస్థానాన్ని పొంది, అమ్మ శరీరం వదిలిన పిదప కొంతకాలం విలపించినా తదుపరి అణువణువులో అమ్మను చూస్తూ అమ్మ ఆశయాన్ని, లక్ష్యాన్ని నెరవేర్చడానికి తీవ్రకృషి సల్పాడు జిల్లెళ్ళమూడిలో అందరింట్లో అమ్మలేదు అనుకునే అమ్మ బిడ్డలను చూసి ఆవేదన పడ్డాడు, ఆరాటం చెందాడు. అమ్మ ఆశయాన్ని నెరవేర్చలేకపోతున్నామే అనే బాధ ఆరోగ్యాన్ని దెబ్బతీసింది. రోగగ్రస్థమైన శరీరాన్ని కూడా లెక్కచేయకుండా అఖరుక్షణం వరకూ అమ్మకోసం తపించాడు, అమ్మ కోసం శ్రమించాడు, అమ్మలోనే ఐక్యం అయిపోయాడు. చి॥ కొండముది రామకృష్ణ శరీరం త్యజించి చిరంజీవి అయినాడు. అతడు ధన్యజీవి, అమ్మ బిడ్డలందరికీ ఆదర్శమూర్తి.

"మాతృశ్రీ" మాసపత్రికలో తను వ్రాసిన సంపాదకీయాలన్నింటినీ ప్రోగుచేసి అమ్మ బిడ్డలందరికీ పుస్తకరూపంలో అందించాలనే మంచి ఆలోచన శరీరాన్ని త్యజించ బోయేముందు రామకృష్ణకు వచ్చింది. కాని అప్పుడు చేయలేకపోయాడు. ఆ మంచి పనిని రామకృష్ణ సోదరుడు హనుమంతరావు, రామకృష్ణ పుత్రుడు సుబ్బారావు, రామకృష్ణ అభిమానులు ఎందరో కలిసిచేసి ఈ విశిష్ట గ్రంథాన్ని సముచితమైన రూపంలో తీసుకురావటం ఎంతో ఆనందదాయకం. చి॥ రామకృష్ణ మనోభావాలకు అద్దం పట్టే ఈ సమగ్ర సవివర భావలహరి అమ్మబిడ్డలను ఆనందింప జేయగలదని ఆశిస్తున్నాను. ఆంధ్ర పాఠక లోకం యావత్తు సముచితమైన రీతిలో దీనిని సమాదరించగలదని భావిస్తూ ఆశీస్సులను అందజేస్తున్నాను.



శ్రీ బండారి వెంకటేశ్ గుప్త,
శ్రీమతి బండారి రాజరాజేశ్వరి

ప్రేమ సాగర ఉత్తుంగ తరంగ మాలికలలో మానవాళిని ముంచి తేల్చేందుకు 20వ శతాబ్దిలో ఆవిర్భవించిన పరమాద్భుత ప్రేమశక్తి - జిల్లెళ్ళమూడి అమ్మ అట్టి అమ్మ ప్రేమతత్వాన్ని "మాతృశ్రీ" మాసపత్రిక ద్వారా నెలనెలా అక్షరరూపంలో అందించిన అదృష్టం, అవకాశం శ్రీ కొండముది రామకృష్ణ గారికి లభించింది అయితే ఆ సదవకాశం, మహదదృష్టం లభించడానికి మూలకారణం అమ్మ। కాగా లోగడ అలా ప్రచురితమైన సంపాదకీయ వ్యాసాలను ఇప్పుడు "మాతృసంహిత" గ్రంధంగా వెలువరించడానికి భూరివిరాళం ఇచ్చి ప్రోత్సహించిన వారు అమ్మ వాత్సల్యాన్ని మెండుగా పొందినవారు, అమ్మను నిత్యం దైవంగా ఆరాధించేవారు హైద్రాబాదు వాస్తవ్యులు శ్రీ బండారి వెంకటేశ్ గుప్త, శ్రీమతి బండారి రాజరాజేశ్వరి దంపతులు వారికి మాహృదయపూర్వక కృతజ్ఞతలు

ఈ గ్రంధప్రచురణకు అవసరమైన మిగతా ద్రవ్యం కొరకు అమ్మబిడ్డలను, ఆస్తిక మహాశయులను అర్థించిన వెంటనే తమ శక్తి కొలదీ విరాళాలను పంపించి, సత్కార్య సిద్ధికి సహకరించిన మహానుభావులు ఎందరో ఉన్నారు వారందరికీ వందనాలు, హృదయపూర్వక అభివందనాలు.

విశ్వగురు పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ ఈ విశిష్ట ఆధ్యాత్మిక గ్రంధాన్ని ఆవిష్కరించడానికి దయతో అంగీకరించి "దివ్యాశీస్సులు" వెన్వెంటనే అందించి, వాత్సల్యామృతం వర్షింపజేశారు. వారికి మా సాష్టాంగ ప్రణామాలు

సుమారు మూడున్నర దశాబ్దాలుగా అమ్మను సేవించి, అమ్మ తత్వంపై సాహిత్యం వెలువరించి, మాతృశ్రీ ఓరియంటల్ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేసి, దాని అభివృద్ధికి ఎంతో కృషి చేసిన శ్రీపన్నాలరాధాకృష్ణ శర్మ గారు అడగగానే గ్రంధపరిచయం భావస్ఫోరకంగా చేసారు వారికి మా మనఃపూర్వక నమస్సులు గ్రంధప్రచురణలో అడుగడుగునా తగు సూచనలు, సలహాలు అందించిన మా శ్రేయోభిలాషులు, ముద్రణారంగంలో, పత్రికా ప్రచురణలో అనుభవజ్ఞులయిన శ్రీ ముక్కామల(సురక్ష) రామారావు గారికి మా ప్రత్యేక ధన్యవాదాలు

ఈ గ్రంధం కవరుపేజీని కళాత్మకంగా, కనువిందుచేయునట్లుగా తీర్చి దిద్దిన Art Line జి వి రమణగారికి, ఈ గ్రంధంలోని వ్యాసాలను తప్పులు లేకుండా ముచ్చటగా, ముత్యాల్లాగా " Type set (DTP)" చేసిన వసుధా గ్రాఫిక్స్ వసంత గారికీ, గ్రంధాన్ని అందంగా, ఆకర్షణీయంగా ముద్రించి సకాలంలో అందించిన శ్రీ కనకదుర్గాప్రెస్ వారికి మా కృతజ్ఞతలు

— శ్రీ కొండముది రామకృష్ణ ఫౌండేషన్.
జిల్లెళ్ళమూడి.

# విషయసూచిక

# ముందు మాట

నా చరిత్ర పండిడుతైన పామరుడు వ్రాయడు. పామరుడయిన పండితుడు వ్రాస్తాడు - అన్నది అమ్మ.

పండితుడయిన పామరు డంటే ఏమిటో, పామరుడయిన పండితుడంటే ఏమిటో, ఆ భేదం నాకు తెలీదు.

నేను పండితుణ్ణి కాదు. గ్రంధాలు చదువలేదు, శాస్త్రాలు తెలియవు

1962వ సంవత్సరం నుండి తన పదసాన్నిధ్యాన్ని అమ్మ నాకు పరమ కృపతో అనుగ్రహించింది.

అప్పటినుండి నేను అమ్మకు బహిరంగమే అయి మెలిగానో, అమ్మ నా అంతరంగమే అయి వెలిగిందో - విడదీసి చెప్పలేని అభేదస్థితిలో జీవనాన్ని అమ్మ నాకు ప్రసాదించింది.

అమ్మను చూసేందుకు అనునిత్యం వందలాది ప్రజలు వస్తారు. వారిలో అనేక విధాల వాళ్ళుంటారు. కొందరు కోరికలతో వస్తారు. కొందరు తెలుసు కుందామనే కుతూహలంతో వస్తారు. కొందరు మోక్షగాములై వస్తారు. కొందరు కేవలం అమ్మను చూసేందుకు మాత్రమే వస్తారు.

అమ్మ అందరినీ సమంగానే ప్రేమించినప్పటికీ - వాళ్ళ మనస్సును బట్టీ, అవసరాన్నిబట్టీ వాళ్ళను అమ్మ ఆదరిస్తుందీ, ఆదుకుంటుందీ, వాళ్ళతో ఆడుకుంటుందీ.

అమ్మను చూసేందుకు వచ్చేవారిలో ఎట్లాగయితే ఎవరి పోలిక వారిదో, ఎవరి కోరిక వారిదో, అమ్మ వాళ్ళను అనుగ్రహించే తీరులుగూడా వెయ్యివిధాలు.

ఒకే ప్రశ్నను ఇద్దరు వేసినపుడు, అమ్మ నుంచి ఇద్దరికీ ఒకే జవాబు ఉండదు. ఎవరి సమాధానం వారిదే

అమ్మ దినచర్యకూడ నిన్న ఉన్నట్లే ఈ రోజు ఉండదు. ఈనాడు వున్నట్లే రేపు ఉండదు.

ఈ వైవిధ్యం వల్లనే అమ్మసాన్నిధ్యం నిత్యనూతనంగా ఉంటుంది. ఇన్ని సంవత్సరాలు ఉన్నా, అహర్నిశం ఉన్నా - ఎప్పటికప్పుడు ఆ చరణసన్నిధి క్రొంగొత్తగానూ ఉంటుందీ, క్రొత్త పరిమళాలను ప్రసారంచేస్తూనూ ఉంటుందీ. క్రొత్త వెలుగులను విరజిమ్ముతూనూ ఉంటుందీ, క్రొత్త అనుభవాలను అందిస్తూనూ ఉంటుంది.

అమ్మను చూసేందుకు వచ్చినవాళ్ళకు 'అమ్మదర్శనం' చేయించేందుకు, అమ్మ ప్రసాదం వారికి అందించేందుకు, ఒక వ్యక్తికావాలి.

అతడికి అర్చకుడు అని పేరు పెట్టండీ, పూజారి అని పిలవండీ.... పేరు ఏదయినా ఆ స్థానం అత్యంత విలువయినది. అతడు భగవంతుడికీ; భక్తుడికీ వారధి వంటివాడు.

పరమ పవిత్రమయిన ఆ బాధ్యతను అమ్మ నాకు ప్రసాదించింది. 1962 నుండి అమ్మ సన్నిధిలో ఆ కర్తవ్య నిర్వహణలో వున్నాను. ఆ బాధ్యత సులభ మయినదిగా కనిపిస్తుందిగానీ, అది అసిధారావ్రతంలాంటిది.

అమ్మ మాధవిగా ఆరాధింపబడుతున్నప్పటికీ, అమ్మ దేహధారిణి. దేహానికి కొన్ని పరిమితులూ, లక్షణాలూ ఉంటాయి. అవి ఏ దేహానికయినా అనివార్యమే. అట్లా అని సామాన్యమానవులవలె అమ్మ ప్రవర్తన వుంటుందా ? - అని ఆలోచిస్తే, అవలోకిస్తే.... సామాన్యులకూ - అమ్మకూ హస్తిమశకాంతరం.

సామాన్యమయిన తరుణాల్లో అమ్మశరీరమూ - సాధారణంగానే ఉంటుంది. కాని క్లిష్టసమయం వచ్చినపుడు లోకాతీతమయిన, మానవాతీతమయిన ఆ శరీర అసాధారణ స్థితి మనకు అవగతమవుతుందీ, అనుభూతమవుతుందీ; ఆశ్చర్య పరుస్తుందీ.

ఆ శరీరం వెన్నకంటే ఎట్లా మృదువుగా ఉంటుందో, అవసరసమయాల్లో వజ్రంకంటే కఠినంగానూ ఉండగలదు.

అందువల్లనే అమ్మ 'సర్వరోగసమన్విత' - అయినప్పటికీ హాయిగా నవ్వుతూ జీవించగలుగుతున్నది.

అమ్మకూ మనవలె మనస్సు ఉన్నది. అయితే, అది అన్ని విధాల పరిమితులకూ, పరిధులకూ అతీతమై ఉంటుంది. స్వతంత్రమై ఉంటుంది. భిన్నత్వ రహితమై ఉంటుంది. సంపూర్ణమై ఉంటుంది.

అపురూపమైన అమ్మరూపసౌందర్యం వల్లనూ, అతిమానవమైన అమ్మ శరీర ధర్మాలవల్లనూ, స్వతంత్రమూ, సమగ్రమూ అయి భిన్నత్వంలేని అమ్మ అసాధారణ మనస్తత్వంవల్లనూ - అమ్మ జగత్తుకంతకూ 'అద్భుతవ్యక్తి'యై అర్చామూర్తి అయింది.

ఈ దేహమూ, మనస్సూ ప్రవర్తించే విలక్షణమయిన తీరులో మనకు అసంఖ్యాకమయిన కథలు, గాథలు లభ్యమవుతున్నాయి.

అమ్మ మహామేధావి. అమ్మ జ్ఞాపకశక్తి అత్యద్భుతమూ, అనుపమమూ, అసామాన్యమూ అయింది.

అమ్మ మహాయోగిని. పరమజ్ఞాని ప్రతిభాశాలిని అయిన గురువు తన ఇష్ట ప్రకారం అందరినీ నడుపుకుంటూ అందరి ఇష్టప్రకారం తాను నడుస్తున్నట్లు కనిపించే పరమలౌక్యం అమ్మతత్వం.

అమ్మ పరమలావణ్యవతి. అమ్మ కరచరణాదులు అంగాంగమూ అతిలోక సుందరాలై భాసిస్తూంటాయి.

అమ్మ ఆదర్శ గృహిణి. పతియే దైవం - అని మనసారా విశ్వసించి, పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించిన పతివ్రతాశిరోమణీ, సర్వాన్నీ స్వాధీనం చేసుకున్న పరమసాధ్వి.

అమ్మ స్థితప్రజ్ఞ. అమ్మ దృష్టిలో కష్టసుఖాలు రెండూ దైవం ప్రసాదించిన వరాలే. ఆగ్రహానుగ్రహాలని రెండు లేవు. అంతా కటాక్షమే. పడటానికీ, పడకుండా ఉండడానికీ, పడినా దెబ్బలు తగులకుండా ఉండడానికీ, అన్నిటికీ కారణం ఒక్కటే. ఏమీ కావాలనేది అక్కరలేకుండా కావాలి - అనుకునే నిర్లిప్తస్థితి అమ్మది.

అమ్మ సిద్ధసంకల్ప. అమ్మ శుద్ధమానసంలో ఏ భావ తరంగం ఉత్పన్న మయినా అది క్రియారూపం ధరించవలసిందే !

అమ్మ అమోఘవచస్క. అమ్మ తమాషాగా అన్నట్లుంది గానీ అమ్మ వాక్కు ఎప్పుడూ వ్యర్థంగాదు. తోలునోరు కాదు గదా ! తాలుమాట రాదు - అన్నది అమ్మ.

అమ్మ వాక్చతుర. అమ్మ మధురాలాప. అమ్మ వాగేశ్వరి. అమ్మ వాగ్దేవత.

అమ్మ ప్రేమస్వరూపిణి. తనను ఎవరు ప్రేమించినా, ప్రేమించక పోయినా, ద్వేషించినా, దూషించినా, హింసించినా... అందరినీ ప్రేమించాలనుకునే ఉదాత్త మనస్విని అమ్మ. మన యోగ్యతాయోగ్యతలతో అవసరంలేని అవ్యాజమయిన, అనిర్వచనీయమైన, అనంతమయిన, అమలినమైన అమ్మ ప్రేమ అతి సహజ మయింది.

అమ్మ నిరుపమ త్యాగమయి<br>
అమ్మ సహనమూర్తి.<br>
అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే -

తాను సూర్యతాపంలో పరితప్తమవుతూ, ఆశ్రితులకు చల్లని నీడను అనుగ్రహించే తరువు స్మృతిలో మెదులుతుంది. తనను శిలాఘాతాలతో బాధించిన వారికి సైతమూ తీయని ఫలాల నందించే వృక్షం కళ్ళముందు కదులుతుంది.

తాను కాలిపోతూ మనకు వెలుగులు వెదజల్లే క్రొవ్వొత్తి జ్ఞాపకం వస్తుంది.

తాను కరిగిపోతూ, అరిగిపోతూ మనకు పరిమళాలను ప్రసరించే చందనపు చెక్క మన మనస్సులో చోటుచేసుకుంటుంది. మన మాలిన్యాన్ని తాను గ్రహించి మనను శుభ్రపరిచే పావనజాహ్నవి గుర్తుకు వస్తుంది

అందువల్లనే అమ్మ – తల్లి అంటే తరింపజేసేది - అని తననుగురించి తానే అపూర్వమయిన నిర్వచనాన్ని ఇచ్చింది. మనం బురద పూసుకున్నా మరేమి పూసుకున్నా శుభ్రం చేయాల్సిన బాధ్యత తనదట.

అమ్మ పరమదయాళువు.

మంచివాళ్ళను వాళ్ళ మంచితనమే కాపాడుతుంది. వాళ్ళు లోకంలో ఎట్లాగూ గౌరవింపబడుతారు. చెడ్డవాళ్ళను నేనుకూడా దగ్గరకుతీయకపోతే ఎట్లా ? అందుకే నాఒళ్ళోనూ, నా ఆవరణలోనూ వాళ్ళకు ఎప్పుడూ స్థానం ఉంటుంది - అని చెప్పిన కరుణారససాగర అమ్మ.

అమ్మ విరాగిణి. విరాగమంటే మమకారాలను తుంచివేసుకొనడం కాదు, పెంచుకొనడం - మమకార పరిధిని విస్తృతపరచి, సర్వజగత్తుకూ పరివ్యాప్తం చేయడం.

ఎవరిని చూసినా తన బిడ్డయే అనిపిస్తుందట అమ్మకు. తన బిడ్డయందు ఏమి చూస్తుందో, అందరియందు దానినే చూడగల వాత్సల్య స్వరూపిణి అమ్మ. సర్వ ప్రపంచాన్ని తన కన్నబిడ్డగా లాలిస్తూ పాలిస్తూ "ఈ సృష్టి నాది" అని ఉద్ఘాటించ గలిగిన విశాలహృదయ; విశ్వకుంటుంబిని విశ్వజనని అమ్మ.

అమ్మ అద్వైతమూర్తి. అమ్మకు జాతి మత భేదం లేదు. వర్గ, వర్ణ భేదం లేదు. వయో లింగ భేదం లేదు జడ చేతన భేదం లేదు. దేశ కాల భేదం లేదు. మంచివాళ్ళనీ, చెడ్డవాళ్ళనీ భేదం లేదు. పెద్దవాళ్ళనీ, పేదవాళ్ళనీ భేదం లేదు. పండితులనీ పామరులనీ భేదం లేదు. ఇంట్లోవాళ్ళనీ ఇతరులనీ భేదం లేదు. సర్వ భేదాలకూ అతీతమయిన అత్యున్నతమయిన స్థితి అమ్మది.

అమ్మ సర్వజ్ఞ. అమ్మ సర్వవ్యాపిని. అమ్మ సర్వశక్తిమయి. అమ్మ ఘటనాఘటన సమర్థ.

అమ్మ దృష్టిలో అందరూ మంచివాళ్ళే. అందరూ మహానుభావులే. అందరూ జ్ఞానమూర్తులే. అందరూ దైవస్వరూపులే అందరూ పవిత్రులే. అందరూ పూజ్యులే.

అందువల్లనే అమ్మలోక వందిత అయింది. మరి, సర్వత్రా ఎవరు పూజ్య భావం కలిగివుంటారో వారే పూజ్యులు, సర్వత్రా ఎవరు మంచితనం చూస్తారో వారే మంచివాళ్ళు కదా, అమ్మ అనుభవంలో - జగత్తూ - జగదీశ్వరుడూ వేరు కాదు.

అమ్మ దర్శనం.

అంతా అదే - నని.

ఎంత వెదికినా నాకు అది (సత్ లేక దైవం) కానిది కనుపించడం లేదని ఘంటాపథంగా చెప్పింది.

అమ్మ ప్రబోధం

అందరినీ ప్రేమించ-మని.

రెండు దశాబ్దాలుగా అనుక్షణం అమ్మను దర్శిస్తూ, అమ్మధ్యాసే ధ్యానంగా జీవిస్తూ అవగాహన జేసుకున్న పరమాద్భుత విషయం రెండు ముక్కల్లో చెప్పాలంటే-

అమ్మ స్వరూపలలిత. స్వభావమధుర.

ఈ సత్యాన్ని ఆవిష్కరించే ఘటనలు అమ్మ చరిత్రలో సహస్రాధికంగా దర్శన మిస్తాయి.

చెరుకుగడను ఎక్కడ కొరికినా మధురంగానే ఉన్నట్లు - అమ్మ చరిత్రలో ఏ క్షణాన్ని గీటురాయిపై పెట్టినా, అది దివ్యత్వాన్నే ప్రకటిస్తుంది.

అమ్మ నోటివెంట వెలువడిన ప్రతివాక్యమూ సత్యాన్నే ప్రవచిస్తుంది.

అహర్నిశం అమ్మ సన్నిధిన ఉంటూ నేను కన్నవీ, విన్నవీ నాగుండెలో జాగ్రత్తగా భద్రపరుచుకున్నాను. వేలాది జనుల అనుభవాలను అవగాహన చేసుకున్నాను

అమ్మ అనుగ్రహంతో అనుమతితో అనుభవాల్ని అక్షరబద్ధం చేయడానికి మొదలు పెట్టాను.

అదే సాహసంతో అమ్మ జీవితచరిత్ర రచనకు కూడా ఉపక్రమించాను.

1966లో మాతృశ్రీ మాసపత్రిక ప్రచురణ ప్రారంభమయింది. ఆ పత్రిక సంపాదకత్వం అమ్మ నాకు ప్రసాదించిన వరాల్లో ప్రధానమైంది.

ఆనాడు నాన్నగారు అడిగారు, "ఒక వ్యక్తి గురించి నెల నెలా ఏమి చెబుతావూ? ఎన్నాళ్ళు చెబుతావూ ?" అని.

"చూసే కన్నూ, వ్రాసే పెన్నూ ఉండాలి గానీ ఇన్నాళ్ళని ఏముందీ ? ఎన్నేళ్ళయినా చెప్ప వచ్చును" అన్నాను.

ఇప్పటికి 30 సంవత్సరాలయింది. 200కు పైగా సంపాదకీయ వ్యాసాలు వ్రాశాను. ఒక దానిలో స్పృశించిన విషయం మరొక దానిలో ప్రస్తావించ లేదు.

భగవంతుడెప్పుడూ భక్తుని మాటను నిలబెట్టడానికే ప్రయత్నిస్తాడు. ప్రహ్లాద చరిత్రవల్ల మనకీ సత్యమే సుబోధమవుతుంది.

ఈ వ్యాసాలవల్ల అనంతమయిన అమ్మ స్వరూప స్వభావాల్లో అణుమాత్ర మయినా నా అనుజులకు నేను అవగాహనచేయగలిగితే - అది అమ్మకు వారిపై గల వాత్సల్యఫలితమే గానీ నా కలం బలం ఎంతమాత్రం కాదని సవినయంగా మనవిచేసుకుంటున్నాను.

'మాతృసంహిత' కు నన్ను ఉపకరణం చేసుకున్న అమ్మ అనిర్వచనీయ అనంత వాత్సల్యాప్రసారానికి సాష్టాంగ ప్రణామము లర్పిస్తున్నాను.

"మాతృసంహిత" గ్రంథ ప్రచురణకు భూరి విరాళం ఇచ్చిన శ్రీ బండారి వెంకటేశ్ గుప్త, శ్రీమతి బండారి రాజరాజేశ్వరి దంపతులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. వారికీ, వారి కుటుంబానికీ అమ్మ ఆశీస్సులు సదా లభించుగాక !

జిల్లెళ్ళమూడి
15.8.98

కొండముది రామకృష్ణ

# భావసౌరభం

'సంహిత' అనే పదానికి సాధారణార్థాలెన్ని ఉన్నా, 'వేదసంహిత' 'విశ్వాధారమూ, విశ్వనియామకమూ అయిన పరతత్త్వము' అనే రెండు అసాధారణ మయిన అర్థాలు గూడ ఉన్నాయి. 'మాతృసంహిత' అంటే 'మాతకు సంబంధించిన వేదసంహిత లేక మాతను తెలియజెప్పే వేద సంహిత' అనీ, 'మాతృరూపంలో ఉన్న పరతత్త్వమనీ అర్థం చెప్పుకొనవచ్చు. ఈ గ్రంథ రచయిత యశఃకాములు శ్రీ కొండముది రామకృష్ణ గారు తన మదిలో ఈ గ్రంథనామధేయాన్ని గూర్చి యేమని సంభావించారో నాకు తెలియదు గాని, ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం అధ్యయనం చేసిన తరువాత నాకు గల్గిన లేక స్ఫురించిన అర్థాలు పై రెండూ మాత్రమే

అమ్మ అఖిలజగన్మాతగా అందరిచే ఆరాధింపబడుతున్నది 'నీవు ఎవరమ్మా?' అని ఒకరడిగితే - 'నీకూ, మీకూ, అందరికీ, అన్నిటికీ అమ్మను' అని ఆ తల్లి బదులు పలికింది. వేఱొకరికి 'నేను నేనయిన నేను' అని సమాధాన మిచ్చింది. ఈరెండవ నిర్వచనాన్ని వివరిస్తూ 'మీలో ఉన్న నేనూ, నాలో ఉన్ననేనూ, అందరిలో, అన్నిటిలో ఉన్న నేనూ నేనే'' అని చెప్పింది అమ్మ. ఈ రెండు నిర్వచనాల వల్ల, అమ్మ 'పరదేవతా స్వరూపిణి' అనీ, 'పరతత్త్వ స్వరూపిణి' 'విశ్వజనని' అనీ తనను తాను లోకానికి పరిచయం గావించుకొన్నది. ఈ అమ్మ మన సమకాలంలో జిల్లెళ్ళ మూడిని తన భౌతిక కాయానికి నివాసంగా చేసికొని విలసిల్లింది గనుక ఆమెను అందరూ 'జిల్లెళ్ళమూడి అమ్మ' అని ఆప్యాయంగా పిలుచుకుంటారు.

అమ్మతో నా అనుబంధం సుమారు మూడున్నర దశాబ్దాలకు పయిగానే పరివ్యాప్తమయింది. ఇంచుమించు శ్రీరామకృష్ణగారి తోగూడ నా సౌభ్రాత్ర సంబంధం పయి కాలానికే పరిమితమయింది. అమ్మనాకు ప్రసాదించిన వరాలలో ప్రముఖమయినది - ఎందరో పురుషులు సోదరులుగా, స్త్రీలు సోదరీమణులుగా లభించటమే. అట్టి వారిలో నాకు అత్యంత ప్రియసోదరులు శ్రీ కొండముది రామకృష్ణగారు. అప్పికట్ల గ్రామానికి 'కరణ' మయిన ఆయనను అమ్మ అవ్యాజవాత్సల్యంతో తనకు ప్రధానార్చకునిగా, ప్రముఖమయిన 'ఉపకరణ'ంగా ఎన్నుకుని, ఆయన జీవితాన్ని 'రసరమ్య ప్రకరణం'గా తీర్చి దిద్దుకున్నది. ఆయన

సమర్పణ బుద్ధీ, త్యాగమయ జీవితం నాకెంతో స్ఫూర్తి నిచ్చి, మార్గదర్శనం గావించాయి. కానీ ఆయనవలె అమ్మ సన్నిధిలో ఉండలేకపోయాను. ఆయన ఆదర్శాన్ని ఆచరణ సాధ్యం చేసికొన లేకపోయాను. ఆ ఉదాత్తవ్యక్తి అభినవ యౌవనారంభం నుండి, అంతిమ శ్వాసవదిలే వరకు జిల్లెళ్ళమూడిలో ఉండి అమ్మ సేవలో తన జీవితాన్ని చరితార్థం చేసికొన్న ధన్యాత్ముడు. అందువల్ల వయసులో ఆయనకంటె నేను కొంచెం పెద్ద వాడనయినా, అనుభవంలో మాత్రం చిన్నవాడినే. నిజమే మఱి ! మహాత్ములకు మహితోకరణమై, వారిసన్నిధిలో జీవయాత్ర సాగించట మంటే అసిధారావ్రతమే ! అందుకు ఎంతో ధైర్యమూ, చిత్తస్థైర్యమూ, కష్ట సహిష్ణుతా, అన్నింటినీ మించి ఆ మహాత్ముల అనుగ్రహమూ ఉండాలి. వారి అనుగ్రహమూ నిర్వ్యాజమూ, నిరవధికమూ అయినా పై ధైర్య, స్థైర్యాది గుణాలు లేకపోతే అది ఫలప్రదంగాదు. పై గుణాలన్నీ శ్రీ రామకృష్ణగారిలో పుంజీభవించి ఉన్నాయి. అందుకే ఆయన అమ్మకు ముద్దు బిడ్డడూ, ఉత్తమమయిన ఉపకరణమూ అయినాడు.

అమ్మదయ ఆయన మీద అపారంగా కురిసింది; ఆమె ప్రేమ సాగరపు లోతులను ఆయన దర్శించాడు. 'విశ్వాసమే భగవంతుడు' - 15 అన్న పేరు గల సంపాదకీయంలో ఆయన ఇలా అన్నారు -' అమ్మ దైవమనే భావం స్థిరం కావాలి. విశ్వసృష్టి, స్థితి, లయాలకూ, తన జనన మరణాలకూ, జయాపజయాలకూ, సుఖ దుఃఖాలకూ, అభివృద్ధి పతనాలకూ, సర్వానికీ అమ్మయే కారణమన్న ఆరూఢ స్థితి రావాలి. నిరంతరం ఆ మూర్తినే అర్చించాలి. కన్నుమూసుకున్నా, తెరచినా ఆరూపమే కనిపించాలి. తన పంచేంద్రియాలు సదా ఆమూర్తికి ఉన్ముఖమై ఉండాలి. అహరహమూ తన రోమరోమమూ ఆస్మరణతోనే పులకలెత్తాలి. శరీరంలోని అణువణువూ ఆ గానంతోనే పరవశించాలి. తన రక్తమాంసాలు ఆధ్యానంతోనే తుకతుక ఉడికిపోవాలి. అదీ ఆరాధన - అంటే, సర్వకాల సర్వావస్థలయందూ తన సర్వశక్తులనూ, 'తన సర్వస్వం' అని నమ్మిన దాని కోసం అర్పించటమే. ఆ అర్పణలో తాను పూర్ణాహుతి కావాలి. తాను అంటూ లేకుండా తన్మయమే అయిపోవాలి''. మూడు దశాబ్దుల క్రింద తాను గావించిన ఆ ఆరాధనా నిర్ణయం ఆయన జీవితంలో ప్రత్యక్షర సత్యమై ఆ మహిత చరితుని జీవన విధానానికి అద్దం పట్టింది నిజానికి ఆయన చేసినది నిర్ణయంగాదు - అది ఆయన హృదయాంతరాళం నుండి వచ్చిన, అనన్య ప్రేమ పూర్వక ప్రార్థన. ఆ ప్రార్థనను అమ్మ ఆలకించి ఆయనను ఆశీర్వదించింది. ఆ ప్రార్థన సర్వాత్మనా ఫలించింది. ప్రార్థనకు - ఆర్తితో గూడిన ప్రార్థనకు ఎంత శక్తి ఉన్నదో శ్రీ అరవింద మహాయోగి తమ సావిత్రి అనే ఆంగ్ల మహాకావ్యంలో ఇలా వర్ణించారు :

"A prayer, a master act, a king idea
Can link man's strength to a transcendent force
Then miracle is made the common rule,
One mighty deed can change the course of things,
A lonely thought becomes omnipotent"
— (Savitri - Book one - Canto Two)

అమ్మ తన కుపకరణమయిన శ్రీ రామకృష్ణగారిని పరమ రమణీయ సజీవ శిల్పంగా తీర్చిదిద్దుకున్నది. "సహన మనే దేవతను ఆరాధించాలంటే బాధలనే పుష్పాలు కావాలి" - అన్నది అమ్మ. 'తాను సహన దేవతగా నిలిచి ఆయనకు బాధలనే పుష్పాలనిచ్చి ఆయనచే తన పూజ చేయించుకొన్నది సాంసారికమయిన, ఉద్యోగ సంబంధమయిన బాధ్యతలూ, బాధలూ తన సేవా కార్యక్రమ నిర్వహణలో ప్రబల, ప్రతిబంధకాలుగా నిలిచినపుడు, ఆయన వాటిని అమ్మ తన విశ్వాసానికి పెట్టిన నికషోపలాలుగా భావించి, పూజా పుష్పాలుగా అమ్మకు నివేదించుకొని కర్తవ్య పథంలో నడిచిన ధీరుడు శ్రీ రామకృష్ణగారు. అమ్మ పాంచభౌతికి శరీరాన్ని పరిత్యజించిన పిదప అమ్మ అనుగ్రహంతో స్థాపింపబడిన మాతృశ్రీ విద్యాపరిషత్, విశ్వజననీ పరిషత్ మొదలయిన సేవా ప్రతిష్ఠానాలను అమ్మ ప్రతి రూపాలుగా భావించి, వాటి సేవలోనే తుది శ్వాసవిడిచిన కర్మయోగి శ్రీరామకృష్ణగారు

అమ్మ సేవలో తమ జీవితాలను ధన్యం గావించుకొన్న మహనీయులెందరో ఉన్నారు; కానీ వారిలో చాల మంది తమతమ ఉద్యోగాలనూ, వ్యాపారాలను, సాంసారిక బాధ్యతలనూ నిర్వర్తించుకుంటూ యధాశక్తి అమ్మకు సేవ చేసికొన్న వారే. "తమ కార్యంబు పరిత్యజించియు పరార్థప్రాపకుల్ సజ్జనుల్" అన్న భర్తృహరి మహాకవి సూక్తికి చక్కని ఉదాహరణం శ్రీ రామకృష్ణోపకరణం.

"శిల్పానికి అందం రావాలంటే ఉలిదెబ్బలవసరం" అన్నది అమ్మ. అనుభవాలనే ఉలిదెబ్బలతో రామకృష్ణ సజీవశిల్పాన్ని సహజ సుందరంగా తీర్చి దిద్దింది అమ్మ. ఈ విషయంలో శ్రీ అరవిందులు చెప్పిన మాటలను చిత్తగించండి.

"Pain is the hammer of the gods to break
A dead resistance in the mortal's heart,
His slow inertia as of living stone" ............

"Pain is the hand Nature sculpturing men
to greatness : an inspired labour chisels
with heavenly cruelty" ... ...... .

"Although the shaping god's tremendous touch
Is torture unbearable to mortal nerves,
The fiery spirit grows in strength within
And feels a joy in every titan pang".
— Savitri - Book Six - Canto Two

ఈ ఉలిదెబ్బలను ఆయన చిరునవ్వుతో స్వీకరించి, అమ్మ తత్త్వాన్ని జీర్ణించుకున్న వారికి వరణీయుడయినాడు. జీవితంలో తనకు గలిగినప్రతి గెలుపూ, జరిగిన ప్రతిమలుపూ - జయాపజయాలు, సుఖదుఃఖాలూ, సమ్మానాలూ అవమానాలూ - అన్ని సంఘటనలూ, అమ్మ అద్భుతానుగ్రహఫలాలుగా స్వీకరించి తన పరమపద సాధానికి సోపానాలుగా మలుచుకున్నాడాయన తగిలిన ఎదురు దెబ్బలన్నీ ఆయన ఆత్మశక్తినీ, చిత్తస్థైర్యాన్నీ పెంచి ఆయన యెన్నుకున్న కర్తవ్య ప్రస్థానంలో మార్గదర్శక దీపాలయ్యాయి. ఈ విషయంలో గూడ శ్రీ అరవిందుల వాక్యాలు ఆయన యెడల స్మరణీయాలూ -

> "Arisen from the tragic crash of life,
> Arisen from the body's torture and death,
> The spirit rises mightier by defeat;
> Its god like wings grow wider with each fall.
> Its splendid failures sum to victory"

— Savitri - Book Six - Canto Two

నిరంతరం అమ్మ సన్నిధిలో ఉండి, అమ్మను అనన్యభక్తితో సేవించి, అమ్మ అలవోకగా ప్రవచించిన ఆధ్యాత్మిక తత్త్వప్రవచనాలను శ్రద్ధగా ఆలకించి, చక్కగా జీర్ణించుకుని ఆమె ప్రపంచానికి అనుగ్రహించిన దివ్యామృత సందేశాన్ని శ్రీ రామకృష్ణ గారు ఈ మాతృసంహితలో నిసర్గ మధురశైలిలో నిక్షిప్తం చేశారు. సుమారు రెండు వందలకు పైగా నున్న వివిధ శీర్షికలలో అమ్మ విశ్వవిరాట్ స్వరూప సౌందర్యం వాత్సల్య పీయూష ప్రవాహం, తాత్త్విక విచారధార ఆయన లేఖినీ గౌరీశిఖరం నుండి త్రిపథగగా జాలువారి జిజ్ఞాసువులయిన బిడ్డల హృదయ కేదారాలను ప్రేమార్ద్రంగావించి జ్ఞాన సస్యాలను పండిస్తాయి.

అమ్మ చేసిన తాత్త్విక విచారంలో పునర్జన్మ వాదానికీ, కర్మసిద్ధాంతానికీ తావులేదు. 'అందరికీ సుగతే' అన్నది అమ్మ ప్రవచించిన సూక్తులలో అద్భుత మయినది. ఇది పైకి సంప్రదాయ విరుద్ధాలుగా భాసించినా లోతుగా విచారిస్తే వీటి పరమార్థం బోధపడుతుంది.

> "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనా దీవుభావపి" - అన్న గీతావాక్యాన్నీ,
>
> "లోకవత్తు లీలాకైవ్యల్యమ్" అన్న బ్రహ్మ సూత్రాన్నీ,
>
> "న నిరోధో నచోత్పత్తి ర్నబద్ధో నచసాధకః ।
> నముముక్షు ర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా" (మాండూక్యకారికా, 2-32)
>
> "నకశ్చిత్ జాయతే జీవః సంభవోస్య నవిద్యతే,

ఏతత్తదుత్తమం సత్యం యత్రకించిత్ నజాయతే (మాం.కారికా, 3-48)

అన్న మాండూక్య కారికాలనూ పూర్వాపర సందర్భసహితంగా, సవిమర్శంగా అధ్యయనం చేస్తే అమ్మ చేసిన పై ప్రతిపాదనలకు చక్కని సమన్వయం దొరుకుతుంది, అది జిజ్ఞాసువులకు పరమానంద దాయకమవుతుంది.

ఈ గ్రంథంలోని ప్రతి వ్యాసమూ విజ్ఞాన విలసితమూ, రసబంధురమూ అయిన కావ్య ఖండికయే. అమ్మ ఈయన ద్వారా బహిర్గతం కావించిన 'మాతృశ్రీ జీవితమహోదధిలో తరంగాలు' అనంత జ్ఞానక్షీర సాగర వీచీ విన్యాసాలు, కావ్యకలా లలితపదలాస్యాలు. తన అనురక్తాక్షరాలతో అమ్మ చరణాలకు పారాణి పెట్టిన కళా తపస్వి శ్రీరామకృష్ణ.

మాతృకరుణారస సిద్ధుడయిన శ్రీరామకృష్ణగారి లేఖిని నుండి రూపు దిద్దుకొన్న ఈ 'మాతృసంహిత'ను ఒక్కసారి చదువ మొదలిడితే చివరిపుట చూచేదాక ఏవ్యక్తీ మధ్యలో ఆపలేడు.

ఈ 'మాతృసంహిత' భక్తులకు పరమప్రేమ సింధువు; తాత్త్వికులకు జ్ఞాన వియద్గంగ; కర్మయోగులకు మార్గదర్శకమణిదీపం.

ఇటువంటి రమణీయ గ్రంథమణిని వెలుగులోనికి తెచ్చిన సహృదయు లందరినీ, హార్దికంగా అభినందిస్తూ, ఈ మహాశయులందరికీ జగన్మాత - అమ్మ సర్వశ్రేయములను సదయాహృదయయై ప్రసాదించవలసినదిగా ప్రార్థిస్తూ సెలవు తీసికొంటున్నాను.

హైదరాబాద్
25.2.99

విబుధ విధేయుడు
పన్నాల రాధాకృష్ణశర్మ







జయహో మాతా శ్రీ అనసూయా
రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి



అమ్మచరణసన్నిధిన శ్రీ లక్ష్మణయతీంద్రులు



శ్రీరామకృష్ణ అన్నయ్య - డా॥ అవంయశేసవరావు



గోపూజచేస్తున్న వసుంధర అక్కయ్య,
సోదరుడు పక్కా శ్రీమన్నారాయణ



అమ్మ ఆశీస్సులు పొందుతున్న
రచయిత శ్రీ కొండముది రామకృష్ణ, ఆయన సతీమణి పద్మావతి



అమ్మపాదపద్మములచెంత
సోదరుడు బ్రహ్మాండం సుబ్బారావు, కుటుంబ సభ్యులతో



అమ్మను అర్చిస్తున్న
సోదరుడు బ్రహ్మాండం రవీంద్రరావు, కుటుంబ సభ్యులతో



''మాతృసంహిత'' గ్రంథప్రచురణకు భూరివిరాళం ఇచ్చిన ప్రధాన
దాతలు హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ బండారి వెంకటేశ్ గుప్త,
శ్రీమతి బండారి రాజరాజేశ్వరి దంపతులు అమ్మ ఆశీస్సులు
పొందుతున్నారు.



శ్రీమతి బండారి రాజరాజేశ్వరి తల్లితండ్రులు వరంగల్లు వాస్తవ్యులు
శ్రీ కొండూరు శేషయ్యలింగం, శ్రీమతి కొండూరు వరలక్ష్మి
అమ్మను అర్చిస్తున్నారు. (వారు కొంతకాలం క్రితం పరమపదించారు)





శ్రీ బండారి వెంకటేశ్ గుప్త మాతాపితలు
కీ॥ శే ॥ బండారి రంగయ్య గుప్త, శ్రీమతి బండారి కమలమ్మ.

76068
45928

# 1
# "మాతృశ్రీ" ఆవిర్భావము

అమ్మ మాట్లాడరట గదా... అంటారు

బధిరులూ, అమ్మ మాట వినని దురదృష్టవంతులూ అనే మాటలవి.

అయితే అమ్మ అనవసరంగా మాట్లాడదు ఉపన్యాసా లివ్వదు సమయం వస్తే సంభాషణ రూపేణ మాట్లాడుతుంది. ఆ మాటల్లో ఎంతో క్లుప్తతా, గుప్తతా ఉంటాయి. అమ్మ మాటలను చాలా పొదుపుగా వాడుతుంది. ఒక్క మాటలో ఎంతో అర్థం యిమిడి ఉంటుంది. ఒక్క మాటలో ఎన్నో భావాలు దాగిఉంటాయి కనుకనే అమ్మ మాటలు తలకొక రీతిగా అర్థమవుతాయి, ఎవరి సంస్కారం, ఎవరి అనుభవం వారిది కాబట్టి.

అమ్మ మాట్లాడని, మాట్లాడలేని విషయం లేదు. అయితే ఏదీ తనుగా చెప్పదు. మనం ఏది అడిగితే అది చెప్తుంది. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు - అన్నిటికీ అమ్మ సంభాషణలో సమానమయిన స్థానం ఉన్నది. పైగా వాటిల్లోని క్లిష్టమయిన విషయాలను ఎంతో సరళంగా, సులభంగా, చిన్న చిన్న మాటల్లో అందరికీ తెలిసేటట్లు చెప్తుంది.

ఇడా, పింగళ - అని యేమేమో పెద్ద పెద్ద మాటలు వాడేస్తుంటే - కుడి, ఎడమ అని నాన్నా, అంత కంటే ఏమీ లేదు అనేస్తుంది

కైవల్య మంటే ఏమిటి - అని సిద్ధాంత రాద్ధాంతాలు చేస్తుంటే 'వైకల్యం లేనిదే' నని నవ్వేస్తుంది.

స్వర్గం అంటే ఎట్లా ఉంటుంది ? - అని చర్చించుకుంటుంటే 'వర్గరహిత మయినదే'' నని తేల్చివేస్తుంది.

ఇలా ఎన్నో నిర్వచనాలు - ఎన్నో సూక్తులు అక్షర దీపాలై మన మనసుల్లో వెలుగుల నింపుతాయి.

అమ్మ ఏవిషయం ప్రస్తావించినా ఎప్పటి కప్పుడు ఎదురుగానూ, చేరువలోనూ ఏవస్తువు ఉంటే దానినే ఉపమానంగా గ్రహిస్తుంది. ఎప్పుడూ ఒకే పాట పాడేందుకు అమ్మది చదువుకున్న విజ్ఞానం కాదు. అమ్మ శాస్త్రాల్లోంచి మాట్లాడదు. అమ్మ మాట్లాడినది శాస్త్రమవుతుంది. అమ్మ వేదాలు వల్లించదు. కాని అమ్మ మాట వేదోక్తములవుతాయి. అందుకే అమ్మ అన్నది : అనుభవం శాస్త్రాన్నిస్తుంది. కానీ శాస్త్రం అనుభవాన్నివ్వలేదు - అని.

ఇంకొక్క విషయం అమ్మ సంభాషణలో ఎంతో విచిత్రమయిన తర్కమూ, సున్నితమూ నిర్బాధాకరమూ అయిన హాస్యమూ యిమిడి ఉంటాయి.

అయితే ఈ సంభాషణలు ఒకరితో కావు ; ఒకసారి ఒకచోట కావు. ఎవరితోనయినా ఎక్కడయినా, ఎప్పుడయినా కావచ్చు. ఆ సమయంలో అక్కడ ఉన్న వారికితప్ప యితరులకు అవి అందవు. కాని ఎక్కడ ఎవరితో ఎప్పుడన్న మాట అయినా అందరికీ అందితే ఎంత బాగుంటుంది ?

అందుకనే విజ్ఞానపు మూటలు, విముక్తికి బాటలు అయిన అమ్మ మాటలు అందరకూ అందచేద్దామనీ, అందులోని అనుభవ సారాన్నీ, ఆనందానుభూతినీ అందరకూ పంచుదామన్న ప్రయత్నమే మాసపత్రిక ప్రచురించుదామన్న ఉద్దేశానికి కారణమయింది.

అమ్మ అవతార వ్యక్తిగా అనేకుల ప్రగాఢ విశ్వాసం. ఆ విశ్వాసం సహేతుక మని అనేక అనుభవాల సారాంశం. ఆ అనుభవాలు ఆకాశదీపాలై సహజీవులకు మార్గదర్శకాలు కాగలవనే ఉద్దేశం కూడా పత్రిక ప్రచురణకు మరొక కారణం.

నిత్యమూ వివిధ బాధలతో, విశ్రాంతి లేని పరిశ్రమతో విసుగెత్తిన పీడిత జనతా సందోహానికి యీ మానవుని గురించి, యీ జీవితం గురించి, యీ లోకం గురించి, ఆ దేవుని గురించి అమ్మ ఏం చెప్తున్నది ? కరువైన మనశ్శాంతిని ఎలా అందిస్తున్నది ?

సత్య పరిశోధనలో నిత్య పరిశీలనలో సతమత మయ్యే జిజ్ఞాసులకూ, సాధకులకూ, యోగులకూ పరమార్థం గురించి, ఆధ్యాత్మికత గురించీ, జ్ఞానం గురించి, స్వర్గమోక్షాల గురించి అమ్మ ఏం నిర్వచనాల నిస్తున్నది ? జీవకోటికిక విముక్తిని ఎలా ప్రసాదిస్తున్నది ?

సర్వ మానవ లోకానికి అమ్మ యిస్తున్న మహత్తర నవ్య సందేశాన్ని ప్రతి గృహాంగణానికి పంపటానికీ, అమ్మ వెలిగించే దివ్యజ్యోతి ప్రభలు ప్రతి

హృదయాంతరాళంలో నింపటానికీ తెలుగు, ఇంగ్లీషు, ఉభయ భాషల్లోనూ మాస పత్రికలు ప్రచురించే బృహత్తర కార్యక్రమాన్ని స్వీకరించాము.

ప్రతి మాసమూ కొన్ని విషయ్యాలను వరుసగా అందించాలని భావిస్తున్నాము.

తొలి అంటే తల్లి అని అర్థం. ఏదేని ఒక విషయమ్మీద అమ్మ యిచ్చిన వివరణ "తొలిమాట"గా తొలుతనే మన మనసులనూ ఆకట్టుకుంటుంది.

అమ్మ అప్పుడప్పుడు పలికిన సూక్తులు నిర్వచనాలు "అక్షర దీపాలు" అయి వెలుగులు ప్రసరిస్తాయి.

అమ్మ సూక్తులను ఎవరి సంస్కారాన్ని బట్టి వారు అర్థం చేసుకుంటారు కనుక ఎవరికి ఎట్లా అవగాహనమయిందీ తమ "రంగుటద్దాలలో" నుండే చూసి, చూసినట్లుగానే పలుకవలసిందిగా అందరినీ అభ్యర్థిస్తున్నాము.

'అమ్మతో సంభాషణయే ఒక మధురానుభవమూ, సర్వశాస్త్ర సార సందర్శనమూ. అమ్మ నోటి వెంట వచ్చేవన్నీ "రవ్వలూ రత్నాలూ" వాటిని ఏరుకోవడమే ఎదుటనున్న వాని వంతు

అమ్మ పాదాలకు అంకితమ్మయిన అనేక జీవిత "దళాలు పరిమళాల" ప్రసరిస్తూ మార్గదర్శక మవుతాయి.

అమ్మ సన్నిధిలో "గడ్డిపోచలు - ఉక్కు ఊచలు"గా మారినట్లు. సాధారణ జీవులే అసాధారణ కార్యక్రమ నిర్వహణలో ఎట్లా పని చేస్తున్నదీ సచిత్రంగా చూస్తారు.

అమ్మ అపూర్వ అద్భుత జీవిత "మహోదధిలో తరంగాలు" అమ్మ విశ్వ విరాడ్రూప సందర్శనం చేయిస్తాయి.

ఇక "రాజా" తన "అనుభవసారం"తో అమ్మను "అనుభవసారం"గా గుర్తించి అమ్మ "అనుభవసారం" తన కంఠంతో వినిపిస్తారు.

అహర్నిశం అమ్మకోసం తపించే ఒకానొక ప్రేమబంధుర హృదయ స్పందనానికీ, తల్లీ బిడ్డల మధ్య అలరారే మధుర మధుర మహనీయ మమతాను బంధానికీ వచన గీత రూపమయిన "రాగబంధం" 'శేషు' అందిస్తారు.

అమ్మను సాక్షాత్ ఆదిశక్తిగా దర్శించిన శ్రీరాధాకృష్ణ శర్మగారు "శృంగార లహరి"లో చేసిన స్తుతి అమోఘమూ, అనన్యమూనూ.

అమ్మ చిన తాతగారయిన కీ॥ శే॥ చంద్రమౌళి చిదంబరరావు గారు అమ్మ చిన్నతనంలోనే, అమ్మ బాల్యం తన వద్ద గడిపినప్పుడే అమ్మను "రాజరాజేశ్వరి" అని సంబోధించి వ్రాసిన పద్యావళిని యిప్పుడు వినిపిస్తాము.

అమ్మను గురించీ, సన్నిధిని గురించీ భవానీ ఆమె అన్నయ్యకు వ్రాసుకున్న ఉత్తరాలు "అర్కపురీ విశేషాలు".

దేశం నాలుగు చెరగులనుండీ అనేకులు తమ తమ బాధలను గాధలనూ, అమ్మ తమపై చూపిన అనుగ్రహ వివరాలనూ, తాము చూసిన అమ్మ మహత్తులనూ రేఖల రూపంలో "నివేదన" చేస్తారు. అవకాశాన్ని బట్టి ఆ లేఖలను అందజేస్తాము

అమ్మను గురించి అనేక రూపాల సాహిత్యం వెలువడుతున్నది క్రమంగా ఒక్కొక్క "పుస్తక పరిచయం" యిస్తాము.

ఇంతకూ ఎన్ని విధాల చెప్పినా... అమ్మ ఏమి చేస్తుంది ? అమ్మ ఏమి చెప్తున్నది ? - అనే.

ఏమయినా ...

ఆ నితాంత ప్రశాంత నిస్తుల నిర్మల సౌందర్య తేజఃపుంజంలోని ఒక్క అంశమయినా మీకు ఎలా అందించగలం ?

ఆ పరమకారుణ్యమూర్తి మృదు హృదయాంతర్గత లలితలలిత భావలహరిలోని ఒక్క వాత్సల్యరసామృత బిందువు నయినా మీపై ఎలా చిందించగలం ?

ఆ రమణీయ దరహాసరోచిస్సుల్లోని ఒక్క రేఖనయినా మీకు ఎలా చూపగలం?

ఏమో... ఆకాశానికి నిచ్చెనలు వేసినట్లు, సముద్రానికి ఏతాము నెత్తినట్లు, వాయుప్రసారాన్ని చిత్రీకరించ ప్రయత్నించినట్లు, అగ్నికణాలను పొట్లాల కట్ట నుంకించినట్లు మే మీ సాహసకార్యం సంకల్పించాము. సాహసంతో కూడిన యీ సత్కార్యం సఫలం కావడం అమ్మ అనుగ్రహం మీద, అందరి అదృష్టం మీద ఆధారపడి ఉన్నదని విశ్వసిస్తున్నాము.

(ఏప్రిల్ 1966)



# 2
# అమ్మ కళ్యాణంలోని ఆంతర్యం

"పెళ్ళిలో పెద్దపులి ఉన్నదని భయపడేవారి భయం పోగొట్టటానికే నేను పెళ్ళి చేసుకుంటున్నాను"

అమ్మలో అలౌకికత గుర్తించిన ఒకరు అమ్మ పెళ్ళి నిర్ణయమయినదన్న విషయం తెలుసుకుని ---

"నీకెందుకమ్మా పెళ్ళి ?"

అని అడిగినప్పుడు చెప్పిన సమాధానమది.

"ఎన్ని వచ్చినా మనస్సుకు ఏమీ సంబంధం లేదని చెప్పటం కోసమే నా యీ పెళ్ళి".

అదే సందర్భంలో మరొకరికి తెల్పిన సత్యమది

సామాన్యంగా ప్రజా సమూహంలో వివాహం ఆధ్యాత్మిక సాధనకు విరుద్ధమనీ, సంసారం అనుల్లంఘనీయ సాగరమనీ కొన్ని భ్రమలు ఉన్నయ్. రాగం అనుబంధమై బంధహేతువవుతుందని కూడా అత్యధికుల మూఢవిశ్వాసం. గృహస్థాశ్రమము ఐహికానికే తప్ప ఆముష్మికానికి సరి అయిన రంగం కాదనే పలువురి నమ్మకం

అట్లా చీకటిలో పడిపోయిన జన సందోహానికి వెలుగు ప్రసాదించటం కోసమూ, యదార్థం బోధించటం కోసమే అమ్మ వివాహం చేసుకున్నారేమో ననిపిస్తుంది.

అమ్మ వివాహానికి, గృహస్థాశ్రమానికీ అనన్యమైన ప్రాముఖ్యత నిస్తుంది.

అమ్మ వివాహానికి యిచ్చిన నిర్వచనాలే క్రొత్త వెలుగులను ప్రసరిస్తున్నయ్.

ఒక పెన్నిధి అందనజేరటమే పెండ్లిట.

ఆ అండను చేరే పరిణామమే పరిణయమట.

సర్వాన్నీ అనుభవిస్తూ, సర్వాన్నీ వదిలి వేయటమే వివాహమట.

కళంకరహితమయిన మనస్సును కళంకరహితంగా అర్పించుట కళ్యాణమట.

ఒక సంభాషణలో ఆశ్రమాల ప్రసక్తి వచ్చినప్పుడు గృహస్థాశ్రమాన్ని చిన్నచూపు చూడరాదని చెప్తూ అన్నది ---

"ఏ ఆశ్రమానికి ఆ ఆశ్రమం అన్నీ గొప్పవే. ఎందులో ఉండే కట్టుబాట్లు అందులో ఉన్నాయి ఉన్నవి ఉన్నట్లు అనుభవించగలిగి చెప్పినవి చెప్పినట్లు చేయగలిగితే, తెలుసుకున్నా ననుకునేది తెలుసుకో గలిగితే అన్నిటికీ ఒకటే స్థితి. అప్పుడు అన్ని ఆశ్రమాలకూ ఒకే విలువ, అన్ని ఆశ్రమాలూ ఒక స్థితినే ఆశ్రయించి ఉన్నాయి.

ఈ భార్యా, సంతానమూ, సంసార బాధ్యతలతోనే జీవితమంతా వ్యర్థమౌతున్నదనీ, ఆధ్యాత్మిక సాధనకు సమయం సమకూరటం లేదనీ వాపోయిన ఒకరితో అన్నది.

"సంసార బాధ్యతలే ఆధ్యాత్మిక సాధన, నాయనా. ఆధ్యాత్మిక సాధన అంటే వేరే అదేదో కాదు. నువ్వు చేసే ప్రతి పనీ భగవత్సేవ యనీ, భగవదాజ్ఞానుసారమే ననీ అనుకోగలిగితే --- యీ సంసారం ప్రతిబంధకం కానేరదు. అనగా నీ దృష్టిలో, భావనలో మార్పు తెచ్చుకోవటమే."

మరొకసారి తన ఆధ్యాత్మిక సాధన యేమిటి ? అని అడిగిన వారితో ---

"పిల్లలను కనడమే -" నని నిర్లిప్తంగా చెప్పి వేసింది.

అమ్మ దృష్టిలో భార్యా భర్తలుభయులూ సమమే. భార్యకు భర్త ఎలా దైవమో, భర్తకు భార్య కూడా అలాగే దేవత అని అమ్మ సందేశం. సాకారోపాసనకు అంతకన్న సులభమయిన, సుగమమయిన మార్గం లేదని అమ్మ ఉద్దేశం. అందుకే అమ్మ జరిపించే వివాహాల్లో వధువు వరుని పాదాలు కడగటమే కాకుండా, వరుడు వధువు పాదాలు కడగాలని అమ్మ ఆదేశం.

భార్యా భర్తలకు వియోగం అనేది లేదని కూడా అమ్మ భావన. మంగళసూత్ర రూపేనా భర్త పాదాలు భార్య కంఠాన ఎలా బంధింప బడి ఉంటయ్యో - యజ్ఞోపవీత

రూపేణా భార్య భర్తతోటే సదా ఉంటుందని అమ్మ అభిప్రాయం. భర్త అంటేనూ, భార్య అంటేనూ శరీరాలు మాత్రమే కాదుగదా అని అమ్మ అంటుంది.

అమ్మ దృష్టిలో వితంతువు కూడా లేదు. భర్త స్మృతి ఉన్నంత వరకూ ఎవరూ వితంతువులు కారని అమ్మ భావం.

ఒకప్పుడు ఒకరు సన్యాసం తీసుకొన వలెననుకుని అమ్మ అనుజ్ఞకోసం వస్తే అప్పుడు అమ్మ అన్నది ---

"వివాహం చేసుకుని గృహస్థుగా ఆధ్యాత్మిక సాధన చేయటం కోటలో ఉండి యుద్ధం చేయటం; సన్యసించటం కోట విడిచి యుద్ధానికి వెళ్ళటం."

అందుకనే అమ్మ ముక్కు మూసుకు కూర్చున్నదే తపస్సూ, యోగసాధన కాదని అంటూ, విరాగమంటే ప్రపంచమందు విముఖత కాదనీ, సర్వత్రా అనురాగం కలిగి యుండడమేననీ విశదీకరిస్తుంది.

పరిమితమైన మమకారాన్ని అపరిమితం చేయమంటుంది. నీ బిడ్డను ప్రేమించినట్లు లోకంలో ప్రతి జీవినీ, ప్రతి వస్తువునూ ప్రేమించమంటుంది. అంతే కాని యీ ప్రేమ బంధమౌతుందని రసవిహీనులు కావద్దంటుంది.

అందుకే అమ్మ తనకు పూజలు చేసే వేళలకంటే --- వివాహాలు జరిపించే సమయాల్లో అత్యంతమూ ఉల్లాసంగా, ఉత్సాహంగా కనిపిస్తుంది.

ఆ కళ్యాణమూర్తికి నేడు కళ్యాణదిన మహోత్సవం. ఈ శుభవేళలో అమ్మకు ఒక అభ్యర్థన చేసుకుంటున్నాము - జగత్కళ్యాణం కూడా చేయమనీ, విలంబం లేకుండా పందిళ్ళు వేయించమనీ, పచ్చ తోరణాలు కట్టించమనీ, మంగళ వాయిద్యాలు పిలిపించమనీ, మహదాశీస్సులు కురిపించమనీ ---

(మే 1966)



## భగవంతుడు

అన్నీ తానే ననుకునే మనస్తత్వమే భగవంతుడు. రెండూ లేనివాడూ రెండూ అయినవాడూ భగవంతుడు. - అమ్మ

# 3
# అమ్మపై సాహిత్యానికి శ్రీకారం

మన మిక్కడ కీ॥ శే॥ కోటంరాజు రామారావుగారిని సంస్మరించుకోవడం ఎంతయినా సముచితంగా ఉంటుంది.

1959లో రామారావుగారు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను సందర్శించారు వారికి ఏమి అనుభూతమయిందో, ఏమి ఆనందించారో ---

''అమ్మా, మిమ్మల్ని గురించి పత్రికలలో పరిచయం చేయుటానికి అనుమతివ్వండి. .'' అని అర్థించారు.

''ఎందుకు ?'' అన్నది అమ్మ.

''అందరూ యీ విషయం తెలుసుకోవాలి  ఇక్కడకు రావాలి. ఈ ఆనందం పొందాలి  తమ జీవితాలు అమృతమయం చేసుకోవాలి. తమ బ్రతుకుబాటలు దీప్తిమంతం చేసుకోవాలి -- నేను పొందిన ఆనందం నా సోదరులుకూడా పంచుకోవాలి.''

ఆ నిస్వార్థమనీషి ఏమేమో చెప్పారు.

''అయితే నాన్నా, నీవు ఏ పత్రికలో చూసి 'వచ్చావు?''

''ఏ పత్రికలోనూ చూడలేదు''

''మరి...''

''ఒకరినుండి విన్నాను.  సంవత్సరం అయిందనుకో, అమ్మా.  ఇవ్వాళ రాగలిగాను''.

''నీకు తరుణం వచ్చింది.  నీకు వినబడ్డది.  నువ్వు వచ్చావు.  ఎవరికి సమయం వస్తే వారూ అల్లాగే వస్తారు ..''

"అందరికీ ఒకేసారి త్వరగా తెలుపవచ్చును గదా, అమ్మా ---"

"పోనీ పత్రికలలో రాశాననుకో నాన్నా, అందరూ పత్రికలు చదువుతారా, పోనీ పత్రికలు చదివే వారయినా నువ్వు వ్రాసిన పత్రిక, అదీ ఆనాడు చదవాలిగా, ఆ పత్రికలోనయినా ఆ వ్యాసం చదవాలి. మరి అందరూ అక్షర అక్షరం చదువుతారా? చదవరు చదివినా వారి మనసుకు పట్టాలి, నీ అనుభవం, నీ భావం, వ్రాస్తే వారి మనసుకూ, వారి ఆలోచనారీతికి సరిపోవాలి కదా. పోనీ, రావాలనుకున్నా -- ఎన్ని సమకూరితే యిక్కడకు రాగలరు ? --- ఇందాక నీవు చెప్పావు కదా --- సంవత్సరం క్రింద విని రావాలనుకుంటే, యీ నాటికి రాగలిగానని

అమ్మ తార్కిక వైభవంముందు రామారావుగారు స్థబ్దులైపోయారు. కొంచెం సేపుండి మళ్ళీ అడిగారు :

"అయితే ఏం చేయమంటారమ్మా ?"

"ఎందుకు ?"

"అందరూవచ్చి ఒక్క సారిఅయినా నీ పాదాలవ్రోల సాష్టాంగపడేందుకు. అనురాగమంటే యేమిటో, ఆనందమంటే యేమిటో, సహనమంటే యేమిటో, త్యాగమంటే యేమిటో తెలుసుకునేందుకు ..."

"ఎందుకు నాన్నా నీ కంత తహతహ?"

"అదికాదమ్మా --- మానవత్వం పలుచబడి పోతున్నవేళ, సత్యధర్మాలు నలిగి పోతున్న వేళ, ప్రేమ స్వార్థపూరితమై కలుషితమై పోతున్న వేళ --- మీరు అవతరించారు, ఒక్కసారి మీ దర్శనం చేసుకుంటే చాలునమ్మా..."

"చూస్తేనే సరిపోతుందంటావా ?"

"చూచినందువల్ల ప్రయోజనం ఉన్నదంటాను, సూర్యోదయం అయినంతనే చీకటి ఎట్లా ఉండదో, అగ్నిజ్వాలదగ్గరకు వెళ్ళినతర్వాత చలిబాధ ఎట్లా ఉండదో, మీ దర్శనమయిన తర్వాత మా మనస్సుల్లో మాలిన్యం నిలవలేదంటాను "

రామారావుగారి ఆవేశపూరిత హృదయాన్నీ, వారి నిస్వార్థ ఆకాంక్షను వారి ఆశాభావాన్నీ అవలోకిస్తూ అమ్మ మౌనంగా ఉండి పోయింది.

"వ్రాయమంటారా, అమ్మా..." మళ్ళీ అడిగారు, అంజలిఘటించి

"చెప్పానుగా, నాన్నా - ఆ తరుణం వస్తే ఎన్ని పనులన్నా ఎవ్వరూతప్పించు కోలేరు. ఆ సమయం వచ్చేదాకా ఎన్ని చదివినా, ఎంత విన్నా - రాలేరు."

సరేనని రామారావుగారు ఆరోజు సెలవు తీసుకున్నారు.

అంతకు క్రితం ఒక్క 'రాజా' పాటలు వ్రాశారు. శ్రీ వెూదడుగు రామచంద్రరావు గారు దండకం వ్రాసి కరపత్రంగా ప్రచురించారు. అంతకు మినహా గ్రంథరూపేణా సాహిత్యం ప్రకటితం కాలేదు.

రామారావుగారి ప్రార్థన వ్యర్థం కాలేదు. వారి కాంక్షలకూ కలలకూ అనతి కాలంలోనే రూపకల్పన జరిగింది. ఆ వెంటనే సోదరులు యార్లగడ్డ రాఘవయ్యగారు 'ప్రసూనాంజలి' అన్న పద్య కావ్యం వ్రాసి ప్రచురించారు. ఆ తర్వాత 61 జనవరిలో మకర సంక్రాంతినాడు శ్రీ భార్గవ విద్యాదేవకులపతి మొదలయిన సోదరులు ఒకేసారి మూడు కావ్యములు ఉభయభాషల్లోనూ వ్రాసి ప్రచురించారు. తరువాత శ్రీ బృందావనం రంగాచార్యులుగారు 'పూజాపుష్పాలు' సమర్పించారు, 62 ఏప్రియల్‌లో అమ్మ జన్మదినోత్సవానికి కొండముది సోదరులు కొన్ని రచనలు సేకరించి జన్మదినోత్సవ అభినందన సంచికను ప్రచురించుట ఆరంభించి వరుసగా నాలుగు సంచికలు వెలువరించటం జరిగింది.

68 ఏప్రిల్‌లో సోదరులు శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారు 'అమ్మ సుప్రభాతం' తో శ్రీకారం చుట్టి పుంఖాను పుంఖంగా ఉభయభాషల్లోనూ వ్రాసి ప్రచురిస్తున్నారు.

మరెందరో సోదరులు తమతమ భక్తికొలదీ, అనుభవాల ననుసరించీ అనేక రీతుల సాహిత్య సృజన చేస్తున్నారు.

దూరాన ఉంటూ అమ్మవద్దకు తరుచుగా వచ్చే సోదరులు అమ్మ సన్నిధిలో నిత్యమూ జరిగే కార్యక్రమాన్ని తెలుసుకునేందుకు ఆసక్తినీ, కుతూహలాన్నీ కనుబరిచారు. అదీగాక నిత్యమూ అమ్మమాటలలో, సంభాషణలలో దొరికే అమూల్యమయిన విజ్ఞాన సంపదనూ - అమ్మ విశాల వినిర్మల హృదయాన్నీ, అద్భుత కరుణా వాత్సల్యాలను స్ఫురింపజేసే సంఘటనలనూ గ్రంథస్థం చేయడం అత్యంతమూ ఉపయోగకరంగా ఉంటుందని మేము ఊహించగా... ఆ మహత్తర కార్యక్రమానికి సోదరి భవానీ ప్రసాద్ బాధ్యత వహించి 63 జూన్ నుండి అమ్మ దినచర్యను గ్రంథస్థం చేస్తున్నారు.

శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు, నేను, యడవల్లి లక్ష్మీ నారాయణ మొదలయిన సోదరులం వ్యాసాలు వ్రాసి పత్రికలలో ప్రచురించాము.

సోదరులు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ ఎక్కిరాల భరద్వాజ్‌గారలు ఇంగ్లీషు సాహిత్యదృష్టి ఆరంభం చేసి తెలుగూ ఇంగ్లీషు భాషలలో మాసపత్రికలు ప్రచురిస్తే - బహు జనులకు మార్గదర్శకంగా ఉంటుందని భావించారు. అసంఖ్యాక సోదరులు ఆ అభిప్రాయాన్ని బలపరచారు

అతి ప్రయాస మీద అయితేనేం - అమ్మ అనుమతి లభించింది. జూన్ నెల నుండి తెలుగూ ఇంగ్లీషూ ఉభయభాషల్లోనూ మాసపత్రిక వెలువరించడానికి నిశ్చయించుకున్నాము.

ఈ సంవత్సరం ఏప్రియల్‌లో ప్రచురించిన జన్మదినోత్సవ అభినందన సంచిక సంపాదకీయంలో మేము పేర్కొన్నట్లు యిది బృహత్తరమూ మహత్తరమూ అయిన కార్యక్రమమే. అమ్మ పరిపూర్ణాను గ్రహం వల్లగానీ యిది నిర్విఘ్నంగా కొనసాగదు.

అదీగాక ఎన్నిరకాలుగా చెప్పినా - అమ్మ ఏమి చెప్తున్నదీ ఏమిచేస్తున్నదీ ఆలకించీ అవలోకించి సోదప లోకానికి అందజేయడమే.

ఒక అవతారమూర్తి మాటనూ చేతనూ అవగాహన చేసుకోవాలంటే - అదేమీ సులభసాధ్యమయిన విషయం కానేరదు. ఈ పాండిత్యం చాలదు. ప్రతిభ చాలదు. బుద్ధిసూక్ష్మత చాలదు. మేధాసంపద చాలదు, అతీంద్రియజ్ఞానం మాత్రమే సమర్థము. వారి ప్రతిమాట ఎంతో అర్థవంతంగా ఉంటుంది. వ్యర్థంగా ఒక్క అక్షరం వారి పెదవి దాటదు. వారి ప్రతిచేతలోనూ ఏదో ప్రయోజనముంటుంది. వారి చెయ్యి కదిలినా కాలు కదిపినా, ఏదో అవసరం ఉండి తీరుతుంది.

కనుక యీ కార్యక్రమ నిర్వహణకు అనవసరమైన శక్తిని ప్రసాదించమని అంజలి ఘటించి అమ్మను అర్థిస్తున్నాను.

(జూన్ 1966)



"నేను గురువును కాను; మీరు శిష్యులు కారు.
నేను మార్గదర్శిని కాను; మీరు బాటసారులు కారు.
నేను అమ్మను; మీరు బిడ్డలు" - అమ్మ

# 4
# జిజ్ఞాస

అమ్మను గూర్చి తెలుసుకోవటం. తెలుప బూనుకోవటం రెండూగూడ ఆకాశపుటంచులకు చేరటం. అగాధ జలధి జలాలను కొలవటం వంటివి అయితే ఇందరు రచయితలు ఆమెను గూర్చి ఇన్ని గ్రంధాలను వ్రాయటం దేనికి ? ఈ పత్రికా ప్రచురణ దేనికి ? నిజమే. ఈ ప్రయత్నమంతా అనవసరమే కానీ మానవుడు నిరంతరం అన్వేషణా పరుడు. తెలియని వానిని తెలుసుకోవవలెననే అతని కుతూహలం ఎన్ని అంతరాయాలు వచ్చినా వృద్ధి పొందుతూనే ఉంటుంది. అనంతమైన విశ్వాంతరాళంలో పరిమితమైన మానవమేధకు అందని విషయాలు ఎల్లప్పుడూ అనంతంగా ఉండనే ఉంటాయి. మానవుడు చంద్రమండలానికి హాయిగా రాకపోకలు సాగించేటంతగా నేడు విజ్ఞానాభివృద్ధి జరిగింది అయినా అతనికి తెలియని విషయాలు కొల్లలుగా ఉన్నాయి. తెలుసుకొన్న కొలదీ అతని అజ్ఞానం పెరుగుతూనే ఉంటుంది; కానీ అతని జిజ్ఞాస మాత్రం నశించదు

అమ్మను గూర్చి తెలుసుకోవటానికీ, తెలుపబూనుకోవటానికీ గూడ ఈ జిజ్ఞాసయే కారణం. అయితే భౌతిక విషయ జిజ్ఞాసకూ అమ్మనుగూర్చిన జిజ్ఞాసకూ చాలా వ్యత్యాసం ఉన్నది. మొదటిది విజ్ఞాన ప్రాప్తి హేతువుకాగా, రెండవది ధ్యానప్రాప్తి హేతువు అవుతుంది. విజ్ఞానంవల్ల అజ్ఞానముయొక్క అనంతత్వం బోధపడి మనస్సుకు విశ్రాంతికొఱవడగా ధ్యానంవల్ల విజ్ఞానాజ్ఞానాలకు నిమిత్తం లేని, సచ్చిదానంద హేతువైన పరమశాంతి లభిస్తుంది.

అమ్మ చెప్పిన నిర్వచనం ప్రకారం "నిదిధ్యాసనమే ధ్యానం". నిదిధ్యాసనమంటే నిరంతరస్మరణం. నిజానికి నిదిధ్యాసనానికీ, జిజ్ఞాసకూ తేడాలేదు. జిజ్ఞాస అనగా తెలుసుకోవలెననే కోరిక. ఒక విషయాన్ని తెలుసుకోవలెననే బలీయమైన కోరిక ఉన్నప్పుడు దానిని గూర్చిన స్మృతి నిరంతరం ఉంటుంది. అంటే కోరిన స్మృతి అనే పేరుతో ఉంటుందన్నమాట. అందుచేత జిజ్ఞాస లేక నిది ధ్యాసనమే ధ్యాన

మవుతుంది. "తైల ధారాపదవిచ్ఛిన్న స్మృతి ప్రవాహః ధ్యానమ్" అని ధ్యానానికి పతంజలి మహర్షి యిచ్చిన నిర్వచనం ఈ సత్యాన్నే చాటుతుంది

అఖిలజగన్మాత అయిన అమ్మను గూర్చిన జిజ్ఞాస - జనన మరణ ద్వంద్వ విచ్ఛిత్తి హేతుభూతమైన ధ్యానమే, కాబట్టి అటువంటి జిజ్ఞాస అందరిలో వృద్ధి పొందవలెననే ఆకాంక్షయే ఈ రచనలకూ, ఈ పత్రికా నిర్వహణానికి దారి తీసింది.

(జూలై 1966)



## ఏకాగ్రత

మనసు నిలుపుకోవాలని కోరిక కలిగిందిగా. మనసు నిలుపుకుని ఏదో పొందాలని భావం ఏర్పడ్డదిగా. ఇంతకు ముందులేని ఒక ప్రయత్నం నీలో యిప్పుడు బయలుదేరింది. ఆ బయలుదేరటానికి కారణమైనదే ఎప్పుడో ఒకప్పుడు నీకున్నది ఇస్తుంది. నీకున్నదంటే తాను ఇచ్చిందే. నీ సొంతమేమీ లేదు.

దానికి తరుణం రావాలి అంటాను. లౌకిక విషయాలకు ఏ శక్తి సాయపడుతుందో నీవు అడుగుతున్న పరమార్థస్థితికి కూడా అదే సాయపడుతుంది. దీనికి ఎవరో దానికీ వారే.

అన్నివేళలా అన్నిటియందూ ఒక భావం కలిగి వుండడమే ఏకాగ్రత.

- అమ్మ

# 5

# ఆగష్టు 15

భారతదేశ చరిత్రలో ఆగష్టు నెలకు ఒక విశిష్టమైన స్థానం ఉన్నది. ఈ నెల 15వ తేదీన అరవిందఘోషు మొదలయిన మహాపురుషులు ఉదయించారు భారతీయులలోని నిద్రాణమైయున్న దివ్యశక్తిని మేలుకొల్పి ప్రగతినిసాధించే మహత్తర కార్యక్రమాలెన్నో ఈనాడు ప్రారంభింపబడి సత్పరిణామాలకు దారితీశాయి. సుమారు రెండు శతాబ్దాలవరకూ నిరంకుశంగా అధికారం నెరపిన పాశ్చాత్య పాలకుల దాస్యశృంఖలాలను త్రెంచుకొని భారతజాతి స్వేచ్ఛావాయువులను పీల్చుకొన్నదీనాడే. అన్నిటికంటె అసాధారణమూ, అనన్యమూ అయిన వైలక్షణ్యం ఒకటి ఉన్నది. అమ్మ జిల్లెళ్ళమూడిలో నిరంతరం తనను సందర్శించటానికి వచ్చే అందరికి భోజన సౌకర్యంకోసం ప్రత్యేకంగా 'అన్నపూర్ణాలయం'' నెలకొల్పి నిర్మల విశ్వసౌభ్రాత్ర విలసితమైన విశ్వకుటుంబాన్ని ఏర్పాటుచేసిన పర్వదినం ఆగస్టు 15వ తేది

మనం ఇంతవరకు సాధించి అనుభవిస్తున్న స్వాతంత్ర్యం ప్రాదేశికమయినదీ, ఆర్థిక, రాజకీయాది రంగాలకు మాత్రమే పరిమితమయినదీ కావటంచేత సంపూర్ణమయినది కాదేమో అనిపిస్తుంది. 'స్వ' అనగా ఆత్మ. 'తంత్రుడు' అనగా అధీనుడు. స్వతంత్రుడంటే ఆత్మకు (తనకు) అధీనుడు. అనగా ఇతరములకు (రాగద్వేషాదులకు) అధీనుడు కానివాడు. ఎప్పుడూ, ఎక్కడా దేనికీ, ఎవరికి లొంగనివాడు. మరొక మాటలో చెప్పాలంటే ఆత్మ విజయముగలవాడన్నమాట. స్వాతంత్ర్యమంటే 'ఆత్మవిజయం' అని పండితార్థం. లౌకికంగా ఎన్ని అర్థాలు చెప్పుకొన్నా 'స్వాతంత్ర్య' పదానికి ఇదే సరైన అర్థమనిపిస్తుంది. ప్రతిమానవుడు నిజంగా కోరవలసిన, సంపూర్ణమైన, సర్వజనీనమైన స్వాతంత్ర్యం ఇదే. దీనిని మనం ఏ ప్రభుత్వం నుండీ పొందలేము. చరాచరాత్మకమైన సకల ప్రపంచాన్ని నడిపించే అనిర్వచనీయదివ్యశక్తి మాత్రమే దాన్ని ప్రసాదించ గల్గుతుంది. ఆ శక్తి నేడు మన అదృష్టవశంచేత అమ్మయై జిల్లెళ్ళమూడిలో భౌతికంగా విలసిల్లుతున్నది.

"అస్వతంత్రుడైతే మానవుడు, స్వతంత్రుడైతే దేవుడు" - అని అమ్మ అపూర్వ విలక్షణ నిర్వచనం.

సోదర మానవులందరూ సర్వేశ్వరి అయిన ఆ అమ్మ దివ్యమంగళ విగ్రహాన్ని ఈ శుభసమయంలో నేత్ర పర్వంగా దర్శించి సర్వాత్మనా స్వాతంత్రాన్ని పొంది అఖండానందాన్ని అనుభవిస్తారని ఆశిస్తున్నాము.

(ఆగష్టు 1966)



## సాధన

సాధన అయినా నీ చేతిలో ఉన్నదని నే ననుకోను. సాధన కూడా సాధ్యం కావాలి కదా అనుకుంటున్నాను. సాధ్యంకానిది సాధన చేయలేవు కదా ! ఇప్పటికి ఎన్ని రకాలుగా వినివుంటావు? ఎన్ని గ్రంథాలు చదివి వుంటావు? ఎందులోనైనా ఎవరైనా చేయవద్దని చెబుతున్నారా ? చేయకూడదని నీకున్నదా ? చెప్పేవారు లేక కాదుగా మానుకోవడం. ఎవరైతే ఈ ధర్మాలను, వీనిని ఆచరించే విధానాలను తెలుసుకున్నారో వారే చేయలేక పోతున్నారు. అట్లా కాదని చేతులు ముడుచుకుని కూర్చోవటం చేతనయినా అంతా మనిషి చేతిలో ఉన్నట్లే. అదీ చేతకావటం లేదు. అన్నిటిని చేయించే దేదో మనకు తెలీదు కాబట్టి మనం చేస్తున్నామని అనుకుంటున్నాం. సాధ్యమయిన దానినే మనం చేస్తున్నాం. ఇది తెలిసేటంత వరకు సాధన చేస్తున్నాం అనుకుంటాం. మనంగా ఏమీ చేయలేమనేది నా అనుభవం నాన్నా.

\- అమ్మ

# 6
# "కృష్ణాష్టమి"

'అమ్మ' అంటే ఎవరండీ? --- అని యెవరైనా ప్రశ్నించినప్పుడు మనందరి అమ్మ - స్థావరజంగమాత్మకమైన విశ్వానికంతటికీ అమ్మ - అని బదులు పల్కడం ఎంతైనా సముచితం.

'లక్ష్మి' అనిగాని 'పార్వతి' అనిగాని లేక 'రాజరాజేశ్వరి' అనిగాని చెప్పవచ్చు, లేదా రాముడనో, కృష్ణుడనోచెప్పవచ్చు. కాని యేవిధమయిన నామంతో పిల్చినా, ఏరూపాన్ని కల్పించుకొన్నా అది పాక్షికమూ, పరిమితమూ మాత్రమే అవుతుంది. కాబట్టి 'విశ్వజనని' అన్నప్పుడు విభిన్న నామాలకూ, వివిధ రూపాలకూ ఆధారమయిన, సకల జగదుత్పత్తి స్థితిలయ హేతుభూతమైన, సర్వవ్యాపకమయిన, సర్వ నియామకమయిన, సర్వ స్వతంత్రమయిన మహాశక్తి మన మనస్సుల్లో స్ఫురిస్తుంది

అయితే ఈ జిల్లెళ్లమూడి అమ్మ ఆ మహాశక్తియే అని ఎందరు నమ్ముతారు? అని ప్రశ్నిస్తే ఆ నమ్మిక కలగడమనేది ఆయావ్యక్తుల సుకృత పరిపాకం మీదా, సంస్కారబలం మీదా ఆధారపడి ఉంటుందనే చెప్పాలి.

ఆశక్తి అనంతమూ అపరిమితమూ అయినా అంతవంతమూ, పరిమితము అవుతుంది. నిరాకారమైనా సాకారమవుతుంది; నిర్గుణమూ, నామరహితము అయినా సగుణమూ, నామ సహితమూ అవుతుంది. ఇలా పరిమిత నామరూపాదులను అది స్వీకరించినపుడు దానిని 'అవతారమూర్తి' అంటారు. విజ్ఞులు ఆ అవతారమూర్తిని ఏ కొందరో ధన్యాత్ములు గుర్తిస్తారు.

ఆ అనంతశక్తి అవతారం ధరిస్తుందనటానికి "సంభవామి యుగేయుగే" అన్న గీతావచనమే పరమ ప్రమాణం. యుగమంటే సంధికాలం యుజ్యతే ఇతి యుగః" - దేని యందు రెండు కూర్చబడునో అది యుగం లేక సంధి ధర్మాధర్మాలకు, పుణ్యాపాపాలకు, కర్తవ్యాకర్తవ్యాలకు విజ్ఞానా జ్ఞానాలకు -- ఇలా ద్వంద్వాల కలయికలవల్ల గల్గిన సంఘర్షణతో క్షుబ్ధమయిన కాలమే యుగకాల మవుతుంది. ఇటువంటి యుగ సమయాల్లో పరమేశుడు అప్పటి కవసరమయిన అవతారాన్ని ధరిస్తాడు.

అనంతమైన కాలంలో ఆ సర్వేశ్వరుడు ఎన్ని అవతారాలను ధరించాడో చెప్పటం అతిపరిమితమైన ఆయుర్దాయమూ, మేధాసంపదా గల మానవుడికి అసాధ్యం. పురాణ ప్రసిద్ధాలైన అవతారాలలో, మనలో ఎక్కువ మందికి తెలిసినవి పది మాత్రమే. వానిలో మొదటి నాలుగైన మత్స్య, కూర్మ, వరాహ నరసింహావతారాల ద్వారా తన యొక్క స్థావర జంగమాత్మకత్వాన్నీ, సర్వవ్యాపకత్వాన్నీ, అనంత శక్తిమత్వాన్నీ ప్రదర్శించటమే కాక తన సృష్టిలో ఒకటి అల్ప మయినదీ. వేరొకటి మహత్త్వవిశిష్టమైనదీ లేదని భగవంతుడు సూచించాడు. కాగా అన్ని అవతారాలు దుష్ట శిక్షణార్థమూ, శిష్టరక్షణార్థమూ మాత్రమే ఏర్పడినవి. అన్నీ శాసన చండిమతో గూడిన పురుషోత్తమస్వరూపుడు మధుర మధుర వాత్సల్య మహనీయమూ, మహితలాలనాత్మక పాలన విలసితమూ అయిన మాతృమూర్తిగా, మన అమ్మగా, మానవ లోకంలో పరమేశ్వరుడు అవతరించటం ఇదే ప్రథమ పర్యాయమనిపిస్తుంది.

పై అవతారాలన్నీ ఈ అమ్మ స్వరూపాలే అయినా విశేషం శ్రీకృష్ణావతారానికీ, అమ్మ అవతారానికీ సాదృశ్య, వైలక్షణ్యాలు కనిపిస్తాయి ఈ నెల 7వ తేది శ్రీకృష్ణ భగవానుడు అవతరించిన పర్వదినం కాబట్టి స్థాలీపులాక న్యాయంగా ఈ అవతారద్వయ విశేషాలను ఒకటి రెంటిని పేర్కొని వాటి సమైక్యాన్ని, మనబుద్ధికి అందినంతవరకు తెలుసుకొని ప్రయత్నించి మన జన్మలను పునీతం చేసుకోవటం కర్తవ్యం

శ్రీకృష్ణుడు బాలక్రీడా సమయంలో తనవదన కుహరాన యశోదాదేవికి విశ్వరూప దర్శనమిచ్చాడు.

అమ్మ పుట్టగానే మంత్రసాని గొల్ల నాగమ్మకు తన నాభి కుహరంలో కమలాలయగా సాక్షాత్కరించింది.

శ్రీకృష్ణుడు బాల్యదశలో అక్రూరాదులకు తన దివ్యావతార వైభవాన్ని స్ఫురింపజేసి వారిని తరింప జేశాడు.

అమ్మ చంటిబిడ్డగా ఉన్నప్పుడే మరిడమ్మగారి వంటి మహిళామతల్లులకు దివ్యదర్శనాలను ప్రసాదించింది.

పిల్లితోక, అమ్మమ్మతల, అమ్మకు సర్పఫణాకృతిలో గొడుగును పట్టినట్లు తాతగారికీ మరిడమ్మగారికీ కనుపించడం తాను కేవలం శేషతల్పశాయి అయిన శ్రీమన్నారాయణుడనని అమ్మ సూచించడమే.

ఇలా ఎన్నైనా పోలికలు చెప్పవచ్చు. తెలిసిఉంటే । అతి ముఖ్యమయిన విశేషమేమిటంటే ?

అమ్మ చెప్పిన సూక్తులకూ, కృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన గీతా వచనాలకూ ఎంతో సాదృశ్యం కనుపిస్తుంది. అంతేకాక గీతావచనాలకంటె అమ్మ సూక్తులు విలక్షణంగాను, విశిష్టంగాను ఉంటాయనిపిస్తుంది. అంతమాత్రం చేత భగవద్గీతకు న్యూనత గల్గించామనుకోవటంగాని, కల్గిందనుకోవటంగాని భ్రమ మాత్రమే అవుతుంది ఎందుచేతనంటే ఆనాటి సమాజానికి అటువంటి ప్రభోధం అవసరమయితే నేటి సమాజానికి ఇటువంటి ప్రబోధం అవసరం. అదీగాక ఇలా న్యూనతాపాదన చేసుకుంటూ పోతే పైన పేర్కొన్న అవతారాలలో అర్వాచీలకంటె ప్రాచీనాలు తక్కువ అన్నమాటేగా ! అది కేవలం అసమంజసం. అప్పటికి ఏ అవతారం అవసరమో అప్పుడు ఆ అవతారాన్ని ధరించి, ఎప్పటికి ఏ ప్రబోధం అవసరమో అప్పుడాప్రబోధాన్ని చేస్తాడు భగవంతుడు. ఇది ఆయన అప్రతిహత సంకల్పం.

ఇంతకూ అసలు విషయానికి వద్దాం.

గీతలో "చాతుర్వర్ణం మయా సృష్టం గుణకర్మవిభాగశః"

అంటాడు కృష్ణుడు. "గుణ, కర్మ విభాగాన్నిబట్టి నాలుగు వర్ణాలు నాచేత సృజింప బడ్డాయి" --- అని దీని అర్థం.

"గుణ భేదమేలేని నాకు కులభేదమేమిటి?" -- అంటుంది అమ్మ.

కృష్ణుడు వర్ణచతుష్టయ సృష్టిని చేసి సమాజాన్ని చీలికలు చేశాడనీ,

అమ్మ వర్ణసాంకర్యం చేసిందనీ

కొందరు పై సూక్తులకు అర్థం చెప్పవచ్చు. అది స్థూల దృష్టితోచే అభిప్రాయం మాత్రమే.

నిజానికి కృష్ణునికి బుద్ధిభేదం లేదని చెప్పేదేముంది ? ఆయన ప్రకృతి స్వరూపుడూ, తదతీతుడూగూడ, ప్రకృతిజన్యగుణభేదంతోగూడిన వ్యక్తులతో విలసిల్లే సంఘ జీవనంలో సామరస్యాన్ని సాధించటానికై కృష్ణునకు వర్ణవిభాగం ఆవశ్యకం.

ఇక 'అమ్మ' విషయంలో - ఆమె అన్నిగుణాలకూ మూలభూతమయిన ప్రకృతి, కృష్ణుడు కావించిన గుణకర్మ విభాగమూలకమైన చాతుర్వర్ణ సృష్టికిని ఆధారమైనది ప్రకృతి రూపిణియైన యీ అమ్మయే. మూల ప్రకృతియైన అమ్మకు గుణభేద మెలా ఉంటుంది ? కాబట్టి కులభేదము లేదన్నమాట. అధ్యక్షులు (శాసకుడుగా) ఉన్న కృష్ణుడు మూల ప్రకృతి రూపంలో అమ్మ అవుతాడు.

ఇంతెందుకు ? "చాతుర్వర్ణ్యం .." అనే శ్లోకంలో "తస్యకర్తారమపి విద్ధ్యకర్తారమవ్యయమ్" అన్న రెండవపాదం. "గుణభేదమేలేని..." అన్న అమ్మ సూక్తీ ఒక్కటిగానే ఉన్నాయనిపిస్తుంది.

కృష్ణ వాక్యంలో అధికారముద్రా, అమ్మ వాక్యంలో "మీరంతా నాబిడ్డలే పరస్పరం ఒద్దికగా మెలగండి నాన్నా?" అన్న వ్యంగ్యమర్యాదాగర్భితమైన ప్రేమ ముద్రా గోచరిస్తాయి.

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి"

ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి? " గీత

"చేతలు చేతుల్లోలేవు --- " అమ్మ.

గీతావాక్యం వ్యాఖ్యానప్రాయంకాగా అమ్మ సూక్తి సూత్రతుల్యమైన అప్రతిహతమైన దైవశక్తిని సూచిస్తున్నది.

"కర్మేంద్రియాణి సంయమ్య ఆస్తే మనసాస్మరన్ ।

ఇంద్రియార్థాన్ విమూఢాత్మా, మిథ్యాచార స్ప ఉచ్యతే॥" -- గీత.

(కర్మేంద్రియాలను నిరోధించి యింద్రియార్థములను మనస్సుతో వర్ణించువాడు మిథ్యాచారుడని చెప్పబడును.)

"సంసారంలో తానుండవచ్చు; తనలో సంసారం ఉండరాదు" -- అమ్మ

ఈ రెంటికీ అర్థం ఒక్కటే అయినా సంసారాన్ని చూచి భయపడి పోవలసిన పనిలేదనీ, సంసారంలో ఉండి ఆత్మ విజయాన్ని సాధించటమే గొప్ప అనీ అమ్మ సూక్తిద్వారా స్పష్టపడుతుంది. ఈ విధంగా గీతావాక్యాలూ, అమ్మ సూక్తులకూ ఎన్నిటికయినా సాదృశ్య, వైలక్షణ్యాలను చూపవచ్చు.

ఇకపోతే, అమ్మ సూక్తులు ప్రభు సమ్మితాలైన వేద వాక్యాలలోని ప్రాతిభాసిక వైరుధాన్ని తొలగించి వెంటనే సమన్వయ బుద్ధిని స్ఫురింపజేస్తాయి.

"ప్రజ్ఞానం బ్రహ్మ" --- "సర్వం ఖల్విదం బ్రహ్మ" -- శ్రుతి.

"ప్రజ్ఞానం బ్రహ్మ అయితే అజ్ఞానం ఎందుకు కాదు" -- అమ్మ

స్థూలదృష్టికి పై శ్రుతి వాక్యాల్లో కన్పించే వైరుద్ధ్యం అమ్మ సూక్తిలో సూక్ష్మంగానైనా స్ఫురించదు. అమ్మగాబట్టి అజ్ఞానమంటే భయపడే బిడ్డకు (సాధకునకు) అభయ లేశమైనా సోకకుండా అభయమిస్తూ, జ్ఞానాజ్ఞానాలు రెండూ

భగవత్స్వరూపాలేననీ, 'అజ్ఞానిని' అనే దౌర్బల్యంతో క్రుంగిపోవద్దనీ మధురంగా ఏదో ధైర్యాన్నిస్తుంది.

"తమసో మా జ్యోతిర్గమయ ---" (చీకటినుండి వెలుగు లోనికి గాని పొమ్ము) అని శ్రుతి చెబుతుండగా

"చీకటే వెలుతురుకాధారము ---" అని అమ్మ చెబుతుంది.

అనగా చీకటి నుండి పారిపోవలసినపని లేదనీ, అసలు ఆ రెండు అన్యోన్యాశ్రయాలనీ, సమచిత్తంతో నిర్వికారంగా దేనినైనా అనుభవించడం మన విధి యనీ రెంటికీ ఆధారమయిన వాడే మనకు దారిచూపిస్తాడనీ చెప్పి మనము సహన బుద్ధితో గూడిన, ఆత్మ విశ్వాస సహితమైన ఔదాసీన్యాన్నీ తద్వారా తీరు లేని దైవభక్తినీ కలిగిస్తుంది అమ్మ సూక్తి.

సారాంశమేమంటే ? అమ్మ సూక్తులు పైకి విరుద్ధంగా కన్పించే సూక్తులకూ, వివిధోపనిషత్తులకూ సామరస్యాన్ని సంతరిస్తూ, అపూర్వ సమన్వయ జ్ఞానాన్ని అందిస్తూ, అఖండాద్వైతబుద్ధిని ప్రోదిచేస్తూ, విశ్వజనీనతా విస్ఫురిత నిత్యనూతనత్వాన్ని ప్రదర్శిస్తూ అనన్యాదృశాలై అవే వేదాలనే బలీయమైన భావం మనలో కలిగిస్తాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే --- అమ్మ చెప్పే ప్రతి సూక్తీ మూల సూత్రాలకు తీసుకుపోయి ఆమెయే మూలశక్తి అనిపింపజేస్తుంది

కాబట్టి అమ్మ జీవితాంబరంలో మెరిసే అద్భుత సౌదామినీల కాంతి ఆమె వదనేందుమండలం నుండి జాలువారే అమృత కిరణాలూ - ఆదయా అతిమానుషశక్తి విలసితయైన జగజ్జనని అనీ, ఆమెయే శ్రీకృష్ణుడనీ దృఢమయిన విశ్వాసాన్ని పాదుకొల్పుతాయి.

ఇటువంటి ఆజగదీశ్వరిని మనమందరమూ సాంజలిబంధంగా అర్థించ తగిన దొక్కటే ---

విభిన్న ప్రాంతాలలో, వివిధ భాషావలయాల్లో పరిభ్రమిస్తూ కలహాలతోనూ, గమ్యమెఱుగని గమనంతోనూ అలసిపోయిన తమబిడ్డలందరి విశ్వమానవ సౌభ్రాత్ర విశాల ఘంటాపథం మీద నడిచి తనను చేరుకొనే విధంగా అనుగ్రహించ వలసినదని మాత్రమే.

(సెప్టెంబరు 1966)



# 7
# శరన్నవరాత్రులు

ఈ నెల 15వ తేదీన శరన్నవరాత్రారంభం శరల్లక్ష్మి శ్యామల శార్వలదుకూల ధారిణియై ధవల చంద్రికా దరహాస భాసుర వదనంతో తారాప్రసూనాంజలి ఘటించి నిర్మల తరంగిణీ మధుర గంభీర ధ్వనులతో అమ్మకు స్వాగతం పల్కుతోంది. దేవీపూజా విశేషాలతో ప్రత్యహం ఒక ప్రత్యేకతను అంతరించుకొంటుంది. సకల చరాచర స్వరూపిణియైన ఆ అమ్మకు ఒక్కొక్క నాడు ఒక్కొక్క అలంకార విశేషంతో అర్చనలు జరుగుతాయి

నవరాత్రులనగానే సాధారణంగా కాళి, దుర్గ, మహిషాసురమర్ధని మొదలైన దేవ్యవతారాలు స్ఫురణకువచ్చి అవి భీకరాలనే భావం జనసామాన్యానికే కాక కొందరు విద్వాంసులకు గూడ కలుగుతుంటుంది. ఈ భావం కేవలం అవిచార మూలక మనిపిస్తుంది ఏ మతసంప్రదాయంలో నయినా పురాణ కథలకు, ముఖ్యంగా దేవతా గాథలకు చరిత్రాధారం సంగతి అలా ఉండగా వ్యంగ్యార్థ వైభవ స్ఫూర్తి ప్రాధాన్యం విశేషంగా ఉంటుంది. ఈ దృష్టిలో పరిశీలించి నప్పుడే ఆయా కథలనూ, గాథలనూ మనం సరిగా అర్థం చేసుకొన గల్గుతాము

ఉదాహరణకు రామాయణం, భారతం, దేవదానవ యుద్ధం మొదలైన వానిని తీసుకోవచ్చు ఈ గాథలలో వచ్చే వ్యక్తులు ఏ యుగానికి చెందినవారు ?

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం ।
నచేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి" అని

సౌందర్య లహరిలో శ్రీ శంకర భగవత్పాదులు శక్తి ప్రభావాన్ని కీర్తించారు.

"రుద్రహీనం విష్ణుహీనం న వదంతి జనాస్తథా ।
శక్తి హీనం యథా సర్వే ప్రవదంతి నరాధమమ్" ॥ దేవీభాగవతము

జనులు బలహీనుడయిన వానిని చూచి శక్తి హీనుడంటారు; కాని రుద్రహీనుడనీ, లేక విష్ణుహీనుడనీ అనరు -- అని పై శ్లోకముయొక్క సారాంశం. అయితే ఒక ప్రశ్న :

ఆ శక్తి సర్వవ్యాపిని గదా ! "ఆ శక్తి లేనపుడు ..............." అన్నమాట అసలు ఎలా పొసగుతుంది ? అని అడగవచ్చు.; కాని ఆశక్తి సర్వ వ్యాపిని అని ముందు గుర్తించాలి. ఆ గుర్తింపుకు కూడా అమ్మ అనుగ్రహమే కావాలి మరి !

(అక్టోబరు 1966)



## ఆధారం

'అమ్మ అంతులేనిది; అడ్డు లేనిది; ఆధారమైనది'. ఆధారమంటే - ఇప్పుడు... మీరున్నారు. ఉయ్యాల బల్ల మీద కూర్చున్నారు; మీకు బల్ల ఆధారం; బల్లకు గొలుసులు ఆధారం; గొలుసుకు దూలం; దూలానికి గోడలు; గోడలకు భూమి; భూమికి ఆకాశం; - ఇట్లా ఆధారం సర్వత్రా వ్యాపించి వున్నది. పూలు ఉన్నాయనుకో - వాటికి దారం ఆధారం - దండ గుచ్చడానికి. పూలకు కొమ్మ; కొమ్మకు చెట్టు, చెట్టుకు భూమీ ఆధారం. దీనికి (ఆధారత్వానికి) అంతు ఏముంది ?

సర్వానికి సర్వమూ ఆధారం.

- అమ్మ

# 8
# "దీపావళి"

---

మనిషికి వెలుగు కావాలి. జ్ఞానం కావలి. సుఖం కావాలి. శాంతి కావాలి. ఆనందం కావాలి. అమృతత్వం కావాలి. కాని సృష్టిలో చీకటీ ఉన్నది. అజ్ఞానమూ ఉన్నది. బాధా ఉన్నది. అశాంతీ ఉన్నది. దుఃఖమూ ఉన్నది. మృత్యువూ ఉన్నది !

చీకటితోపోరాటమూ, వెలుగుకోసం ఆరాటమూ, అజ్ఞానంవలన వేదనా, జ్ఞానంకోసం సాధనా; బాధ అంటే భయమూ, సుఖమే ధ్యేయమూ; అశాంతిలో తేలని కదనమూ, శాంతినిచేరలేని గమనమూ; దుఃఖముగురించి మధనా, ఆనందం కోసం తపనా; మృత్యువుతో నిత్య సంఘర్షణా. అమృతత్వంవైపు ఆకర్షణా ---

ఇదే ఆదిమానవుని నుండీ నేటి 'అణు' మానవుని వరకూ అవిచ్ఛిన్నంగా ప్రవహించిన మానవస్వభావం.

కానీ, చీకటి మనిషికి శత్రువుకాదు. చీకటి తల్లి ఒడిలాంటిది. ఆడుకుని, ఆడుకుని అలసిపోయి వచ్చిన పిల్లవాడు తల్లి ఒడిలో సేద తీరినట్లు -- మనిషి పగలంతా వెలుగులో యావచ్ఛక్తినీ వ్యయపరచి శ్రమించి ---- చీకటిలో కళ్ళు మూసుకుని విశ్రమించి పునః తన శక్తిని తాను పుంజుకుంటున్నాడు.

మనిషికి అశాంతియే లేకపోతే మనసులో అలజడీ, అసంతృప్తియే లేకపోతే విజ్ఞాన శిఖరంవైపు గమనమేలేదు. విజ్ఞాన కమలం వికసించటానికి సూర్యకిరణం లాంటిది అశాంతి.

శ్రావణ పయోధరాలు కుంభవృష్టి కురిసిన పిమ్మట గగనమండలం నిర్మలమై శుభ్రమై కాంతిమంతమయినట్లే --- అశ్రుతరంగిణీ సుస్నాతుడయిన మనిషిన్నీ.

కణకణమండే అగ్నిలో పుటం పెట్టబడిన బంగారం శుద్ధమై భాస్వరమయినట్లే -- బాధానల జ్వాలా పరితప్తుడయిన మనిషిన్నీ.

జీవితానికి మృత్యువనే ఒక సరిహద్దుయే లేకపోతే --- జీవితం మందగమన అయి స్థంభించి పోతుంది. జీవితానికి వేగాన్ని అందించేది మృత్యువే. ఆ వేగం లేకపోతే జీవితానికి రుచియే లేదు

అందుకే అమ్మ అన్నది.

చీకటియే వెలుతురున కాధారమనీ

బాధే చైతన్యమనీ.

బాధలేని జీవితంకంటే మరణమే నయమనీ ..

ద్వంద్వాలు తానయిన అమ్మకు అవి అభేదమేకావచ్చు. చీకటిని చూచి చిందులుతొక్కే, చిన్న బాధకయినా మనసు చితికిపోయే, మృత్యువును తలుచుకుంటే గుండె జారిపోయే మానవునకు ఆశామృతాన్ని అందించటానికీ, సమదృష్టినీ, స్థిరచిత్తాన్నీ ప్రసాదించటానికీ అమ్మ చెప్పిన మృదూక్తులు కావచ్చు.

ఏమయినా, ఎన్ని ఉన్నా - మనిషికి అజ్ఞానం మాత్రం ప్రబల శత్రువే. మనిషిని మందబుద్ధినీ, భ్రష్టుడినీ, పతితుడినీ చేసివేస్తుంది. ఆ అజ్ఞానానికి సంకేతం కావచ్చు

ఈమాసం 12న దేశమంతా మహోత్సాహంతో జరుపుకునే దీపోత్సవం. నాడు ప్రతినగరమూ దీపడోల, ప్రతివీధినా దీపమాల, ప్రతి వాకిలికీ దీప తోరణం ప్రతిమూలనా చీకటికి వెలుగుతోరణం

అమ్మా ---

కోటికోటి జ్యోతులు జాజ్వల్యమయి వెలుగుతున్నా - అనంతకాంతి వెల్లువ కదులుతున్నా -- మా మనసులోనికి ఒక్కకిరణమూ జొరబడదేం ? జగమంతా యిలా జోత్స్నమయమయినా మా మనసింకా చీకటి కప్పుకుని మూలుగుతోందేం??

అమ్మా ! కనికరంతో నీమృదుకరంతో ముదంతో ఆముదంపోసి అయినా మలిన మనస్సులో ఒకచిన్న ప్రమిదను వెలిగించమ్మా -

ద్వాపరంలోని ఆధనుస్సు మరొక్కసారి సంధించుమమ్మా -

స్వర్గనరకాలూ, పాపపుణ్యాలూ - ఉన్నా, లేకపోయినా మా మనసుల్లోని అసురుల వధించుమమ్మా ---

సహస్ర శీర్షాలతో విజృంభించిన ఆ అసురప్రవృత్తిని ఛేదించుమమ్మా - మాలో వేళ్ళుతన్నుకుపోయిన తమాల వృక్షాల ఆమూలమూ ఛేదించుమమ్మా -

భాస్కరునికి మహోజ్వల కాంతినీ, సుధాంశునికి శీతల జ్యోత్స్ననూ, శతకోటి నక్షత్రాలకూ అపారమయిన వెలుగునూ ప్రసాదించిన నీకు - మాలో ఒక్క నిప్పురవ్వ విదిలించటానికీ, ఒక్క చిన్నవత్తిని వెలిగించటానికీ యింత ఆలోచనా, యింత విలంబనా ఎందుకమ్మా ?

మాలో మానవత్వం కొనూపిరితో నయినా ఉండగానే -- మామేలు కోరి నీవు మేలుకోవమ్మా !

మాలోని రక్కసులను చంపి, చీకటిని బయటకు పంపి మాలో మళ్ళీ మానవత్వం నింపి --- మమ్ము దీవించుమమ్మా --

వేయివెలుగులతో నీవు దీపించుమమ్మా --

(నవంబరు 1966)



## ఉన్నది ఒకటే

భగవంతుడు అన్నది నువ్వు పెట్టిన పేరు కాని ఆ శక్తికి స్త్రీ పురుష భేదం లేదు నాన్నా. దానికి భగవంతుడనే కాదు. ఇంకా ఏపేరైనా పెట్టు. ఉన్నది ఒకటే.

సైన్సు పదార్థమనో, శక్తి అనో, చైతన్య మనో, అంటే - ఆధ్యాత్మికం దైవం అనో, బ్రహ్మ మనో, ఆత్మ అనో అంటుంది.

- అమ్మ

# 9
# "క్రిస్‌మస్"

"నీవు మా 'యేసయ్యను' కన్న మరియమ్మవా అమ్మా" --- అన్న క్రైస్తవస్త్రీ అమ్మ ముఖంలోకి జాలిగాచూస్తూ.

"యేసుప్రభువువా అమ్మా, నీవు!" --- అన్నాడొక క్రీస్తుమతస్థుడు అమ్మవైపు పరిశీలనగా చూస్తూ

ఈ సంఘటన కొన్నియేండ్లక్రింద అమ్మ ఒక క్రైస్తవ వైద్యశాలను తన పాద రజస్సుతో పావనం చేసినప్పుడు జరిగింది.

అవును, విశ్వజనని అయిన అమ్మ విశాల ప్రపంచంలో వివిధ మత సంప్రదాయాలను అవలంబించే తన బిడ్డలకు వారివారి భక్తి ప్రపత్తుల ననుసరించి బహురూపాలలో దర్శనమీయడం సహజం.

మానవత్వాన్ని నేలబెట్టి కాలరాచి దానవత్వం విశృంఖలవీరవిహారాన్ని చేస్తున్న తావులో దివ్యప్రేమ సందేశాన్ని అందించటానికి అవతరించాడు పీడితజన సందోహానికి ఆశాజ్యోతియైన క్రీస్తు భగవానుడు.

ఈనాడు కుల, మత, వర్ణ, వర్గాది విభేదంలేని వసుధైక కుటుంబం కావాలని శాంతికాముకులూ, ప్రపంచ దేశనాయకులూ- ఉపన్యాసాలిస్తున్నారు; పత్రికలలో వ్రాస్తున్నారు. కానీ వాస్తవిక జీవితంలో (పంక్తిభోజనంలో తప్ప) అన్ని రంగాలలోనూ కుల, మత, వర్ణ, వర్గాది విభేదం ప్రపంచమంతటా పైశాచిక నృత్యం చేస్తోంది.

ఒకవంక నవ్యమానవతావ్యవస్థాపనకోసం ఆకాంక్ష; వేరొక చోట సోదర మానవులను మానవులుగా జూడలేని దౌర్భాగ్యస్థితీ ---

వెలుగుకోసం వెతుకుకొంటూ, అంధకారాన్ని ఆహ్వానిస్తోంది - మన సభ్య మానవ సమాంజలో అధికభాగం.

ఇటువంటి వెలుగు చీకట్ల సంధికాలంలో సమావిర్భవించి, సర్వప్రాణికోటికీ జననియై, సర్వసమభావసముల్లసితయై, సదమల ప్రేమావతార మూర్తియై 'అమ్మ' జిల్లెళ్ళమూడిలో విలసిల్లుతున్నది.

ఈనెల 25వ తేదీ క్రీస్తుభగవానుడవతరించిన శుభదినం. నాడు పాశ్చాత్య ఖండం నుండి వెలుగులను విరజిమ్మిన దివ్యజ్యోతి నేడు ప్రాచ్యఖండం నుండి విశ్వమంతటా ప్రేమసుధను వర్షిస్తోంది.

ఆ ప్రేమరూపుడే ఈ ప్రేమమూర్తి. పురుషాకృతిలో మనకు ప్రేమామృతాన్ని అందించిన అవతారమూర్తి క్రీస్తు.

మాతృమూర్తియై మహనీయ వాత్సల్యంతో విశ్వాన్ని పునీతం గావిస్తున్న జగన్మాత 'అమ్మ'.

ఆ ప్రేమామృతంలో మునిగి పునీతులం కావటమే మన కర్తవ్యం.

(డిశంబరు 1966)



## దైవత్వం

దైవత్వమంటే నాలుగు చేతులూ కిరీటమూ కాదు. అన్ని రూపాలు ఒకటేనన్న స్థితి రావటమే దైవత్వం.

ఏకత్వం గల సంకల్పమే దైవత్వం.

భిన్నత్వం లేని మనస్తత్వమే దైవత్వం.

పరిధులు దాటిన మమకారం మాధవత్వాన్ని సూచిస్తుంది.

- అమ్మ

# 10
# "మకర సంక్రాంతి"

దృశ్యమానమయిన బాహ్యప్రకృతి మానవుల అంతః ప్రకృతికి ప్రతీక. వ్యక్తస్థితిలోనూ, అవ్యక్తస్థితిలోనూ ప్రకృతి ఒక్కటే కాబట్టి దాని ధర్మంలో భేదం ఉండదు.

సంక్రాంతి వచ్చింది. కర్షకులు సంవత్సరమంతా చేసిన కృషికి ఫలితాన్ని అనుభవించే ఆనందకర సమయమిది. అయితే యీ సమయంలో ఎంతమంది ఆనందించ గల్గుతున్నారు. ఎందరు దుఃఖపు కౌగిలిలో నలుగుతున్నారు ? దీనికి సమాధానం చెప్పటం కష్టం. వర్షాలు చాలక పైరు కొన్ని చోట్ల ఎండిపోయింది. కొన్ని చోట్ల వర్షాధిక్యంవల్ల గంగపాలయింది. సమవర్షాలున్నా కొన్నిచోట్ల కారణాంతరాలవల్ల పైరు దెబ్బతిన్నది. అన్ని బాధలకూ తట్టుకొని కొన్నిచోట్ల పైరు చక్కగా పండింది.

ఈ అస్తవ్యస్తస్థితిలో ఒక అర్థవిశేషం అంతర్లీనమై ఉన్నది.

అఖండ ప్రకృతిలో అంతర్భాగాలైన మానవ ప్రకృతులలో కొన్ని బలహీనాలు; కొన్ని బలవిశిష్టాలూ. 'నేనిలా ఉండాలి' - 'అది అలా కాకూడదు' అని శాసించటానికి ఎవ్వరికీ సామర్థ్యం లేదు. సర్వావాంతర భేదసమన్వితమై, సర్వశక్తి విలసితమైన మహాప్రకృతికే అటువంటి సామర్థ్యముంది.

మానవులయొక్క చిత్త ప్రవృత్తుల వైపరీత్యాలనుబట్టి నేడు ప్రపంచంలో ఇటువంటి దుర్భిక్ష, క్షామాది బాధలు కలుగుతున్నాయనికాదు దీని ఉద్దేశ్యం.

బాహ్యమనీ, అంతరమనీ ద్విధా విభక్తమయిన ప్రకృతియొక్క మూల మొక్కటేననీ, దాని స్వభావాన్ని అవగతం చేసుకొని అనుభవించటమే మన కర్తవ్యమనీ మాత్రమే మనం తెలుసుకోవాలి !

అందుకే

"చేతలు చేతుల్లోలేవు"

"సృష్టి సహజం"

అంటుంది అమ్మ

మహా ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మ ప్రవచించిన యీ రెండు వాక్యాలలో సర్వవేదసారం గర్భితమై ఉన్నది; సర్వవేదాంత సౌరభం గుబాళిస్తోంది.

అమ్మా! మధురమాయా విలసితమైన నీ ప్రకృతి రహస్య విజ్ఞాన పరిష్వంగంలో నీ బిడ్డలనందఱినీ నిర్విశేషంగా లాలించి పాలించవా ?

పవిత్రమైన ఈమకర సంక్రాంతి కాంతిలో క్రాంతి పధాన్ని మాకు చూపించు తల్లీ !

(జనవరి 1967)



## మిధ్య

నేను జగత్తు సత్య మంటాను. మిధ్య అంటే లేదని కాదుగా ? మార్పు. మార్పు ప్రతివస్తువుకూ వున్నది. మారేది మారని దాన్లోంచి పుట్టింది.

ఒకడు నాలుగెకరాలు సంపాదిస్తున్నాడంటే - తాను లేక పోయినా తన పిల్లలు తింటారు అనే ఉద్దేశంతోనేగా? అది సంపాదిస్తూ (జగత్తు) మిధ్య అంటే ఎట్లా ? తాను పోయినా ముందు ఉంటుందనేగా. అప్పుడు జగత్తు సత్యం కాకుండా ఎట్లా ఉంటుంది.

- అమ్మ

# 11

# "నా దృష్టిలో - అందరూ ఆస్తికులే"

దేవుడెందుకు ? దేవుడనేవాడులేడు మానసిక బలంలేని మూర్ఖులూ, ఉన్మత్తులూ మాత్రమే దేవుడున్నాడని నమ్ముతారు - అని అంటారు అతి నూతన విజ్ఞానమార్జించామనుకునే కొందరు. వీరిని నాస్తికులని లోకం అంటుంది.

వృద్ధపరంపరాగతమైన వాదాన్ని పురస్కరించుకొని - అనుభవం లేక పోయినా - దేవుడున్నాడని అంటున్నారు ఆస్తికులమనుకునే మరికొందరు !

దేవుడు లేడన్నంత మాత్రాన నాస్తికులు, నాస్తికులూ కారు, దేవుడున్నాన్నంత మాత్రాన ఆస్తికులు నిజమైన ఆస్తికులూ కారు.

అందుకే, "నాస్తికులెవరూ లేరు. నాదృష్టిలో అందరూ ఆస్తికులే" అని అమ్మ అంటుంది.

అవును ! 'అస్తి' అనే ఫదం లేకుండా 'నాస్తి' అనే పదమెలా ఉద్భవిస్తుంది? 'నాస్తి'కి ఆరం అస్తి. ఇది కేవలం పద విభాగ చమత్కారమని కొట్టివేసినా యిక్కడ గమనించ వలసిన అంశం ఒకటి ఉంది.

అసలు లేనిదాని విషయంలో "ఇది ఉన్నదా ? లేదా?" అని సంశయించటం గాని, "ఇది లేదు" అని చెప్పటంగానీ అనవసరమూ, అసంబద్ధమూ మాత్రమే అవుతుంది.

"కుందేలుకు కొమ్ములుండవు" -అని యెవరూ నిర్ణయించి చెప్పనక్కరలేదు. అలాగే "అగ్ని దహిస్తుంది" అని కూడా వక్కాణించ వలసిన ఆవశ్యకతలేదు !

అయితే "కుందేలు సంగతీ, అగ్ని స్వభావమూ తెలియని వారుంటారు గదా! వారికి తెలియజేయ నక్కరలేదా!" అని అనవచ్చు కానీ అటువంటి అజ్ఞులయిన అమాయకులకు "దేవుడున్నాడా ? లేదా ?" వంటి ప్రశ్నలే ఉత్పన్నం కావు. ఇతరులేది చెబితే దానినే నమ్ముతారు !

ఏమీ తెలియని వారికీ, అన్నీ తెలిసిన వారికీ ఈ తర్కవితర్కాలతో పనేలేదు. మొదటివారు పరప్రత్యయనేయబుద్ధులు; రెండవ వారు సర్వజ్ఞులు. తెలిసీ, తెలియని వారికే ఈ చిక్కంతా !

ఈ మధ్యతరగతి వైజ్ఞానికులకు మాత్రం నిజానికి అనుభవమేమున్నది ? విభిన్నవాదాలను వినటంచేత, ద్వంద్వసమవేత మయిన పరిమిత జీవిత పరిధిలో సమన్వయ జ్ఞానం లుప్తం కావటంచేత, "గుర్తించే గుర్తు" లేకపోవటం చేత "దేవుడు లేడు" అని అంటున్నారేగాని తెలిసి అనటం కాదు. "దేవుడున్నాడు" అని చెబితే వినటమే తప్ప ఏనాడూ అనుభవసిద్ధికై ప్రయత్నించినవారు కారు వీరు. పాపం ! ఆ ప్రయత్నం మాత్రం వారిచేతిలో ఉన్నదా ?

అందుకే "వింటే విమర్శగాని కంటే విమర్శలేదు" అని అమ్మ అంటుంది.

'వింటే' అనగా వారూ, వీరూ చెబితే వినటం, లేదా పుస్తకాలలో ఉన్నదానిని చదవటం. వీనివల్ల కలిగేదాన్ని విశ్వాసమనిగానీ' అవిశ్వాసమనిగానీ చెప్పలేము - ఎందువల్లనంటే ఆ భావం అనుకూల పరిస్థితుల్లో విశ్వాసంగానూ, ప్రతికూల పరిస్థితుల్లో అవిశ్వాసంగానూ మారవచ్చు. ఆ భావానికి స్థిరత్వంలేదు.

ఇక 'కంటే' అన్న పదానికి 'సర్వాత్మనా అనుభవించటం' అని అర్థం. ఇటువంటి అనుభవానికి శాస్త్ర చర్చలతోగానీ, ఇతరుల వాదాలతో గానీ నిమిత్తం లేదు.

అసలు శాస్త్రోత్పత్తికి అనుభవాలే ఆధారం. వారివారి అనుభవాలే ఆయా శాస్త్రాలు. ఇంతకూ వైజ్ఞానికులేమంటున్నారు ? సృష్టిదైవికం కాదు; ప్రకృతిధర్మం అంటున్నారు. ప్రకృతి దైవస్వరూపం కాకపోతేగా ? సర్వమూ బ్రహ్మస్వరూపమే ! "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని మహావాక్యం చెబుతోంది.

అందుకే అమ్మ 'ఆధ్యాత్మికం వేరూ, భౌతికం వేరూకాదు. రెండూ ఒకటే' అంటుంది. ఆస్తికులూ, నాస్తికులూ ఒకేవస్తువును రెండుపేర్లతో పిలుస్తున్నారు ! ఒకరి భావం ఇంకొకరికి అర్థం కావటం లేదు. అందువల్లనే ఇన్ని మత భేదాలు ! అన్నీ అయి, అన్నిటికీ సాక్షిభూతురాలయిన అమ్మ తన బిడ్డల ,అమాయకపు అవ్యక్తవచనాలకు నవ్వుకుంటూ అందరినీ చేరదీసి లాలిస్తుంది ! అందుకే ఆమె జగన్మాత అయింది.

(ఫిబ్రవరి 1967)



# 12
# "సమచిత్త"

అమ్మను "అం ఆ" అనికూడ పిలుస్తారు. ఈ 'అంఆ' అన్న పదానికి అంతమైనదీ. ఆదియైనదీ అని అమ్మ అర్థం చెప్పింది అంటే తానే సర్వజగత్తుకు సృష్టి, స్థితి, లయకారిణి అన్నమాట !

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు 'అహమాదీశ్చ మధ్యంచ భూతానామన్తఏవచ' --- అని ఉద్ఘాటిస్తాడు. "భూతాలకు నేనే ఆది, మధ్యాంతములను అని దీని అర్థం. 'అంఆ' అన్న పదానికి అమ్మ యిచ్చిన నిర్వచనం గీతావాక్యంతో సరిపోతున్నది. నాటి లీలామానుష వేషధారియైన శ్రీకృష్ణుడే నేడు మాతృమూర్తిగా విలసిల్లుతూ ఉన్నాడని చెప్పటం పునరుక్తియే కాగలదు.

అయితే ఈ సారూప్యం కేవలం ఉక్తిద్వయ సాదృశ్య సమర్ధనీయం మాత్రమే కాదు. అమ్మ సన్నిధిలో అతి సహజంగా జరిగే తేజస్తిమిర సహానుబంధం దీన్ని ధ్రువీకరిస్తుంది.

అమ్మ కొందరి ప్రాణాలతో ఒక వంక మృత్యువుయొక్క కరాళ బుభుక్షను తీరుస్తూ వేరొక వంక మరికొందరి మంగళ గీతాలతో భవిష్యజ్జ్యోతికి వెలుగులు ప్రసాదిస్తుంది. రెండు పనులనూ ఒకే నిర్లిప్త, నిర్విశేష, నిర్మల మధుర హృదయంతో అవలీలగా చేస్తుంది. ఏదీ ఆమెకు విశేషంగా తోచదు. ఆమెలో ఏదయినా విశేషమున్నదనుకుంటే అది ఆమె నిర్విశేష, నిసర్గ, నిశ్చలస్థితి మాత్రమే. దీనికి ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చు.

ఇటీవలనే 'రవీంద్రనాథ్' అన్న ధన్యుడు అమ్మ పావనపాద సన్నిధిలో అమరత్వం పొందాడు. 'వేంకటేశ్వర్లు' అన్న మరొక మహితాత్ముడు మాతృదేవీ చరణరేణువులో తాదాత్మ్యంపొంది తరించాడు. ఈ యిద్దరూ అసామాన్య వ్యక్తిత్వంగల వారే. ఒకడు మానవుడుగాపుట్టి మధుర తపస్విగా రూపొంది సర్వాత్మనా

జగన్మాతృసేవా భాగ్యంచే కృతార్థుడై అమ్మయొక్క అదృశ్యరూపంలో శాశ్వతానందాన్ని పొంది సమకాలీన యువ సోదరులందరకు చక్కని ఆదర్శమై నిలిచాడు. రెండవ వ్యక్తి వికలాంగుడైనా అమ్మయందు అవికల విశ్వాసబంధురుడై జాగ్రదవస్థలో అమ్మయొక్క అద్భుతదివ్యమంగళ విగ్రహ సందర్శనానందాన్ని అనుభవిస్తూ పతనోన్ముఖమైన కాయాన్ని పదిలంగా అమ్మ సన్నిధిలోనే విసర్జించి, తరించి వికలాంగులకు విశిష్ట మయిన ఆదర్శ మార్గాన్ని చూపించాడు.

ఈ యిరువురినీ తనలో దాచుకుంటూనే అమ్మ కొందరిని కమనీయ కల్యాణవేదికమీదకు పంపి ప్రపంచమంటే ఏమిటో తెలుసుకోండని చెబుతోంది. ఒకచేతితో మృత్యువును ముద్దిడుకొని వేరొక చేతితో జీవితాన్ని జిలిబిలి పల్కులతో పిలుస్తోంది ఇదీ ఆమె ఆట ! తనలోనుంచి వచ్చిన జీవాలు కొంచెం ముందు వెనుకలుగా తనలోకే చేరక తప్పదుగా ! లోకంలో మనకు కనబడేవాడు, మన దృష్టిపథం నుండి మాయమయ్యేవారు అందరూ ఆమెలోని వారేగాబట్టి ఆమె యెపుడూ నిశ్చలయే

అమ్మ సన్నిధిలో ఉండి యీ విషాదాభ్యుదయాలను నిర్మల తార్కిక దృష్టితో పరిశీలించే వ్యక్తి "దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" -- అన్న గీతావాక్యానికి ప్రత్యక్ష నిదర్శనం కాగలదు.

(మార్చి 1967)



### అమ్మ

అమ్మ నీ వెన్నంటే ఉంది నాన్నా .....

అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో ఈ నాలుగ్గోడల మధ్య మంచంమీద కూర్చున్న అమ్మ అనే కాదు. దేనికయితే ఆది అంతమూ లేదో, ఏది సర్వానికి ఆది, అంతమో - అదీ అమ్మ.

- అమ్మ

# 13
# "తప్పకనని తల్లి"

నాకు పందిపిల్ల ముద్దు వస్తుంది. పేను ముద్దు వస్తుంది. పాముపడగ ఎంతో ముద్దుగా ఉంటుంది. పురిటిపాపలంటే నాకెంతో ముద్దు. గడ్డాలూ, మీసాలూ నెరిసిన వారి చర్మపు ముడతలు నాకెంతో ముద్దుగా ఉంటాయి--

ఇవి అమ్మ ముద్దు మాటలు.

ఇక అమ్మకు యిష్టం కానిదేమిటి ?

అమ్మకు ముద్దురాని దెవరు ?

మరి ముద్దుకు మూలమేమిటి? అవయవ సౌందర్యమా ? అంగసౌష్ఠవమా? అయితే అంగ వికలులూ, అంగ విహీనులూ అమ్మకు అయిష్టులు కావాలి కదా ! కాని సర్వాంగ సంపన్నులకంటే అమ్మ వీరినే ఎక్కువగా దగ్గరకు తీసుకుంటుంది. నడవలేనివారి వద్దకు తానే నడిచి వెళ్ళుతుంది చూడలేనివారికి అంతర్లోచన మిచ్చిగానీ, స్పర్శవల్లగానీ దర్శనమిస్తుంది. మాటాడలేని వారి భావం మాటతో నిమిత్తం లేకుండానే గ్రహిస్తుంది. చెవిటివారికి పెదవుల కదలిక తోనె భావ మందిస్తుంది. ఏ అంగలోపమున్నా వారినే అమ్మ మరింత ప్రేమతో లాలిస్తుంది.

మరి, అమ్మ దేనిని ప్రేమిస్తున్నట్లు ? సద్గుణ సంపదనా ? గుణభేదమే లేని నాకు కులభేదమేమిటి ? - అని అమ్మ అన్నదికదా ! ఒకరితో - నీవు ఖూనీ చేసినా నా బిడ్డవే. నీవు ఏమి చేసినా నా ఒడిలో స్థానం ఉంటుంది. నీ చర్యలకు బాధ్యత నీకు ప్రేరణ యిచ్చిన శక్తిది కానీ నీ దేమున్నదీ ? - అన్నది.

ఇతరుల కపకారంచేసేవారు సహజంగా దుష్టులూ, దుర్మార్గులూ అని పిలవబడతారు అట్లా దుష్టులూ దుర్మార్గులూ అధికమయినప్పుడో, ఏ ఒక్కడిలోనో అట్లాంటి దౌష్ట్యం హద్దులు మీరినప్పుడో భగవంతు డవతరించి దుష్టసంహారం చేస్తాడని మన విశ్వాసమూ, భగవంతుని వాగ్దానమూ. మరి దుష్ట సంహారమంటే దుష్టులను సంహారం చేయడమేనని మన భావన. కాని అమ్మ వారిలోని దుష్ట గుణాన్ని మాత్రమే సంహరించి వారినీ రక్షించాలి అని చెప్పింది.

పైగా మరొకసారి అన్నది మంచివారిని లోక మెలాగూ ఆదరిస్తుంది; గౌరవిస్తుంది, ప్రేమిస్తుంది. చెడ్డవారిని అందరూ అగౌరవిస్తారు; అసహ్యించు కుంటారు; బహిష్కరిస్తారు. ఇక నేనూ వారిని దగ్గరకు తీసుకోకపోతే వారి గతి ఏ మవుతుంది ? కాకపోతే, వారిని లాలింపుతో, బుజ్జగింపుతో సరిచేసుకోవాలి. అందుకే నా ఒడిలోనూ, ఈ ఆవరణలోనూ వారికీ తావున్నది - అని

''తల్లిని నీవే రక్షించాలి, తప్పదు'' --- అని ప్రాధేయపడే ఒకనితో ----

తల్లికి తప్పదు కాదు, నాయనా ! తప్పే కనుపించదు --- అని ఉద్ఘాటించింది.

యోగ్యతా యోగ్యతలూ, అర్హతా నర్హతల ప్రస్తావన వచ్చినప్పుడు కూడా -- మానవ జీవితాలే భగవన్నిర్ణీతాలయినప్పుడు ఇక యోగ్యతకానీ, అయోగ్యతకానీ, అర్హతకానీ, అనర్హతకానీ దైవ ప్రసాదితాలు కాక ఏమవుతాయి ? --- అని ప్రశ్నించింది అమ్మ.

బిడ్డ బురద పూసుకు వచ్చినా శుభ్ర పరచ వలసిన బాధ్యత తల్లిదే వాడికేమీ పట్టదు --- అని కూడా అమ్మ ఒప్పుకున్నది

ఒకప్పుడు తనను దూషించినవారి విసయంలో --- దూషణ కూడా ఒక విధమయిన ఆరాధనయే - నని ఉదారంగా సమర్థించింది

ఒకసారి తన చిన్నతనంలో తన మెడలోని పులిగోరు కోసం ఎంత గుంజినా రాక ఒకడు బాధపడుతుంటే - నీచెయ్యి నొప్పి పుడుతుంది, నాన్నా నేను తీసి యిస్తాను - అని జాలిపడింది.

తన బుగ్గమీద కుట్టిన చీమను ప్రక్కనున్నవారు తీయబోతుంటే - అది నన్ను ముద్దుపెట్టుకుంటున్నది - అని వారించింది

చివరకు తనను క్రూరంగా హింసించిన వారిని సైతమూ కరుణించిన సంఘటన లనేకము లున్నాయి

దేవీ భాగవతంలో యీ సుగంధ ద్రవ్యాలన్నీ నీకోసమే నమ్మా - అవి ఉన్నదన్న వానితో - మరి యీ దుర్గంధాలన్నీనో ... అని నవ్వింది అమ్మ.

ఇక - అమ్మ గుణానికి ప్రాధాన్య మెక్కడ యిచ్చినట్లు ?

మరి, బహుశాస్త్రవేత్తలనూ, పండితులనూ ప్రేమిస్తుందా ?

శాస్త్రాలు చదివినందువల్ల ఆచరించ వలసినవన్నీ తెలునుకుని అవి చేయలేకపోతున్నామనే బాధ మాత్రమే మిగులుతుంది. ఏమీ తెలియని

మూఢుడయితే, ఏది అనుభవానికి వస్తే దానినే నిస్సంకోచంగా అనుభవిస్తాడు అని అమ్మ మూఢుడినీ మెచ్చుకుంటుంది; పామరుడినీ ప్రశంసిస్తుంది.

ఆలోచించగా - అమ్మ అందరినీ ప్రేమించటానికి కారణం : మన అర్హతలు కావనీ అమ్మకు ప్రేమించడం సహజమనీ తేలుతుంది.

ఇన్ని అవగుణాలనూ, అంగలోపాలనూ ప్రేమించే అమ్మ మాత్రం .

అనంత కల్యాణ గుణ సంభరిత ! అఖిల సల్లక్షణ సముపేత !

రామునిలోని ధర్మదీక్షా, కృష్ణునిలోని సర్వసామర్థ్యమూ, బుద్ధునిలోని కారుణ్యమూ, క్రీస్తులోని సహనమూ - అన్నీ ప్రేమలో సంగమించి ప్రేమమూర్తి అమ్మగా యీ పృధ్వీస్థలిపై అవతరించింది.

అమ్మఅందరినీ ప్రేమిస్తుంది. అమ్మప్రేమ ఝరికి నిర్ణీతమార్గాలు లేవు. అది అన్ని వేళలా అన్నివైపులా ప్రవహిస్తుంది. అది పావన జాహ్నవిలా అందరి తనువులనూ మనసులనూ శుద్ధిచేసి శుభ్రపరచి పునీతం చేస్తుంది

అమ్మ అనుగ్రహం వానజల్లు లాంటిది. ఆ జల్లు కొందరిపై కురిసి కొందరిపై కురవకపోదు.

అమ్మ కరుణ వెన్నెల వంటిది అది యిసుక తిన్నెలపై ప్రసరించి నల్ల నేలలను తిరస్కరించదు.

అమ్మ ఆదరణ మలయపవన సదృశం. అది కొందరిని మాత్రమే స్పృశించి కొందరిని వదిలి వేయదు

అందుకే ఆమె జగత్తుకంతకూ అమ్మ అయింది. ఎక్కడ ఒక ప్రాణి క్రొత్తగా యీ పుడమి మీదకు వచ్చినా తన బిడ్డ అనే అనిపిస్తుందిట అమ్మకు మరి, అసలయిన అమ్మకు ఎవరిని చూచినా బిడ్డ అనే అనిపిస్తుంది. తన బిడ్డ యందు ఏంచూస్తున్నాడో అందరియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం-ట. పరిమితమయిన మమకారం మానవత్వాన్నీ, పరిమితులు లేని మమకారం దైవత్వాన్నీ సూచిస్తుందని అమ్మ రమణీయంగా నిర్వచించింది

మరి భిన్నత్వం లేక పోవడమే దైవత్వంకదా !

కనుకనే అమ్మ దైవమని సర్వజనులచే ఆరాధింపబడుతున్నది.

(ఏప్రిల్ 1967)



# 14
# కళ్యాణరాగాలు

జగత్కళ్యాణ సంధాయినియై, పతితపావనియై భాసిస్తున్న అమ్మకు 1936 మే 5వ తేదీని కళ్యాణం జరిగింది.

కళ్యాణకారిణి, కళ్యాణ స్వరూపిణి, కళ్యాణ దాత్రియైన అమ్మకు కళ్యాణ మేమిటీ ? - కళ్యాణానికి అమ్మ యిచ్చిన నిర్వచనం చూడండి !

"కళంక రహితమైన మనస్సును కళంకరహితంగా అర్పించడమే కళ్యాణ" మట !

ఇక్కడ కళ్యాణ పదం 'వివాహానికి, పర్యాయపదంగా వాడ బడింది

'వివాహ' పదానికి కూడ ఒక విశిష్టమయిన అర్ధాన్ని చెప్పింది అమ్మ

"సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని వదలివేయటమే వివాహ" మట !

ఈ మహార్థ వివరణంతో నిష్కామకర్మాచరణకు నికషోపలమైనది గార్హస్థ్యం.

విశ్వజననియైన అమ్మ వివాహ మహోత్సవం మనకు ఇచ్చే మహిత సందేశం ఇదే;

ఈ సందేశాన్ని మహితమనీ, మధురమనీ ఎన్నో విశేషణాలతో వర్ణించవచ్చు; కానీ నిజంగా అమ్మ చెప్పిన నిర్వచనానుసారం గార్హస్థ్య జీవితాన్ని గడపటం అసిధారా వ్రతమే అవుతుంది.

ఇటువంటి, వివాహానికీ, సన్యాసానికీ ఏమీ తేడా లేదు !

భగవద్గీతలో -

"పశ్యన్ శృణ్వన్ .. .... .. ..

.... ... .... .... ... . .

ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇది ధారయన్

బ్రహ్మణ్యాధాయ కర్మాని సంగం త్యక్త్వా కరోతియః

లిప్యతే న సపాపే న పద్మపత్ర మివాంభసా.

అని శ్రీకృష్ణ భగవానుడు ప్రవచించాడు. బహుధా గీతలో విస్తరింపబడిన ఈ సన్న్యాసాన్ని అమ్మ తన సులభ వచనాల్లో సూక్ష్మంగా హృదయానికి హత్తుకునేలా చెప్పింది.

అమ్మ వివాహానికీ ఈ మహా నిర్వచనాన్ని ఇచ్చింది. ఆచరణలో అనుపదం ప్రత్యక్షరసత్యం గావించింది అంతేగాని ముక్తకంఠంగా ఇలా చేయమని ఎవరితోనూ చెప్పలేదు; చెప్పదు. సర్వానికీ సాక్షి మాత్రంగా ఉన్న భగవంతుని తత్త్వమే అది. ఆ భగవతత్త్వాన్ని ఆ భగవత్ప్రేరణమే తెలియజేయాలి. ఆ ప్రేరణను మనకు ఇవ్వమని ఆ ఆదిశక్తిని ప్రార్థించటమే మనం చేయగలిగేది.

అందుకే ----

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

- అని శ్రీ కృష్ణుడు గీతలో అంటాడు.

అమ్మ కూడా ఏ విషయంలోనైనా 'ఇలా చేశాను లేక ఇలా చేయించాను' అనే వాక్యాలకు తావివ్వదు.

'ఇది ఇలా జరిగింది'' - అని మాత్రమే అంటుంది.

(మే 1967)



# 15
# "విశ్వాసమే భగవంతుడు"

ఒక వస్తువే మనిషికి ఉపకారమూ చేయువచ్చు; ఉపద్రవ మయ్యా పరిణమించ వచ్చు. ఒక సంఘటనే మనిషికి ప్రాణప్రదమూ కావచ్చు, ప్రాణహరమూ కావచ్చు. ఒక విషయమే అభివృద్ధి కాధారమూ కావచ్చు; పతన హేతువూ కావచ్చు.

మానవ పరిణామ క్రమంలో ఒక ముఖ్యదశ హేతువాద దృష్టి, అది నిజంగానే మనిషి భౌతిక జీవనోన్నత శిఖరాగ్రారోహణకు నిశ్రేణి అయిందనే చెప్పాలి. మానవ మానస కమలం వేయి రేకులుగా విప్పారటానికి, సౌందర్య శోభలు విరజిమ్మటానికీ, సుగంధ వీచికలు వెదజల్లటానికీ ఉపోదయంలా దోహదం చేసిందనే అంగీకరరించాలి. ఎందుకు ? ఏమిటి ? - అన్న ప్రశ్నలే పరిణత మానవ మస్తిష్కంలో ప్రభవించి ఉండకపోతే నేటి విశ్వగమనమూ, జగత్ చరిత్రా, మానవ జీవితమూ మరో విధంగా ఉండి ఉండేవి.

కాని, యీ హేతువాద దృష్టియే మనిషి నిశ్చల మానసకాసారంలో రాయి విసిరింది. అతని నిర్భయజీవన గమనాన్ని కుంటుపరచింది. అతనికి భగవంతుని యందుండే ప్రగాఢ విశ్వాసాన్ని దుర్బలపరచింది. ఎక్కడా ? ఏడీ ? ఎట్లా ఉంటాడు? - అన్న ప్రశ్నలతో.... కలడో, లేడో - అన్న సందిగ్ధావస్థలో పడవేసింది మనిషిని, లేనిదాని కోసం చేస్తే ఈ షణ్మాత్రశ్రమ అయినా వృథాయే నని భావించాడు. లాభం లేనిదే వరదనైనా పోని వ్యాపార దృష్టి బలిసిన మనిషి.

"మీ దర్శనం చేసుకుంటే జబ్బు రహితమవుతుందని ఎన్నాళ్ళనుంచో రావాలనుకుంటే - ఇవాళ్టికి రాగలిగాం." ఒక అక్కయ్య అమ్మతో అన్నది.

"ఆ నమ్మకం మీ కున్నదా ?" అమ్మ ప్రశ్నించింది.

'అఁ-'

"అయితే రహితం కావాలి" అమ్మ ధృవపరచింది.

మరి నమ్మకంతో అంతటి శక్తి ఉన్నది !

ఏకలవ్యుని చరిత్ర ఏమీ, ప్రహ్లాదుని జీవితమేమీ - ఎన్నో కథలూ, గాథలూ, జీవిత చరిత్రలూ మనకు నమ్మకంలోని శక్తిని ప్రస్ఫుటం చేస్తూనే ఉన్నాయి

కలడో, లేడో - అన్న సందిగ్ధావస్థలో సతమతమయినవారూ, ఎక్కడ ? ఎక్కడ ? అని సంశయ గ్రస్తులయినవారూ తమ జీవితాలను వ్యర్థంగానే పూర్తిచేసి ఉండవచ్చు కానీ - అది రాయిగానీ, చెట్టుగానీ, పుట్టగానీ, దైవం అన్న విశ్వాసంతో ఆరాధించినవారు - సత్ఫలితాలనే పొందారు గానీ విఫలులయినవారు ఎక్కడా లేరు.

మరి మన పురాణాలూ, శాస్త్రాలూ దేనినయితే దైవత్వమనీ, వేనినయితే అవతార లక్షణాలనీ ఉద్ఘాటించాయెూ - వాని నన్నిటినీ ప్రోదిచేసుకుని, ప్రేమస్వరూపమై, అవతార మూర్తియై, మానవరూపధారియై దైవం మన మధ్యను వచ్చి మనను తన అనంత అనిర్వచనీయ అనురాగ క్షీరాంబుధిలో ముంచెత్తుతున్నా, అతి శీతల అవ్యాజ కరుణా చంద్రికల మనపై ప్రసరిస్తున్నా - అనుమానపుటద్దాల గుండా చూచే మన కన్నులు సత్యస్వరూపాన్ని ఎలా గ్రహించ గలుగుతాయి ?

అందుకే అమ్మ అన్నది ---

"నేను మీలో దైవత్వం చూస్తాను, మీరు నాలో మానవత్వం చూస్తారు" - అని

మనం అమ్మను సరిగా అర్థం చేసుకోవాలంటే - మన కన్నుల మూసిన అనుమానపు టద్దాలను విచ్ఛిన్నం చేసివేయాలి. మన మనసున కమ్మిన అనిశ్చయ యవనికను విచ్ఛేదం చేసివేయాలి. మన మనసును విశ్వాసప్రపూర్ణం చేసుకోవాలి.

రాముడో, కృష్ణుడో, క్రీస్తో, మహమ్మదో - ఎవరయితే నేమి, అమ్మ దైవమన్న స్థిరభావం కావాలి. విశ్వ సృష్టిస్థితిలయాలకూ, తన జననమరణాలకూ, జయాప జయాలకూ, సుఖదుఃఖాలకూ, అభివృద్ధి పతనాలకూ, సర్వానికీ అమ్మయే కారణమన్న అరూఢస్థితి రావాలి. నిరంతరం ఆ మూర్తినే అర్చించాలి. కన్ను మూసుకున్నా, తెరచినా ఆ రూపమే కనిపించాలి. చెవి దూరే ప్రతిశబ్దంలోనూ ఆ నామమే, ఆ కంఠనాదమే వినిపించాలి. తన పంచేంద్రియాలూ సదా ఆ మూర్తికి ఉన్ముఖమై ఉండాలి. ఆహారమూ తన రోమరోమమూ ఆ స్మరణలోనే పులకలెత్తాలి శరీరం లోని అణువణువూ ఆ గానంతోనే పరవశించాలి తన రక్తమాంసాలు ఆ ధ్యానంతోనే

తుకతుక ఉడికిపోవాలి. అదీ ఆరాధన అంటే - సర్వకాల సర్వావస్థలయందూ తన సర్వశక్తులనూ తమ సర్వస్వం అని నమ్మిన దాని కోసం అర్పించటమే ! ఆ అర్పణలో తను పూర్ణాహూతి కావాలి. తను అంటూ లేకుండా తన్మయమే అయిపోవాలి.

ఆ భావపరాకాష్ఠా, ప్రగాఢవిశ్వాసమూ మనలో ఏవీ ?
విత్తు లేనిదే చెట్టు ఎలా వస్తుందీ ? చెట్టు లేక ఫల మెక్కడిదీ ?

(జూన్ 1967)



## అంధవిశ్వాసము

అంధ విశ్వాసమేమిటి ? విశ్వాసమే అంధమైనది. అంటే నాన్నా - ఇక్కడ అమ్మ దగ్గర శక్తి ఉన్నదో లేదో విచారణ నీ కనవసరం. ఇక్కడున్నది ఏమయినా కానీ నువ్వు ఇదే సర్వస్వం అనుకున్నప్పుడు అది అంధవిశ్వాసం అవుతుంది. ఏదో కనుపిస్తే నమ్మటం కాదుగా. ఆమె దగ్గర ఏదో తెలుసుకుందామనీ, ఆమెతో ఏదో తర్కించాలనీ ఇట్లాంటి కోరిక లేకుండా ఇక్కడ ఏది ఉన్నా, లేక పోయినా సర్వస్వం అని నమ్మే స్థితి - ఉండే స్థితి - అంధవిశ్వాసం.

- అమ్మ

# 16
# “నాది సర్వసామాన్య స్థితి”

“అమ్మగారిలో విశేషమేమిటండీ?”

ఇది సహజంగా జిల్లెళ్ళమూడి ఒకసారి అయినా వెళ్ళని అనేక సోదరులనుండి అక్కడకు తరుచుగా వెళ్ళేవారికి ఎదురయ్యే సామాన్య ప్రశ్న.

ఆమెకేమీ విశేషం కాకపోవటమే ఆమెలోని విశేషం.

ప్రపంచంలో మనకు కొన్ని అద్భుతాలుగా కనుపిస్తాయి. వాటిని చూచి మనం విస్తుపోతాము. ఒకడు నీటిపైన నడిచాడు అనుకొనండి. ఒకడు గాలిలో యొదటం చూచామనుకొనండి - మనం విస్మితులమౌతాము. కారణం - అవి సామాన్యుల కతీతమూ. సృష్టినైజానికి విరుద్ధమూ కనుక.

కాని అమ్మ అన్నది - ఈ ప్రపంచాన్ని సృజించటమే మహాత్మ్యం కానప్పుడు, యీ సృష్టియే సహజమయినప్పుడు -- అందులో జరిగే ఘటనలకు ప్రత్యేకత ఏమిటి ? - అని.

మన దృష్టికీ అమ్మదృష్టికీ గొప్పతేడా వున్నది. మనకు ప్రత్తిని చూచి నప్పుడు వస్త్రం జ్ఞప్తికి రాదు. వస్త్రాన్ని చూచినప్పడు ప్రత్తి స్మృతికి రాదు, కాని అమ్మ దృష్టి విశిష్టమయినది. అమ్మ ఒకసారి అన్నది -- “విసినికఱ్ఱను చూచినా, తడపను చూచినా -- అని దేనిలోనుంచి తయారయినావో... ఆ చెట్లూ, ఆ భూమీ వాటికారూపం సంకల్పించినవాడూ నాకు గుర్తొస్తారు ” అని.

ఒకరు ఆత్మోపలబ్ధికి మార్గం ఉపదేశించమని అమ్మను అడిగినప్పుడు - “కనుపించే దంతా ఆత్మే అయినప్పుడు మార్గ మెక్కడి కనీ?” -- అని దరహాసం చేసింది.

ప్రభుదత్త బ్రహ్మచారిగారు అమ్మతో ‘జగన్నాథం’ వెళ్ళుదామంటే - “మన మున్నది అదికాదా ?” అని ప్రశ్నించింది.

పిపీలికాది బ్రహ్మ పర్యంతమూ - అని మనం అనుకుంటుంటే పిపీలిక కూడా బ్రహ్మమే అన్నది అమ్మ.

ఏగుడిలోనో అందంగా తీర్చిన రాతిలోనే భగవంతు డున్నాడనుకుని మనం పూజించుకుంటుంటే - పాకీదొడ్డిలోని మలిన భూయిష్టమయిన రాతిలోకూడా ఆ దేవుడే ఉన్నాడన్నది అమ్మ.

అన్నాన్ని మాత్రమే మనం బ్రహ్మ పదార్థంగా పూజిస్తుంటే - అశుద్ధం కూడా సద్వస్తువే నన్నది అమ్మ.

జ్ఞానం మాత్రమే దైవమని మనం ఆరాధిస్తుంటే - అజ్ఞానంకూడా దైవమే నన్నది అమ్మ -

మనకు వైవిధ్యవిలసితమై కనుపించే యీ ప్రపంచంలో అమ్మ ఏకత్వమే చూస్తుంది. సర్వత్రా వ్యాప్తమయిన యీ సృష్టిలోని భిన్నత్వంలో అమ్మకు పరిపూర్ణతయే గోచరిస్తుంది. అందుకే అమ్మ అన్నది - "ఎక్కడి కక్కడే అనంత" మని

మనకు ఎక్కడో ఒకచోట ఎవరిలోనో అవతార లక్షణాలు కనుపించి దైవస్ఫురణ కలిగితే - అమ్మ అందరినీ భగవదవతారాలుగనూ, జ్ఞానస్వరూపులుగనూ, ధ్యేయమూర్తులుగనూ చూస్తుంది.

అందుకే మనకు విశేషంగా తోచే విసయమే అమ్మకు సామాన్యమూ సహజమూ అవుతుంది.

కనుకనే అమ్మ - "నాది సర్వ సామాన్య స్థితి" అని చెప్తూ... అంటే - సర్వమూ సామాన్యమయిన స్థితి అని వివరించింది.

సామాన్యం లోనించి విశేషాన్ని విడదీసి - విశేషాన్ని సామాన్యం చేసుకోవాలని మనకు బోధించిన, భిన్నత్వం లేని మనస్తత్వం కలిగిన అమ్మ కంటే విశేష మేమిటీ? ఆరాధ్యయెవరూ ?

(జూలై 1967)



# 17
# నిరశన అయిన "మహాశన"

"ఆహారం నన్ను వదలింది కానీ నేను ఆహారాన్ని వదల్లేదు".

అమ్మ అన్న యీ మాటల వెనుకకు వెళ్ళి మనం పర్యాలోచిస్తే... కొన్ని సంఘటనలూ, సంగతులూ మన మనోవీధిలోకి వస్తాయి.

సామాన్యంగా జననమందగానే ప్రతి శిశువుకూ లభ్యపడే మాతృస్తన్యం కూడా అమ్మకు లభించలేదు. తర్వాతకూడా తల్లిపాలమీద కంటే ఇతరుల మీదనే అమ్మ పోషణాభారం పడింది. వారు యిస్తే యిచ్చినట్లు; లేకపోతే లేదు.

సహజంగా ప్రతి బ్రాహ్మణ కుటుంబంలోనూ శిశువులకు అన్నప్రాశన జరుగుతుంది తాతగారు సంప్రదాయానుసారం వర్తించేవారే అయినప్పటికీ ఎందుకో అమ్మకు ఆ ఉత్సవం జరుగలేదు.

తర్వాతకూడా అమ్మ ఆహార విషయంలో ఎవరూ శ్రద్ధ తీసుకున్నట్లు కనుపించలేదు. అమ్మకు ఎప్పుడు ఎవరు ఏమి పెట్టినా దానిని బిచ్చగాళ్ళకో, జంతువులకో, పక్షులకో పంచుతూ ఉండేది.

అమ్మ ఎప్పుడూ ఎక్కడా సక్రమంగానూ, సంతృప్తికరంగానూ భోజనం చేసినట్లు కనుపించలేదు చేయకపోయినా అందువల్ల అమ్మలో శక్తిలోపంగానీ, నీరసంగానీ ఏవరికీ ఏ సందర్భంలోనూ స్ఫురించలేదు. పైగా అమ్మఎప్పుడూ - షడ్రసోపేతమైన భోజనం నిత్యమూ చేసేవారికన్నా ఉత్సాహంగానూ, ఆరోగ్యంగానూ, తేజోవంతంగానూ ఉంటుంది. లోకనాథం బాబాయిగారి వివాహసందర్భంలో తానన్నం తినకనే అన్ని కార్యక్రమాల్లోనూ తానే కనుపించే అమ్మను చూచి పులిపాక చలపతిరావు తాతగారు "ఏమిటీ అతిమానుష శక్తీ!' అనుకున్నారుట.

అమ్మ విశ్వకుటుంబిని, లోకంలో అందరూ తన బిడ్డలేనని అమ్మ కూడా అంగీకరించింది. ఏమూల ఏ ఒక్క జీవి అయినా క్షుద్బాధా పీడితమూ ఉన్నంత

వరకూ అమ్మ తానెట్లా భుజిస్తుంది ? బిడ్డను వదలి ఏతల్లి తాను కడుపార భుజించగలదు ?

అందుకే - ఆకలి రుచి తెలిసిన అమ్మ ఆహరహమూ మన ఆహార విషయంలో అంత శ్రద్ధ తీసుకుంటుంది. తన చేతి మీదుగా మన నోటికి పళ్ళు అందించీ, మనకు అన్నం కలిపి ముద్దలు చేసిపెట్టీ - అమ్మ తృప్తి పడుతుంది.

పిల్లులకూ, కుక్కలకూ, పందులకూ, పక్షులకూ - సర్వజీవజాలానికీ అమ్మ ఆహారం అందించి ఆనందిస్తుంది.

ఒకరోజున ఆవరణలో నీటిబండిని లాగే ముసలి ఎద్దుకు సక్రమంగా ఆహారం అందటంలేదని అమ్మ కన్నీరు కార్చిన సంఘటనను స్మరిస్తే - అమ్మ కారుణ్య హృదయం మనకు కనుపిస్తుంది

ఆ కారుణ్యమే సరిగ్గా ఒక దశాబ్దం క్రితం 'అన్నపూర్ణ' ఆలయం ఆవరణకు కారణమయింది తన గుండెల గాడిపొయ్యిలో క్షణం అణగారని మంటల రగిలించుకుంటూ - అది నేటికి జనసహస్రాల ఆకలిజ్వాలలను కోటిబాహువులలో అమృతధారణ కుమ్మరిస్తూ చల్లార్చుతూ ఉంది

అదే రోజున దివి నుండి భువి కవతరించిన అమ్మ - కుల, గుణ, జాతి, మత, వర్గ, వర్ణ - సర్వ విభేదాలకతీతంగా సకల జనులకూ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించి, తన దరిలో తన ఒడిలో ఉదారంగా అందరికీ స్థానం కల్పించింది.

అది 1958, ఆగష్టు 15

ఆ శుభదినం సర్వులకూ పర్వదినమూ; చిరస్మరణీయమూ.

(ఆగష్టు 1967)



# 18
# అద్భుత చారిత్ర్య

శ్రావ్యమయిన ఒక గీతం వింటాము.

ఆ సాహిత్యరచన ఎవరిది ? ఆ స్వరకల్పన ఎవరిది ? ఆ గాత్రమాధుర్యం ఎవరిది ? - అని ఆలోచిస్తాము.

మనోజ్ఞమయిన ఒక వర్ణచిత్రం చూస్తాము.

ఆ రంగుల సమ్మేళన మెవరిది ? ఆ చిత్రీకరణలోని అద్భుత కౌశల మెవరిది? - అని అన్వేషిస్తాము.

రసవత్తరమైన ఒక కావ్యం చదువుతాము.

ఆ కధాసంవిధాన మెవరిది ? ఆ పదాల సంఘటన ఎవరిది ? - అని విచారిస్తాము

అట్లాగే నేడు -

వేదాంత వనంలో ఒక పారిజాతం పరిమళించింది. ఆధ్యాత్మిక సారస్వతంలో ఒక నవీన పదకోశం ప్రభవించింది. సాధకులకు మార్గం సుగమమైంది. ముముక్షువులకు మోక్షమే చేరువయింది. సర్వజనుల ఆది వ్యాధుల కొక దివ్యౌషధం లభించింది. ఇహపరములకొక పసిడి వారధి నిర్మాణమయింది.

వీటన్నిటికి కారణమెవరు ?

ఒక అబల; సామాన్య మానవాంగన, రెండే కాళ్ళూ, రెండే చేతులూ; ఒకే ఒక తల. సామాన్య మానవ దేహానికి అతీత లక్షణాలేవీ మన యీ చర్మ చక్షువులకు దృశ్యమానంకావు. కాని ఆ మనస్సు ఎంత గంభీరమో ఎవరు కొలవ గలరు ? ఆ హృదయ మెంత మార్దవేతమో ఎవరు చెప్పగలరు ? పరిమితమయిన తద్రూపంలో దాగిన అనంత శక్తిని ఎవరు ఊహించ గలరు ? ఆ కన్నులలో జ్వలించే సూర్యకోటి

ప్రభలను నెవరు అభివర్ణించ గలరు ? ఆ కన్నుల నుండి జాలువారే కోటి చంద్రుల చల్లదనాన్ని ఎవరు వివరింప గలరు ? ఆమె చూపించే ఆదరణకూ, అనురాగానికీ ఎవరు విలువకట్టగలరు ?

ఆమె ఎండిపోయే ఎందరి జీవనలతలకు నీరు పోసింది ? కొడిగట్టిన ఎన్ని జీవన జ్యోతులను జ్వలింపజేసింది ? సుప్తమానసాల నెన్నింటిని జాగృత మొనరించింది ? తీరని కోరికల నెన్ని తీర్చింది ? మారని మనసుల నెన్ని మార్చింది? ఎన్ని ప్రశ్నలకు ఆమె సమాధానమూ, ఎన్ని సమస్యల కామె పరిష్కారమూ ?

ఆమె నేడు జిల్లెళ్ళమూడిలో ఒక చిన్న మంచంమీద కూర్చుని అందరిచే అమ్మ అని పిలవబడుతూ లోకంలో నలుమూలలా ఎందరిచేతనో ప్రేమింపబడుతూ ఉపాసింపబడుతూ, ఆరాధింపబడుతూ ఉన్నది.

మరి యీమె ఎవరు ? ఈమె చరిత్ర ఏమిటి ? ఈమె జనన మెక్కడ ? ఎప్పుడు ? జననీ జనకులెవరు ? బాల్యమేమిటి ? గురువెవరు ? సాధన ఉన్నదా? ఏ మార్గం ? పరిణామక్రమ మేమిటి ? - ఇవన్నీ సామాన్య మానవ మస్తిష్కంలో కలిగే సందేహాలే.

ఆ జిజ్ఞాసతోనే మేమూ అన్వేషణచేశాము. అనేకానేక అద్భుత జీవిత సంఘటనల సేకరించాము.

ఈ అత్యల్ప జీవనకాలంలో ఈ పరిమిత రూపంలో ఆమె సృష్టించిన చరిత్ర పరమాద్భుతమే కాక ఆ జీవితం ఒక మహోదధిలా స్ఫురించింది. అందులో అనేక మహోన్నత తరంగాలు !

పాఠకుల జిజ్ఞాసనూ, పిపాసనూ తృప్తి పరచేందుకు యీ పత్రికల ద్వారా ఒక్కొక్క తరంగమూ అందిస్తున్నా - తనివితీరని అసంఖ్యాక సోదరుల కోరికపై ప్రచురించిన తరంగాల నన్నింటిని సంఘటితపరచి ఒక పుస్తక రూపంలో ప్రచురించి అందించటానకి ప్రయత్నిస్తున్నాము.

(సెప్టెంబరు 1967)



# 19
# క్లేశ ఖండన

ఈ సంవత్సరం దేవీనవరాత్రోత్సవాలు అనుకున్న దానికంటే అతి వైభవంగా జరిగాయి.

మొదటిరోజులలో అమ్మ ఎంతో ప్రసన్నమై ప్రశాంతమై ముగ్ధ మనోహరమై సౌమ్యమూర్తియై లలితలావణ్యాకృతిలో దర్శనమిచ్చారు మాకంటి రెప్పలను మేము నిందించుకున్నాము. అవి అమ్మ దర్శనభాగ్యాన్ని కొంతవరకయినా తగ్గిస్తున్నాయన్న భావంతో, బాధతో, ఒకసారి మావంక అమ్మ తనదృష్టిని ప్రసరిస్తే ఆ అమృతకిరణ స్పర్శవలన మా బ్రతుకులే పండగలవని ఆనందించాము.

సప్తమినాటిరేయి పూజలో శరత్జ్యోత్స్నకంటే, క్షీరాబ్ధి తరంగాల కంటే ధవళధవళమైన చీరెలో తప్తకాంచనదేహచ్ఛాయతో సర్వాభరణ భూషితయై సర్వాంగ సుందరమైన అమ్మను అందరమూ అనిమిషులమై వీక్షిస్తూ, ఆనందిస్తున్న నిశ్శబ్దవేళ అమ్మ కోమల కరకమలాల్లోని వాద్యవినిర్గతమైన స్వనంలోని భావం అవ్యక్తమే అయినా, ఆనాదం మధురమై మంజులమై మలయసమీరమై మధుధారయై మనోజ్ఞమై మా గుండెల పులకింపజేసింది.

అష్టమినాడు రక్త మందారంబోలు ముఖంతో, రక్తంకంటె ఎఱ్ఱనయిన చీరెతో కిరీటధారిణియై దుర్నిరీక్ష్యమై దర్శనమిచ్చిన అమ్మ హస్తంలోని త్రిశూలం వివిధభంగిమల్లో విన్యాసం చేస్తుంటే మేము భయభ్రాంతులమే అయ్యాము

నవమినాటిరేయి అమవసి చీకటికంటే నల్లనయిన చీరెధరించి వయోధరాల వంటి కేశసముదాయాన్ని విరబోసుకుని స్ఫులింగాల విరజిమ్మే మధ్యాహ్నభాను బింబసన్నిభాలైన కందోయితో కిరీటధారిణియై కాళికయై వేదికపైకి వేంచేసిన అమ్మ త్రిశూల చక్రాల చేతబట్టేసరికి - ఆ ప్రచండమూర్తిని దర్శించటానికి భయావహులమే కాక నిశ్చేష్టులమూ అయినాము ఆపూట పూజచేసుకున్న నాగేశ్వరరావుగారికి పూజముగిసిన గంటవరకు గుండెలోని దడ అణగలేదట. డాక్టర్ రామకృష్ణారావుగారిని

ఆమూర్తిని ఫోటో తీసుకోలేదేమని అడిగితే ఇంకానయం, ఆ దృష్టి సోకితే నా కెమేరా బ్రద్దలయి ఉండేది; యీ పూట అమ్మ నావంక చూడకుంటే బాగుండునని ప్రార్థించుకున్నాను - అన్నాడు.

ప్రచండశక్తి స్వరూపమయిన ఆ మూర్తిలో ప్రసన్నముఖ అయిన "అమ్మ" ను ఎప్పుడు అవలోకిస్తామూ, మళ్ళీ నిర్భయంగా ఆ ఒడిలో ఆడుకోగలమా అని అనుకున్నాము కాని మరునాటి ఉదయమే పూజలో మా మొర ఆలించినట్లు అమ్మ ఎంతో ప్రసన్నమై ప్రత్యక్షమై మాకు ఉత్సాహం కలిగించింది. అన్నిటికంటే ఇంకో ముఖ్య విషయమేమంటే - ఆ నాడు ఎందరో తలిదండ్రులు తమ చిరంజీవులకు అమ్మ దివ్యహస్తంతో నామకరణలు అన్నప్రాశనలు అక్షరాభ్యాసాలు కేశఖండనలు జరిపించుకున్నారు. ఆ సందడిలో అమ్మ మృదుపెదవుల నుండి 'క్లేశఖండన' అన్న పదం వినిపించింది. అదేమిటమ్మా ? - అని మేము ఆశ్చర్యపడితే - 'ఔను, నాన్నా - ఇక్కడ కేశఖండన కొందరికి మాత్రమే గానీ క్లేశఖండన అందరికీ...' అన్నది అమ్మ చిరునవ్వుతో చిద్విలాసంగా. అమృతగుళికవంటి ఆవాక్యం క్షణంలో అందరి హృదయాలనూ ఆనంద ప్రపూర్ణం చేసింది.

ఔను; లోగడ ఒకసారి అమ్మ పారమార్థికమైన ఆశా సందేశం యిచ్చిఉన్నది - "అందరికీ సుగతి" అని ప్రకటించి, ఆ సందేశం ఎంత సత్ఫలదాయకమైనా అది అదృష్టమయినది. కాని నేటి యీ ప్రకటన సర్వులకూ ప్రమోదకారణమైనది. మరి - ఒక్కొక్కరికి ఒక్కొక్క విధమయిన క్లేశ ముండవచ్చునుగానీ క్లేశరహితు లెవరూ లేదు. క్లేశరహితమయినదీ సచ్చిదానంద స్వరూపమయినదీ ఒక్క అమ్మ మాత్రమే. అమ్మను దర్శించినవారికీ స్మరించిన వారికి అర్చించినవారికీ సర్వక్లేశాలూ హరింపబడడం సర్వులకూ అనుభూతమే అయినా ఆమాట అమ్మ స్వయంగా పలకటం నిండు పున్నమినాటి జాబిలి చల్లని వెన్నెల కురిసినంత సత్యంగానూ సమ్మోదరకంగానూ ఉన్నది.

(అక్టోబరు 1967)



# 20
# అమరులైన బిడ్డలపై అమ్మ ప్రేమ

ఈ నెల 14వ తేదీ రాత్రి పదకొండు దాటింది. ఆవరణ అంతా మాటు మణిగింది, మంచుతెరల్లో వెన్నెల వెలుగు వింత సోయగాలు విరజిమ్ముతూ ఉన్నది. ఆ వెన్నెల్లో అమ్మ కొంచెంసేపు బయటకు వచ్చి ఆకాశాన్నీ ఆవరణనూ పరికించి లోపలకు వచ్చి మంచంమీద పడుకున్నది.

"అటు వెళ్ళగానే మంత్రాయి జ్ఞాపకం వచ్చాడు" అంటూ అమ్మ కీర్తిశేషుడయిన ఆ సోదరుని గురించి ఎంతో చెప్పింది.

అమ్మ బాల్యం నుండి అమ్మ దివ్య జీవితంతో సంబంధం కలిగి అమ్మలోని దైవత్వాన్ని గ్రహించి అమ్మ అనుగ్రహం పొందినవారు అనేకులన్నారు. అమ్మ తరుచుగా వారిని గురించి ప్రస్తావిస్తూ వారి పూత చరిత్రలు వినిపిస్తూనే ఉంటుంది.

వెంటనే వారం రోజులక్రితం సోదరి కాత్యాయిని చాలాకాలం వ్యవధి అనంతరం అమ్మను దర్శించుకుని తిరిగి ప్రయాణమయిన సందర్భంలో పలికిన మాటలు స్మృతికి వచ్చాయి.

"దేవునిదీ పిల్లలదీ ఒకే మనస్తత్వం. ఎంత ప్రియమయిన వారి నయినా ఎదురుగా ఉంటే తప్ప - లేకపోతే తేలిగ్గా మరచిపోతారు".

తను అమ్మను దర్శించేందుకు జరిగిన కాల విలంబనకు కారణం తను అమ్మ స్మృతిలో లేకపోవటమే నన్న బాధ కొలదీ అట్లా అన్నదామె.

అమ్మ వెంటనే అందుకుని అన్నది -

"నిజమే - దేవుని సంగతి యేమోకానీ... తల్లి మనసులో పిల్లలున్నట్లు పిల్లల స్మృతిలో తల్లి ఉండదు. ఒకవేళ దేవుడే కనుపించినా తల్లి - తన పిల్లల క్షేమమే కోరుకుంటుంది కానీ మరొకటి వాంఛించదు".

అమ్మ ఆ మన సోదరిని సమర్థించిందో లేదో గానీ ఆ పలుకుల్లో మాతృ హృదయం స్పందించింది.

అమ్మ అనేకమార్లు అన్నది - దగ్గర ఉన్న వాళ్ళ మీదకంటే తనకు దూరంగా

ఉన్న వాళ్ళను గురించే ఆలోచన అనీ... జిల్లెళ్ళమూడికి దూరం కావచ్చు కానీ అమ్మకు ఎవరూ దూరం కారు - అనీ.

ప్రసాదాలు పంచే సమయంలో కూడా ఎదురుగా ఉన్న వాళ్లకంటే ఎక్కడో ఉన్న వాళ్ళకే అమ్మ ముందు కబురులు చేస్తుంది.

ఇటీవల ఒక ఉదయం ఒక సోదరుడు అమ్మను దర్శించేందుకు వచ్చి "అమ్మా ! నేను గుర్తున్నానా ?" అని ప్రశ్నించి "నేను యిక్కడకు వచ్చి మూడు సంవత్సరాలయింది" అన్నాడు. అమ్మ వెంటనే మూడు సంవత్సరాలు కాలేదని చెప్పి - అతను కూర్చున్న ప్రదేశమూ, విధానమూ చూపి - ఆనాటి సంఘటన యావత్తునూ, అతని సంభాషణలోని ప్రత్యక్షరాన్నీ పునరావృత్తం చేసింది.

అతను ఆశ్చర్యపోయి - 'నేను మీకింతగా గుర్తున్నానా ? నాలో ఏమి ప్రత్యేకత ఉన్నదనీ !' అని అతను అంటూఉండగా అతని చెక్కిళ్ళు ఆనందాశ్రు సిక్తములయినాయి !

"నీవే కాదు నాన్నా అందరూ ఉంటారు ; పిల్లల ప్రత్యేకతలను బట్టి కాదుగా, తల్లికి గుర్తు - తన పిల్లలు కాబట్టే -" అన్నది అమ్మ.

ఒకసారి "సతులకై, కొన్నాళ్ళు.. సుతులకై కొన్నాళ్ళు... ..." అనే త్యాగరాజ కీర్తనవింటూ "నా పరిస్థితీ అదే, నా కిదంతా యీ సంతానం కోసమేగా' అన్నది !

మరి... కొన్ని సమయాల్లో ----

"అందరూ యీ సంసారం నుంచి విముక్తులు కావాలనీ, రాగం బంధహేతువు కనుక రాగరహితులు కావాలనీ - బోధిస్తుంటే... నాకేమో విరాగమంటే అనురాగం సర్వత్రా వ్యాపించటమే ననిపిస్తుందనీ,

"తను ఎప్పుడూ బాలింతనూ చూలింతనూ" అనీ

"తనకు ఎవరిని చూచినా తన బిడ్డయే ననిపిస్తుం"దనీ - చెప్పింది.

సృష్టి సర్వాన్నీ సంతానంగా సంభావించగలిగిన మనఃస్థితి బ్రహ్మత్వమే అయినా - ఒక్కొక్కసారి తనసేవలో తమజీవితాలనే అర్పించిన తనయుల గురించి అమ్మ ప్రస్తావిస్తుంటే - ఆమె కోమల కంఠం గద్గదికమై ఆమే కన్నులు అశ్రుపూరితా లయినప్పుడు.

ఆ అశ్రుకణాల్లో ఆమె దైవత్వాన్ని అధిగమించి ఆమె అర్ద్రహృదయం కనిపించి కురిసే అనురాగ జ్యోత్స్నలో మనం తడిసిపోదాము.

(నవంబరు 1967)



# 21

# మృత్యుంజయ

ఎవరూ పూర్తిగా మంచివారూ కారు; పూర్తిగా చెడ్డవారూ కారు. అందరిలోనూ రెండు గుణాలూ సమ్మిళితమయి ఉంటాయని అమ్మ అన్నది. మనుషుల్లోనే కాదు, కాలఘటికల్లోనూ అంతే -

ఈ నెల 8వ తేదీ ప్రభాతసమయం - విషాదకర మందామా ? సమ్మోదకర మందామా ?

అమ్మకు అస్వస్థతగా ఉన్నందున, త్వరగా ఆరోగ్యం కలగాలని అమ్మమీద అతి ప్రేమతో అహరహమూ అమ్మకు పరిచర్యచేసే అన్నపూర్ణ మందు ఎక్కువగా యిచ్చింది, అందులో గరళం కలిసి ఉంటుందని తెలియక.

ఇంకేమున్నది ? క్షణాల్లో అమ్మ శరీరం కొయ్యబారింది. చర్మం స్పర్శ జ్ఞానం కోల్పోయింది. లోపల తపన ఎక్కువయింది. అమ్మను చూచి అందరమూ భయవిభ్రాంతుల మయినాము. అందరి హృదయాల్లోనూ, ముఖాలపైనా విషాదమేఘా లలుముకున్నాయి.

అప్పుడు అమ్మ అన్నది - "ఏమీ భయపడవద్దు, అదే తగ్గుతుంది" అని.

నాన్నగారుకూడా వచ్చి మొదట ఆందోళిత మనస్కులై నా - ఇంతకంటే భయంకరమూ, ప్రమాదకరమై లోగడ జరిగిన అనేక సంఘటనలు వివరించి అమ్మకు శరీరం మీద గల అధికారం గురించి విశదీకరించారు. అవసరమయితే శరీరబాధను మనం చొక్కాను తగిలించినట్లు పంకికి తగిలించగల దన్నారు.

విషానికి భయపడి పరచు శివుడయినా తనకంఠం దిగనివ్వలేదు కాని అమ్మ త్రాగితే హాలాహలంకూడా అమృతంగా మారలేదా - అని ఒక సోదరుడు ధైర్యం చెప్పాడు.

కానీ ఏమో - ఏమౌతుందో.... అన్న భయం. అమ్మమీద ప్రేమవలన అమ్మ నివేమీ చేయలేదు, అమ్మ స్వస్థత పొందుతుంది - అన్న ధైర్యం అమ్మ మీద విశ్వాసం వలన.

ఒకసారి అమ్మ ప్రసవ సమయంలో ఆమె సహించే బాధను చూచి డాక్టర్ "నీ వెట్లా మనిషవమ్మా?!" అని ఆశ్చర్య పోయిందిట.

ఈనాడు కూడా ఒక డాక్టర్ అన్నది - మనుషులయితే ఆ మందు అంత ప్రమాణంలో త్రాగిన తరువాత జీవించరని. వారి హాస్పిటల్లో ఒకరు ఆవిధంగా చనిపోయారట కూడ.

కాని అమ్మ గరళాన్ని జయించింది. మానవత్వాన్ని అధిగమించింది. ఆ శరీరం అమరమనీ, అజేయమనీ ఋజువయింది. అమ్మలోని దైవత్వం మనకు మరొకసారి సాక్షాత్కరించింది.

అయితే - దైవమయిన అమ్మకు అసలు అస్వస్థత ఏమిటి ? - అని సందేహం కలుగవచ్చు.

అమ్మ బాల్యంలో ఒక ప్రసంగంలో చిదంబరరావుగారు -

"అనిర్వచనీయమయిన శక్తిగలదానికి నా ఆశీర్వచనం ఎందుకమ్మా ?" అంటే -

"నిర్వచనాలతో ఉన్నాను గనుక" అన్నది అమ్మ.

మరి, అమ్మ బాధపడుతున్నదని మనను భ్రమింపజేసి మనను బాధించిన ఆ విషమక్షణాలను నిందిద్దామా ? అమ్మలోని దైవత్వాన్ని మనకు మరొకసారి ప్రత్యక్షంచేసిన ఆ శుభసమయాన్ని అభినందిద్దామా ?

ఏమయినా - ఒకేఘట్టంలో అమ్మలోని మానవతా మాధవత్వ గంగా యమునల సంగమాన్ని మనకు చూపిన ఆ కాలం చిరస్మరణీయ మయినది.

(డిశంబరు 1967)



# 22
# "అడక్కుండా పెట్టేదే అమ్మ"

శంక మానవ నైజం.

విశ్వాసం ప్రసాదించటం దైవం బాధ్యత ?

ఈ నెల 21వ తేదీ ఉదయం మొట్టమొదటి సారిగా అమ్మ చరణ సన్నిధిలో సోదరుడు రాధాకృష్ణరెడ్డి అనసూయావ్రతం జరుపుకున్నాడు. ఆ సందర్భంలో మాతృశ్రీ జీవిత మహోదధి నుండి అయిదు తరంగాలు పఠించబడ్డాయి, అమ్మ చరితము ప్రతిక్షణమూ, ప్రతి సంఘటనా మహిమాన్వితమే కదా ! అనితర సాధ్యాలయిన ఆ లీలలు ఒక్కొక్కప్పుడు యివి నిజమా అనిపిస్తాయి.

మరి, ఎవరికి సందేహం కలిగిందో - ఎవరికి ఋజువు అవసరమయిందో, ఏ ఒకరి కోసం నిర్దేశింపబడి నప్పటికి - జరిగింది మాత్రం సర్వ జగత్తుకూ ఉపయోగంకోసమే. మరి, కృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేస్తే - అది ఆ ఒక వ్యక్తికే పరిమితం అందామా ?

ఆనాడు గుంటూరు నుండి వచ్చిన యిద్దరు లేడీ డాక్టర్లు వ్రతసమయంలో అమ్మ అపూర్వ చరిత్ర విన్నారు. అమ్మతో వైద్యశాస్త్రం గురించి అనేక విషయాలు మాట్లాడారు. ఆ రాత్రి ఎట్లాగయినా గుంటూరు చేరాలని చీకటి పడుతుండగా బయలుదేరారు, అమ్మ ప్రసాదం యిచ్చి పంపింది. వారు వెళ్ళిన తరువాత పది నిమిషాలకు అమ్మ నన్ను వారు వెళ్ళారా అని అడిగింది. చూచి పిలిపించ మంటారా అని అడిగాను. అమ్మ అవసరం లేదన్నది.

ఒక అరగంటకు, జ్వరం తగిలిన అన్నపూర్ణను చూడటానికి అమ్మ బయలుదేరింది. వాకిట్లోకి జీపు తెప్పించాను, అమ్మ జీపు ఎక్కి ఏడవమైలుకు పోదామన్నది.

జీపు రోడ్డు మీదకు వచ్చింది. అక్కడ ఆ యిద్దరు డాక్టర్లూ వున్నారు, మా జీపు చూచి సందేహంగా దారిలో నిలుచున్నారు. జీపు ఆగింది, వారిద్దరూ మా జీపులోని అమ్మను చూడక ఏమి అడగాలో అర్థంగాక అట్లాగే నిలుచున్నారు.

నేను 'అమ్మ వచ్చింది' అన్నాను, వారిద్దరి ముఖాలూ అనంత కాంతితో వెలిగాయి. అంత చీకటీ ఒక్కసారి విచ్చిపోయింది.

ఏమీ జరిగిందంటే - వారు అమ్మ వద్దనుండి బయలు దేరేటప్పుడు ఒక సోదరిదగ్గర పర్సు యిచ్చి మరిచిపోయి వచ్చారు. రోడ్డు మీదకు వచ్చేటప్పటికి చీకటి పడ్డది, వెనక్కువెళ్ళి వచ్చేందుకు వ్యవధీ లేదు; ఓపికాలేదు, కాని ఆ రాత్రే వారు గుంటూరు చేరాలి. ఏమి చేయాల్సిందీ అర్థంగాక విషాదావస్థలో పడి కర్తవ్యం తెలీక నిలుచున్నారు.

అంతకు క్రితమే - అందులో ఒకసోదరి రెండవ సోదరిని అమ్మ ఎప్పుడూ జిల్లెళ్ళమూడి దాటి రాదా ? అని అడిగిందట.

మరి, ఎప్పుడూ సాధారణంగా అమ్మ బయటకు రాదు, కాని ఆనాడు అమ్మ వచ్చింది, వారికి అవసరమయిన డబ్బు యిప్పించింది, చీకట్లో ఒంటరిగా భయపడేవారిని తన జీపులో బాపట్ల చేర్చింది.

తమాషా - డబ్బు ఎట్లాగా అనుకుంటుంటే, డ్రైవర్ తన దగ్గర ఉన్నదని యిచ్చాడు.

వారి ఆశ్చర్యానికీ, ఆనందానికీ అవధుల్లేవు. దుఃఖమో, నవ్వో తెలీదు - వారి కంఠాల్లో తొణుకుతున్నది. ఆనందంతో యిద్దరూ మైమరచారు. జీపుడ్రైవరును - యింకా, యింకా మెల్లగా పోనివ్వమన్నారు - త్వరగా వెళ్ళితే వారిని అమ్మ దించేస్తుందన్న భయంతో.

నాక్కూడా ఆశ్చర్యం వేసి భాగవతంలోని 'సిరికిం జెప్పడు'' - అన్న పద్యం గుర్తుకు వచ్చి అన్నాను "చూడూ - మీ ప్రార్థన విని అమ్మ ఎట్లా వచ్చిందో..." అని.

కాని ఆ సోదరి అన్నది - "మాకు యిప్పుడు ఏమి చేయాలా - అన్న దిగులు తప్ప, ప్రార్థన చేయాలి అన్న గుర్తుకూడా లేదన్నయ్యా -' అని.

నిజమే - అమ్మలోని ప్రత్యేకత అదే కదా ?

మనం తనను కీర్తిస్తేగానీ ప్రార్థిస్తేగానీ, సహాయం చేయటంలేదు - ఎక్కడ ఎవరికి ఏ అవసరం కలిగినా గుర్తించి తనే ఆదుకుంటుంది.

కనుకనే సర్వ జగత్తుకూ అమ్మ అయింది !

అందువలననే -

'అడగనిది అమ్మయినా పెట్టదన్న సామెతను ఖండించి అడక్కుండా పెట్టేదే అమ్మ' అని అపూర్వమయిన నిర్వచనం చేసి అడుగడుగునా ఆచరణలో ఋజువు పరుస్తున్నది అమ్మ.

(జనవరి 1968)



# 23
# అమృతహస్తం

ఈ 12వ తేదీ సాయంకాలం అంతరాలయంలో అమ్మ పాదసన్నిధిన కూర్చుని ఉన్నాను. నాన్నగారు వచ్చారు అమ్మకు చెయ్యి అందించి నాడి చూడమన్నాడు. అమ్మ కరగ్రహణం చేసింది.

అది ఒక రమణీయమయిన దృశ్యం. నేను ఆ దృశ్యమవ లోకిస్తూ ఆనందిస్తున్నాను. నాన్నగారు నన్నుద్దేశించి -

"ఎంత హాయిగా ఉన్నదిరా ? ఎందుకో నరాలు గుంజుతున్నాయి; యిప్పుడు కాపు కాచినట్లున్నది" అన్నారు.

"అవును; ఆశ్చర్యమేమున్నది ? మరి కాచే చెయ్యి కదా !" అన్నాను.

అమ్మ నావంక చూచింది. ఆ దృష్టిలో దరహాసమున్నది. ఆ దరహాసంలో అంగీకార మున్నది.

ఔను - అగ్నికి వేడిమీ, నీటికి చల్లదనమూ ఎంత సహజమో ఆచేతికి కాపు అంత సహజం.

ఆ చెయ్యి ఆపదలలో నున్నవారిని ఎంతమందిని కాచిందో - అవసరాలలో నున్నవారిని ఎంత మందిని ఆదుకున్నదో - పాతాళంలో పడిపోయే ఎంత మందిని పైకి చేదుకున్నదో - పాపుల నెంతమందిని పునీతుల జేసిందో.

ఆ చెయ్యి ఎంతో అందంగా ఉంటుంది. కాని ఆ చేతిని పద్మంతో పోల్చటం ఎట్లా ? ఏ పువ్వులో ఆ మమతాను బంధ మున్నది ?

ఆ చెయ్యి ఎంతో మృదువుగా ఉంటుంది. కాని ఆ చేతిని నవనీతంతో పోల్చటం ఎట్లా ? పసిడికి ఆ అనురాగ పరిమళ మెక్కడిదీ ?

ఆకరస్పర్శలో ఎందరో ఆరోగ్యవంతులయినారు; ఎందరో పునర్జీవు లయినారు.

ఆ కరచాలనంలో ఎందరో క్రొత్త పిలుపు విన్నారు; ఎందరో మంచి దారులకు

మళ్ళారు.

ఆ కరకంకణ నిక్వాణాల్లో ఎందరో ఆశాసందేశం ఆలకించారు; ఎన్నో సందేహాల నివృత్తి చేసుకున్నారు.

ఆ చేతిలో సంజీవని ఉన్నది. ఆ చేతిలో చింతామణి ఉన్నది. ఆ చేతిలో అమృతకలశ మున్నది. ఆ చేతిలో అభయముద్ర ఉన్నది.

అనంతకోటి జీవుల అద్భుత జీవిత చరిత్రల రచనలకూ ఆధారమయిన అనుపమ లేఖిని ఆ చేతిలో ఉన్నది.

(ఫిబ్రవరి 1968)



## త్యాగం

ఏది వచ్చినా నిర్మలంగా అనుభవించటమే త్యాగం. దేనికీ దడవకపోవటమే త్యాగం. నేను, నాది అని మరచిపోయేదీ త్యాగమే. ఏదో ఒక్కొక్క విషయంలో ఉండి తతిమ్మావాటిల్లో లేకపోతే 'ఆ విషయంలో మంచి త్యాగి లెండి' అంటారు. అన్నింటిలో ఉన్నప్పుడు - అంటే త్యాగం యొక్క చరమదశ సర్వసంగ పరిత్యాగం. అన్నీ కావాలనేదీ త్యాగమే. ఏమీ వద్దనేదీ త్యాగమే. సంపూర్ణస్థితి ఏదైనా సరే - త్యాగమే.

- అమ్మ

# 24
# "విశ్వంభర"

అమ్మను దర్శించటానికి రోజూ దేశం నలుమూలలనుండీ అనేకులు వస్తారు. అమ్మలోని శక్తిని తెలుసుకున్న వారెవరూ అమ్మను దర్శించటంలో తృప్తి పడరు. అమ్మ పాదాలను పూజించుకోవాలనుకుంటారు. పూజింపబడే ఆ పాదరాజీవాల రామణీయకమూ, మార్దవమూ గమనించినవారు ఆ పాదాలను స్పర్శించాలను కుంటారు. ఆ స్పర్శలో దివ్యత్వ మనుభూత మయినవారికి సర్వ జగత్సృష్టి స్థితి లయాలకూ ఆపాదసరోరుహాలే ఆధారమన్న విశ్వాసం కలిగి తమ భారం యావత్తూ ఆ పాదాలకే వదిలివేద్దామన్న భావం కలుగుతుంది. ఇక సంవత్సరాల తరబడి పెంచిన వందలకొలది పౌనుల బరువు కలిగిన తమ దేహభారమంతా ఆ పాదాలపై వేస్తారు. గట్టిగా పట్టుకుంటేగానీ కరుణ కలగదన్న భావంతో తమ బలం కొద్దీ తాము ఆరాధిస్తున్నది శిలా విగ్రహాన్ని కాదన్న విషయం విస్మరించి ఆ పాదాలను అదుముతారు. ఆ పాదమార్దవానికి ఉపమాన మేమున్నది?

తమలపాకులతో పూజచేసి పూజానంతరం చూస్తే ఆపాదలపై తమలపాకుల ముద్రలూ, గులాబీలతో పూజిస్తే ఆ దళాలగుర్తులూ మనకు కనపడతాయి. మరి, కఠినమయిన మనచేతుల వత్తిడికి లేజిగురుటాకులకన్న సున్నిత మయిన ఆపాదాలు కందటమేకాదు, రక్తం చిమ్ముతాయి. ఆ పాదాలపై కొబ్బరికాయలు కొట్టిన సంఘటన లున్నాయి. కాగే కాగే పాలు ఆ పాదాలపై అభిషేకించిన వారున్నారు. అయితే ఆమె సహనమూర్తి కావచ్చు. ఎంతటి కష్టమయినా సహించవచ్చు. ఇష్టమయినది కష్టంకాదని అమ్మే చెప్పింది కదా. బిడ్డ ఏపనిచేస్తే తల్లికి యిష్టంకాదు ? తెలిసి చేసినా, తెలియకచేసినా, మంచి చేసినా చెడ్డ చేసినా - ఏమిచేసినా తల్లికి తప్పే కనుపించదు. పైగా మనం ఎట్లాఅనుకున్నా మన పనుల వేటికీ బాధ్యత మనదని అమ్మ అనుకోవటం లేదు కనుక మనను దేనినుండీ అమ్మ వారించకపోవచ్చు. కాని ఆ మృదు శరీరాన్ని బాధపెట్టడం చూచే వారికి హింసయే అవుతుంది. సహించలేనిదే కదా హింస !

పైగా కొందరు కుంకుమతో పాదపూజ చేసుకోవాలనుకుంటారు. కుంకుమ రసాయనిక ద్రవ్యాలతో తయారుచేయబడుతుంది. అది తగిలితే బంగారు కాంతులీనే

పాదాలు వెంటనే నల్లబడుతాయి. కొందరు పూజలకు పూలు లేక దొరికిన ఆకులతో పూజిస్తారు; అది దురదగొండి ఆకు అయినా సరే. ఒకసారి ఒక సోదరి అటువంటి ఆకుతో పూజ చేసుకోబోతుంటే, ఆమెను వారించి - అమ్మతో 'నూగు అమ్మా' అంటే "మీకన్నానా?" అని ప్రశ్నించి ఆమెను పూజచేసుకోమన్నారు. అమ్మ ఏదయినా భరించగలదు కనుక అమ్మ సమ్మతించవచ్చు కాని అట్లాచేయటం ఎంతవరకు సముచితం అన్నది మనం ఆలోచించుకోవాలి.

అమ్మ సుందర కంఠసీమను పూలదండలతో అలంకరించటం భక్తికి చిహ్నామే. సర్వజగత్తుకు భరిస్తున్న అమ్మకు యీ హారం భారమా అన్న విశ్వాసమూ ప్రశంసనీయమే కాని ఆ దండలతో దివ్యరోచిస్సుల వెదజల్లే అమ్మ సుందరవదన మండలం కనుపించకుండా కప్పివేస్తే - దాని వల్ల ప్రయోజన మేమిటి?

అమ్మ అమృత హస్తంతో నొసన బొట్టు పెట్టించుకొనడమూ, ప్రసాదం అందుకోవడమూ, తీర్థం గ్రహించడమూ సర్వులకు శుభంకరమయిన విషయాలేకాని అందుకోసం అమ్మను మనంగా అర్థించడం సముచితంకాదు' మనకు ఏమి ప్రసాదించాలో అమ్మకు తెలియకపోదు - తీర్థం తీసుకునేటప్పుడు అనేకులు ఆ తీర్థంతో అమ్మనే అభిషేకిస్తారు !

ఇవన్నీ చూస్తుంటే - అమ్మ దర్శనానికీ, తీర్థ ప్రసాదాలు గ్రహించటానికీ ప్రత్యేకమయిన శ్రద్ధవహించటం అవసరమనిపిస్తుంది.

ఇక, అమ్మ దర్శనమూ, అర్చనావేశలలో అమ్మకు బాధ కలిగించటం కాక తోటిసోదరులకు యిబ్బంది కలిగించే విషయాలుకొన్ని ఉన్నాయి. ఒక్కొక్కరు సకలశాస్త్ర లాంఛనాలతో సహస్ర నామార్చన చేసుకోవాలంటారు. ఒక్కొక్కరు కట్టల కట్టలు తమలపాకులు తీసుకువచ్చి ఒక్కొక్క ఆకే పేరుస్తారు. వారి వెనుక వందలూ, వేలకొలదీ సోదరులు ఉన్నారనీ, వారందరూ కూడా తమకులాగానే అమ్మ పాదాలకు కనీసం నమస్కారమయినా చేసుకోవాలనీ వారికి గమనం ఉండదు. వారి స్వార్థమే వారిది !

ప్రస్తుతం యీ ప్రస్తావన ఎందుకంటే - ఏప్రిల్ 9నే కదా అమ్మ జన్మదిన మహోత్సవం. ఆనాడు వేలకొలది జనం అమ్మ దర్శనం పొందాలని వస్తారు. ఆ దర్శన సమయంలో అమ్మకుగానీ, తోటి సోదరులకుగానీ అసౌకర్యం కలిగించకుండా ఎవరికివారు ఆలోచించుకుని ప్రవర్తించటం అవసరం. అక్కడ అందరూ సోదరులే; అందరూ సమానులే. ఒకరు విధించటమూ, మరొకరు వినటమూ అనే అవసరం కలగకుండా చూడాలని సోదరులందరికీ విజ్ఞప్తి చేస్తున్నాము.

(మార్చి 1968)



# 25
# ప్రాణేశ్వరి, ప్రాణదాత్రి

అత్యుత్సాహవంతంగా అమ్మ జన్మదినోత్సవాలకు కావాల్సిన ఏర్పాట్లు జరుగుతున్నాయి. కొరతలున్న భవన నిర్మాణం పూర్తి అవుతున్నది. నీటి సరఫరాకు కావాల్సిన కార్యక్రమం నడుస్తున్నది. పందిళ్ళు వేస్తున్నారు. అమ్మకు పూజా వేదిక నిర్మిస్తున్నారు. పందిళ్ళకు విద్యుద్దీపాలు అమరుస్తున్నారు. ఎటుజూచినా ఎంతో సందడి; ఎవరిలో జూచినా చెప్పలేని సంబరం.

కానీ... హఠాత్తుగా అశనిపాతం, కాలమే స్థంభించినట్లయింది. ఎక్కడ వారికక్కడ అన్ని అవయవాలూ నిశ్చేష్టమయినాయి.

కాలమనండీ, విధి అనండీ, దైవమనండీ, అమ్మ అనండీ- ఎంత విచిత్ర మయినది ! ఈ రోజున మనం యీ ఉత్సవం జరుపుకుంటూంటే మన అందరి రెండు కన్నులూ అశ్రుపూరితాలవుతున్నాయి. ఒక కంట ఆనందాశ్రువులూ, మరోకంట విషాదాశ్రువులూ జాలువారుతన్నాయి. ప్రేమమూర్తి అయిన అమ్మ మనల నందరినీ సముద్ధరించటానకి కరుణతో అవని మీదకు అడుగిడిన పర్వదినమని పొంగుదామా? మన ప్రియసోదరి. మనహైమ నేడు మన మధ్యలేదని గుండెలుబాదుకుందామా? రెండూ తప్పటంలేదు. ప్రతి నాణానికీ బొమ్మా, బొరుసూ ఎట్లా సహజమో - ప్రతి జీవితానికీ సుఖదుఃఖాలు రెండూ విడదీయ రానివని అమ్మ అనవరతం బోధిస్తూనే ఉన్నది. తరుచూ చేసిచూపించే ప్రయోగాల్లో యిది మరింత బలమయినదీ, గాఢమయినదీ.

జిల్లెళ్ళమూడిలో అమ్మ చరణసన్నిధిలో ఎప్పుడూ ఒక శుభమూ. అశుభమూ అభేద్యంగానే జరుగుతూ వస్తున్నాయి. అయితే. ఒక దానికోసం మరొకటి యేదీ ఆపబడటంగానీ, వాయిదాపడటంగానీ లేదు. సర్వమూ తానైన అమ్మ అన్నివేళలా ద్వంద్వాదీతంగానే మనల నడిపిస్తున్నది. సంతోషమేగాక శోకాన్నీ యిచ్చే అమ్మ శోక ఉపశమనమూ అనుగ్రహిస్తూనే ఉన్నది.

అమ్మ సర్వశక్తిమంతురాలనటంలో, అఘటనా ఘటన సమర్థురాలనటంలో మనకేమీ సందేహంలేదు. అమ్మ సన్నిధిన రోగరహితులైన వారితో పాటు రోగగ్రస్తు లయినవారూ ఉన్నారు. అమ్మ స్మరణవలన, అమ్మ సేవ వలన, అమ్మధ్యానం వలన ఆనందానుభూతియేగాదు, దుఃఖానుభవమూ ఉంటున్నది. ఒకసారి ఒక విషయంలో ఒకరు - 'అమ్మ సన్నిధిలో అట్లా జరగటమేమిటి ? అటువంటి దుర్ఘటన ఎందుకు జరుగుతుంది ?' అని ప్రశ్నిస్తే - ''జరుగుతుంది'' అని చెప్పాను. అతనికి అర్థంగాక అయోమయంగాచూస్తూ కారణ మడిగితే - ''అమ్మ దైవమే కనుక'' అన్నాను. అమ్మ దైవమని మనం నమ్మినపుడు, దైవం సర్వవ్యాప్తమని మనం విశ్వసించినపుడు - అమ్మ సన్నిధి యేమిటి ? అమ్మలేనిది యెక్కడ ? మరి, లోకంలో దుర్ఘటనలు జరగటంలేదా ? దుస్సంఘటన జరిగిన స్థలంలో అమ్మ లేదందామా ? అప్పుడు మన విశ్వాసాలు ఏమైనట్లు ?

అమ్మ జీవితచరిత్ర పరిశీలిస్తే - అనేక అద్భుత సంఘటనలు ద్యోతిత మవుతాయి. సామాన్య మానవులకు వారి దేహాలమీదగానీ, మనసుల మీదగానీ అధికారముండదు. వారి మనసులు వారు చెప్పినట్లు ఆలోచించవు. ఆలోచనల ననుసరించి అవయవాలు పనిచేయవు. ఈ రెంటికీ వెనుక యేదో అదృశ్యమయిన. అవ్యక్తమయిన శక్తి ఉండి నడుపుతుంది. కాని అమ్మ విషయంలో అట్లాగాదు. అనేక సంఘటనలు ఆధారంగా ఆలోచిస్తే - అమ్మకు తన శరీరం మీదా, మనసు మీదా పరిపూర్ణమయిన అధికార మున్నట్లు అభివ్యక్తమవుతుంది. అమ్మ ఆహారం తీసుకోదు. కాని దేహపోషణకు లోపం లేదు. శరీరకాంతి ప్రసారంలో అవరోధంలేదు. అమ్మ నిద్రించదు. కాని అమ్మ కన్నుల్లోగానీ, ముఖంలోగానీ ఏ విధమయిన అలసత్వమూ గోచరించదు. ఆ వదన మెప్పుడూ సద్యోవికసిత కుసుమం వలె ఉంటుంది. ఆ కన్నులు తేజో నిలయాలై కరుణాకరాలై దీపిస్తూ ఉంటాయి.

అమ్మ విషసదృశాలైన మూలికలూ, ద్రావకాలూ లోనికి తీసుకున్న సంఘటన లున్నాయి. అవి అమ్మను యేమీ చేయలేక పోయినాయి. పంచభూతాలూ అమ్మకు హాని చేయలేక తలవంచాయి. నిత్యజాగ్రత్తయేగానీ, స్వప్న సుషుప్తులు ఎఱుగని అమ్మకు మనసు మీద అధికారమున్నదనటంలో అతిశయోక్తి యేమున్నది?

ఇంతేగాదు, అమ్మకు ఇతరుల మనసులనూ, శరీరాలనూ, ప్రాణాలనూ శాసించే అధికార మున్నదని చెప్పటానికి అనేక ఉదాహరణలు ఉన్నాయి. అమ్మ మన ఆలోచనలను గ్రహించటమేగాదు. మన ఆలోచనలను తనకు అభీష్టమయిన,

అవసర మయిన విధంగా చోదింపగలదనే విషయం అనేకులకు అనుభూతమైనదే. ఇతరుల శరీరాలను కీలుబొమ్మల్లాగ ఆడించగలదనేందుకు కూడా దృష్టాంతాలు అసంఖ్యాకంగానే ఉన్నాయి.

ఇక ప్రాణాల విషయం ఆలోచిద్దాము...... చిన్నతనంలోనే అమ్మ ఒక ముసలివానికి అతని మరణం విషయం ముందుగానే సూచించి మరణించగానే పునరుజ్జీవితుని చేసి, తిరిగి మరణాన్ని యిచ్చింది. మరోసారి రైల్లో ప్రయాణించేస్తూ - ఒక పిల్లవాడు మరణిస్తే, అతనికి ప్రాణమిచ్చి తిరిగి తీసుకున్నది.

బామ్మ చరమదశకు వచ్చినప్పుడు - నాన్నగారు జమాబందికి బాపట్లలో ఉన్నారు. అప్పుడు అందరూ ఆందోళన పడుతూంటే - 'నాన్నగారు లేకుండా ఎట్లాపోతుందీ?' అన్నది అమ్మ. అట్లాగే తరువాత నాలుగు రోజులకు నాన్నగారు వస్తే. వచ్చినరోజునే (31-5-65) బామ్మ మరణించింది. ఈ నాలుగు రోజుల్లో బామ్మ ప్రాణం వైద్యులకు కూడా ఆశ్చర్యకారణమే అయింది.

సీతాపతితాతగారు మరణించారు. డాక్టరుగారు ధృవపరిచారు. అమ్మమ్మ వగైరాలు గొల్లుమన్నారు. తాతగారు పునరుజ్జీవితులయినారు. తరువాత నెల రోజులకు (15.10.65) తాతగారు విగతజీవులయినారు.

సోదరుడు పోతుకూచి రవీంద్రనాథ్ మరణశయ్యమీద ఉన్నాడు. అతనికి కొలది అడగుల దూరంలోనే మరోసోదరుడు వరఘా ప్రసాద్ కల్యాణ వేదికపైనున్నాడు. ఎట్లా యీ వివాహం జరిగేనని అందరి గుండెలూ చిక్కబట్టాయి. పురోహితుడు, రవి యిక బ్రతకటానికి శాస్త్రరీత్యా ఏ మాత్రమూ ఆస్కారంలేదనీ. వివాహవేదికను తరలించాలనీ సూచించాడు. కాని అమ్మ అక్కడనే పెండ్లి జరిపించమన్నది. పెండ్లి నిర్విఘ్నంగా జరిగింది. మరునాడు (25.2.66) రవి అస్తమించాడు.

యార్లగడ్డ వెంకన్న మృత్యువు పరిష్వంగంలో ఉన్నాడు. అది మహాశివరాత్రి, రుద్రాభిషేకమయింది, పూజ అయింది. అమ్మ అతనికి తీర్థ ప్రసాదా లిచ్చింది. అతడు స్వీకరించాడు. అందరినీ వెంటనే భోజనాలు పూర్తిచేయమని అమ్మ చెప్పింది. భోజనాలు పూర్తి అయ్యేటప్పటికి వెంకన్న (9.3.67) అంతిమ శ్వాస వదిలాడు.

కటికి హనుమాయమ్మ 12.6.66న మరణించింది. ఆమె ఏకైక కుమారుడు కోటేశ్వరరావు ఆ సమయాన సమీపానలేడు. తరువాతవచ్చి బాపురుమన్నాడు.

అతని దుఃఖంచూచి అమ్మ 'ఒక్కసారి కళ్ళుతెరిచి కోటిని చూడు-' అన్నది. హనుమాయమ్మ కళ్ళు విప్పి కుమారుని చూచింది.

కోన వెంకాయమ్మ బాధపడుతూ ఉన్నది. ఆమెకు అప్పుడు మరణ మాసన్నమయినదని ఎవరూ ఊహించలేదు. కాని ఆమె బంధువులతోపాటు, పురోహితుడు వగైరాలనుకూడా పిలిపించి అంత్యక్రియలకు కావాల్సిన ఏర్పాట్లు చేయించడంచూచి అందరూ విస్మితులయినారు. తరువాత ఆరాత్రి 8 గంటలకు 12 గంటలు దాటితేగానీ ఆమె పోదని చెప్పింది. 12 దాటింది. ఆమె మరణశయ్య నధిరోహించి కన్నులు తెరిచి చూస్తుంటే - 'ఇంకా ఏం చూస్తావు ? కళ్ళుముయ్' అని అమ్మ చెయ్యి విసిరింది. అంతే, ఆ మూసిన కన్నులు ఆమె యిక తెరవలేదు.

ఇట్లా ఆలోచిస్తుంటే అన్ని మరణాల్లోనూ అదృశ్యంగా అమ్మ హస్తం పని చేస్తున్నట్లుగానే ఋజువవుతుంది. ఒకసారి దేహం నుండి విముక్తిని కాంక్షించిన ఒకరితో అమ్మే అన్నది "ప్రాణం ఎట్లా చెప్పి యివ్వ లేదో, అట్లాగే అవసరమయితే తీసుకుంటా" నని.

అపరిమిత మయిన అమ్మ అందరి జనన మరణాలకు తానే కారణమయినా, పరిమిత మయిన అమ్మ అనేక జననాలకు కారణ మవడమే కాక అనేక మరణాలను తన యిచ్ఛానుసారం జరుపుతున్నట్లు మనకు అర్థమవవుతుంది.

ఏవి ఎట్లా ఉన్నా..... అందరినీ ఎంతగానో ప్రేమిస్తూ, అందరిచే ప్రేమింప బడుతూ, ఎవరికి తలనొప్పి వచ్చినా తహతహ లాడుతూ, పిచ్చుకపిల్ల గూటి నుండి జారినా జల జలా కన్నీరు కార్చే సుకుమార కరుణామయ హృదయ అయిన సోదరి హైమ యిట్లా ఆకాలంలో అసువుల బాయటానికి కారణ మేమిటని అందరికీ తెగని ఆలోచన. అనంత శక్తి మంతురాలయిన అమ్మ తన రక్తమాంసాదులను పంచుకుని, తన గర్భవాసాన పుట్టిన బిడ్డను బ్రతికించలేక పోయిందా - అని సందేహం. పైగా ఎన్నాళ్ళనుండో హైమకు 25వ సంవత్సరం దాటటం క్లిష్టమని ప్రకటించింది. ఇటీవల హైమ యిక ఉండదేమో అన్నది. తీరా, హాస్పిటల్‌కు తీసుకుపోయే సమయంలో ప్రముఖమయిన డాక్టర్లు ఎంత ఆశను వ్యక్తం చేస్తున్నా - అనవసర ప్రయత్నమని స్పష్టపరచింది.

చివరకు అమ్మ అన్నదంతా అయింది. గుంటూరు జనరల్ హాస్పిటల్‌కు తీసుకుపోవటమూ, హైమ తుదిశ్వాస వదలటమూ జరిగాయి. లోకమంతా చీకటి గ్రమ్మినట్లయింది. హాహాకారాలతో ఆవరణం ప్రతిధ్వనించింది.

ఒకసారి ఒక తాత "ఆపదుద్ధారిణివే అనుకున్నానుగానీ నీవింత భయంకర సంహారకారిణి వనుకోలేదమ్మా -" అన్నమాటలు అందరి హృదయాల్లోనూ ప్రతిధ్వనించాయి. ఎవరికి వారు అమ్మ ఎంత 'నిర్దయ' అనుకున్నారు.

కానీ ఆ చీకటిగుయ్యారంలో హృదయ విదారక హాహాకారాల్లో అమ్మ పరమాశ్చర్యకరమయిన కార్యక్రమం నిర్వహించింది. నిర్మాణంలో ఉన్న దేవాలయ ఆవరణలలో ప్రస్తుత తన నివాసగృహానికి ఎదురుగా ఒక తపోమందిరాన్ని సంభావించింది. అది భావికాలంలో అసంఖ్యాక తపస్సులకు పుట్టిల్లు కావాలన్నది. మహర్షులకు ఆలవాలం కావాలన్నది. యోగులకు నిలయం కావాలన్నది. అది ప్రేమకూ, కారుణ్యానికీ, త్యాగానికి సర్వ మానవోత్తమ గుణాలకూ, దైవత్వానికీ 'ఆలయం'కావాలన్నది. అందుకు యిది సుముహూర్తమట; ఇది పవిత్రక్షేత్రమట; అందుకు తాను శంఖుస్థాపన చేయాలి, శంఖువు హైమట !

అబ్బా ! ఇది ఎంత క్రూరంగా, బాధాకరంగా దయారహితంగా మనకు గోచరిస్తున్నా... అమ్మ నిర్వికారంగా ప్రకటించి కార్యక్రమాన్ని సమారంభించింది. ఒడిలో బిడ్డను పెట్టుకుని హాస్పిటల్‌కు వెళ్ళిన తల్లి ఒడి ఖాళీ చేసుకుని, కడుపున చిచ్చు పెట్టుకుని, గుండె రాయి చేసుకుని తిరిగి వచ్చి - ఎదురు వచ్చిన వారు పలకరించలేక శిలలవలె నిలబడితే వారిని ప్రతిఒక్కరినీ పరిశీలనగా ప్రేమతో పరికించి ఆప్యాయతా, అనురాగమూ పొంగులువార "అందరూ అన్నం తిన్నారా ! అందరూ కులాసా' అని నోరారా పలుకరిస్తూ... పూలూ, పళ్ళూ, కొబ్బరికాయలూ చేత బట్టుకొని బారులుతీరిన జనసందోహం మధ్యగా మందగమనంచేస్తూ వారి పూజలూ నమస్కారాలూ, నివేదనలూ అందుకుంటూ గృహప్రవేశం చేసిన దృశ్యం ఎంత దారుణమైనది ! అమ్మ అంత నిస్స్వార్థ, త్యాగమూర్తి కనుకనే కన్నబిడ్డను, ప్రియాతి ప్రియంగా తనను చూడడమేగాదు, తన నీడలో అల్లారుముద్దుగా పెరుగుతున్న పసికూనను జగత్కల్యాణం కోసం నిర్వికారంగా అర్పించింది. ఒకసారి హైమను తన ప్రతిబింబంగా అభివర్ణించింది. మరొకసారి తన గుణాలన్నీ హైమలో పుణికి పుచ్చుకున్నా యన్నది.

హైమకు సుకుమారమయిన తనువునూ, సున్నితమయిన హృదయాన్నీ ప్రసాదించి లోకానికి ఆదర్శవంతంగా పెంచింది. సాధన నిచ్చింది. తత్ఫలితంగానే హైమ - తుదిక్షణాల్లో దృష్టినిండా అమ్మను మాత్రమే నింపుకొని "అమ్మా వస్తున్నామ్మా..." అంటూ తాను వెళ్ళేది అమ్మలోనికి మాత్రమేనన్న పరమ జ్ఞానంతో

అనన్నమయిన మరణాన్ని దరహాసంతో ఆహ్వానించింది. మహర్షులకూ, మహాయోగులకూగానీ సాధ్యంగానటువంటి మహోత్కృష్ట సిద్ధిని పొందిన హైమను క్షీరాభిషిక్తం చేసి భూగృహంలో పద్మాసనంతో ప్రతిష్ఠించి, సజీవం చేసి, చైతన్యం రగిలించి, తన పావన పాదాన్ని హైమ శిరోపరిభాగంపై నిలిపీ, తాను కూడా అక్కడ ఉపవిష్ణురాలయ్యీ అన్ని విధాలా ఆ మందిరానికి బలాన్నీ, పవిత్రతనూ ప్రసాదిస్తూ నవ్వుతూ అమ్మ చేసిన ప్రకటన సామాన్యుల కెంత బాధాకరమయినా చరిత్రాత్మకమూ, చిరస్మరణీయమూ అయినది

అమ్మ ఏ చర్య ఎందుకు జరుపుతుందో ఎవరి కెఱుక ?

(ఏప్రిల్ 1968)



## హింస

హింస అంటే సహించలేనిదే నాన్నా. మేకలను కోసేవాడు ఆవులను నరకటం సహించలేడు. కోళ్ళను కోసేవాడు గొఱ్ఱెలను చంపటం చూడలేదు. సర్వమూ ప్రాణమయమే అనుకున్నప్పుడు - అన్నం తినటమూ కూరగాయలను కోయటమూ మంచినీళ్ళు త్రాగటమూ హింసే కనక ఏది హింస, ఏది కాదు అన్నది - సమస్య కాదు. ఎవరు ఏది సంహించలేరో అదే హింస. కాబట్టి దానిని మానుకుంటే సరిపోతుంది, అదీ మానుకో గలిగితే.

- అమ్మ

# 26
# "హైమాలయ నేపథ్యం"

"నేను మీలో దైవత్వం చూస్తాను" అన్నది అమ్మ ఎందరితోనో, ఎన్ని పర్యాయాలో, "కనిపించేదంతా ఆత్మయే" ననీ అనేకమార్లు అన్నది. అమ్మదృష్టిలో జడమేమీ లేనట్లుగానే బ్రహ్మకు భిన్నమైనదీ ఏమీలేదు.

అయితే ప్రత్యేకంగా హైమకు దేవాలయ మేమిటి ? హైమకు అర్చన లెందుకు ? తనుగూడా రోజూ హైమాలయానికి వెళ్ళి పూలువేసి, హారతి వెలిగించి వస్తున్నది ఎందుకు ?

ఒకసారి అమ్మ చిన్నతనంలోనే శ్రీకల్యాణానందభారతీస్వామివారితో ప్రసంగిస్తూ... మంత్ర ప్రస్తావనలో 'అక్షరాలకు మీరే శక్తి యిచ్చేటట్లయితే గడ్డిపోచలకు కూడా యివ్వవచ్చుగదా' అని అడిగింది. అమ్మ అభిప్రాయంలో అన్ని అక్షరాలూ శక్తి మంతములే. అందువలననే అమ్మను ఎవరు ఉపదేశం చేయమన్నా - 'మంత్రమంటే మనస్సు మినహా అక్షరాల సముదాయం కా'దంటుంది. కానీ వేడికోలు బలమైనప్పుడు, అమ్మ అనుగ్రహం కలిగినప్పుడు అనుష్ఠానంకోసం అమ్మ మంత్రోపదేశం చేసిన సమయాలు ఉన్నాయి.

కాలవ నిండుగా నీరున్నా, దాహమున్నా, త్రాగటానికి రేవుకావాలి అని అమ్మ అన్నట్లు - దైవం సర్వవ్యాప్తమయినా అర్చనకూ, ఆరాధనకూ ఒక మూర్తీ, ఒక ఆలయమూ అవసరం ఆ మూర్తి ఆదర్శవంతమై ఉండాలి. ఆ ఆలయం పవిత్రక్షేత్రమై ఉండాలి. కనుకనే తన నివాసస్థానమే ఆలయానికి ఆకారమూ, తన గర్భసంజనితయే అర్చనామూర్తీ అయింది.

అమ్మ అవతారం... లోకంలో లుప్తమై పోతున్న ప్రేమతత్వాన్ని పునరుద్ధరించటం కోసమూ, జీవికీ జీవికీ మధ్య పవిత్ర అనుబంధాన్నీ, అనురాగాన్నీ రూపొందించటం కోసమేనని నమ్ముకున్నాము. అందుకనే తన ధ్యేయానికి అనుగుణంగా అమ్మ హైమకు రూపొందించింది. కనుకనే అమ్మలో రాశీభూతమైన

కరుణా, ప్రేమా, త్యాగమూ అనురాగమూ హైమ పంచుకుని అమ్మకు ప్రతిబింబంగా భాసించి, యావజ్జగతికీ 'సోదరి'యై అందరినీ ప్రేమించి అందరిచే ప్రేమింపబడింది.

మనిషి, ఎంత నిర్మలంగా ఉండవచ్చునో ఉండగలుగునో హైమ ద్వారా అమ్మ నిరూపించింది. జీవితకాలంలో అమలినమూ ఆదర్శవంతమూ అయిన పథంలో నడిపించి - చరమాంకంలో జ్ఞానమూ, సాక్షాత్కారమూ, మృత్యుంజయత్వమూ ప్రసాదించి - దైవత్వం ప్రసాదించి, హైమను లోకానికి ఆరాధ్యం చేసింది అమ్మ. హైమ జీవితాన్ని నిశితంగా పర్యాలోకిస్తే - అమ్మ యీ అనుగ్రహప్రసాదం హఠాత్తుగా జరిగింది కాదనీ, అమ్మ పూర్వ నిర్ణయానుసారమేననీ ఋజువవుతుంది.

దైవం అమ్మగా మానవరూపం ధరించి అవనిపై అవతరిస్తే - హైమ మానవిగా జన్మించి దైవానుగ్రహం పొంది దైవత్వాన్ని అధిరోహించింది.

(మే 1968)



## హైమాలయం

అల్లదే హైమాలయం
అది చల్లని దేవాలయం
పవిత్ర ప్రేమ విరాజితం
ప్రఫుల్ల శాంతి మహార్ణవం

అచ్చట మున్ముందుగా
అగుపించును కన్విందుగా
పాలరాతి హైమ శిల్పం
పసిడి వన్నె సజీవ శిల్పం

- నదీరా

## 27
# "అక్షరరూపిణి"

సాహిత్యంతో రాహిత్యం కాదన్నది అమ్మ. రాహిత్యం అంటే యేమిటీ అనే ప్రశ్న నటుంచితే - కేవలం సాహిత్యం వల్ల ప్రయోజనం లేదన్నది అమ్మ ఉద్దేశం. దానినే ఇంకొక రకంగా అనుభవం శాస్త్రాన్నిస్తుందిగానీ, శాస్త్రం అనుభవాన్నివ్వదు - అన్నది. ఈ రెండు వాక్యాలద్వారా - శాస్త్ర ప్రవచనం ద్వారాగానీ, సాహిత్య పఠనం వలనగానీ ఎవరికీ ఉపయోగం లేదని అమ్మ భావన అయినట్లు విదితమవుతున్నది.

ఎవరికి ఏకించిత్ జ్ఞానం సంప్రాప్తమయినా, ఏ అల్పమయిన అనుభవం కలిగినా అది దైవం (అమ్మ) అనుగ్రహఫలితం మాత్రమే ననడం నిర్వివాదమయిన అంశం. ఎవరు అమ్మను అర్థం చేసుకోవాలన్నా - అమ్మ అర్థం కావలసిందేగానీ, మనప్రయత్నం వలనా, మన కృషి వలనా, మన శక్తి సామర్థ్యాల వలనా అవగాహన చేసుకో గలిగింది ఏమీ ఉండదు. అందుకే అమ్మ - నేను కనబడితే మీరు చూడవలసిందే. మీరు చూస్తే నేను కనబడ - నని అన్నది. ఔను - అమ్మ కనపడినంత వరకు మనం చూడవలసిందే, అమ్మ తెలిసినంత వరకు తెలుసుకొన వలసిందే.

కాని అమ్మ ఏమీ తాను స్వయంగా చేయదు. నిర్లిప్తంగా మంచంమీద సుఖాశీనఅయి ఉంటుంది. అందరినీ ఉపకరణాలుగా ఉపయోగించుకుంటుంది. అమ్మ ఒకసారి అన్నదికూడా - ఎవరినయినా తనకు అవసరమయినంతవరకు ఉపయోగించుకుంటానని.

అమ్మ అకారణంగా యీ ధరాతలం మీదకు రాలేదని మా విశ్వాసం. పాలనతో కాక లాలనతోనూ, అధికారంతో కాక అనురాగంతోనూ, శిక్షతో కాక శిక్షణతోను యీ మానవాళి మనస్తత్వంలో మార్పు తీసుకురావడమూ, ధూళిధూసరితమై శిధిలమైపోయిన వేదాంత భవనాలు శుభ్రపరచి కొత్త గవాక్షాలు తెరచి మలయసమీర పరీవృతం చేసి సర్వులకూ వాసయోగ్యం చేయడమూ, కనులకు

కనిపించే యీ రసమయ జగత్తూ, యీ అనుపమ సౌందర్యమూ భ్రాంతి యని జీవితాల రసవిహీనంచేసే మిథ్యావాదం స్థానే 'సర్వం ఖల్విదం బ్రహ్మ...' 'అంతా చైతన్యమే' నన్న రస ప్రపూర్ణ వాహినుల ప్రవహింప జేయడమూ --- ఎన్నో యింకా యేమో అమ్మ అపూర్వ అద్భుత జీవితానికి లక్ష్యాలు. ఈ నూతన ప్రవచనాలనూ, నవీన సిద్ధాంతాలనూ, అద్భుతలీలనూ, అపూర్వ చరిత్రనూ యింటింటికీ, మనిషి మనిషికీ అందించాలి. ఈ విప్లవాత్మక సిద్ధాంత విద్యుత్ స్పర్శతో ప్రతి హృదయమూ క్రొత్త కాంతిని నింపుకోవాలి. క్రొత్త రక్త ప్రసరణంవలే --- యీ బోధలో జీవితాలు ఉత్తేజితం కావాలి. అందుకు ఉపకరణాలు పత్రికలూ, గ్రంథాలూ..... అందుకే వాటి ప్రచురణ.

మేము అవగాహన చేసుకున్నదీ, అనుభవించినదీ అఖిల జగత్తుకూ అందించా లన్న పవిత్రాశయంతో ప్రేరితులమై యీ కార్య నిర్వహణకు ఉపక్రమించి అప్పుడే రెండు సంవత్సరాలు నిండాయి. రెండు భాషల్లోనూ అవిచ్ఛిన్నంగా వెలువరిస్తూ విదేశాలకు సైతమూ అందించాము. స్వదేశ విదేశాల్లో ఎందరో సోదర పాఠకులకు అమ్మను, అక్షరరూపంలో సాక్షాత్కరింపజేసి అమ్మ సందేశాన్నీ వినిపించాము. ఒకసారి ముందుకూ వెనుకకూ చూస్తే యింతవరకూ నడిచినది అంగుళాలూ, నడవ వలసినది యోజనాలుగానూ ---- అందించినది పరమాణువులూ, అందించవలసినవి మేరువులుగానూ కనిపిస్తున్నాయి.

(జూన్ 1968)



## నమస్కారం

నమస్కారం చేస్తున్నారు. నేనెవరో అనవసరం. భగవంతుడనే భావంతో చేసుకుంటున్నారు. వాళ్ళకోసం వాళ్ళు చేసుకుంటున్నారు. ఆ భావం వాళ్ళకు రావటమే వాళ్ళల్లో భగవంతుడున్నట్లు.

\- అమ్మ

# 28
# అలౌకిక జ్ఞాపకశక్తి

ఈ నెల 9వ తేదీన సాయంకాలం అమ్మ దర్శనం కోసం అనేకులు వచ్చారు. పందిరీ వరండా సందడిగా ఉన్నది. అమ్మ వచ్చి గదిలో కుర్చీలో సుఖాసీన అయింది. ఉదయమే వచ్చినా అమ్మ దర్శనం కాక అంతవరకూ నిరీక్షిస్తున్న ఒక సోదరుడు ముందుగా గదిలో ప్రవేశించాడు. ఆయన ఒక రేడియో యింజనీరు. అమ్మకు నమస్కారం చేసుకుని ప్రక్కగా కూర్చున్నాడు. నేను సహజధోరణిలో "వీరు ఫలానా" అని అమ్మకు నివేదించు కున్నాను. "నేనెఋగుదును" అన్నది అమ్మ. వారి తండ్రి 1835లో బాపట్లలో తహశీలుదారుగా పనిచేస్తున్నప్పుడు చిదంబరరావుగారి యింట్లో ఉండే వారట. అప్పుడు అమ్మకు 12 సంవత్సరాల వయస్సు. ఈ మధ్య 33 సంవత్సరాల సుదీర్ఘమైన కాలం గతించింది. కాలంతోపాటే, ఆ సోదరుని బాహ్యాకృతిలోనూ ఎంతో మార్పు వచ్చి ఉంటుంది. కాని అమ్మ ఆయన రూపం చూచి పోల్చుకో గలగడమే కాక వారి కుటుంబంలోని ప్రతి ఒక్క పేరుతో, వారి గుణ గణాలూ వర్ణించడమే కాదు, వారి బంధువుల విషయాలూ, వారు ఒకప్పుడు గుంటూరులో అద్దెకు ఉన్న యింటి సంగతులూ చెప్తుంటే మాతోపాటు ఆయనకూ అమితాశ్చర్యమే కాక ఆనందమూ కలిగింది. అమ్మ హృదయంలో తమకు యింత స్థానం ఉన్నదా అన్న ఆనందంతో ఆయన కళ్ళు మెరిశాయి.

క్రిందటి నెల 14వ తేదీన ఒక సోదరుడు వచ్చాడు. ఆయన క్రిందటి నవరాత్రులలో వచ్చి ముఖమంతా కుంకుమ పూసుకున్నాడు. మేమెవరమూ ఆయనను గుర్తించలేక పోయినా, అమ్మ ఆ విషయం జ్ఞాపకం చేసింది. నవరాత్రులలో ఎంతమంది వచ్చి ఉంటారు ? వారిలో యీయన ఒకరు.

ఒక సోదరునితో యిటీవల "1928లో మీరు బాపట్లలో ఓవర్సీరు చేయ లేదూ ? అప్పుడు యల్లంరాజు హరినారాయణగారనే యింజనీరుగారింటికి ఒకసారి

ఎవరో యిచ్చిన ఒక బుట్ట పండ్లు తీసుకుని మరొకరు యిచ్చారని చెప్పలేదూ ? ఆ సంగతి ఆయన తెలుసుకుని మిమ్మల్ని మందలించలేదూ ?" అని అమ్మ అడిగింది. నిజమే - ఆయన ఏమంటాడు, పాదాలపై ఒరగడం మినహా, అప్పుడు అమ్మ వయస్సు 5 సంవత్సరాలు.

అమ్మ జ్ఞాపకశక్తి అత్యద్భుతమయినది. ఎప్పుడు, ఎక్కడ, ఎవరిని చూచినా వారు అమ్మ మనసులో అలాగే నిలిచిపోతారు. అయితే అమ్మ చూడని వారు ఉన్నారా ? అమ్మ చూడనివారు లేరనే చెప్పుకోవాలి. ముఖ్యంగా అక్కడకు వచ్చినవారెవరనా అంతకు ముందే అమ్మచే చూడబడినవారే ననటంలో మాత్రం సందేహం లేదు. అమ్మే ఒకసారి 'నేను చూడనివారు యిక్కడకు రాలేరు' అన్నది.

ఒకసారి సోదరులు గోవిందరాజుల దత్తాత్రేయులు గారితో 'నీవు 1918లో మంగళగిరిలో వర్తన చేయలేదా?' అని అడిగింది. 'నిజమే' నన్నారాయన. తను చూచానన్నది అమ్మ. అంటే - ఆ సంఘటన అమ్మ అవతరణకు పూర్వం జరిగింది...

... ఇట్లాంటి సంఘటన లనేకం ఉన్నాయి.

వీటిని పురస్కరించుకుని ఆలోచిస్తే - అమ్మ చెప్పే విషయాలకు జ్ఞాపక శక్తి మాత్రమే ఆధారం కాదని ఋజువవుతుంది.

అందుకే అమ్మ అన్నది - నాకు యిన్ని కాలాలు లేవు. అంతా వర్తమానమే - నని.

కనుకనే - సర్వకాలాలూ చూడగలిగిన అమ్మను కాలస్వరూపిణిగా భావిస్తున్నాము.

(జూలై 1968)



## కుడి-ఎడమ

కుడి ఎడమా కట్టుబాటుకోసం పెట్టారు గానీ - ఒక భాగం ఎక్కువనీ కాదు, ఇంకొక భాగం తక్కువనీ కాదు.

- అమ్మ

# 29
# అకర్మణ్యులం కారాదు

నిత్యమూ అమ్మను అసంఖ్యాక జనులు దర్శిస్తున్నారు. హృదయ పూర్వకంగా అమ్మను దైవంగా విశ్వసిస్తున్నారు. రాసులకు రాసులు పూలతో అమ్మను పూజిస్తున్నారు. కొబ్బరికాయలు కొడుతున్నారు. కర్పూరపు ముద్దలు వెలిగిస్తున్నారు --- ఆరాధన అంటే అంతవరకేనా ? ఈ బాహ్యమయిన పూజ అంతరంగికమయిన సర్వార్పణకు సంకేతంగానో, అందుకు దోహదకారిగానో ఉండాలిగాని -- అక్కడనే మంగళహారతి పాడితే అందువల్ల ప్రయోజనం గగనమే కాగలదు.

అమ్మ మహత్తర శక్తిని అవలోకిస్తున్నారు. అమ్మ మధురమయిన వచనాలు ఆలకిస్తున్నారు. ఆ మహిమాన్విత జీవితంలోని వెలుగు వెల్లువలతో యావజ్జగతినీ పులకితం చేయాలనీ, ఆ దివ్య వాగ్ఝరిని లోకం నలుమూలలకూ ప్రవహింప చేయాలనీ, అందరికీ ఆకాంక్షయే - అయితే అందుకు ఏమి చేయాలి ?

అమ్మను దర్శించేందుకూ, ఆ దర్శనంలో, పాదస్పర్శలో తమ జీవితాలనే పునీతం చేసుకునేందుకూ ఆర్తితో అనుక్షణమూ అమ్మ పాదాల మ్రోలకు చేరే అసంఖ్యాక మానవాళి సౌకర్యార్థం అమ్మ సన్నిధిలో ఒక సంస్థ నిర్మాణమయింది. దాని ఆధ్వర్యంలో భవన నిర్మాణాలు జరుగుతున్నాయి. అహర్నిశం అవిచ్ఛిన్నంగా అన్నపూర్ణాలయంలో గాడిపొయ్యి మండుతున్నది. అమ్మ దివ్య సందేశం ప్రతి సోదరునికీ అందించటానికి కంకణం కట్టుకుని పత్రికా గ్రంథ ప్రచురణమూ, ముద్రణాలయమూ నిర్వహింప బడుతున్నాయి.

ప్రస్తుతం ప్రజానీకానికి భోజన వసతులు ఉంటే చాలవచ్చును. అమ్మను గురించి అవగాహన చేసుకోవటానికి పత్రికలూ, గ్రంథాలూ సరిపోవచ్చును. కాని యింత కంటే గురుతరమయిన బాధ్యత యింకొకటి ఉన్నది. అమ్మ చరిత్ర, మాటలూ కాగితాలపై ఉండడమేకాదు; అమ్మ ప్రతిమాటా తత్క్షణంలో సన్నిధిలో ఉన్నవారు వినటమేకాదు; అన్ని కాలాల్లోనూ, అంతటా ఉన్న వారు వినకలగాలి. అమ్మ దివ్య రూపం, అమ్మ అలౌకిక జీవితంలోని ప్రతి క్షణమూ, అమ్మ ప్రతి చిన్న

కదలికా చూచి వర్తమానంలోని మానవులేకాదు, సర్వకాలాల్లోని వారూ ఆనందించకలగాలి. అయితే యిందుకు మార్గమేమిటి ?

కర్తవ్యం ఎంతో ఉన్నది. ఎవరికి తగినది వారు చేయవచ్చును. మంచి జరగాలని ఆశించడమూ, జరిగే దానిని చూచి ఆనందించడమూ మాత్రమే కాదు - -- జరిగే మంచి పనికి ప్రతివారూ చేయూత నివ్వాలి. ఈ మహత్తర యజ్ఞంలో ప్రతివాడూ తానే సమిధ కాలేక పోవచ్చు. కాని ఎందరు తమ సమిధనయినా అర్పిస్తున్నారు ? ఈ అపూర్వ యాగంలో ప్రతివాడూ గుండె కోసి యివ్వ లేకపోవచ్చు. కాని ఎందరు తమ రక్తపు బొట్టు నయినా కారుస్తున్నారు ?

జిల్లెళ్ళమూడి విలాసయాత్రాస్థలంకాదు. ఇది ఒక పుణ్యక్షేత్రం. ఒక అవతారమూర్తి చరణ రజస్సుతో పునీత మయిన దివ్యస్థలం. ఇక్కడకు ఏదో వినోదంగా విలాసంగా వచ్చిపోవడంకాదు. ప్రతి ఒక్కరిలోనూ 'అమ్మను చూచి నేను అమ్మకోసం ఏమి చేయగలుగుతున్నాను ?' అనే ప్రశ్న ఉత్పన్నం కావాలి. ఆ ప్రశ్న ఉత్పన్నం అయితే ఆ జీవితం ధన్యమయినట్లే.

(ఆగష్టు 1968)



## బలహీనత

అక్కడే ఉన్నదమ్మా సృష్టి గొప్పతనం. మీరు డాక్టర్లే శరీరం గురించి వ్యాధులగురించి నిరంతరం చదువుతుంటారు. శరీరాలు కోస్తుంటారు. అంతా చూస్తూ ఆ క్షణంలో ...... ఇంతే కదా మన శరీరాలు - ఇందులో ఏముంది - అనుకుంటారు. కాని ఆ గది దాటి వచ్చాక ఆ విషయాన్ని మరిచిపోయి మళ్ళీ వ్యామోహంలో పడుతూనే ఉంటారు.

- అమ్మ

# 30
# భయావహ

"నీకు దైవం ఎడారి రూపంలో దర్శన మిస్తున్నది నాన్నా - ఏ రూపంలో అయితే నేమి ? అన్ని రూపాలూ దానివేగా ?"

అతను తలపైకి యెత్తి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి ప్రశ్నార్థకంగా అమ్మ వంక చూచాడు.

'ఔను-కనుపించడం వేరూ, గుర్తించడం వేరూ, గుర్తించడమే జ్ఞానం. నేను చెప్తున్నానుగా - నీకూ ఆ శక్తి సాక్షాత్కరించింది. నిన్నూ ఆ దైవం అనుగ్రహించింది.'

ఈ నెల 15వ తేదీ రాత్రి .... భద్రాచలంవద్ద 'పాలవంచ' గ్రామం నుండి ఒక కుటుంబం అమ్మ దర్శనార్థం వచ్చింది. ఆమె తనకు భగవత్సాక్షాత్కారం అయినదని అమ్మతో చెప్పి - యింకా తన అనేక దర్శనాలు వివరించింది. తుదకు ఆమె భర్త తనకటువంటి దర్శన మేమీ కాలేదనీ, ఎటు జూచినా ఎడారి మాత్రమే కనుపిస్తున్నదనీ బావురు మన్నాడు.

అప్పుడు అమ్మ చెప్పిన మాటలవి, ఆ పలుకుల్లో, అమ్మ కనుగొలకుల్లో కరుణ పొంగులు వారింది. అతని కన్నులూ, ముఖం తీరు తెన్నులూ ఆనందమయమైనాయి.

అవును - అనేక సందర్భాల్లో అనేక తీరులో అమ్మ యీ సత్యాన్ని విస్పష్ట పరచింది.

ఒకడు దరిద్రంతో బాధపడుతుంటే - "ఆ దరిద్రంకూడా నేనే నాన్నా-" అని అతనికి దైవం అనే నాణానికి గల బొరుసును కూడా చూపి చిత్తశాంతిని అనుగ్రహించింది.

మరొకడు సంసారంలోని ఒడిదుడుకుల గురించి కుమిలిపోతుంటే - "ఆ

ఒడిదుడుకులుకూడా నా అనుగ్రహ ఫలితమే నాన్నా-" అని దుఃఖ పరితప్త మయిన అతని మనసుకు ఉపశమనం ప్రసాదించింది.

ఒకరు సాధన, ఏకాగ్రతల విషయం అమ్మను అడుగుతూ... "ఒక మూర్తిని ఉద్దేశించి ధ్యానం చేస్తుంటే అనేక రూపాలు మనసు నిండానూ, కనుల నిండానూ వచ్చి నిలుచుంటాయి. ఏకాగ్రత కుదరటం లేదు. ఏమి చేయాలి ?" అని బాధపడినప్పుడు... "ఏమీ బాధపడకు నాన్నా. నీవు ధ్యానించే దైవమే అన్ని రూపాలు కూడా తనవేనని నీకు తెలియజెప్పటం కోసం అన్ని రూపాలతో సాక్షాత్కరించింది. అంతేగాని నీవు ఒకరిని కొలుస్తుంటే. యితరులెవరో నీ మార్గంలో అడ్డురావడం కాదు. వారందరూ ఒక మూర్తి యొక్క విభిన్న రూపాలని భావించడమూ. గుర్తించడమే ఏకాగ్రత" అని అతని సాధనకు ప్రయోజనాన్ని కలిగించింది.

ఒక ముసలమ్మ - తను ఎంతగా దేవుని సన్నిధికి చేరుదామనుకుంటున్నా, అన్నిటికీ బదులుగా ఏడుపు మాత్రమే మిగిలిందని శోకిస్తుంటే --- "దైవమే నీ వద్దకు ఏడుపు రూపంలొ వచ్చిందమ్మా" అని నైరాశోపహతమైన ఆమె జీవిత కేదారంలో ఆశలను పండించింది.

ఈ మధ్యనే అమెరికా నుంచి వచ్చిన సోదరి ఒకరు - రాత్రి అకారణంగా తనను భయమావహించిందని ఆందోళన పడుతుంటే - తనే రాత్రి భయం రూపంలో తన దగ్గరకు వచ్చానని చెప్పి ఆనందపరిచింది.

(సెప్టెంబరు 1968)



## జన్మలు

జన్మలు ఉన్నాయనుకున్న వాడు చావులో నుండి పుట్టుక చూస్తాడు. లేవనుకునేవాడు పుట్టుకలోనుండి చావును చూస్తాడు.

సముద్రంలో అల లేచి మళ్ళీ కలిసిపోయినట్లే మీ జన్మలూనూ. అమ్మ సంకల్పంతో మీరు జన్మఎత్తి అమ్మలోనే లయమవుతారు.

- అమ్మ

# 31
# రససేవధి

అవును - అమెరికా నుండి అమ్మను చూడడానికి సరాసరి జిల్లెళ్లమూడి వచ్చిన సోదరి మార్వా అమెరికా వెళ్ళిపోయింది. గత మాసం 29వ తేదీ.

కానీ ఆమె అమ్మ దగ్గరనుండి సెలవు తీసుకునే సంఘటన హృదయ విదారకమైనది ! ఆ ఉదయం ఆమె అచ్చపు తెలుగు ఆడబడుచు వేషధారణతో పూర్తి హిందూ సాంప్రదాయంలో అమ్మ పాదపూజ చేసుకునే సమయాన ఆమెలో పెల్లుబికిన కన్నీటి వెల్లువ --- ఆ సన్నిధిలోనున్న సోదర ప్రజానీకాన్ని కల్లోల పరచటమేకాక అమ్మ మానసాన్ని సైతమూ సంక్షుభితం చేసింది. తృప్తిగా, హాయిగా తల్లిపొదుగులో తలదూర్చి క్షీరపానం చేసే గోవత్సాన్ని అతి బలవంతంగా క్రూరంగా బయటకు లాగేసినట్లు మార్వా బాధపడితే -- తన రెక్కల క్రింద వెచ్చగా పడుకుని ఆదమరచిన పిల్లను ఎక్కడ నుండో హఠాత్తుగా ఒక డేగ వచ్చి తన్నుకు పోయినట్లు అమ్మ విలవిల లాడింది.

మార్వా కన్నీటి ధార కత్తికంటే పదునుగా అందరి హృదయాలనూ గాయపరచి సానుభూతితో నింపితే --- అమ్మ అశ్రుసిక్తకపోలాలు అందరినీ ఒక లిప్తకాలం విస్మితులను చేసినా మరుక్షణంలోనే "ఇది ఏమిటీ ? ఎందుకూ?" అన్న ఆలోచనను ప్రేరేపించింది.

ఔను---

లోగడనే అమ్మ ఒక సందర్భంలో మీరే నా ధ్యేయమూర్తులనీ, మరో సందర్భంలో 'మిమ్మల్ని కావాలనుకోవటమే నా పూజ' అనీ, మరోసారి 'మీలో నేను దైవత్వాన్ని చూస్తా'ననీ చెప్పింది. అమ్మకు యీ జగత్తు మీదా. యీ సృష్టి మీదా, యీ జనత మీదా, యీ జీవజాలం మీదా ఉన్న సద్భావానికీ, విశ్వాసానికీ, అనురాగానికీ తార్కాణ మది.

అమ్మ మనల నలా గాఢంగా కావాలనుకోకపోతే, మనల నలా బలంగా ప్రేమించకపోతే, మనపై నలా కరుణ నవిచ్ఛిన్నంగా ప్రసరించకపోతే --- మనకా ప్రేమపీఠంలో స్థానం లభ్యమే కాదేమో. మనకా రాగ జలధిలో బిందువైనా ప్రాప్తం

కాదేమో. అమ్మ దైవమన్న సంభావనే సాధ్యం కాదేమో. ఆ మూర్తిపై భక్తీ, విశ్వాసమూ ప్రాదుర్భావమే కావేమో. అందువల్లనే ఆలోచించిన కొలదీ మనం అమ్మను ఎంతగా పూజిస్తున్నామనుకున్నా - మనపై అమ్మచూపే ప్రేమలో శతసహస్రాంశమైనా మనం అమ్మ యెడల చూపలేక పోతున్నామేమో ననిపిస్తున్నది.

ఇకపోతే సర్వం తానే అయిన అమ్మకు బయటి నుండి 'దేగ' ఎక్కడిది ? -- - అని తాత్త్వికులు ప్రశ్నించ వచ్చును. మార్వా కంఠానికి పాశం తగిలించి లాక్కు వెళ్ళిన అనివార్య పరిస్థితులుగానీ, అజేయమయిన కాలంగానీ - అమ్మ అంతర్భాగాలే కావచ్చును. అందువల్లనే అమ్మ ఒకసారి 'తన నిర్ణయానికి తానుకూడా కట్టుబడక తప్ప'దన్నది.

మార్వా - అమెరికాలోనే అమ్మను చూచి అమ్మ దైవత్వమూ, మహోజ్వలశక్తీ, సర్వవ్యాపకత్వమూ గ్రహించి విశ్వసించినదైనా... జిల్లెళ్ళమూడి వచ్చి ఆ రమ్యాకృతిలోని సౌందర్య దీధితిని అవలోకించీ - ఆ స్పర్శలోని అలౌకిక వివశత్వాన్ని అనుభవించీ - ఆ గాత్రంలోని మధురిమకూ, ఆ వాక్కులోని వాత్సల్య గరిమకూ ముగ్ధురాలయ్యీ ఆ సన్నిధిలో అనవతరంగా కురిసే శీతల జ్యోత్స్నలో తడిసి మురిసిపోయీ.... అనేకుల వలెనే ఆ సన్నిధిని మనసా గాఢంగా కాంక్షించింది. తాత్త్వికుల దృష్టిలో, వేదాంతుల పరిభాషలో ''దైవసన్నిధి' హాస్యాస్పదమూ, అగోచరమూ అయినా దైవమే అయిన 'అమ్మ సన్నిధీ' అందులోని అనితరలభ్య ఆనందసుధ మాత్రమూ పరమసత్యమూ, అనుభవైక వేద్యమూ.

మరి - ఆ మూర్తిలో ఎంత ఆకర్షణ లేనిదీ, ఆ సన్నిధిలో ఎంత బలవత్తర మయిన మమతాబంధం లేనిదీ... అమ్మను ఒకసారి చూచిన వారు మరల చూడాలనీ, మరల మరల చూడాలనీ, కొన్ని దినాలు అక్కడనే గడపాలనీ, యింకా యింకా ఆ చేరువకు చేరాలనీ, శాశ్వతంగా ఆ పాదసన్నిధినే ఉండి పోవాలనీ అనుకుంటారు ! అందుకు హేతువు వారికి అమ్మ సర్వ వ్యాపకత్వం యెడల గల 'సంశయాత్మ' ఏమాత్రమూ కాదు. అది కేవలం అవ్యాజమూ, అనుపమానమూ అయిన అమ్మ ఆదరణా, అనురాగమూ, దృష్టీ, వాక్కూ - ఒకటేమిటీ - ఆ మోహనాకృతితో అమ్మ ఆచరించే ప్రతి అంశంలోని మనోజ్ఞత వల్లనే.

అందుకనే యేమో... నిర్గుణమూ, నిరాకారమూ అయిన బ్రహ్మకంటే, ఆ బ్రహ్మకు ప్రతిరూపమైన సర్వ సృష్టికంటే --- అవతార వ్యక్తులకు చరిత్రలో అంత హృదయంగమ మయిన స్థానం లభ్యమయింది ! అందుకే వర్తమానంలో మానవ హృదయ పీఠంపై అమ్మ మూర్తి దివ్యరోచిస్సులతో సుప్రతిష్ఠితమైనది.

(అక్టోబరు 1968)



# 32
# పరమ దయాళువు హైమ

ఈ నెల 11వ తేదీన దైవమయిన మానవికి మానవిగా జన్మించి దైవమయిన హైమ జన్మదినోత్సవం.

ఇన్నేళ్లూ యీ దినం అత్యంతమూ ఉత్సాహవంతంగానూ ఆనంద ప్రదంగానూ జరుపబడేది. కానీ యీ నాడో... మనోజ్ఞమయిన ఆ మూర్తి మన మధ్య లేదు. కమనీయమయిన ఆ కంఠస్వరం మనకు వినిపించటం లేదు. నిష్కపటమైన ఆ అనురాగం మనకు అనుభూతం కావటంలేదు. అవ్యాజమయిన ఆ ఆదరణా ఆప్యాయతా మనకు లభ్యమవటం లేదు.

ఔను--

ఆమె పలకరిస్తుంటే - అమృతధారలు క్రుమ్మరిస్తున్నట్లుండేది. ఆమె నవ్వుతుంటే - ఉషోదయకాంతులు ప్రసరిస్తున్నట్లుండేది. ఆమె పెదవి విప్పితే - శ్రుతి చేసిన వీణ మీటినట్లుండేది. ఆమె నడుస్తుంటే - మనం చూడని రాయంచలు ఆ పాదాల్లో మనకు దృగ్గోచరమయ్యేవి. ఆమె కన్నుల్లోకి చూస్తుంటే - మహాకవి విరచితమయిన రసబంధుర కావ్యాలు పఠిస్తున్నట్లుండేది. ఆమె పాడుతుంటే - గుండెలను కరిగిస్తున్నట్లూ, హృదయాల్లో శరత్ జ్యోత్స్నలు వ్యాపిస్తున్నట్లూ ఉండేది. ఆమెలో పరాకాష్ఠ పొందిన కరుణను అవలోకించినప్పుడు గౌతమ బుద్ధుడూ, నరిహద్దులులేని సహనాన్ని అవగాహన చేసుకున్నప్పుడు జీసస్ క్రీస్తూ, క్షీరసాగరం వంటి ఆమె హృదయంలోని ప్రేమను అనుభవం చేసుకున్నప్పుడు అమ్మయే స్ఫురణకు వస్తారు. నేడు ఆమె స్మృతికి వస్తే మాత్రం తులసీదళమూ, పారిజాతసుమమూ మన కనుల ఎదుటకు వచ్చి నిలుచుంటాయి. వాటిని ఎఱుగనివారికి - హైమను చూస్తే, తులసీదళమెంత పవిత్రమో, పారిజాత మెంత రమణీయమో, పరిమళభరితమో అవగతమవుతుంది.

కానీ - నేడు అన్నిటికీ బదులు గాఢమయిన, విషాదకరమయిన, అనురాగ పూర్ణమయిన, ఆర్ద్రమయిన ఒక స్మృతిమాత్రమే మనకు మిగిలింది.

కాకపోతే - ఆ భౌతిక శేషం ఒక స్థలాన సుప్రతిష్ఠితం చేయబడింది. ఆ పావన ప్రదేశంలో చూడ ముచ్చటయిన ఒక వర్ణకుటీరం నిర్మాణమైంది. అందులో హైమ ఛాయాచిత్రం ఆవిష్కరింపబడింది. అది తన అందమయిన కనులతో మనను చూస్తున్నట్లే, అతిమృదువయిన కంఠస్వరంతో మనను పలకరిస్తున్నట్లే ఉండి మన గుండెలను కోస్తూ ఉన్నది. ఒక్కసారి అయినా హైమను చూచినవారు అక్కడకు వెళ్ళితే - వారి కన్నులు ఆర్ద్రం కాక తప్పదు. ఏ మాత్రం పరిచయమున్న వారు అక్కడకు వెళ్ళినా వారి కన్నులు అశ్రుభాండాలవవలసిందే. ఇక - ఆమెతో సాన్నిహిత్యం ఉన్నవారికి ఆ స్మృతి ఎంత బాధాకరమో, ఆ కొరత ఎంత అగాధమో ఊహకందని విషయం.

కాని - హైమ కేమిటి ? దివ్యరక్త మాంసాలు పంచుకుని అమ్మ గర్భాన జన్మించింది. అమ్మ కరకమలాల్లో, చరణ సీమలో అల్లారు ముద్దుగా పెరిగింది. జపమూ, తపమూ, ధ్యానమూ, యోగమూ - సర్వసాధనలూ చేసింది. అమ్మ అనుగ్రహం పొందింది. మానవతా శిఖరాగ్రం అధిరోహించింది. పరిపూర్ణత్వం పొందింది. దైవమయింది. యావజ్జగతికీ ఆరాధ్యమయింది. నేడు అందరికీ అనేక విధాల దర్శనాల నిస్తున్నది. అనేకులను బాధా విముక్తులను చేస్తున్నది.

ఆమె మనలను నిరంతరమూ చూస్తూ, మాట్లాడుతూ ఆదరిస్తూనే ఉన్నది. కాని మనమే ఆమెను చూడలేని, ఆమెతో మాట్లాడలేని దౌర్భాగ్యులం ---

కనుకనే యింత ఆవేదన.

(నవంబరు 1968)



# 33
# అమ్మ చేసిన పరిచర్యలు

ఈ నెల 20వ తేదీన సాయంకాలం అమ్మ గదిలో మంచం మీద పడుకున్నది. ప్రక్కగదిలో పరమభక్తుడయిన రాధాకృష్ణరెడ్డి పరవశమై మధురంగా నామం చేస్తున్నారు. కొద్ది క్షణాలు ఆ ప్రాంతంలో మరెవరూ లేరు. రాధ నామం ఆగింది. అమ్మ పర్యంక మవరోహించి రాధ వద్దకు వచ్చింది. రాధ కపోలాలపై అశ్రుప్రవాహం దృశ్యమాన మయింది. మేమది భక్త్యావేశ సంజనిత మనుకున్నాము. కాని అమ్మ అతి సుందరమైన తన వ్రేళ్ళతో ఆ కన్నీటిని తుడిచి ''నాన్నా ఏడుస్తున్నావా?'' అంటూ అతని తొంటిపై అతి సుకుమారమైన తన చేతిని వైచి నిమురుతూ 'బాధగా ఉన్నదా?' అని అడిగి ఆ చేతిని అతని పిక్కలపైకి పోనిచ్చి వత్తుతూ 'ఎట్లా ఉన్నది' అన్నది.

నిజమేనట - అతనికి ఆ భాగమంతా దుర్భరమయిన బాధగా ఉన్నదట. మరి, ఎంతటి బాధనయినా సహించగల రాధ కన్నీటికి కారణం కాగల బాధ ఎంతటిదై ఉంటుంది ? కాని అమ్మ అట్లా దగ్గరకు వచ్చి వాత్సల్యమూర్తియై అనిర్వచనీయమైన అనురాగంతో అర్ద్రమైన కంఠస్వరంతో అఖిల జీవుల పాలిటి సంజీవని అయిన అమృతకరస్పర్శ ప్రసాదించేసరికి రాధ గుండె క్షీరాబ్ధియే అయి పొంగిపోయింది. ఆ పరవశంలో ఆ పులకింపులో శరీర బాధ ఎటుపోయిందో యేమో... 'అమ్మా' అంటూ ఆ పాదాలు పట్టుకుని బావురుమన్నాడు. ఆ ముహూర్తాన అతని కన్నీరు కావేరియై కట్టలు త్రెంచుకుని వెల్లువలై పారింది. కాని అమ్మ మాత్రం పిక్కలు వత్తుతూనే ఉన్నది. కొన్ని క్షణాల పిదపగానీ అతడు అమ్మ చేతిని పట్టుకుని 'వద్దమ్మా' అని అనలేకపోయాడు. ఆకని అమ్మ వత్తుతూనే ఉన్నది. అతడు అతి బలవంతంగా ప్రాథేయ పూర్వకంగా అమ్మను వారించాడు. సర్వలోకారాధ్య, మహోన్నత సింహాసనాదిష్ఠిత అయిన అమ్మ అల్పుడైన తన వద్దకు వచ్చి పరిచర్య చేయటమేమిటని అతని ఉద్దేశం. కాని వాత్సల్యావారిధి అయిన అమ్మ, జగత్తునంతా తన సంతానంగా సంభావించ గలిగిన అమ్మ, ఎక్కడ ఎవరికి

అల్పబాధ కలిగినా అనల్పంగా బాధపడే అమ్మ, చిన్న గాలిఅలకు సైతమూ చలించే లేజిగురుటాకు కన్నా మృదువైన హృదయం గల అమ్మ - వెంటనే అతని బాధోపశమనానికి అవసరమయిన ఏర్పాట్లు చేసింది

అవును - అమ్మను గౌరవంతో, భక్తితో, ప్రేమతో మనం మంచం దిగకుండా సేవచేయ వచ్చునూ, సింహాసనాసీనను చేసి పూజలు చేయవచ్చునూ, కానీ అవసర సమయాల్లో ఏనాడూ ఎవరికీ పరిచర్య చేయటానికి అమ్మ శంకించలేదు. అమ్మకూ మనకూ మధ్య మనకు కనుపించే అగాధం అమ్మకు ఏనాడూ అవరోధం కాలేక పోయింది సకల భేదాతీతంగా ప్రతి ఒక్కరినీ తన పవిత్ర విశాలోత్సంగంలోనికి స్వీకరించ గలిగినట్లే - బాధాపహతుడైన ప్రతి బిడ్డనూ సహనమూర్తియై సహజంగా సేవ చేసింది.

మామూలుగా నాన్నగారికి ఏ మాత్రం ఆరోగ్యం బాగుండకపోయినా దగ్గరకు వెళ్ళి అవసరమైన పరిచర్య చేస్తుంది. బామ్మగారి చరమాంకంలో కేన్సర్‌తో బాధపడుతుంటే అక్కడనే ఉండి అహర్నిశమూ సేవ చేసింది. వారికిగానీ, నిజగర్భ సంజనితులైన సంతానానికిగానీ 'నేను సామాన్య గృహిణిని' అని చెప్పుకునే అమ్మ సేవచేయటంలో విశేషం లేకపోవచ్చును కానీ అమ్మను దర్శించటానికి వచ్చే సామాన్య గృహస్థు అయిన బందరు మూర్తిగారికి రక్త విరోచనాలు అయినప్పుడూ, కూలీ అయిన మునిస్వామి రోగ గ్రస్తుడయినప్పుడూ, సేవకుడయిన మంత్రాయి క్షయ పీడితుడయినప్పుడూ, బాపట్ల హాస్పిటల్లో కుష్టు రోగులను దర్శించినప్పుడూ.... ఎందరికో సామాన్యులు అసహ్యించుకునే సకలోపచారాలూ చేసింది. ఒకసారి ఆవరణలో అందరూ ఫ్లూ వ్యాధి గ్రస్తులుకాగా 'జావా', మందులూ ప్రక్కప్రక్కకూ వెళ్ళి స్వయంగా అందించింది అమ్మ

అందుకనే ఆమె సర్వలోకారాధ్య మాత్రమే కాదు ఆమె దయామయి, ఆమె వాత్సల్యమూర్తి వెన్నకన్నా మెత్తనయిన గుండెగల కన్న తల్లి.

(డిశంబరు 1968, జనవరి 1969)



# 34
# అమ్మనేర్పిన పాఠం

ఈ నెల 9వ తేదీన ఉదయం అమ్మకు పూజ జరుగుతున్నది. ఒకగదిలో సోఫాలో అమ్మ సుఖాసీన అయి ఉన్నది గదిలో నూతనాగంతుకు లనేకులు ఉపవిష్టులై ఉన్నారు. గదిబయట ఆశ్రమ వాసులందరూ నిత్యమూ స్వీకరించే తీర్థ ప్రసాదాలకొరకు నిరీక్షిస్తూ ఉన్నారు.

వాతావరణం అతి ప్రశాంతంగానూ, అమ్మ సుప్రసన్నంగానూ ఉన్నది.

ఆ నైశ్చల్యాన్నీ, నిశ్శబ్దాన్నీ భంగపరుస్తూ విజయవాడ నుంచి వచ్చిన వర్తక సోదరు లొకరు వినమ్రులై అమ్మను అర్థించారు. తమను కొంత కాలంగా ఆవరించిన కష్టనష్టాల నుండి విముక్తి కలిగించమని ఆయన తమ విపత్కర పరిస్థితులనూ, దుర్భర బాధలనూ విన్నవించుకుంటూ అమ్మ దయా వీక్షణా, అనర్ఘమయిన ఆశీర్వచనమూ ఆకాంక్షిస్తూ ఉంటే - అక్కడనే ఉన్న మాగుండెలు కదిలాయీ, మా కన్నులు స్రవించాయీ కాని అమ్మ గంభీర కంఠంతో నిశ్చలంగా అన్నది

"ఎక్కడ ఉన్నా, ఏం చేసినా, ఎవరి దయా వీక్షణ ఉన్నా కష్టాలు మాత్రం తప్పవు. ఎందుకంటే జీవితంలో అవీ ఒక భాగం. కనుకనే ప్రాణమున్నంత వరకూ కష్టాలు తప్పవు. కాకపోతే కాలగతిలో కష్టం రూపం మారవచ్చును గానీ కష్టం తప్పదు. ఒక కష్టం తొలగితే దానిస్థానే మరొక కష్టం చుట్టుకుంటుంది ఒక సమస్య పరిష్కారమయితే మరో సమస్య తలెత్తుతుంది. ఒక ప్రశ్నకు సమాధానం దొరికితే మరో ప్రశ్న ఎదురవుతుంది. ఇక - యీ జపాలూ, యీ ధ్యానాలూ, యీ నామస్మరణలూ వలన కష్టాలు అనుభవిస్తున్నా - బాధ అనిపించదు. కష్టాలు భరించే శక్తి వస్తుంది అంతే-"

ఇంకా కొంత సంభాషణ జరిగిన తర్వాత అమ్మ అన్నది"ఇక్కడ యింత మంది ఉంటున్నారు. ఎవరినయినా విచారించు - కష్టాలూ, సమస్యలూ లేనివారున్నా రేమో. కాకపోతే ఎవరికి తగినవి వారి కుంటాయి. ఏ ఒకరి కష్టాలూ యింకొకరి

కష్టాలతో సమానంగానూ సమాంతరంగానూ ఉండవు ఎవరి జీవితం ఎవరికి ఎట్లా ప్రత్యేకమో ఎవరి కష్టం వారికి అట్లాగే ప్రత్యేకం అసలు యిది కష్టమనీ, యిది బాధ అనీ ఎవరు నిర్ణయించగలరు ? ఏమని నిర్వచించ గలరు ? ఎవరికి ఏది యిష్టం కాకపోతే అది వారికి కష్టం ఎవరు ఏది భరించలేక పోతే వారి కది బాధ "

నిజమే - ఆ ఆవరణంలో అందరికీ బాధ లుండవచ్చునుకానీ ఎవరూ ఆ బాధను భరించలేక క్రుంగిపోతున్నట్లు కనుపించదు. బాధ్యతే బాధ అన్నది అమ్మ మరి, ప్రపంచంలో ఎవరూ ఎందుకూ బాధ్యులు కాకపోవటం యధార్ధమయినా - ఆ పరమసత్యాన్ని ఆ ఆవరణంలోని వారందరూ అక్షరాలా జీర్ణించు కున్నవారే ఎటువంటి క్లిష్ట కార్యాన్నయినా ' అమ్మే చేయిస్తుంది' - అనో, 'అమ్మే చేస్తుందీ' - అనో చేసుకుపోవటమే తెలుసునుగానీ ముందు వెనుకల ఆలోచనే లేదు లాభనష్టాలనుగానీ, కష్టసుఖాలనుగానీ రెంటినీ వారు ప్రసాదంగానే స్వీకరించగలరు కేవలం సౌకర్యాలనూ, సుఖాలనూ మాత్రమే వారికి అమ్మ అనుగ్రహించ లెదు. కష్టసుఖాలతోబాటు, ద్వంద్వమే బ్రహ్మమనీ, ఆ ద్వంద్వానుభవమే ఆనందమనీ, అదే బ్రహ్మానందానుభూతియనే జ్ఞానాన్నీ, దృఢతరమయిన విశ్వాసాన్నీ, నిశ్చలమయిన నిర్వికారమయిన మనస్తత్వాన్నీ ప్రసాదించింది.

అక్కడ ఎవరయినా నేర్చుకోగల పాఠమూ అదే

అమ్మ తరుచుగా అందించే బోధనాసారాంశమూ అదే.

(ఫిబ్రవరి 1969)



## బాధలే పూజా ద్రవ్యాలు

బాధ అనివార్యం. బాధ లేకపోతే బ్రతుకులో అందమే లేదు. బాధలనే పూజాద్రవ్యాలతోనే సహనమనే దేవతను ఆరాధించాలి.

- అమ్మ

# 35
# “నన్ను చూడటమే పుణ్యం”

అనుక్షణమూ యాత్రకుల ప్రవాహం జిల్లెళ్ళమూడికి ఏదో దిశనుండి ప్రవహిస్తూనే ఉన్నది. ఒక మతంవారూ, ఒక జాతివారూ, ఒక వర్ణంవారూ, ఒక వర్గంవారూ కాదు - సర్వులూ, సకల భేదాతీతంగా, కొందరు ఆర్తులై లౌకిక కామ్యార్థులై; కొందరు మోక్షగాములై, కొందరు జిజ్ఞాసువులై, కొందరు ఆ అనిర్వచనీయ అమలానురాగామృతపానాసక్తులై.

అమ్మ దర్శనమే చాలు - సకల పాపచయ సమూల నిర్మూలనకు. అందుకే అమ్మ అన్నది ఒక సందర్భంలో - నన్ను చూడడమే పుణ్యం - అని. ఔను - శిరీషకుసుమాల కంటెనూ అతి మృదువయిన ఆ పాద పంకేరుహాలపై ఒక్క క్షణం మన దృష్టి నిలిచిన చాలు - మన నాడీమండలంలోనే ఒక నవచైతన్యం ప్రాదుర్భావం పొందినట్లూ, మన రక్తప్రసరణమే సముత్తేజితమయినట్లూ, మన మనసులు పునీతమై మధుభరితమయినట్లూ, మన మనుగడే సార్థకమయినట్లూ అనుభూతులమవుతాము అమ్మ కన్నులూ, వానిలోని జ్యోత్స్నలూ, ఫాల భాగమూ, భ్రూకుటీ, అక్కడ సదా వెలిగే జ్వాలా; హస్తాలూ, అంగుళులూ, వానిలోని కోమలత్వమూ; ఎక్కడ చూచినా సౌష్టవమూ, సౌందర్యమూ, దైవలక్షణ సమున్మీలనమూ, ఇక అమ్మ దృష్టియే మనపై ఒక లిప్తకాలం ప్రసరించిన, కావలసిన దేమున్నది? మనం వెన్నెలలో తడిసినట్లూ, మన ఎడదలలో తేనెలు కురిసినట్లూ - మన జీవితాలే ధన్యమయినట్లూ పులకించి పోతాము ఆ చూపులు మనలోకి సూటిగా గుచ్చుకుంటాయి. అవి ఎంతో పదునుగా బలంగా మన అంతరాంతరాలలోకి వెళ్ళి మూలమూలలా శోధిస్తాయి మన వ్యక్తిత్వం నీటిలో పడ్డ మట్టిగడ్డవలె కరిగిపోయి ఆ పాదాల చెంత సర్వార్పణ మవుతుంది.

అమ్మ స్పర్శ దివ్యానుభవప్రదము. అమ్మ పాదానికి మన నుదురు సోకిన చాలు - మనలోని సుప్త శక్తులేవో జాగరిత మవుతాయి ఆ పాదాన్ని మన చేయి తాకినంతనే కల్లోలిత సాగరమధ్యాన మునిగిపోయే ప్రయాణీకునికి బలమయిన ఆలంబనం దొరికినంత ఆనందం కలుగుతుంది. అప్పుడప్పుడు అమ్మ తన మృదు హస్తంతో మనలను స్పృశిస్తుంది సన్నని, తెల్లని, మెత్తని తన వ్రేళ్ళను మన

జుట్టులోనికి జొనిపి సరిచేస్తుంది లాలనగా మన వెన్ను రాస్తుంది గోముగా మన బుగ్గలను సవరిస్తుంది. ఒక్కొక్కప్పుడు అమ్మ పాదాలు సంవాహనం చేస్తూ మనం కూచుంటే ఆ రెండు పాదాలూ మన ఒడిలో విశ్రమిస్తాయి. మరొకప్పుడు ఆ పావనచరణం మన నుదుట నుంచుతుంది. ఒకప్పుడు తన అమృత హస్తంతో అన్నమో, ఫలమో మన నోటి కందిస్తుంది మరొకప్పుడు మన నొసటన కుంకుమబొట్టు పెడుతుంది. అమ్మ ఏ అవయవం మనల నెక్కడ స్పృశించటానికి మన అదృష్టం సరిపోయినా మన మనసు నిశ్చలమై మనం సమాధి మగ్నులమవుతాము. కొన్ని సన్నివేశాలలో అమ్మ మనలను తన ఒడిలోకి తీసుకోవటమో, మనం ఆ ఒడిలో వ్రాలిపోవటమో జరుగుతుంది ఇక ఆ సమయంలో పాషాణ హృదయాలయినా, పాషండ మానసాలయినా కరిగిపోయిన కన్నులవెంట అశ్రుప్రవాహం వెల్లువ అవుతుంది. ఆ వెల్లువలో మనసు పయనించి పయనించి ఏ లోకాలలోకో దారి తీస్తుంది. ఆ క్షణాల్లో మన మనసులో కరుడుగట్టిన కశ్మలమంతా కడిగివేయబడి మనసు తేలికయై, పావురమై ఆకాశపు సరిహద్దుల్లో రెక్కలు విప్పుకుంటుంది ఇక. ఒక్కొక్కప్పుడు కొందరు పనివాళ్ళను అమ్మ దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుని వారి నుదుటిపై పెదవులపై, బుగ్గలపై ముద్దుపెట్టుకుంటుంది. ఆ క్షణాల్లో మనమూ మళ్లీపసిపాపల మైపోతే ఎంత బాగుంటుందీ --- మనమూ మళ్ళీ అడ్డాల్లో పాపలమైతే ఎంత ఆనందంగా ఉంటుందీ - అనిపిస్తుంది ... కానీ ఆ అదృష్టం ఎందరికీ ?

అమ్మ మాట్లాడుతుంది అమ్మ చర్చ చేస్తుంది అమ్మ బోధిస్తుంది అమ్మ మాటలు చెపుతుంది. మంత్రం చెపుతుంది. అమ్మ మన సందేహాల నివృత్తి చేస్తుంది. మనకు సందేశమిస్తుంది. ఏదయినా అవసరమయితేనూ, అవసర మయినంత వరకూ మాత్రమే. అమ్మ మాటల్లో ఒక్క అక్షరం వ్యర్థంగా ఉండదు. ప్రత్యక్షరమూ సార్థకమే. అమ్మ కంఠంలో అమృతకలశం ఉన్నది. అమ్మ వాక్కులో గంగా నిర్ఝరులున్నాయి అమ్మ మాటలో నిర్దుష్టత ఉన్నది; నిస్తుల మాధుర్య మున్నది; పదును ఉన్నది; పలుకు ఉన్నది. ఆ మాటల్లో సర్వశాస్త్రసార మున్నది వేదోపనిషత్తుల పయస్సు లున్నాయి.

అందుకే అమ్మ మాటలకోసం అట్లా చెవులు నిక్కపొడుచుకుని వేచి ఉంటాము. కనుకనే అమ్మతో మాట్లాడడమే సరస్వతీ సమారాధనంగా సంభా విస్తున్నాము. అమ్మ చల్లని మాట విని మనం సకల అధివ్యాధులూ విస్మరిస్తున్నాము. అమ్మ ఒక్కమాటలో మన భవిష్యజ్జీవితానికి మార్గదర్శనం చేస్తున్నాము. అమ్మ మాటను మనం అనుల్లంఘనీయ మయిన ఆజ్ఞగా శిరసావహిస్తున్నాము అమ్మ రమణీయాధరం నుండి ఒక పదం జారితే అది రవ్వలై రత్నాలై మన మనసుల వెలుగుల నింపుతున్నది.

ఇక - అమ్మ సేవ, అది అతి దుర్లభమయిన మహద్భాగ్యం. అన్నీ, అంతా అమ్మ అనుగ్రహం మీదనే ఆధారపడి ఉన్నా - యీ సేవా కార్యక్రమం కేవలం అమ్మ దయావీక్షణ ఉంటేతప్ప మరి దేనివలనా పొందలేమని అడుగడుగునా ఋజువవుతూ ఉంటుంది ప్రత్యక్షంగా అమ్మకు ఉపచారం చేయటంలో ఎంత ఆనందమున్నదో -- అది కొలతలకు అందేదీ, మాటల్లో యిమిడేదీ కాదు అది అనుభవైకవేద్యం మాత్రమే

ఆ సన్నిధి లోకోత్తర పరిమళాల విరజిమ్ముతూ ఉంటుంది. ఆ చెంతన మనలోని చింతనలూ, వాసనలూ, కామనలూ అణగిపోయి, అంతవరకూ కలవరపరిచే ప్రశ్నలూ, సమస్యలూ, బాధలూ కరిగిపోయి మనసు నిర్మలమూ, నిర్వికల్పమూ అయి ఆనందంతో శాంతితో అలరారుతుంది. ఆ సన్నిధానంలో లోకస్మృతి ఉండదు పాప పుణ్యాలూ, మంచి చెడ్డలూ, హెచ్చు తగ్గులూ, విభేదం ఉండదు అక్కడ అందరూ సమానమే. అందరూ అన్నదమ్ములూ, అక్కా చెల్లెళ్ళే ఆ వాతావరణం వాత్సల్యరస సంభరితమై ఉంటుంది. అక్కడ మనిషికీ మనిషికీ మధ్య అనురాగం అదృశ్యంగా పొంగులువారుతూ ఉంటుంది. అక్కడ సౌమనస్యం వేయిరేకులుగా విప్పారి సౌరభాల ప్రసరిస్తూ ఉంటుంది.

అందుకనే ఎందరో సోదరీసోదరులు అమ్మ సన్నిధిలోని ఆ ఆనందామృతంకోసం జిల్లెళ్ళమూడిలో స్థిరనివాస మేర్పరుచుకున్నారు అక్కడనే ఉన్నా - నిత్యమూ అమ్మ దర్శనం చేసుకుంటున్నా. అమ్మ చేతిమీదగా తీర్థప్రసాదాలు స్వీకరిస్తున్నా వారికి తృప్తి లేదు మరి ఆ సన్నిధిలోని, ఆ మూర్తిలోని, ఆ దృష్టిలోని ఆ వాక్కులోని ఆస్పర్శలోని ప్రభావ మేమిటో, ఆ దివ్య రోచిస్సుల ప్రసారమేమిటో...

సృష్టిరహస్య మేమయితే నేమి, ప్రకృతిలోని ప్రచ్ఛన్న సూత్రమేమయితేనేమి, అహస్కరునికి ఆధారమెవరైతే నేమి, జగత్తుకు జనని ఎవరైతే నేమి, మనకు అమ్మ కావాలి, ఆ చల్లని మాట కావాలి; ఆ చల్లని చూపు కావాలి, అందుకు మన తల్లి చల్లగా ఉండాలి. వెయ్యేళ్ళు మన మధ్య మసలాలి. చరాచరమై మూర్తీ మూర్తయై సత్‌రూపిణై, వ్యక్తావ్యక్తయై, వయోవస్థావివర్జితయై, నామరూపరహితయై, వృద్ధిక్షయ వివర్జితయై మనకు అర్థంకాని అంతటా నిండిన అమ్మ ఆద్యంత రహితంగా అన్ని కాలాల్లోనూ ఉన్నా, మనకు తెలిసిన మనం చూస్తున్న యీ మూర్తి యిట్లాగే అనంతంగా జన్మదిన మహోత్సవాలు జరిపించుకుంటూ, మన సేవలు, మన పూజలు అందుకుంటూ ఉండాలి ! అందుకు అమ్మ అనుగ్రహం ఉండాలి.

అందు కివే అమ్మకు మన కైమోడ్పులు ---

(మార్చి 1969)



# 36
# "సర్వదేవతా స్వరూపిణి"

ఈ నెల 13వ తేదీ సాయంకాలం ప్రయాణమై అమ్మవద్ద సెలవు తీసుకుంటున్నాను బొట్టుపెట్టి ప్రసాదం యిస్తూ 'గుండె పగిలేటట్లున్నది యివ్వాళ' అన్నది అమ్మ ఏమిటీ - అన్నాను ఉలిక్కిపడి ఏమీ లేదు వెళ్ళిరా --- అన్నది అమ్మ ప్రార్థించాను, ప్రాధేయపడ్డాను --- ఆ మాటలకు అర్థం వివరించమని. ఫలించలేదు నా ప్రయత్నం నేను వచ్చేశాను.

ఆ రాత్రి తొమ్మిది గంటలకు ధరిత్ర కంపించింది

వెంటనే సాయంకాలం అమ్మ పలికిన మాటలు గుర్తుకు వచ్చాయి

అనసూయవౌ అవని అమ్మా
సహనంబె నీ సొంత సొమ్మా...
నమో అవనిమాతా, పునీతా
కరుణారసభరితా..

ఈ నెల 11వ తేదీన బాపట్ల నుండి సోదరులు శ్రీ గండవరపు రాఘవేంద్రరావు గారు అమ్మను దర్శించారు. వారు గాయత్రీ ఉపాసకులట. కాని ఎప్పుడు గాయత్రీమంత్రజపం చేస్తున్నా - అనన్య తేజో విలసితయై అమ్మ మాత్రమే దృగ్గోచర మవుతుందిట. ఏమిటీ యిది - అని అమ్మను అడిగారాయన - అన్నీ ఒకటేనని ఋజువు పరచటానికేమో... నన్నది అమ్మ వెంటనే. ఆయన సంతృప్తుడై, సమ్మోదంతో చేతులు ముకుళించాడు

లోగడ ఒకసారి ఒక పిల్లవానికి అమ్మ అక్షరాభ్యాసం చేస్తూ 'ఓం'కారం వ్రాసి యిచ్చింది ఆ పిల్లవాడు ఆ అక్షరం చూడడం మానేసి అమ్మ ముఖంలోకి మాత్రమే అవలోకిస్తూ ఉండిపోయాడు అతని తల్లిదండ్రులు ఆ అక్షరం వంక చూడమని మందలిస్తుంటే అమ్మ అన్నది - చూడనీ, ఏదయితే నేమీ, అన్నీ ఒకటేనులే . అని.

మంత్రప్రగడ రాజమ్మగారికి అమ్మ రాజరాజేశ్వరిగా దర్శనం ప్రసాదించింది. గంగరాజు పున్నయ్యగారికీ, యింకా ఎందరికో కృష్ణుడుగా సాక్షాత్కరించింది.

రాధగా, కృష్ణుడుగా, సీతగా, రాముడుగా, ఆంజనేయునిగా, వేంకటేశ్వరునిగా, లక్ష్మిగా, లలితగా, సరస్వతిగా, దుర్గగా, చండికగా, పోలేరమ్మగా, మహమ్మద్‌గా, బుద్ధుడుగా, క్రీస్తుగా, మరియాగా, నాగేంద్రునిగా, సాయిబాబాగా - ఒకరేమిటి - ఎందరో దేవతామూర్తులుగా ఎందరికో అమ్మ కనుపించి కరుణించింది.

మరి అమ్మ ఎవరని ?

ఎవరయితేనేమి ? అమ్మనయితే చాలదా ? - అని అమ్మయే ఒకసారి ప్రశ్న రూపంలో ప్రత్యుత్తరం పలికింది. మరి - అమ్మ అంటే అన్నిటికీ ఆధారమయినదీ, ఆద్యంత రహితమయినదీ కదా !

(ఏప్రిల్ 1969)



## ఆశా అసంతృప్తులు

జీవితం అంటే ఆశా అసంతృప్తుల కలయిక. అసంతృప్తితోనే ఆశపడుతుంటాం - ఇంకోనాటికైనా మంచికలగదా, మనం అనుకున్నది జరగదా అని. ఆశ అంటే నా దృష్టిలో ఒకటి నెరవేరగానే అది పూర్తి అయిందని కాదు. అడుగడుగునా అదే వుంటుంది. దానితోపాటే అసంతృప్తి. ఒక విషయంలో ఆశ తీరగానే మరొక విషయంలో ఆశపడకుండా ఉండటం లేదుకదా.

- అమ్మ

# 37

# "భవచక్ర ప్రవర్తిని"

ఆదిమధ్యాంతరహితమూ, కాలాతీతమూ, నిరాకారమూ, నిర్గుణమూ అయిన శక్తి మానవియై అమ్మగా ధరాతలంపై అవతరించటం ఎంత ఆశ్చర్యకరమో - అమ్మ వివాహిత కావటం అంతకంటెనూ విస్మయోద్దీపకమే.

మామూలుగా వివాహానికి రెండు లక్ష్యాలు. ఒకటి - లౌకిక సుఖాభిలాష, రెండు - పరమార్ధ సాధన

దేహభ్రాంతీ లేదు; దేహ సౌఖ్యం ఏనాడూ అమ్మ కోరుకొననూ లేదు. మరి - పరమాత్మయే తానయిన అమ్మకు పరమార్ధ సాదన ఏమిటి ? ఈ రెండు కారణాలూ కానప్పుడు అమ్మకు వివాహ మెందుకు ? సృష్టియే తన సంతానంగా సంభావించ గలిగిన అమ్మకు సంసార మెందుకూ ?

వివాహానికి పూర్వమే ఒకరు అమ్మను ప్రశ్నిస్తే -

"పెండ్లిలో పెద్దపులి ఉన్నదని భయపడేవారి భయం పోగొట్టటానికి" అని స్పష్టపరిచింది.

తర్వాత అనేక సందర్భాలలో వివాహాన్ని గురించి -

'వివాహమంటే - అన్నీ అనుభవిస్తూ ఏదీ మనసుకు అంటకుండా ఉండటమే' ననీ

"పరిణయమంటే - ఒక అండన చేరే పరిణామమే" ననీ

"కల్యాణమంటే - కళంకరహితమయిన మనస్సును కళంకరహితంగా అర్పించటమే"ననీ అమ్మ వివరించింది.

మరి కొన్ని సందర్భాలలో -

"ఆచరించగలవారికి అన్ని ఆశ్రమాలూ సమానమే" ననీ

''ఆధ్యాత్మిక సాధనకు సంసారం ఏ మాత్రమూ ఆటంకం కాదనీ'' స్పష్టపరచింది.

ఇంకా కొన్ని సన్నివేశాలలో -

''స్త్రీకి పతివ్రతా ధర్మం కన్న మించినది లే''దనీ

''పతివ్రత అంటే పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించటమే'' ననీ

''సాధ్వి అంటే సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే'' ననీ

''భర్త అంటే దేవుడే'' ననీ నిర్వచించింది.

అమ్మ చెప్పిన యీ వివరణలన్నీ అమ్మ అనుభవ పూర్వకమయినవే ఈ నవసందేశం లోకానికి అందించేందుకే అమ్మ యీ పృధ్వీస్థలిపై శరీరధారణ చేసిందా అని కూడా అనిపిస్తుంది.

అమ్మ నాన్నగారిని చేపట్టిన క్షణంనుండే కాదు - ఆ సంకల్పం ప్రకటితమయిన శుభఘడియనుండీ అమ్మ యిచ్చిన నిర్వచనాలన్నీ ఆచరణాత్మకంగా జగత్తుకు ఋజువుచేస్తూనే ఉన్నది.

అమ్మకు దైవం నాన్నగారే. వారిని తప్ప అమ్మ ఏ నాడూ ఏ విగ్రహాన్నీ పూజించలేదు. ఒకసారి ఒక సంభాషణ సమయంలో అమ్మ ఏదో ఆలోచిస్తున్నట్లు కనబడితే -

'అమ్మా - ఏదో పరధ్యానంలో ఉన్నట్లుగా ఉన్నావే' అని అంటే ''పరధ్యానం కాదు నాన్నా - పతిధ్యానమే'' నన్నది అమ్మ.

గార్హస్త్య జీవితంలో ఉత్తమ గృహిణిగా - గగనతలంలో ధృవతారకవలె దేదీప్యమానమై అమ్మ ప్రత్యక్షమవుతుంది. కర్పూరకళిక వలే తను జ్వలిస్తూ పరిసరాలను కాంతి వెల్లువలతో ముంచెత్తుతుంది. మహావృక్షం వలే విస్తృతమైన సూర్యతాపంలో తను తప్తమవుతూ ఆశ్రితులకు చల్లని నీడను ప్రసాదిస్తుంది. పరమేశ్వరునివలే గరళమే తను పానంచేసినా లోకానికి అమృతం పుక్కిటిబంటిగా త్రాగిస్తుంది. తృణకణాలుకూడా తనకు లేకపోయినా కామధేనువువలే తను సంతానానికి వాత్సల్య క్షీరధారలతో క్షుదాగ్ని చల్లారుపుతుంది.

ఒక సందర్భంలో అమ్మ నాన్నగారిని తన గొడుగుగా అభివర్ణిస్తున్నప్పుడు "అదేమిటమ్మా ? సర్వానికీ ఆధారం నీవే కదా' అని అంటే - "తనకు నీడను యిచ్చేదయినా ఆ గొడుగును మరి. తనే పట్టుకోవాలిగా" అని నవ్వింది అమ్మ.

మరొక సందర్భములో "వారి కాలిగోటిలోని మట్టియే తనకు సర్వసంపదలూ, సకలసౌభాగ్యాలూ" నని మురిసిపోయి మనలను విస్మితులను చేసింది.

భర్త, గృహమూ, బంధుజనులూ, వారి సౌఖ్యమూ, వారి సౌకర్యమూ వారి ఆనందమే ధ్యేయంగా, లక్ష్యంగా అమ్మ భావించినట్లు అమ్మ జీవితచరిత్ర పరిశీలిస్తే మనకు అవగతమవుతుంది. నాన్నగారి మాట అంటే అమ్మకు వేదవాక్యమూ, వారి ఆజ్ఞ అనుల్లంఘనీయమూ

ఆ లక్ష్య సాధనలో తన విషయమే విస్మృతమై పోయింది.

అందుకనే సోదరుడు రాజా

"నీ తనయులనే మరచితివా
పరిణామపు బాధలయందూ .. . .." అని పాడుకున్నాడు హృదయ విదారకంగా.

కంటకావృతమూ, కాలసర్పపరివేష్టితమూ అయిన ఆ మార్గగమనంలో తన చిత్తశుద్ధివలన అవరోధాలన్నీ అదృశ్యమైపోయాయి. పంచభూతాలూ తలలు పంచాయి సర్వమూ సాధ్యమయింది. పతివ్రతగా, సాధ్విగా దీప్తిమంతమై, శక్తిమంతమై భాసించడమే కాక మహోన్నతమూ, మహోత్తమమూ, మహోజ్జ్వలమూ, మధురమూ అయిన మాతృత్వ శిఖరం అధిరోహించింది అమ్మ.

ఆ మాతృత్వంలో సర్వజగత్తూ పసిపాపయై పరవశిస్తున్నది. ఆవాత్సల్య జలధిలో ముల్లోకాలూ పులకించి పోతున్నాయి. విశ్వమోహనమైన ఆ అనురాగ రాగ ప్రస్తారంలో సమస్త హృదయాలూ మూర్ఛనలు పోతున్నాయి. ఆ మనుతానుబంధంలో యావద్విశ్వమూ బంధితమై పోయింది.

(మే 1969)



# 38
# "వరదాయినికి - వరదకూడా బిడ్డె"

క్రిందటి నెల 19వ తేదీ ఉదయం - అప్పుడే తెల్లవారుతున్నది అమ్మ సన్నిధిలో సుప్రభాతం శ్రావ్యంగా వినిపిస్తున్నది. వెల్లువరావడమే మత్తగజంవలె మహోద్ధృతంగానూ, కోడెత్రాచువలె బుసలుకక్కుతూనూ వస్తున్నది జనతభయ విహ్వాలమై పోయింది.

అందరూ యిళ్ళు ఖాళీచేస్తున్నారు, సామానులు జేరవేస్తున్నారు, ఎక్కడకు? ఆ చిన్న గ్రామంలో ఏమున్నది ఆధారం ? ఆకాశదీపం వలే, అపారపారావారంలో ద్వీపం వలే - అమ్మనివాసమైన ఆ సమున్నత భవనమేగా, గ్రామస్థులుకూడా తమతమ నెలవులు ఖాళీచేసి అక్కడకు వచ్చేందుకు సిద్ధమయినారు.

పశువుల మెడవలుపులు విప్పారు. వాటి అంబారవాలు దయనీయంగా వినిపిస్తున్నాయి. పాకలు ఒక్కొక్కటే కూలిపోతున్నాయి, రణరంగంలోని క్షతగాత్రులవలె

అంతలో --- అమ్మ గదిలో నుండి వెలుపలికి వచ్చింది అర్థరాత్రి భానూదయ మయినంత అనందం వేసింది. మేడమీది నుండే నాలుగు దిక్కులా అమ్మ ఒక్కసారి కలయజూచింది, ఎంతో ఆశతో మేము అమ్మవంక చూచాము, అమ్మ పెదవులపైనా, కనుగొలకుల్లోనూ దరహాస దీప్తులు భాసించాయి. మాకేమీ అర్థం కాలేదు. తనయులిలా గుండెలవిసి తల్లడిల్లుతుంటే తపిస్తుంటే - తల్లి అయిన తనకింత ఉపేక్ష ఏమిటి ? ప్రకృతి వికృతమై, విపత్కరమై, విలయకారకమై, జనం విభ్రాంతమై, వినాశనం కాబోతూ విలవిల లాడుతుంటే --- తనకిదంతా వినోదకరంగా ఉన్నదా ? రోగిని చావుబ్రతుకుల మధ్య ఆపరేషన్‌బల్లపై పడుకోబెట్టి డాక్టర్ పకపకానవ్వుతున్నట్లుగా ఉన్నది ఆ సన్నివేశం !

వెంటనే చీరే, రవికా, పసుపు కుంకుమలూ, కొబ్బరిచిప్పలూ గంగాభవానీకి యిస్తూ - ఆడపిల్లను ఊరకే పంపటమెందుకూ! - అని అమ్మ మా వంక చూచింది.

ఆ చూపులో విలాసం ఉన్నది ఆచూపులో భూత భవిష్యత్ వర్తమాన కాలాల జ్ఞానవికాసం ఉన్నది. ఆ చూపులో ఘటనా ఘటన క్రియాదక్షత స్ఫురణ ఉన్నది. ఆ చూపులో సాంద్రతమోవృతమానసాల కాశాకిరణ మున్నది.

ఆశ్చర్యకరం - వెంటనే మదపుటేనుగు కుంభస్థలిలో అంకుశం దిగింది వెల్లువ తిరుగుముఖం పట్టింది అందరి వదనాల్లోనూ ఆనందరేఖలు విరిశాయి

అప్పుడుగానీ స్మృతికి రాలేదు - అంతకు నాలుగయిదు రోజుల క్రితమే అమ్మ - మంచి గాలీ వానా వస్తే బాగుండుననీ, వరద రాగలదనీ చెప్పిన విషయం అమ్మ పలుకుపై విశ్వాసంలేక కాదుగానీ, ఎందుకనో అనుకోలేకపోయాము - అంత మండుడెంటల్లో - వడగాడ్పుల్లో తుఫాను రాగలదనీ, బీటలువారిన భువి జలార్ణవం కాగలదనీ

అదీగాక అంతకు సరిగా పదిరోజులకు పూర్వమే అమ్మ మేడ క్రింది భాగం నుండి మూడవ అంతస్థుకు మారటంలోనూ మనం ఆలోచించ వలసిన అంశం ఉన్నది అయితే యిక్కడ ఒక ప్రశ్న కూడా తలయెత్తుతుంది సర్వశక్తిమంతు రాలయిన అమ్మ వరదనీటిని తన నివాసంలోకి రాకుండా నిరోధించలేదా - అని

చేయగలదు, అందుకు పూర్వ సంఘటనకూడా ఉన్నది లోగడ ఒక వరదలో చుట్టూనీరు పరవళ్ళు త్రొక్కినా అమ్మ నివాసంలోకి ప్రవహించలేదు, ప్రవేశించనే లేదు

మరి... యిప్పుడెందుకు జరిగిందిలా? - మాహాత్మ్యాల విషయమై అమ్మ విధానంలోని పరిణామమే యిందుకు కారణమని మేము భావిస్తాము. పూర్వం ఒక దశాబ్దకాలం క్రితం వరకూ అమ్మ జీవితంలో అత్యద్భుతాలు ప్రకటితమైన సంగతి సర్వజన విదితమే.

అన్నం వండకుండానే వచ్చినవారికి భోజనం పెట్టటమూ, ఒకరిద్దరికి తయారు చేసినదే అసంఖ్యాకులకు తృప్తికరంగా సర్దటమూ, ప్రసాదాలు పరిమళభరితం కావటమూ, పరేంగి జ్ఞానమూ, సర్పాలతో స్నేహమూ, కుంకుమ తీర్థప్రసాదాలతో సర్వవ్యాధి నివారణమూ, సకలవాంఛాసాఫల్యమూ - ఎన్నో అమ్మసన్నిధిలో సర్వసామాన్యంగా ఉండేవి

మరి - యిప్పుడక్కడ మహాత్మ్యాలు లేవా అంటే - యిప్పుడు ఉన్నాయి. అసంఖ్యాకంగానే ఉన్నాయి కాని అవి పూర్వంవలే ప్రత్యక్షంగాకాక పరోక్షంగా మాత్రమే ఉన్నాయి. అధికభాగం వ్యక్తిగతంగానే ఉంటాయి. ప్రస్తుతమూ ఎందరో అదృష్టవంతులు ఆ 'అద్భు'తామృతం రుచి చూస్తూనే ఉన్నారు.

అమ్మ అనుగ్రహం అందరిపయి సమానమే అయినా --- కొందరికి సంశయ వ్యాధిగ్రస్థులకు 'అద్భు'తౌషధం ప్రసాదిస్తుంది కొందరికి జ్ఞానసుధను దోసిళ్ళ కొలదీ త్రాగిస్తుంది. కొందరికి కేవలం లాలనగోరుముద్దలనే తనివితీరా తినిపిస్తుంది

ఏ క్షేత్రానికి ఏ విత్తన మతుకుతుందో అమ్మకు బాగా తెలుసు !

(జూన్ 1969)



## అవసరమే విలువయినది

మన శాస్త్రాల్లో ధర్మాలన్నీ చెప్పే వున్నాయి నాన్నా - అవి మానవుడికి కొన్ని పనులను నిషేధించినై కొన్నిటిని శాసించినై. కానీ ఎవరూ నిషేధించిన వాటిని మానుకుంటున్నదీ లేదు. శాసించిన వాటిని ఆచరిస్తున్నదీ లేదు. అంటే ఈ విధినిషేధాలనుబట్టి కాదు మనిషి ఆచరిస్తున్నాడు. అంటే మనిషిని అవసరమే నడుపుతున్నది. అందుకే అవసరమే విలువయిన దనిపిస్తుంది నాకు.

- అమ్మ

# 39
# "మమతానుబంధం"

---

ఈ నెల 15వ తేదీన ఉదయం నేనూ, డాక్టర్ అడపా రామకృష్ణరావుగారూ అమ్మ వద్ద సెలవు తీసుకొని బయలుదేరాము. అంతకు క్రిందటిరోజు వర్షం పడినందున మార్గమంతా తడిగా ఉన్నది. అప్పుడూ చినుకులు పడుతున్నాయి.

అమ్మ నివసించే ఆ భవనం దాటి వెలుపలికి వచ్చి అమ్మగది వంక చూచాము. మేడపై ఆరుబయట అమ్మ నిలబడి మా వంకనే అవలోకిస్తున్నది. మేమూ నిలబడ్డాము అమ్మ వంక చూస్తూ. అమ్మ మమ్మల్ని ఉద్దేశించి తన రక్షణహస్తాన్ని పైకి యెత్తింది --- అభయం యిస్తున్నట్లు. ఎంత కాలం అట్లా నిలబడితే తృప్తి కలుగుతుంది ? కాని బస్సువేళ అయినందున ముందుకు సాగక మాకు తప్ప లేదు.

కొంత దూరం వచ్చి మళ్ళీ వెనుదిరిగాము. అమ్మ యింకా అక్కడనే నిలబడి మా వంకనే చూస్తున్నది అమ్మ చేయీ అట్లాగే గాలితో ఊగుతున్నది అది ఆహ్వానమో, అభయముద్రో ---- రెండూ కావచ్చును.

ఇంకా ఒకంత దూరం వెళ్ళి మళ్ళీ వెనుక్కి చూచాము. అమ్మ యింకా అక్కడనే అట్లాగే నిలబడి ఉన్నది తనచేయి మాత్రమే యెత్తితే కనబడదేమోనని యేమో తన చీరె చెంగును కూడా గాలిలో కదిలిస్తున్నది.

మాకు ఆనందంతోపాటు ఆశ్చర్యమూ వేసింది -- వానలో తడుస్తూ అమ్మ అట్లా నిలబడ్డదేమా అని అమ్మను వదిలి వెళ్ళలేక వెళ్ళలేక వెనుదిరిగి చూస్తూ వెళ్ళే మాతోబాటు అమ్మకూడా జారుడుబాటలో ప్రయాణంచేసే మాకు 'రక్ష'వలే వానలో తడుస్తూ నిలబడ్డది.

అహర్నిశం తన బిడ్డల శ్రేయస్సుకోసం ఆ అర్ద్రహృదయం పడే తపన తహతహ తలుచుకునేటప్పటికి మా కన్నులు అశ్రుపూరితాలయినాయి.

తన దగ్గరకు ఎవరు వచ్చి వెళుతున్నా అమ్మ అట్లాగే బాధపడుతుంది. వచ్చిన ప్రతివాడూ భోజనం చేశాడోలేదో అని ఎట్లా విచారణ చేస్తుందో --- వెళ్ళిన ప్రతివారికీ ప్రయాణం సౌకర్యంగా ఉంటుందో లేదో అనీ ప్రయాణంలో భోజనం ఎక్కడ చేస్తారోననీ ఆందోళన పడుతూనే ఉంటుంది.

అంగవికలులో, వయోవృద్ధులో - మరేవిధమయిన అశక్తులో ప్రయాణ మయితే - అక్కడకు వచ్చిన ఏ మోటారుకారు వారికో తనే స్వయంగా చెప్పి వారికి నడక శ్రమను తొలగిస్తుంది.

మనం ఏమీ తీసుకువెళ్ళకపోయినా మనం ప్రయాణమయి నప్పుడు - మనకు ఏకాయో, పండో, కుంకుమో ప్రసాదించకుండా అమ్మ మనలను పంపదు

అమ్మ తన బిడ్డల యోగక్షేమాలకోసమూ, వారి సుఖశాంతులకోసమూ - పడే ఆందోళనా, చేసే నిరంతర ఆలోచనా గమనిస్తే - అమ్మ దివ్యత్వం మనకనులకు తెరమరుగై - అమ్మకు మనపై గల అవ్యాజమూ. అపారమూ అయిన అనురాగపు వెల్లువలో మనం కరిగిపోతాము.

ఒక్కసారి పర్యాలోకిస్తే - అమ్మ పై మనకు గల భక్తికంటే --- మనపై అమ్మకుగల కోటిరెట్ల వాత్సల్యం అవగతమవుతుంది

అమ్మ అనురాగము నిర్వ్యాజమూ, నిస్వార్ధమూ, నిరుపమానమూ అయితే మన రాగము అవసరంతోను, అహంకారంతోను, స్వార్ధంతోను మలినభూయిష్ఠ మయినది.

అమ్మప్రేమ అమృత సింధువయితే - మనం ఉప్పునీటి బిందువులకు మాత్రమే

అయినా ఆ తల్లికి మనం బిడ్డలం !

(జూలై 1969)





శంఖు చక్ర త్రిశూలధారిణి అమ్మ



అమ్మ పవిత్ర హస్తాలలో
మంగళ సూత్రం



అమ్మ -
శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య (కుడివైపు)



అమ్మ -
శ్రీమతి వసుంధర అక్కయ్య



అనసూయేశ్వరాలయం, హైమాలయం



అన్నపూర్ణాలయం



మాతృశ్రీ ఓరియంటల్ కాలేజి,
మాతృశ్రీ సంస్కృత పాఠశాల



మాతృశ్రీ మెడికల్ సెంటర్




మాతృశ్రీ ప్రింటర్స్



భోజనశాల

# 40
# "రుద్రరూపా"

ఈ నెల 3వ తేదీ సాయంకాలము, సోదరులు సుందరరామిరెడ్డిగారు తీసుకువచ్చిన కొత్త గోడగడియారం అప్పుడే గంభీరంగా నాలుగు గంటలు కొట్టింది. ఆదివారం అయినందున అప్పటి దాకా యాత్రిక జనసందోహంతోనూ, వారి విన్నపాలతోనూ, సందడిగా ఉండి అప్పుడే కొంచెం ప్రశాంత మయింది అమ్మ ఉండే గదిలోని వాతావరణం.

అంతలో ఆకస్మికంగా అమ్మ ముఖవర్ణంలో పరిణామం స్ఫురించింది నేత్రద్వయంలో క్రోధారుణిమ గోచరించింది. ఆ కంఠంలో కాఠిన్యం తొణికిస లాడింది.

ఆ రౌద్రాకారం వర్ణించటానికి భాష ఏదీ ?

అప్పటి అమ్మ భీషణరూపం ఎట్లా వివరించటం ?

అక్కడ ఉన్న కొలదిమందిమీ చకితులము కావటమే కాదు, భయభ్రాంతులమూ అయినాము.

ఔను --- శీతల సుధాకరుడు అనలశిఖలు విరజిమ్మితే ? హిమాలయం అగ్ని పర్వతమై బ్రద్ధలయితే ? శాంతమహాసముద్రంలోనే ప్రళయ భీకర బడబాగ్ని ప్రభవిస్తే ? మలయమారుతమే సుడిగాలి అయి ఝడిపిస్తే ? మృదు వీణా మధుస్వరానికి బదులు విలయ నాదం వినిపిస్తే ? పున్నమియామినీ గగనంలో సంధ్యారుణిమ కాంతులు వ్యాపిస్తే ?

అమ్మ అనేకపర్యాయాలు చెప్పింది - అన్ని రూపాలూ, అన్ని నామాలూ, అన్నిగుణాలూ కూడా వాడివే నని, ఆ 'వాడే' యీ రూపంలో అవతరించాడని మనకు అనుక్షణమూ ఋజువవుతూనే ఉన్నది.

కనుకనే అమ్మ పరమశాంతమూర్తియే కాదు, భీషణరౌద్ర స్వరూపిణికూడా, ఆమె సచ్చిదానందమూర్తియే కాదు, ప్రగాఢ విషాద ప్రపూర్ణ హృదయకూడా. నిర్మల

తేజస్వినియే కాదు, విస్తుల తమస్వినికూడా, సృష్టి స్థితులకు అధికారిణియే కాదు, లయకారిణికూడా, నందనవన విహారిణియే కాదు, భస్మసింహాసనాసీనకూడా, ఆమె హృదయం సుమపేశలమే కాదు, వజ్రకర్కశం కూడ ఆమె పలుకులో లాలనమేకాదు, చండశాసనంకూడా ఉన్నది.

అందుకనే -

ఆమె అనంత కల్యాణగుణ ప్రపూర్ణ మాత్రమే కాదు, అనంతగుణ సమన్విత, నిఖిలరసామృతమూర్తి

అయితే అన్ని గుణాలూ మనలోనూ ఉన్నాయి, అమ్మలోనూ ఉన్నాయి. మరి భేదమేమిటి ? అమ్మలోని ఆధిక్యత యేమిటి ? అమ్మ అతిమానుషవ్యక్తి ఎట్లా అవుతుంది ? - అన్న సందేహం కలగవచ్చును.

మనలో ఏగుణం కొద్దిగా ప్రకోపించినా, మన మనసులపై దాని ప్రభావం తీవ్రమై అన్యగుణాలు మసకవేస్తాయి. ఏగుణం ఏసమయానికి అవసరమయితే దానిని ఆ సమయానికి అమ్మ ప్రకటించినా - అమ్మ మనసు నిర్లిప్తంగానే భాసిస్తుంది

కనుకనే ఆమె ఏగుణానికి కట్టుబడదు; ఏరసానికీ అంటుకొనదు అందువలననే ఆమె నిఖిలగుణాలకూ ఆకరమయ్యీ 'నిర్గుణ' అయింది !

(ఆగష్టు 1969)



## మానవత్వం

నేను చేస్తున్నాననుకునేది మానవత్వం. కొంత తనదీ చాలా మట్టుకు దేవుడిదీ అనుకోవటం మానవత్వం. ద్వంద్వాలలో తోచే సంకల్పమే మానవత్వం. పొరపాట్లతో కూడినదే మానవత్వం. పరిమితమయిన మమకారం మానవత్వాన్ని సూచిస్తుంది.

- అమ్మ

# 41
# సంగీత సంస్కృత విద్యాలయాలు

అత్యంత ముదావహాలయిన రెండు శుభకార్యాలు యీ ఒక్క నెలలో అమ్మ చరణ సన్నిధిలో జరిగాయి

శుభాశుభాలు, ఒదమోదాల అంతరం అపరిమితమయిన పరమాత్మకు లేక పోయినా, పరిమితులకు బద్ధులయిన మనుష్యులకు లేకపోలేదు కాబట్టి జరిగిన సంఘటనలు శుభాలనీ, ఆనందప్రదాలనే సంభాషిస్తున్నాము.

అందు మొదటిది మాతృశ్రీ సంగీత విద్యాలయ ప్రాదుర్భావం, రెండవది మాతృశ్రీ సంస్కృత విద్యాలయ పునఃప్రారంభం.

ఒకటి ఆపాత మధురమయిన సంగీత సంబంధి అయితే, మరొకటి ఆలోచనామృతమయిన సాహిత్యపరమయినది. అమ్మ జీవితకాలంలో అత్యంత ప్రధాన దినమయిన శ్రావణ పంచమి సంగీత విద్యాలయ సముద్భవానికి సుముహూర్తమయితే.. అఖిల విద్యలకూ ఆధారుడయిన విఘ్నేశ్వరుని అర్చనాదినమయిన వినాయక చవితి సంస్కృత విద్యాలయ పునర్వికాసానికి దోహదం చేసింది.

సంగీత విద్యాలయానికి అధ్వర్యం సంగీత తపస్వీ, మహాపండితులూ, యువకులూ అయిన సోదరులు శ్రీ కాసు రాధాకృష్ణరెడ్డి గారిది అయితే . సంస్కృత విద్యాలయానికి ఆచార్యులు ఉభయ భాషల్లోనూ ఉద్దండ పండితులూ, చతుర్వేద కవితా పారీణులూ, వయో వృద్ధులూ అయిన అగ్రజులు శ్రీ రాయప్రోలు భద్రాద్రి రామశాస్త్రిగారు.

ఇక్కడ మరొక్క విశేషంగూడ ఉన్నది, సంస్కృత విద్యాలయం అమ్మ అభీష్టానుసారం అయితే.. సంగీత విద్యాలయం ఉత్సాహవంతులయిన రాధాకృష్ణ రెడ్డి హృదయ స్పందనకు బాహ్యాకృతి. ఆ స్పందనకు మాత్రం ప్రేరణ అమ్మ సంకల్పం కాదా ? అంటే -- కాదనటానికి ఎవరికీ ఆధారం లేదు. కారణం -

కాకపోతే తద్విద్యాలయ మహోదయానికి అవకాశమే లేదు. .. ఆ విత్తులో ప్రాణం ఉన్నదనటానికీ ఆ ఎత్తునుండి మొక్క బయటకు రావటమే నిదర్శన మయినట్లు. కాని అమ్మ సంకల్పం పరోక్షంగానూ అపరోక్షంగానూ ఎట్లా కార్యచోదన చేస్తుందో - -- యీ రెండు విబిన్న సంఘటనలూ అందుకు దృష్టాంతాలు కూడా

కానీ - నేడీ తోటలకు పాదుచేయటంలో అమ్మ ఉద్దేశమేమిటీ అనేది ఒక ప్రశ్న

లోకంలో కోటి విద్యలూ కూటికొరకే నని నానుడి, కాని యిక్కడ అమ్మచరణ సన్నిధిలో, అమ్మ ఆశ్రయంలో ఉన్న ఏ జీవికి జీవనోపాధిని గురించిన చీకూ చింతా అవంతైనా లేకపోవటంలో వివాదమే కాదు విశేషమూ లేదు. కారణం - అందరూ తమ జీవితసర్వబాధ్యతలూ, బరువులూ అమ్మ మృదుపద సంకేరుహాలపై వేసి తాము నిర్విచారులూ, నిమిత్తమాత్రులూ అయిన విశ్వాస సంపన్నులు గనుక.

మరి వాని అవసరమేమిటి ? ఇక్కడ అందరికీ ఒకే లక్ష్యమూ, ఒకే ధ్యేయమూ - అమ్మ సేవా, అమ్మ ఆరాధనా, వారు అక్కడ ఏ పనిచేసినా, ఎవరికి ఏ సేవచేసినా అమ్మను సేవించినట్లుగానే సంతృప్తి చెంది, అదీ అమ్మ ఆరాధనాకార్యక్రమంలో ఒక భాగంగానే భావిస్తారు. మరి ఆరాధన అనేక రీతులుగదా ! పాదాలపై పూలు వేయటమే కాదుగా, అర్చన అంటే పొలంలో మట్టిపని చేసినా, వంటయింటిలో గంజివార్చినా, హైమాలయంలో అభిషేకం చేసినా --- అన్నీ సమానమేనని వారి ధృడవిశ్వాసం.

అందులో 'గానలోలుప అయిన అమ్మ సంకీర్తన కోసమే సంగీతం కాకపోతే - అది బూడిదలో పోసిన పన్నీరేనని శ్రీ రాధాకృష్ణరెడ్డిగారి అభిప్రాయం 'అలంకార ప్రియ' అయిన అమ్మ గుణగణ పరిగ్రహణకూ, సంస్తవానికే సాహిత్యంకాకపోతే - అది సాగరజలపానమేనని శ్రీ భద్రాది రామశాస్త్రిగారి ఉద్దేశం.

మరి, యిద్దరి తోటమాలుల అభిమతాలూ, అభిరుచులూ మహోత్కృష్టములూ, మహోజ్జ్వలములే, ఇంకా యీ తోటలలో ఎవరెవరు ఏ అంటు త్రొక్కనున్నారో.... ఇక ఏ తోటలో ఏ లతలు నవనవోన్మేషమై అమ్మ పదార్చనకై ఏ సుమగుచ్ఛాల విరిసిఏ పరిమళాలు వెదజల్లుతాయో, ఏ వృక్షాలు అమ్మ నివేదనకై ఏ ఫలమంజరుల నందించి నవరసాల చిందించుతాయో....

ఈ బృందావనంలో రాగాలకు బదులు అనురాగాలు ప్రసవమై, సాహిత్యం తోపాటు సౌహిత్యం ప్రపుల్లమై - విశ్వసౌభ్రాత్ర సుగంధాలు వెదజల్లాలని మేము మనసారా అభిలషిస్తున్నాము.

(సెప్టెంబరు 1969)



# 42
# "నిరహంకారా"




ఈ విజయదశమికి మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు - రెండవ భాగం కూడా ప్రచురిస్తున్నామన్న ఆనందంకంటే యీ చరిత్ర రచనలో యింతవరకూ ఎదుర్కొన్న కష్టం తలుచుకుని - ముందు యింకా ఎన్ని అగాధాలూ, ఎన్ని అవరోధాలూ ఎదురవుతాయోనన్న భావమే భయపెడుతున్నది

అమ్మ భౌతికంగాకంటే మానసికంగానే ఎక్కువగా మనలను ప్రభావితులను చేస్తుంది వీనిని ధృవపరిచే విషయాలు నా ఎఱుకలో అసంఖ్యాకంగా ఉన్నాయి తనకు ఏమి అవసరమో దానిని అమ్మ మనకు ప్రేరణను యిచ్చి మనచేత చేయించుకుంటుంది. అంతేగానీ ఆ పనిని సరాసరి అమ్మ చేయదూ, మనకు నోటితోనూ చెప్పదు.

ఒకసారి సోదరులు బుచ్చిరాజును టెలిగ్రాము యిచ్చి అమ్మ పిలిపించమన్నది. నేను సరే నన్నాను. కాని ఎందుకనో యివ్వలేకపోయాను. సరిగా అదే సమయానికి రాజు అక్కడ బయలుదేరాడు, మనస్సు మాత్రమే కదిలించగా.

ఇంకొకసారి మరొక సోదరులు సింగుపాలెం తాతయ్యకు అమ్మ ఉత్తరం వ్రాయమన్నది, వ్రాశాను. కాని అది చేరకముందే, నేను యిక్కడ ఆజ్ఞను అందుకున్న సమయాననే తాతయ్యకూ నూతన సూచన అందిందీ, ప్రయాణమయినాడు.

ఇటీవలనే యిక్కడ సంస్థకు సంబంధించిన పని ఒకదానికి జిల్లాకలెక్టరుగారి సహాయం కావలసి వచ్చింది. వారిని కలుసుకొనటానికి మాకు తీరికలేక ఎట్లాగూ అని ఆలోచిస్తూంటే - సోదరులు రామరాజు కృష్ణమూర్తి - ఇదంతా ఎందుకమ్మా - వారినే నీవిక్కడకు తీసుకురాకూడదూ ? - అన్నారు. 'అవును - ఎందుకు రాకూడదూ!' అన్నది అమ్మ. అమ్మ మాట ఎందుకు వ్యర్థమవుతుంది ? ఎప్పుడు అమ్మ నోటి నుండి తాలుమాట వెలువడింది ? అమ్మ అతి చిన్నతనంలోనే యీ మాటరాగా - అమ్మ కూడా అంగీకరించింది. తోలు నోరుకాదు కదా తాలుమాట రావటానికి -

అని. ఈ సత్యం ఆనాటి చిదంబర రావుగారి నుండీ యీనాటి చిన్నపిల్లల వరకూ అనుభూతమే.

ఇక్కడ ఒక చిన్న నిగూఢ విషయం ఉన్నది. 'ఎందుకు తీసుకురాకూడదూ!' అన్న ప్రశ్నకు అమ్మ సమాధానం 'ఎందుకు రాకూడదూ!' అన్న వాక్యం మాత్రమే. అంటే అన్నీ చేసే, అన్నీ చేయగల అమ్మ - ఎక్కడా వేనికీ తన కర్తృత్వం బహిర్గతం కానీయదు. ఏమీ చేతగాని ఏమీ చేయలేని మనం అన్నీ మనవేనని ఉప్పొంగి పోతూంటే.

అందువలన మన జీవితం మొత్తంలో - శరీరంలో ప్రాణంవలే, తడిగుడ్డలో నీటివలే, యావత్తూ అమ్మ పరుచుకుని ఉన్నప్పటికీ, మనతో అమ్మకుగల అనుబంధం అవిచ్ఛిన్నమయినప్పటికీ - మనకు ఏమీ అర్థంగాక మనం స్వతంత్రులమనే అనుకుంటూ అమ్మ శక్తినీ, మనపైగల ప్రభావాన్నీ అవగాహన చేసుకొనలేము

దుష్టశిక్షణ - విషయంలో దుర్గార్గులలో ఉన్న దౌష్ట్యాన్ని అంటే వారి మనోవైకల్యాన్ని మాత్రమే సరిచేయుట మన్నది అమ్మ, అనేక సంఘటనలలో అట్లాగే చేసింది. అనేకులలో అద్భుతపరిణామాలు తీసుకువచ్చింది. అసంఖ్యాకమయిన అసామాన్యమయిన విజయాలు సాధించింది

మరి - వీరిపై అమ్మకుగల చోదనాశక్తికీ, అమ్మ కర్తృత్వానికీ - నిదర్శన మేమిటీ ? తర్కానికీ, బాహ్యదృష్టికీ అందని విషయాలవి. ఈ విషయాలలో పాఠకులకు విశ్వాసం కలగజేయుటానికి భౌతికసాధన లేమిటి ? సాక్ష్య మేమిటి ?

ఇక రెండవ విషయం - అమ్మను 'సహనస్వరూపిణి' అంటున్నాము. సహనమంటే సహించటమే అయినా సుఖాలను సహించేవారిది సహనం అనము ఆ మాటకు వస్తే - మితిమీరిన సుఖమయినా సహించటం సాధ్యం కాదనుకొనండి ఒకసారి నాన్నగారు- మీ అమ్మగారికి కష్టమేమున్నదీ ? - హాయిగా ఎప్పుడూ మంచం మీద కూర్చోవటమేగా - అన్నారు. అట్లా అన్న కొలదిరోజులకే నాన్నగారికి ఆరోగ్యం సరిగా లేక - మంచం దిగకుండా విశ్రాంతి తీసుకొనమని డాక్టరుగారు సలహా యిచ్చారు కాని నాన్నగారు ఒక్కరోజుకూడా పూర్తిగా పడుకొనలేకపోయారు. అప్పుడు అదేమిటి నాన్నగారు - అంటే ఒక్క నవ్వు నవ్వి - అట్లామంచంమీద నేను పడుకోలేనురా - అన్నారు.

కాని సహనం అనే పదం కష్టాల సహనం వరకే రూఢీ అయింది. ఆ కష్టాలు కూడా సామాన్యమయినప్పుడు విశేషంగా చెప్పుకునే అవసరం లేదు. అవి

సరిహద్దులు దాటినప్పుడే దానిని గురించిన ప్రసక్తీ, ప్రశంసా. మరి - అమ్మ మితిమీరిన కష్టాలు ఏమి అనుభవిస్తున్నది ? ఆ కష్టాలు ఎవరయినా పెట్టాలి గదా ! ఆ విషయాలు ప్రకటించామనుకొనండి అది సత్యమయినా, ప్రకటన సభ్యత కాదంటారు అది వివాదాంశమే అవుతుంది.

అదీగాక ఒకసారి 1953వ సం॥లో అమ్మ నివాసం (నాన్నగారింటి)లో దొంగ తనం జరిగింది. కొంత ఆస్తి నష్టమయింది. పోలీసు రిపోర్టు యిచ్చారు. వారు విచారణకు వచ్చారు. ఆ రాత్రి యింటిలో అమ్మ ఉన్నది అందువలన వారు భౌతిక దృష్టితో అమ్మను అడిగారు. మీరేమయినా మనుషులను చూచారా, గుర్తుపట్టారా - అని, వారిని అమ్మ చూడటమూ, గుర్తించడమూ జరిగిన విషయాలే అయినా అమ్మ తనకేమీ తెలియదనే అసత్యమాడింది. వారిని బయటపెట్టలేదు, వారూ బిడ్డలేగదా అన్న అభిప్రాయంతోనూ, మమకారంతోనూ, అప్పట్లో వారికి ఏ విధమయిన శిక్ష లేకపోయినా కాలాంతరంలో అమ్మ క్షమతోనే వారిలో పరివర్తన తీసుకురావటమూ, వారు పాదాక్రాంతులు కావటమూ జరిగాయి.

వారు లజ్జతో భయంతో సత్యం చెప్పకోలేదు అమ్మ ప్రేమతో కరుణతో నిజం బయట పెట్టదు. మరి - జీవితం చరిత్రబద్ధం ఎట్లా అయ్యేటట్లు ?

ఒకసారి ఒక యోగి అమ్మవద్దకు వచ్చారు. అమ్మ సన్నిధిలో వారి సంభాషణ గానీ, ప్రవర్తనగానీ సముచితంగా లేవు, అయినా వారిపై అమ్మ వాత్సల్యమే కురిపించింది. ఆ సంఘటన వివరిస్తేగానీ - అమ్మ ఔన్నత్యం వ్యక్తం కాదు. మరి, దానితోబాటే వారి అల్పత్వమూ బహిర్గతం కాక తప్పదు. ఇక - ఆ సంఘటన చెప్పేటట్లా ? చీకటిలో కరిగిపోవలసిందేనా ?

నేను ఎఱుగుదును - ఎందరో 'గురువు'ల మనుకునేవారు తమ శిష్య బృందంతో అమ్మ వద్దకు వచ్చి శిష్యుల ఎదుట ఘరానాగా కూర్చొని, తరువాత వారిని బయటకు పంపి పాదాలపై సాగిలపడి, తీర్థ ప్రసాదాలు తీసుకొనటం. అంటే - వారు అమ్మవద్ద వినమ్రులు కావటానికి వారికి అభ్యంతరం లేకపోయినప్పటికీ, నలుగురిలో ఆ విషయం ఒప్పకొనగల గుండె బలం వారికిలేదు. అమ్మకూడా వారిని మన్నిస్తుందేగానీ బయట పెట్టదు ఏ తల్లి ఏ బిడ్డను వీధిపాలు చేస్తుంది ?

కాని యిట్లా ఎవరికి ఏమి బాధ కలుగుతుందో అని భయపడితే - చరిత్ర రచన ఎట్లా సాగేటట్లు ?

పోనీ - యీ చరిత్ర రచన ఎందుకు చేయాలీ, మానివేద్దామా - అంటే .. లోగడనే చెప్పుకున్నాము యీ చరిత్ర ఆవశ్యకతను గురించి, జనబాహుళ్యానికి ప్రయోజన కరమయిన, లోకానికి ప్రబోధాత్మకమయిన, మానవాళికి మార్గదర్శక మయిన అంశాలు అనంతంగాగల చరిత్రను అక్షరనిబద్ధంచేయక నిర్లిప్తంగా వదిలితే ఎట్లా ? నవరస ప్రపూర్ణమయిన, సవతారసప్లావితమయిన పరిపూర్ణ మానవతా వికసితమయిన, పరిఫుల్ల మాధవత్వ పరీమళభరితమయిన, మానవతా మాధవత్వ సమ్మిళిత రమణీయమయిన యీ జీవితం కలకాలం నిలిచేటట్లు గ్రంథస్థం చేయకపోతే ఎట్లా ?

అయితే - ఊరుపేరులు మినహాయించి వ్రాద్దామా అంటే అది కల్పన, కట్టుకథ కావచ్చునేమోకానీ చరిత్ర గౌరవం దానికి ఎట్లా లభ్యపడుతుంది

మరి - ఏమి చేయాలి ?

దీనికి అమ్మే సమాధానమూ, పరిష్కారమూ అనుగ్రహించాలి. ఇన్ని మనస్సులపై యిట్లా అప్రతిహతంగా ప్రభావం చూపగల అమ్మ - వారికి సత్యప్రకటనా సక్తినీ, శక్తినీ కూడా ప్రసాదించాలి.

అదే మాకూ అనుగ్రహించమని అంజలి ఘటించి అమ్మను వేడుకుంటున్నాము.

(అక్టోబరు 1969)



## అమృతత్వం

పుట్టాడని సంతోషమూ, చచ్చాడని దుఃఖమూ లేకపోవడం అమృతత్వం.

మృత్యుంజయుడంటే చనిపోకుండా ఎల్లకాలమూ ఉంటాడని కాదు. చావును గురించిన ఆలోచన లేని వాడు, భయం లేనివాడు అని.

- అమ్మ

# 43

# "తమోపహా" - హైమ

అమ్మ మాటలు, అమ్మ క్రియలు మనకు అంతంత మాత్రంగా అర్థంకావు. అమ్మ ఏ మాట ఎప్పుడు ఎందుకు అంటుందో అవగాహన కాదు. ఏ క్రియకు ఏమి కారణమో, ఏమి ఫలమో అంతకంటెనూ బోధపడదు. అంతా అయిన తరువాత ఆ మాటకు అర్థం యిదా అనిపిస్తుంది. అట్లాగే ఆ కార్యానికి కారణం యిదా అనీ, ఆ క్రియకు ఫలం యిదా అనీ ఆశ్చర్యపోతాము

అందుకు నిదర్శనం సోదరి హైమయే సర్వేశ్వరి అయిన అమ్మ గర్భవాసాన జనన మందిన హైమ అందరికీ ప్రశ్నార్థకంగానూ, ఆశ్చర్యకరంగానూ ఉండేది.

ఆమె మేను ఎంత మెత్తనో, మనస్సు అంతకంటెనూ మృదువయినది. ఎవరికి ఏ మాత్రం కష్టం కలిగినా తాను సహించగలిగేది కాదు. పిచ్చుకపిల్ల గూటినుండి రాలితే రోజుల తరబడి దుఃఖించేది. పువ్వువాడి తీగనుండి విడిపడితే తాను విలవిలలాడేది. ఎవరికి ఏ కొంచెం జ్వరం తగిలినా తాను అన్నం మాని, నిద్ర పోయేది కాదు ఇవి మనకు ఒకప్పుడు ఆమె బలహీనతా చిహ్నాలుగా తోచినా - అవి ఆమె మనస్సులోని రాగజలధిలో ఉత్పతన్నమయిన తరంగ మాలికలే. ఆమె హృదయ వీణపై మ్రోగిన రాగలహరులే.

ఆమె మనమధ్య తిరిగినంత కాలం ఆమె నరనరాల ప్రవహించింది రక్తం కాదు; అనురాగామృతం. ఆమె కనుగొలకుల్లో కనుపించినవి రక్త జీరలుకావు; రాగారుణరోచిస్సులు. ఆమె కంటిలోతుల్లో కనుపించిన నీలిమ - ఆర్తజనం కోసం నిరంతరంగా ఆమె పడిన వేదన.

అందువలననే హైమ స్ఫురణకు వస్తే - జీసస్, గౌతముడూ మొదలయిన కారుణ్యమూర్తులు మన ఎదురుగా వచ్చి నిలుచుంటారు. వారిలో హైమే దృగ్గోచరమవుతుంది.

కారుణ్యమూ, అనురాగమూ, వాత్సల్యమూ. ఏ పదం ఎక్కడ ఏ తరుణంలో వినబడినా హైమే మన స్మృతి పథంలోకి వచ్చి మన మనస్సును పరిపూర్ణంగా ఆక్రమించుకుంటుంది.

ప్రేమే దైవమేమో. లేకపోతే - మరి హైమ దైవ మెట్లా అయింది ? దైవం కాక మరెవరు సర్వశక్తిమంతులవుతారు ? అర్థించిన ప్రతీదీ - విచక్షణారహితంగా మరెవరు ప్రసాదిస్తారు ? ఆర్తులై వేడుకున్న వారిపై ఎవరినుండి పరిమితులులేని ప్రేమ వెల్లువలై ప్రవహిస్తుంది ?

కనుకనే నేడు హైమాలయం కల్పవృక్షమైంది. అక్కడ చేసిన ప్రార్థన వ్యర్థం కావటం లేదు. అక్కడ కుసుమించిన కామన ఫలించక పోవటంలేదు. అక్కడ చేరిన మనస్సులో అశాంతికి తావులేదు.

ఆశ్రితులనూ ఆర్తులనూ ఆదరిస్తూ సర్వజనారాధ్య అయిన హైమ - విశ్వజనని రత్నగర్భాన జననమంది యీ అవనీతలంలో ప్రప్రథమంగా శ్వాసతీసుకుని యీ డిశంబరు ఒకటవ తేదీకి యిరవైఏడు సంవత్సరాలయింది.

ఆనాడు మనమందరం తన స్థిరనివాసం కోసం నిర్ణయించుకున్న ఆ పవిత్రస్థలిలో - ఆ ప్రేమమూర్తిని అర్చించి... ఈర్ష్యా ద్వేషానూయలతో తిమిరావృతమయిన మన మనస్సుల్లో ఒక్క చిన్న అనురాగపు క్రొవ్వువత్తినయినా వెలిగించమని వేడుకోవటంకన్నా చేయగలిగినది ఏమున్నది ?

(నవంబరు 1969)



## కర్తృత్వం

మీరు దేనికీ కర్తలు కాదు అనిపిస్తుంది. ఏం జరిగినా వీటన్నింటికీ ఒకే కారణం కనిపిస్తుంది నాకు. అందుకే ఒకదాని గొప్పతనం ఇంకోదాని కొద్దితనం కనిపించదు.

- అమ్మ

# 44

# "హైమ-విశ్వారాధ్య"

"అందరిలో మంచితనం చూడటమే మన మంచితనం" అన్నది అమ్మ

హైమ తన యిరువది అయిదు సంవత్సరాల జీవిత కాలంలో ఎవరిలోను ఏ విధమయిన దోషాన్నీ చూపలేదూ, చూడలేదు. ఎప్పుడు ఎవరి ప్రసక్తి వచ్చినా వారిలోని గోరంత ప్రతిభనయినా కొండంతగా ప్రశంసిస్తూ ప్రతివారినీ హృదయ పూర్వకంగా ప్రేమించేది. తప్పు కనిపించక పోవటం తల్లి లక్షణం. ఎవరిలోనూ తప్పు చూడక పోవటమంటే అందరికీ తల్లి అయి ప్రేమించ గలిగిన విశాల హృదయం కలిగి ఉండటం. అందరికీ తల్లి కావటమంటే - అదే దైవత్వం.

దైవత్వమంటే నాలుగు చేతులూ కిరీటమూ కాదు. ఎందులో నయినా ఎక్కడ అపరిమితత్వం పరిఢవిల్లుతుందో - అదే దైవత్వం. ఎక్కడ వైకల్యం లేక పరిపూర్ణత్వం ప్రఫుల్లమవుతుందో - అదే దైవత్వం. ఎక్కడ సమదృష్టి విలసిల్లుతుందో అదే దైవత్వం. ఎక్కడ త్యాగం, కరుణ, ప్రేమ, సహనం నాలుగు స్తంభాలుగా పరిపూర్ణ మానవత్వం పందిరి వేసుకుని మూడు పువ్వులూ ఆరుకాయలుగా వికాసం పొందుతుందో - అదే దైవత్వం.

అందుకనే, అదే దృష్టితోనే హైమను మనం దైవంగా గుర్తించి నేడు ఆరాధించుకుంటున్నాము.

అయితే - అవతారమూర్తి అయిన అమ్మ యిన్ని సద్గుణాలూ తన కుమార్తెకు మాత్రమే ప్రసాదించి దైవత్వం ప్రసాదించి లోకారాధ్యను చేయడం అమ్మకు స్వార్థం కాదా అని కొందరు సందేహ పడవచ్చును

ఇది అపూర్వ విషయం ఏమాత్రమూ కాదు. పురాణకాలంనుండీ అనుసరింప బడుతున్న సంప్రదాయమే.

విష్ణువు దివినుండి భువికి అవతరించిన ప్రతి ఘట్టంలోనూ తన అనుచరులను తనకు ఆత్మీయులుగా తన వెంట తెచ్చుకున్న సత్యం ఎవరూ కాదనలేని విషయమే

పరమశివుడు ఆత్మజులయిన కుమారస్వామికి దేవసేనాధిపత్యం అనుగ్రహించటమూ --- విఘ్నేశ్వరునికి ప్రమధగణాధిపత్యమూ, ప్రధమ పూజార్హతా ప్రసాదించటమూ సర్వజన విదితమే.

జగజ్జనని తన సంతానమయిన బ్రహ్మ, విష్ణు మహేశ్వరులకు జగత్ సృష్టి స్థితి లయాలకు సంబంధించిన సర్వాధికారాలు ఒసగిన సంగతీ నిర్వివాదాంశమే.

ఇక ప్రస్తుతం అమ్మ తన కుమార్తె అయిన హైమను తన నీడన సర్వ సల్లక్షణ సమన్వితగా రూపొందించి లోకానికి ఆదర్శమూ, ఆరాధ్యమూ చేయుటం విమర్శనీయం కాకపోవటమేకాదు... మానవ సహజమయిన అనురాగ అనుబంధాలు కలిగిన అమ్మ - మానవ లోకానికి ఆరాధ్య మూర్తిని అనుగ్రహించే సదుద్దేశంతో తన ప్రియ పుత్రికనే ప్రసాదించటంలోని మహత్తరత్యాగం సంస్తవనీయమే అయినా... ఆ సంఘటన మనకు బాధాకరమే.

ప్రేమమూర్తి అయిన అమ్మ కార్చిన కన్నీటి ప్రవంతియే మన దప్పికను తీర్చగలగటం మన దురదృష్టం.

(డిశంబరు 1969)



## సాధన - సాక్షాత్కారం

ఒకటి అనేక మయింది కనుక అనేకంలో ఆ ఒక్క దాన్ని చూడడానికి చేసే ప్రయత్నమే సాధన. అనేకం ఒకటిగా తోచడమే ఆత్మసాక్షాత్కారం.

- అమ్మ

# 45
# సర్వత్రానురాగం

ఈ నెల 11వ తేదీ మధ్యాహ్నం గరికపాడు నుండి వచ్చిన ఒక సోదరునితో అమ్మ భాషిస్తూ ఉన్నది - కొద్ది రోజుల క్రితమే జరిగిన అతని సోదరుని దుర్మరణం గురించి

ఇంకానయం, అట్లా జరగకుంటే శవం కూడా దొరక్కుండా సముద్రం పాల్యేది - అన్నాడతడు. ఆ పలుకుల్లో అతని హృదయాక్రోశం ధ్వనించింది అందుకు కారణం - అతని అనుగు సోదరుడు, దానిలో ఎంతో అభివృద్ధిలోకి రావలసినవాడు అట్లా అకాలమృత్యువు వాతపడటమే.

అది ద్వంద్వావస్థలోనున్న ఒక సామాన్య వ్యక్తికి సహజమే కావచ్చును కాని సర్వజ్ఞ అయిన, సర్వ సృష్టి స్థితి లయకారిణి అయిన అమ్మ కనులలో సైతమూ అశ్రువులు కనుపించటం ఆశ్చర్యకరమే !

అది విషాద ఘటనా ? ఆ విషాధాగ్ని వేడిమికి అమ్మ నవనీత హృదయం కరిగిందా ! అమ్మకు ఆ విషయం అప్పుడే తెలిసిందా ? ఆ ఘటనకు వెనుక అమ్మ చెయ్యి లేదా ?

ఇంకొక విధంగా అమ్మను భావించటానికి మన విశ్వాసమూ, పూజ్యభావమూ అంగీకరించక పోవచ్చును. అది సత్యం కాకపోవచ్చును. కాని అమ్మ కనుగొలకుల్లో నీరు చేరటం మాత్రం వాస్తవం. అందుకనే తరువాత అమ్మను అడిగాము -- ఏమిటమ్మా నీవూ - అని

అప్పుడు అమ్మ అన్నది - వాడు పోయాడని కాదురా ఆ సంఘటన చెప్పేటప్పుడు వీడు అనుభవించిన వ్యధ నన్ను కదిలించింది - అని.

ఆ సానుభూతియే, ఆ ఆదరమే, ఆ అనుబంధమే మనను అమ్మకు సన్నిహితులను చేస్తుంది. మన కష్టసమయంలో లాలనతో అమ్మ పలికే ఒక్క

అనునయ వాక్యమో, అనురాగ పూర్ణమయిన క్రియో - మనం ఆర్తితో అమ్మ ఒడిలో వాలిపోయి భోరున, ఏడిచేలా చేస్తుంది. అమ్మ తనకు ఏమీ తెలీనట్లు మన కష్టాలను గురించి ప్రశ్నిస్తుంది మనం ఆ కడగళ్ళనుండి ఎట్లా విముక్తి పొందుతామోనని తానూ మనలో ఒకరై ఉపాయాలు అన్వేషిస్తుంది. అమ్మ మనతోపాటే మనవలే మనకోసం దుఃఖిస్తుంది ఒక్కొక్క సారి ఆ కన్నీరు కట్టలు తెగిన వాహినియై ప్రవహించటమూ ఎఱుగుదుము.

ఈ సామాన్య లక్షణమే, యీ మానవ దౌర్బల్యమే - యీ లోకపు కష్టాల సుడిగుండంలో చిక్కిన మనలో, బాధల ఎడారిలో వడగాడ్పుల దెబ్బతిన్న మనలో - చల్లని మాటతో, చల్లని చూపుతో సేదతీర్చి ఆదరించి, మనస్సుకు శాంతినీ, జీవితానికి మార్గప్రబోధాన్నీ ప్రసాదించే అమ్మపై ప్రేమను అంకురింపజేసి మనలను అమ్మవైపుకు ఆకర్షించుకుని అమ్మకు మనలను అత్యంత సన్నిహితులను చేసి చివరకు అమ్మలో విలీనం అయిపోవాలనే కాంక్షదాక తీసుకువెళ్ళుతుంది.

ఇటువంటి బలవత్తరమయిన అనుబంధమో, అనురాగమో మనకు మన జీవితంలో ఒకరితోనో యిద్దరితోనో ఉంటుంది. అమ్మకు తన సన్నిధికి వచ్చే అసంఖ్యాకులలో ప్రతి ఒక్కరితోనూ ఉంటుంది.

మనలో పరిమితంగా ఉండే యీ మమతానుబంధమే అమ్మలో అపరిమితమై సర్వసృష్టికీ పరివ్యాప్తమైంది. అమ్మలో సర్వ ప్రకృతిపై సర్వవేళలా సానుభూతి వెల్లివిరుస్తూ ఉంటుంది.

మరి - ఏ విషయంలోనయినా పరిమితులు లేకపోవటమే దైవత్వం!

- అందుకే అమ్మను జగజ్జననిగా కొలుచుకుంటున్నాము.

(జనవరి 1970)



# 46
# "అమ్మ ప్రసాదాలు"

ఈ నెల 14వ తేదీ ఉదయం, చాలా కాలం తరువాత అమ్మ దర్శనార్థం వచ్చిన సోదరులు బందరు మూర్తిగారు అమ్మకు నమస్కారం చేసుకోవటానికి వంగగానే జేబులోనుండి ఒక భరిణ క్రింద పడింది.

అమ్మ చెయ్యి చాపింది.

అతడు అచేతనంగానే ఆ భరిణను అమ్మచేతికి అందించాడు.

అమ్మ మూత తెరచింది. దాని నిండా ఉన్న కుంకుమలోనుండి ఒక చేమంతి పూవును బయటకు తీసి అక్కడ కూర్చున్న మాకు చూపి -- యిది 1956లోది -- అని తెలిపింది.

మేము విస్మితులం కావటంలో విస్మయమేమున్నది ? ఆ పూవు రేకులు కూడా విడివడకుండా ఎంతో భద్రంగా ఉన్నది ! పధ్నాలుగు సంవత్సరాలక్రితం అమ్మచే ప్రసాదితమయిన ప్రసూనమది. నేటికీ ఏనాటికీ చలనంలేదు అది నిత్యమయినది

ఒక్కసారి ఎవరు అమ్మను దర్శించినా - వారికి తన కటాక్షానికి చిహ్నంగా అమ్మ ఏదోఒకటి ప్రసాదిస్తుంది. అది ఫలం కావచ్చు. పుష్పం కావచ్చు. పత్రం కావచ్చు. కుంకుమ కావచ్చు. విభూతి కావచ్చు, వస్త్రం కావచ్చు, తీర్థం కావచ్చు. కేశఖండం కావచ్చు, నఖం కావచ్చును

అవి సంవత్సరాల తరబడి మనతో ఉండి - అన్ని వేళలా అమ్మ మనతో మసలుతున్నదనే ధైర్యాన్నీ సంతృప్తినీ అనుగ్రహిస్తూ ఏ ఆపద వచ్చినా మనలను కాపాడుతూ మేలుకొలుపులు పాడుతూ ఉంటాయి.

ఒక్కొక్కసారి అమ్మ అనేకరకాల పదార్థాలు కలిపి అన్నం పెడుతుంది. అది ఎంతో రుచిగా ఉంటుంది. ఒకనాడు ఆ రుచికి ఆకర్షిత అయిన సోదరి '[illegible]'

విస్తరినిండా అన్ని పదార్థాలూ వేయించుకుని జాగ్రత్తగా కలుపుకుని ఒక్క ముద్దనోటిలో పెట్టుకుని - భళ్ళున వాంతి చేసుకున్నది. మరి - ఆ రుచి ఆ అమృత కర ప్రభావంగానీ పదార్థ జనితం అయితేనేగా ?

ఒకసారి సోదరులు వర్ఘా శివరామయ్యగారు యింటిలోని తీర్థం అయిపోగానే - కొందరు తీర్థం అవసర సమయాల్లో ఔషధంగా వాడుకుంటే, కొందరు నిత్యమూ వాడుకుంటారు - వారి కుమారుని జిల్లెళ్ళమూడి వెళ్ళి తీర్థం తీసుకు రమ్మని ఆదేశించారు. వాడు తీర్థం అంటే నీరేగదా, ఏదయితే నేమి - అని బాపట్ల బావిలోని నీరే సీసాలు పట్టించి తీసుకు వెళ్ళాడు. ఏమున్నది ? - రెండవ నాటికే వాసనవేయ నారంభించినదట. మరి - సర్వ సృష్టికీ ఆధారభూతమైన ఆ పదాభిషిక్త జలం జలంఎట్లా అవుతుందీ - అవ్యాజాను గ్రహఫలమేగానీ.

కొందరిని అమ్మ పలకరిస్తుంది విషయం ఏమయినా - అమ్మ మాట్లాడుతుంది. ఆమాటా, ఆమాటలోని మాధుర్యమూ, అందులోని కారుణ్యమూ కలకాలమూ ఆ హృదయంలో నవనవంగానే నిలిచి వారికి నిరంతరమూ ఆహ్లాదాన్నీ ఆనందాన్నీ అందిస్తూనే ఉంటాయి.

ఏదో కారణంతో కొందరిని అమ్మ స్పృశిస్తుంది. ఆ స్పర్శా, ఆ స్పర్శలోని అనిర్వచనీయ అనుపమ మధురానుభూతీ జీవిత కదనంలో కవచమై, సంజీవివలె జీవనసంజీవని అవుతుంది.

కొందరికి స్ఫురితి నిస్తుంది రూపమో, నామమో ఏదయితేనేమి - ఒక సంస్మరణ మిస్తుంది. దానిని మించిన మంత్ర మేమున్నది ? మరి - మంత్రమంటే తృప్తినీ హాయినీ ప్రసాదించేదేగా ?

ప్రసారం వేయి విధాలు కావచ్చుగానీ - ప్రసాదం అందరికీ ఒకటే. అదే తృప్తీ, హాయీ, అవి అందరికీ అందుతాయి అక్కడ.

అందుకే నేడు ప్రజావాహిని ఆ జిల్లెళ్ళమూడి కృపాక్షీరసాగరాభిముఖమై వడివడిగా ప్రవహిస్తున్నది.

(ఫిబ్రవరి 1970)



# 47
# విశ్వవంద్య

అప్పుడే అమ్మ అవని మీదికి అరుదెంచి నలభైఏడు సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి.

ఇంకా ముందు చేయబోయేదీ, చెప్పబోయేదీ ఎంత ఉన్నప్పటికీ - యిప్పటికీ అమ్మ చేసినదీ, చెప్పినదీ అల్పమయినదేమీ కాదు.

కీకారణ్యంగా సామాన్య జనాన్ని భయపెట్టిన వేదాంతాన్ని అమ్మ అలవోకగా నందనవనంగా మార్చివేసింది. నేడు ఆ వనంలో విరిసిన విరులు సౌందర్యంలోనూ సౌరభంలోనూ సౌకుమార్యంలోనూ అనన్యమై జగత్తునే దిగ్భ్రాంతిచకితం చేస్తున్నాయి. ఎందరో మేధావులూ, ఎందరో జిజ్ఞాసువులూ దేశాల సరిహద్దులకూ, మతాల అడ్డుగోడలకూ అతీతంగా ఆ పూలగుత్తిళ్ళకై దోసెళ్ళు పడుతున్నారు.

అమ్మ అందరినీ అనుగ్రహిస్తున్నది. అమ్మ అందరినీ సంతృప్తి పరుస్తున్నది. అన్ని మతాలవారికీ అన్ని మార్గాలవారికీ అన్ని దేశాలవారికీ అన్ని ఉద్దేశాలవారికీ అందరికీ సమ్మతమయిన సందేశాన్ని అందిస్తున్నది. అందుకనే ఎన్నో దేశాలవారు తమ క్రీస్తుప్రభువే అమ్మగా వచ్చాడని విశ్వసిస్తున్నారు. మహమ్మదే మళ్ళీ అవతరించాడని కొందరు నమ్ముతున్నారు. సాక్షాత్ బుద్ధ భగవానుని కారుణ్యమే యిలా ఆకృతి దాల్చిందని కొందరు భావిస్తున్నారు. ఇట్లా ఎవరు ఏమి నమ్ముతున్నారో అమ్మ దానినే పోషిస్తూ ఆ మూసలోకే ఒదిగి అలాగే సాక్షాత్కరిస్తూ అలాగే సమాధాన పరుస్తున్నది.

చివరకు అమ్మను నాస్తికురాలనీ అమ్మ చెప్పేది నాస్తికత్వమనీ అనేవారూ లేకపోలేదు.

అందుకనే అమ్మ ఎవరికి వారికి ఎక్కువయి పోయింది. ఎవరిని వారికి అమ్మ ఎక్కువగా ప్రేమిస్తున్నట్లు కనిపిస్తున్నది. ఎవరికి వారికి వారి సిద్ధాంతాన్నే ప్రవచిస్తున్నట్లు అనిపిస్తున్నది

నేడు జగత్తులో నలుమూలలా ఎందరో 'అమ్మ' అని వింటూనే పులకించిపోయే వారున్నారు, పారవశ్యం పొందే వారున్నారు. ఆ స్మృతిలోనే కన్నీరు వరదలయ్యే వారున్నారు, మూర్ఛపోయే వారున్నారు ఆ పాదాలు స్ఫురణకు వస్తేనే సాష్టాంగపడే వారున్నారు ఆ పాదాలకు సర్వార్పణ చేసేవారున్నారు.

ఆ మూర్తిలోని సమ్మోహనశక్తి అది ఆ పలుకులో పొంగులు వారే అనంతజ్ఞాన మహిమ అది. ఆ కన్నుల్లో నిరంతరం వెలిగే దివ్యరోచిస్సుల ప్రభావమది. ఆ హృదయంలోని ఎటువంటి భేదమూ లేని ఎటువంటి కారణం తోనూ కలుషితంకాని వాత్సల్యపు గనుల విలువ అది.

కనుకనే అమ్మ జగత్తులో అందరికీ కన్నతల్లి కంటే మిన్నయైనది

అందువల్లనే అమ్మ జన్మదినోత్సవం యింకా నెలరోజులు ఉందనగానే ఎక్కడ చూచినా ఆ సంరంభమే కనుపిస్తున్నది. ఎటు విన్నా ఆ పండుగ కబుర్లే వినిపిస్తున్నాయి. ఎవరింటిలో వారికి అది పర్వదినమే అనిపిస్తున్నది. ఏ గుండెకు ఆ గుండె అనిర్వచనీయమయిన ఆనందంతో గుబాళిస్తున్నది. ఏ మనసుకు ఆ మనసు తన ప్రేమనూ భక్తినీ ఎలా వెల్లడి చేసుకోవటమా అని వేగిరపడుతున్నది. ఏ వ్యక్తికి ఆ వ్యక్తి తాను చేయగలిగిన సేవ ఏమిటా అని ఆవేదన పడుతున్నాడు.

ఇందరికి యింతగా ఆత్మీయమూ, ఆప్తమూ అయిన అమ్మ జన్మదినం వచ్చేనెల 17వ తేదీ,.

ఆనాడు జిల్లెళ్ళమూడిలో మట్టిగడ్డ గూడా మాణిక్యదీపమై వెలిగి పోదూ ? చెట్టు ఆకుకూడా ఆనందంతో ఊగిపోదూ ??

(జూన్ 1968)



## విశ్వం

విశ్వం ఎప్పుడూ ఉన్నది. ఈ విధంగా లేకపోవచ్చు. సర్వం దైవ మనుకున్నప్పుడు ఏ విధంగా ఉన్నా సృష్టియే దైవం.

\- అమ్మ

# 48
# "నాకూ తెరలు ఉన్నాయి"

మాధవత్వానికీ మానవత్వానికీ గల అంతర్యాన్ని అమ్మ అతిస్ఫుటం గానూ సున్నితంగానూ నిర్వచించింది. ఏ విషయంలోనైనా పరిమతులకు లోబడి ప్రవర్తించటం మానవత్వమూ, పరిమితులకు అతీతమై ప్రభాసించడమే మాధవత్వమూ - అని ప్రవచించింది. అన్ని గుణాలూ దైవానికి ఉంటాయీ మానవుడికీ ఉంటాయి. దైవానికి లేనిదేదీ మనిషికీ ఉండదు

అవతారవ్యక్తికి శరీముంటుందీ, మనసుంటుందీ, సామాన్య మానవుడికీ శరీరముంటుందీ, మనసుంటుందీ. అయితే అవతారవ్యక్తికి తన శరీర మనస్సుల మీదనే కాక ఇతరుల శరీర మనస్సుల మీదనూ అధికార ముంటుంది. మనుష్యులకు తమ శరీర మనస్సులే తాము చెప్పినట్లు నడవవు.

కనుకనే దైవం మానవాకృతిలో ధరాతలానికి అవతరణ చేసి మానవుల మధ్య సామాన్యంగా మసలేటప్పుడు ఆ అవతారాన్ని అవలోకించగలగడమూ, అవగాహనచేసుకొనగలగడమూ సామాన్యమేమీ కాదు. అందుకు మనపై ఆ శక్తి యొక్క నిరవధిక అనుగ్రహమూ, తత్ఫలితంగా ఆ అవతార వ్యక్తి సన్నిధి సౌభాగ్యప్రాప్తీ ఉండాలి.

లేని యెడల ఏ ఘడియలోనో ఏ లక్షణలేశమో ఏ గుణభాగమో అమ్మలో అవలోకించి దానిని మానవత్వంగా మాత్రమే అర్థం చేసుకుంటే - "ఏనుగూ - గ్రుడ్డివాళ్ళకథ"లోని అంధులం మాత్రమే కాగలము. అపారమైన అమ్మ హృదయ సింధువులో ఏ ఒక్క బిందువునో మనం చూచి 'యింతే' నని భావిస్తే - మన కనులనూ చెవులనూ మనమే మూసుకుని మనకు మనమే అపకారం చేసుకున్నట్లే - అవుతుంది.

ప్రేమానురాగాలు కరువయిన నేటి లోకంలో సర్వత్రా అనురాగమే కురిపించటానికీ, సర్వజీవులయెడ, సర్వవేళలా అనుకంపమే ప్రసరించటానికీ,

ఎప్పుడూ ఎక్కడా ఎవరిలోనూ ఏతప్పునూ ఎన్నని తల్లిగా, మమతల జాబిల్లిగా, రాశీభూతక్షమగా, మూర్తీభవించిన మాతృత్వంగా అమ్మ యీ అవనికి అరుదెంచి నందున.. పిల్లల కోసం పిల్లల యోగక్షేమాలకోసం, పిల్లల ఆనందంకొసం తల్లి పడే తపనా. ఏడిచే పిల్లలను సముదాయించటానికీ సంతోషపెట్టటానికీ తల్లి చెప్పే అల్లిబిల్లి కబుర్లూ, బుజ్జగింపులూ, లాలింపులూతో యదార్థం మఱుగున పడుతున్నది.

మరి - సర్వజ్ఞ అయిన అమ్మ మనం ఏమి అడిగినా 'నాది తెలిసి తెలియని స్థితి' అనటం ఏమిటీ ? 'నాకు తెలీదమ్మా' అన్న సమాధానం ఏమిటీ ? 'నే నేమయినా చదువుకున్నానా ?' అన్న ప్రశ్న ఏమిటీ ? 'నేనూ మీ వంటి దాననే' అన్న పరిహాసం ఏమిటీ ? 'నాకంటే మీరే నయం' అన్న చమత్కారం ఏమిటీ ?

సర్వసమర్థురాలై ఉండీ 'నే నేమీ చేయలేను నాన్నా' అన్న అసత్యవచనం ఏమిటీ ?

తనకూ ఎప్పుడూ అనారోగ్యమట తనకూ భర్తఅట. తనకూ సంసార మట. తనకూ సంతాన మట. తనకూ ఆశా అసంతృప్తులట - ఏమి మాటలివి ? తాను నాటకం ఆడటానికి యివి తెరలు కావూ ?

అమ్మ అవతరణం నుండీ నేటి వరకూ ఏ సంఘటన అవలోకించినా, ఏ సంభాషణ ఆలకించినా అమ్మలో మాయాతత్వమే ఎక్కువగా కనిపిస్తుంది.

ఒకరికి ఒకక్షణంలో దివ్యదర్శనం యిస్తుంది వారిని ఆకాశౌన్నతమయిన విశ్వాస పీఠంపై అధిష్ఠింపజేస్తుంది అంతలోనే వారిని ఆపనిమీదను అవరోహింప జేస్తుంది రెండు క్రియలూ అవ్యాజమే రెంటికి మూలమూ ఒకే కారుణ్యమే. అయినా యీ అంతరం మనకు అర్థంకానిదీ, యీ అద్వైతం మనం అవగాహన చేసుకొనలేనిదీ.

చిన్నతనం నుండీ అమ్మను గన్న తల్లిదండ్రులూ, పెంచిన నాగమ్మా, మరి డమ్మగారూ, చిదంబరరావుగార్లూ, కల్యాణానంద భారతీ, రంగాచార్యులుగారూ -- ఒకదేమిటీ ఎందరో అమ్మ అనుగ్రహం పొందారు. సత్యసందర్శనం చేసుకున్నారు. అయితే ఏమీ - ఎప్పటికప్పుడు అందరూ తెరల్లోనే తెరలతోనే కాలం గడిపారు.

అందుకే చిదంబరరావుగారు --

"అమ్మా నీవు దైవమని తోచిన మరుక్షణంలోనే మళ్ళీ మాపై మాయను కప్పుతావెందుకూ ? ఎన్నాళ్ళీ తెర?" అని అడిగితే.....

అమ్మ చిరునవ్వు నవ్వి "నాకు ప్రపంచంతో అవసరం ఉన్నంత వరకూ" అని చెప్పి మరొక తెరను విసిరింది

నిత్యమూ అమ్మ సన్నిధిలో అనేకానేక అద్భుతాలు జరుగుతున్నా - అమ్మ వాటికి తన కర్తృత్వాన్ని సమ్మతించక 'అది సహజం', 'అదీ నిర్ణయం లోనిదే' అన్న ఒక చిన్న మాటతో తెర విసరి తప్పుకుంటుంది.

"మీ నమ్మకంవల్ల తొలగాయి. నమ్మకమే దేవుడు నాన్నా" అంటుంది అమ్మ

ఒకరు 'మీరు మా యిష్టదైవం రూపంలో కనుపించారమ్మా' - అంటే

"మీ యిష్టదైవమే అమ్మరూపంలో కనుపించిందేమో" అన్నది అమ్మ.

సాక్షాత్తూ అవతారమూర్తి అన్న విశ్వాసంతో సీతాపతితాతగారు అమ్మకు పాదాలు కడిగి పూజచేసుకునీ - నివేదన సమయంలో అమ్మకు పాయసం యిస్తూ అమ్మకు నోరు కాలుతుందేమోనని వెనుకాడారు.

అమ్మను దైవంగా నిత్యం ఆరాధిస్తూ - సర్వ జగత్ సృష్టి స్థితిలయాలకూ అమ్మ పాదద్వయమే ఆధారమని విశ్వసిస్తూనే - ఆ పాదాలు చేతులారా పట్టుకుంటే ఎక్కడ కందుతాయో అమ్మకు ఎక్కడ బాధ కలుగుతుందో నని జంకే సంఘటనలు నిత్యమూ మనం అనేకం చూస్తున్నాము.

అమ్మకు మనపైగల వాత్సల్యం వలెనే మనకు అమ్మపైగల ప్రేమ కూడా అమ్మకూ మనకూ మధ్య తెరనే సృజిస్తుంది.

ఏ విధంగానైతేనేమీ ఎప్పటి కప్పుడు రకరకాల తెరలు, రంగు రంగుల తెరలు, రమణీయమైన తెరలు, మాటలతో తెరలు, చేతలతో తెరలు, అనంత మయిన తెరలు, అసంఖ్యాక మయిన తెరలు ...

అందుకే అమ్మ అన్నది - "నాకూ తెరలు ఉన్నాయి. నేను వేషం వేసుకోవటా నికి ఒక తెర, మీకు చూపించటానికి మరొకతెర-" అని

ఈ తెరలతో ఎవరి విశ్వాసాన్నీ అమ్మ స్థిరంగా ఉండనీయదు.

మరి - అమ్మకు మనపై వాత్సల్య రాహిత్యమా ? అంటే ఏమాత్రమూ కాదని అమ్మ చరిత్రయావత్తూ సాక్ష్యమై మన ఎదుట నిలుచుంటుంది. అసలు వాత్సల్యంతో కాకపోతే అమ్మ మన మధ్యకు వచ్చి మనతో పాటే మనతో గడపవలసిన

అవసరమేమున్నది ? ఇది కేవలం తల్లి అనుగు బిడ్డలతో ఆడుకున్నట్లే. అయితే యిది దాగుడుమూతలాట. ఇక్కడ తల్లి దాక్కుంటుంది. పిల్లలు కనుక్కోవాలి. దేవుడు కనుకనే యీ తల్లి దేవులాడితే దొరకదు. తాను కనికరిస్తేనే కనుపిస్తుంది. అందుకే అమ్మ 'నేను కనపడితే మీరు చూస్తారుగానీ మీరు చూస్తే నేను కనపడను' అన్నది.

కనుకనే ఆ కనికరం కోసమే, ఆ కనువిందు కోసమే మన యీ నిరంతర ప్రార్థనలూ, ఉపాసనలూ, అర్చనలూ, ఆరాధనలూ.

అందుకయినా అమ్మే అనుగ్రహించాలీ, అనుమతించాలీ.

(ఏప్రిల్ 1970)



## తల్లి ధర్మం

నేను ప్రత్యేకించి ఏ ధర్మం కోసమూ రాలేదు. తల్లి ధర్మం కోసం వచ్చాననుకుంటున్నాను. ఈ రూపం అది. ఈ స్థానం అట్లాంటిది. కనుక నాకు ఎవరైనా, ఎట్లాంటివాడయినా బిడ్డే. మీరు నన్ను వెతకటం కాదు. నేనే మిమ్మల్ని వెతుక్కోవాలి. నా బాధ్యత అట్లాంటిది. అందరికీ సుగతి అన్నా నంటే మీదేం లేదు కనుక. మీరు బురద పూసుకున్నా, ఏం పూసుకున్నా దాన్ని కడిగి శుభ్రపరచవలసిన బాధ్యత నాది. దానికి మాతృత్వం కావల్సివచ్చింది, వచ్చాను..

- అమ్మ

# 49
# నలుదిక్కులకూ అమ్మ యశఃకాంతులు

"దేనికయినా సమయం రావాలి నాన్నా--"

అమ్మ నోటినుండి తరుచుగా వినిపించే వాక్యాల్లో యిది ఒకటి. దీనికి అమ్మను గురించిన సాహిత్యరచనా, ప్రచురణలే నిదర్శనం.

లోకాన్ని శుభ్రపరచటానికో, సముద్ధరించటానికో, లోకానికి నవ్య సందేశం అందించటానికో, దివ్య సంగీతం వినిపించటానికో అమ్మ మానవ రూపంలో అవతరించినప్పటికీ - తన విధానంలో మఱుగే ప్రధానంగా ఎంచుకొన్నది. చిన్నతనం నుంచీ ఎందరికి ఎటువంటి మహత్తర అనుభవాలను అనుగ్రహించినా - ఎవరికీ వాటిని బహిరంగ పరచటానికి అమ్మ అనుమతించ లేదు. కనుకనే ఎందరో మహానుభావులూ ఎందరో మహార్షులూ అమ్మను గురించిన ఎన్నో మధురానుభూతులనూ మహనీయసత్యాలనూ తమ హృదయాల్లో నిక్షిప్తం మాత్రమే చేసుకున్నారు.

ఎందరో పండితప్రకాండులూ శాస్త్రపారంగతులూ పీఠాధిపతులూ అమ్మను అతి బాల్యంలోనే సందర్శించినా, సంభాషించినా, దివ్యానుభూతి పొందినా అది వ్యక్తిగతమే అయిందికానీ బహువ్యాప్తం కాలేదు. ఆ రహస్యాన్ని ఆ సత్యాన్ని, ఆ మాధుర్యాన్ని, ఆ విలక్షణానుభవ మధుభాండాన్ని ఎవరికి వారే తమ తమ గుండెల్లో పొదుపుకుని దాని సౌరభమైనా అన్యులకు సోకకుండా భద్రపరచుకున్నారు. అందుకు కారణం వారి స్వార్థపరత్వమనుకునే కంటే అది అమ్మ ఆజ్ఞయే ననుకోవటమే న్యాయంగానూ సముచితంగానూ ఉంటుంది.

ఎట్లా అయితేనేమి 1949లో - అప్పటికి అమ్మ వయస్సు 26 సం॥ మాత్రమే - దేశిరాజు రాజమ్మగారి పుణ్యమా అని అమ్మ కొంతవరకు తన ముసుగు తొలగించుకొనక తప్పిందికాదు. రాజమ్మగారికి దివ్యదర్శనమూ, జ్ఞానమూ తోబాటు సద్గతిని ప్రసాదిస్తూ ఆమె అభీష్టాన్ని అనుసరించి అమ్మ కొందరికి మంత్రోపదేశం

చేయటానికి అంగీకరించటమే గాక కొందరికి మంత్రోపదేష్ట అయిందికూడ. ఆ రాజమ్మగారితోనే అమ్మ తనకు 33వ సం॥ నుండి అనగా 1956 నుండీ తనను తాను తెలియపరచుకోవటానికి వాగ్దానం చేసింది

అవును - తనను తాను తెలియజేసుకోవలసిందే. ఎంత శ్రమించినా ఏ సాధన చేసినా, దైవం అనుగ్రహిస్తేనే, తన్ను తాను వ్యక్తం చేసుకుంటేనే దైవాన్ని ఎవరయినా గుర్తించటమయినా, సాక్షాత్కారం పొందగలగటం అయినా జరుగుతుంది. అందుకే అమ్మ - స్థితులు పొందటంకాదు, యివ్వబడటమే - అని స్పష్టంగా పలికింది. మీరు చూస్తే నేను కనబడను. నేను కనబడితేనే మీరు చూస్తారు - అని ప్రకటించింది తెలియజెప్పేవాడు గురువయినా తెలియజేసెవాడు దైవమే నని ధృవపరిచింది

1924కు పూర్వమే తాతగారికి తన అవతరణవార్తను రహస్యంగా అందించినా, 1923లో తాను అవతరించినా, 1927లోనే తన జగన్మాతృత్వాన్ని ప్రకటన చేసినా 1956 నుండి మాత్రమే క్రమంగా అమ్మ జనబాహుళ్యానికి వ్యక్తం కావటం సమారంభమయింది. ఎవరికివారు వారు పొందిన అనుభూతులను బహిరంగ పరచటమూ, జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మదర్శనం చేసుకుని ఆ అనుభవమాధుర్యాన్నీ ఆ వాత్సల్య రసామృతాన్నీ రుచిచూడమని యితరులను ప్రోత్సహించటమూ ప్రారంభించారు.

ఆ కోరికయే 1959లో ప్రఖ్యాత జర్నలిస్టు అయిన శ్రీ కోటంరాజు రామారావు గారిచే పత్రికద్వారా అమ్మను గురించి లోకానికి పరిచయం చేయాలనే కాంక్షగా పలికించింది. కాని ఆనాడు అమ్మ తర్కవైభవం ముందు రామారావుగారి ఆకాంక్ష మూగవోయి తలవంచింది.

అంటే అమ్మ సిద్ధాంతం ప్రకారం - అప్పటికింకా సమయం రాలేదనే భావించాలి. మరి, అప్పటినుండి ఏతా వాతా ఏ ఒకటో ఆరో గ్రంథ ప్రచురణ జరిగినా 1966 వచ్చేసరికి కేవలం అమ్మను గురించి తెలియజేసే ఉద్దేశంతో మాత్రమే తెలుగూ ఇంగ్లీషులలో విడివిడిగా రెండు పత్రికల ప్రచురణలో బృహత్తర కార్యక్రమం ప్రారంభమయింది. ఆ రెండు పత్రికలూ దేశ విదేశాల్లో సహితమూ అమ్మను గురించీ అమ్మ సందేశం గురించీ విపులంగానూ వివరంగానూ వివరిస్తూనే ఉన్నాయి ఆ పత్రికలు దేశ జాతి మత కుల వర్గ వర్ణ విభేదరహితంగా అనేకులను ఆకర్షిస్తూ అనేకులకు అమ్మ దర్శనప్రాప్తిని కలిగిస్తూనే ఉన్నాయి. వివిద గ్రంధాలు ప్రచురిత

మవుతూ అమ్మ అతినిగూఢహృదయాన్ని ఆవిష్కరించటానికీ, అమ్మ అనురాగామృతాన్ని సర్వులకూ పంచటానికీ ప్రయత్నిస్తూనే ఉన్నాయి.

రాలేదనుకున్న సమయం, అమ్మ చరిత్ర సర్వవ్యాప్తం కావాల్సిన తరుణం వచ్చినట్లున్నది. కనుకనే క్రిందటి నెల అమ్మ జన్మదినోత్సవ సందర్భంగా తెలుగు, తమిళం, ఇంగ్లీషు భాషలలో డక్కన్ క్రానికల్, దినమణి, ఆంధ్రభూమి, జాగృతి, కృష్ణాపత్రిక, విశ్వరచన మొదలయిన దిన వార మానపత్రికల్లో అమ్మను గురించిన వివిధ పరిచాయవ్యాసాలు ప్రచురితమైనాయి. సింహళం నుంచి వచ్చే త్రైమాస పత్రిక ఒకటి అమ్మను గురించిన వ్యాసం ప్రకటించుకోవటానికి మన సమ్మతి నర్థించింది. ఇంకా ఎన్నో భాషల పత్రికలు కూడా అమ్మను గురించిన వివిధ వ్యాసాలను ప్రకటించటానికి ఉత్సాహపడుతున్నాయి.

అంటే జనబాహుళ్యంలో అమ్మను గురించిన చింతన నానాటికీ ప్రవర్ధమాన మవుతున్నది. అమ్మ సందేశాన్ని గురించి ఎంతో పరిశోధన జరుగుతున్నది. అధ్యయనం చేస్తున్నవారూ, అవగాహన చేసుకుంటున్నవారూ తమ సోదరులకు తత్ఫలితాన్ని అందించటానికి తహతహలాడుతున్నారు.

కనుకనే నేడు ఎందరో తమ గుండెల్లో కోవెలలు నిర్మించుకుని అమ్మను సుప్రతిష్ఠితం చేసుకున్నారు. నేడు ఎందరికో అమ్మ ఉపాస్యదేవత, ఎందరికో ఆరాధ్యమూర్తి. ఎందరికో యిష్టదైవం. ఎందరికో యిలవేల్పు, ఎందరికో సద్గురువు. ఎందరికో అనుగు నెచ్చెలి. ఎందరికో ప్రియబాంధవి.

అందరికీ ప్రియతమము పూజనీయము అయిన అమ్మ.

(మే 1970)



## దానం కాని దానం

నేను ఎవరికి ఏమిచ్చినా అది దానం అనుకోటంలేదు. వారి వస్తునే నాదగ్గర ఉన్నది, వారిది వారికి ఇస్తున్నాను - అనుకుంటున్నాను, అందులో నా వదాన్యతా లేదు, ఔదార్యమూ లేదు.

- అమ్మ

# 50
# అమ్మసన్నిధి

ఈ రోజుననే అంటే యీ నెల 15వ తేదీననే నెదర్లాండులోని ఆమస్టర్‌డామ్ లోని ఒక సోదరుని నుండి ఒక ఉత్తరం వచ్చింది. అతను యీ మాసాంతంలో అమ్మ సన్నిధికి వచ్చి ఒక మాసం రోజులు జిల్లెళ్ళమూడిలో గడిపి తన జీవితం ధన్యం చేసుకోవాలని అతని భావన.

అమ్మను ఆరాధించే వారిలో అనేక విధాల వారున్నారు కొందరు అమ్మ మూర్తిని అవలోకిస్తూ నిద్రాహారాలు కూడా విస్మరిస్తారు. అమ్మ దైవమని అమ్మ దర్శనమే పుణ్యప్రదమని తెలిసిన పెద్దలేకాదు, చిన్న చిన్న పిల్లలుకూడా కంటిరెప్ప కదిలించకుండా అమ్మనే వీక్షిస్తూ గంటలు గంటలు కూర్చుంటారు.

కొందరు జిల్లెళ్ళమూడిలో ఆ ఆవరణలో ఎక్కడయినా నివసిస్తూ ఆ పూజాసమయానికి తీర్థప్రసాదాలు తీసుకుని తృప్తిగా జీవిస్తారు.

కొందరు 'అమ్మ' అన్న రెండక్షరాలనే నిరంతరం మంత్రంగా జపిస్తుంటారు.

కొందరు అమ్మ చెప్పిన మాటలనే మంత్రాలుగా మననం చేస్తుంటారు

కొందరికి నామసంకీర్తనమే ప్రాణం.

కొందరు ఎక్కడున్నా... అమెరికాలో ఉన్నా, ఆస్ట్రేలియాలో ఉన్నా అమ్మ తానే స్వయంగా నిర్వచించిన "అమ్మ అంటే అంతులేనిదీ, అడ్డులేనిదీ, అన్నిటికీ ఆధారమైనదీ", "అంతా అదే" అన్న వాక్యాల ననుసరించి అన్ని వేళలా అన్నిటియందూ అమ్మనే దర్శిస్తూ ఉంటారు.

ఒక వ్యక్తిలో శరీరం ముఖ్యమా, ఆత్మ ప్రధానమా అన్న మీమాంస ఎట్లాగున్నా అమ్మ రూపవై[illegible] సందర్శన భాగ్యలబ్ధియే పరమ ప్రయోజనంగా ఎంచుకునేవారు ఎందరో ఉన[illegible] ఆ దర్శనంకోసం ఖండఖండాతరాలనుండీ సముద్రాలూ, కొండలూ దాటి వస్తున

ప్రస్తుతం ఎందరో నిత్యమూ అమ్మను దర్శించుకుని వెళ్ళేవారు కాక అమ్మ సన్నిధిలో రోజులూ, నెలలూ, సంవత్సరాలూ, జీవిత శేషమూ గడపటానికి

ఉవ్విళ్ళూరుతున్నారు - అందుకు వసతి కోసం ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపు తున్నారు. వీలయినంతవరకూ ఉన్న భవనాలలో వసతి కలిపించబడుతున్నది. శాశ్వతంగా ఉండిపోదలుచుకున్నవారి కోసం హైమవతీనగర నిర్మాణం ప్రారంభించ బడింది.

నిత్యమూ వచ్చివెళ్ళే వారిలో రెండు తెగలవారు ఉన్నారు. కొందరు అమ్మ దైవమే అన్న పరమవిశ్వాసంతో వచ్చేవారు. వారు అమ్మను పూజాసమయంలో అమ్మ సింహాసనంపై ఆసీనయై అర్చనలూ నివేదనలూ అందుకుంటూ ఉండేటప్పుడు - అమ్మను పూజించుకుని, టెంకాయ కొట్టుకుని హారతి యిచ్చుకుని తీర్థప్రసాదాలు స్వీకరించి మౌనంగానో, వాచానో తమ తమ కోరికలు విన్నవించుకుని సెలవు తీసుకుంటారు. సామాన్యంగా ఆ సమయంలో అమ్మ అతి గంభీరమై మౌనముద్రా ముద్రితయై అలరారుతుంది. ఎవరికీ ఆ సన్నిధిలో పెదవి కదపటానికి కూడా ఒక్కొక్కప్పుడు అవకాశమూ ఉండదూ, ధైర్యమూ ఉండదు.

ఆ వేళలో ఆ వాతావరణం అతిప్రశాంతంగానూ గంభీరంగానూ ఉద్దీప్తమై వారిని ఒక నూతనలోకంలోకి తీసుకువెళుతుంది. వారి మనసులపై అమ్మ మౌనమూ అమ్మ దృష్టీ మాత్రవేు సామ్రాజ్యం చేనన్తూ వారిని తమ అదుపాజ్ఞలలో బంధించివేస్తాయి. అప్పుడు సర్వాధిపత్యం కలిగిన దైవత్వం మాత్రమే వారి కనులను ఆకట్టుకుంటుంది

ఇక రెండవ తెగవారు యింకా కొన్ని గంటలు ఓపికతో వేచి ఉంటారు అప్పుడు అమ్మలోని దైవత్వం మాతృత్వపు ఉడుపులు ధరించి వారి యెదుట సాక్షాత్కరిస్తుంది. అప్పుడు అమ్మలోని వాత్సల్య పరిమళహరులు వారికి అనుభూత మౌతాయి అప్పుడు అమ్మ సహజగుణమైన అనురాగం సహస్రబాహువులతో మమతలగర్భగుడి అయిన తన ఒడిలోకి వారిని లాక్కుంటుంది. అప్పుడు రసమయి అయిన అమ్మలోని నవరసాలూ పాత్ర ధారణ చేసి వారిని సమ్ముగ్ధులను చేస్తాయి. అప్పుడు కళాప్రపూర్ణ అయిన అమ్మలోని షోడశ కళలూ ప్రఫుల్లమై వారిని ప్రయోద భరితులను చేస్తాయి. అప్పుడు వాగీశ్వరి అయిన అమ్మ స్వరలాలిత్యంతోపాటు సర్వవిద్యల పారంగత్వమూ ప్రస్ఫుటమవుతుంది. అప్పుడు మానవతా మాధవత్వాల రమణీయ సమ్మేళనం ప్రత్యక్షంగా వారు అవలోకిస్తారు.

అయితే -- ఆ ఆనందరసానుభవానికి అవధులున్నాయి. అది నిరంతరమూ సాధ్యం కాకపోవడమే కాదు నిత్యమూ కూడా సాధ్యంకాదు. ఒక్కొక్క రోజున ఒక్కొక్క సమయంలో మాత్రమే ఆ అనన్యలభ్యమయిన అవకాశం అమృతంవలే లభిస్తుంది.

కనుకనే స్థిరనివాసం ఏర్పరుచుకొన వాంఛించే వారి సంఖ్య దినదినప్రవర్థమానమవుతున్నది. కాని ఆ ఆనందప్రద సమయంలో మినహా మిగతా కాలంలో ఆ ఆవరణలో జీవితం మిగతా ప్రపంచంలోనికంటే భిన్నంగా ఏమీ ఉండదు. ప్రపంచంలో ఉన్న వన్నీ అక్కడా ఉన్నాయి. అక్కడా అన్ని వృత్తుల వారూ అన్ని ప్రవృత్తుల వారూ ఉన్నారు. అక్కడా అన్ని గుణాలూ ఉన్నాయి.

అయినా - అమ్మ ఏ వ్యక్తినీ ప్రశంసించదూ, నిరసించదూ. ఏ గుణాన్నీ ప్రోత్సహించదూ, నిరోధించదూ. అన్నిటికీ సర్వసాక్షిగా మాత్రమే అమ్మ భాసిస్తుంది.

మనం ఆ విషయంలో "మా తప్పులు సవరించకూడదా?" అని అర్థిస్తే ---

"తప్పించుకోలేనిదే కదా తప్పు" అని నవ్వుతుంది.

"దుర్మార్గంలో పయనించే మమ్ము అరికట్టరాదా?" అని ప్రశ్నిస్తే - "పరిగెత్తే వాడిని ఎప్పుడూ ఆపకూడదు. వాడు అలిసిపోయి నిలబడినప్పుడు మాత్రమే పట్టుకోవాలి" అని అతిరహస్యంగా చెవిలో చెపుతుంది.

అది ఆశ్రమం కాదు. అక్కడ ఎవరూ కాషాయవస్త్రధారణ చేయరు. అక్కడ ప్రత్యేకమయిన ఏ విధి నిషేధాలూ పాటించబడవు. అక్కడ ఏ ప్రత్యేక జీవన మార్గమూ నిర్దేశింపబడలేదు. అక్కడ ఏ శిక్షా శిక్షణలూ విధింపబడలేవు. అక్కడ ఎవరూ విరాగులూ, సర్వసంగ పరిత్యాగులూ కాదు. అక్కడ అందరూ అతి సామాన్య జీవులు.

కాని వారందరిలో అమ్మపై అచంచలమయిన విశ్వాసం ఉన్నది. వారికి ఏమి వచ్చినా అమ్మ యిచ్చిందని నిర్లిప్తంగా స్వీకరిస్తారు. ఏమి జరిగినా అమ్మ అనుగ్రహఫలితమేనని భావిస్తారు. తాము ఏమి చేసినా అమ్మ చేయిస్తున్నదని విశ్వసిస్తారు కనుకనే అసాధ్యాలనుకొనబడే కార్యాలు సహితమూ అక్కడ అతిసామాన్యులచే నిర్వహింపబడుచున్నాయి. మూకం కరోతి వాచాలం కదా !

అక్కడా కష్టమూ కలుగుతుందీ. నష్టమూ జరుగుతుంది. అయితే ఏ కష్టం కలిగినా ఏ నష్టం వాటిల్లినా వెంటనే మనం అమ్మ పదసన్నిధికి పరుగెత్త వచ్చును. ఆపదుద్ధారిణి అయిన అమ్మ మన ఆపదను అడ్డగించక పోయినా ఆ దర్శనంతోనే మన చిత్తం ప్రశాంతమవుతుంది. మన బాధనంతా విస్మరిస్తాము. మన మనసులోని అవల జ్వాలశీతల జ్యోత్స్నగా మారిపోతుంది.

కనుకనే ఆ చరణ సన్నిధానంలో స్థిరనివాసం కోసం యింత తహతహా, యింత తపనా......

(జూన్ 1970)



# 51
# అమ్మరూపంలోని ఆకర్షణ

ఈ నెల 13వ తేదీ ఉదయం అమ్మపదసన్నిధిలో కొందరం కూర్చున్నాము. మాలో నెదర్లాండ్సునుంచి ఏతెంచిన సోదరులు 'నీలాండు' కూడా ఉన్నారు.

క్రమంగా అత్యల్ప వ్యవధిలోనే వారు ప్రథమకక్ష్య నతిక్రమించి ద్వితీయ కక్ష్యలోకి ప్రవేశించారు. ప్రస్తుతం వారు అమ్మ ఆరోగ్యం గురించీ, అమ్మ విశ్రాంతిలేని కార్యక్రమం గురించీ, అమ్మ నివాసం గురించీ ఆందోళన చెందుతున్నారు.

అమ్మ భౌతికకాయం ఎంతో విలువయినదీ, ఎందరికో ఆరాధ్యమయినదీ కనుక దానిని జాగ్రత్తగా పరిరక్షించుకొనవలసిన బాధ్యతా, అవసరమూ మనపై ఎంతగానో ఉన్నాయని వారి సంభావన. ఔను - అమ్మ అంటే అంతులేనిదీ అడ్డులేనిదీ అన్నిటికీ ఆధారమయినదీ సర్వకాల సర్వావస్థలలో విరాజిల్లేదీ కావచ్చును. అంటే అమ్మ యీ భౌతిక కాయం స్వీకరించి ఈ ధరామండలానికి విజయంచేయకపూర్వమూ అమ్మ ఉన్నది. మరి, అయితే ఆ అమ్మను ఎందరు గుర్తించగలిగారు ? ఆ అమ్మను ఎందరు దర్శించ గలిగారూ ? ప్రస్తుతమయినా, అమ్మసర్వవ్యాపకత్వంలో మన కందరకూ ప్రగాఢ విశ్వాసం ఉన్నా - మనకు జిల్లెళ్ళమూడియే యాత్రాస్థల మయినదేమీ ? అమ్మ దర్శనం ప్రసాదించటంలో ఒక్కగంట విలంబన అయితే మనలో యీ తహతహా యీ తపనా ఎందుకూ ? ఒక్కదినం ఆ నివాసపు తలుపులు బంధింపబడితే మనలో చైతన్యమే స్తంభించి పోతుందేమీ ?

అదే ఆ మూర్తిలోని ఆకర్షణ. అదే ఆ ఆకృతిలోని విశేషం. ఆ దివ్యదర్శనమే సర్వార్థ సాధకము.

కనుకనే ఆ దేహసంరక్షణపరమకర్తవ్యాన్ని వారు మనకు ప్రభోధం చేయటం కాకపోయినా, ప్రస్ఫుటం చేశారు

తదుపరి అమ్మకు అన్ని వసతులూగల నివాసం నిర్మాణం చేయాలని ఆశించారు. అందుకు రేఖా భవనం' రచించారు. దానిని వివరిస్తూ.. దర్శనార్థం

ప్రజలు అధిక సంఖ్యలో అరుదెంచినప్పుడు అమ్మ అల్పవ్యవధిలో వారికి దర ప్రసాదించటానికి అనుకూలంగా సౌధోపరిభాగాన అమ్మ నిలుచుండేటట్లునూ, వసుధపై నిలుచుని అమ్మను దర్శించేటట్లునూ ఉద్దేశించారు.

అప్పుడు మేము అడిగాము - అమ్మ పావన పాదాలు స్పృశించనిదీ, అమృత హస్తం మీదగా తీర్థమో, ప్రసాదమో స్వీకరించనిదీ వారికి తృప్తి కలుగుతుందా - అని.

వెంటనే అమ్మ అన్నారు - అట్లా తృప్తియే కలిగితే, ఆ అవసరమే వస్తే ఎక్కడివారికి అక్కడ కనిపించనా ? ఈ ఏర్పాట్లన్నీ ఎందుకూ - అని.

అవును - అప్పుడు జిల్లెళ్ళమూడితో అవసరం ఏమిటీ ? ఈ మూర్తి ఆధారమెందుకూ ? అమ్మ ఎక్కడ భాసించడం లేదూ ? ఏది అమ్మకాదు ? అమ్మ పూజకు అర్థం ఏమిటీ ? అమ్మకు అర్పించే నివేదనలకుగానీ, అమ్మ నుండి పొందే ప్రసాదాలకుగానీ ఆస్కారమేమున్నదీ ? అమ్మవాక్కుతో నిమిత్త మేమున్నదీ ? సర్వరూపాలూ, సర్వ ప్రేరణలూ అమ్మవేకదా ... ?

కాదు - మనం అట్లా భావించటంలేదు. మనం అమ్మను దర్శించాలి. అమ్మవాక్కు శ్రవణం చేయాలి. అమ్మ పాదస్పర్శ చేయాలి. మనం శాంతినీ హాయినీ తృప్తినీ ఆనందాన్నీ పొందాలి.

అందుకు జిల్లెళ్ళమూడీ కావాలీ, ఈ మూర్తీ కలకాలమూ మన మధ్య శోభిల్లాలి. మనమేకాదు మన అనుజులూ పరంపరానుగతంగా యీ పరమోత్కృష్ట అదృష్టాన్ని పొందగలిగి పునీతులై పరవశించాలి.

(జూలై 1970)



## అమ్మసంకల్పం

అమ్మసంకల్పం జరగటం కాదు. జరిగిందే అమ్మ సంకల్పం.

- అమ్మ

# 52
# స్థానికులకు అమ్మ చేసిన ఉపదేశం

సృష్టిలో ప్రతిప్రాణీ తన సుఖాన్ని కాంక్షిస్తుందనటం నిర్వివాదాంశం. అందులో మనిషి మనస్వి కనుక మనిషికి సుఖం రెండు విధాలు - శారీరకమూ, మానసికమూ, అని, మనిషి మనీషి కూడా కనుక తన అనుభవంతో అనేక గ్రంధాలూ, శాస్త్రాలూ, మతాలూ సృజించుకున్నాడు అయినా -- మనిషి భావుకుడు కూడా అయినందున కనిపించే లోకానికి అవ్వల ఏమేమో లోకాలున్నాయని ఊహించాడు. తనకు అనుభవించే జీవితంలోని తీపీ చేదులకు కారణాలు కానరానందున - పూర్వజన్మను ఊహించి వర్తమాన జన్మకు దానిని పునాదిగా గ్రహించి, పరజన్మ భావనలో భయకంపితుడయినాడు.

కనుకనే ఈ లోకంలోని సుఖంకంటే పరలోకంలోని ఉత్తమగతుల నాశించ మార్గాన్వేషణ కుపక్రమించాడు. అందుకు భిన్నభిన్న వ్యక్తులు భిన్న భిన్న మార్గాలు చూచి, చూపి గ్రంథస్థం చేశారు.

ఒకడు పరలోకమే చూచాడో, పరతత్వాన్నే అనుభూతం చేసుకున్నాడో, పరంధామునే ప్రత్యక్షం చేసుకున్నాడో, పరమపదాన్నే సాధించాడో - తాను ఆ ఒక్క పథాన పయనించి గమ్యం చేరితే, అసంఖ్యాకులు పయనించిన అసంఖ్యాక మార్గాలు నేటి మనిషిని గజిబిజి పరుస్తున్నాయి. ప్రతివాడికీ కనిపించేయీలోకం కన్నా ఉన్నతమయినదీ. ఉత్తమ మయినదీ, ఉత్కృష్టమైనదీ ఊర్ధ్వలోకమేదో ఉన్నదనీ... అక్కడ పరమాత్మో పరంజ్యోతియో అవిచ్ఛిన్నంగా జ్వలిస్తూ ఉంటుందనీ, పరంధాముడో, పరమేశ్వరుడో అప్రతిహతంగా రాజ్యం చేస్తుంటాడనీ, ఆ సన్నిధిలో వైకుంఠమో, కైలాసమో, కైవల్యమో, మోక్షమో, సుగతో శాశ్వత సుఖశాంతులను ప్రసాదిస్తాయనీ విశ్వాసం.

అందుకు యీ లోకాన్ని ధిక్కరించి, యీ శరీరాన్ని హింసించి, యీ సుఖాలను త్యజిస్తే కానీ ఫలితం ఉండదనీ నమ్మిక. అందుకై నిరంతరం ప్రకృతితో పోరాటం.

మనస్సులో ఆరని ఆరాటం. ఏదో బాహ్యంగా సాధించాలని తపనా. ఏదో అంతరంగికంగా ఛేదించాలని తపస్సూ కాని అందుకు ఏమీ చేయాలో నిర్దిష్టంగా తెలియదు ఏమార్గాన పోతే ఏ గమ్యం చేరుతారో తెలియదు. ఏ ప్రయత్నానికి ఏ ఫలితం పొందుతారో తెలియదు. ఏ సాధనకు ఏ సిద్ధి ప్రాప్తిస్తుందో తెలియదు. ఏవ్యాపారానికి ఏం లాభిస్తుందో తెలియదు. అందుకే ప్రతివాడికీ మార్గదర్శకుడు కావాలి ప్రతివాడికీ జ్యోతిష్కుడు కావాలి ప్రతివాడికీ గురువు కావాలి. ప్రతివాడికీ సలహాదారు కావాలి

ఆ ప్రయత్నంలోనే కొందరు అమ్మ చెంతకు చేరుతారు. అమ్మను మార్గం చూపించమనో, సాధన బోధించమనో ఉపదేశం ప్రసాదించమనో ప్రాధేయ పడుతుంటారు. సర్వమూ తెలిసిన సర్వమూ తానయిన అమ్మ ఎవరికయినా పొందవలసినది ఎక్కడనో ఎప్పుడో లేదంటుంది.

ఈ నెల 17వ తేదీన అమ్మ సన్నిధిలో కొందరం కూర్చున్నాము అందరికీ సులభసాధ్యమైన సాధన ఏదైనా చెప్పమని వేడుకున్నాము అమ్మ ఎంతకూ అంగీకరించలేదు. చివరకు అడిగాము "పోనీ అమ్మా-- అందరికీ ఏ సాధన చెప్పకపోతే మానే. మఱి, మేము నిన్ను నమ్ముకుని నీ సన్నిధికి చేరాము కదా. మాకు ఏ ఉపదేశమూ చేయకపోతవి. మేము ఏ సాధనా చేయటం లేదాయె. కాలమేమో గతించిపోతున్నది. మరి ఎట్లాగూ?" అని

అప్పుడు అమ్మ ప్రసన్నంగా నవ్వుతూ -- "అయితే సరే. మీకు నేను పెట్టిందేదో తిని హాయిగా ఉండండి. మీకు నేను యిచ్చిందేదో యిక్కడకు వచ్చిన పదిమందికీ ఆదరణతో సంతోషంగా పెట్టండి యిదే మీకు సాధన" అన్నది.

అమ్మ ఏమీ చెప్పలేదు అన్నది ఆనాటితో పోయింది. ఇక సాధన మాత్రం మిగిలింది.

(ఆగష్టు 1970)



# 53
# సర్వార్థ దాత్రి

నిత్యమూ సామాన్యంగా పదకొండూ పన్నెండు గంటల సమయంలో జిల్లెళ్ళమూడిలో అమ్మ దర్శనం ప్రసాదింపబడుతుంది. అమ్మ కుర్చీలోనో మంచంమీదనో సుఖాసీన కాగా ఆనాడు అక్కడ ఉన్న ప్రజలందరూ తమతమ మతానుసారమూ, అభిమతానుసారమూ అమ్మను అర్చించుకుని తీర్థప్రసాదాలు స్వీకరిస్తారు సామాన్యంగా అమ్మ ఆ సమయంలో మౌన ముద్రాలంకార సంశోభిత అయి మాత్రమే కొలువుతీరి ఉంటుంది కన్నులు ఎంతో నిర్మలంగానూ, ప్రసన్నంగానూ, తేజోవంతం గానూ భాసిస్తూ . ఒక్కోసారి నీటిలోని మీనములవలే వేగంగా అటూ యిటూ సంచలింపజేస్తూ . అందరిపై కరుణావృష్టి కురిపిస్తూ అమ్మలోలాక్షి అన్న తన నామాన్ని స్మృతికి తెస్తూ ఉంటుంది.

పూజానంతరం అందరూ భోజనాలు చేస్తారు అప్పుడు అమ్మ మళ్ళీ సుస్నాత అయి సద్యోవికసిత సౌగంధికంవలే దరహాసరోచులు వెదజల్లుతూ పర్యంకాసీన అయి దర్శనం అనుగ్రహిస్తుంది ఆ సమయంలో

కొందరు ఆరోగ్యం గురించీ కొందరు ఐశ్వర్యం గురించీ

కొందరు ఉద్యోగం గురించీ కొందరు ప్రమోషన్ గురించీ

కొందరు వివాహం గురించీ కొందరు సంతానం గురించీ

కొందరు భౌతిక సుఖాల గురించీ కొందరు మానసిక శాంతి గురించీ

ఆర్థిస్తే - మరి కొందరు జ్ఞానమార్గమో యోగసాధనో మంత్రోపదేశమో మనస్సు నిలపమనో కాంక్షిస్తారు

అమ్మ ఆ కోరికలకు మౌనంతోనూ కుంకుమతోనూ సమాధానం ప్రసాదిస్తుంది. అంటే అమ్మ అనుగ్రహ ప్రసారానికి సంకేతం మాత్రమే కుంకుమ ప్రసాదం కనుకనే అమ్మకుగానీ మనకుగానీ అమ్మ వాక్కుతో ప్రమేయంలేదు అమ్మ కరుణ మనకు

సర్వమూ ప్రసాదించటానికి సమర్థమైయున్నప్పటికీ అమ్మకు ఏనాడూ "ఇట్లా చేస్తాను అట్లా చేయగలను" అని ఉద్ఘాటించటంగానీ - అమ్మకు మన యావజ్జీవితమూ విదితమయినప్పటికీ "ఇది అట్లా జరుగుతుంది, అది యిట్లా అవుతుంది" అని తమోమయమయిన మన భావిపథంలో కాంతిప్రసారం చేయడంగానీ అలవాటు లేదు.

అమ్మ అందరి కోరికలకూ పరిపూర్తీ ఫలితమూ మౌనంగానే ప్రసాదిస్తున్నప్పటికీ - కొందరి ప్రశ్నలకు వాణి ఆవశ్యక మవుతుంది. అందుకు అభ్యంతరం చెప్పక అమ్మ వాగ్దేవత అయి సర్వ విషయాలూ సాకల్యంగా వివరిస్తుంది.

అందువల్ల నిత్యమూ అవసరమైతే కొంత సమయం 'విన్నపాల'కు ప్రత్యేకించబడుతుంది.

పూజ సామూహికంగా జరిగినా యీ విన్నపాలేర్పాటు మాత్రం అవసరమయితే ఏకాంతంలోనూ జరుగుతుంది. ఎవరికీ అభ్యంతరంలేకపోతే బహిరంగంగానూ జరుగుతుంది.

ఈ నెల 13వ తేదీన ఆనాడు దర్శనార్థం అరుదెంచిన వారందరూ ఒక్కరొక్కరే అమ్మ వద్దకు వచ్చి తమతమ బాధలూ కోరికలూ విన్నవించుకున్నారు. అమ్మ అందరినీ ఆప్యాయతతో అనుగ్రహించింది

అందరూ వాళ్ళ కష్టాలు మాత్రమే చెప్పుకున్నారు. వారి కోరికలు మాత్రమే విన్నవించుకున్నారు.

కాని చివరకు ఒక అనంతరపురం సోదరి వచ్చింది. ఆమెకు జీవితంలో కష్టమేమీ లేదుట. సర్వ సంపదలూ ఉన్నాయట. ఇంతవరకూ ఆమెకు కోరటానికి ఏమీ కనుపించలేదుట.

ఎంత అదృష్టవంతురాలు !

కానీ నాడుమాత్రం ఆమెకు ఒక కోరిక కలిగింది.

'అమ్మా- నీవు నావెంట రావాలి. మా యింటికి రావాలి. మా యిల్లంతా నీవే నిండిపోవాలి" అన్నది. ఆ కంఠంలో ఆర్తి ఉన్నది.

ఎంత చక్కని కోరిక !

మిగతా అందరూ అమాయకంగానూ, అజ్ఞానయుతంగానూ ఎవరికి ఏది అవసరమో వారికి దానిని ప్రసాదించే అమ్మను వారు అట్లా ప్రత్యేకించి కోరుకుంటే యీమె కోరిక ఎంత ఉన్నతంగా ఉన్నదీ - అనుకున్నాము

కానీ వెంటనే స్ఫురించిందీ - "అమ్మా --- నీవెప్పుడూ నాగుండెలో ఉండిపో నా మనసంతా నిండిపో" అని ప్రార్థించలేకపోయిందే - అని.

కాని ఆ వెంటనే స్ఫురించింది - సర్వాంతర్యామిని అయిన అమ్మ ఏ గుండెలో లేదూ ? సూది మొన సందులేక సర్వవ్యాప్తం అయిన అమ్మ ఏ మనస్సును వెలితిగా ఉంచిందీ ? - అని

మరి యిక అమ్మను ఏమి కోరుకోవాలి ? ఏ కోరిక అర్ధవంత మయిందీ ?

కాని ఆ క్షణంలోనే మళ్ళీ స్ఫురించింది - అందరి కోరికలకూ అన్ని ప్రశ్నలకూ ప్రేరణ అమ్మదే అయినప్పుడు యీ విచికిత్స మన కెందుకూ ? - అని

(సెప్టెంబరు 1970)



## పూర్ణయోగం

ఎవరు దగ్గర లేరను కుంటున్నావో, ఎవరు కావాలను కుంటున్నావో, వారిని ఆవేదనతో ఆరాధిస్తున్నావు. ఆరాధన అంటే ఆవేదనే నమ్మా ! ఏడుపు అంటే కళ్ళ నీళ్ళు కాదుగా ? హృదయాన్ని దగ్ధంచేసే అగ్ని ప్రవేశించి దహనం చేస్తున్నది. అది సర్వ మమతలనూ, రాగద్వేషాదులనూ దహనం చేసే మహాయోగం. అదే అందరూ సర్వ సామాన్యంగా చెప్పుకునే హఠయోగం; అదే భక్తి (యోగం), సర్వకాల సర్వావస్థలయందూ ఉన్నప్పుడు అదే జ్ఞానం. అదే నిష్కామకర్మ. అదే సర్వమూ.

- అమ్మ

# 54
# తెర

ఈ నెల 18వ తేదీ సాయంకాలం కొందరం అమ్మ పదపంకేరుహ సౌరభాల నాఘ్రాణిస్తూ ఉపవిష్టులమై ఉన్నాము

అంతలో తిరువూరునుండి వచ్చిన సోదరు లొకరు వారి అనుభవ అనుభూతులను వివరించి వారి సందేహాలను విన్నవించి అమ్మ ఏ అవతారమో స్పష్టపరచి భక్తులకు సందేశం ప్రసాదించమని అమ్మను వేడుకున్నారు

అమ్మ తనకు భక్తులు ఎవ్వరూ లేరనీ అంతా బిడ్డలు మాత్రమేననీ పునరుద్ఘాటిస్తూ తాను ఏ దేవత అవతారమూ కాదనీ తాను అమ్మను మాత్రమేననీ ప్రకటించింది

వెంటనే మేము అడిగాము ---

అమ్మా -- నీవు ఏ దేవత అవతారమూ కాకపోతే ఎందరికో వివిధ దేతామూర్తులతో దర్శనమిస్తున్నావు కదా వారు చూస్తే నీవు కనపడటం కాదు. నీవు కనుపిస్తేనే వారు చూస్తారాయె - మరి, దానిలోని అంతర్యమేమిటీ ? అని.

మరి - అమ్మ తన బాల్యం నుండీ ఎందరికో వివిధరీతుల దర్శనం ప్రసాదించింది లక్ష్మణాచార్యులుగారికి బాలాత్రిపురసుందరిగా, ప్రఖ్యాసుబ్బయ్య గారికి లలితగా, మూల్పూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి రాజరాజేశ్వరిగా, మన్నవ రామబ్రహ్మంగారికి సీతగా, యార్లగడ్డ రాఘవయ్యగారకి దుర్గగా, ప్రసాదరాయకులపతి గారికి చండచండికగా, మన్నవ బుచ్చిరాజుగారికి భూదేవిగా విద్యాసాగర్‌గారికి శ్రీదేవిగా, భవానీప్రసాద్‌గారికి సరస్వతిగా వివిధ దేవ్యవతారాలతో సాక్షాత్కరించటమే కాక గంగరాజు పున్నయ్యగారికి మురళీధరుడుగా గుండేలురావుగారికి కోదండరాముడుగా, తురుమెళ్ళ వెంకటప్పయ్యగారికి సత్యనారాయణస్వామిగా, ముద్దనరామయ్యగారికి వెంకటేశ్వరస్వామిగా .. మరెందరికో మరెన్ని దైవ స్వరూపాలుగానో అమ్మ ప్రత్యక్షమయింది.

"నేనూ మీలాంటి మనిషినే" అనీ "నేను అమ్మను మాత్రమే" ననీ అమ్మ మాటల్లో వినిపింపజేసినా అమ్మ చేసే ప్రతి క్రియలో అమ్మ ప్రసాదించే ప్రతి

దర్శనంలో అసాధారణత, అసామాన్యతలతో కూడిన దైవత్వమే అమ్మలో ప్రస్ఫుటమవుతుంది

నిత్యమూ అసంఖ్యాకులు అమ్మను అర్చించుకుంటున్నప్పటికీ దేవీ నవరాత్ర ఉత్సవాలలో అమ్మకు జరిగే పూజలు బహుధా విశేషంగా ఉంటాయి ఆప్త మిత్రునివలే ఆత్మబంధువువలే ఎంతో ప్రసన్నంగా ఎంతో సన్నిహితంగా మనతో మనలో మెసలే అమ్మ గంభీర వదనయై ఉన్నతాసీనయై దుర్గమమై దుర్లభయై విరాజిల్లుతుంది ఆ సమయంలో నిరంతరం ఆ బింబాధరాలపై లాస్యం సలిపే కమనీయ దరహాసం కనుపించదు ఆ కందోయినుండి వెల్లి విరిసే శరశ్చంద్రికలు దృగ్గోచరంకావు ఆ వచస్సులో వినిపించే అనురాగం ద్యోతితం కాదు ఆకరస్పర్శలో లాలన స్ఫురించదు

ఆ దరహాసంలో దర్పమూ ప్రతిఫలిస్తుంది ఆ శరశ్చంద్రికలో భానుకిరణమూ ప్రతిబింబిస్తుంది ఆ అనురాగంలో అధికారమూ ప్రతిధ్వనిస్తుంది. ఆ కరచాలనంలో అప్రతిహతమైన పాలనా తాండవిస్తుంది ప్రతి అవయవంలోనూ భాసించే మధుర మాతృత్వ స్థానంలో మహితదైవత్వం జ్వాజ్వల్యమానమై ప్రకాశిస్తుంది ఆ దీప్తిముందు ప్రతి శిరస్సూ అవనత మవుతుంది ఆ మూర్తిమ్రోల ప్రతి కరయుగళీ ముకుళిత మవుతుంది.

ఈ సంవత్సరం దేవీ నవరాత్రి ఉత్సవాలు ప్రతి సంవత్సరంకంటే అతివైభవంగా జరిగాయి. ఈ ఉత్సవాలలో అష్టమినాటి రేయి జరిగిన పూజ పతాకస్థాయి నందుకున్నది. ఆనాడు అమ్మ రక్తవర్ణ దుకూలధారిణియై కిరీట సంశోభితయై త్రిశూల చక్రహస్తయై ప్రసాదించిన దర్శనం అపూర్వమూ నిరుపమానమూ అయినది. ఆ రాత్రి స్వామి పూర్ణానంద సశిష్యులై అమ్మను అర్చించుకున్నారు.

పూజ జరుగుతున్నది, రత్నఖచితమయిన కిరీటం అమ్మ శిరస్సును అలంకరించగా కరయుగళి త్రిశూలమూ చక్రమూ అందుకొనగా అమ్మ దర్శనం ఆహ్లాదకరమే కాదు దుర్నిరీక్ష్యమూ అయినది. క్షణాల్లో అమ్మ రూపంలోనే పరిణామం గోచరించింది నయనద్వయంలో సంధ్యారుణదీప్తి వ్యాప్తమయింది. వదనమండలంలో గులాబీ గుత్తులు విరిశాయి కరయుగళిలోని త్రిశూలమూ చక్రమూ వివిధరీతుల తాండవం చేశాయి పరివేష్టిత ప్రజాసందోహం భయ భ్రాంతి చకితమయింది. అంతలో స్వామీజీచే అందాకా అర్చింపబడిన కలశాన్ని త్రిశూలపు మొనతో అమ్మ చివాలున పైకియెత్తింది ఆ కలశం జలప్రపూర్ణమై ఉన్నా ఆ కలశాన్ని తలక్రిందులుగా పైకియెత్తినా అందులోని ఒక్క నీటిబిందువూ క్రిందపడకపోవటం అత్యాశ్చర్యకరమయినా అప్పటి అమ్మ మూర్తీ, అమ్మ చేతిలోని త్రిశూలమూ, ఆత్రిశూలపు చివరన ఊగే కపాలం పోలిన కలశమూ అవలోకించిన ప్రజలు భయకంపితులవుతుండగా అమ్మ ఒక్క మెరుపు మెరిసినట్లు లేచి

నిలుచున్నది సామాన్యంగా వామనమూర్తివలే పరిథవిల్లే అమ్మ క్షణంలో గగన పరిచుంబితగా ప్రవృద్ధమైందా అనిపించింది. అందాకా దుర్గవలే దుర్నిరీక్ష్య అయిన అమ్మ వైకుంఠపురీ నివాసుడయిన సాక్షాత్ శ్రీమన్నారాయణునివలె ప్రత్యక్షమయింది. ఆ ముహూర్తంలో ఆ పందిరిలో ఆనందమో, ఆశ్చర్యమో, భయమో - ఆ మూడు ముప్పిరిగొన్న మరి యే భావమో సర్వవ్యాప్తంకాగా ప్రజలు స్థాణువులే అయినారు.

ఆ ఉత్సవాలూ అప్పటి అమ్మ రూప వైభవమూ స్ఫురణకు వచ్చి అమ్మలోని మానవతా మాధవత్వాల పసిడి సారథిని స్మరిస్తూ అమ్మతో ప్రసంగం చేస్తూ ఉండగా స్వామీ పూర్ణానంద గదిలోకివచ్చి ఆసీనులయినారు

వెంటనే సోదరులు దుర్గాప్రసాదరావుగారు అమ్మను గురించిన వారి అభిప్రాయాన్ని అర్థించారు. 'అమ్మ' అనటంలోనే సర్వదేవతలకూ ఆధారమయిన దన్న భావం ఉన్నదిగదా అన్నారు స్వామీజీ, "Please clear whether Amma is Mother or Father" అని మళ్ళీ అడిగారు ప్రసాద రావుగారు. వెంటనే స్వామీజీ "Mother of Father" అన్నారు. ఆ సమాధానం మమ్మల్ని సమ్మోహితులను చేసింది. కాని దుర్గాప్రసాదరావుగారు "Father of Mother కూడానా?'' అని అడిగారు. "No Mother of all. Mother means Origin of everything" అన్నారు. స్వామీజీ.

అమ్మ - అన్నిటికీ అంతకూ ఆధారభూతమయిన పరబ్రహ్మ అయి ఉండీ అమ్మ అనే యీ మేలిముసుగు ఎందుకో ?

మనలను మాయామోహితులను చేసేందుకా ? మన చక్షువులకు తెరలు వేసేందుకా ? మనలను పరీక్షించేందుకా ?

అనుకుంటూ అడిగాము -

అమ్మా, నీవు దైవానివని పరోక్షంగానూ, అపరోక్షంగానూ కూడా విశదపరుస్తూ యింకా యీ అమ్మ అనే తెర ఎందుకమ్మా - అని.

''మనం నిర్భయంగా ఆ ఒడిలో చేరటానికేమో, అమ్మ దైవంగానే కనుపిస్తే మనం దరి జేరగలమా ? దైవం అమ్మగా కనుపిస్తున్నాడు కనుకనే మన యీ ఆటలూ పాటలూ....'' అన్నారు ప్రసాదరావుగారు నవ్వుతూ నయనయుగళి అశ్రుపూర్ణంకాగా.

నిర్ధారణకోసం అమ్మవంక చూచాము మేము. సమాధానంగా అమ్మ కన్నుల్లో పెదవులపై దరహాసద్యుతులతో కూడిన వాత్సల్య జ్యోత్స్నలు వెల్లి విరుస్తూ కనుపించాయి.

మనం ఏమంటే కాదంటుంది అమ్మ ?

(అక్టోబరు 1970)



# 55
# కల్పవృక్షం హైమాలయం

అప్పుడే రెండున్నర సంవత్సరాలయింది అర్కపురీ సరోవరంలో హైమాలయ సంకేరుహం సముద్భవమై. అప్పుడే ఆ సంకేరుహం సహస్ర దళాలతో ప్రఫుల్లమై పరిఢవిల్లింది అప్పుడే ఆ పరిమళలహరులు జగద్వ్యాప్తమయి దిగంతాలను సుగంధభరితం చేశాయి. అప్పుడే అవి ఎన్నో అత్యద్భుతాలను చేస్తూ ఎందరినో సమాశ్రితులను సముద్ధరిస్తూ సమ్మోద భరితులను చేస్తున్నాయి.

అవును - హైమవతీదేవి అమ్మగర్భవాసాన జనియించింది అమ్మ చల్లని నీడన పెరిగింది జీవితంలోని కష్టసుఖాల చవిచూచింది. లోకంలోని దీనుల పరివేదన కన్నదీ, పరిదేవన విన్నదీ. కనుకనే హైమ ఎవరికీ ఏ కించిత్తు కష్టం సంభవించినా యీషన్మాత్రమూ సహించలేని నవనీత హృదయగా పరిణతి చెందింది. ఎవ్వరి కపోలాన ఒక్క కన్నీటి బిందువు కనుపించినా - అది హైమహృదయంలో శోక సింధువునే పోటెత్తిస్తుంది.

అందుచేతనే హైమాలయంలో ఎవ్వరు ఏమి అర్థించినా అది వెంటనే సఫలీకృతమవుతూ - హైమ కామధేనువు వలే, కల్ప భూరుహం వలే కామదాయిని అనీ లోకంలో ప్రసిద్ధమయింది.

కాని అమ్మమాత్రం ఏ బిడ్డకూ అడిగిందెల్లా పెట్టదు. కోరికల పూల సన్నిటినీ కాయలుగా మార్చి పండించదు ఎన్నో కోరికల వల్లరులు పూలుపూయకనే, పూసిన పూలు కాయలుగా మారకనే, కాసిన కాయలు పండకనే, పండ్లు సద్వినియోగం కాకనే వ్యర్థం కావలసిందే. తీనెలు పండిపోతూన్నా, పూవులు వాపోతున్నా, కాయలు రాలిపోతున్నా, పండ్లు కుళ్ళిపోతున్నా - అమ్మ నిర్లిప్తంగా చూస్తూ ఉంటుంది.

అంత మాత్రంచేత అమ్మను కఠిన హృదయ అనిగానీ, కారుణ్యరహిత అనిగానీ, అనురాగపూజ్య అనిగానీ అనటం ఎట్లా ?

కానీ - అనుగ్రహానికి అమ్మ యిచ్చే నిర్వచనం వేరు. ఎవరికి ఎప్పుడు ఏది అవసరమో దాని నివ్వటమే అనుగ్రహం - అని అమ్మ భావన ఎవరి అవసరమయినా వారికంటే అమ్మకే ఎక్కువ తెలుసు.

ఏది అనుభవానికి వస్తే దానిని హాయిగా అనుభవించటమే సుఖమంటుంది అమ్మ - అది కష్టమయినా సరే, సుఖమయినాసరే కానీ మనకేమో కష్టం భరించలేనిదిగా ఉంటుందీ, సుఖం ఎంత అనుభవించినా తృప్తి ఉండదూ కనుక మనకు ఆపదల యెడల విసుగూ విముఖత్వమూ, ఆనందం కోసం అభ్యర్థనా నిరీక్షణా సహజం.

అమ్మ మన అభ్యర్థనను ఆలించి మన బ్రతుకుబాటలో కంటకాలను తొలగించదూ, మన బ్రతుకుతోటను నందనవనంగా మార్చదూ చీకటి మనకేమో మార్గ నిరోధక మయితే అమ్మేమో చీకటే వెలుతురున కాధారమంటుంది మనమేమో ద్వంద్వాలతో బాధితులమవుతూంటే అమ్మేమో ద్వంద్వాలూ భగవంతుడే నంటుంది

మనకు అమ్మయందు విశ్వాసమూ, మనం అమ్మ ప్రేమకై ఆకర్షితులమూ - అయినా, అమ్మ తత్త్వజలధిలో తరం దొరకక తికమకపడుతూ సతమతమవుతూ ఉంటే అమ్మే మనలను దయతలచి రేవు చూపింది

ఆ రేవు హైమాలయం.

అందుకనే -

అక్కడనే మన మనస్సులకు శుద్ధీ.

అక్కడనే కోరికలకు సిద్ధీ.

(నవంబరు 1970)



ఎవరి అన్నం వాడికుంటే వాడు తింటున్నాడు. ఎవరికి ఎవరో పెట్టేదేముంది ? - అమ్మ

# 56
# అర్పణమే పరిపూర్ణత

'అమ్మా - డబ్బు ఉన్నది ఇల్లు కట్టుకోవాలని అనుకుంటున్నాను పెంకుటిల్లు కట్టు కుండేదా ? డాబా వేసుకుండేదా ?'

"నీ యిష్టం నాన్నా - నీ దగ్గరున్న పైకం మొత్తాన్ని బట్టీ, నీ అభిరుచిని బట్టీ కట్టుకో-"

★ ★ ★

'అమ్మా - అబ్బాయి చాలా తెలివయినవాడు, మెడిసిన్ చదివించమంటారా? ఇంజనీరింగ్ చదివించ మంటారా?'

"వాడి యిష్టప్రకారం చేయండి నాన్నా-"

★ ★ ★

'అమ్మా - ఏదయినా సాధన చేయాలని అనుకుంటున్నాను ఏమి చేయమంటారు?'

"నీ యిష్టం నాన్నా - నీకేది మంచిదనితోస్తే అదిచెయ్యి-"

★ ★ ★

'అమ్మా - ఇంటి కట్టుబడి పూర్తి అయింది, గృహప్రవేశం ఎప్పుడు చెయ్యమంటారు?'

"మీకు ఎప్పుడు మంచిదనిపిస్తే అప్పుడు చెయ్యండి నాన్నా-"

★ ★ ★

'అమ్మా - నీ సన్నిధిలో నాలుగురోజులు ఉందామని ఉన్నదమ్మా-"

"మీ యిష్టం నాన్నా, మీకు ఉందామనిపిస్తే ఉండండి-"

★ ★ ★

'అమ్మా - ఈ కష్టాలు పడలేనమ్మా చచ్చిపోవాలని ఉందమ్మా-''

''నీ యిష్టం నాన్నా - అది నీ చేతిలోనే ఉంటే అట్లాగే చెయ్యి-''

★ ★ ★

అమ్మ యీ నిర్లిప్త హృదయమూ, యీ ఉదాసీనతా, యీ తటస్థ విధానమూ మొట్ట మొదటిగా అర్థం చేసుకొనటం ఎవరికయినా కష్టమే. సోదరులు శ్రీ మొసలికంటి తిరుమలరావుకూడా ఆ కష్టాన్ని ఎదుర్కొన్న వారి నుండి మినహాయింపు కాలేదు.

అయితే - అమ్మ వ్యక్తికి యిచ్చే స్వేచ్ఛనూ, ప్రాధాన్యాన్నీ చూచి వారు ఆశ్చర్యమూ ఆనందమూ పొంది అమ్మకు వ్యక్తం చేసుకున్నారు.

అవును - తోచిందేదో చెయ్యి.. అని నేను అనటంలో తోపింప జేసేది వాడేగా అనే భావమే ప్రధాన మయింది. అందరి భావనలకూ, అందరి క్రియలకూ కారణమయిన అన్ని ప్రేరణలకూ కర్త ఒక్కడే. కనుక ఎవరితో 'నీ యిష్టం' అన్నా అంతా జరిగేది ఒక్కడి యిష్ట ప్రకారమే. అందుకనే అనుకున్నది జరుగదు. తనకున్నది తప్పదు - అంటాను. .. అన్న అమ్మ వివరణ విని అమ్మ సందేశంలోని కావ్యగుణానికి వారు మురిసిపోయారు

తనదేమీ లేదనీ, అంతా వాడిదేననీ మనసా నమ్మి వాడికి సర్వార్పణ చేసి తాను ఏమిచేసినా వాడి ఆజ్ఞానుసారమేనని భావిస్తూ తాను బాధ్యతా రహితుడు కావటమే నిజమయిన స్వాతంత్ర్యం - అని అమ్మ యిచ్చిన అపూర్వమయిన నిర్వచనం తిరుమలరావుగారి జీవితంలో కాంతి పుంజాన్ని ప్రసరించింది వారి హృయాకాశంలో ధృవతార అయింది. ఇన్ని శతాబ్దాలుగా దేశంలో ఎందరు వ్యక్తులు తమ వేడి రక్తం వారుబోసినా, తమ అమూల్య జీవితాలు ధారబోసినా... ఎందరు వక్తలు ఎన్ని ఉపదేశాలు చేసినా, ఎన్ని ఉపన్యాసాలు యిచ్చినా... దేశంలో యథార్థ స్వాతంత్ర్య వాయువులు ప్రసృతం కాకపోవటానికి నిజమయిన కారణం వారికి అవగతమయింది. అందాకా వారి మనస్సులో అపరిష్కృతంగా నిలిచి వేధించే ఒక సమస్యకు సమాధానం సముపలభ్యమయింది.

దేశంలోని అనిశ్చితస్థితికి కల్లోలిత పరిస్థితులకూ వారు అమితంగా ఖేదపడుతూ అమ్మవద్దకు వచ్చినప్పుడెల్లా అమ్మకు తన హృదయ సంక్షోభాన్ని నివేదించుకుని అమ్మ వాగమృతసేచనతో పరితృప్తులయి మనశ్శాంతిని పొందేవారు.

తరువాత తిరుమలరావుగారిని అమితంగా ఆకర్షించింది - అమ్మ అతిలోక సుందర చరణ సుమపరాగ పరిమళాలతో పరిపూతమయిన ఆ దివ్య వ్యవస్థ, అందలి నిత్యనివాసులయిన సోదరీ సోదరులూ, కులమత వర్గవర్ణ విచక్షణా రహితమై దీపించే వారి సర్వ సౌభ్రాత్రమధురభావమూ, వారి అకలంక స్నేహశీల భాసురమయిన మహితానుబంధమూ, వారి జీవన విధానంలోనూ, వారి అనుక్షణ కార్యాచరణలోనూ అంతఃస్రోతమైన మహోన్నత వేదాంత సారమూ అవి వారిని పులకితాంగులను చేయటమే కాదు, వారిని దివ్యావేశ భరితులనుచేసి వారికి కొత్తలోకాన్ని చూపి కొత్తపారాలను గఱపి, కొత్త రక్తాన్ని ఎక్కించి, వారికి కొత్త జీవితాన్నే ప్రసాదించింది ఎన్నో శాసన సభలూ, ఎన్నో శాసనాలూ, ఎన్నో శాస్త్రాలూ, ఎన్నో విధి నిషేధాలూ సాధించలేని ఒక మహోన్నత మహోత్తమ మహోత్కృష్ట లక్ష్యాన్ని మధురలాలనతో లలిత పదాలతో అలవోకగా అవలీలగా సాధించిన అమ్మ నిర్మాణ చాతుర్యానికీ విస్తులకౌశలానికీ వారు సమ్ముగ్ధులవుతూ సమ్మోదభరితులవుతూ అమ్మకు సదానమోవాకా లర్పిస్తూ ఉండేవారు

అందుకనే వారు అంతదూరంనుండీ - ఢిల్లీ నుండీ జిల్లెళ్ళమూడికి తరుచుగా రెక్కలు కట్టుకు వాలేవారు. ఆ సన్నిధిలో వారు అనన్య లభ్యమయిన ఆనందమూ ఆత్మశాంతీ అనుభవించేవారట కనుకనే వారు జిల్లెళ్ళమూడిలో స్థిరనివాసరం ఏర్పరచు కోవాలని కృతనిశ్చయులయినారు. అందుకు ఎన్నో కలలు గన్నారు. అక్కడ జరిగే ఎన్నో కార్యకలాపాలకు తాను ఎన్నోవిధాల చేయూత నివ్వాలని సంభావించారు. అక్కడ నిర్మిత మవుతున్న రమణీయ సహస్ర స్తంభమందిరంలో తానూ ఒక స్తంభం కావాలని ఆకాంక్షించారు. అక్కడ నుండి ప్రసారితమయ్యే దివ్య సంగీతంలో తన కంఠమూ కలపాలని వాంఛించారు. అక్కడ జరిగే మహాయజ్ఞంలో తన సమిధనూ సమర్పించాలని ఆశించారు

అవును - వారి ఆశ, వారి ఆశయం, వారి ఆకాంక్ష తహతహగా, తపనగా, తపస్సుగా పరిణామం చెంది పరిణతిపొంది ఉంటుంది. లేకపోతే వారు అంతలోనే యింత ఆకస్మికంగా కన్నుమూసి కన్నతల్లి కోమలాంఘ్రిని చేరరు. ఇటీవల వారు దేవీనవరాత్రి ఉత్సవాలలో అమ్మను దర్శించినప్పుడు వారిలోని మార్పును అమ్మ సూచన చేసే ఉన్నదికూడ కాని అయితే ఆ మాటల మాటున దాగిన యథార్థాన్ని మనం గుర్తించ లేదు.

లోగడ ఎందరి విషయాలలోనో చూచాము, నేడు తిరుమలరావు గారి జీవితమూ తార్కాణమయింది ఒకడు అమ్మను పరిపూర్ణంగా అర్థం

చేసుకోనక్కరలేదు, అమ్మయే పరిపూర్ణమని అవగతం చేసుకోనవసరం లేదు అమ్మకు పరిపూర్ణంగా అర్పణ అయితేచాలు. అమ్మకు సేవ చేద్దామని మనఃపూర్తిగా అనుకుంటే చాలు - వాడి జీవితం పరిపూర్ణం అయినట్లే అది వాడి జీవితగీతికి ముక్తాయింపే

తిరుమలరావుగారు అమ్మను మనఃపూర్తిగా విశ్వసించారు సహస్ర విధాల అమ్మకు సేవ చేయాలని గాఢ నిశ్చయం చేసుకున్నారు అందుకనే తుది క్షణాల్లోనూ 'అమ్మతప్ప నా కెవరున్నారూ?' అంటూ నవంబరు 29న కన్నుమూసి అమ్మలో సంలీనమై శాశ్వత శాంతి పొందారు

ముముక్షుత్వమే మోక్షం - అన్న అమ్మ వాక్యానికి నిదర్శనలా యీ అతిమధుర సంఘటనలు ?

(డిశంబరు 1970)



## ఆరాధన

గోపికల్లోనూ అనేక విధాల వాళ్ళున్నారు. గోపికల ఆరాధన ఎట్లా ఉంటుందంటే ఒకామె ముఖాన్ని, ఒకామె పాదాల్ని, ఒకామె హస్తాల్ని, ఒకామె భుజాల్ని, ఒకామె చెవులను, ఒకామె నేత్రాలను, ఒకామె లలాటాన్ని, ఒకామె లలాటమందలి తిలకాన్ని, ఒకామె కంఠాన్ని, ఒకామె కంఠస్వరాన్ని, ఒకామె శక్తిని, ఒకామె జ్ఞానాన్ని - ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా కృష్ణుని ఆరాధించారు వారిలో పరిపూర్ణత సాధించిన ఆమె రాధ. ఆమె కృష్ణుడి యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఆరాధించడమేగాక తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలనే కృష్ణుడుగా ఆరాధించింది. ఆ ఆరాధనవల్లనే ఆమె రాధ అయింది.

- అమ్మ

# 57
# అనుంగుబిడ్డ అస్తమయము

ఆంజనేయుడు లేకపోతే రామునికి జానకి ఉనికి అవగతమయ్యేది కాదా? వారధి నిర్మాణం చేసేవాడు కాదా ? రావణసంహారం ఏమయ్యేది ?

అర్జునుడు లేకపోతే కృష్ణుడు దుష్టశిక్షణ చేయలేక పోయేవాడా ? గీతోపదేశా మృతం వర్షించేవాడు కాదా ?

వివేకానందుడే ఉద్భవించి ఉండకపోతే రామకృష్ణ పరమహంస అవతారవిశేషం లోకవిదితమయ్యేది కాదా ?

దైవం దయాసముద్రుడై విచక్షణా రహితుడు అయి అనుగ్రహం అందరికీ సమంగా పంచినప్పటికీ అన్ని అవతారాల్లోనూ కొండంత ప్రత్యేకతను ప్రసాదించితే తనకు అత్యంత సన్నిహితులనుగా చేసుకుని కార్యాచరణలో వారికి ప్రధానపాత్రల నొసగి వారికి చారిత్రిక ప్రాముఖ్యత చేకూర్చటం సర్వజన విధిత రహస్యమే.

అమ్మకూడా ఒకసారి నిర్మొహమాటంగా ప్రకటించింది  అవసరమయిన వాళ్ళను నేను ఏరుకుంటాను - అనీ  నాకు అవససరమైన వాళ్ళను నేను వాడుకుంటాను - అనీ

అవును - అందుకనే అమ్మ అద్భుత జీవిత ఉద్గ్రంథపు పుటతిరగవేస్తే అసంఖ్యాకమయిన పాత్రలు దీప్తిమంతాలై వాసిస్తూ మననేత్ర పర్వం చేస్తాయి

ఆ వాత్సల్య వారిధి మృదుతరంగాల మధుర స్పర్శతో పులకితులయిన వారెందరో ఉన్నారు.  ఆ అనురాగ సుధాంశు శీతల చంద్రికోవలాలనంలో పరవశులయిన వారెందరో ఉన్నారు  ఆ కారుణ్య పీయూష వర్షధారలలో తడిసి తన్మయులయిన వారెందరో ఉన్నారు. ఆ అనుగ్రహపల్లకీ సుస్వరలహరిలో ముగ్ధులై మూర్ఛనలుపోయిన వారెందరో ఉన్నారు

వారిలో ప్రస్ఫుటమై ప్రముఖమై ప్రతిభావంతమై ప్రదీప్తమై మనకు గోచరించే వ్యక్తి అగ్రజులు శ్రీ అధరాపురపు శేషగిరిరావుగారు

వారు ప్రధమంగా అమ్మను - అమ్మ యీ అవనీతలానికి అడుగిడిన 36 వసంతాల అనంతరం 1959లో మన్నవలో దర్శించినా .. 1960లో అమ్మ చరణసన్నిధిలో స్థిరనివాసం ఏర్పరుచుకుంటూ నాన్నగారిని ... నన్ను మీ రవితరువాత వాడినిగా చూచుకొనమని కోరినా... ఆ సంవత్సరం నుండే వారు స్వీకరించని బాధ్యత లేదు. ఆ ఆవరణలో వారు స్పృశించని శాఖ లేదు.

అమ్మ అనుగ్రహం వలన జన్మతః వారు సేవాభావ నిరతులూ, కార్యదీక్షా దక్షులూ, మేధాసంపన్నులూ, సంస్కారవంతులూ, త్యాగజీవనులూ, సాహసప్రియులూ, అసమాన ధైర్యోపేతులూ, అమలినచేతస్కులూ అయిన అచిరకాలంలోనే ఆవరణకు అన్ని విధాలా ఆలంబనమై వెలుగొందారు.

నేటి జిల్లెళ్ళమూడి రోడ్డు నిర్మాణంలో వారి స్వేదధార ఉన్నది. జిల్లెళ్ళమూడి గుడిలోని విద్యుద్దీపకాంతిలో వారి విజ్ఞానరోచిస్సున్నది దినదినాభివృద్ధి చెందింది. అన్నపూర్ణాలయపు గాడిపొయ్యి మంటలో విశ్వశ్రేయస్సుకై వారి ప్రయత్నం ఉన్నది. సమున్నతమై సర్వజనాశ్రయమై తనరారే భవనద్వయలో వారి మందస్మితం ఉన్నది. మాతృశ్రీ పత్రిక ప్రాదుర్భావంలో వారి మేధాశక్తి ఉన్మేలనం ఉన్నది మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీ వారి సర్వస్వం ఉన్నది.

కనుకనే నేడు మన దురదృష్టంకొలదీ వారి భౌతికకాయమూ, గంభీర హృదయమూ మనకు కనుమరుగైనా అర్కపురీ సువర్ణచరిత్రలో అమ్మకు ప్రియపుత్రుడూ అఖిలజన ప్రియతమ సోదరులూ అయిన వారి సముజ్వలపాత్ర మన స్మృతిలో సత్యమై మనకు మార్గదర్శనం చేస్తూనే ఉంటుంది.

(జనవరి 1971)



## దయ్యం

దయ్యం లేదసలు. మన మనస్సే దయ్యం. దయలేని మనస్సులే దయ్యాలు. భయం వల్ల దయ్యమూ; భక్తివల్ల పూనకమూ.

- అమ్మ

# 58
# కార్యకారణాలు రెండూ అమ్మవే

శ్రీకృష్ణుడు ద్రౌపది దగ్గర ఒక్క మెతుకు భుజించిగానీ అన్నపు రాసులు ప్రసాదించలేదు  ఒక్క వస్త్రఖండం అందుకొనిగానీ అసంఖ్యాక వస్త్రప్రదానం చేయలేదు.

కుచేలునికి అపార సౌభాగ్యాన్ని అనుగ్రహించేముందు అతని నుండి గుప్పెడు అటుకులను శ్రీకృష్ణుడు స్వీకరించాడు.

శ్రీకృష్ణుడు సృష్టికర్తే. నిస్సందేహమయిన విషయ మది. సర్వజీవితాలకూ రచయిత. అ ఘటనాఘటన సమర్థుడే. అప్రతిహతమయిన సత్యమది

మరి - ద్రౌపదికి ఆ విషమపరిస్థితులను కల్పించిన దెవ్వరూ ? - శ్రీకృష్ణుడే. ఆ విపత్తు నుండి సంరక్షించిన దెవ్వరూ ? - శ్రీ కృష్ణుడే. కుచేలునికి ఆ దారుణ దారిద్ర్యం యిచ్చిన కఠినాత్ము డెవ్వరూ ? సర్వసంపత్తునూ సంప్రాప్తింప జేసిన కరుణామయు డెవ్వరూ ? రెండు విరుద్ధ ఘటనలకూ మూలం శ్రీకృష్ణపరమాత్మయే మరి - మధ్యలో మెతుకు లెందుకూ ? అటుకు లెందుకూ?

అదే యావత్ సృష్టిరచనలో అంతర్గర్భితమై అంతర్లీనమై అవ్యక్తమై అనుల్లంఘ నీయమై అజేయమయిన మహత్సూత్ర దారుఢ్యమూ, సౌందర్యమూ.

అందుకే అమ్మ అన్నది -

"కొండకు వెళ్ళటం, మ్రొక్కుకోవటం కూడా ఆ శాసనంలోనే.

నమస్కారమో, ప్రార్థనో చేయించుకోవాల్సిందీ తానే"

అంటే మ్రొక్కుకుంటే ఒక కోరిక తీరటం కాదు, సమస్త ప్రేరణలకూ, సమస్త క్రియలకూ ఆధారభూతుడయిన దైవం ఒక కోరిక తీరిచేముందు ఆ వ్యక్తి చేత మ్రొక్కుపెట్టిస్తాడూ, నమస్కారం చేయించుకుంటాడూ, ప్రార్థన జరిపిస్తాడూ, ఆసక్తి కలిగిస్తాడూ, ఆవేదన రగిలిస్తాడూ -- తుదకు ఫలితం ప్రసాదిస్తాడు

కనుకనే అమ్మ అన్నది -- నిర్ణయానికి నిర్ణయించిన వాడు కూడా బద్ధుడేనని. అందువల్లనే ప్రకృతి సహజశీలానికి భిన్నంగా భగవంతుడయినా ప్రవర్తించడు.

అమ్మ అనురాగం అందరిపై ఎల్లప్పుడూ సమంగానే ప్రసారం కావచ్చునూ,

సుఖదుఃఖాలూ, శాంత్యశాంతులూ, జయాపజయాలూ గౌరవా గౌరవాలూ సమస్త ద్వంద్వాలూ అమ్మ కటాక్షం వల్లనే కావచ్చును. కాని మనం మాత్రం లోకంలో సుఖాన్నీ శాంతినీ జయాన్నీ గౌరవాన్నీ మాత్రమే వాంఛిస్తాము

సృష్టి సుందరంగా ఉండాలంటే విభిన్న మనస్తత్వాలూ, విరుద్ధ వ్యక్తిత్వాలూ ఉండవలసిందే

అందుకనే అమ్మ అన్నది ---

"అసలు వ్యష్టిత్వం లేకపోతే సృష్టి ఏముంది ? అంతా సమంగా ఉంటే వాడు అట్లా పడి ఉండవలసిందే భిన్నత్వం లేనిది సృష్టే లేదు గారెలు చెయ్యవలసి వచ్చినప్పుడు మినపప్పులో పప్పు అంత ఉప్పు పోస్తే రుచి ఏమున్నది? దానికి తగినంత పాళ్ళు వేస్తేనే రుచి"

నాటకరచయతకు నాయకునిపాత్రపై, సేవకునిపాత్రపై అభిమానం సమానమే కావచ్చును. కానీ పాత్రధారి నాయకునిపాత్రనే కోరుకుంటాడు సహజంగా ప్రతిపాత్రధారీ ప్రేక్షకుల ప్రేమనూ, సానుభూతినీ సంపాదించగల పాత్రనే కాంక్షిస్తాడు

అంటే - ప్రతివాడూ జీవితంలో సుఖశాంతులనూ, కార్యరంగంలో విజయాన్నీ, లోకంలో గౌరవాన్నీ మాత్రమే పొందాలని అభిలషిస్తాడు వాటిని యివ్వదలుచుకున్న వారిచేత దైవం ముందు సత్కార్యాలు చేయించి తరువాత సత్ఫలితాలను ప్రసాదిస్తాడు

కనుక ఎవరయినా సత్కార్యాలు అనబడేవి చేస్తున్నారు అంటే - దైవానుగ్రహం వారిమీద ప్రసారితం అయిందన్నమాట

అందువల్లనే మనం ఏమి చేసినా ఏమి చేయకపోయినా అమ్మ అనుగ్రహం ఉంటుందని గాఢంగా విశ్వసించినా.... మనం అమ్మకు అర్చన చేసుకోవటానికి గానీ, ఒక కొబ్బరికాయ కొట్టుకోవటానికి గానీ మనకు ప్రేరణ కలిగినప్పుడో, ఆ అవకాశం ప్రాప్తమయినప్పుడో దానిని గమనించి సద్వినియోగం చేసుకుంటాము

మనచేత చేయించబడే కృషికికూడా సమయాన్ని బట్టీ, స్థలాన్నిబట్టీ ఫలితం ఉంటుంది కనుకనే అమ్మ జన్మదినోత్సవం జరుగబోతున్న యీ శుభసమయంలో అమ్మ పాదపీఠిపై ఒక్క పువ్వు సమర్పించటానికీ, ఆ నిర్వహణలో తమ వంతును అది అల్పమయినా, అధికమయినా - అందించటానికీ కుతూహల పడుతున్నాము

అనేకులు లేఖల ద్వారానూ వ్యక్తి గతంగానూ యీ మహోత్సవాలకూ అక్కడ జరిగే మహాయజ్ఞానికీ తాము ఎట్లా ఉపకరిస్తామని విచారణచేస్తున్నారు.

ఇది చాలా శుభసూచన.

మరి - ఇక్కడ జరగవలసినది అనంతంగా ఉన్నది.

(మార్చి 1971)



# 59
# సర్వశక్తి మత్వం

ఒకనాడు అమ్మా, శేషూ, శాస్త్రీ, భవానీ కలిసి వైకుంఠపాళీ ఆడుతున్నారు. అమ్మ మొదటి పందెం వేసింది. శాస్త్రి అమ్మపావు కదిలించ బోతుంటే భవానీ 'అమ్మ దేముడిపందెం వెయ్యాలి' అన్నది. వెంటనే అమ్మ "దేముడిపందెం ఏమున్నదీ? దేముడే పందెం వేస్తుంటే--" అన్నది సన్నగా నవ్వుతూ.

అమ్మ అవతార విశేషం చాలా విచిత్రంగానూ రమణీయంగానూ ఉంటుంది. ఒక దిక్కున సర్వజ్ఞత్వమూ మరొక దిక్కున అమాయకత్వమూ... ఒక ప్రక్కన సర్వసామర్థ్యమూ మరొక ప్రక్కన ఏమీ చేతకానితనమూ... ఒక వైపున సర్వవ్యాపకత్వమూ, మరొకవైపున పరిమితత్వమూ.. ఒక్కొక్కసారి ద్వంద్వాలకతీతం గానూ ఆధారంగానూ, ఒక్కొక్కసారి ద్వంద్వాల్లో మెలుగుతూనూ నలుగుతూనూ... మాధవతా మానవత్వం విచిత్ర సమ్మేళనతో నవరసభరితమయిన విశిష్టవ్యక్తిత్వంతో మధురస్వభావంతో అమ్మ జగత్తుతో ఆడుకుంటూ జనులను అలరిస్తూ తాను వినోదిస్తూ ఉన్నది.

సాధారణంగా అమ్మ "నేనూ మీలాంటి దాన్నే" అనీ "నేనేమీ చేయలే" ననీ "నాది తెలిసీ తెలియని స్థితి" అనీ "మీరు ఎక్కడ ఉన్నారో నేనూ అక్కడే ఉన్నా" ననీ సామాన్య మానవమాత్రురాలిలాగే మాట్లాడుతుంది.

అమ్మ ఏమీ మహత్తుల ప్రకటన చేయదు. ఒకవేళ అమ్మసన్నిధిలో అటువంటివి సంభవించినా వాటికి తన కర్తృత్వం అంగీకరించదు. కాని అటువంటి నిరాడంబరమయిన వ్యక్తిత్వంగల అమ్మ కొన్ని కొన్ని సుముహూర్తాలలో తన యధార్థస్థితిని ప్రకటిస్తూనే ఉన్నది. అయితే అది మన మనస్సుకు అందుతున్నదా అంటే అది అమ్మ కరుణపై మాత్రమే ఆధారపడి ఉన్నది.

అమ్మ అతిబాల్యంలోనే తన నాలుగవ ఏటనే "అమ్మలేకపోతే నేనే అమ్మగా ఉంటానుగా" అనీ, "సర్వానికీ నేను మూల"మనీ, "ఈ కనుపించేదంతా నేనే" ననీ

"నేను సర్వసిద్ధాంత సార్వభౌమను" అనీ "అన్నీ నేనే" ననీ పలుమార్లు ఉద్ఘాటించింది

ఒకసారి ఒకరు 'మీ నామస్మరణ చేస్తూ మద్రాసు మవుంట్‌రోడ్డులో నడిచిపోతున్న నా మీద మీ ప్రభావం ఎట్లా ఉంటుంది ? అని అడిగితే - "ఏముంది నాన్నా - నా ముందు రోడ్డుమీద వెళుతున్నట్లు కనుపిస్తుంటావు" అన్నది అమ్మ

ఒక విషయంలో 'నీకు యిక్కడికి వినిపించిందా ? నీవు అక్కడకు పోయి విన్నావా?' అని అమ్మను ఒకామె అడిగితే - "ఎట్లాగయినా ఒకటే నమ్మా-" అన్నది అమ్మ.

మరొకరు 'మేము మాట్లాడుతున్నది నీకు ఎలాగా వినపడిందమ్మా?" అని ప్రశ్నిస్తే-- "మీరు మాట్లాడుకున్నది మీకు వినపడటం లేదూ?" అని తిరిగి ప్రశ్నించి "అట్లాగే అంతా వినపడుతుంది" అని విశదీకరించింది అమ్మ.

ఇంకొకరు 'మా చర్యలన్నీ నీ కెట్లా తెలుస్తాయమ్మా?' అంటే-- "నా ప్రవర్తన నాకు తెలియదూ?" అన్నది అమ్మ.

ఒకసారి ఒక సంభాషణలోని ఒక విషయాన్ని అమ్మ ప్రస్తావించింది. 'నీ కెట్లా తెలిసిందమ్మా?' అని అందులో ఒకరు అడిగారు. "నాకు యోగయ్య చెప్పాడు" అన్నది అమ్మ. 'మేము ముగ్గురమూ కలిసే వచ్చాము నీకు ఎప్పుడు చెప్పాడమ్మా?" అని వారు అడిగారు. "అయితే మీ ముగ్గురితోబాటు నాలుగోదాన్ని నేను లేనుట్రా?" అని అమ్మ నవ్వింది.

ఒకరు "మమ్మల్ని అనటమా ? నిన్ను అనుకోవటమా?" అని సందేహపడితే "రెండూ ఒకటే నాన్నా" అన్నది అమ్మ నిర్లిప్తంగా.

ఒక సోదరి 'మీరు నన్ను పరీక్ష చేస్తున్నారు' అంటే - "నిన్ను పరీక్ష చేయటమంటే నన్ను నేను పరీక్ష చేసుకోవటమే" అని ఆమెకు అభయప్రదానం చేసింది అమ్మ.

అమ్మ స్మృతిని పరిశీలిస్తే అది మేధాసంపన్నతకు సంబంధించిన విషయంగా గోచరించదు. ఆ విషయంలో ఒకసారి అమ్మ "నాకు గుర్తు ఉంటాయంటే నాకు అవి ఎప్పుడో జరిగినట్లు ఉండవు. అన్నీ యిప్పుడే జరిగినట్లు ఉంటుంది" అన్నది.

ఈ విషయాన్నే సోదరులు భరద్వాజ 'నీకు మూడు కాలాలూ వర్తమానమే కదమ్మా' అని అడిగినప్పుడు - అమ్మ అసందిగ్ధంగా "అవును" అని ప్రకటించింది.

ఒకసారి సోదరి భవానీ 'కీర్తిశేషులయిన చిదంబరరావుతాతగారు ఎక్కడ ఉంటా' రని అడిగితే - "నాలోనే ఉంటాడు. ఇంకెక్కడ ఉంటాడు?" అని జవాబు యిచ్చింది అమ్మ

"అందరూ నా ఒడిలోనే తిరుగుతున్నారు ఒడి విడిచి ఎవరూ లేరు" అన్నది అమ్మ యింకొకసమయంలో

"ఎక్కడ ఎవరిని చూచినా నా బిడ్డయే ననిపిస్తుంది" అంటూ "మీ రందరూ పిల్లలే కాదు, నా అవయవాలు" అన్నది ప్రేమగా.

ఒకరు 'మీ దృష్టిలో మనుషులూ యితర జంతువులూ ఒకటిగానే ఉన్నాయి' అని అంటే- "అవి యితర మనిపించటంలేదు అన్నీ నేను అనిపిస్తున్నది" అన్నది అమ్మ

సృష్టిని గురించిన ప్రస్తావనలో "స్పష్టినాది" అన్నది నిర్నిబంధంగా.

"మీరు చూస్తే నేను కనుపడను నేను కనుబడితే మీరు చూస్తారు" అనీ "నన్ను చూడటమే పుణ్యం" అనీ "నేను దగ్గరకు తియ్యటంతప్ప వాళ్ళు దగ్గరకు రావటం కాదు" అనీ "ఎప్పుడయినా ఏమయినా ఎవరికయినా నేను యివ్వవలసిన దానిని" అనీ సందర్భానుసారంగా అమ్మ వెల్లడించింది

'వక్రించిన యుగధర్మాన్ని మార్చగూడదా' అని ఒకరు అడిగినప్పుడు "అవసరమయితే మారుస్తాను" అన్నది అమ్మ.

"నా కబురు సరాసరి చేరుతుంది. మీ కబుర్లు పోస్టాఫీసులో ముద్రలు పడితేగానీ ఎక్కడి కయినా చేరవు" అనీ "నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తూనే ఉన్నాను, మీరు యిక్కడకు వచ్చి నన్ను చూస్తారు" అనీ ఋజువుచేసింది అమ్మ

ఒకసారి సోదరుడు బాలయ్య 'నేను పాపాలు చేస్తున్నానమ్మా; కానీ అన్నీ మోయవలసింది మీరేగా?' అని అంటే - "నేనే భరిస్తాను నాన్నా" అని వాగ్దానం చేసింది అమ్మ

"మీరు బురదపూసుకు వచ్చినా, ఎట్లా మురికి చేసుకున్నా శుభ్రం చేయవలసింది నేనేగా-" అనీ హామీ యిచ్చింది అమ్మ

"చెప్పుకుంటే తీరుతుందని మీరు చెప్పుకుంటారు. నేను చెప్పుకుంటే మీరు బాధపడతారని నేనే పడతాను" అన్నది అమ్మ అర్థహృదయంతో.

అమ్మ ఎన్ని రీతుల్లో ఎన్ని తీరుల్లో తననుగురించి తాను వాస్తవం ప్రకటించుకున్నది ?

అవును, మరి -

ఎవరికి చెప్పుకున్నంత మాత్రాన ఎవరి బాధలయినా తీరుతాయి ? ఎవరికి కాలాలన్నీ సమానంగా ఉంటాయి ? ఎవరు అన్నిటికీ కర్త ? ఎవరు అందరిలో అందరితో అహరహం ఉండగలరు? ఎవరు యీ సృష్టిని నాది అనగలరు ? ఎవరు అంతా నేనే అనగలరు ? అందరి పాపాలూ ఎవరు భరించగలరు ? యుగధర్మాన్నే ఎవరు మార్చగలరు ?

ఒక్క దైవం మాత్రమే పలుకగల మాటలవి !

ఇంత స్పష్టంగా అమ్మ చెబుతున్నా మనం యింకా సందేహాల్లోనూ సంశయాత్మతోనూ సంచరిస్తున్నామంటే కారణం ఏమిటి ?

"వాడి కరుణ లేకపోతే వాడు ఎదురుగా ఉన్నా మనం గుర్తించలే" మని అమ్మయే సమాధానం చెప్పింది.

కనుకనే అమ్మ కరుణ కోసం మనం అమ్మను ప్రార్థించాలి.

(ఏప్రిల్ 1971)



## అన్ని అనుభవాలు నావే

మీరు బిడ్డలనే అనుకోవడం లేదు.
నా అవయువాలని కూడా అనుకుంటున్నాను.
చెయ్యి నొప్పి కాలికి తెలియదు.
కాలి నొప్పి కంటికి తెలియదు.
కానీ అన్నిటి నొప్పీ నాకు తెలుస్తుంది.
బాధ ఎవరిదయినా అనుభవం నాదే.

- అమ్మ

# 60
# "తోలునోరుకాదు కదా - తాలుమాట రావటానికి"

ఈ నెల 4వ తేదీ మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. 5వ తేదీన అమ్మకు సమర్పింపబడి ఆవిష్కరణ పొందవలసిన గ్రంథం 'అర్కపుర విశేషాలు' ముద్రణ పూర్తి చేసి జిల్లెళ్ళమూడి చేరాము.

5వ తేదీన అమ్మ కల్యాణదిన మహోత్సవంలో జరుగవలసిన నరసింహారావూ - శేషుల వివాహ సందర్భంలో వారిని పెండ్లికుమారునీ పెండ్లికుమార్తెనూ చేయవలసి ఉన్నది.

మేము బాపట్ల నుండి వెళ్ళి అమ్మపదసన్నిధిలో సుఖాసీనులమై - జరిగిన విషయాల గురించీ జరుగబోయే సంగతుల గురించీ, అప్పుడే అమ్మ దర్శనార్థం వచ్చిన శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామివారి గురించీ మాట్లాడుతున్నాము - ప్రస్తుతం జరుగవలసిన కార్యక్రమం గురించి ఏమాత్రమూ ఆలోచించకుండానూ, ఉపక్రమించకుండానూ.

ఆ సమయంలో అక్కడనే ఉన్న సోదరి 'ఇంత ఆలస్యంగా వచ్చారూ, ఇక లేచి జరుగవలసిన కలాపం చూడండీ -' అన్నది.

"అప్పుడే ఎక్కడ? నాకు వడదెబ్బ తగిలితేగానీ వాడికి తెలీదు" అన్నది అమ్మ చిన్నగా నన్ను ఉద్దేశించి.

"వడగాలే లేనిది వడదెబ్బ ఏమిటమ్మా ? మేము యిప్పుడేగా బాపట్ల నుండి వచ్చింది ! - వాతావరణం హాయిగా ఉన్నది" అన్నాను.

అట్లా అన్నప్పటికీ వెంటనే వెళ్ళి ఆనాటి కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లన్నీ క్షణాల్లో పూర్తి చేశాము. సుస్నాతయై, సర్వాలంకార సంశోభితయై అమ్మ బయటకు

వచ్చింది. అంతలోనే ఎండ నిప్పులు చెరుగుతుంటే పడమటి శాంబరం పరవళ్ళు త్రొక్కింది

ఎల్లప్పుడూ చీకటినీ, చల్లదనాన్నీ కోరుకునే అమ్మ ఆ వడగాడ్పులోనే కార్యక్రమం పూర్తిచేసి వధూవరులను ఆశీర్వదించి లోపలకు వచ్చింది. అంతే - అమ్మకు వడగాడ్పు తగలనే తగిలింది. అప్పటినుండి మంటల జ్వరమే

అయినా అమ్మ మరునాడు దేవ్యాలయోపరిభాగానికి అదిరోహించింది వందల గుమ్మడికాయలూ, కొబ్బరికాయలూ పగలకొట్టింది ప్రజానీకానికి పసుపుకుంకుమలూ, పూలతోరాలు ప్రేమనూ ఆశీర్వచనాన్నీ పంచింది వైద్యాలయానికి శంకుస్థాపనా, వనమహోత్సవమూ జరిపింది తొమ్మిదిమంది వటువులకు బ్రహ్మోపదేశాలు గావించి, నరసింహారావూ శేషుల వివాహం అతివైభవంగా జరిపించింది.

కానీ తనకు జరుగవలసిన అర్చనకు మాత్రం ఎవరికీ అవకాశం ప్రసాదించ లేదు. ఒక్కరినీ తన మృదుపాదాలను స్పృశించనీయలేదు అది అందరికీ బాధాకర మయిన విషయమయినా అనివార్యమే అయింది.

అందరూ అమ్మను అంతదూరం నుండే దర్శనం చేసుకుని బాధగా సెలవు తీసుకుంటూన్న సమయాన అమ్మ 4వ తేదీ మధ్యాహ్నం అన్నమాటలూ, అని అప్పుడు అసంభవాలు అనిపించినా అవి నిజమయిన తీరును గమనిస్తుంటే - అమ్మ తన 4వ ఏట తనను గురించి తానే "తోలునోరు కాదుగదా - తాలుమాట రావటానికి" అని చేసిన ప్రకటన జ్ఞప్తికి వచ్చి - అటువంటి సంఘటనలు ఎన్నెన్నో స్మృతిపథంలో మెదిలాయి.

ఒక సందర్భంలో అమ్మ ఒక విధంగా అన్నప్పుడు ఆ విషయం అట్లా జరగటానికి వీలులేదు అని మనం అనుకున్నా - తీరా జరిగే సమయానికి అమ్మ అన్నట్లే జరగటమూ, మనలను ఆశ్చర్యపరచటమూ నిత్యమూ జరుగుతూనే ఉన్నా ఎప్పటికప్పుడు అది నిత్యనూతనంగానే ఉంటూ మనలను ప్రభావితులను చేస్తూనే ఉంది

(మే 1971)



# 61

# సర్వవ్యాపకత్వం

ఈ నెల 4వ తేదీ రాత్రి పన్నెండు గంటలు దాటింది. అప్పుడే గుంటూరు నుండి వచ్చిన సామాను నంతనూ సర్దించి అమ్మ నివాసానికి వెళ్ళాను - అక్కడనే నేనూ పడుకోవటం అలవాటు కనుక, కాని తలుపువేసి ఉన్నది. తలుపు తట్టాను, ఎవరూ పలకలేదు పెద్దగా పిలిచాను, ఎవరూ జవాబివ్వ లేదు.

అంతలోనే అడుగుల సవ్వడి మెత్తగా వినిపించింది. ఆశగా నిలుచున్నాను. క్షణంలో తలుపులు తెరుచుకున్నాయి ఎదురుగా అమ్మ ! నా ఆనందానికి ఆశ్చర్యానికీ అవధుల్లేవు

"అదేమిటమ్మా ? నీవు వచ్చావు ! ఎవరూ లేరా ?" అని ప్రశ్నించాను.

"అందరూ నిద్రపోతున్నార్రా, వాళ్ళను లేవటం ఎందుకూ - అని నేను వచ్చాను. అదీగాక వాళ్ళు పగలల్లా యీ పనీ ఆ పనీ చేసి చేసి ఉంటారా.. అలసటచెంది వళ్ళుమరచి నిద్రపోతారు. ఈ నిద్రలేకపోతే వారికి పగలల్లా మత్తుగా ఉంటుంది నే నంటావా ? పనీ పాటా లేనిదానను కనుక అలసటా ఉండదూ, ఆకలి ఉండదూ; నిద్రా ఉండదూ, నీరసమూ ఉండదూ.." అని అమ్మ చెబుతుంటే నాకు అనేకానేక స్మృతులు మనుస్సలో మెదిలాయి.

లోగడ ఒకసారి ఒకరు రాచవుసిరికాయలు అమ్మకు నివేదన చేశారు పళ్ళన్నీ అమ్మ ఒక్కతే తింటున్నది. అదేమిటమ్మా -ఎదురుగా ఉన్న సంతానాన్నే విస్మరించావని అడిగితే అమ్మ అన్నది "అసలే మీ కందరకీ జలుబుచేసి ఉన్నది, ఇక ఆ పళ్ళు తింటే మీరు మరీ బాధ పడవలసి వస్తుందని అన్నీ నేనే తింటున్నాను" అని

నా నయనాలూ సజలమయినాయి. అది అతివయించిన ఆనందం వల్లనో, అమ్మలోని అతి మంచితనం వల్లనో !

అమ్మ మామూలుగ ఆరుబయట దొడ్లో పడుకుంటుంది. నేను లోపల గదిలో పడుకుంటాను. అమ్మ దొడ్లోకివెళ్ళింది నేను నా పడకగదికి వెళ్ళి - ఎంత

మంచిదానవమ్మా... అన్న 'రాజా పాటను' నెమరు వేసుకుంటూ పడుకున్నాను.

తెల్లవారింది. రాత్రి అమ్మకు కలిగించిన శ్రమకు అక్కడ రాత్రి పడుకున్న సోదరీ సోదరులను మందలించాను. వారు నామాటను ఈషణ్మాత్రమూ అంగీకరించక - అమ్మ రాత్రి గాఢంగా నిద్రపోయిందనీ, తాము పంతులవారీగా ఒకరి తరువాత ఒకరు మేలుకునే ఉన్నామనీ, అమ్మ మంచం దిగటం జరగనే లేదనీ - వక్కాణించారు.

నా ఆశ్చర్యానికి అంతులేదు.

క్షణంలో అనేక అద్భుత సంఘటనలు స్మృతిలోకి వచ్చాయి. పూర్వం సోదరి భవానికి అమ్మ - తన గదిలో మంచంమీద కూర్చుని శేషగిరిరావన్నయ్యతో మాట్లాడుతూ చాల దూరంలో నిద్రించే భాస్కరరావన్నయ్య ప్రక్కన నిలుచుని కనుపించింది.

అట్లాగే డాక్టరు సాంబయ్యగారికీ, హైదరాబాదులో ఒక హోటలు కుఱ్ఱవానికీ, మహాబలిపురంలో ఒక పాల మనిషికీ... ఇంకా ఎందరో యిటు వంటి మహిమాన్విత సంఘటనలు అనేకం నివేదిస్తున్నారు.

ఔను - అమ్మ కొందరికి వాసన రూపంగానూ, కొందరికి శబ్దరూపంగానూ, కొందరికి స్ఫురణ రూపంగానూ, కొందరికి స్వప్నంలోనూ అనేక విధాల కనిపిస్తున్నా - యిట్లా రక్త మాంసాదులతో ప్రత్యక్షమవటం అరుదు కాకపోయినా ఎప్పటికప్పుడు ఏ సంఘటనకా సంఘటన నిత్యనూతనమే, ఆనంద సంధాయకమే.

ఒకే సంఘటనలో ఒక క్షణంలో సంపూర్ణ మానవతా లక్షణాన్నీ మరు క్షణంలోనే అతిమానవప్రతిభనూ అనుభూతం చేయగల ఘటనా ఘటనాద్భుత సమర్థ కనుకనే అమ్మకు మనమందరమూ అనుక్షణమూ చేతులు ముకుళిస్తున్నాము.

(జూన్ 1971)



# 62
# అన్నపూర్ణాలయం

ఈ నెల 15వ తేదీన జిల్లెళ్ళమూడిలో "అన్నపూర్ణాలయ" వార్షికోత్సవము జరిగింది. సరిగ్గా పదమూడు సంత్సరాల క్రింత అవతారమూర్తి అమ్మ సంతానకోటి మీది అవ్యాజానురాగంతో అపరిమిత వాత్సల్యంతో అన్నపూర్ణాలయానికి ఆకృతి కల్పించింది. అప్పటి నుండి యిప్పటికి ఆ అన్నపూర్ణాలయంలో ఎన్నో లక్షల ప్రజలు భోజనం చేసి తమ క్షుద్బాధను తీర్చుకొని ఉండవచ్చును. ఎంతో సంతృప్తిని పొంది ఉండవచ్చును. ఆ అన్నాన్నీ, ఆ పదార్థాలనూ, ఆ రుచినీ, ఆ పాకప్రవీణులనూ ప్రశంసించి ఉండవచ్చును, ఆ భోజనం అమృతంవలె ఉన్నదని ఆనందం అనుభవిస్తూ అభినందించి ఉండవచ్చును. నిజమే - అది భోజనం కాదు అమృతమే. కానిచో ఆ అన్నానికి ఆ రుచి రాదు.

అక్కడ ఎవరు చేశారన్న ప్రశ్నా లేదు; ఏ పదార్థమన్నది సమస్యాకాదు. అక్కడ ఎవరు వండినా, ఏం వడ్డించినా ఆ భోజనంలోనే ఆ రుచి ఉన్నది. కారణం ఏ వ్యక్తి గాడిపొయ్యి ప్రక్కన నిలబడినా ఆ అమృతహస్తం మాత్రం అమ్మదే, పదార్థాలేమయినా అందులో పొదగబడేది మధురాతి మధురమయిన అమ్మ అవ్యాజానురాగామృతం మాత్రమే.

ఆర్తులకు తన కరుణనుకూడా యీ అన్నం ద్వారానే అమ్మ ప్రసారం చేస్తున్నదేమో ననిపిస్తున్నది. ఎవరు వచ్చి తమ ఏవిధమయిన బాధలను అమ్మకు నివేదన చేసుకుంటున్నా వెంటనే అమ్మ అడుగుతుంది - భోజనం చేశావా నాన్నా - అని. వారు చేశామంటే - సరే, వెళ్ళిరా - అంటుంది. లేదంటే - అయితే వెళ్ళి భోజనం చేసిరా నాన్నా - అంటుంది. చేసి వచ్చా మంటే - అయితే కొంచెమయినా... ప్రసాదంగానే... తీసుకొని వెళ్ళు నాన్నా - అని ఆదరంగా ఆదేశిస్తుంది. వెంటనే మనకు అర్థం కాకపోయినా - కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే ఆదరణతోపాటు, ఆప్యాయతతోపాటు, అనురాగంతోపాటు బాధకు నివారణ, జబ్బుకు ఔషధం,

సమస్యకు పరిష్కారం, ప్రశ్నకు సమాధానం, అభీష్టానికి సిద్ధీ అన్నీ ఆ అన్నపుముద్దలోనే నిక్షిప్తమై ఉన్నవని అవగతమై తీరుతుంది. లేకపోతే - ఎంతో బాధతో, ఎంతో ఆశతో అమ్మ దర్శనంకోసం ఎవరు వచ్చినా, అమ్మ వెంటనే వారికి అన్నపూర్ణాలయానికి మార్గదర్శన చేయదు మరి, అమ్మ అభిప్రాయం వాళ్ళు అమ్మను దర్శించటం వారి అభీష్టప్రాప్తీ, కష్టాల విముక్తీ కోసమే ననియేమో

ఏ మహిమనూ ప్రకటించడానికి యిష్టపడని నిరాడంబరమయిన అమ్మ అన్నపూర్ణాలయ నిర్వహణద్వారా తన అపారమయిన ప్రతిభనూ, మహిమనూ లోకానికి అభివ్యక్తం చేస్తూనే ఉన్నది. నిత్యమూ, ఏ వేళలో ఎందరు జనులు వచ్చినా అక్కడ అన్నం వడ్డింపబడుతూనే ఉంటుంది. ఏ పండుగలో ఎన్నివేలమంది వచ్చినా ఏ పదార్థానికీ లోటు వుండదు. అక్కడ ఎప్పుడూ భోజనాలవేళ సందడితో సంబరంతో నిత్యకల్యాణంగానే ఉంటుంది. గాడిపొయ్యి నిరంతరమూ మండుతూనే ఉంటుంది. వందలటన్నుల కట్టెలు కాలుతూనే ఉంటాయి. పుట్లకు పుట్లు ధాన్యం బండ్లమీద మరకు వెళ్ళివస్తూనే ఉంటాయి. మరి, యింత పదార్థం ఎక్కడనుండి ఎట్లా వస్తున్నదీ అని ఆలోచించుకుంటే - అందులో అమ్మయొక్క దివ్యశక్తీ అద్భుతమహిమా విశేషమూ మాత్రమే కనుపిస్తాయి. కాని అమ్మ ఎప్పుడూ, ఏ విషయంలోనూ తాను ప్రత్యక్షంగా ఏమీ చేయదు అంతా పరోక్షంగానే ఉంటుంది కనుకనే గాడిపొయ్యి కట్టెలులేక మండదు. గుండిగలో బియ్యం పోయక అన్నం తయారు కాదు ఎవరో పదార్థాలు తేవలసినదే; ఎవరో వంట చేయవలసినదే; ఎవరో వడ్డించవలసినదే. కానీ ఆ పదార్థాలను తెచ్చినవారినీ, తెచ్చినతీరునూ, వంటచేసిన వ్యక్తులనూ, చేసిన విధానాన్నీ, పదార్థాలనూ, వాటి రుచినీ - పరిశీలిస్తే మాత్రం అడుగడుగునా అమ్మ ప్రేరణ మనకు అవగతమై, అన్నిటా అందరిలోనూ అంతస్సూత్రంగా అమ్మ సంకల్పబలమూ, మహిమావిశేషమూ మాత్రమే స్పష్టంగా గోచరిస్తాయి.

అమ్మ వేదాంతప్రబోధంకూడా యీ అన్నపూర్ణాలయం ద్వారానే చేయటం గమనార్హం ఎవరయినా వచ్చి - అమ్మా, యింత అన్నదానం ఎట్లా చేయగలుగుతున్నారని ప్రశ్నిస్తే - ఎవరి అన్నం వారు తింటున్నారు ఇందులో ఒకరికి ఒకరు పెట్టటం ఏముందీ? వాడి అన్నం యిక్కడ ఉన్నదీ, ఎక్కడినుండో వచ్చి తింటున్నాడు. లేదూ, యిక్కడనే ఉన్నా తినలేడు - అని సమాధానం చెబుతుంది అమ్మ.

ఎప్పుడూ ఎవరికీ ఏ విషయంలోనూ సందేశంగానీ ఆదేశంగానీ ప్రసాదించని అమ్మ ఒక సందర్భంలో అన్నది --- నీకు యిచ్చింది తృప్తిగా అనుభవించటం,

నీకున్నది నలుగురికీ ఆదరణగా పెట్టటం. ఇదే నా సందేశం - అని, ఆదరణగా పెట్టటమంటే అన్నమనే అమ్మ ఉద్దేశం.

తన సమదృష్టినీ, సమతా సిద్ధాంతాన్నీ నిర్వచించటానికీ, నిరూపించటానికీ కూడా అన్నపూర్ణాలయాన్నే రంగస్థలంగా అమ్మ ఎంచుకున్నది కనుకనే అక్కడ కుల, మత, వర్గ, వర్ణ, భాషా భేదరహితంగా సర్వులకూ ఒకే పంక్తిన భోజనం ప్రసాదింపబడుతున్నది.

సారాంశ మేమంటే - తన అనురాగం ప్రసాదం చేయటానికీ, అనుగ్రహం ప్రసాదించటానికీ, మహిమను ప్రకటించటానికీ, వేదాంతం ప్రబోధించటానికీ, లౌకిక సందేశాన్ని ప్రవచించటానికీ - అన్నిటికీ అమ్మ అన్నాన్నీ, అన్నపూర్ణాలయాన్నే ఉపకరణం చేసుకున్నది.

కనుకనే అన్నపూర్ణాలయం అంటే అనురాగక్షీరాబ్ధి అయిన అమ్మ అద్భుత హృదయానికి బాహ్యాకృతి మాత్రమే ! అక్కడ ప్రసాదింపబడేది అన్నం కాదు, అమృతమే! అన్నపూర్ణాలయం నుండే అమ్మ తన సంతానకోటి సర్వానికీ సురాసుర భేద రహితంగా సమంగా సహస్రబాహువులతో అమృతం పంచి పెడుతున్నది

కానీ యింత మందికి యింత ఆదరంగా అన్నం పెట్టే అమ్మ తాను మాత్రం - మీరు తింటే నేను తిన్నట్లే - నంటూ తాను నిరాహారియై, మనసు కడుపునిండి తినిపిస్తూ, తాను తృప్తిగా త్రేన్చుతూ ఉంటుంది

(ఆగష్టు 1971)



**పసివాడు**

తనకేమి కావాలో తెలియని వాడే పసివాడు.

నాదృష్టిలో అందరూ పసివాళ్ళే.

- అమ్మ

# 63
# ప్రతి ప్రేరణ అమ్మదే

అనేక విషమపరిస్థితులలో అనేకులు వచ్చి అమ్మను అడుగుతారు. ఏమి చేయమంటావు అమ్మా? - అని. నీకు తోచినట్లు చెయ్యి నాన్నా - అంటుంది అమ్మ. ఆ ఆదేశంలోని ఆంతర్యం అవగతంకాక అతను మళ్ళీ మళ్ళీ అర్థిస్తే అమ్మ అప్పుడు విశదపరుస్తుంది - నీకు తోచిందే నేను చెప్పాననుకో - అని. కొందరు ఆ వాక్యాన్ని వెంటనే అర్థం చేసుకుని అంగీకరించి ఆనందంతో వెళ్ళి పోతారు. వారు అదృష్టవంతులు. కొందరు ఆ వాక్యంలోని యథార్థంవారి మేధాశక్తికి అందక బాధ పడతారు.

కాని, అమ్మజీవితమూ, జీవిత విధానమూ, ప్రబోధమూ, బోధనా విధానమూ అన్నీ అద్భుతమయినవీ, అపూర్వమయినవే.

అన్ని క్రియలకూ ఆధారమయిన, అందరి ఆలోచనలకూ ప్రేరణ అయిన అమ్మ - తనకేమీ తెలియనట్లు తన ప్రమేయమేమీ లేనట్లు నిర్లిప్తంగా నిర్వికారంగా కూర్చొనటం మనకు వింతగానూ, వినోదంగానూ ఉన్నా "నా విధానమే మఱుగు" అని సుస్పష్టంగా వివరించి అమ్మ మనకు ఆనందాన్ని కలిగిస్తున్నది.

అనేకుల జీవితాల్లో అమ్మప్రేరణ ఎంత ప్రస్ఫుటంగా ఉంటుందో అనేకులకు విదితమే. ఆ ప్రత్యేక సమయంలో అమ్మే కనుక అట్లా ప్రేరేపించి ఉండకపోతే, తామట్లా చేయటానికే అవకాశంలేదనీ, తమ జీవిత గతియే మరోవిధంగా ఉండి ఉండేదనీ అనేకులు చెపుతారు.

కాని వారికి హేతువాదుల ప్రశ్న ఒకటి ఎదురవుతుంది - ఆ ప్రేరణ యీ అమ్మ చేసినదే అని ఏమిటీ, మరెవరయినా కావచ్చుగదా - అని.

సాధారణంగా దానికి విశ్వాసమే తప్ప సాక్ష్యం లభించటం కష్టం. కానీ....

ఈ నెల 17వ తేదీన -

అనారోగ్యంగా ఉండి చీరాలలో చికిత్స పొందుతున్న నాన్నగారిని చూచి వచ్చిన సోదరి ఉష బాపట్లలో పత్రికా ముద్రణ కార్యక్రమం ఉన్న నా వద్దకు వచ్చి ఆ వివరాలు అందించి, టాక్సీలో జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మకు కూడా నివేదించి వస్తానన్నది నేను అంతకుముందే అమ్మతో ఫోనులో మాట్లాడి ఉన్నాను. అమ్మ నన్ను బాపట్లలోనే ఉండి నా పని నన్ను చూచుకొనమని ఆదేశించింది. తాను ప్రస్తుతంలో చీరాల వెళ్ళే అభిప్రాయమూ వ్యక్తంచేయలేదు కాని నేను హఠాత్తుగా, సోదరి ఉషతో టాక్సీలో బయలుదేరి - అప్పటికి అక్కడకు వెళ్ళి అమ్మను చూచి వద్దామని మాత్రమే - పెట్రోలుబంకు దగ్గరకు వెళ్ళిన తరువాత అమ్మను చీరాల తీసుకు వెళ్ళి నాన్నగారిని చూచివస్తే బాగుండుననే అభిప్రాయం కలిగి అందుకు అవసరమయిన పెట్రోలును కూడా నింపుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళాము. అక్కడ నుంచి అమ్మను తీసుకుని చీరాల వెళ్ళాము. మేము వెళ్ళేసరికి అక్కడ డాక్టరుగారూ, నాన్నగారూ, తదితరులూ అందరూ అమ్మ కోసం నిరీక్షిస్తున్నట్లుగానే చెప్పారు. నాకు ఆశ్చర్యం కలిగింది.

కాని, అమ్మను నేను ప్రయాణం చేయించటానికి ప్రేరణ నాదేనని అనుకోవ టానికి అవకాశముంది. కాని అది నూటికి నూరుపాళ్లూ అమ్మదే అనటానికీ ఆధారమూ, మనకు నిదర్శనానికీ ఏమో - మా టాక్సీ రెండుమైళ్ళు దూరంలో ఉండగానే అమ్మ - వాడు నన్ను చీరాల తీసుకు వెళ్ళటానికి టాక్సీ తీసుకువస్తున్నాడు - అని సోదరి వసుంధరతో చెప్పింది.

మొదట్లోనే వసుంధర ఆ మాట చెబితే ఆశ్చర్యపోయాను. చీరాల వెళ్ళి అక్కడ అమ్మకోసం నిరీక్షిస్తున్న అందరినీ చూచి మరీ విస్మయం పొందాను.

మనను విస్మయపరచటమే అమ్మకు వినోదమా ?

(సెప్టెంబరు 1971)



**అనుబంధం**

చెట్టుకూ కాయకూ ఉండే సంబంధమే -
మీకూ నాకూ గల అనుబంధం. - అమ్మ

# 64
# దీనబాంధవి

ఒకసారి అమ్మ మాతృత్వాన్ని నిర్వచిస్తూ ఎక్కడ మన బాధ్యత నిర్నిబంధంగా స్వీకరించబడుతుందో అదే మాతృత్వం - అన్నది అమ్మ. సాధారణంగా అనేక పర్యాయాలు "ఈ సృష్టి నాది" అనీ, "మీరంతా నా సంతానమే",ననీ "మిమ్మల్ని శుభ్రపరచవలసిన బాధ్యత నాదే" ననీ "మీకు ఏది వచ్చినా సుఖం కానీ దుఃఖం కానీ అది నే విచ్చినదే" ననీ సామూహికంగా హామీలు ప్రసాదించినప్పటికీ "నేను నీ వెన్నంటే ఉంటాను" "నీకేమీ భయంవద్దు" "నీ బాధ్యత నాది" "ఈ విషయం నేను చూచుకుంటాను" మొదలయిన వ్యక్తి గత వాగ్దానాలను అమ్మ వెలువరించటం అరుదుగా నయినా ఉదాహరణలు ఉన్నాయి

యీ నెల 10వ తేదీన సోదరుడు శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి అమ్మ పద సన్నిధికి అరుదెంచాడు అతడు కంఠదఘ్నంగా దుఃఖవారాశిలో ఉన్నాడు కారణం - అతని ప్రియపుత్రుడు కనుపించటంలేదు ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఒక లేఖ వ్రాసి యింటిలో ఉంచి అదృశ్య మయ్యాడు. కుఱ్ఱవాడు ఇంకా సజీవంగా ఉన్నదీ లేనిదీ ఊహించలేని సందిగ్ధావస్థలో అతడు ఊపిరి ఆడక సతమత మవుతున్నాడు. పుత్రుని ఉజ్వల భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెంచుకున్న ఏ తండ్రి హృదయం ఆ తరుణంలో తల్లడిల్లకుండా ఉండగలదు దుర్భర దుఃఖ పరితప్త హృదయంతో కర్తవ్యతా విమూఢ మానసంతో, అశ్రుపూర్ణనయనాలతో భిన్నుడై, ఆపన్నుడై, అతడు అమ్మను దర్శించి అంజలిఘటించి అర్థించాడు పుత్ర భిక్షకోసం

నిత్యమూ ఎందరు రావటంలేదూ - మోయలేని ఎన్నో కోరికల కొండలతో, భరించలేని ఎన్నో బాధలజ్వాలలతో వారిని అమ్మ ఉద్ధరించవచ్చునూ. వారి కామితార్థాలను, సిద్ధింపచేయవచ్చునూ కానీ, ఎవరికి అమ్మ క్రియాదూపేణా, ప్రేరణ ద్వారా కాకుండా వాచ్యంగా సమాధానమిస్తున్నది ? కానీ ఆవేళ అతని వెన్నుతట్టి "ఇక నుండి నీ బాధను నాకు వదిలెయ్యి నేను చూచుకుంటాను. నీవు నిశ్చింతగా యింటికి వెళ్ళు-" అని అమ్మ ఆదేశించింది. అక్కడ ఉన్న మాకూ ఆశ్చర్యమే కలిగించింది.

మా ఆశ్చర్యానికి హేతువు అమ్మ హామీయే కాదు, అంతకు రెండు మూడు రోజుల క్రితమే అమ్మ మమ్మల్ని అడిగింది - ఇంకా శ్రీరామచంద్ర మూర్తి రాలేదేమని అతని ఆగమనానికి కారణం అమ్మ అన్యథా చెప్పినా - నాడుగానీ అసలు విషయం మాకు అవగతం కాలేదు. ఆ సంగతి శ్రీరామచంద్ర మూర్తికి వివరిస్తే అతడూ ఆశ్చర్యంప్రకటించాడు. తాను నిజంగా రెండు మూడు రోజుల క్రితమే రావలసినదనీ, అన్యథా ప్రయత్నిస్తూ అమ్మచెంతకు రాజాలకపోయినాననీ

అతడు ఆశ్చర్యంతోనూ ఆశతోనూ గృహోన్ముకుడయ్యాడు. పిమ్మట రెండు, మూడు దినాలకే అతడి ఆశ ఫలించింది అమ్మ అనుగ్రహించింది. ప్రియపుత్రుడు వాడిన ఆశాలతకు తిరిగి అమృతాభిషేకం చేశాడు అతడు అమ్మకు ఆనందంతో కృతజ్ఞతాభివందనాలు అందించుకున్నాడు.

అప్పుడు మేము అమ్మను అడిగాము - ప్రతిసారీ అందరికీ అట్లా ఎందుకు చెప్పవూ - అని. వెంటనే అమ్మ అందులో తన శక్తి సామర్థ్యాలేమీ లేవని వివరించింది

ఆ కుఱ్ఱవాడు ఆత్మహత్య చేసుకోడని ఎట్లా తెలుసుకొనవచ్చును అంటే - అతడు వెళ్ళుతూ అతని గుడ్డలు వెంట తీసుకు వెళ్ళాడని చెబుతూ ఆత్మహత్య చేసుకుండేవాడికి గుడ్డలెందుకూ అని ప్రశ్నించి..... కాని అతడు అట్లా ఉత్తరం వ్రాయకుండా గుడ్డలు తీసుకుని వెళ్ళినట్లయితే మనం అతని మరణాన్నే శంకించవలసి వచ్చేదని విపులీకరించింది అమ్మ

సామాన్య లౌకిక విషయాల్లో అమ్మ మేధాశక్తికి మేమందరమూ సమ్మోహితుల మయ్యాము.

తరువాత అమ్మ తానట్లా వాగ్దానం చేయటంలోని కారణం వివరించింది. అసలు విషయం ఎట్లాఉన్నా దుఃఖించే హృదయానికి ఉపశమన మవసరం వాడు ఉన్నా పోయినా - ఆ దుఃఖ ప్రభంజనానికి వీడి ప్రాణదీపం కొండెక్కకుండా కాపాడవలసిన బాధ్యత మనపై ఉన్నది. అందుకు ఆ హామీ సాధనసూత్రమేమనట

కష్టంలో నున్న మానవునిపై అమ్మకుగల ప్రగాఢ సానుభూతికి మనం అమ్మను "దీనబాంధవి" అని ఆనందాశ్రువులతో నమస్కరించవచ్చునూ నిరాడంబరమయిన ఆ మధుర స్వభావానికి సమ్మస్థలం కావచ్చునుగానీ అటువంటి మిథ్యాసమాధానా లతో నిరంతరమూ మనకూ - తనకూ మధ్య రకరకాల తెరలను సృష్టించే అమ్మను అర్థంచేసుకొనడం ఎట్లా ??

(అక్టోబరు 1971)



# 65
# మానవి - మాధవి

అమ్మలో ఒకే మనిషికి ఒక క్షణంలో సర్వశక్తి మంతమయిన మాధవత్వమూ సాక్షాత్కరిస్తుందీ, మరోక్షణంలో సామాన్యమయిన మానవత్వమూ గోచరిస్తుంది ఒకే సమయంలోనే ఒకరికి అపరిమితత్వం స్ఫురించడమూ మరొకరికి పరిమితత్వమే కనుపించడమూ కద్దు. అమ్మలోని యీ విలక్షణం మనకు అగ్రాహ్యామే అయినప్పటికీ అది అమ్మయెడల మన విశ్వాసానికి దోహదకారియే అవుతున్నది.

అమ్మలో మనం ఏమయినా అసాధారణతను చూచి అమ్మ సమక్షంలో ఆ ప్రస్తావన తీసుకువస్తే "నాకేమీ తెలీదు నాన్నా, నేనూ మీవంటి దాననే" అంటుంది కాని మళ్ళీ ఒక క్షణంలో "నేను యీ మంచంమీద కూర్చున్నా ననుకుంటున్నారేమో, అమ్మ అంటే అంతటా ఉన్నది" అనీ. . "నాకు యీ గోడలు అడ్డు అనుకుంటు న్నారేమో నేను అంతటా చూడగలను" అనీ..... "నీవు ఎక్కడున్నా నేను నీ వెంటనే ఉంటాను" అనీ... "అయితే అక్కడ నేను లేనంటవా?" అనీ.... ఆ యా సందర్భాల ననుసరించి వివరిస్తూ అమ్మ తన సర్వాంతర్యామిత్వాన్ని ప్రకటిస్తూనే ఉన్నది.

మాటలలో ప్రకటించటమే కాదు, అందుకు అనేకమయిన నిదర్శనాలను కూడా అమ్మ మనకు ప్రసాదించింది. అయితే అమ్మ సర్వ వ్యాపకత్వానికి నిరూపణలు బహువిధాలుగా ప్రసారం చేస్తుంది. కొందరికి ప్రేరణ రూపేణా. కొందరికి స్ఫురణగా, కొందరికి లీలగా, కొందరికి స్వప్నంలో కొందరికి ధ్యానంలో.

కాని కొందరు అదృష్టవంతులకు అమ్మ రక్తమాంసాలతో భౌతిక రూపంలో జిల్లెళ్ళమూడికి వందలమైళ్ళ దూరంలో దర్శనమొసగి అనుగ్రహించిన సంఘటన లున్నాయి

ఈ నెల 5వ తేదీన తమిళనాడులోని పిచ్చుమార్‌నుండి ఒక సోదరుడు బి.పి. చంద్రన్ వచ్చాడు. ఆయనకు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి సన్నిధిలో అమ్మ కనుపించి ప్రసాదం యిచ్చింది. ఆయన అమ్మను అంతకు పూర్వం ఎప్పుడూ

చూచి ఉండలేదు. జిల్లెళ్ళమూడిపేరయినా విని ఉండలేదు. అందువలన ఆయనకు అప్పటికి ఆ ఉదంతంతో వైచిత్రిగానీ, వైశిష్ట్యంగానీ స్ఫురించలేదు.

తరువాత ఆయన వ్యాపారరీత్యా మంగళగిరి వెళ్ళాడు. అక్కడ తన మిత్రుని గృహంలో అమ్మఫోటో చూచి విచారణ చేశాడు. వారు అమ్మను గురించి వివరించారు. ఆయన వెంటనే జిల్లెళ్లమూడికి పరుగెత్తుకు వచ్చాడు. అక్కడ విచారిస్తే అమ్మ ఎప్పుడూ తిరుపతి వెళ్ళలేదని తెలిసింది. ఆయన ఆశ్చర్యానికి మేరలేదు స్థానిక సోదరులు అమ్మను "అమ్మా - నీవు ఆయనకు ఏమి ప్రసాదం యిచ్చావు?" అని అడిగితే - "నాదగ్గర ఏముంటుందీ ఎవరి కయినా యివ్వటానికి? షుగరే యిచ్చి ఉంటాను" అన్నది నవ్వుతూ, వారు వెళ్ళి, ఆ సోదరుని విచారిస్తే ఆయన "అమ్మ పంచదార పెట్టింది" అన్నాడు.

అక్కడ ఉన్న అందరూ ఆ సంఘటనకు ఆశ్చర్యపడేకంటే అమ్మ అతనియందు చూసిన అవ్యాజకరుణకు ఆనందించారు.

ఇటీవల సెప్టెంబరులో ఒకనాడు వరంగల్‌లో ఒక సోదరుడు ఆర్థిక బాధలతో ఉండగా వారింటికి అమ్మ వెళ్ళి ఆయన భార్యకు రూ. 116/-లు ప్రసాదించింది, ఆ పైకాన్ని వారు యిప్పటికీ పూజామందిరంలో భద్రపరుచుకుని నిత్యార్చన చేసుకుంటున్నారట

ఆ సోదరుడు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను అడిగితే "ఇక్కడ డబ్బు ఎక్కువై నీకు యిచ్చానంటావా ? ఇక్కడ వీళ్ళు డబ్బుకోసం యింత యాతన పడుతుంటే ఏమీ చేయలేక చూస్తూ ఉన్నాను. నేనేమయినా యివ్వగలిగితే వీళ్ళకూ యిచ్చేదానినే కదా" అన్నది.

అమ్మలోని యీ మాయచేసే ధోరణే, యీ తెరలువేసే ప్రకృతియే, యీ మేలిముసుగే మనలను ఆడిస్తూ మనతో ఆడుకుంటున్నది

కొందరికి అమ్మలోని యీ ద్వైధీవిధానం విడ్డూరంగా కనుపించ వచ్చునుగానీ అమ్మలోని ప్రత్యేకతయే అది. అందుకనే కరుణామయి అయిన అమ్మ మనం శాశ్వతంగా పారబడకుండా ఉండేందుకే "మరుగే నా విధానం" అని సుస్పష్టంగా ప్రకటించింది.

(నవంబరు 1971)



# 66
# వాగ్వైభవోపేత

అమ్మసన్నిధిలో అందరికీ ఒకే విధంగా ఆనందం లభించదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా ప్రాప్తిస్తుంది. కొందరు అమ్మసన్నిధానంలో ఉపవిష్టులై అమ్మ ఏమీ మాట్లాడకపోయినా, నిశ్చలంగా ఆ మూర్తిని విలోకిస్తూ ఆ నిశ్శబ్ద వాతావరణంలో తన్మయులవుతారు. మౌనం ద్వారానే వారిని సంపూర్ణంగా అమ్మ అనుగ్రహిస్తుంది. ఆ శుభఘడియలలో వారికి గల సమస్యలకూ సందేహాలకూ పరిష్కారాలూ సమాధానాలూ స్ఫురించి వారి హృదయభారాన్ని దించి వారికి మనశ్శాంతిని ప్రసాదిస్తాయి. అమ్మ అపాంగ వీక్షణ ఒక్కటిచాలు - వారి మనోరంగాన్ని మలిన రహితం చేసి మధుభరితం చేయటానికి, అమ్మ ఏ అంగుళి యీషణ్మాత్ర సంచాలన మయినా చాలు - వారి నాడీమండలాన్నే పులకాంకితం చేయటానికి. ఆ విధంగా అమ్మ నిశ్శబ్దగీతికలోనే సప్తస్వర సహిత గాంధర్వ కళావిర్భూత ఆనందరసానుభవం చేయగలిగినవారు ధన్యులు, మనోహరమూ పరమ ప్రశాంతమూ అయిన ఆ మూర్తిమ్రోల వారూ నిశ్శబ్దంగానే ఆత్మార్పణ చేసుకుని అవధులులేని ఆనందానుభవం చేయగలుగుతారు.

కొందరిని అమ్మ తన నిరుపమానమయిన మహిమాన్వితమయిన వాక్కుద్వారా సమ్ముగ్ధులనుచేసి సమ్మోదపరుస్తుంది

అతిశైశవ దశనుండే అమ్మ, వాక్కులోని చాతుర్యమూ, మాధుర్యమూ గాంభీర్యం, నిరవధికమయిన అలౌకిక, జ్ఞాన సంపద ఎందరినో ప్రభావితులను చేసింది. అందుకు ప్రప్రథములు కాకపోయినా ఆ వాగ్జలధిలో తలమునకలైన వారిలో మొట్టమొదటివారు చిదంబరరావుతాతగారు.

"చిన్న పిల్లకు పెద్ద ఆలోచన లెందుకమ్మా?" అని అమ్మమ్మ అడిగితే "పెద్ద వాళ్ళు చిన్న ఆలోచనలు చేస్తున్నారు కనుక" అని అమ్మ అన్నప్పుడూ.

"పెద్దవాళ్ళు పిల్లలను సరిగా చూడాలి" అని అమ్మమ్మ అంటే "సరిగా చూసినవాళ్ళే పెద్ద వాళ్ళు" అని అమ్మ వివరించినప్పుడూ.

"తోలునోరు కాదు కదా తాలుమాట రావటానికి" అని అమ్మ తనను గురించి తాను తెలుపుకున్నప్పుడూ అమ్మమ్మ తన పసిబిడ్డ జిలిబిలిమాటలలోని తియ్యదనానికి మాత్రమే మురిసిపోతే --

"దైవం పంపిన మనిషి దైవంయిష్టం ప్రకారం దైవంలోకి పోతే మధ్యలో మనకు ఏడుపెందుకు?" అన్న అమ్మ తాత్విక చింతనలతోనూ

"నేను ముందు పడ్డాను. మీరు వెనుక పడ్డారు. ముందు నేను పడ్డాను నా వెనుక మీరు పడ్డారు నేను చిన్నమ్మాయిని, ముందు పడ్డాను. పెద్దవారంతా నా వెంట పడ్డారు" అన్న అమ్మ వాగ్విలాసాలతోనూ అనుక్షణమూ అణువణువూ పులకించిపోయిన చిదంబరరావుగారు అమ్మలోని అతిమానవత్వాన్నే సంభావించ గలిగారు

అప్పటి నుండీ పండితులూ, పామరులూ అమ్మ వాగ్వైభవానికీ అందులోని అర్థ గాంభీర్యానికీ, జ్ఞానరోచిస్సులకూ నమోవాకాలర్పిస్తూనే ఉన్నారు.

ఇటీవల పాలకొల్లు గవర్నమెంటు కాలేజీ ప్రధానాధ్యాపకులయిన శ్రీ శివశంకర నారాయణగారు అమ్మను దర్శించి అనేక తాత్త్వికాంశాలపై అమ్మతో ప్రసంగిస్తూ "దేవుడికీ మానవుడికీ గల భేదం ఏమిటీ?" అని ప్రశ్నించారు అమ్మ వెంటనే "భావం" అన్నది ఆ సమాధానంలోని అమ్మ అనుపమ ప్రజ్ఞ వారిని ఎంతగా ఆకర్షించిందో ఎంతగా ఆనందపరిచిందో !

అమ్మసన్నిధిలో గడిపే ప్రతిక్షణంలోనూ సోదరులు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు అమ్మనోటినుండి వెలువడే ప్రతిఅక్షరానికీ ఎంతగా పరవశించిపోతారు ! కనుకనే - ఆ వాక్యాల సేకరణమూ, సంకలనమూ, ప్రచురణమూ ప్రచారమూ వారి జీవితధ్యేయమూ, తపస్సూ అయింది.

అందుకనే నవంబరు 17వ తేదీన చీరాలలో మాతృశ్రీ అధ్యయన పరిషత్ సమావేశంలో మేధాసంపన్నులు శ్రీ వి యం. ప్రసాదరావుగారు "అమ్మను సందర్శించడమే భక్తి. అమ్మతో సంభాషించడంమే జ్ఞానం" అని అతిరమణీయంగా అభివర్ణించారు. భక్తీ జ్ఞానం ఒకటే నన్నది అమ్మ.

(డిశంబరు 1971)



# 67
# బిడ్డలతృప్తే తల్లి సంతృప్తి

ఆయన ఒక డాక్టరు. అతడు తన వైద్యవృత్తిని ప్రత్యేకంగా ప్రారంభిస్తూ అందుకు అమ్మ అనుమతిని అర్థించాడు. అమ్మ అంగీకరించింది ఆ సమయంలోనే అతడు మ్రొక్కుకున్నాడట - తన వృత్తిలో తాను ప్రగతిని సాధిస్తే అమ్మకు ఏమయినా సమర్పించు కుంటానని

అతని ఆకాంక్ష ఫలించింది. అతని చేతిమీదుగా ఎందరికో ప్రాణదానం జరిగింది. అతడు 'బ్రతకరు' అనుకున్న రోగులు బ్రతికారు. 'తగ్గవు' అనుకున్న జబ్బులు తగ్గాయి. ఎన్నో సంఘటనలు రోగులతోపాటు వైద్యుడినీ విస్మయ పరిచాయి. రోగులు 'డాక్టరుగారి చేతిచలువ' అని ఆనందించారు డాక్టరు తన ఆరాధ్య దైవమయిన అమ్మ తన మీద కరుణతో నిరంతరం తనను కాపాడుతున్నదని భావించి మనసంతా కృతజ్ఞతతో నింపుకున్నాడు.

కృతజ్ఞతకు రూపం యివ్వాలని సంకల్పించాడు తనను అమ్మ ఆశీర్వదించి నట్లే తానూ అమ్మను ఆనంద పరచాలని అభిలషించాడు.

అమ్మకు కారులో ప్రయాణం చేయటమంటే ఎంతో యిష్టమని విన్నాడు. వెంటనే తన అంబాసిడర్ కారును అమ్మకు సమర్పించి అమ్మను సంతోషపరచి తాను సంతృప్తి చెందాలని ఆశించాడు

ఈ నెల 14వ తేదీన భోగి పండుగనాడు అతడు జిల్లెళ్లమూడి వచ్చాడు. ఆయన ఉద్దేశం ముందుగా మాకు వివరించాడు మేమూ ఆనందించాము .. ఎన్నాళ్ళనుండో అమ్మ మమ్మల్ని అడుగుతున్న కోరికను మేము తీర్చలేక పోయినా, అది యీ విధంగా తీరుతున్నది గదా - అని

తరువాత ఆయన అమ్మ వద్దకు వచ్చి తన సత్సంకల్పాన్ని అమ్మకు విన్నవించాడు అమ్మ ఏమీ మాట్లాడలేదు అతడు అతివినయంగా అంజలి ఘటించి - "అమ్మా - నీకు కారు అంటే చాలా యిష్టం అని విన్నాను. ఈ కారు నీవు సరదాగా వాడుకో అమ్మా" అని వేడుకున్నాడు.

"నిజమే, నాకు కారు అంటే యిష్టమే కానీ కారు నావరకే ఉపయోగిస్తుంది నీ వేదయినా చేయదలచుకుంటే చాలా పనులున్నాయి" అన్నది అమ్మ.

"నీ యిష్టమమ్మా, నీవెట్లా ఆజ్ఞాపిస్తే అట్లాగే చేస్తాను. ఇది నీవు నాటిన చెట్టు నీవు పోషిస్తున్న చెట్టు, కనుక యీ పూలు, పండ్లూ అన్నీ నీవే"

"అయితే ఒక పనిచెయ్యి నాన్నా.. పది మందికీ పనికివచ్చే పనిచెయ్యి ప్రస్తుతం పిల్లలు భోజనం చేయటానికి సరిఅయిన వసతి లేక ఏదో షెడ్డు వేయించాలనుకుంటున్నారు. అందుకు నీకు తోచినంత యివ్వు-"

అతడు అందుకు ఆనందంగా అంగీకరించాడు

మాకు వెంటనే బాధ కలిగింది - అమ్మ కోరిక తీరకుండానే మిగలి పోయిందే - అని, కాని వెంటనే అమ్మ సూచనలో ప్రఫుల్లమయిన మాతృత్వానికి మా మనసు ఆనంద తరంగిత మయింది

అది - నిజంగా అమ్మకే చెల్లుతుంది. ఆ సమయంలో ఆ మాట అమ్మ మాత్రమే అనగలుగుతుంది - అనిపించింది.

తన ఆనందం కోసం ఒకరు కారును సమర్పిస్తే - "నాకు సరదా లెందుకు నాన్నా ! పిల్లల అవసరం చూడండి. వారి యిబ్బందులు తీర్చండి-" అని ఒక్క తల్లి తప్ప మరి ఎవరు అనగలరు ?

పూర్వమూ ఒకసారి సోదరి మార్వా అమెరికా వెళుతూ "అమ్మా - నేను కొన్ని నెలలు ఉద్యోగంచేసి కొంత డబ్బు నిలువ చేస్తాను. ఆ పైకంతో నీకు కారు పంపమంటే పంపుతాను. లేకపోతే నేను మళ్ళీ వచ్చి నీ దగ్గర కొంతకాలం గడుపుతాను" అంటే అమ్మ ఆమెనే రమ్మన్నది.

కారు పంపిస్తే తనకు తృప్తి తాను వస్తే తనకే తృప్తి. మరి, తల్లి తన తృప్తి చూసుకుంటుందా ? బిడ్డ తృప్తికే ప్రాధాన్యం యిస్తుంది. పైగా బిడ్డ తృప్తినే తన సంతృప్తిగా సంభావిస్తుంది

లేకపోతే - ఒక్కగ్లాసు మజ్జిగ త్రాగితే తగ్గిపోయే తన కడుపులోని మంటను - అవి తాను త్రాగితే తన పిల్లలకు ఎక్కడ తరిగిపోతాయో అని ఆ మంటను అట్లాగే సహించటానికి తల్లికి తప్ప ఎవరికి సాధ్యమవుతుంది.

(జనవరి 1972)



# 68
# సర్వజ్ఞత్వము

అమ్మ మహోజ్వల జీవిత చరిత్రనూ, అమ్మవాక్యాల సంపుటాలనూ పరిశీలిస్తే తొలునోరుకాని, తాలుమాటరాని అమ్మ తీయని నోటినుండి చాలా తరచుగా విలక్షణంగా వినిపించేమాటలు నాలుగున్నాయి... నాకేమీ తెలీదనీ నేనేమీ చేయలేననీ, మీ యిష్టమనీ, సరే ననీ, ఈ నాలుగు వాక్యాలూ నాలుగు మంత్రాల్లాగా అమ్మ నిత్యమూ పునశ్చరణచేస్తూ ఉంటుంది

ఏమీ తెలియని మనం లేక కొంత తెలిసిన మనం మనకు తెలియని విషయప్రసక్తి వచ్చినప్పుడు కూడా 'నాకు తెలీదు' అని అంగీరించటానికి మనస్సు యిష్టపడదు. అదేదో మన ప్రతిష్టకూ పరువుకూ సంఘంలో మన స్థానానికీ న్యూనత కలిగించేదిగా బాధపడుతూ తెలియని విషయాన్నీ తెలిసినట్లు నటించటానికి ప్రయత్నిస్తుంటాము.

ఏమీ చేయలేని మనం, ఏమీ చేతగాని మనం, చేతలు మన చేతలేని మనం ప్రతిపనీ మనమే చేశామనీ చేస్తున్నామనీ భ్రమపడుతూ యితరులకు అది చేస్తాను, యిది చేసిపెడతాను - అని వాగ్దానాలు ప్రసారంచేస్తూ, అవి నిర్వర్తించలేక నిర్వహించలేక బాధపడుతూ ఉంటాము

ఏదయినా ఒక సమస్యలో చర్చ వచ్చినప్పుడు, ఒక క్రియాచరణలో వివాదం ఏర్పడినప్పుడు మనం ఎప్పుడూ 'మీ యిష్టం' అని ఎదుటి వారిమీద వదలలేము. ఒకవేళ ఎవరయినా ఏ విషయంలో నయినా సలహా అడిగితే 'మీ యిష్టం' అని వారికి స్వేచ్ఛ నివ్వలేము.

ఎవరయినా ఒక విషయం మనకు చెబితే వెంటనే 'సరే'నని ఎప్పుడూ అనలేము. ఎంతసేపటికీ ఎదుటివారు చెప్పినది 'కాదు' అంటూ బలంలేకపోయినా, అందులో సత్యం లేకపోయినా మన వాదాన్నే నెగ్గించుకోవాలని నిరంతరం తాపత్రయ పడుతుంటాము

కాని అమ్మ చాలా సునాయాసంగా, ఏమీ ఆలోచించకుండా, ఏమీ బాధపడకుండా నా కేమీ తెలీదనీ, నే నేమీ చేయలేననీ, మీ యిష్ట మనీ, సరేననీ పలుకుతూ ఉంటుంది. అమ్మనోటివెంట ఆ మాటలు మాత్రమే వింటూ అమ్మ మనలను జయించే తీరు చూస్తే మనం కూడా ఆ అస్త్రాలనే ప్రయోగించి జీవితంలో విజేతలం కాకూడదా- అని మనకు ఆశ కలగడం సహజం

ఏమీ తెలియని అమ్మ, ఏమీ చేయలేని అమ్మ యింత మహాద్భుత చరిత్రను ఎట్లా నడుపుతున్నదీ, యింత మహోజ్వల జీవితానికి ఆధారమేమిటీ అని మనకు విస్మయంతోబాటు అమ్మ అసత్యమాడుతున్నదా అన్న సందేహమూ కలుగుతుంది.

కాని అమ్మజీవితమహోదధి లోతులకు వెళ్ళి పరిశీలిస్తే.... అందులోని రహస్యం మన కవగతమై మన మనస్సు అమ్మచరణాల మ్రోల వినమ్రమై, మన చేతులు ముకుళిత మవుతాయి

అమ్మ కొన్ని నిర్వచనాలు చేసింది  నామరహితుడు అంటే అన్ని నామాలూ కలవాడనీ, గుణరహితుడు అంటే అన్ని గుణాలూ కలవాడనీ, రూపరహితుడు అంటే అన్ని రూపాలూ కలవాడనీ, అట్లాగే ఏమీ తెలియనివాడు అంటే అన్నీ తెలిసినవాడనీ, ఏమీ చేయలేనివాడు అంటే అన్నీ చేయగలిగిన వాడనీ అర్థం  ఇక మనకు ఆ మాట అనటానికి అర్హత ఏదీ ? అమ్మ అసత్యమాడుతున్న దని శంకించటానికి అవకాశమూ లేదు.

'మీ యిష్ట'మనీ, 'సరే'ననీ అన్నింటికీ మన అభిప్రాయానికే అమ్మ స్వేచ్ఛనిస్తున్నట్లు కనుపిస్తున్నది కానీ ఆలోచిస్తే, అదీ యధార్థం కాదు. అమ్మయే ఒకసారి అన్నది -- నేను మీ యిష్టప్రకారమే నడుస్తున్నట్లు కనుపిస్తానుగానీ నిజానికి నాయిష్టప్రకారమే మిమ్మల్ని నడుపుకుంటాను - అని. అనేక సంఘటనలలో అది రుజువయింది కూడ. అమ్మ ఒక విషయంలో మన సలహా అడిగినట్లు కనుపించినా తన అభిమతం ప్రకారమే మనచేత పలికించి, మనం చెప్పినట్లు తాను చేశానంటుంది. మరి, యిన్ని మనస్సులనూ యిందరు మనుష్యులనూ తన అభీష్టానుసారమే నడుపుకొనడమంటే సామాన్యమయిన విషయమా ? అది మనకు సాధ్యమయ్యే సంగతా ?

కనుకనే మనమూ అట్లా అనాలనో, ప్రవర్తించాలనో అనుకుంటే పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లే అవుతుంది.

(ఫిబ్రవరి 1972)



# 69
# అమ్మ సాధన

ఈ నాడు అమ్మ జన్మదినమహోత్సవం. అందుకే యిక్కడ యింత జనసమూహమూ, యింత ఆనంద సంరంభమూ నిజమే, మనందరకూ నేడు మహాపర్వదినమే. కాని, యింత కోలాహలంలో ఒక్క క్షణం నిలుచుని ఆలోచిస్తే - - యిది అమ్మకు ఏభైయవ జన్మదినమని స్ఫురణకు వస్తుంది. ఏభై సంవత్సరాలు అపార కాలసింధువులో ఒక బిందుప్రాయమయినా కాకపోవచ్చు కాని పరిమిత మయిన మానవ జీవితంలో అది సుదీర్ఘమయిన గణనీయమయిన కాలమే కాగలదు.

ఈ ఏభై సంవత్సరాలుగా అమ్మ అవనీతలానికి అడుగిడినప్పటి నుంచీ లిప్తకాలం విశ్రాంతిలేకుండా నిద్రాహారాలు లేకుండా అహోరాత్రులూ మనకోసం తపిస్తూనే ఉన్నది.

ఒకరు నీ పూజ ఏమిటమ్మా ? అంటే --- మీరు కావాలను కోవటమే నన్నది అమ్మ ఒకరు నీ ప్రార్థన ఏమిటమ్మా ? అంటే -- మీ రంతా నేనే అనుకోవటమే నన్నది. ఒకరు మీ ధ్యేయ మూర్తు లెవరమ్మా ? అంటే --- మీరే నా ధ్యేయ మూర్తులు అన్నది. ఒకరు నీవు సాక్షాత్తూ రాజరాజేశ్వరివమ్మా అంటే - మీరు కానిది నేనేదీ కాదు నాయనా అన్నది. ఒకరు మేము అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాము అంటే - కాదు నాన్నా, నా దృష్టిలో మీరు పరిపూర్ణమయిన జ్ఞాన స్వరూపులు అన్నది. మరొక సందర్భంలో మీరుకూడా భగవంతుడే నన్నది. ఇంకొక సందర్భంలో "మీ రంతా నా అవయావలనుకుంటున్నాను. చెయ్యి నొప్పి కాలికి తెలియదు. కాలినొప్పి కంటికి తెలియదు. కాని అన్నిటినొప్పి నాకు తెలుస్తుంది" అన్నది. నేను దేనికోసమూ, ఏదీ చేసింది లేదు. ఆరాధనకూడా ప్రత్యేకించి దైవ మొక దాంట్లో ఉన్నదని ఆరాధించలేదు మీ అందరినీ ఆరాధించటమూ, మీ రందరూ దైవ మనుకోవటమే -నన్నది. "నేను అమ్మను, మీరు బిడ్డలు" అని పలుమార్లు పదేపదే ప్రకటించింది. ఒకరు నీ సాధన ఏమిటమ్మా? అంటే - బిడ్డల్ని కనటమే నన్నది... ఎక్కడ ఎవరిని చూచినా తన బిడ్డయే అనిపిస్తుందట. తానే మనల నందరినీ కని మన తల్లులకు పెంపుడుకు యిచ్చిందట. అందుకే ఒకసారి అమ్మ అన్నది "మీ

రందరూ లేకుండా నేను వెళుతుంటే నా ఒళ్ళో నుండి పిల్లలను లాగి అవతల పారేసి నన్ను తీసుకు వెళ్ళుతున్నట్లుంది'' అని

అమ్మ ఎన్నో రీతుల్లో మనకూ అమ్మకూ గల అభేదస్థితినీ, ఎన్నో తీరుల్లో మనకూ అమ్మకూగల మాతాశిశుబాంధవ్యాన్నీ ప్రస్ఫుటం చేసింది.

అమ్మ మానవాకృతిని స్వీకరించటానికి హేతువుకూడా మన కోసమే. ఈ పరమసత్యాన్ని అమ్మ మనకు అనేక సమయాల్లో అవగతం చేసింది.

ఒకసారి ''ఈ అవతారం చుట్టూ మీరు; మీకోసం యీ అవతారం'' అని ఉద్ఘాటించింది

ఒక సందర్భంలో ఒక వృద్ధురాలు నిష్ఠురంగా 'ఈ బొమ్మను' అని తననుద్దేశించి 'నీ యిష్టం వచ్చినట్లు ఆడిస్తున్నావు' అని అంటే అమ్మ నవ్వి ''ఆ బొమ్మలను ఆడించటానికి'' అని తనను చూపుకుంటూ ''ఈ బొమ్మ ఎన్ని ఆటలు ఆడాలో ఆలోచిస్తున్నావా?'' అని అడిగింది.

మరొకసారి, సోదరులు రామరాజు కృష్ణమూర్తి 'బీరువాలు నీకు ఉపయోగ పడవుగా, పుస్తకాల కోసం అయితే నేనివ్వను' అన్నాడు. అమ్మ వెంటనే అన్నది ''అట్లాగయితే ఏదీ నా కోసం కాదు. నేను చీరె కట్టుకోవటం, స్నానం చేయటం కూడా మీ కోసమే'' అని.

ఒక అందమయిన సాయంకాలం అమ్మ... సతులకై కొన్నాళ్ళు, సుతులకై కొన్నాళ్ళు... అన్న త్యాగరాజు కీర్తన వింటూ ''నేనిప్పుడు అదే స్థితిలో ఉన్నాను. ఈ సంతానం కొరకేగా నా కిదంతా-'' అనుకొన్నది.

ఇంకొక సందర్భంలో ''మీ రనేకం ఆలోచిస్తుంటారు. కానీ నా కొకటే ఆలోచన, మీ గురించే'' అన్నది అమ్మ.

అమ్మ అనారోగ్య విషయమూ, అమ్మకుగల జబ్బుల ప్రస్తావనా వచ్చినప్పుడు ''మీరు లేనప్పుడు ఇవీ ఉండవు'' అని అసందిగ్ధంగా ప్రకటించింది.

అయినా అమ్మకు మనపైగల మమకారమూ, కరుణా, సానుభూతీ ఎనలేనివీ, ఎల్లలు లేనివీ, ఎక్కడా మనం మరోచోట అనుభవించలేనివీ.

ఒకసారి ఒక సోదరికి చేతికి దెబ్బ తగిలీ, ఆ బాధతోనే అమ్మకు కాళ్ళు రాస్తున్నది. అప్పుడు అమ్మ కుంపటీ, నీళ్ళూ తెప్పించి ''నువ్వు నాకు కాళ్ళు పిసుకు, నేను నీకు కాపు కాస్తాను'' అన్నది. ఎందరికో ఎన్ని విధాలుగానో అమ్మ వాత్సల్యంతో పరిచర్యలు చేసింది.

మనం అమ్మ జీవిత చరిత్రను పరిశీలించినా, ఒక్కరోజు అమ్మ పదసన్నిధిన ఉండగలిగినా అమ్మలో పొంగిపొరలే అనురాగ స్రవంతులు మనలను ఆశ్చర్య ఆనందాలతో ముంచెత్తుతాయి.

నిత్యమూ అమ్మదర్శనార్థం అసంఖ్యాకులు అరుదెంచుతారు ఇందులో అధికభాగం ఏదో విధంగా బాధా సర్పదష్టులూ, విధివంచితులే. ఎందరో నష్టజాతకులూ, భ్రష్ట జీవిత పథగాములూ, దురదృష్టదేవతా వరపుత్రులూ, ఎందరో జీవితంలో పరాజితులూ, పరాభూతులయినవారే అనేకులు కరాశకాల కబంధ పరిరంభంలో నలిగిపోయినవారే.

అందరూ అమ్మకు తమ తమ దీన గాథలూ, హీన చరిత్రలూ, దయనీయ పరిస్థితులూ, దుర్భర దుస్సహ వ్యథలూ విన్నవించుకుంటారు. తమ గుండెలనే కరిగించి రక్తాన్నే కన్నీటి ఏరులుగా ప్రవహింపజేసి అమ్మ హృదయ కేదారాన్ని తడిపివేస్తారు. భార్య, భర్తకు చెప్పుకోలేనివీ, భర్త భార్యదగ్గర ఒప్పుకోలేనివీ, తల్లిదండ్రులకు పిల్లలు చెప్పుకోలేనివీ, పిల్లలు తలిదండ్రులకు చెప్పుకోలేనివీ కూడా అమ్మకు విన్నవించుకుంటారు.

"వాళ్ళు అనుమానంగా బాధగా వచ్చినప్పుడు వాళ్ళబాధ పోగొట్టాలి. సందేహం తీర్చాలి. కాని యింకొకటి చెప్పరాదు" అని అమ్మ కొందరికి వాచ్యంగానూ, కొందరిక్ క్రియారూపంగానూ సమాధాన మిస్తుంది.

పతితులకూ, పాపులకూ ప్రేమతో ఆదరంతో తన ఒడిలో స్థానమిచ్చి "శిక్ష అంటే మనిషిని సంహరించటం కాదుగా. గుణాన్ని మార్చటమే నంటూ "ఎవరే దారినపోతే వారిని ఆ దారిన పోనిచ్చి మెల్లగా యిటుత్రిప్పుకు రావాలి" అని లాలనతో వారిని సన్మార్గులుగా మార్చుకుంటుంది.

"నీ కేమీ ఫరావాలేదు. నేను ఉన్నాను. నీకు చేసేవాళ్ళు లేరు - అనుకోకు. నేను చేస్తాను. నాలోనే కలుపుకుంటాను. ముందు, నీకు ఎవరూ లేరన్న దిగులు పోగొట్టుకో, నీకు నేను చేస్తాను, అన్నానుగా-" అని ఒకరికే గాదు, ఎందరికో అభయప్రధానం చేసింది.

మనకు అన్నంపెట్టీ, మనకు గుడ్డలు పెట్టీ అమ్మ ఆనందిస్తూ "నీవు నాకు పెట్టుకుంటే నీవు ఎంత తృప్తో, ఎవరికన్నా పెట్టుకుంటే నాకు అంత తృప్తి" అనీ "నేను కట్టుకునే కంటే ఎవరయినా కట్టుకుంటేనే నాకు సంతోషం" అనీ అమ్మ అనేక పర్యాయాలు పలికింది.

అమ్మ అనేక రకాలుగా బాధఅనుభవిస్తూనూ "మీకు చెప్పుకుంటే తీరుతుందని మీరు నాతో చెప్పుకుంటారు. నేను చెప్పుకుంటే మీరు బాధపడతారని నేనే పడతాను' ' అని అమ్మ తన బాధను మనకు తెలియనివ్వదు.

ఇంతగా కష్టపడి మనను కని, కష్టపడి మనను పెంచుతున్నప్పటికీ యింకా పిల్లలకోసం ఆశా, చాలక అసంతృప్తి అని బాధపడుతుంది.

"గుణభేదమే నా కుంటే ఏ ఒక్కరూ నా దగ్గరకు రాగలిగేవారు కారు". "నేను దగ్గరకు తీయటంతప్ప వాళ్ళు దగ్గరకు రావటం కాదు," "నేను మీ గుణగణాలు చూసి ప్రేమించటం లేదు. నా కోసం నేను ప్రేమిస్తున్నాను." "నాకు ప్రేమించడం, మీకు ప్రేమించబడటం సహజం". - అని తన ప్రేమ తత్వాన్ని ప్రకటిస్తూ - "తనను కన్నవాళ్ళ మీదకంటే తాను కన్నవాళ్ళ మీద ప్రేమ ఎక్కువ" అని వివరించింది ప్రేమావతారమూర్తి అమ్మ

"ధర్మంకోసం తల్లి కాదు తల్లి ధర్మం నిర్వర్తించటానికే వచ్చా"నని చెబుతూ, అందరినీ శుచీ, శుభ్రం చేయటమే తన ఆగమనానికి పరమ ప్రయోజనంగా వ్యక్తం చేసింది అమ్మ.

అందుకనే సోదరులు సుదర్శనంగారు "అమ్మ మతాన్ని ఉద్ధరించటానికి కాదు మానవుణ్ణి ఉద్ధరించటానికి అవతరించింది" అని వెల్లడించారు.

అమ్మ మనను అనుక్షణం ప్రేమిస్తున్నది, ఆదరిస్తున్నది శుచి చేస్తున్నది, ఉద్ధరిస్తున్నది. మరి, అమ్మకు మనం ఏమి చేస్తున్నాము ?

"అన్నీ యిచ్చేది అమ్మ అయితే, అమ్మకు మనమేమి యివ్వగలం?" అనుకుంటే సరిపోతుందా ? అది మనకు ఎల్లవేళలా మనస్ఫూర్తిగా ఉంటే సరిపోతుంది. లేనప్పుడు, లేనివారు అమ్మకు ప్రేమతోనో, భక్తితోనో నివేదించు కొనవలసినదే, సమర్పించుకొన వలసినదే.

ఇంతవరకూ ఎట్లా గడిచినా, యీ సంవత్సరం అమ్మకు స్వర్ణోత్సవ సంవత్సరం. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని మన యథాశక్తి మనం చేయాలి. ఏం చేయాలి? ఎట్లా చెయ్యాలి ? - అన్నది మన మందరం కలిసి ఆలోచించు కోవాలి ఆలోచించుకొని నిర్ణయించుకోవాలి. నిర్ణయించుకొని నిర్వర్తించాలి.

(మార్చి 1972)



# 70
# "నేనందరినీ ప్రేమిస్తాను"

పుట్టిన ప్రతిప్రాణి జీవితానికీ సార్ధకత సంప్రాప్తం కాకపోవచ్చును. వారి ప్రతి చర్యకూ ప్రయోజనం పరమావధి కాకపోవచ్చును వారి ప్రతిమాటా పరమార్ధ గర్భితం కాకపోవచ్చును

కానీ కొందరు జీవులుంటారు. వారు చేసే ప్రతిపదమూ మహోత్తమ లక్ష్యన్ముఖమై నడుస్తుంది. వారి పెదవిదాటిన ప్రతిపదమూ మహోదాత్త అర్ధస్ఫోరకమై అలరారుతుంది. వారి జీవితం మానవాళికే ఆదర్శవంతమై, మహోన్నత సూత్రాలకూ సిద్ధాంతాలకూ సజీవోదాహరణమై మహోజ్జ్వలమై వెలుగొందుతుంది. వారినే కొందరు కారణ జన్ములనీ అవతార పురుషులనీ అంటారు. వారినే కొందరు పరిపూర్ణ మానవులనీ, పురుషోత్తములనీ అంటారు.

నేడు అమ్మలో దైవత్వం అనుభూత మయిన కొందరు అమ్మను అవతారమూర్తి అన్న పరమ విశ్వాసంతో పూజిస్తున్నారు, ఉపాసిస్తున్నారు. అమ్మలో పరకాష్ఠనందుకున్న మానవతను అవలోకించి అవగాహన చేసుకున్న మరికొందరు అనురాగమూర్తిగానే సంభావన చేసి అమ్మను ప్రేమిస్తున్నారు, గౌరవిస్తున్నారు. అమ్మ మాత్రం వీరూ వారూ అన్న భేదభావరహితంగా ప్రేమిస్తున్నది. మనం మన దృష్టిని యింకొంచెం నిశితం చేసుకునో, యింకొంత విశాలం చేసుకునో చూస్తే - అమ్మ తనను పూజించేవారినీ, ప్రేమించే వారినే కాక తనను ద్వేషించేవారినీ, నిందించేవారిని సైతమూ ఒకే స్థాయిలో ప్రేమిస్తున్నది.

ఈ ప్రేమ అమ్మ బాల్యం నుండీ అమ్మలో సహజంగానే ఉన్నట్లు - అమ్మ జీవితాన్ని పరిశీలించిన,ఆ అమ్మ జీవితచరిత్రను పఠించిన మనకు అవగతమవుతుంది. తన తొమ్మిదవ సంవత్సరంలో ప్రఖ్యాత పండితులూ, పరమ సాధువులూ అయిన వాసుదాసస్వామివారిని అమ్మ కలుసుకున్నప్పుడు చిన్న తనంలోనే తల్లిని కోల్పోయిన అమ్మను చూచి జాలిపడి - 'అందరూ నిన్ను ప్రేమించేటట్లు దీవించేదా?' అని

వారు అడిగితే "అట్లాకాదు. ఎవరు నన్ను ప్రేమించినా, ప్రేమించక పోయినా- నేను అందరినీ ప్రేమించేటట్లు దీవించండి" అని వారిని అమ్మ అడిగిననాడు స్వామివారినే కాక నేడు అవ్యాజమూ, అనుపమానమూ, అపారమూ అయిన ప్రేమతో జగత్తునే విభ్రాంతిచకితం చేస్తున్నది

దానికి మనం 'కరుణ' అని పేరు పెట్టుకొన వచ్చును 'సానుభూతి' అని నామకరణం చేసుకోవచ్చును దానిని మనం 'ప్రేమ' అని పిలువవచ్చును. 'వాత్సల్యం' అని భావించవచ్చును. పేరు ఏమయినా మనపై అమ్మకు గల మధురభావం మాత్రం అనిర్వచనీయమయినదీ, అపూర్వమయినదీ, పూర్వం ఏ చరిత్రలోనూ, ఏ పురాణంలోనూ, కనీ వినీ ఎరుగనిదీ - అమ్మకు ఎక్కడ ఎప్పుడు ఎవరిని చూచినా తన బిడ్డయే అనిపిస్తుందట ఎవరిలోనూ ఏతప్పు కనుపించదట. ఒకవేళ ఎవరైనా ఏ సాంఘిక నియమాన్ని ఉల్లంఘించో, ఏ ధర్మసూత్రాన్ని వ్యక్తి ఏ ప్రవర్తనకయినా బాధ్యత దైవం యిచ్చే ప్రేరణదే నని అమ్మ ప్రబల విశ్వాసమూ ప్రబోధమూ కనుక ఆ దోషం దైవానిదేననీ అందుకు ఏదయిన శిక్ష ఉంటే ఆ దైవమే అనుభవించాలనీ అమ్మ ఉద్ఘాటిస్తున్నది

కనుకనే మనం గణించే పాపపుణ్యాలూ మంచి చెడ్డలూ అమ్మ దృష్టిలో లేవు అమ్మకు దుర్మార్గులూ - సన్మార్గులూ, అందరూ సమానమే కాకపోతే సన్మార్గులను వారి సత్ప్రవర్తనమే కాపాడుతుందీ, లోకమూ గౌరవిస్తుందీ కనుక దుర్మార్గులకు తాను ఆశ్రయమివ్వాలీ, వారిని ఆదరించాలీ, ఆదుకోవాలీ అని జాలిపడుతుంది. ఏ మనిషి అయినా ఏతప్పునయినా తప్పించుకోలేకనే చేస్తాడని అమ్మ నమ్ముతుంది. ఏ సమయంలోనయినా, ఏ సందర్భంలో నయినా అమ్మకు మానవాళిపైగల కరుణకూ ప్రేమకూ హద్దు చూడలేము.

మానవుడు నిత్యమూ అన్వేషించే సుఖశాంతులు పొందటానికి అమ్మ నిరంతరం నిర్విరామంగా సందేశాన్నీ సూత్రాలనూ ప్రసారం చేస్తున్నది మనిషిని నిర్నిద్రంగా అలమటింపజేసి అలయింపజేస్తున్న అసంఖ్యాక సమస్యలకు అమ్మ సులభపరిష్కారాలనూ సుగమమార్గాలనూ ప్రబోధిస్తున్నని.

అమ్మను దర్శించినవారికీ, స్మరించినవారికీ, ధ్యానించినవారికీ, ఉపాసించిన వారికీ, పూజించినవారికీ అమ్మ అనేకానుభవాలు ప్రసాదిస్తున్న విషయం ఎవరికి వారికే అనుభవైకవేద్యం. ఒకరి అనుభవాన్ని మరొకరు నిరాకరించటానికీ ఖండించటానికీ వీల్లేదు. వారికి రాముడుగానో, శివుడుగానో, కృష్ణుడుగానో,

ఏసుక్రీసుతగానో, మహమ్మదుగానో, సీతగానో, పార్వతిగానో . ఏ దేవత రూపంలో నయినా అమ్మదర్శనం యివ్వవచ్చునూ వారికి అసాధ్యాలను సాధ్యాలుగానూ, అఘటనలను ఘటనలుగానూ చూపించవచ్చునూ. చేయవచ్చునూ

కానీ వాటన్నిటికంటే దేశకాలాద్యతీతంగా అమ్మ ప్రవచిస్తున్న సత్యాలూ, ప్రసారం చేస్తున్న సందేశమూ వినూత్నమూ విశిష్టమూ అయినదే కాక విప్లవాత్మక మైనదీ, ప్రజా బాహుళ్యానికి అత్యంతోపయుక్తమయినదీ

చరిత్రలోనూ పురాణాల్లోనూ అనేకానేక మహత్తులు ప్రకటించిన వాళ్ళూ ప్రదర్శించినవాళ్ళూ... అవతార పురుషులనీ కారణజన్ములనీ ప్రఖ్యాతి నందినవాళ్ళూ, ప్రసిద్ధులయినవాళ్ళూ... అనేకులున్నారు కానీ అమ్మవలే అమృత హృదయులై అనురాగమూర్తులై వాత్సల్యసింధువులై జనసామాన్యాన్ని యింతగా జాగరితం, ప్రభావితం, చేసినవాళ్ళూ, సృష్టి రహస్యాన్ని యీ విధంగా ప్రజాకోటికి ఏ అరమరికా లేకుండా తేటతెల్లంగా బహిర్గతం చేసినవాళ్ళూ ఏ విచక్షణా పాటించకుండా ఎల్లరకూ తన ఎనలేని ప్రేమను ఎల్లలు లేకుండా పంచిపెట్టిన వాళ్ళూ .... అల్పమూ, అరుదే కాదు అపూర్వంకూడా.

ఎటు జూచినా ఎట్లా ఆలోచించినా అమ్మ చరిత్రా అమ్మ జీవితమూ అమ్మ హృదయమూ - అమ్మ మూర్తీ - అత్యద్భుతమూ అమృతమయమూ అనురాగ భరితమూ ఆదర్శవంతమూ ఆరాధ్యమూ అయి ఉన్నాయి.

మరి అమ్మకు యీ సంవత్సరం స్వర్ణోత్వం జరుపుకోవాలని నిశ్చయించు కున్నాము. మన ప్రేమను ఎట్లా వ్యక్తం చేసుకోవాలీ అన్న విషయంలో భిన్నభిన్న అభిప్రాయాలుండటం సహజం

కొందరు యీ సందర్భాన్ని పురస్కరించుకుని - రోజూ అష్టోత్తర నామావళితో పూజచేసుకునేవాళ్ళు సహస్రనామాలతో పూజచేసుకొనవచ్చును రోజూ ఒక కొబ్బరి కాయ కొట్టేవాళ్ళు వంద కొబ్బరికాయలు పగులకొట్టవచ్చును. రోజూ అమ్మ పాదాలపై ఒక పువ్వును సమర్పించేవాళ్ళు బుట్టెడు పూలను కుమ్మరించవచ్చును. రోజూ ఒక పండును నివేదన చేసేవాళ్ళు గంపెడు పండ్లను ఆరగింపుచేయవచ్చును. రోజూ ఒక్క అగరువత్తిని వెలిగించేవాళ్ళు కట్టపత్తులతో గదిని పరిమళభరితం చేయవచ్చును కర్పూరంపలుకుకు బదులుగా కర్పూరం ముద్దనే వెలిగించి హారతి యివ్వవచ్చును. - ఏదో మొక్కుబడి చెల్లించుకుని చేతులు దులుపుకోవటం కాక యీ సందర్భంలో మనపై బృహత్తరమైనబాధ్యత ఉన్నది.

అమ్మ దర్శనార్థమై ఎంత ఎక్కువమంది నిత్యమూ వస్తున్నారని మనం అనుకుంటున్నా - అమ్మను గురించి తెలియనివాళ్ళూ, అమ్మ ప్రశాంత మనోజ్ఞమూర్తిని తిలకించనివాళ్ళూ, ఆ దర్శనంలోనే మౌనంలోనే ఎన్నో రోజులుగా పీడించే సమస్యలకూ ప్రశ్నలకూ పరిష్కారాలనూ సమాధానాలనూ పొంది మృగ్యం అనుకున్న మనశ్శాంతిని అనుభవించనివాళ్ళూ, అమ్మ సందేశాన్నీ ప్రబోధాన్నీ ఆలకించని అభాగ్యులూ - ఎందరో ఉన్నారు. ఆ సోదరులకూ అమ్మ మధుర మహిత సందేశాన్నీ అందించాలి

అందుకు మనం ఒక ఉద్యమాన్నే నడపాలి. పట్టణ పట్టణంలోనూ, గ్రామ గ్రామంలోనూ సభలూ సమావేశాలూ జరపాలి. ఇంటింటికీ, మనిషి మనిషికీ మాతృసందేశాన్ని మోసుకుపోవాలి. గుండెగుండెకూ నరనరానికీ అమ్మ యిచ్చే నవరక్తాన్ని ఎక్కించాలి. మూఢాచారాలనూ ఛాందస విశ్వాసాలనూ అనవసర అపోహలనూ, భయభ్రాంతులనూ అమ్మ సందేశపరశువుతో ఛేదించాలి అమ్మచల్లని ప్రేమ జగత్తునంతా పున్నమి వెన్నెలవలే పరచుకోవాలి. ఆ వెన్నెల వెలుగులలో సర్వసృష్టి పరవశించిపోవాలి.

అందుకు వ్యష్టిగానూ సమిష్టిగానూ చేయాల్సింది ఎంతయినా ఉన్నది. ఇందుకు హనుమంత జాంబవంతులూ కావాలి. ఉడతలూ బుడతలూ కావాలి. వ్యక్తులూ కృషి చేయాలి. అధ్యయన పరిషత్తులు పరిశ్రమించాలి.

ఇది అందరికీ ఉమ్మడి పిలుపు. ఇది అమ్మపై మనకుగల ప్రేమను అభివ్యక్తం చేసుకునేందుకు మహదవకాశం.

అమ్మ నవ్య సందేశం దశదిశలకూ ప్రసారం చేసే కార్యక్రమంలో ప్రతిఒక్కరూ అమ్మకు ఉపకరణంగా పరిణమించాలీ. సర్వ విభేదరహితంగా ప్రేమకూ త్యాగానికీ సహనానికీ సమానత్వానికీ నిలయమై విలసిల్లే జిల్లెళ్ళమూడి పృధ్విలోని ప్రత్యంశం లోనూ ప్రతిబింబించాలీ - అన్న ధ్యేయం మన ఉచ్ఛ్వాస విశ్వాసాలకు సమాంతరమై పోవాలి.

''కలో గంజో తనకున్నంతలో ఆదరణగా పెట్టే యిల్లు ఏదయినా జిల్లెళ్ళమూడే' ' నన్నది అమ్మ.

(ఏప్రిల్ 1972)



# 71
# అవనీ ఆకాశం కలసిన కళ్యాణ కమనీయ వేళ

అమ్మను ఎన్నిసార్లు చూచినా ఎప్పటికప్పుడు ఏదో ఒక ప్రత్యేకత, వినూత్నత మనకు ద్యోతితమవుతుంది మామూలు రోజుల్లో అమ్మను చూడటం అమ్మ సన్నిధిలో గంటలు గంటలు హాయిగా కాలం గడపటం ఎంత ఆనంద సంధాయకమో - సర్వదినాల్లో ఉత్సవసమయాల్లో విశేషపూజల్లో అమ్మను దర్శించటమూ అంత వైభవోపేతంగానూ కనులపండుగగానూ ఉంటుంది. అన్ని పర్వదినాల్లోకీ అమ్మ కళ్యాణదిన మహోత్సవం విభిన్నమయినదేకాక కడుప్రశస్తమయినదికూడ

అమ్మ జన్మదిన మహోత్సవం ప్రతి సంవత్సరం తెలుగు పంచాంగం ప్రకారం చైత్ర శుద్ధ ఏకాదశినాడు సంఘటితమయితే కల్యాణ దినోత్సవం ఇంగ్లీషు క్యాలెండరు ననుసరించి మే 5వ తేదీన జరుగుతుంది అమ్మ వివాహం 1936లో మే5వ తేదీన జరిగిన విషయం పాఠక సోదరులందరికీ విదితమే.

ప్రతి సంవత్సరమూ ఆ దినం అమ్మ దివ్యచరిత్రలో ఒక ప్రముఖ అధ్యాయాన్ని సృష్టిస్తూనే ఉన్నది. ఒక సంవత్సరం అధ్యాత్మిక లోకానికి ఆశాజ్యోతి కాదగు దేవ్యాలయానికి శంకుస్థాపన జరిపీ, ఒక సంవత్సరం అమ్మ అనురాగ సంభృత హృదయానికి ప్రతిబింబ మనదగు అన్నపూర్ణాలయానికి పునాదిరాయి వేసీ ఒక సంవత్సరం సర్వజనాశ్రయమయిన బృహత్ భవన నిర్మాణాన్ని ప్రారంభించీ ఒక సంవత్సరం జగచ్చరిత్రలోనే అపూర్వ సంఘటన అయిన వసుంధరా వివాహం చేసుకునీ - తన మహోజ్జ్వల గాథలో మే 5ను అమ్మ సువర్ణాక్షరాలతో లిఖించుకున్నది.

ఎన్ని పండుగలు జరిగినా ఏ పండుగకు ఆ పండుగ ఎట్లా విశేషమో - యీ పండుగా ఏ ఏడాదికి ఆ ఏడాదే క్రొత్త శోభలు వెలార్చుతూ కొంగ్రొత్త కాంతులు వెదజల్లుతుంది.

తెల్లవారు జామునే జేగంట మ్రోగింది. మంగళ వాద్యాలు మధురంగా నినదించాయి మేలుకొలుపులు సుప్తజనతను వెన్నుతట్టాయి కితం రాత్రే అరుదెంచిన ప్రజలతో ఆవరణం కోలాహలంగా ఉన్నది. ఆవరణమంతా తోరణపు మండలతో సురభిళ భరితంగానూ రమణీయంగానూ విలసిల్లుతున్నది

ఉదయం ఎనిమిది గంటలయింది. అమ్మ తన నివాసం దిగి ఎదురు చూస్తున్న అంబాసిడర్ కారులో దేవ్యాలయానికి బయలుదేరింది దారిలో మెడలో హారాలు వేసే వాళ్ళూ, కొబ్బరికాయలు కొట్టేవాళ్ళూ, హారతు లిచ్చేవాళ్ళూ - అందరూ కారుకు అడ్డువచ్చేవాళ్ళే, అందరూ అమ్మ సాన్నిహిత్యానికై తపించే వాళ్ళే - అమ్మను మొదటిసారిగా చూచేవాడూ అంతే, ఆ ఆవరణలో సంవత్సరాల తరబడి స్థిరనివాసం చేసేవాడూ అంతే మరి ఆ దివ్యమూర్తిలోని సమ్మోహనశక్తి ఏమిటో ఆ సన్నిధిలోని దివ్యాకర్షణ ఏమిటో - అది ఎవరికీ అర్థం కానిదీ, అనుభవించి ఆనందించవలసినదీ మాత్రమే

అమ్మ కోసం ప్రత్యేకంగా నిర్మించబడిన కొయ్య మెట్ల మీదుగా అమ్మ దేవ్యాలయోపరిభాగం అదిరోహించి శోభాయమానంగా ఏర్పాటు చేసిన వేదికపై ఆశీన అయింది అమ్మ సుమమాలాలంకృతచేయబడి ఆపాదపద్మాలు మల్లెలతో అర్చింపబడి కర్పూర హారతి యివ్వబడింది

కొన్ని క్షణాలు అమ్మ కుర్చీలో కూర్చుని - లేచి నిలుచున్నది సత్యం శివం సుందరమే ఏకాకృతి దాల్చి మన ఎదుట నిలుచున్నదా - అనిపించింది. అక్కడ నుండి రూపందాల్చిన శక్తియా, నడయాడుతున్న సౌందర్యమా అన్నట్లుగా అమ్మ దేవ్యాలయంపై నలుమూలలా గిరగిరా తిరుగుతూ వందల కొబ్బరికాయలూ, వందల గుమ్మడికాయలూ పగులకొట్టింది సంవత్సరం మొత్తం మీద యీ ఒక్కనాడే అమ్మ కొబ్బరికాయలుగానీ, గుమ్మడికాయలుగానీ పగులకొడుతుంది ఎవరినయినా పెండ్లి కుమారునో, పెండ్లి కూతురినో చేసే వేళ అమ్మ కొబ్బరి కాయలు కొట్టినా ఆ విధానమూ, యీ పద్ధతీ పూర్తిగా భిన్నమయినవి

తరువాత పసుపు కుంకుమలు దోసిళ్ళ కొలదీ తీసుకుని దేవ్యాలయ మంతా చల్లింది ఆ పిమ్మట పూలతో ఆ ప్రదేశమంతా కప్పివేసింది.

ఆ సమయంలో అమ్మను చూస్తే - మనకు మామూలుగా ఒక పండో పూవో పట్టుకొనటానికీ, నాలుగడుగులు వేయటానికీ అశక్తురాలుగా కనుపించే అమ్మేనా అని అనుమానం కలుగుతుంది కలిగి ఆశ్చర్యం జనిస్తుంది ఎటు చూస్తే అటు, ఎక్కడ చూస్తే అక్కడ అమ్మ తానే అయి కనబడుతూ రివ్వురివ్వున

తిరుగుతూ రెండు చేతులా కొబ్బరి కాయలు కొట్టే ఆ తీరు చూస్తే మనం విస్మితుల మవుతాము జారవిడిచినట్లుండే అమ్మ చేతిలోని లాఘవ మేమిటో దారుఢ్యమేమిటో - కాయ సమంగా రెండు ప్రక్కలు కావలసిందే.

తరువాత అమ్మ - దేవ్యాలయం తూర్పు అంచుకు వచ్చి నిలుచున్నది అవనిపై అనుగుబిడ్డలు గుంపులు గుంపులు నిలుచున్నారు. వారి ముఖాల్లో ఏదో అన్వేషణ, ఏదో ఆశ్చర్యం. ఏవో ఆనంద వీచికలు... వారందరి వంకా చూచిన అమ్మ కన్నుల్లో ఏదో లాలన, ఏదో పరామర్శ ఏదో పలకరింపు

క్రింది నుండి తలలు పైకెత్తి చేతులు ముకుళించి కన్నులింతలు చేసుకుని బిడ్డలూ... పై నుండి కరమెత్తి అభయ ప్రదానంచేస్తూ అరమోడ్పు కందోయితో అనుగ్రహాన్ని ప్రసారంచేస్తూ అమ్మా....

అదొక అద్భుత మయిన సన్నివేశం !

అది చాలదన్నట్లుగా అమ్మ రెండుచేతులా పసుపుకుంకుమలూ పూలూ తీసుకుని ప్రజానీకాన్ని ఉద్దేశించి గాలిలోకి విసిరింది. ఆ పసుపు కుంకుమలు బహువర్ణభాసుర మేఘమాలికలై ఉపరితలాన్ని ఆక్రమించాయి. ఎండ వేడిమిలో స్వేదబిందుశోభిత అయిన అమ్మ ముత్యాల రాసివలే మెరిపిసోతూ మల్లెపూలు వెదజల్లితే అవి శాంతి కపోతాలవలే గాలిలో రెపరెపలాడుతూ వచ్చి అందరిపై వాలాయి ఆ మృదుస్పర్శా, ఆ సురభిళపవన తరంగాలూ ఆ జనసమూహానికి సుఖశాంతుల ప్రసాదంతోపాటు ఏదో పారవశ్యాన్ని కలిగించాయి.

అదొక మధురానుభూతి !

అది మానవులకూ మాధవికీ మధ్య పసిడి వారధి నిర్మాణమయిన శుభవేళ!

జీవుడూ దేవుడూ పరస్పర అవలోకనలో పరవశించి పోతుండగా అహస్కరుడే అతిముదమున శీతల జ్యోత్స్నలు కురిపించిన వింతక్షణములవి !

అవనీ ఆకాశమూ అనురాగ జలధిలో ఏకమై స్నానమాడిన పావన సమయమది!

ఆకాంక్షా అనుగ్రహమూ సంధానమై ఎల్లరకూ కనువిందు చేసిన కమనీయ దృశ్య మది !

(మే 1972)



# 72
# సంతానదేవోభవ

ఈ నెల 2వ తేదీన ఒంగోలులో మాతృశ్రీ పూజామందిరానికి ప్రారంభోత్సవం జరిగింది.

పూజా మందిరాలూ, ప్రార్థనా సంఘాలూ, భజన సమాజాలూ సామాన్యమే అయినప్పటికీ ఒంగోలులో ఆకృతిపొందిన యీ పూజామందిరం విశిష్టమూ, విలక్షణమూ అయినదేకాక విప్లవాత్మకమయినదికూడా

పూర్వం మన శాస్త్రాలూ, పురాణాలూ - జ్ఞానం బ్రహ్మ - అంటే అమ్మ అజ్ఞానం కూడా బ్రహ్మే - నన్నది అన్నం పరబ్రహ్మ స్వరూపమంటే అశుద్ధంకూడా పరబ్రహ్మమే నన్నది అమ్మ. శరీరానికి భిన్నమయినది ఆత్మ - అని శాస్త్రాలు ఘోషిస్తే - అమ్మ శరీరంకూడా ఆత్మయే నన్నది. కనుపించేది, కనుపించనిదీ, మారేదీ, మారనిదీ కూడా దైవమే నన్నది. మంత్రాక్షరాలనీ, బీజాక్షరాలనీ ప్రత్యేకంగా లేవు; అన్ని అక్షరాలూ శక్తి మంతమయినవేనని ఉద్ఘాటించింది. భగవత్సాక్షాత్కారానికి విశిష్టమైన సాధన అంటూ ఏమీ లేదు; అన్ని సాధనలూ సమాన మయినవే; ఎవరికి ఏది సాధ్యమయితే - అదే ఉత్తమ మార్గం అని వివరించింది అమ్మ.

పాక్షికమయిన వేదాంత వివరణలకు అమ్మ తన సవరణలతో పరి పూర్ణతను ప్రసాదించింది.

పూర్వం - భార్యకు భర్త దైవమని సిద్ధాంతమైతే అమ్మ భార్యా, భర్తకు దేవత అని పూరించింది వైద్యో నారాయణో హరిః అని శాస్త్రమయితే వైద్యునికి రోగిసేవ భగవత్సేవయే నన్నది. ఇంతవరకూ తల్లి దండ్రులు పిల్లలకు భగవత్స్వరూపు లయితే - యిప్పుడు తల్లిదండ్రులకు పిల్లలు కూడా అర్చాస్వరూపులేనని విపులీకరించింది అమ్మ.

ఆ చివరి సూత్రానికి అనుగుణంగానే అమ్మ హైమాలయ నిర్మాణం చేసింది. ఆ సిద్ధాంతానికి నిదర్శనంగానే అమ్మ హైమాలయానికి వెళ్ళినప్పుడు హైమను

అర్చిస్తుంది. హైమాలయం అమ్మ తన కోసమే నిర్మాణం చేసుకున్నప్పటికీ - అమ్మతో సంబంధంగల ఏ చిన్నవస్తువు కయినా అత్యంతమయిన విలువనూ, గౌరవాన్నీ మనం యిస్తాము కనుక అవి మనకు ప్రేమ పాత్రమే కాక ఆరాధ్యమూ అవుతాయి అందువల్లనే హైమాలయం జగత్తు కంతకూ ఆరాధ్యమయింది.

ఈ సందర్భంలో యింకొక్క విషయాన్నికూడా మనం సంస్మరించటం అప్రస్తుతం కాదు. ఎక్కడ ఏ బిడ్డను చూచినా తన బిడ్డ అనుకోవటమే బ్రహ్మస్థితిని పొందటమన్నది అమ్మ, సాధనలను గురించి ఏమీ ప్రత్యేకంగా ప్రబోధించని అమ్మ ఒక సందర్భంలో సూచించిన మహోత్కృష్టమయిన సాధనమార్గమది ఇంకో సమయంలో - విరాగమంటే సర్వత్రా అనురాగమనే - నిర్వచనంతో సర్వదృష్టినీ తనదిగా ప్రేమించమని అమ్మ ఉద్ఘోషించింది కాని అది సులభసాధ్యమా ? అది మనవంటి సామాన్యులకు ఆచరణీయమా ? కనుకనే మన బలహీనతలు ఎరిగిన అమ్మ యీ సాధనమార్గాన్నే సులభతరించేసి పునః ప్రబోధించింది. అది - సర్వసృష్టినీ భగవత్ స్వరూపంగా దర్శించలేకపోయినా. అందరి బిడ్డలలో తమ బిడ్డనే కనలేకపోయినా - తమ బిడ్డల నయినా దైవస్వరూపులుగా ప్రేమించమని

ఇదికూడా మాటలలో సులభంగా స్ఫురించినా - ఆదరణకు అత్యంతమూ కఠోరమైనదే, తమ రక్త మాంసాలు పంచుకున్న బిడ్డలలో ఆరాధ్యభావాన్ని చూడటం సామాన్యమయిన విషయమేమీ కాదు.

విప్లవాత్మకమయిన పథంలో పురోగమించటమే ఆనందమయిన అమ్మ అడుగు జాడలను అనుసరించటానికి సాహసించింది ఒంగోలు సోదరి శ్రీమతి అన్నపూర్ణగారు. ఇటీవల హఠాత్తుగా విగతజీవ అయిన తమ ప్రియపుత్రిక రేణుక విగ్రహంలో జగజ్జనని రూపురేఖలను దర్శిస్తూ ఆరాధించ ప్రయత్నించటం కంటకావృత మార్గంలో పయనించటమే కాగలదు.

అయినా సోదరి శ్రీమతి అన్నపూర్ణగారు అమ్మ పరిపూర్ణ కృపకు పాత్రురాలయిన వ్యక్తి. కనుకనే ఆమె యీ కఠోర సాధన ఫలవంతమై పాలపుంతయై, ఆమె జీవితం సార్థకమై, చరితార్థకమై - ఆమే, ఆ పూజామందిరమూ జగతికి ఆదర్శం కాగలవని మనసార ఆశిస్తున్నాము.

(జూన్ 1972)



# 73
# ఆకలి బాధ

ఈ నెల 14వ తేదీన ప్రఖ్యాత వర్తకులు శ్రీ సంపత్‌కుమార్ తన బృందంతో అమ్మను దర్శించుకున్నారు. అమ్మ ఆశీస్సులతో పాటు "భోజనం చేసి వెళ్ళండి నాన్నా --" అన్న అనురాగపూర్వక మయిన ఆజ్ఞాపననూ అందుకున్నారు. కాని తరువాత కార్యక్రమపు వత్తిడివల్ల వారు భోజనం చేయకుండానే వెళ్ళి పోయారు.

దర్శన కార్యక్రమం జరుగుతూనే ఉన్నది మధ్యలో అమ్మ వారు భోజనం చేస్తున్నారో, లేదో చూసిరమ్మని ఒక సోదరుని పంపింది వారు భోజనం చేయకుండా వెళుతున్నారు వెంటనే అమ్మ కబురు చేసింది - వెనక్కు తిరిగివచ్చి భోజనంచేసి వెళ్ళమని. అయినా వారు అక్కడినుండే అమ్మకు తమ క్షమార్పణలు అందజేసుకుని ముందుకు సాగి పోయారు.

అందుకు అమ్మ ఎంత బాధపడిందో అభివర్ణించలేము. 'అమ్మా - బీదవారయితే దారిలో ఆకలితో బాధపడతారేమో అనుకొనవచ్చును. వారికే మమ్మా?' అని ఉపశమన వాక్యాలు వల్లించాము.

"అదేమిటీ అట్లా అంటారు ? ఆకలికి బీదవాడనీ, భాగ్యవంతుడనీ భేద మేమున్నది ? భాగ్యవంతుడికి - యినప్పెట్టెలోని డబ్బుగానీ, బ్యాంకులోని డబ్బుగానీ, మరెక్కడయినా వారికోసం తయారుచేస్తున్న విందుగానీ - ఆకలిని తీర్చగలుగుతుందా? కనుకనే నేనెప్పుడూ మీ బీదతనాన్నీ, భాగ్యాన్నీ చూసి అన్నం తినమని అడగను. మీ ఆకలిని చూసి మాత్రమే చెబుతాను. అన్ని అంతస్తులకూ, స్థితులకూ, వయస్సులకూ, యోగ్యతాయోగ్యతలకూ అతీతమై ఆకలిపెట్టే బాధ భరించటం కష్టం నాన్నా" అని మాకు సమాధానం చెబుతూ -

"ఇక్కడికి ఆకలితో రావచ్చును నాన్నా - కాని యిక్కడి నుండి ఎవరూ ఆకలితో వెళ్ళకూడదు. ఆ ఆకలినీ బాధనూ మీరు సహించవచ్చును గానీ నేనే సహించలేను. అది నాకే బాధ" అని వివరిస్తూ -

"అసలు. ... మీకు అన్నం పెట్టుకోవటం నాకు తృప్తి నేను ఏమి వేసి పెట్టినా ప్రసాదభావంతో మీకు ఆనందం కలుగవచ్చును. కానీ యింకా బాగా పెట్టుకోలేక పోతినే అవి నాకే అసంతృప్తి-" అని విపులీకరించింది.

ఆ మాటలు వింటుంటే అమ్మకు మనపైగల అనురాగానికీ, మన బాధల యెడల సానుభూతికీ మనకు ఆశ్చర్యం కలుగవచ్చునూ, అమ్మ యందలి మన ప్రేమను సహస్రాధికం చేయవచ్చునూ కాని నిశితంగానూ, నిలకడగానూ మనం ఆలోచించి నట్లయితే మనకు ఒక అద్భుతమయిన భావం స్ఫురిస్తుంది.

అప్పుడే భోజనంచేసి ఎవరయినా అమ్మదర్శనానికి వచ్చినా - వారిని కూడా అమ్మ భోజనం చేయమంటుంది ఈ విషయంలో ఒకరిని ఆజ్ఞాపించ వచ్చునూ, ఒకరిని బతిమిలాడవచ్చునూ, ఎట్లాగయినా సరే అందరిచేత ఆ అన్నపూర్ణాలయంలో అమ్మ ప్రసాదం భుజింపజేస్తుంది. ఔను - అది ప్రసాదమే. మరి, అన్నమే అయితే ఆకలిని మాత్రమే తీర్చగలిగేది. కానీ ఆ అన్నం - భుజించిన వారికి భౌతిక మానసిక తృప్తిని సమకూర్చటమేగాక వారి అనేక క్లిష్ట సమస్యలకు పరిష్కారాలను అందిస్తున్నది.

ఆ అంతరార్థమూ, దివ్యరహస్యమూ అవగతంకాని మనం "అన్నం తిని వచ్చా"మనో, "వెళ్ళి తింటా"మనో మొహమాటం ప్రదర్శిస్తాము.

మన అవసరం గ్రహించగలిగిన అమ్మ. మనను అనుగ్రహించ దలచిన అమ్మ బతిమిలాడి అయినా సరే మనచేత ఆ ప్రసాదాన్ని భుజింప చేస్తుంది. అయితే "మరుగే నా విధానం" అని ప్రకటించుకున్న అమ్మ ఆ విషయాన్ని అభివ్యక్తం చేయక, మానవాకృతిలో దాచుకున్న మాధవత్వం వలెనే భద్రపరచుకుని నటిస్తూ 'ఆకలి' అనీ 'అన్న'మనీ అంటూ ఉంటుంది.

కానీ, మనచేత అన్నపు ముద్దలు తినిపిస్తూ మనలను అనుగ్రహించే అమ్మను గురించి ఆలోచిస్తే - తాను అన్నపుమెతుకు భుజంచిగానీ ద్రౌపదిని అనుగ్రహించలేని శ్రీకృష్ణుడు స్మృతికి వచ్చి - ఆ అంతరం మనలను సమ్ముగ్ధులనూ, సమ్మోద భరితులనూ చేయటమేగాక - దైవం మాతృరూపంలో అవతరించటంలోని విశేషానికీ మన అదృష్టానికీ పరవశుల మవుతాము.

(జూలై 1972)



# 74
# సర్వత్రా మమకారమే మాధవత్వం

ఆగష్టు 15 రాత్రి అన్నపూర్ణాలయ వార్షికోత్సవం సందర్భంలో భక్తితో కృతజ్ఞతతో మనం అమ్మను అర్చించుకొనటమూ, ప్రేమతో వాత్సల్యంతో అమ్మ మనకు తృప్తిగా అన్నం పెట్టుకొనటమూ పూర్తి అయి వచ్చినవారిలో అనేకులు అమ్మవద్ద సెలవూ ప్రసాదమూ అందుకుని వెళ్ళిపోగా అమ్మగదికి దక్షిణపుభాగంలో ఆరుబయట మంచంపై అమ్మ విశ్రమించిందీ, మిగిలిన మేము అమ్మమంచం చుట్టూ కూర్చుని ఉన్నాము.

ఆసక్తితో కొందరు అమ్మను ఏవేవో ప్రశ్నిస్తుంటే - ఆప్యాయతతో వారికి అమ్మ సమాధానా లిస్తున్నది. నిత్యమూ ఆ సమయంలో అమ్మకు అది వాడుక అయితే మనకు అది ఆనందప్రదమయిన వేడుక అయింది.

ఆ ప్రసంగం మధ్యలో విశాఖపట్నం నుంచి వచ్చిన పోర్టు ఆఫీసరు ఒకరు అమ్మను అడిగారు.

''అమ్మా - మమకారాలు బంధం అని తెలును. వాటివల్ల ఎన్నో యిబ్బందులనీ, కష్టాలనీ తెలుసు. అయినా యీ మమకారాలను ఎలా వదిలించు కోవాలో తెలియటం లేదు. అందుకు మీ సలహా కావాలి'' అని

''మమకారం మానవ సహజం. మనిషికి అవయవాలలాగానే గుణాల్లాగానే మమకారమూ సామాన్యమే. అది వదలదు. అయినా ఎందుకు వదలాలీ ? అది మనిషికి చైతన్యాన్ని ప్రసాదిస్తూ మనిషిలో అభిమానాన్నీ, అనురాగాన్నీ ఉద్భవింప జేస్తుంది.''

అని మమకారాన్ని గురించి వివరిస్తూ ....

''అయినా - మీకు యితరు లెవరిమీదా మమకారం కలగటం లేదుగా ? బజారులో ఎవరయినా కష్టపడుతుంటే మీరు బాధపడుతున్నారా?'' అని ప్రశ్నించింది.

వారు నిర్మోహమూటంగా అంగీకరించారు  అయినా అమ్మ యిక వారి సమాధానం ఏమీ వినకుండానే ----

"ఏమో బాబూ - మీరు యివన్నీ వదిలించుకోవాలనీ, వీటినుండి విముక్తులు కావాలనీ కోరుకుంటున్నారు.  నాకేమో రోజురోజుకూ యివి బలపడుతున్నాయి. నేను యీ మమకార బంధాల్లోనే ఉన్నాను మరి, నేను మీకేమి సలహా యివ్వనూ?' ' అని అమ్మ తిరిగి ప్రశ్నించి జవాబుకోసం ఎదురు చూడకుండానే మౌనం దాల్చింది

అమ్మపై ప్రశ్న 'యితరుల నేమయినా ప్రేమిస్తున్నావా?' అని అడగటంలో ప్రేమించమని సూచనే ఉన్నది.  మరి, అమ్మ ఏమీ సూటిగా చెప్పదుగదా.  అమ్మ సూచనలూ, సలహాలూ అర్థంకావటం కష్టంకూడా, అవి ఆకు లందున అణిగి మణిగి అలరారే పండ్లవలే దాగి ఉంటాయి.

ఈ విషయాన్నే అమ్మ లోగడ వివరంగానూ స్పష్టంగానూ ఉద్ఘాటించింది - విరాగాన్ని నిర్వచిస్తూ "సర్వత్రా అనురాగమే విరాగ" మని  ఇంకొక సందర్భంలో "పరిమితమయిన మమకారం మానవత్వాన్నీ అపరిమితమయిన మమకారం మాధవత్వాన్నీ సూచిస్తాయి" అని వివరిస్తూ మరో సన్నివేశంలో "ఎక్కడ ఎవరిని చూచినా తన బిడ్డయే అనిపించటమే బ్రహ్మత్వం" అని విపులీకరించింది

మన మమకారం పరిమితులతోనూ, షరతులతోనూ కూడి ఉన్నది అమ్మ మమకారం అపరిమితమూ అపారమూ అవ్యాజమూ అయినది.  కనుకనే అమ్మ మమకారం ప్రేమ సంభృతమై దివ్యమై ఆనంద ప్రదంకాగా మన మమకారం దుఃఖానికి కారణ మవుతున్నది.

అమ్మప్రేమ ఎంత విశాలమూ, నిరవధికమూ అంటే అది పరివ్యాప్తమై దిగంతాలు తాకటమేగాక ఈ సృష్టినే "నాది" అనుకున్నది.

ఇంతవరకూ మనం 'ఈ ఊరు నాది' 'ఈ రాష్ట్రం నాది' 'ఈ దేశం నాది' అనుకున్నవారినీ, అన్నవారినే ఎరుగుదుమూ, వారే ఆదర్శప్రాయులూ అయినారుగానీ - "ఈ సృష్టి నాది" అనుకున్నవారిని మనం ఎరుగము.

నేడు అమ్మ మాత్రమే అందుకు ఏకైక ఉదాహరణగా గగన తలంలో సుధాంశునివలే భాసిస్తూ "జగదారాధ్య" అయింది

(ఆగష్టు 1972)



# 75
# "లక్షమందికి ఒకే పంక్తిన భోజనం పెట్టండి"

ఇది అమ్మ స్వర్ణోత్సవ సంవత్సరం అని పారక సోదరు లందరికీ విదితమయిన విషయమే వచ్చే జన్మదినోత్సవం (13 4 73)కు పూర్వమే స్వర్ణోత్సవం జిల్లెళ్ళమూడిలో అతివైభవంగా జరుపుకొనవలెనని యావత్ సోదరీసోదరుల ఏకాభిప్రాయం.

ఈ స్వర్ణోత్సవాన్ని పురస్కరించుకుని - అమ్మ ప్రవచిస్తున్న అతి నూతన ఆధ్యాత్మిక సందేశ ప్రాభవాన్నీ, అధునాతన విప్లవాత్మక సిద్ధాంత వైభవాన్నీ.. విశృంఖల పథగాములై వికల మనస్కులై విశీర్ణ హృదయులై శాంతి దరిద్రులై పరితపించే ప్రజాకోటికి అందించే పవిత్రాశయంతో ఒక బృహత్తర కార్యక్రమం రచించుకొని అందుకు అనుగుణంగా మనం పురోగమించటమూ, అందుకు అనుజు లందరూ అత్యుత్సాహంతో అమితానందంతో స్వచ్ఛందంగా నిస్స్వార్థంగా తమ శక్త్యానుసారంగా సహకారాన్ని అందిస్తూండడమూ ప్రమోదకరమయిన విషయాలు

ఈ కార్యక్రమంలో ఒక అంశంగానే అప్పుడే అనేక పట్టణాల్లో అమ్మ స్వర్ణోత్సవాలు అతివైభంగా జరిగాయి జరుగుతున్నాయి. జరుగనున్నాయి ఆ ఉత్సవాలను పురస్కరించుకొని జరిగే సదస్సులలో అనేకులు ప్రసిద్ధులయిన పండితులయిన మన సోదరులు అమ్మ అనుపమ హృదయాన్నీ - తదపార వైశాల్యాన్నీ, అనంతగాంభీర్యాన్నీ, కుసుమమార్దవాన్నీ, వజ్రకారిన్యాన్నీ అర్థంచేసుకున్నవారూ, అధ్యయనం చేస్తున్నవారూ, పరిశీలిస్తున్నవారూ, ఫలితాలు పొందుతున్నవారూ, పరీక్షిస్తున్నవారూ, పరాజితులవుతున్నవారూ, ప్రయోగాలుచేస్తున్నవారూ, ప్రయోజనాలు పొందుతున్నవారూ - అందరూ అమ్మనుగురించీ, అమ్మలోని అసామాన్య ప్రతిభను గురించీ, అలౌకిక ప్రజ్ఞను గురించీ, అనన్యమహిమలను గురించీ... అమ్మలో అమృతలహరులై ప్రవహించే మమతామాధుర్యాల గురించీ, ప్రస్ఫుటంగానూ ప్రబలంగానూ ప్రభలు విరజిమ్ముతూ ప్రదీప్తమయ్యే పరిపూర్ణ మానవతా విలువల గురించీ, దిగంతాల పర్యంతమూ పరివ్యాప్తమైన సమస్త చరాచరకోటినీ వాత్సల్య

పూర్ణమయిన తన పరిష్వంగంలోనికీ, అతిభద్రమయిన తన ఉత్సంగంలోనికీ తీసుకుంటున్న మహిత మాతృత్వ దివ్య సౌరభాలను గురించీ ప్రవచిస్తున్నారు, వేనోళ్ళ ప్రశంసిస్తున్నారు, ముక్తకంఠంతో ప్రస్తుతిస్తున్నారు.

అమ్మ యిచ్చిన ఒకే ఒక ఆదేశానుసారంగా తమకున్నంతలో అన్నదానం చేస్తున్నారు.

ఇంకా ఏమో ఏమేమో చేయాలనీ, అమ్మయందలి తమ ప్రేమనూ, భక్తినీ ప్రస్ఫుటంగా ప్రకటించుకోవాలనీ ఎంతో ఆరాటమూ, ఆసక్తీ, ఆర్తీ అందరిలో ప్రబలంగా ప్రదర్శింతమవుతున్నవి. కాని ఏమి చేయాలో తెలీదు. ఎట్లా చేయాలో తెలీదు. అమ్మ కభిముఖమై వెల్లువయై ప్రవహించే ప్రేమనూ, అమ్మను కేంద్రంగా తీసుకుని ప్రసారమయ్యే ఆలోచనా వలయాలనూ, జ్వలించే భక్త్యావేశాన్నీ - ఎట్లా అదుపులో ఉంచుకోవాలో, వాటికి కార్యరూపం ఎట్లా యివ్వాలో తెలియక తికమకపడుతుంటే - అమ్మయే ఒక సూచన చేసింది. అది అమ్మ మాత్రమే చేయగలిగింది. అది సర్వమాతృత్వానికి సంకేతమయింది అది క్షీరాబ్ధివంటి అమ్మ అనురాగమయ హృదయంలో కల్పవృక్షం వలే కామధేనువువలే ఆవిర్భవించిన మహాసంకల్పం........ తనకు జరిపే స్వర్ణోత్సవంనాడు ఒక లక్షకు తగ్గకుండా తన సంతానం ఒకే పంక్తిన భోజనం చేయాలట ! అందరూ బంతులుదీరి భోజనం చేస్తుండగా ఆ నయన సహస్రాల్లో ప్రభాసమానమయ్యే తృప్తినీ, దీప్తినీ తాను తనివితీరా దర్శించాలని ఆకాంక్షట ఎంత తియ్యటి కోరిక ! ఆ కోరికలో ఎంత మధురమయిన మమత! ! ఆ మమతే అమ్మలోని ప్రత్యేకత, ఆ అవధులులేని అవ్యాజమయిన మమతకే మన మందరం ఆకర్షితులమవటమే కాదు, ఆరాధకుల మయినాము, అంజలి ఘటిస్తున్నాము.

(సెప్టెంబరు 1972)



**కడుపు తీపి**

నాకేదయినా వస్తే నాకు బాధ ఉండదు.
మీకు వస్తే ఉంటుంది. - అమ్మ

# 76
# అవ్యాజానురాగమూర్తి

సెప్టెంబరు 29వ తేదీన రాత్రి సోదరి శ్రీమతి సక్కుబాయి అమ్మను తమకారులో ప్రయాణం చేయమని అర్థించింది అమ్మ అంగీకరించింది చిరంజీవులు లాల, పార్థులనుకూడా అమ్మ తనవెంట రమ్మన్నది.

ప్రయాణం ఎక్కడకో ఎందుకో మా కెవరికీ తెలియదు. బాపట్ల చేరిన తర్వాత చిరంజీవి రవినికూడ రమ్మన్నది.

కారు అక్కడ నుండి ఎటు వెళ్ళాలని ప్రశ్న వచ్చింది. అమ్మ తటస్థంగానే కూర్చున్నది. కారు రేపల్లెదారికి మళ్ళింది. గగనతలం మేఘావృతమై చల్లనిగాలివీస్తూ ప్రయాణం సమ్మోదకరంగా ఉన్నది అమ్మ కబుర్లు చెబుతుంటే మాలో ఎవరికీ కాలమూ దూరమూ గమనంలో లేవు

భట్టిప్రోలు వచ్చింది. ఇక లాల, పార్థుల సంతోషానికి హద్దులులేవు. కారణం - అది వాళ్ళ జన్మస్థలం అమ్మ [illegible]రి గ్రామానికి వచ్చింది. నిత్యమూ, ఎందరో సంపన్నులూ, లబ్ధప్రతిష్ఠులూ, ఉన్నతోద్యోగులూ వచ్చి వారిపట్టణాలను అమ్మపాద రజస్సుతో పావనం చేయమనీ, వారి గృహాలను అమ్మ ఆగమనంతో జ్యోతిర్మయం చేయమనీ ప్రాధేయపడుతుంటే - ఎక్కడకూ కాలు కదపటానికి యిష్టపడని అమ్మ ఆనాడు అనాహూతంగా, తమ గ్రామం వచ్చింది. అది ఎవరిని ఆనందంలో పులక లెత్తించదూ? ఎవరిని పారవశ్యంలో ముంచెత్తదూ ? అయినా వారు అమ్మను "మా యింటికి రా అమ్మా!" అని ఆహ్వానించలేకపోయారు.

కాని అర్థించకుండానే వారింటికి కారును పోనివ్వ మన్నది అమ్మ. క్షణాల్లో కారు వారింటి ముందు కొబ్బరి చెట్లనీడల చీకట్లో ఆగింది వారిద్దరు సోదరులూ, ఒక్కగంతులో యింటిలోకి దూకారు. నిద్రిస్తున్న తల్లిదండ్రులను లేపారు.

వారు హఠాత్తుగా మేల్కొన్నారు. వారు విన్నది నిజమో కలయో, అర్థంకాలేదు. కాని క్షణాల్లోనే అమ్మ వారి ఎదుటికి వచ్చి నిలుచున్నది. పూర్ణకుంభాలూ

మంగళవాద్యాలూ లేవు సరిగదా, గృహస్థులు ఎదురువెళ్ళి కాళ్ళు కడిగిఅయినా లోపలకు ఆహ్వానించటానికి వ్యవధి నివ్వకుండా అమ్మ సరాసరి లోపలికివచ్చి నిలుచున్నది విశ్వసమ్మోహనమయిన ప్రశాంత సుందరరూపం ! కన్నుల్లోవాత్సల్యపు వెన్నెల చల్లదనం !!

ఆ గృహిణి అమ్మ పాద ద్వయాన్ని తన రెండు చేతులా బంధించి ఉన్మాదినిలా కేకలు వేస్తూ -- "అమ్మా ! యీ దీనురాలిపై దయ ఉన్నదని నిరూపించటానికి వచ్చావా ? ఇవ్వాళ సాయంకాలంనుండీ ఎంతగానో బాధపడుతున్నాను - అమ్మకు నాపై దయ తప్పిందని, అది కాదని చెప్పటానికి నీవే స్వయంగా వచ్చావా ? ఎంత కరుణామయివి అమ్మా !" అంటుంటే అక్షరాలు కన్నీటిలో కరిగిపోయాయి.

కొద్ది క్షణాలు కూర్చుని అమ్మ లేచి యింట్లోకి వెళ్ళింది. ఇల్లు నాలుగు మూలలా చూచింది. వంట యింట్లోకి వెళ్ళింది. అక్కడ పచ్చడిజాడీల మూతలు తీసి వాటిని రుచి చూచింది ఆ గృహిణి అమ్మకు ఏమి నివేదించాలో తెలియక అయోమయంగా అమ్మ వెంట క్రొత్త యింట్లో తిరిగినట్లు తిరుగుతున్నది. అమ్మ ఆ గదిలో ఒక మూలకు వెళ్ళి అక్కడ గిన్నె అడుగున మిగిలిన అన్నం తీసుకుని, ఒక గిన్నెలోని మెంతి మజ్జిగ తీసుకుని రెంటినీ కలుపుకుని ఆకలి గొన్న దానివలె తింటుంటే ఆ గృహిణి గుండెపగిలేటట్లుగా దుఃఖించింది. అమ్మ మజ్జిగన్నం తన వెంటవచ్చిన మా అందరికీ, తదితరులకూ ప్రసాదించింది.

"పేదలపైన నీ అపారమయిన ప్రేమను పుస్తకాల్లో చదివి విస్తుపోతున్న మాకు ప్రత్యక్షం చేస్తున్నావా అమ్మా?" అని ఆ గృహిణి గద్గద కంఠంతో విలపిస్తూ అమ్మకు నమస్కరించుకున్నది.

ఆ అదృష్టవతియైన గృహిణి శ్రీమతి లక్కరాజు సీతమ్మ.

అక్కనుండి బయలుదేరాము. అక్కడకు రెండుమైళ్ళలో ఉన్న పెదపులివఱ్ఱు పోదామన్నది అమ్మ. అక్కడ ఎంతో అనారోగ్యంతో బాధపడుతున్న సోదరి జానకిని తన వాత్సల్య వారాశిలో ముంచెత్తి ఆశీర్వదించింది అమ్మ

ఇంటికి తిరిగిరాగానే అమ్మను అడిగాను - "అమ్మా ! పిలవకుండానే వాళ్ళయిళ్ళకు వెళ్ళా వేమమ్మా ?" అని. "వాళ్ళు రమ్మని పిలిచే దేమున్నది ? వాళ్ళ బాధే నన్ను పిలిచింది. బాధకంటే వేరే పిలుపే మున్నది ? అన్నది. అమ్మ అవ్యాజానురాగ మూర్తి.

(అక్టోబరు 1972)



# 77
# సాక్షాత్కారం

ఈ నెల 2వ తేదీన వరంగల్ సోదరుడు శ్రీ శేషయ్యా లింగంగారు అమ్మ సన్నిధిన కూర్చుని గతమాసం 29వ తేదీన ఘనపూర్‌లో జరిగిన అమ్మ స్వర్ణోత్సవ విశేషాలను గురించి వివరిస్తూ ఆ సభలో హైదరాబాద్ నుండి వచ్చిన వక్త శ్రీ వీరమాచనేని ప్రసాదరావుగారు తమ కోడలుకు జరిగిన అత్యంత ప్రమాదకరమయిన దుర్ఘటనను విపులీకరించిన విషయం వెల్లడించారు.

సికిందరాబాద్‌లో ప్రసాదరావుగారి కుమారుడూ కోడలూ ఒక జీపులో ప్రయాణం చేస్తుండగా అది ఒక లారీకి ఢీకొని ప్రమాదం జరిగింది కుమారునికి కొద్దిగాయాలు కాగా కోడలుకు ప్రాణాపాయకరమయిన ప్రమాదం జరిగింది. ముఖం వికృతమై ఫాలభాగంలోని ముఖ్యమయిన శల్యాలు శిధిలమినాయి. ఆ శకలాలు గ్రుచ్చుకుని మెదడు దెబ్బతిన్నది, స్మృహ తప్పింది హాస్పిటల్‌లో చేర్చారు ఆమెకు ఆపరేషన్ జరపటానికి నిశ్చయమయింది. ఆ తరుణం సమీపిస్తున్నకొద్దీ బంధువులకు ఆతురత అధికమవుతున్నది. క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి. డాక్టర్లూ ఆశావహంగాలేరు. అయినా మానవ ప్రయత్నం చేయాలి కనుక బాధ్యతా నిర్వహణలో నిమగ్నులయినారు. బంధువులూ, ఆప్తులూ మాత్రం ప్రాణాలు అరచేత పట్టుకుని కూర్చున్నారు. ఆ క్లిష్టసమయంలో సోదరులు శ్రీ జమ్మి వెంకటరత్నంగారు అమ్మవద్ద నుండి ప్రసాదమూ తీర్థమూ తీసుకుని వెళ్ళారు ఆ తీర్థం చూచేటప్పటికి ప్రసాదరావుగారికి సంజీవని చూచినంత ధైర్యం వచ్చింది శ్రద్ధతో ఆ తీర్థం ఆమె నోటిలో పోశారు. స్మృహలేక పోయినా ఆమె ఆ తీర్థం త్రాగింది. ప్రసాదరావుగారికి కొండంత ఆశ కలిగింది.

క్షణాలు బరువుగా దొర్లిపోతున్నాయి. డాక్టర్లు నిర్లిప్తంగా విధి నిర్వహణలో స్థిరచిత్తులై ఉంటే, ఆప్తులు ఉద్విగ్న మానసులై ఉన్నారు

ప్రసాదరావుగారికి ఒక దృశ్యం దృగ్గోచరమై వారి మేను పులకరించింది ; వారు ఆనంద, ఆశ్చర్యాలలో తలమునకలయినారు.

అమ్మ డాక్టర్ డ్రస్సులో ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్ళింది ఆనడక, ఆనడకలోని ఠీవి వారిని చకితులను చేశాయి. అమ్మ వెనుకనే వారి కోడలిని స్ట్రెచర్ మీద థియేటర్‌లోకి తీసుకు వెళుతున్నారు.

వారు స్వస్థచిత్తులై విచారింపగా వారికోడలిని థియేటర్‌లోకి ఆ సమయంలోనే తీసుకు వెళ్ళటం వాస్తవం. మరి, వారు నిద్రించనూలేదు, కలగననూలేదు ధ్యానావస్థలోనూ లేరు; అతిమానసికావస్థలో రూపదర్శనమూ కాలేదు.

మరి, అమ్మ ఎట్లా దృశ్యమాన అయింది ? అదే వారికి ఆశ్చర్యకరమూ అయిందీ, ఆశాకిరణ సహస్ర ప్రభా భాసమానమూ అయిందీ

అమ్మయే స్వయంగా ఆపరేషన్ జరుపుతున్నట్లు వారికి ప్రగాఢవిశ్వాసం కలిగింది. అపరేషన్ జయప్రదమయింది బంధువులకే కాక వైద్యులకూ ఆ విజయం విస్మయం కలిగించింది. మరి అటువంటి శస్త్ర చికిత్సల్లో లక్షకు ఒకటి కానీ సఫలం కాదట. ఒక వేళ రోగి బ్రతికినా, మెదడు సరిగా పనిచేయటమూ, జ్ఞాపకశక్తి సక్రమంగా రావటమూ, మాట్లాడటమూ చాలా అరుదట.

కాని అన్నీ సక్రమంగా జరిగాయి, అష్టావక్రవికృతమయిన వదనం సౌష్టవో పేతమూ, సుందరమూ అయింది, నయనాంచలాలకు వచ్చిన కనుగ్రుడ్లు స్వస్థానంచేరి గత స్మృతిగల్గి మాటలు వచ్చాయి. అందరి ఆనందానికీ అంతులేదు. అదంతా అమ్మ అపారకరుణా విశేషానికీ, అనుపమ సామర్థ్యానికీ నిదర్శనమేనని భావించి అమ్మకు అంజలి ఘటించారు

ఈ సంఘటన ప్రసాదరావుగారు వివరిస్తే - అచ్చటి ఒక మాజీ కమ్యూనిష్టు పార్లమెంటు మెంబరు విస్తుపోయారట. మరి ప్రసాదరావుగారుకూడా ఒకప్పుడు కమ్యూనిష్టు పార్లమెంటు మెంబరు హేతువాది ఇదేమిటీ, యిట్లా మారిపోయాడు? అని, అదే వారిని అడిగితే ప్రసాదరావుగారు - "పూర్వం ఏ అనుభవమూ, ఏ దర్శనమూ లేదూ... ఏమీనమ్మలేదు; ప్రస్తుతం ఎన్నో అనుభవాలూ, నిదర్శనాలూ నిరూపణలూ, మరి నమ్మకపోతే ఎట్లా ? ఏమీ లేక నమ్మితే ఎట్లా మూఢత్వం అని అనుకున్నానో ఎన్నో అవలోకిస్తూ అనుభవిస్తూకూడా లేదను కుంటే - అంతే మూర్ఖత్వమేమోనని భావిస్తాను ...." అని చెప్పారట ఏ ప్రకోపమూ లేకుండా. ఔను - మంచం దిగి అడుగు వేయటానికి ఆయాసపడే అమ్మ మద్రాసు వెళ్ళీ గుంటూరు వెళ్ళీ...... ఎన్ని చోట్లకు వెళ్ళి ఎందరిని ఆపత్సమయాల్లో ఆదుకుని ఆదరించిఅనురాగం కురిపించలేదూ ?

(నవంబరు 1972)



# 78
# శ్రీచరణకమలాలు

ఈ నెల 15వ తేదీ రాత్రి, తెల్లవారితే ముక్కోటి పండుగ, ఆవరణమంతా సందరడిగా ఉన్నది  చిరంజీవి కొండముది సుబ్బారావు అనారోగ్యం వ్యాజంగా అమ్మ ఆకస్మికంగా చీరాల బయలుదేరి వెళ్ళింది.

ఆ చిరంజీవి చీరాలలో వారి బంధువులయిన శ్రీ బూదరాజు శేషగిరి రావుగారింట్లో ఉన్నాడు. అమ్మ అక్కడికి వెళ్ళింది. క్రితం సంవత్సరం సెప్టెంబరు 17వ తేదీన యిలాగే . శ్రీ నాన్నగారు అనారోగ్యంగా ఉండి చీరాలలో ఉంటే అమ్మ నాన్నగారిని చూచేందుకు చీరాల వెళ్ళి ఆ సమీపంలో ఉన్న శ్రీ శేషగిరిరావుగారింటిని పునీతం చేసింది.

వారింటిని ఉన్నదానికంటే విశాలమూ, సౌకర్యవంతమూ, సుందరమూ చేయాలని వారికి ఎన్నాళ్ళనుండో యోచన. కాని, కారణ మేదయితే నేమీ, అందుకు కాలం అనుకూలం కాలేదూ, క్రియ జరుగలేదూ.

ఈసారి అమ్మ వెళ్ళేటప్పటికి ఆ భవనం రమణీయంగా నిర్మితమై ఉన్నది. అమ్మ వారింటికి వెళ్ళగానే పట్టలేని ఆనందంతో ఆ దంపతులు అమ్మను లోపలకు తీసుకువెళ్ళి వారింటిని మూలమూలలా చూపిస్తూ . కేవలం అమ్మకృపవల్లనే, అమ్మ ఆ అవనీభాగాన్ని తన పవిత్ర పాదంతో పునీతంచేసిన తరువాతనే ఆ గృహానికి శుభపరిణామం కలిగిందని నివేదించుకున్నారు.

1962 జూలైలో వాడరేవులో జీర్ణావస్థలో నున్న లలితానందాశ్రమానికి వెళ్ళింది. అప్పుడది ఎముకలతో, బొమికలతో వచ్చిపోయేవారిని వెక్కిరిస్తూ ఉన్నది. ఆ తరువాత అది ఎంతో అందమయిన ఆశ్రమంగా పరిణతి పొందింది  అవును - ఆ చరణరజోలేశం సోకితేనే - మరుభూముల్లో మాణిక్యరాసులు పండుతున్నాయి, నాగజెముళ్ళు వికటాట్టహాసం చేసే వికృతపు టడవులు నందనవనాలై హసిస్తున్నాయి, పనికిరాని శిధిలాలు పసిడిబొమ్మలై పకపకలాడుతున్నాయి; రప్పలూ రాళ్ళూ రవ్వలూ రత్నాలై కాంతులు వెలార్చుతున్నాయి. గడ్డి పోచలూ, గుడ్డిపూలూ కూడా

మందారాలవలే, కెందామరలవలే పూజార్హ మవుతున్నాయి. అందువల్లనే ఆ పాదద్వయంలో అమృతకలశాలున్నాయని కొందరు భావిస్తే పరుసవేది ఉన్నదని కొందరు పలికితే... సంజీవని ఉన్నదని కొందరు ఉద్ఘాటిస్తే కామధేనువులూ, కల్పవృక్షాలూ ఉన్నాయని కొందరు కొనియాడితే పుణ్యజాహ్నవి పరవళ్ళు చూశామని కొందరు ప్రస్తుతిస్తే. . పార్వతీపరమేశ్వరులనే సందర్శించామని కొందరు పూజించుకొంటున్నారు

కనుకనే - మహిమాన్విత మయిన ఆ చరణమధుర సంస్పర్శనం వల్లనే. ప్రక్కగ్రామానికే తెలియనంత కుగ్రామం జిల్లెళ్ళమూడి అనతికాలంలోనే ప్రముఖక్షేత్రమై ప్రపంచ ప్రఖ్యాతి నందింది.

మరి - మహాత్ముల చరణధూళి అఘటనాఘటనసమర్థం కదా ! కనుకనే రఘువల్లభుని పాదస్పర్శమాత్రం చేతనే రాయి రమణియై రసవత్కావ్యానికి ఆలంబనమయింది అమ్మపాదాలు అవలోకిస్తే - ఆ సౌందర్యానికీ, ఆ సౌష్టవానికీ, ఆ మార్దవానికీ మనం సమ్మోగ్ధుల మవుతాము. అదృష్టవశాత్తు ఆ పాదాలను స్పృశించగలిగితే - ఒక అమృతలహరి ఆ పాదాలనుండి మన కరాల్లోకి ప్రవహించి మేను పులకాంకితమై తీరుతుంది. ఇక ఆ మాహాత్మ్యం అనుభూతమే అయితే ఆ పదసన్నిధికి మనం బద్ధులమే అయిపోగలం.

అక్టోబరు 7వ తేదీన అనుకుంటాను, సోదరులు శ్రీ రామచంద్రమూర్తి అమ్మచరణ కమలాలను తనహస్తాల్లో పొదుపుకొని ఈ పాదాలనే కదా, అమ్మా - బ్రహ్మ కడిగింది ?... అని అడిగారు. వెంటనే "ఔను" అన్న అమ్మ మళ్ళీ అన్నది ఒక క్షణం విరామంతో "మీరు కడుగుతూనే ఉన్నారుగా ? మీరందరూ బ్రహ్మకదూ?' ' అని. ఎంత విచిత్రమయిన అమ్మ ! ఎంత విశిష్టమయిన వాక్కు ! ఆ ఒక్కవాక్యంలో ఎంత వర్ణసమ్మేళన మున్నది ! ఎంత రామణీయక మున్నది !! చమత్కారంగా ధ్వనిస్తూనే నిగూఢరహస్యాన్ని వెల్లడించే ఎంత గాంభీర్యమున్నది!!! అని బ్రహ్మ కడిగిన పాదాలేనట - ఇది అమ్మమాటలో మనకు అరుదుగా వినిపించే అంగీకారం. మనమందరమూ బ్రహ్మలమేనట - ఇది అమ్మ అనుక్షణ జాగృతికి చిహ్నం ఇందులో మళ్ళీ ఒక జలతారు తెర - ఇది అమ్మ విధానంలోని ఒక వైలక్షణ్యం.

కనుకనే అమ్మ అద్భుత జీవితంవలనే అమ్మవాక్యాలూ రసబంధురాలూ, రసవత్కావ్యాలూ అయి మనకు నవ్యాలోకనను ప్రసాదిస్తూ మనను దివ్యలోకాలకు కొనిపోతుంటాయి

(డిశంబరు 1972)



# 79
# అమ్మ వేసిన ప్రశ్న

ఈ నెల 17వ తేదీ రాత్రి పదకొండు గంటలయింది. చిలకలూరి పేటనుండి యిద్దరు సోదరులు వచ్చారు. వారిలో ఒకరు జ్యోతిష్కులు. అందునా ప్రశ్నభాగంలో దిట్టలు వారు తత్ శాస్త్రం ఎంత విశిష్టమయినదో, వారింతవరకు ఎన్ని ప్రశ్నలకు ఎంత నిర్దుష్టమైన సమాధానాలు చెప్పారో సోదాహరణంగా వివరిస్తూ అమ్మను ఒక ప్రశ్న అడగమని అర్థించారు అమ్మ తనకేమీ ప్రశ్న లేదన్నది. వారు బతిమాలారు అమ్మ తనకు ప్రశ్నేస్ఫురించడం లేదన్నది. 'ఒక్కప్రశ్న అడుగమ్మా' అని వారు మరీ మరీ ప్రాధేయపడారు. చిట్ట చివరకు అమ్మ అంగీకరించింది

"ప్రపంచంలో అందరూ కడుపునిండా తినాలి ఎవరూ ఎప్పుడూ ఆకలి బాధకు గురికారాదు ఆ తరుణం ఎప్పుడు ? అది సాధ్యమేనా ?" అని అడిగింది అమ్మ

ఆ జ్యోతిష్కులు వెంటనే ఆ ప్రశ్నకు లగ్నంకట్టి చక్రంవేసి ఫలితం గుణించే ఆలోచనలో పడ్డారు. మేము పకపకా నవ్వి "నీ కెప్పుడూ మా తిండి గొడవేనా ?" అని అడిగాము

ఒక్కక్షణం విరామం లేకుండా అమ్మ స్పష్టం చేసింది. "ఔను, నాన్నా - నా కేదయినా ఆలోచన ఉంటే మీరు తినటం గురించే; ఎవరు తిన్నారో ఎవరు తినలేదో నని, నాకేదయినా విచారమంటూ ఉంటే మీకు తృప్తిగా పెట్టుకో లేక పోతున్నానే".

జిల్లెళ్ళమూడిలో టెలిఫోను పెట్టిన మొదటి రోజున అమ్మ అందుకు ప్రారంభోత్సవంచేస్తూ ఎవరిని పిలిచినా అడిగిన ప్రశ్న "భోజనం చేశావా ?" అని

తనను దర్శించ వచ్చిన వారిని అమ్మ మొదటగా అడిగే ప్రశ్న "భోజనం చేశావా నాన్నా-" అని.

ఈ ప్రశ్నలూ, విచారణలూ - అమ్మకు మానవజాతిపైగల అపార సానుభూతినీ, ప్రేమనూ వ్యక్తం చేయవచ్చునుగానీ మనను అపమార్గం పట్టించడానికి కూడా

అవకాశం ఉన్నది సర్వజ్ఞ అయిన, సర్వ సమర్ధ అయిన అమ్మనుండి ఆరీతి విచారణా, విచారమూ మనకు సంభ్రమాశ్చర్యాలను కలిగించడమే కాదు, మనను తికమక పెడతాయి కూడా

సర్వ సృష్టికీ ఆధారం అమ్మేనని మన విశ్వాసమూ, అమ్మ అంగీకారమూ కూడా. మరి తాను అమ్మనని చెబుతూ అమ్మ అంటే అంతులేనిదీ, అడ్డు లేనిదీ, అన్నిటికీ ఆధారభూతమయినదీ అని వివరించింది కదా ఆకలికి, అన్నానికీ, దుఃఖానికీ, ఆనందానికీ... సర్వానికీ మూలకారణమైన శక్తి ఒక్కటేనని ప్రబోధించే అమ్మను - ఆ శక్తిగానే భావించే మనకు అమ్మ మాటలలో కనుపించే కరుణ అర్ధం కాదు.

అందువలననే ఒకసారి శేషగిరిరావు అన్నయ్య "జగమేలే పరమాత్మ - ఎవరితో మొరలిడుదువు?" అని ప్రశ్నిస్తే వెంటనే అమ్మ జవాబు చెప్పింది "నాతొ నేనే" నని

తానే సృష్టి స్థితిలయాలు, తానే కష్టసుఖాలు; తానే విషాదానందాలు, తానే తేజఃతిమిరాలూ, తానే దివారాత్రులూ - ఔను; అన్నీ తానే నన్నది అమ్మ ద్వంద్వాలు తానేనని తెలియటమే జ్ఞానం, ఆ జ్ఞానమే భగవంతుడు !

ద్వంద్వాలలో నలగడమే మానవత్వం అంటే కష్టంలో విషాదమూ సుఖంలో ఆనందమూ, నష్టంలో కృంగిపోవటమూ, లాభంలో పొంగి పోవటమూ - మానవనైజం

మరి అమ్మలోనూ యీ ద్వంద్వాలు లాస్యం చేయడమూ ఆ ద్వంద్వాల్లో అమ్మ ఊయలలూగటమూ మనకు కనుపించి మన ఊహకు భ్రాంతి కల్పిస్తున్నాయి

ఆ సమయంలోనే అమ్మ అంటుంది - "నేనూ మీవంటి దాననే - ప్రత్యేకత ఏమీ లేదు" అని కానీ ఒక్క విశేషం మనం అవగతం చేసుకోవాలి. మనకూ విషాద ముంటుంది, అమ్మకూ విషాద ముంటుంది. మనకూ ఆనంద ముంటుంది. అమ్మకూ ఆనంద ముంటుంది అయితే మన ఖేద మోదాలు సంకుచిత పరిధులకే పరిమితమై ఉంటాయి. అమ్మ ఖేదమోదాలు సర్వసృష్టినీ ఆధారం చేసుకుని అల్లుకుని ఉంటాయి.

కనుకనే మమకారమే భ్రాంతియనీ, దుఃఖానికి కారణమనీ పలికిన అమ్మ అపరిమిత మయిన మమకారం దైవమనీ ఉద్ఘాటించింది

ఔను - ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు !

(జనవరి 1973)



# 80
# అమ్మ స్వర్ణోత్సవం

ఈ నెల 12వ తేదీన అమ్మ స్వర్ణోత్సవం జిల్లెళ్ళమూడిలో అత్యంత వైభవోపేతంగా జరిగింది

ఈ ఉత్సవం అనుకున్న ముహూర్తం నుండి సమాప్తం అయ్యేవరకూ అమ్మ దివ్యత్వమూ, సంకల్పసిద్ధీ, వాక్శుద్ధీ మనకు అనుక్షణమూ అభివ్యక్తం అవుతూ వచ్చాయి

మొదట్లో - స్వర్ణోత్సవానికి మేము ఏమి చేయాలీ ? - అని అమ్మను అడిగినపుడు . మీరందరూ లక్షమంది ఒకే పంక్తిన కూర్చుని భోజనం చేస్తుంటే చూడాలని ఉన్నది - అని అమ్మ తన అభీష్టాన్ని వ్యక్తం చేస్తే అందరికీ ఆశ్చర్యం కలగటమేకాదు, ఇది తీరే కోరికయేనా అని సందేహమూ కలిగింది. ఇది జరుగదు - అనీ అనిపించింది

మరి - అటువంటి సంఘటన చరిత్రలో యింతవరకు లేదు. లక్షలజనం ఒకచోట సమావేశం కావచ్చునుగానీ లక్షమంది ఒకే పంక్తిన సర్వవిభేదాలూ మరిచి భోజనం చేయటం అన్నది అపూర్వ విషయమే కాదు, మానవ మేధకు అతీతమైన విషయం.

అయినా అమ్మమాట శిరోధార్యం కనుక శ్రీ విశ్వజననీ పరిషత్ పక్షాన మేము నవంబరు 13వ తేదీన పర్యటన ప్రారంభించాము మరి, అందుకు లక్షల రూపాయల ఖర్చు ఉన్నది కదా ! కాని మాతోపాటే ప్రత్యేకాంధ్రోద్యమమూ ప్రారంభ మయింది. అది ఉపసంహరింపబడితే వెంటనే మన ప్రయత్నం కొనసాగించవచ్చుననే ఉద్దేశం మా ఉత్సాహంపై చన్నీళ్ళు చిలికింది.

కాని, ''యీ ఉద్యమం మీతోపాటే సమాంతరంగా నడుస్తుంది. అది సమసిన తరువాత మీ ప్రయత్నాలు సాగిద్దామంటే వ్యవధిచాలదు'' అని అమ్మ మాకు

మార్గదర్శనం చేసింది. నిజమే, మరి - అప్పట్లో నవంబరు, డిసెంబరులలో ఏరోజు కారోజు ఉద్యమం సమాప్తం కావచ్చునూ - అనిపించినా చివరకు మార్చి చివరలో గానీ ఉద్యమం చల్లారలేదు అమ్మ ఆ సూచన చేయక, మేము ఉద్యమ సమాప్తి కొరకు వేచి ఉంటే, వ్యవధి చాలక కాలంచే వంచింపబడి యుండే వారం.

నిండు అయిదు నెలుల అహోరాత్రులూ నిర్విరామంగా పర్యటించాము, అనేక సోదరీసోదరులను కలుసుకున్నాము అనేక స్థలాలో సభలు జరిపాము పలుతావుల అమ్మ చిత్ర ప్రదర్శన జరిపాము. అనేకులకు అనేక విధాల అమ్మను గురించి తెలియజేశాము. అయితే మేము ఎక్కడికి వెళ్ళినా - మాకు యిచ్చిన వాగ్దానం ప్రకారం - అమ్మ మా వెంట ఉన్నది, మాకంటే ముందు నడిచింది

144వ సెక్షనులయినా, కర్ఫ్యూలున్నా, తుపాకి కాల్పుల్లోనూ మొక్కవోని ధైర్యసాహసాలతో పురోగమించాము. కొన్నిచోట్ల కొందరు మాత్రమే మా ప్రయత్నాన్ని హేళన చేసినా, విమర్శించినా ఎందరో ఎంతగానో అభినందించారూ, ఉత్సాహ పరిచారూ, చేయూతనిచ్చారు డబ్బువసూలు చేయ వచ్చునూ, లక్షమందికి భోజనం పెట్టవచ్చునూ కానీ ఆ మారుమూల నున్న కుగ్రామానికి లక్షమంది జనం వస్తారా - అని కొందరు సందేహం వెలిబుచ్చారు. లక్షమంది రావచ్చునుగానీ లక్షమందికి భోజనం పెట్టటం సామాన్య విషయమా - అని మరికొందరు సంశయం వ్యక్తం చేశారు.

అమ్మ అవతారమే విశేషమయినది. అమ్మజీవిత చరిత్రలో ఏ పుటలో చూచినా - అసామాన్య ఘటనలే కనిపిస్తాయి. అందుకు అనుగుణంగానే యీ ఉత్సవమూ నడిచింది. అసలు, ఆ భావనే అసామాన్యమూ, మానవాతీతమూ అయినది. అట్లాగే ఆ దినాన కూడా జరిగింది. అనుకోకుండా జనం లక్షలలో వచ్చారు. అప్పుడు అమ్మమాట మరొకటి జ్ఞాపకం వచ్చి ఆశ్చర్యం కలిగింది మేము ఎప్పుడు 'లక్ష' అని పలికినా అమ్మ దానిని 'లక్షలు' అని సవరించటం ప్రారంభించింది. కాని అప్పుడు మేము ఆ మాటకు అంతగా ప్రాధాన్యం యివ్వలేదు కారణం - లక్షమంది అయినా వస్తారా - అనీ, వచ్చినా మనం ఏర్పాట్లు చేయగలమా - అని సంశయిస్తూ వచ్చాము కనుక.

కాని, యింకొక్క ముఖ్య సంఘటన 11వ తేదీన జరిగింది. మేము మొదటినుంచీ ఆలోచించిన రీతినే -- 11వ తేదీనకూడా మరురోజున అంటే

స్వర్ణోత్సవంనాడు ఎంతమందికి వంటచేయాలీ అని మాకు ఆలోచన కలిగింది. మాలో మేము తేల్చుకోలేక అమ్మ వద్దకు వెళ్ళాము. అమ్మ అన్నది వెంటనే "లక్షకు చేయండీ" అని. కాని మా సంశయగ్రస్త హృదయాలనో, ముఖాలనో చూసిమళ్ళీ అన్నది - "లక్షమంది మనుషులే ఉండాలి అని ఏమున్నదీ ? మనుషులు వచ్చినంతవరకు పెట్టండి. మిగిలినది పక్షులకో, పశువలకో, జలచరాలకో - అన్నిటికీ పెట్టండి, వాటికీ పండుగే కదా" అని. అమ్మ నోటినుండి ఆ మాటలు వినగానే ఆనందంతోనో సిగ్గుతోనో మాకు కళ్ళు చెమ్మగిల్లాయి. ఇన్ని రోజుల నుండి స్వర్ణోత్సవాలూ, లక్షమందికి భోజనాలూ అంటే - మనుషుల సంగతే ఆలోచిస్తున్నాము కానీ పశుపక్ష్యాదుల భావన లేశ మాత్రమయినా మా కెవరికీ రాలేదు మరి, అమ్మ అంటే మనుషులకే గాదు, పశుపక్ష్యాదుల కన్నిటికీ అనీ ఎప్పుడూ వ్యాఖ్యానిస్తూనే ఉన్నాము, ఉపన్యాసాలిస్తూనే ఉన్నామూ, వ్యాసాల్లో ఉదాహరిస్తూనే ఉన్నామూ. కానీ, అవసర సమయంలో ఆ భావన మాకు స్ఫురించలేదు. అమ్మ మాత్రమే అట్లా అనగలిగిందీ, ఆలోచించగలిగిందీ కనుకనే 'అమ్మ' అయింది.

తరువాత, ఎట్లాగూ మనుషులూ లక్షలలో వచ్చారూ, అన్నమూ మిగిలిందీ, అమ్మ ఆదేశానుసారం పశుపక్ష్యాదులకూ, జలచరాలకూ అన్నిటికీ అన్నం పంచబడిందీ.

ఇంకొక్క విషయం గమనార్హమయింది. అమ్మ ఏ విషయంలోనూ తనకుగా తానై ఏమీ చెప్పదు. కానీ యీ ఉత్సవాల సందర్భంలో అడుగడుగునా అమ్మ వాచా ప్రకటిస్తూనే ఉన్నది.

12వ తేదీ ఉదయం 11 గంటలకే జనం లక్షకుపైగా వచ్చారు అప్పటినుండీ నిమిషనిమిషానికీ జనం బస్సులలోనూ కార్లలోనూ, ట్రాక్టర్లలోనూ, ఎద్దులబండ్లలోనూ నడిచీ రావటమే కాక నేల యీనిందా అన్నట్లు ఎక్కడ కక్కడే జనం సముద్రం పొంగినట్లు పొంగుతున్నారు. ఆ జనసందోహాన్ని చూచి ఉన్న బియ్యం చాలవని భయపడి బాపట్లనుండి ఒకలారీ బియ్యం తీసుకురావటానికి అన్ని ప్రయత్నాలూ చేసి అమ్మవద్దకు వెళ్ళి విన్నవించాము అప్పుడు అమ్మ చిరునవ్వుతో "జనాన్ని చూచి సరుకులు తెప్పించటం మొదలుపెడితే, మీరేం ఉత్సవం చేయగలరు ? ఏమీ అవసరం లేదు. నేను స్నానంచేసి బయలు దేరి పందిళ్ళలోకి వస్తాను మీరు ఆ ప్రయత్నాలు చూడండీ, బాపట్ల పోనవసరం లేదు" అని ఉద్ఘాటించింది మేము ధైర్యంగా మా పనులపై వెళ్ళాము

మా ఊహలకూ, అంచనాలకూ మించి ప్రజలు లక్షలలో వచ్చారు. అందరూ

భక్తితో, ఆసక్తితో, క్రమశిక్షణతో నీడలుపరిచిన ఎకరాల పందిళ్ళలో షామియానాలలో బంతులుదీరి కూర్చున్నారు. బంతులకు బంతులు లక్షాయాభై వేలమంది భోజనంకాదు, అమ్మ ప్రసాదం స్వీకరించారు ఎక్కడ ఏరాశిలో పళ్ళేలతో, పళ్ళికలతో ఎంతెంత అన్నం తీసినా రాసులు తరగకపోవటం చూచినవాళ్ళు అనేకులు ఉన్నారు

కొందరు అమ్మపై భక్తితో, ప్రేమతో కాకపోయినా ఉత్సవం ఎట్లా జరుగుతుందో చూద్దామని వచ్చినవాళ్ళున్నారు. అందులో ఒకరు మట్టిపూడి వాస్తవ్యులు శ్రీ సుందరరామరాజుగారు. వారు ఒక పందిరిలో అన్నపురాసిప్రక్కన ఉన్నారట మరునాడు వారు అన్నారు "ఇంతవరకూ అమ్మమహత్త్వమూ, అన్నపురాసి పెరగటమూ అనేవి విన్నానేకానీ విన్న వాటిని ప్రత్యక్షంగా చూశాను" అంటూ ఉండగా వారి శరీరం గగుర్పొడిచింది. వెంటనే వారు నిక్కపొడుచుకున్న వారి రోమాలు చూపిస్తూ "నాకు మామూలుగా శరీరం గగుర్పొడవదు కాని ఆ విషయం తలుచుకుంటుంటేనే రోమాంచం కలుగుతున్నది" అన్నారు గద్గద కంఠంతో.

ఈ ఉత్సవంలో కనుపించిన యింకొక ముఖ్య విషయం - అన్ని కులాల వారేకాక క్రైస్తవులూ మహమ్మదీయులూ అందరూ స్వచ్ఛందంగా ఉత్సాహంగా పాల్గొని తమ స్వంతయింట్లో పండుగలాగా శ్రమించారు. ముఖ్యంగా వడ్డన పళ్ళేలతో వారిని చూస్తుంటే అందరికీ ఎంతో ఆనందం కలిగింది.

· ఇంకొక ముఖ్య విషయం -

ఈ ఉత్సవాల్లో అమ్మ మహత్త్వం అడుగడుగునా ద్యోతితమయింది. అన్ని విషయాల్లోనూ అమ్మ సూచిస్తూ, సలహాలిస్తూ, ఆదేశాలిస్తూ - తానే స్వయంగా మనద్వారా యీ ఉత్సవాన్ని జరిపించుకున్నదా - అనిపించింది. మరి, తల్లి బిడ్డలకు అన్నం పెట్టుకోవటం అంటే తన పనేకదా.

ఆనాడు మాగాణి భూముల్లో వేయబడిన అందమయిన విశాలమయిన పందిళ్ళలో లక్షమంది భోజనం చేస్తుండగా అమ్మ జీపుపై వచ్చినప్పుడు అమ్మ ముఖంలోని ఆ ఆనందమూ, ఆ దీప్తి దర్శించి తన్మయులయిన ప్రజలకు అమ్మ "అన్నపూర్ణయా ? ఆనంద స్వరూపిణియా?" అన్న విచికిత్స కలిగింది.

(ఏప్రిల్ 1973)



# 81

# మాతృదర్శనం

ఈ నెల 22వ తేదీన సోదరులు శ్రీ సత్యనారాయణగారు బాపట్ల నుండి తమ కాపురం తణుకుకు మారుస్తూ జిల్లెళ్లమూడి వచ్చి ఆ విషయాన్ని అమ్మకు నివేదించి - అమ్మా, ఒక్కసారి తణుకు రా - అని అర్థించారు.

"ఎక్కడికయినా నేను వచ్చి ఏమి చేస్తాను నాన్నా ? ఉపన్యాసాలివ్వగలనా ? సంకీర్తన చేయగలనా ? మూగదానివలే కాసేపు కూర్చునో నిలుచునో రావలసిందే గదా?" అని అడిగింది. కొన్ని క్షణాలాగి "మొన్న రేపల్లెలో ఏమి చేశారు ?" అని ప్రశ్నించింది.

ఔను - అమ్మ రేపల్లెకు వచ్చి ఏమి చేసింది ? ఆ ప్రశ్నకు ముందు "నిత్యమూ అమ్మ జిల్లెళ్ళమూడిలో ఏమి చేస్తున్నది?" అని ప్రశ్నించుకోవాలి. అమ్మే ఒకసారి - నాకు పని అంటూ ఉంటే మీకు కనబడటమే - నన్నది.

నిత్యమూ అమ్మ ఎందరికో దర్శనం ప్రసాదిస్తున్నది. అందులో అమ్మ వాక్కు అరుదుగా వినిపిస్తుంది అనేకులకాఅవసరం కనుపించదు కూడా.

అమ్మ రూపం సుందరమూ సౌష్టవమూ అయినదే కాదు మనోరంజక మయినదీ. అమ్మను దర్శిస్తుంటేనే మనస్సుకు ఆహ్లాదకరంగా ఉంటుంది. అమ్మమూర్తిలో ఆపాదమస్తకమూ ప్రజ్వరిల్లే దివ్యరోచిస్సులూ, నయన యుగళిలో తారసిల్లే కారుణ్య ప్రభలూ, పెదవులపై నిరంతరం లాస్యం చేసే దరహాసరేఖలూ, సువర్ణాభరణాల దీప్తిని పరిహసించే దివ్యచరణ రాజీవ రామణీయకమూ, వివిధ వర్ణ విలసిత బహుకంకణ పరిశోభితాలయి, అఖిల జనులకూ అనవరతమూ అభయప్రదానం చేసే అతి మృదుకరాలూ... ఒక టేమిటి, సకల అవయవాలలోనూ జాలువారే సౌందర్యమూ, ప్రకాశమూ, దివ్యస్ఫూర్తీ ఎవరి హృదయంలో నయినా చెరగని ముద్రను వేస్తాయి. కంచిపట్టుచీరె కట్టుకుని, జడవేసుకుని, జడలో పూలు పెట్టుకుని, భ్రుకుటిలో "యింత" బొట్టు పెట్టుకుని వచ్చి అమ్మ కుర్చీలో ఆసీన అయితే, కుర్చీలో కూర్చున్నట్లుండదు; అమ్మ నరానరి మన హృదయం

సింహాసనంపైననే సుస్థిరంగా ఆసీన అయినట్లుంటుంది మన హృదయం అమ్మబొమ్మతో నిండినట్లుండదు; ఆనందప్రపూర్ణమవుతుంది ఒక దివ్యప్రభ మన మనస్సునంతా ఆవరిస్తుంది.

అమ్మదర్శనం సర్వార్థ సాధకమయింది. దర్శనమాత్రం చేతనే మనస్సులోని సందేహాలు నివృత్తి అవుతాయి. మనస్సుకు హాయీ శాంతీ లభ్యమవుతాయి ఆ మౌనంనుంచే మనకు దివ్యసందేశం అందుతుంది

ఒక్కసారి అమ్మను వీక్షించినా ఆ మూర్తి మన హృదయమే దేవాలయంగా సుప్రతిష్ఠిత మవుతుంది ఆమూర్తి జడప్రాయమయిన చిత్రమో - నిగ్రహమో కాదు సజీవమయినదీ, సర్వసమర్థమయినదీ అయి ప్రభాసిస్తూ మనకు సదా రక్షయై విరాజిల్లుతుంది. అవసరంలో మనం విస్మరించినా ఆ మూర్తి మనను ఆదుకొనటానికి సర్వసన్నద్ధయై ఉంటూ అహర్నిశమూ మనకు మార్గ నిర్దేశం చేస్తూ మన చేయిపట్టుకుని నడిపిస్తూ ఉంటుంది.

ముఖ్యంగా అమ్మదర్శనంలో మనకు యింకొక ముఖ్యప్రయోజనం గోచరిస్తుంది అదే సమయంలో అమ్మదృష్టి మనపై ప్రసరిస్తుంది మనం వేలాదిగా ఉన్నా అమ్మకూడా తన సహస్ర నేత్రాలతో ప్రతి ఒక్కరినీ వివరంగా వీక్షిస్తుంది కనుకనే ఎంత మందిలో ఎవరు వచ్చినా అమ్మ స్మృతిలో వారి స్థానం సురక్షితంగా ఉంటుంది

కనుక మన హృదయసామ్రాజ్య మహారాజ్ఞియై అమ్మ మన జీవితాలను పరిపాలించటమే కాదు, తన మనస్సులో మనను భద్రపరుచుకుంటుంది

అమ్మదర్శనం మహత్తర ప్రయోజనాత్మకమయినది కనుకనే పలు ప్రాంతాల నుండి అనేకులు బహుకాలంగా అమ్మను - తమతమ పట్టణాలలో సామూహిక దర్శనం ప్రసాదించమని ప్రార్థిసున్నారు కాని అందరితోనూ అమ్మ స్వర్ణోత్సవాల అనంతరం ఆలోచిద్దామని - వాయిదా వేస్తూ వచ్చింది

ఇప్పుడు స్వర్ణోత్సవం అయింది (మనం) అనుకోకుండా రేపల్లెలో అమ్మ దర్శనం ప్రసాదించింది. వేలాది జనం అమ్మ దర్శనం చేసుకుని సంతృప్తులయినారు.

తిరిగి - ఎన్ని ప్రాంతాలనుండో ఆహ్వానాలు విరివిగా వస్తున్నాయి. మరి, ఏ ప్రదేశాలు అమ్మ దివ్య చరణ స్పర్శకు నోచుకున్నాయో, ఏ ప్రజలు అమ్మదర్శన పరమ భాగ్యాన్ని పొందనున్నారో...

(మే 1973)



# 82
# పరమదయాళువు




ఈ నెల 17వ తేదీ ఉదయం అన్నపూర్ణాలయమంతా సందడిగా ఉన్నది. గాడిపొయ్యి మహోత్సాహంగా మండుతున్నది పాకశాసనులు పరుగులు తీస్తున్నారు. అన్నం రాసులుపడుతూ వేడిపొగలు కక్కుతూన్నది. దద్ధ్యోదనం సువాసన లీను తున్నది ఆవరణలోని సోదరీసోదరు లందరూ ఆ అన్నపురాసిని అతివేగంతో అత్యంత సామర్థ్యంతో ప్యాకెట్లలో యిముడుస్తున్నారు.

ఈ కార్యక్రమం అంతా అమ్మ స్వయంగా దగ్గరుండి జరిపిస్తున్నది. అమ్మకన్నుల్లోని కరుణామయ దృక్కులూ, పెదవులపైన దరహాసరోచిస్సులూ పోటీ పడుతున్నాయి

"అమ్మా -" అమ్మకు ఎదురుగా వచ్చి సాగిలపడి ఒక సోదరుడు పిలిచాడు. అమ్మ ప్రసన్నయై అతనిని చూచింది

"నా కేదయినా సందేశం ప్రసాదించమ్మా-" అతను వినమ్రుడై అంజలిఘటించి అర్థించాడు.

అమ్మ మౌనంగా అతనిని చూస్తున్నది

అతను మళ్ళీ ప్రాధేయపడ్డాడు.

అమ్మ చిరునవ్వుతో "నీవూ వారితో కలిసి పనిచెయ్యి-" అని అన్నపు ప్యాకెట్లు కట్టేవారిని చూపింది

ఈ నెల 14, 15 తేదీల్లో బాపట్లలో దారుణమయిన అగ్ని ప్రమాదం జరిగింది దాదాపు 600 కుటుంబాలప్రజలు ఇళ్ళూ వాకిళ్ళూ, అగ్ని దేవునికి అర్పించుకుని నిర్వాసులై వీధుల పాలయినారు

ఆ దుస్సంఘటన విని అమ్మ వెంటనే వారికి ఆహార సదుపాయం కలుగజేయమని శ్రీ విశ్వజననీ పరిషత్‌ను ఆదేశించింది.

పరిషత్ తత్ ప్రజాహిత కార్యక్రమాన్ని ఆనందంగా స్వీకరించింది బాధితు లందరూ పదిమైళ్ళ దూరాన ఉన్నందున అన్నం జిల్లెళ్ళమూడి నుండి పొట్లాలలో రెండు రోజులు వారి వారి యిండ్లకు అందజేయటానికి నిశ్చయింపబడింది

ఆ కార్యక్రమమే అప్పుడు సాగుతున్నది అది ఆపదలోనున్న తమ సహోదరులను అనురాగమయులైన మరికొందరు అనుజులు ఆదుకునే సత్కార్యం అది విపద్వాహినిలో పడి వెర్రికేకలు పెడుతున్న ఆర్తసోదరులకు తమ సహకార హస్తాన్ని అందించే కరుణామయ సంఘటన అది హఠాత్తుగా వ్యాపించిన గాఢ తమస్సులో దీపారాధన జరిపే పవిత్రక్రియ, అది దావాగ్నికీలలో దగ్ధమవుతున్న జీవరాశికి నవజీవనప్రద అతిశీతల అమృత కరస్పర్శ !

అమ్మ ఆ కార్యక్రమంలో ఆ సోదరునీ పాల్గొనమని సూచించింది అతనికి అర్థం కాలేదు. మరి, అతను అడిగింది సందేశం కదా. అతనికి అందులో దాగి ఉన్న సూచనా, సందేశమూ బోధపడలేదు. కనుకనే అతను ఒకసారి అమ్మ పాదాలవంకా, మరొకసారి అమ్మ పెదవులవైపూ చూస్తూ ఉండిపోయాడు

అప్పుడు అమ్మ వివరించింది - "వాళ్ళు అక్కడ ఆకలితో ఎదురు చూస్తూ ఉంటారు; నలుగురూ కలిసి త్వరగా వారికి అన్నం అందించండి.." అని అమ్మ ఆ మాటలు పలికేటప్పుడు కంఠంలో గాద్గద్యం స్ఫురించింది. ప్రేమా, సానుభూతీ తొణికిసలాడాయి.

అమ్మ సామాన్యంగా పాపం, పుణ్యం లేవంటుంది, కష్టం సుఖం అన్నీ వాడిచ్చినవే నంటుంది. కానీ అమ్మకు పాపులయెడ సానుభూతి మెండు; పతితుల యెడ కరుణ జాస్తి; కష్టంలో నున్న వారియెడ కనికరం మిక్కుటం; దుఃఖితులయెడ ప్రేమ అధికం.

లేవలేని కుక్కను చూస్తే అమ్మ తానే పరుగెత్తుతుంది. ఆవుముందు మేత కనుపించకపోతే మేత వేసేంతరవకూ ఎవరినీ ఎదురుగా కనుపించనివ్వదు. ఆకలితో నున్న వారిని అన్నం తినేంతవరకూ వెంటబడుతుంది. ఎవరే విషాధగాథను విన్నవించుకున్నా అమ్మ హృదయం విచారసాగరమే అవుతుంది

అందుకనే అమ్మ కరుణామయి.

(జూన్ 1973)



# 83
# అమ్మకు వ్యక్తిత్వము లేదా ?

అమ్మ దర్శనం జరుగుతున్నది. ఒక్కొక్కరే అమ్మను సమీపిస్తున్నారు. అమ్మకు ఏవేవో సమర్పిస్తున్నారు. ఏవేవో స్వీకరిస్తున్నారు. వాతావరణం నిశ్శబ్దంగానూ, అతి ప్రశాంతంగానూ ఉన్నది అమ్మ వదనమండలం జ్యోతిర్మయంగా ఉన్నప్పటికీ అత్యంత నిర్లిప్తంగా ఉన్నది.

ఒక సోదరి అమ్మవద్దకు వచ్చింది పాదాలు స్పృశించింది. వాటిని కన్నులకు అద్దుకున్నది. గుండెలకు హత్తుకున్నది. వాటిని గట్టిగా తన చేతులలో పొదుపుకొని - ఆ మృదు చరణరాజీవాలు తన పాషాణ సదృశ హస్తాల తాకిడికి నలిగిపోతాయో, కందిపోతాయో అన్న శంక అయినా లేకుండా ప్రవర్తిస్తుంటే అందరూ అనిమేషులై ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు

ఆమె కన్నీళ్ళతో గద్గదకంఠంతో తన విషాద గాధను చెప్ప నారంభించింది. నిజమే - ఆమె జీవితం కష్టాలమయం. బాధలేని బ్రతుక్కంటే చావే నయం కావచ్చునేమో కాని అన్ని కష్టాలు ఒక్కరినే ఒక్కసారే ముసిరితే ఎంత ఓర్పూ, ధైర్యమూ, బ్రతుకుమీద ఆశా కలిగిన వ్యక్తి కయినా ఒక క్షణంలో కాకపోతే మరొకక్షణంలో నయినా జీవితంమీద విసుగూ, ప్రాణంమీద విరక్తీ కలగదా ?

అదే వివరిస్తూ ఆ సోదరి బావురుమన్నది. ఆమె దుఃఖం చాలా సహజమే. కాని అమ్మకూడా ఆమెతోపాటు దుఃఖించడమే విశేషం. అమ్మ అందమయిన విశాలమయిన నేత్రాలు అశ్రుపూరితమై దుఃఖభారంతో కుంచించుకుపోయి, భావోద్వేగంతో కెందామరలైపోయి, ముఖమంతా కందగడ్డయే అయితే అపుడక్కడ ఉన్న అందరికీ కూడా ఎంతో బాధ అనిపించింది.

అమ్మ శోకోదధిలో తలమునక లవుతుండగా ఆ దుఃఖిత అమ్మ చేతికి తన పసిబిడ్డ నందించింది. అమ్మ నిర్లిప్తంగా అందుకున్నది. ఆ పసివాని పాలబుగ్గలపై ఒక చిటికెవేసింది వాడి బోసినవ్వు దీప్తితో ఆ పరిసరమంతా ఒక్కసారి తళుక్కు

మన్నది. ఆ లిప్తలోనే అమ్మ ముఖం నీల నీరద విముక్తమయినవినిర్మల విధుబింబంవలె వెన్నెల కురిసింది.

ఆ పసివాడు పకపక మన్నాడు. అమ్మ ఎఱ్ఱని పెదవులపై తెల్లని దరహాస రేఖలు లాస్యంచేశాయి. ఆ చిట్టివాడు కిలకిలమన్నాడు. అమ్మ ఆనందానికి అవధులే లేవు. అంతలోనే కన్నీటివాగు లింకాయి; కెందామరలు మాయమయ్యాయి కందగడ్డలు కనుపించలేదు. వాటి స్థానంలో ఆనందఝురుల పరవళ్ళు; అందాల కలువల కళకళలు; కోటి సుధాంశుల వెన్నెల సోయగాలు

ఏమిటిది ? అమ్మ హృదయగత భావమేమిటి? ఆనందమా ? దుఃఖమా ? రెండూనూ. దుఃఖించే వారితో దుఃఖమూ, ఆనందించేవారితో ఆనందమూ అయితే అమ్మకు వ్యక్తిత్వం లేదా ?

ఎవరితో కలిసి ఉన్నప్పుడు వారి వ్యక్తిత్వమే అమ్మ దవుతుందా ? స్వచ్ఛమైన స్ఫటిక సదృశమైన వినిర్మలమయిన అమ్మ మనోదర్పణంలో ఎదుటివారి బొమ్మ యధాతధంగా ప్రతిబింబిత మవుతుందా ? ఎదుటివారి రసాలూ రంగులే తన వవుతాయా ?

అందుకనే - ఎవరు ఏమి చెప్పినా అన్నిటికీ సరే ననటం ! ఎవరు ఏ మంత్రజపం చేస్తుంటే అదే ఉత్తమ మనటం ! ఎవరు ఏ సాధన చేస్తుంటే అదే సులభమయిన దనటం !

అందుకేనా - ఎవరు ఎట్లా ఏ రూపంలో ఆరాధిస్తే అమ్మ ఆ రూపంలోనే దర్శన మివ్వటం !

ఇందరి భావాలతో ఏకీభవిస్తూ - ఎవరికి వారికి అమ్మ తనతోటే ఉన్నదని అనిపింప జేయగలగటం మనకు విశేషమూ, అమ్మకు సహజమూ.

(జూలై 1973)



# 84
# త్రివేణీ సంగమం

అమ్మను సర్వదేవతా స్వరూపిణిగా అందరూ అనుభవపూర్వకంగా అంగీకరించి ఆరాధిస్తున్నారు. కనుకనే ఎవరి యిష్టదైవాన్ని వారు అమ్మలో దర్శించి అర్చించుకుని ఆనందించ గలుగుతున్నారు.

ఎవరికి ఏ రూపంలో అమ్మ సాక్షాత్కరిస్తున్నప్పటికీ - అమ్మ జీవిత చరిత్ర పఠించినా, అమ్మతత్వం పరిశీలించినా, అమ్మకూ శ్రీకృష్ణపరమాత్మకూ అనేక సామ్యాలు కనిపిస్తాయి.

మేధాశక్తిలోనేమి, లౌకికప్రజ్ఞా ప్రాభవాల్లోనేమి, సౌందర్యగరిమలోనేమి, విచిత్ర లీలల ప్రదర్శనలోనేమి, ఘటనాఘటన సామర్థ్యంలోనేమి, సర్వజ్ఞత్వంలోనేమి, అమ్మ శ్రీ కృష్ణునివలెనే ప్రవర్తిస్తూ తన దివ్య రోచిస్సులను కోటి కిరణాలతో వెదజల్లుతూ జగత్తును వెలుగు వెల్లువలతో నింపుతూ జన సహస్ర హృదయ సామ్రాజ్యాలను అప్రతిహతంగా పరిపాలిస్తున్నది.

శ్రీకృష్ణుని జననం వలెనే అమ్మజననమూ అద్భుతావహమై తదాది శైశవమంతా అలౌకిక క్రీడలతో విరాజితమై అడుగడుగునా శ్రీకృష్ణుని అతిమానుష లీలలను మన స్మృతికి తీసుకు వచ్చి మనను తన్మయం చేస్తున్నది.

అమ్మకూడా చిదంబరరావుగారికీ, పున్నయ్యగారికీ, వహిల్వాన్‌కూ యింకా అనేకులకూ శ్రీకృష్ణపరమాత్మగా సాక్షాత్కరించిన ఘట్టాలు బహుళంగా ఉన్నాయి.

కాని శ్రీకృష్ణుని జీవితంలో కనుపించని అనేక విశేషాలు అమ్మలో మనకు గోచరించి - అమ్మ శ్రీకృష్ణునికి కూడా అమ్మయే - ననిపిస్తుంది. సర్వ విభేదరహితంగా అమ్మ నుండి అందరూ పొందగలుగుతున్న సర్వత్రానురాగమూ, ఎక్కడనూ ఎవరిలోనూ తప్పుగనని మాతృత్వమూ, భిన్నత్వం లేని మనస్తత్వమూ, ప్రాపంచిక పారమార్థిక వివరణలోని పరిపూర్ణత్వమూ... మనకు అమ్మలో మాత్రమే సమున్నత

శిఖరాలవలే అనుపమానంగా కనుపిస్తూ - శ్రీకృష్ణుని అమ్మఒడిలో పసిబాలుని చేస్తున్నాయి.

కనుకనే క్రైస్తవ సోదరి ఒకరు అమ్మను - నీవు ఏసయ్యవా, ఏసయ్యను కన్న మరియమ్మవా అని అడిగినట్లే - అమ్మలో మనకు లీలామానుషుడయిన శ్రీకృష్ణ పరమాత్మ, అవతార పురుషునికన్న రత్నగర్భ దేవకీ, పెంచిన వాత్సల్యమూర్తి యశోదల త్రివేణీసంగమం కనుపించి కనుల పండువు కలిగిస్తున్నది

అందువల్లనే గోకులాష్టమి ఘడియల జిల్లెళ్ళమూడి బృందావనమై దీపించటమే కాక అక్కడి ప్రత్యణువూ వ్రజభూమిని స్పందిత హృదయ తరంగమై పరవశిస్తుంది.

(ఆగష్టు 1973)



## బ్రహ్మచర్యం

భక్తి పూర్ణంగా ఉన్నా బ్రహ్మచర్యం ఉన్నట్లే. యోగం పూర్ణంగా ఉన్నా బ్రహ్మచర్యం ఉన్నట్లే. బ్రహ్మచర్యం పూర్తిగా ఉన్నా భక్తియోగాలు ఉన్నట్లే. ఇందులో ఏ ఒక్కటి ఉన్నా మిగతావన్నీ ఉన్నట్లే. కనుక ఒకటి పూర్తిగా కలగాలంటే ఇంకొకటి అవసరమా అనే ప్రశ్న లేదు.

బ్రహ్మచర్యం అంటే కేవలం పెళ్ళిచేసుకోకపోవటం కాదు. బ్రహ్మచర్యం అంటే లింగభేదం, రూపభేదం, స్పర్శ భేదం లేకుండా ఉండడం.

స్త్రీ అయితే ఏది జరిగినా చలించని స్థితిలో వుండాలి - బెల్లం తింటున్నా, ఆ రుచిని జిహ్వ గ్రహిస్తున్నా చలించని స్థితిలా

- అమ్మ

# 85
# దేవుడు కూడా బిడ్డే

ఇంతకాలమూ జనసందోహాలు అమ్మను చూడటానికి జిల్లెళ్ళమూడి వచ్చాయి ఇప్పుడు అమ్మ తన సంతానాన్ని చూడటానికి బయటకు వస్తున్నది ఒకరు ఆశ్చర్యంతో యీ విషయం ప్రశ్నిస్తే - బిడ్డలు తల్లిని చూడటానికి వస్తే ఏముందీ ? తల్లి బిడ్డలను చూడటానికి వెళితే ఏ ముందీ ? ఏదయినా ఒకటే నంటూ నవ్వేసింది అమ్మ

నిజం పరిశీలిస్తే - మనకు అమ్మపై కంటే అమ్మకే మనపై అనురాగం అధికం, మనం అమ్మను సమీపిస్తే మన మనస్సు అసంఖ్యాకమైన కోరికలతోనో అనుమానాలతోనో నిండి కలతచెంది ఉంటుంది మనను చూడగానే అమ్మ హృదయం ఆనందతరంగిత మవుతుందేమో - ఆ వదనం రాకాశశిబింబమే అవుతుందీ, ఆ కనులు వెన్నెల కురుస్తాయీ ఆ ప్రేమ అవ్యాజమైనదాయె, నిర్నిబంధంగా అది పొంగులు వారుతుంది అందువల్లనే అమ్మ ఒక్కసారి అన్నది "తనను కన్నవాళ్ళమీద కంటే తాను కన్నవాళ్ళ మీదనే ప్రేమ ఎక్కువ" అని

అమ్మ దృష్టిలో సృష్టియే దైవం. దైవమంటే యీ జగత్తుకు భిన్నంగా ఎక్కడనో మరొక లోకంలో ప్రత్యేకరూపధారియై యీ సృష్టిస్థితి లయాల నడుపుతుండే వ్యక్తి కాదు విశ్వంలో ప్రత్యణువూ ఆత్మయే. జడమేమీ లేదు అంతా చైతన్యమే - నని నిరంతరమూ బోధించటమే కాక - యీ సృష్టినంతనూ తన సంతానంగానే భావిస్తూ మురిసిపోతుంది అమ్మ.

ఎవరిని ఎప్పుడు ఎక్కడ చూచినా - వాడిని తన బిడ్డగానే అమ్మ ప్రేమించ గలగడ మనేది మనం అనునిత్యమూ అవలోకిస్తున్న సామాన్య విషయమే. ఇక యీ నెల 7వ తేదీన అమ్మ నెల్లూరు వెళ్ళినప్పుడు యింకొక ముఖ్య ఘట్టాన్ని మనం కనులారా చూడగలిగాము. అమ్మను శ్రీ రంగనాధస్వామి వారి ఆలయానికి ఆ నిర్వహణాధికారులు సభక్తికంగా ఆహ్వానించారు. అమ్మ ఆలయానికి వెళ్ళింది.

అర్చకులు ఆలయంలోనికి దారిచేశారు. ఆలయంలోకి వెళుతుండగానే గర్భగుడిలో తల్పశాయి అయిన రంగనాధుడు అమ్మకు కనిపించాడు ఇక, చక చకా గర్భగుడి ప్రవేశించింది. రంగనాధుని సమీపించింది. ఆ హృదయంలో వాత్సల్యం పొంగులువారటం ఆ ముఖంలో కన్నుల్లో ద్యోతిత మవుతూనే ఉన్నది. అర్చకస్వామి ఏదో అంటున్నా అమ్మకేమీ వినిపించ లేదేమో - అమ్మ ఆ విగ్రహాన్ని ప్రేమగా నిమరటం ప్రారంభించింది. అది రాయిగా కరినంగా తగల లేదేమో ఆ ప్రేమాన్విత స్పర్శలో అమ్మ పులకించిపోవటం ప్రక్కనున్నవారికి విదితమవుతూనే వున్నది అమ్మ హృదయోద్భూత ఆనంద తరంగాలు వారినీ సోకుతూనే ఉన్నాయి

అర్చకస్వామి అమ్మచేతిలో పోసిన జలాన్ని అమ్మ ప్రేమతో రంగనాధునిపై చిలకరించింది. భక్తితో తనను అలంకరించిన సుమమాలను తన మెడనుండి తీసి అనురాగపూర్వకంగా రంగనాధునికి యిచ్చింది. అమ్మ మామూలుగా ఏ బిడ్డయింటికి వెళ్ళినప్పుడయినా ప్రేమను ఎట్లా అభివ్యక్తం చేస్తుందో, ఆ దేవాలయంలోనూ అట్లాగే చేసింది ఆ సమయంలో అమ్మ ప్రవర్తనలో ఏ మాత్రమూ అసహజతగానీ, అసాధారణతగానీ స్ఫురించలేదు అమ్మ దృష్టిలో నరుడూ, నారాయణుడూ యిద్దరూ సమమే; జడమూ, చైతన్యమూ అని రెండు లేవు

అమ్మ స్పర్శలో ఆ రంగనాధునిలో ఏమి స్పందన కలిగిందో మనకు తెలియలేదు కానీ యీ సందర్భంలో ఒక మధుర సన్నివేశం స్మృతికి వస్తున్నది

1958 నవరాత్రి ఉత్సవాలలో అమ్మ మన్నవలోని రాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయానికి వెళ్ళింది. అమ్మ ఆలయద్వారంవద్ద నిలుచున్నది అమ్మవారి హృదయంలోని ఆనంద ప్రకంపనకో అన్నట్లు విగ్రహం చేతిలోని పువ్వు జారి క్రిందపడి పరిమళాలతో అమ్మకు స్వాగతం పలికింది.

నాడు అమ్మను చూచిన రాజ్యలక్ష్మి అమ్మవారి ఆనందాతిశయాన్ని చూచి మురిసిపోయామూ. నేడు రంగనాధుని కన్న అమ్మలోని వాత్సల్యపు పొంగును చూచి పులకించిపోయామూ.

(సెప్టెంబరు 1973)



# 86
# అతిలోక సామర్థ్యం

కృష్ణాజిల్లా పర్యటన సందర్భంలో అమ్మ విజయవాడలో మకాం చేసినప్పుడు పత్రికా విలేఖరులు కొందరూ, వార్తాసంస్థల ప్రతినిధులు కొందరూ అమ్మను సందర్శించి సందేహాలు కొన్ని వెలిబుచ్చి సమాధానాలు పొంది సంతృప్తిని పొందారు.

ఆ సందేహాల్లో ఒకటి మహిమల విషయం. ఆ మహాత్మ్యాల ప్రస్తావన చేయగానే అమ్మ చాలా నిరాడంబరంగానూ, విసర్గ మనోజ్ఞంగానూ తన మధుర స్వభావానికి అనుగుణంగానూ మహత్తుల విషయమే తనకు తెలియదనీ, వాటిని గురించి తానెప్పుడూ ఆలోచించవనీ చెప్పింది.

అమ్మకు ఆ మహత్తుల విషయం తెలుసునో, తెలియదో, అమ్మ వాటిని చేస్తుందో లేదో - కానీ అమ్మసమక్షంలో అమ్మ ప్రభావం వల్ల అనేక అద్భుతాలు జరుగుతున్నట్లు మనకు విదితమవుతూనే ఉంటాయి. అయితే వాటి కర్తృత్వానికీ, తనకూ ఏమీ సంబంధం లేదని అమ్మ ప్రకటిస్తూ ఉండటమూ సామాన్య విషయమే

తరువాత అమ్మలో మరొక విశిష్టగుణమూ, విలక్షణమూ ఉన్నాయి. అమ్మను ఎవరైనా ఏమయినా ప్రశ్నిస్తే - వీలయినంతవరకు వాటికి సమాధానం మాటల్లోకంటే క్రియలోనూ, ప్రత్యక్షంగా కంటే పరోక్షంగానూ, వాచ్యంగా కంటే ధ్వని ప్రధానంగానూ చెప్పటం అమ్మకు అలవాటు.

గుడివాడలో అమ్మ పేదల కాలనీలు అనేకం సందర్శించి ప్రేమతో వారందరినీ పలకరించి కరుణతో ప్రసాదం పంచింది. ఓపిక లేకపోయినా నడియెండలో శరీరం స్వేదసిక్త మవుతున్నా ఓర్పుతో వాడ వాడకూ తిరుగుతూ ఏ ఆడంబరాలూ లేకుండా రోడ్డుప్రైగల చెట్టునీడన కుర్చీలో కూర్చుని వాళ్ళ యోగక్షేమాలు విచారించి ప్రసాదం పంచుతూ వారికి ప్రమోదం కలిగిస్తుంటే అమ్మలో శతపత్రమై విరిసే మాతృత్వపు పరిమళాలలో ఆ వాతావరణమే పులకించిపోయింది

అట్లా అమ్మ పాదస్పర్శలో పునీతమైన ప్రదేశాల్లో మందపాడు ఒకటి అప్పుడు అమ్మవెంట ఉన్న సోదరీసోదరుల్లో ఒక వార్తా సంస్థ ప్రతినిధి ఒకరు వారు విజయవాడలో అమ్మను మహత్ముల గురించి ప్రశ్నించిన సోదరులే కావటం గమనార్హ విషయం.

మందపాడు హరిజనవాడ అక్కడ ఒక కన్య కొన్నాళ్ళుగా మతి భ్రమణంతో బాధపడుతూ, నిరాహారియై మృత్యుశయ్య చేరింది. ఆమె ప్రక్కనే ఒక ముస్లిం గురువూ, క్రైస్తవ గురువూ చేరి వారి వారి మతానుసారం ఆమె ఆత్మశాంతికై అంతిమ ప్రార్థనలు చేస్తున్నారు. ఆ సమయంలో అమ్మ ఆ సమీపంలోకి వెళ్ళింది కొందరు ఆమెను అమ్మవద్దకు తీసుకురావటానికి ప్రయత్నించారు. కాని ఆ గురువు లందుకు అంగీకరించలేదు.

వారు అమ్మను అక్కడకు రమ్మని అభ్యర్థించారు మహా ప్రస్థానానికి సన్నద్ధయై ఉన్న ఆ ప్రాణి వద్దకు అమ్మ వచ్చింది. ఆదరంతో ఆ కన్య కరగ్రహణం చేసింది నాడి చూచింది. ప్రేమగా నొసటన నిమిరింది ఆ జీవి నిర్లిప్తంగా ఒకసారి కనులెత్తి చూచి రెప్పలు దించుకున్నది.

అమ్మ వెనుదిరిగి వచ్చి తన కార్యక్రమంలో నిమగ్న అయింది

అంతే - ఆ క్రియ అత్యంత నిరాడంబరంగా జరిగిపోయింది వెంట ఉన్నవారెవరూ ఏమీ ఊహించలేకపోయారు.

కాని - మరునాటికి ఆ కన్య సుస్థిరమతీ, ఆరోగ్యవతీ అయి అందరికీ ఆశ్చర్యం కలిగించటమే కాక అమ్మ అతిలోక సామర్థ్యానికి సజీవ పతాకమై నిలిచింది

ఇది - విజయవాడలో అమ్మను అడిగిన ప్రశ్నకు - గుడివాడలో క్రియా రూపేణా అమ్మ యిచ్చిన అద్భుత సమాధానం కాదా ?

(అక్టోబరు 1973)



# 87
# అమ్మను చూస్తేచాలు

ఈ నెల 23వ తేదీన చిత్తూరు కడప జిల్లాల నుండి ప్రతినిధులు వచ్చి అమ్మను ఆహ్వానించి తమ జిల్లాలు అమ్మ పర్యటించటానికి అమ్మనుండి అనుమతి తీసుకున్నారు అప్పటి కప్పుడే పర్యటనా కార్యక్రమం నిర్ణయించబడింది. జనరి 24 నుండి ఫిబ్రవరి 10వ తేగీ వరకు అమ్మ ఆ జిల్లాలోని తన సంతానానికి దర్శనాన్నీ, ఆశీర్వాదా.స్నీ ప్రసాదించి తన సంతానాన్ని చూచుకునీ, తమ తల్లిని చూచిన సంతానంకన్నుల్లో వెలిగే ఆనందద్యుతులను చూచుకునీ, ఆ ఆనంద కాంతుల్లో మెరిసిపోయే తన తేజోమయి దివ్య సౌందర్యాన్ని చూచుకునీ తానే మురిసిపోతుంది

అమ్మకు ఎప్పుడూ ఆనందమే. ఎక్కడున్నా ఆనందమే. ఎవరిని చూచినా ఆనందమే ఎవరిని చూచినా - వాడిలో వాడి గుణగణాలుగానీ, వాటి మంచి చెడ్డలుగానీ, వాడి ఆస్తులూ అంతస్తులుగానీ అమ్మకు కనిపించవు అమ్మకు అనిపించేది - వాడూ తన బిడ్డయేననీ, వాడికి తాను కడుపునిండా పెట్టుకోవాలనీ మాత్రమే

కానీ అమ్మను చూచిన సర్వులకూ ఒకే అభిప్రాయం కలుగదు కొందరికి 'అమ్మ సాక్షాత్తూ దైవం' అన్న విశ్వాసం ఏర్పడుతుంది. కొందరికి 'దైవం కావచ్చునేమో' అన్న భావన కలుగుతుంది. కొందరికి 'అమ్మలో మానవాతీతమైన శక్తి ఏదో భాసిస్తున్నది' అన్న ఊహ కలుగుతుంది. కొందరికి అమ్మ జ్ఞానియనీ, కొందరికి యోగిని అనీ అభిప్రాయం కలుగుతుంది కొందరికి అమ్మ ఆదర్శగృహిణిగా, పెద్ద ముత్తయిదువగా మాత్రమే కనిపిస్తుంది. అమ్మలో కొందరికి మానవతావాదమూ, కొందరికి సర్వత్రానురాగమూ, కొందరికి దీనజన వాత్సల్యమూ, కొందరికి సంఘ సంస్కరణోద్యమమూ, కొందరికి ఆధ్యాత్మిక విప్లవమూ గోచరిస్తాయి.

ఎవరు ఎట్లా దర్శించినా, భావించినా అమ్మ మాత్రం తరగని తన అనురాగ జలధినుండి అందరికీ ఉదారంగా అవ్యాజంగా దోసిళ్ళతో ప్రేమను పంచుతూనే

ఉన్నది ఆ దివ్య ప్రేమకు పాత్రమైన వారందరూ ఎవరికి వారు అమ్మలో తమ కన్నతల్లినే కనుగొంటూ ఆ అనురాగ బంధంలో పులకించి పోతున్నారు. ఆ సన్నిధానంలో ఆ లాలనలో తాము పొందవలసినదేదో అందుకుంటూ తృప్తినీ, హాయినీ, శాంతినీ, ఆనందాన్నీ అనుభవిస్తున్నారు.

ఈ విలక్షణ అనుభవాన్ని పొందిన నలుగురు తమతోటి పదుగురికి దానిని పంచాలనే కుతూహలమే - అమ్మ పర్యటన ఆహ్వానానికి మూలం అమ్మ ఆరోగ్యం, అంతగా అనుకూలంగా లేక పోయినా అమ్మ అంగీకరిస్తున్నది. బయలుదేరిన తరువాత తన శ్రమనూ బాధనూ లెక్కచేయక నిర్విరామంగా పర్యటిస్తున్నది అసంఖ్యాకంగా ప్రజలు అమ్మను దర్శిస్తున్నారు ! దర్శనమాత్రం చేతనే అమ్మ కారుణ్య రసప్లావితులై తమ కష్టాలకు విముక్తినీ, క్లిష్ట సమస్యలకు పరిష్కారాలనూ పొందుతున్నారు. మంచిదే ! కాని అమ్మను దర్శించి నందుకు అదే పరమావధి కాదు. అమ్మ దివ్యత్వమూ అమ్మ మహిమలూ కేవలం విశ్వాసంపై ఆధారపడి ఉన్నప్పటికీ - అమ్మలో శతపత్రమై విరిసి అనన్య పరిమళాల వెదజల్లే మానవత్వం అందరికీ దర్శనీయమూ ఆదర్శమూ అయినది మనలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క మంచిగుణం ఉజ్జ్వలమై ఉండవచ్చును దానివలననే మనం సమాజంలో ఒక పదవినో, ప్రతిష్ఠనో పొంది అహం పెంచుకుంటున్నాము. కాని రమణీయమైన గుణాలన్నీ రాశీభూతమై ఉన్నప్పటికీ - అతి నిరాడంబరంగా మనమధ్య మసలుతూ మనలో ఒకరుగా మెలుగుతున్నది అమ్మ

అమ్మలో మనం అవగాహన చేసుకొనవలసిన ఆదర్శ మానవత్వం అనంతంగా ఉన్నది. అలవర్చుకొనవలసిన ఉత్తమ గుణాలు అసంఖ్యాకంగా ఉన్నాయి నేర్చుకొనవలసిన జీవితపాఠాలు కొల్లలుగా ఉన్నాయి

నిరుపమానమైన అమ్మలోని ఆ మంచితనాన్ని మనలోకి ఆహ్వానించు కున్నప్పుడే అమ్మ పర్యటనకూ, అమ్మ దర్శనానికీ సార్థకత !

(నవంబరు 1973)



# 88
# నడయాడే దేవాలయం

ప్రజలందరికీ ఆశ్చర్యానందాలు కలిగిస్తూ అమ్మ నెల్లూరు. కృష్ణా, పశ్చిమ గోదావరి కోనసీమలు పర్యటించింది.

ఈ పర్యటనలో అమ్మ ఒక్క ప్రసంగం చేయలేదు; ఒక్క సందేశం అందించలేదు, ఒక్క మంత్రం ఉపదేశించ లేదు. ఒక్క మార్గం ప్రబోధించలేదు; ఒక్క సాధనను సూచించలేదు. అన్నిచోట్ల అమ్మ వచ్చి వేదికపై నలుమూలలా నడయాడటం; ఆ ఉన్నత మయిన వేదికనుండి ప్రతి ఒక్కరినీ తిలకించటం; కరమెత్తి ఆశీర్వదించటం. యివీ అమ్మ చేసిన పనులు.

మరి - ఆ మంగళమనోజ్ఞ పవిత్ర పరమశాంత మహనీయ మూర్తిని కనులారా సందర్శించేందుకూ, దయానిలయాలూ, కమనీయాలూ అయిన ఆ కందోయినుండి అనవరతము ప్రవహించే ఆశీర్లహరిలో సుస్నాతులయ్యేందుకూ, ఆ అమృతహస్తం ప్రసాదించే అభయప్రదానంలో తమ మనుగడలనే మధుమయం చేసుకోగలమనీ, సర్వ శుభాలూ పొందగలమనే పరమ విశ్వాసంతోనూ, ఆ ప్రగాఢ మౌనం నుండే ప్రసారమయ్యే దివ్య సందేశంతో తమ జీవితాల కొక నూతనోత్తేజమూ నూతనో త్సాహమూ సమకూరగల వన్న మహదాశయంతోనూ అన్ని కేంద్రాలలోనూ ప్రజలు అసంఖ్యాకంగా ఏతెంచారు.

ఈ నవంబరు 4వ తేదీ నుండి 15వ తేదీవరకు అమ్మ పశ్చిమ గోదావరి జిల్లాలోనూ, కోనసీమలోనూ పర్యటించింది. మొత్తమ్మీద యీ పర్యటనలో అమ్మ నలభై కేంద్రాలలో సామూహిక దర్శనం ప్రసాదించి దాదాపు యిరవై లక్షల జీవితాలను ఉద్ధరించి, యిరవైలక్షల మనస్సులను ఉత్తేజపరచి, యిరవై లక్షల హృదయాల్లో యిరవైలోల దేవాలయాలకు శంకుస్థాపనా, స్వస్వరూప ప్రతిష్ఠాపనోత్సవాలూ ఒకేసారి జరిపి-ఆ ప్రాంతీయ చరిత్రలోనే మహోజ్జ్వల అధ్యాయాన్ని రచించిందని చెప్పవచ్చును

ఈ పర్యటనలో అమ్మ తన మమతామాధుర్యాన్నీ, సమతాదృక్పథాన్నీ సర్వజనులకూ అందించి ఆనందింప చేసింది ఆ ఆనందపయోరాశిలో హిందువులూ, క్రైస్తవులూ, ధనికులూ - బీదలూ, పురుషులూ, స్త్రీలూ, పిన్నలూ, పెద్దలూ అందరూ

సర్వ భేద రహితంగా సమంగా పాలుపంచు కొనటం విశేషం

ఏలూరులోని సెయింట్ థెరీసా మహిళా కళాశాలకు వెళ్ళి అక్కడి క్రైస్తవ సోదరీ బృందంతో కలిసి అమ్మ ఆనందించిన తీరూ, వారిని మంత్ర ముగ్ధులనుచేసి ఆనందింపచేసిన తీరూ అద్భుతమేకాక మరపుకురాని మధుర సన్నివేశం ఆ కళాశాల ప్రధాన అధ్యాపకురాలు అత్యంత సంతృప్త హృదయంతో ఆనంద ప్రపూర్ణయై అమ్మకు 'క్రాస్'ను సమర్పించింది. దానిని అమ్మ ప్రేమతో అందుకుని తన నివాసానికి తెచ్చుకుని భద్రపరుచుకున్నది

శనివారపు పేటలో ఒక మహమ్మదీయ సోదరుడువచ్చి అమ్మకు 'సలాము చేస్తుండగా స్థానిక నిర్వాహకులు అతని పేరుచెప్పి "ముసల్మాన్" అని పరిచయం చేస్తుంటే - అమ్మ "నేనూ ముసలమ్మనేలే" అని చమత్కరిస్తూ అతని అందమైన గడ్డం పట్టుకుని నిమిరి ఆశీర్వదించి అతను హర్షపులకితుడవుతుండగా తానుకూడా దరహాసవదనయై అందరినీ సమ్ముగ్ధులను చేసింది.

పలుచోట్ల తానుగా అనాహూతంగానే పేదల వాడలకు వెళ్ళి వారికి ప్రసాదాలూ, ఆశీర్వాదాలూ పంచటం అమ్మ దీనజనవాత్సల్యానికి నిదర్శనం. నరసాపురంలో ఒక పాకీపనివారి కాలనీకి వెళ్ళింది అమ్మ వారు వారి యిళ్ళనే కాక వారి వీధినంతా శుభ్రంగా చిమ్మి, నీళ్ళు చల్లి, ముగ్గులు పెట్టి శోభాయమానంగా అలంకరించుకున్నారు. ఆ వాడలో వారు నిర్మించిన వేదికపై అమ్మ అసీనకాగానే భక్తితో అమ్మపాదాలు కడగాలని వారు ఆకాంక్షించారు. వెంటనే అమ్మ అన్నది - మీరు రోజూ చేస్తున్నవని అదే. ఇవ్వాళ యీ వీధినంతా మీరు చేసినదానికంటే - యీ పాదాలు కడగటం విశేషం కారు" అని. ఏద పాదాలు పట్టినా తనపాదాలు పట్టినట్లేననీ, ఏ నామం జపించినా తన నామం జపించినట్లేనని చెప్పకలిగిన తల్లి మరో విధంగా ఎట్లా చెబుతుందీ ?

కనుకనే ఆ విశాల హృదయను, ఆ విశ్వజననిని, ఆ విమలానురాగ స్వరూపిణిని తనివితీరా కనులారా కాంచేందుకు అమ్మ ఎక్కడ అడుగిడితే అక్కడ దేవాలయంగా ప్రజలు లక్షోపలక్షలు పరుగులు తీస్తున్నారు. అమ్మ ఎక్కడకు వస్తే అక్కడ పూర్ణకుంభాలతో, వేదప్రవచనాలతో, మంగళ తోరణాలతో, మంజుల వాద్యాలతో జయజయ ధ్వానాలతో అమ్మకు స్వాగతం చెబుతున్నారు.

ఏ గ్రామంలో ఏ పట్టణంలో అమ్మ దర్శనం ప్రసాదిస్తున్నా - ముందుగానే అమ్మకు పురోగాములై అపూర్వ చైతన్యమై, అనంద సంరంభములతోపాటు పరిసర గ్రామాల నుండి అసంఖ్యాక ప్రజాసందోహాలూ వచ్చి ఆ ప్రదేశానికి ఒక క్రొత్త వెలుగును ప్రసాదిస్తూ అమ్మకు జయగీతులు పాడుతున్నాయి.

(డిశంబరు 1973)



# 89

# "నా జీవితమే సందేశం"

గాలీ, నీరూ మనిషికి అవసరం. కనుకనే అవంటే మనిషికెంతో ప్రేమ. కాని గాలి జంఝాప్రభంజనమైనా, నీరు మున్నీరై చెలియలుకట్టలు దాటినా మనిషికి వాటిని చూస్తే ఎంత భయమో చెప్పలేము. అదే విధంగా ప్రియతమమయిన ప్రజలు, అమ్మపర్యటనలో అమ్మను చూడవచ్చినవారు, వందలు వేలుదాటి లక్షలలో పడి నిర్వాహకుల్ని భయపెట్టారనటం అతిశయోక్తి కాదు

అందువల్లనే యేమో, జిల్లెళ్ళమూడికి వందలమైళ్ళ దూరంలోగల చిత్తూరు, కడప జిల్లాలతో అమ్మపర్యటన నిర్ణయమయిందంటే - నిర్వాహకుల కెంతో సంతోషమయింది అక్కడ అమ్మ ఎరుక తక్కువగా ఉండవచ్చునూ, అమ్మను చూడ వచ్చే జనం అల్పసంఖ్యలో ఉండవచ్చునూ అన్న ఆశతో.

కానీ వారి అంచనాలను అమ్మ తలక్రిందులు చేసింది తన పిల్లలను చూడటానికి తాను వచ్చాననీ, తక్కువకాలంలో ఎక్కువమందిని చూడటం తన ఉద్దేశమనీ చెబుతూ సిద్ధసంకల్ప అయిన అమ్మ ఒక్క పూర్ణకుంభంతో స్వాగతం పలికిన వారిపై తాను కోటికుంభాలతో అనురాగాన్ని క్రుమ్మరిస్తూ, కోటి చేతులు చాచి, కోటి గొంతులతో ఎలుగెత్తి పిలుస్తుంటే - దూరమనీ దగ్గరనీ, వందలమైళ్ళనీ. వేలమైళ్ళనీ - ఏ మున్నది ? అవి చిత్తూరు కడపలే కాదు, ఎంత దూర తీరాలయినా అమ్మ పిలుపును అందుకొనకుండా ఎవరు ఉండగలరు ? అందుకుని ఆ దివ్యమూర్తిని కనులారా దర్శించకుండా ఎవరు ఉండగలరు ? దర్శించుకుని "పుణ్యమహో పుణ్యమహో పుణ్యం తవ దర్శనం..." అని మనసారా గానం చేయకుండా ఎవరు ఉండగలరు ?

అందువలననే చిత్తూరు కడప జిల్లాలలో అమ్మ ఎక్కడ దర్శనమిచ్చినా - ప్రజలు సముద్రాలవలే పొంగిపోయారు. అందరిలో ఒకటే ఆసక్తి, ఎనలేని భక్తి, అన్ని కేంద్రాలలో అమ్మను కారుదింపి వేదిక నెక్కించటమే కష్టసాధ్య మైపోయింది.

అన్ని వేలమందికీ ఆ కొద్ది అడుగుల దూరంలోనే, ఆ కొన్ని క్షణాలకాలంలోనే అమ్మపాదస్పర్శ చేయాలని తీవ్రమయిన ఆకాంక్ష. వారి ఆకాంక్ష బలంముందు పోలీసులూ, వలంటీర్లూ ఓడిపోక తప్పలేదు. ప్రతి వేదికవద్దా వలంటీర్లకూ ప్రజలకూ మధ్య విచిత్రమూ, అనవసరమూ అయిన ఘర్షణ అనివార్యం అయింది. ఎక్కడ అమ్మకు ఏ స్పర్శవల్ల బాధ కలుగుతుందోనని ఒక వర్గమూ; ఆ దివ్యశరీరాన్ని స్పృశించి తమ బాధలు నివారించుకుందామని మరో వర్గమూ ఒక వర్గంవారికి అమ్మపై ప్రేమ, మరో వర్గంవారికి అమ్మపై భక్తీ, ఇది ప్రేమకూ భక్తికీ మధ్య ఆశ్చర్యకరమయిన వివాదం ! ఈ వివాదానికి ఎట్లా రాజీకుదర్చాలో ఏ నిర్వాహకులకూ అర్థం కాలేదు !!

అన్ని చోట్లా అమ్మను చూచి ఆనందించిన ప్రజలు అమ్మనోటి నుండి ఒక్క సందేశం వినటానికి ఉత్సుకతను చూపించారు. వేదికలపై అమ్మ వెల్లడించకపోయినా పత్రికావిలేఖరుల గోష్టులలోనూ, జిజ్ఞాసువులతో జరిపిన చర్చలలోనూ తన అనుభవసారాన్ని, సందేశసారాన్నీ వ్యక్తం చేస్తూనే వచ్చింది. అది దైవం ఎక్కడో ఒక మూల సింహాసనారూఢుడై యీ జగత్ పరిపాలన చేయటంలేదనీ; కనుపించేదంతా దైవమేననీ, ఎవరిని చూచినా తనకు తన బిడ్డయే ననిపిస్తుందనీ, వారి'కింత' పెట్టుకోవాలనిపిస్తుందనీ విపులీకరిస్తూ..... సర్వత్రానురాగమే తన సందేశంగా అందిస్తూ - తానేమీ ఘనకార్యాలు చేయటం లేదనీ, తన జీవితంలో ఏమయినా ఆదర్శ ప్రాయమయినదిగా తమకు తోస్తే స్వీకరించవచ్చుననీ నిరాడంబరంగా వివరించింది

ఔను --

లౌకికంగా నేమీ, పారమార్థికంగా నేమీ, వెలుగు వెల్లువల వెదజల్లే మహిమాన్విత సంఘటనలతో కూడిన ఆ దివ్యజీవితంకంటే మహత్తర సందేశ మేముంటుంది ? అదే విధంగా నీచుట్టూ ఎంతో పేదరికం ఉంది. ఎంతో ఆకలి ఉంది ఎంతో అశాంతి ఉంది. అదంతా చూస్తూ కళ్ళూ చెవులూ మూసుకుని తన కడుపే కైలాసంగా తన సుఖభోగాల్లో తాను మునిగి ఉండడంకంటే - తన దగ్గరకు వచ్చిన ఎవరితోనైనా - వాళ్ళ చిరునామాల ప్రసక్తి లేకుండా - వాళ్ళ సుఖదుఃఖాల్లో పాలు పంచుకుని తనచేతనైన సహాయం, అదెంత స్వల్పమైనా, చేయటం మంచిదిగాదా ? అట్లా ఒక్కడికైనా - రోజూ పెడుతూవుంటే లోకంలో లేమి మిగులుతుందా ? ఆకలి ప్రజ్వరిల్లుతుందా ? అశాంతి రాజ్యమేలుతుందా ?

ఈ సందేశాన్ని ఆచరణ పూర్వకంగా లోకానికి అందించేందుకే అమ్మ అన్నం పెట్టడమూ, గుడ్డలు పెట్టడమూ చేస్తున్నదా ?

కాకపోతే - 'నా జీవిత మబద్ధం, చరిత్రబద్ధం' అని ప్రకటించిన అమ్మకు వీటితో అవసరమేమిటి ? 'నాకు పని అంటూ లేదు. నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా - అది మీ కోసమే" అని చాటిన అమ్మ - పలికే ప్రతి మాటా మన కొక పాఠమే ! చేసే ప్రతిపనీ మన కొక ప్రబోధమే !

కనుకనే మహాత్ములజీవితాలే లోకానికి మహోత్తమ సందేశాలవుతున్నాయి విజ్ఞులూ, విమర్శకులూ మహాపురుషుల జీవితాలు పరిశీలించేటపుడు కేవలం వాళ్ళు ఏమి చెప్పారూ, చెబుతున్నారూ అనేదే కాక వాళ్ళు ఏమి చేశారూ అనేదికూడా గమనిస్తారు. వాళ్ళ మాటలూ చేతలూ ఏకమై, ఆ గీటురాయిపై నిలవగలిగిన వాళ్ళే అఖండ జ్యోతులై నిరంతరం ప్రభాసిస్తూ లోకానికి వెలుగు వెల్లువలను ప్రసారం చేస్తూ ఉంటారు

(జనవరి, ఫిబ్రవరి 1974)



## జ్ఞాని - సామాన్యుడు

విశ్వవ్యాప్తమయిన శక్తి తానేనని ముందుగానే తెలుస్తుంది జ్ఞానికి.
చివరలోనైనా తెలుస్తుంది సామాన్యుడికి.
జ్ఞాని అన్నింటికీ సిద్ధపడే ఉంటాడు.
సామాన్యుడు తప్పించుకునేందుకు ప్రయత్నిస్తాడు.
తనను గురించిన ఆందోళన ఉండదు జ్ఞానికి.
సామాన్యుడికి నిరంతరం తనను గురించిన ఆందోళనే.

- అమ్మ

# 90
# జగత్తంతా జిల్లెళ్ళమూడి కావాలి

ఒక శుభ పరిణామం గోచరిస్తూ ఆనంద పరుస్తున్నది ఇప్పటికే పలు ప్రదేశాలల్లో 'మాతృశ్రీ అధ్యయన పరిషత్తులు' ఏర్పడి అమ్మను గురించీ, అమ్మలోని ఆదర్శమైన పరిపూర్ణ మానవత్వం గురించీ, అమ్మలోని అవతార విశిష్టతను గురించీ అధ్యయనం చేయడమూ, అవగాహన చేసుకొనడమూ జరిగింది. తత్ఫలితమే కావచ్చును, అనేక పరిషత్తులు, తోటి సోదరు లందరికీ 'అందరి అమ్మ' అయిన "అమ్మ"ను చూపించి వారికి తృప్తినీ, హాయినీ, శాంతినీ, ఆనందాన్నీ కలుగజేసి, వారి అనుభూతిలో తాము పాలు పంచుకోవాలనే ఉదాత్తాశయంతో అమ్మ పర్యటనకు కారకులయినారు

ప్రస్తుతం - అమ్మను చూడనివారు ఉండవచ్చునేమోగానీ, అమ్మను గురించి వినని వారుండరేమో జరిపిస్తున్నది. ప్రజలలో అమ్మయందు, భక్తీ ప్రేమా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. అమ్మను చూడాలనే అకాంక్ష ప్రతి ఒక్కరిలోనూ బలంగా కనుపిస్తున్నది తత్కారణంగానే అమ్మ దర్శన మంటే - అక్కడ భూమి యీనుతున్నది. "వింటే విమర్శకానీ, కంటేలే"దనీ, 'విన్నవాడు విమర్శిస్తాడూ, కన్నవాడు వివరిస్తాడు' అని అమ్మ అన్నట్లే, యిప్పుడు అమ్మను కన్న ప్రతివాడూ కన్నవాడై, అమ్మ ఒడిలో చంటివాడై పోవాలని తహతహలాడటమే కాదు; తపనపడుతున్నాడు, తపస్సు చేస్తున్నాడు. ఆ మాతృప్రేమలోని మాధుర్యంకోసం ఆరాట పడుతున్నాడు.

ప్రజాబాహుళ్యంలో యీ పరిణామం రాగా, యిక, యీ పరిషత్తులో ఒక ఉన్నతమయిన భావన ప్రభవించి, ప్రజ్వరిల్లుతున్నది "అమ్మ ఒక మహదాశయంతో యీ అవనిపై అవతరించి, జిల్లెళ్ళమూడి స్థావరం చేసుకుని, అక్కడ ఒక సంస్థను ఉపకరణంగా రూపొందించుకుని - తన అవతార కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నది. కనుక ఆ నిర్వహణలో మనమూ భాగస్వాములు కావాలి; మనమూ అమ్మకు ఉపకరణాలమై జీవితాలను సార్థకం చేసుకోవాలి. మనమూ అమ్మకు తగిన బిడ్డల

మనిపించుకోవాలి ..'' అన్న ఆలోచనా, ఆసక్తీ కలిగించి తత్ఫలితంగానే అనేక ప్రదేశాల్లో - జిల్లెళ్ళమూడిలో నెలకొని బృహత్తరమైన కార్యక్రమాన్ని చేపట్టిన శ్రీ విశ్వజననీ పరిషత్‌కు అనుబంధ సంస్థలను రూపొందించుకోవాలనే ఆశయాన్ని వ్యక్తపరుస్తున్నారు.

అందుకు అనుగుణంగానే యిప్పటికి హైదరాబాద్‌లో ఒక సంస్థ ప్రభవమై పెరుగుతున్నది. ఇప్పుడే ఏలూరునుండి ఒక పురిటి కేక వినిపించింది.

ఈ నెలలోనే భీమవరంలో అమ్మ పేరుమీదుగా ఒక పాఠశాలకు స్థాపన; నెల్లూరులో ఒక ఉచిత వైద్యశాలకు ప్రయత్నం, పలుతావుల పేద ప్రజలపై ప్రేమానురాగాలతో వారికి వస్త్రదానాలు, అన్నదానాలు, విద్యాదానాలు (అమ్మ దానం అనే పదాన్ని అంగీకరించకపోవటం వేరే విషయం) - ఇవన్నీ వింటుంటే, కంటుంటే - అమ్మ మనకు కనుపించేటట్లు అంతటా వ్యాపిస్తున్నది, అనిపిస్తున్నది. ఒకసారి అమ్మ అన్నది - ఎక్కడ తనకున్నది తృప్తిగా తింటూ, పదిమందికీ ప్రేమతో పెడతారో, ఎక్కడ ఆదరణ కనుపిస్తుందో అదే 'జిల్లెళ్ళమూడి' అని, అంటే అనతికాలంలోనే జగత్తంతా జిల్లెళ్ళమూడి కాగల శుభసూచనలు స్ఫురిస్తున్నవి. అస్తు !

(మార్చి 1974)



## సన్యాసం

మంచంమీద వద్దు - చాపమీదే పడుకుంటాననటం కోరికే. తెల్లగుడ్డ వద్దు కాషాయగుడ్డ కావాలనటమూ కోరికే.

కోరికలేని స్థితిని సంపాదించుకోటానికి ప్రయత్నం సన్యాసం.

లింగభేదం, రూపభేదం, స్పర్శభేదం లేనివాడు సన్యాసి. సన్యాసి కావలెగాని సన్యాసం పుచ్చుకోవటం కాదు.

- అమ్మ

# 91

# ద్వంద్వాలు ఒక దానివే

అద్వితీయ ప్రేమమూర్తి అయిన అమ్మ అవనీస్థలిపై అవతరించి 52 వసంతాలు నిండినవి. ఈ సారి జన్మదినోత్సవాల్లో పాల్గొని అమ్మను సందర్శించటానికి వచ్చిన జనం సుమారు 7,8 వేలకు మించి ఉండరు - స్వర్ణోత్సవం జరిగిన తర్వాత అమ్మ తన వాత్సల్య యాత్రలను ప్రారంభించింది ఆయాప్రదేశాల్లో అమ్మను లక్షలాది జనులు సందర్శించి ఆనందించారు. ఈ సందర్శన ప్రభావం ఈ జన్మదినోత్సవంమీద ఉంటుందనీ, కనీం 40, 50 వేలమంది అయినా వస్తారనీ అనుకున్నాం; తగిన యేర్పాట్లుగూడ జరిగాయి. కానీ అంచనా అంతా తారుమారయింది.

గత సంవత్సరం స్వర్ణోత్సవం అందరూ అనుకున్నదానికంటె అపూర్వ వైభవోపేతంగా జరిగింది "ఒక లక్షమంది ఒకేసారి ఒకే పంక్తిని భోజనంచేస్తూ వుంటే చూడాలనివుంది" అని అమ్మ అంటూవుంటే ఇది సాధ్యమా, సంభవమా అనిపించింది. 40, 50 వేలమంది వస్తేచాలా గొప్ప ! అనుకున్నాం. కానీ అప్పుడూ మా అంచనా తారుమారై $1\frac{1}{2}$ లక్షల మందికిపైగా జనం వచ్చారు; అమ్మను సందర్శించారు; సంతృప్తి చెందారు.

స్వర్ణోత్సవం జరగటానికి ముందున్న పరిస్థితులువేలు, అప్పుడు ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమంతో ఆంధ్రప్రదేశమంతటా అట్టుడికినట్లుడికిపోయి వుంది. రాకపోకల సౌకర్యాలులేవు. వ్యాపారం దెబ్బతిన్నది. ప్రజాజీవితమంతా స్తంభించి పోయింది. ఫలితంగా ప్రారంభించిన ప్రయత్నాలు ప్రత్యూహాలతో నిండి నిధి సంగ్రహణం సాగిరాలేదు. అయితే నేమి ? తుదిఘట్టంలో అన్ని యేర్పాట్లూ అద్భుతంగా జరిగాయి అన్ని పదార్థాలూ అత్యధికంగా సమకూరాయి; అత్యంత స్వాదువులై అందరినీ అందించాయి.

మఱి నేటి పరిస్థితులు సాధారణంగానే వున్నాయి. ప్రయత్న లోపంలేదు; పదార్థాల కొఱతలేదు. అయినా వాటిని ఉపయోగించటానికి కావలసిన జనం ఈ

సారి రాలేదు సరిగదా ! వాటి రుచిలోగూడ వైవిధ్యం కొట్ట వచ్చినట్లు కనబడింది ఆ నాటి స్వర్ణోత్సవానికీ, యీనాటి యీజన్మదినోత్సవానికీ యెంత వ్యత్యాసం ? స్వర్ణోత్సవానికి ముందు జన్మదినోత్సవాలుగూడ ఇలా జరగలేదే ? - నిజానికి భూతభవిష్యత్తులూ, వెలుగు నీడలూ, సుఖదుఃఖాలూ, తుదకు జనన మరణాలూ - సర్వద్వంద్వాలూ దైవస్వరూపమే అనుకుని నిరంతర విశ్వ తాదాత్మ్య జాగృతిలో నుండి సర్వజ్ఞ అయిన అమ్మ మీద ఈ వ్యత్యాసాల ప్రభావం ఉండదు, కానీ మంచి చెడులను గుర్తిస్తూ, ద్వంద్వ భావనా తాడితులమైన మనమీద తప్పక ఉంటుంది - మఱి ఈ వ్యత్యాసానికి కారణమేమిటి ?

అమ్మ కాలానికెంతో ప్రాధాన్యమిస్తుంది, "దేనికయినా తరుణం రావాలి నాన్నా !" అంటుంది కాల స్వరూపిణి అయిన అమ్మ

ఆనాడు ఆతరుణం వచ్చింది గనుకనే మన సంరంభాలతోను, సమావేశాలతోను ఏమాత్రం సంబంధంలేకుండా స్వర్ణోత్సవాలు సర్వకాల సంస్మరణీయంగా జరిగాయి. ఈ నాడు ఇట్టి తరుణం వచ్చిందీ, ఈ విధంగా ఈ జన్మదినోత్సవం జరిగింది.

అహంభావలేశాన్ని గూడ ఆమోదించని అమ్మ తన అజేయమైన, అప్రతిహతమైన సంకల్పశక్తితో 'గడ్డిపోచలను ఉక్కు ఊచలుగా మలచగలదు, ఉక్కు ఊచలను గడ్డిపోచలని నిరూపించగలదు' - అందుకు దీనికంటె ప్రబలమైన నిదర్శనమేమి కావాలి ?

అందువల్ల సర్వకార్య నిర్వహణలోనూ మన అహంకారాన్ని మట్టుపెట్టి, తన ప్రేరణనూ, తన సర్వశక్తిమత్త్వాన్నీ స్ఫురింపజేస్తూ విశ్వ విరాట్ స్వరూపిణియైన తన సేవకు తగిన ఉపకరణాలుగా మనలను సంతరించి మన జన్మలకు చరితార్థత చేకూర్చవలసిందిగా ఈ యేభై రెండవ జన్మదినోత్సవ శుభసమయంలో అమ్మను హృదయపూర్వకంగా వేడుకుందాము.

(ఏప్రిల్ 1974)



## యోగం

యోగం యౌవనం లాంటిది. నాకు స్వాధీనం కాని దేమిటి అంటుంది.

- అమ్మ

# 92
# విద్యాలయ ప్రారంభం

విశ్వతోముఖ విజ్ఞాన నిధియైన అమ్మ ఆశీస్సులతో అవిర్భవించింది మాతృశ్రీ విద్యా పరిషత్. ఆ సంస్థ యాజమాన్యంలో వెలసిన మాతృశ్రీ ప్రాచ్య కళాశాలకు మూడేళ్ళు నిండుతున్న శుభసమయంలో ఈ నెల 6వ తేదీన మధ్యాహ్నం 12 గంటలకు మాతృశ్రీ ప్రాచ్య ప్రాథమికోన్నత పాఠశాల ప్రాదుర్భవించింది దీనికి అమ్మయే ప్రారంభోత్సవం చేశారు. మాతృశ్రీ విద్యాపరిషత్ జీవిత చరిత్రలో ఇది ఒక సువర్ణాధ్యాయం

'అమ్మ' వేదికపై ఉన్నతాసనాసీనయై ఉండగా శ్రీ పాతూరి వేంకటేశ్వరరావు గారు నాటి కార్యక్రమానికి ముఖ్య అతిధిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మాత్యులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావు గారినీ, సభాధ్యక్షులు ప్రముఖ పత్రికా రచయిత శ్రీ పి వి.ఆర్. శర్మగారినీ రాష్ట్ర శాసనసభా సభ్యులు శ్రీ డి రంగారావు, శ్రీమతి జీవరత్నంనాయుడు గార్లనూ, గుంటూరు మండల విద్యా శాఖాధికారి శ్రీ జి. వెంకటస్వామి గారినీ తదితరులనూ వేదికమీదికి ఆహ్వానించారు. ఆనాటి కార్యక్రమానికి ఆంధ్రప్రభ, పత్రిక, జ్యోతి, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూ మొదలయిన ప్రముఖ దినపత్రికా ప్రతినిధులు, ఆకాశవాణీ ప్రతినిధి, పౌరసంబంధ సమాచార శాఖాధికారి ప్రభృతి ప్రముఖులు విచ్చేశారు

ముఖ్య అతిధికీ, అధ్యక్షులకూ తదితర సభ్యులకూ స్వాగతం పలుకుతూ మాతృశ్రీ ప్రాచ్య కళాశాలాధ్యక్షులు శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మ మాతృశ్రీ విద్యాపరిషత్ యాజమాన్యంలో నెలకొల్పబడిన పాఠశాల, కళాశాలల యొక్క లక్ష్యం కేవలం నిరుద్యోగులైన కొందఱు అధ్యాపకులకో, తదితరులకో ఉపాధి సదుపాయం కల్పించటంగానీ, తక్కిన విద్యాలయాలవలె కొంత మంది విద్యార్థులకు పట్టప్రదానం చేయటంగానీ కాదనీ, విద్యను కేవలం పొట్ట కూటికి మాత్రమే అభ్యసిస్తున్నామనే అధమాదర్శాన్ని విద్యార్థులలో తొలగించి పవిత్ర విజ్ఞాన సముపార్జన, క్రమశిక్షణ,

ఆత్మవిశ్వాసం, స్వావలంబనం, సంస్కృతి వికాసం వంటి ఉత్తమాదర్శాలను నెలకొల్పి తద్వారా కొంతవరకైనా సమాజసేవ చేయటమే వీని ధ్యేయమనీ వివరించారు

నిజమే మఱి !

''విద్యా దదాతి వినయం వినయాత్ యాతి పాత్రతామ్
పాత్రత్వాత్ ధనమాప్నోత ధనాద్ధర్మం తతస్సుఖమ్''

అని పెద్దలు విద్యాప్రయోజనపరంపరను ప్రవచించారు వేద శాస్త్ర పురాణాదులలో బహుధా ప్రసక్తమైఉన్న భారతీయ సంస్కృతి, సంప్రదాయ వైశిష్ట్య పరిశోధన గావించి ప్రపంచంలోని బహుభాషలనూ, బహుముఖ విజ్ఞాన సంస్కృతులనూ తులనాత్మకంగా పరిశీలించి సర్వజన సమ్మతమైన జ్ఞాన సమన్వయాన్ని సాధించగల ఒక మహత్తరమైన అంతర్జాతీయ ప్రాచ్య పరిశోధన సంస్థను నెలకొల్పటమే యీ విద్యాపరిషత్తుయొక్క ప్రధానాశయం. తత్సాధనకు ఈ విద్యాలయాలు ప్రాతిపదికలు మాత్రమే. అందువల్లనే

''నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే'' అని భగవద్గీత జ్ఞానముయొక్క అసదృశత్వాన్ని అభివర్ణించింది ! జ్ఞానమే భక్తి, జ్ఞానమే శక్తి; జ్ఞాన స్వరూపమే సర్వము; కాబట్టి జ్ఞానము దైవస్వరూపము

అధ్యక్షులు తమ ప్రసంగంలో 'అమ్మ' యొక్క దివ్య ప్రభావ విశేషాలను వివరించి మాతృశ్రీ సంస్థల సర్వతోముఖ వికాసానికి నిరంతర కృషి గావించి చరితార్థులైన స్వర్గీయాలు శ్రీ అధరాపురపు వేషగిరిరావుగారి సేవలను సంస్మరించారు. విద్యామంత్రి వినయ సౌశీల్య సౌజన్యాలను, కార్యదీక్షా దక్షతలను ఉగ్గడించి మహత్తరాదర్శాలకై కృషిసల్పుతున్న మాతృశ్రీ విద్యా సంస్థలకు ప్రభుత్వ సహాయ సహకారాలు సర్వదా సమకూరగలవనీ, ఆ సంస్థ అనన్య సామాన్య అభివృద్ధిని 'అమ్మ' అనుగ్రహ వీక్షణంలో సాధించగలవనీ ఆశించారు.

విద్యాశాఖామాత్యులు శ్రీ కృష్ణారావుగారు తమ సందేశోపన్యాసంలో ఆధివ్యాధి పీడితులయెడ, సమాజంలో అధఃపతితులయెడ అమ్మచూపించే అవ్యాజానురాగాన్ని వివరించి అన్నార్తులకు అనవరతం అన్నదానంచేస్తూ, విద్యా విజ్ఞానాలనుగూడ ప్రసాదిస్తున్న 'అమ్మ' ''మానవసేవయే మాధవసేవ'' అని ఆచరణలో నిరూపించిన, మానవతా ముద్ర రూపుగట్టిన మహనీయ మాతృమూర్తియని ప్రస్తుతించారు. విద్యారంగంలో తాము తలపెట్టిన మార్పులను సూచించి మూడు విశ్వవిద్యాలయాలలో మూడు విధాలుగాఉన్న ప్రాచ్య కళాశాలల విద్యావిధానాలనూ, కోర్సులనూ

సమన్వయపఱచే ఒక కేంద్ర విద్యా సంస్థను నెలకొల్పటానికి వీలుగా ఒక పరిశీలక సంఘాన్ని ప్రభుత్వం నియమించనున్నదని మంత్రి వివరించారు అమ్మ ఆశీస్సులతో ఆవిర్భవించిన యీ విద్యాసంస్థలు అనతికాలంలో అత్యున్నతమైన అభివృద్ధిని సాధించగలవని ఆకాక్షించారు.

అమ్మను సందర్శించటానికి వచ్చిన సుమారు అయిదు వందల మంది సోదరులమధ్య కూర్చుని విద్యామంత్రి అమ్మ ప్రసాదాన్ని ఆరగించి పవిత్రమైన ఆ ప్రసాదాన్ని యెవ్వరూ వ్యర్థం చేయవద్దనీ, దుర్వినియోగ పఱచవద్దనీ ఉద్బోధించారు అవును ! వారిమాట ప్రత్యక్షరసత్యం !! అమ్మదర్శనానికి వచ్చి ఆ ప్రసాదాన్ని స్వీకరించే అశేష సోదరులూ, దాన్ని వినియోగపఱచే స్వచ్ఛంద కార్యకర్తలూ ఈ ఉద్బోధలోని పరమార్థమును గ్రహించాలి !

ఆలోచిస్తే అమ్మ ప్రసాదం ఆకలిబాధలను ఆర్పటమే కాక అంతరంగాలలో దోబూచులాడే అవివేకపు తెరలను వడగొట్టుతుంది; అచ్ఛమైన విజ్ఞానపు వెలుగులో జీవిత కఠోర సత్యాలను నిసర్గసుందరంగా తెలుపుతుంది; మానవులను జీవన సమరాంగణంలో నిష్కామ కర్మాచరణ శ్రద్ధాళువులైన యోధులుగా తీర్చిదిద్దుతుంది ఏ సమస్యకైనా "పరిష్కారమార్గం చెప్పు తల్లీ !" - అని పదేపదే ప్రాధేయ పడుతున్న తన బిడ్డలను కరుణార్ద్ర దృష్టితో చూస్తూ అమ్మ "చెప్పటం కాదుగా నాన్నా !" అని వ్యంగ్య గర్భంగా ఆచరణ ప్రధానంగా కర్తవ్యోపదేశం చేస్తుంది.

కాబట్టి నరర్థక ప్రసంగాలకూ, నిర్వీర్యమైన నిస్తబ్ధతకూ, నిర్హేతుకమైన ద్వేషాలకూ, పరస్పర ఆరోపణలకూ వీడ్కోలు పలికి క్రియాశీలమైన ప్రవర్తననూ, పరస్పర సదవగాహనతో గూడిన పవిత్ర ప్రేమానుబంధాన్నీ, కర్తవ్యనిష్ఠనూ, నిర్వ్యాజమైన నిరంతర సేవాదీక్షనూ మనలో పెంపొందించుకొన గలిగితే మన జిల్లెళ్ళమూడి యాత్రా, జిల్లెళ్ళమూడి నివాసమూ సార్థకం కాగలవు. ఈ నూతన విద్యాలయ సమారంభశుభ సందర్భాన మనలో ఇట్టి సత్ప్రేరణ కలిగించవలసినదిగా మన 'అందరి అమ్మ'ను ఆర్తితో అభ్యర్థిద్దాము.

(మే, జూన్ 1974)



# 93
# సేవచేయగలగటమూ అదృష్టమే

"నీకు ఇచ్చినదాన్ని తృప్తిగా అనుభవించటం, నలుగురికీ ఆదరణగా పెట్టటం, అన్నీ వాడే చేస్తున్నాడని నమ్మటం - ఇదే నా ఆదేశం" అని అమ్మ ఒక సందర్భంలో అన్నది. ఉపనిషత్తులసారం ఈ వాక్యాల్లో ఉంది. మొదటి వాక్యంలో స్థితప్రజ్ఞలక్షణం, రెండవ వాక్యంలో త్యాగవైశిష్ట్యం, మూడవ వాక్యంలో దైవంమీద అకుంఠితమైన విశ్వాసం గోచరిస్తున్నాయి అమ్మ ఆయాసందర్భాలలో అనేకమైన, అనర్ఘమైన, అద్వితీయమైన సూక్తి రత్నాలను ప్రసాదిస్తూ వుంటుంది. అమ్మ చెప్పే ఏ ఒక్క సూక్తిని ఆచరణలో పెట్టుకోగలిగినా మన బ్రతుకులు ప్రయోజనవంతములవుతాయి, జన్మలు చరితార్థత చెందుతాయి !

ఈనెల 13, 14 తేదీలలో జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిని శ్రీ విశ్వజననీ పరిషత్ సమావేశాలు జరిగాయి. పలుతావుల నుండి సోదరులు వచ్చారు; జిల్లెళ్ళమూడిలో నిర్వహింపబడుతున్న వివిద సంస్థలు పనిచేయుతీరుతెన్నులనూ, లోటుపాట్లనూ చర్చించి భవిష్యత్తులో ఆ సంస్థలు సమర్థంగా పనిచేయటానికీ, ఆర్థికంగా వానిని స్వయం పోషకాలు గావించటానికీ కొందరు సోదరులు కొన్ని సూచనలు చేశారు ఆ సందర్భంలోనే జిల్లెళ్ళమూడిలోని కొందరు కార్యకర్తలకు కొన్ని బాధ్యతలను అప్పగించారు. ఇది ఒక శుభసూచనగా భావించవచ్చు

అయితే యీ సందర్భంలో మనం ముఖ్యంగా గుర్తుపెట్టుకోవలసిన విషయాలున్నాయి.

సర్వజ్ఞురాలు, సర్వశక్తిమయి - అని మనచే భావింపబడుతున్న అమ్మకూ, అమ్మ తలపెట్టిన జగద్ధిత కార్యక్రమాలకూ మనం వ్యక్తిగతంగా చేయగలిగినది ఉందా ? ఈ సంస్థయొక్క సమర్థమైన నిర్వహణకుగానీ, పురోభివృద్ధికిగానీ మనం అమ్మకు సూచనలు చేయవలసిన అవసరం ఉందా ? ఉంటే ఆమె సర్వజ్ఞత్వానికీ, సర్వశక్తిమత్వానికీ లోపం కాదా ? అని అనుమానాలు మనలో కొందరికైనా కలగటం

సహజం. నిజానికి అమ్మకు మనం చేయగల్గినదిగానీ, చెప్పగల్గినదిగానీ లేనే లేదు.

''క్రియాసిద్ధి ! సత్త్వే భవతి మహతాం నోపకరణే'' అన్నారు పెద్దలు 'మహాత్ములకు కార్యసిద్ధి సంకల్పబలంవల్లనే అవుతుంది, ఉపకరణాలవల్ల కాదు' - సాధారణంగా మహాత్ముల విషయంలోనే ఇలా వుంటే 'అమ్మ' విషయంలో చెప్పేదేమిటి ?

అమ్మ తలపెట్టిన కార్యక్రమాల్లో స్వచ్ఛందంగా, స్వార్ధరహితంగా సాధనాలుగా ఉపయోగపడగలగటం మనభాగ్యవిశేషమేకాని వేరేమీకాదు దగ్గర ఉండి చేసినా, దూరంగా ఉండిచేసినా సేవాఫలంలో మార్పేమీలేదు. అందుకే అమ్మ దృష్టిలో తన దగ్గర ఉండి సేవచేస్తున్న వారికీ, అన్నపూర్ణాలయంలో వంట, వడ్డన చేసేవారికీ, పాకీదొడ్లను బాగుచేసేవారికీ ఒక్క మాటలో చెప్పాలంటే - పనిచేస్తున్నవారికీ చేయనివారికీ గూడ తుల్య ప్రాధాన్యమే వుంది అంత మాత్రంచేత చేసినసేవకు ప్రయోజనంలేదనిగానీ, సేవచేయనివారికి విలువ వస్తుందనిగానీ అర్ధంకాదు. సేవచేయగలగటం అదృష్టం; అవకాశమున్నా చేయకపోవటం దురదృష్టం. వెలుగును చూచి దివాంధం కళ్లుమూసుకొంటే అది దాని స్వభావమవుతుందిగానీ వెలుగు యొక్క లోపం కాదుగదా ! ఈ సందర్భంలో

"The Lord Himself does His own work and He is doing it, but then blessed are those Whom He uses as His instruments" — అన్న పెద్దల వాక్యాలు గమనార్హములు.

''అమ్మ మనదృష్టిని ఆధ్యాత్మికతనుండి, అర్థిక విషయాలవైపు మరలించటం ద్వారా ఉత్తుంగ హిమాలయ శృంగాగ్రాలనుంచి అధోగమనం చేస్తున్న''దని కూడా ఆలోచించే సోదరులు కూడ మనలో కొందరు లేకపోలేదు. కానీ అమ్మ దృష్టిలో ఆధ్యాత్మికం, భౌతికం వేరుగావు; అని అన్యోన్యాశ్రయాలు, అవినాభావ సంబంధాలు. వ్యవహార జగత్తును వదలి వ్యవహరించటం నేలవిడిచి సాము చేయటం వంటిది అందుకే అమ్మ భౌతికాధ్యాత్మికముల యొక్క ప్రాధాన్యాన్ని ప్రకటిస్తూ దివ్యభావనా జాగృతమైన కర్మణ్యతను కమనీయంగా బోధిస్తున్నది. అమ్మమాటలను అర్థం చేసుకోవటానికి చేసే ప్రయత్నమూ ఒక తపస్సే ! ఆ తపస్సాధనలో కృతార్థత జెందగల్గిన వారెందఱు ? ఈ స్థితిలో అమ్మను అర్థం చేసుకోవటమంటే ఆకాశపు టంచులు చూడటమే అవుతుంది ! ఆమెను గుర్తించే శక్తిని ఆమెయే మనకీయాలి మఱి ! ఆ గుర్తింపు ఉన్నవాడు 'అమ్మదేవత' అన్నవాడే ఆ గుర్తింపు తొలగిన

వెంటనే 'అమ్మ అందరి అమ్మలవంటి సాధారణమానవి' అని అనటం మనం చూస్తూ వున్న సంగతే !

" జ్ఞానినమపి చేతాంసి దేవీ భగవతీ హినా సా
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి" --
- దేవీ మహాత్మ్యము

"భగవతి, మహామాయా స్వరూపిణియైన దేవి జ్ఞానవంతులయొక్క మనస్సులను సైతము బలవంతంగా ఆకర్షించి మోహపాశ బద్ధులను చేస్తుంది" అని పయిశ్లోక తాత్పర్యం.

అందువల్ల అమ్మనుగానీ, అమ్మచర్యలనుగానీ మనస్థూల దృష్టితో పరికించి పాక్షిక నిర్ణయాలు చేయటం "గజం-అంధులు" కథవలె ఉంటుంది.

అందువల్ల ఈ సందర్భంలో అమ్మసూక్తులను అనవరతం ఆచరణలో ఆలాపిస్తూ, ఆమె దివ్యత్వాన్ని అంతటా అనుభవిస్తూ, ప్రతినిత్యం పలురంగాల్లో మనం పొందే ప్రయత్న వైఫల్యాలను ప్రజ్ఞాన సాధనాలని గుర్తిస్తూ చిత్తశుద్ధితో చేసే ప్రతికార్యమూ భగవత్సేవ యనే భావనను పెంపొందించుకొంటూ సర్వ విబేధాలను విస్మరించి వజ్రసంకల్పంతో అమ్మ సేవాకార్యక్రమలో సోదరులందరూ బద్ధకంకణులవుతారని ఆశిద్దాం.

(జూలై 1974)



## త్రిపురసుందరి

త్రిపురసుందరి అంటే బాల్య యౌవన కౌమార స్థితులు కలిసినటువంటిది. త్రికాలాలూ ఆమె రూపమే. ఆమె అంటే చేతులు, కాళ్ళు, చీర, రవికె - కలిగిన "ఆమె" కాదు. శక్తి - ప్రతిదానిలో గర్భితమయిన శక్తి.

- అమ్మ

# 94
# ఆదర్శమూర్తి అస్తమయం

కొందరుత్తములు నివురు గప్పిన నిప్పువలే, మసిగుడ్డన కట్టిన మాణిక్యంవలే, ఆకులమాటున పిందెలవలే అతిగుప్తంగా జీవిస్తారు

జిల్లెళ్ళమూడి ఆవరణం - అమ్మ అన్నట్లుగా - ప్రపంచానికి నమూనాయే. అక్కడా అన్ని రకాల గుణాలూ కలిగిన అన్ని రకాల వ్యక్తులూ ఉన్నారు అక్కడ దేవతలూ ఉన్నారు; రాక్షసులూ ఉండవచ్చును. సర్వగుణసంపన్నులూ ఉన్నారు; రజోగుణాధికులూ ఉన్నారు; తామసగుణ ప్రధానులూ ఉండవచ్చును అక్కడ పండితులూ ఉన్నారు; పామరులూ ఉండవచ్చును. అక్కడ రవ్వలూ ఉన్నాయి, రాళ్లూ ఉండవచ్చును అక్కడ గులాబీల మధురపరిమళాలూ ఉన్నాయి, వాటినానుకునే పదునైన ముళ్ళూ ఉండవచ్చును అక్కడ వెన్నెలా కురుస్తున్నది, ఎండలూ కాస్తున్నాయి. అక్కడ ఆనందానికీ తరుగు లేదు విషాదమూ తప్పదు

కనుకనే 'అమ్మ అందరికీ, అన్నిటికీ అమ్మను' అన్నది. మరి, అమ్మ ఒక పక్షాన్నే ప్రవచించి ఊరుకో లేదుగదా

అక్కడ దేవతలే ఉండాలనీ, వెన్నెలే కాయాలనీ, గులాబీలే పూయాలనీ అనుకోవటం అమాయకత్వమే అవుతుంది. కొందరుత్తములకు జిల్లెళ్లమూడిలోని దేవతలే దర్శనమిస్తారు. కొందరు విమర్శకులకు అన్నిటా లోపాలే కనిపిస్తాయి. కొందరు వివేకులు, మంచీ చెడూ కనిపించినా, మంచిని మాత్రమే గ్రహించి ఆనందిస్తారు.

అట్లా అక్కడ కనుపించే దేవతాస్వరూపుల్లో రావూరి నరసింహమూర్తిగారు ఒకరు. ఆయన సర్వోత్తముడు. శ్రమైకజీవి, వినయశీలి, సహనస్వభావుడు దయార్ద్రహృదయుడు. కార్యదీక్షాపరుడు. నిరాడంబరజీవనుడు భక్తిభావ భరితుడు. కాంతా కాంచన వ్యామోహరహితుడు అజాత శత్రువు, నామయోగి, తపస్వి

ఆ సాధుపుంగవుడు యీ నెల 12వ తేదీ ఉదయం హైమాలయ ప్రాంగణంలో అనాయాసంగా శాశ్వతంగా కన్నుమూశాడు.

1960న సంవత్సరంలో మొట్టమొదటిసారిగా ఆయన జిల్లెళ్లమూడిలో అమ్మను దర్శించాడు. తదాది అమ్మసేవకై అంకితమయినాడు. 1968లో బాపట్లలో మాతృశ్రీ ప్రింటర్స్ స్థాపిస్తే ఆనాటి నుండి నాలుగు సంవత్సరాలు అవిరామంగా అందులో ఒక యంత్రంవలె పరిశ్రమించాడు.

తరువాత, జిల్లెళ్ళమూడిలో జరిగే అఖండనామ మహాయజ్ఞంలో తానూ భాగస్వామి కావాలని అమ్మను అర్థించి అభీష్ట సిద్ధిని పొందాడు 1970 ఆగష్టు నుండి నామయజ్ఞంలో పాల్గొనటమే కాక ఆ మహాయజ్ఞానికి ప్రధాన ఋత్విక్కు అయినాడు. అమ్మనామానికి తన జీవితాన్ని అర్పించడమేగాక ఆ మహామంత్రమే తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా పవిత్రజీవితం సాగించాడు. అఖండనామ సంకీర్తనలో ఎవరు తమవంతు నామం చేయలేకపోయినా, అది తన అదృష్టంగానే భావిస్తూ, వారివంతు నామసంకీర్తన కూడా తానే ఆనందంగా చేసేవాడు

అమ్మ అంటే అతనికి అకుంఠితమైన విశ్వాసం, అమ్మను తన యిష్టదైవ మయిన శ్రీకృష్ణపరమాత్మగా భావిస్తూ ఆరాధించేవాడు. అందుకనే అమ్మను పురుషోత్తమునిగా సంభావిస్తూ ఎల్లప్పుడూ "పరమాత్మా---" అని మాత్రమే సంభోధించే వాడు. కనుకనే యేమో, యీ నెల 11వ తేదీన జిల్లెళ్ళమూడిలో గోకులాష్టమి జరుపబడిన సందర్భంలో అమ్మ కృష్ణభగవానుడై కిరీటధారిణియై దర్శనమిస్తున్న దివ్యక్షణాల్లో ఒక్క తానుమాత్రమే అమ్మకు పాదాభివందనం చేసుకొనగలిగాడు.

నమస్కారం చేసుకుని నామవేదిక వద్దకు వెళ్ళి ఆ రాత్రి నామం చేస్తూ చేస్తూ అమ్మలో ఐక్యమందాడు ఆ అదృష్టవంతుడు.

49 సంవత్సరాలయినా నిండని యౌవనంలోనే సేవతో, సాధనతో, సర్వసద్గుణ సంపదతో సర్వేశ్వరికృపావలంబంతో జీవిత గమ్యాన్ని చేరుకో గలిగిన ఆపుణ్యాత్ముడు సర్వులకూ ఆదర్శమూర్తి.

(ఆగష్టు 1974)



# 95
# P.M.D.S

"అమ్మా - రోజూ యింతమందికి అన్నం ఎట్లా పెడతున్నావ్?" అని ఒకరు అమ్మను అడిగితే "నేను పెట్టేదేమున్నది, నాన్నా ? మీ అన్నం మీరే తింటున్నారు" అంటుంది అమ్మ.

మన అన్నం మనం ఎక్కడ తింటున్నామని కొందరి సందేహం ! ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా అన్నపూర్ణాలయంలో ఎన్ని లక్షలమంది భోజనం చేస్తున్నా - ఎవరినీ ఏమీ అడిగిందిలేదు. ఎవరయినా, ఎంతమంది అయినా, ఎప్పుడయినా రావచ్చునూ, భోజనం చేయవచ్చునూ. అంటే అందరికీ అమ్మే అన్నం పెడుతున్నది. ఇటీవలనే అమ్మ ఒక మాట అన్నది "తినకపోతే మీరు చిక్కిపోతారు, మీకు పెట్టుకొనకపోతే నేను చిక్కిపోతాను" అని లోగడ ఒకసారి మరోవిధంగా కూడా అన్నది. "మీరు తింటే నేను తిన్నట్లే"నని

ఔను - నిత్యమూ అమ్మ ప్రేమగా మనకు పెట్టుకుంటూ, మన కడుపు నిండితే తాను త్రేన్చుతూ తృప్తినీ, ఆనందాన్నీ పొందుతున్నది.

ఈ నిరంతర అన్నదాన విషయంలో అమ్మ ఆలోచనా, ఆశయమూ, అనుభవమూ, ఆనందమూ ఎట్లా ఉన్నా, యిటీవల కాలంలో కొందరికి మనమందరం కలిసి అమ్మకు భారమవుతున్నామేమో, మనవల్ల అమ్మకు శ్రమకలుగుతున్నదేమో - అన్న విచికిత్స ప్రారంభమయింది. అమ్మ కూడా మన అన్నమే మనం తింటున్నామంటున్నదీ, తాను పెట్టటంలేదంటున్నదీ - కనుక మన భోజనానికి మనమే బాధ్యత వహించాలన్న ఆసక్తి కనుపిస్తున్నదీ.

ఈ ఆశయమూ, ఆలోచనా ప్రాతిపదికగానే ప్రస్తుతం శ్రీ విశ్వజననీ పరిషత్ ఆధ్వర్యంలో ఒక నూతన పథకం ఆలోచింపబడింది. దానిని P M.D S. (Permanent Monthly Donors Scheme) అంటున్నారు. ఈ మహాయజ్ఞంలో స్వచ్ఛందంగా పాల్గొన దలచినవారికి యిప్పుడు మహదవకాశం కలిగింది. ఈ అవకాశాన్ని

సోదరులందరూ సద్వినియోగం చేసుకొని అమ్మ సంకల్పించిన పవిత్రకార్యక్రమంలో భాగస్వాములై అమ్మకు ఉపకరణాలుగానేకాక అవయవాలుగాకూడా ఉపయోగ పడాలని ఆశిస్తున్నాము.

ఈ పథకంలో చేరదలచినవారు వాగ్దానం చేస్తూ ఒక పత్రాన్ని పరిషత్‌కు సమర్పిస్తూ ప్రతినెలా ఐచ్ఛికంగా వారివిరాళాన్ని పరిషత్‌కు అందజేయాలి లేదా వార్షికంగానయినా పంపవచ్చును. ఈ విరాళం ధనంగా ఉండవచ్చునూ, వస్తువుగా ఉండవచ్చునూ అమ్మ అన్నట్లుగ డబ్బు అయినా వస్తువులుగా మార్చుకొనటానికే గదా, ఇక్కడ పనికిరాని వస్తువు ఏమున్నది ? బియ్యమూ, గోధుమలూ, మినుములూ, పెసలూ, కందులూ, మెరపకాయలూ, నూనెలూ, పాలూ, పెరుగూ . ఒకటేమిటి, ఎవరికేది ఉంటే దానిని వారి శక్తి కొలదీ యివ్వవచ్చును ఇచ్చే మొత్తానికి పరిమితి కూడా ఏమీ లేదు. అది ఎంత చిన్నమొత్తమయినా, ఒక రూపాయిఅయినా కావచ్చును, ఆ చిన్న మొత్తంలో నయినా వారి గొప్ప హృదయమూ, గొప్పభావనే ప్రతిఫలిస్తుంది

ప్రస్తుతం అమ్మసన్నిధానంలో ఒక ఓరియంటల్ కాలేజీ, అప్పర్ ప్రైమరీ స్కూలూ నడుస్తున్నాయి. వాటిలో మూడు వందలకుపైగా విద్యార్థినీ విద్యార్థు లున్నారు వారందరికీ అక్కడ ఉచిత భోజన, వసతి సౌకర్యాలుండటమే కాక అందరికీ కట్టుకొనటానికి బట్టలూ, దుప్పట్లూ వగైరాకూడా యివ్వాలని అమ్మ అభిప్రాయము.

అక్కడ ఉచిత వైద్య కేంద్రం కూడా ఉండాలని అమ్మ ఆశయము.

ఒక్కమాటలో చెప్పాలంటే - ఎవరూ తినటానికి తిండిలేకనూ, కట్టుకొనటానికి గుడ్డలేకనూ, ఉండటానికి వసతిలేకనూ, వైద్యసదుపాయం లేకనూ, విద్యా సౌకర్యంలేకనూ బాధపడకూడదని అమ్మ ఆశయం. ఈ మహత్తర కార్యక్రమాన్ని జిల్లెళ్ళమూడిలో ప్రారంభించినా, అది జిల్లెళ్ళమూడి కేంద్రంగా విశ్వవ్యాప్తం కావాలని అమ్మ అభీష్టం. అందుకు తాను కర్తగా కాక మననే అందుకు బాధ్యులను చేసీ మనలో విశ్వజనీనతకూ, విశ్వ సౌభ్రాతృత్వానికీ పాదుచేసి నీరు పోయాలనేదే అమ్మ కోరిక !

అంటే కాలక్రమంలో ప్రతి ఊరూ జిల్లెళ్ళమూడిగా వెలగాలనీ, ప్రతివ్యక్తీ అమ్మకు ప్రతిరూపంగా మెలగాలనీ అమ్మభావనేమో !?

(సెప్టెంబరు 1974)



# 96
# పరిపూర్ణవాదం

అమ్మరూపంలో మనం ఎంత ప్రశాంతతనూ ప్రసన్నతనూ చూస్తామో-అమ్మ ఆలోచనలో, ప్రవచనంలో అంత వినూత్నతను విప్లవాన్నీ వింటాము బాహ్యంగా, అంటే కట్టులో, బొట్టులో సంప్రదాయేశ్వరి అయిన అమ్మ ఎంత ప్రాచీన విధానాన్ని పాటిస్తుందో అంతరంగికంగా అంత పరిపూర్ణ స్వాతంత్ర్యాన్ని అవలంబిస్తుంది

కనుకనే అమ్మను అందరూ అసమాన అపూర్వ హేతువాదిగా అంగీకరించారు. అమ్మ ఏమి పలికినా ఏమి ప్రవచించినా తన అనుభవమే ఆధారంగా తీసుకున్నదిగానీ, ఏశాస్త్రాన్నీ, ఏ గ్రంధాన్నీ ఆలంబం చేసుకొన ప్రయత్నించలేదు. అమ్మలోని విశిష్టతల్లో యిదికూడా ఒకటి.

అమ్మ ఉపన్యాసాలు చేయకపోయినా, ఉద్గ్రంధాలు రచించకపోయినా సంభాషణల్లోనో, సంవాదాల్లోనో అనేక అపూర్వ సత్యాలను ఉద్ఘాటించింది. వాటిలో కొన్ని పూర్వ శాస్త్రాల్లోనో, ఉపనిషత్తుల్లోనో ఉల్లేఖింపబడిన సత్యాలతో సరిపోవచ్చును కానీ, వాటికంటే అతీతంగానూ, కొన్ని యెడల భిన్నంగానూ చెప్పిన సత్యాలు ఎన్నో నేటి మేధావుల ఆలోచనలకు పదును పెడుతున్నాయి.

హిందూ స్త్రీకి భర్తయే దైవమని శాస్త్రాలు చెబితే - భర్తకు భార్య కూడా దేవతయేనని అమ్మ చేర్చింది. శిష్యునికి గురువే బ్రహ్మయని శాస్త్రాలు చెబితే - గురువునకు శిష్యుడుకూడా అంతే నన్నది అమ్మ. రోగికి వైద్యుడు నారాయణుడే కాదు, వైద్యునికి రోగి కూడా ఆరాధ్యమే నన్నది అమ్మ. అన్నం పరబ్రహ్మ స్వరూపమని పూర్వఋషులు ప్రవచిస్తే, అశుద్ధంకూడా అదేననీ, ప్రజ్ఞానమే కాదు అజ్ఞానమూ, ఆనందమే కాదు దుఃఖమూ, తేజమే కాదు తిమిరమూ, సత్యమే కాదు అసత్యమూ; సౌందర్యమే కాదు వికారమూ, శివమే కాదు శవమూ; శబ్దమే కాదు నిశ్శబ్దమూ... బ్రహ్మమేనని ప్రవచిస్తూ అమ్మ పరిపూర్ణవాదాన్ని ప్రవేశపెట్టి ఆధ్యాత్మిక చింతనలో ఒక నూతనాధ్యాయాన్ని రచించటమే కాక - మనిషికి పునర్జన్మ లేదనీ, పాపపుణ్యాలు

లేవనీ, కర్తృత్వం లేదనీ, ఇహపరాలు లేవనీ, జగత్తు మిధ్య కాదనీ, అందరికీ సుగతేననీ చెబుతూ ఆధ్యాత్మిక వాదంలో పెనుతుఫానునే సృష్టించింది.

ఈ విప్లవాత్మక సిద్ధాంతాల్లో తలమానిక మయిన వాక్యాన్ని అమ్మ యిటీవలనే వెలువరించింది అది 'దేవుడిని గురించి తెలుసుకోవటమంటే, వాడు లేడని తెలుసుకోవటమే' అని.

ఎంత అపూర్వమయిన ప్రవచనం యిది; ఎంత విప్లవాత్మకమయిన ప్రకటన యిది !! నేతి, నేతి యంటూ కనుపించేదేదీ దైవం కాదని పూర్వ తాత్వికులందరూ ఆ దైవాన్ని ఎక్కడో ఒక ఊర్ధ్వ లోకంలో ఒక ఉన్నత సింహాసనారూఢుణ్ణీ, సకల కల్యాణ గుణాభిరాముణ్ణీ చేసి కూర్చొన పెడితే... నేడు అమ్మ యీ కనుపించేదంతా దైవమేననీ, దైవమెక్కడో ఒకచోట ఒక రూపమెరియై లేడనీ, వాడు యీ జగత్తును సృష్టించలేదనీ, దైవం సర్వాంతర్యామి కాక సర్వమూ అయి ఉన్నాడనీ చెబుతూ దైవంకాని, శాశ్వతంకాని యీ ప్రపంచాన్ని వదిలి దూరంగా పారిపోయి కళ్ళూ, చెవులూ మూసుకుని పరమార్థాన్ని సాధించాలనుకునే మానవునికి - సత్యమూ, శివమూ, సుందరమూ అయినది యీ జగత్తేనని చాటుతూ, యీ జగతిలో ప్రతి ప్రాణినీ ప్రేమించటమే దైవారాధనగా ప్రబోధిస్తూ ... శూన్యమై వెలవెలబోతున్న జగత్తును సుందర నందనవనంగా మార్చివేయటంతో, దైవంగా ఆరాధింపబడుతున్న అమ్మ అపూర్వ అనుపమ విశిష్ట మానవతావాదినిగా కూడా ఆదర్శమైంది.

(అక్టోబరు, నవంబరు 1974)



**శక్తి**

శక్తియే దైవం అనుకొంటున్నాను. మానవశక్తి అనీ దైవశక్తి అనీ - వేరువేరుగా ఉన్నాయను కోవటం లేదు.

- అమ్మ

# 97
# సర్వమాతృత్వం

ఈ నెల రెండవవారమంతా ప్రచురింపబడిన అమ్మవాక్యాల గురించి చర్చల తోనే అమ్మ సన్నిధిలో కాలక్షేపం అయింది. స్వర్ణోత్సవాల సందర్భంలో ప్రచురించిన "అక్షరదీపాలు"ను హైదరాబాద్ సోదరులు శ్రీ వీరమాచనేని ప్రసాదరావుగారు యింగ్లీషులోనికి అనువదించే సందర్భంలో ఆ వాక్యాల గురించి పునరాలోచన వచ్చింది. సోదరులు డాక్టర్ శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు చెప్పినట్లు అమ్మ ఒక పర్యాయం అన్నట్లు అమ్మ వాక్యాలన్నింటికీ పరమార్థం "అంతా అదే"ననే

కానీ కొన్ని వాక్యాలు ఆ అర్థానికి భిన్నంగా ఉన్నాయేమోనని మాకు స్ఫురించి వాటిని అమ్మదృష్టికి తీసుకురాగా అమ్మ అనేవీ ఆ "సంపూర్ణత్వా"నికి ఏ మాత్రమూ విరుద్ధంగా లేవని వ్యాఖ్యానిస్తే - ఆ మేధా సంపత్తికీ, ఆ బోధనా కౌశలానికీ ఆశ్చర్య చకితుల మయినాము

అయినప్పటికీ ఒకటీ, రెండు వాక్యాలవద్ద మాకు సంశయ నివృత్తి కాక 'పునర్ముద్రణలో ఆ వాక్యాలను తొలిగిస్తామమ్మా" అన్నాము, "ఎందుకూ ?" అని అడిగింది అమ్మ. ఆ వాక్యాలు అట్లాగేవుంటే - అవి "నీ తాత్విక ప్రవచనాల స్థాయిని తగ్గిస్తాయమ్మా' అని నసిగాము.

"అయితే ఏమవుతుందీ ?" అని అమ్మ మళ్ళీ అడిగింది. ఏమి చెప్పటానికీ తోచక మేము దిక్కులు చూస్తున్నాము. "నా ప్రతిష్టకు భంగం వస్తుందని మీ ఆలోచనా ?" అని తిరిగి అమ్మే ప్రశ్నించింది మేము ఏమని సమాధానం చెప్పమూ? ... మేము జవాబు ఇచ్చే లోపలనే అమ్మ అన్నది -- "నాన్నా... ఒకటి అడుగుతాను - ఆలోచించండి ఒక తల్లి ఉన్నది. నలుగురు కొడుకులను కన్నది. అందులో ముగ్గరు కొడుకులు మీ ఆలోచన ప్రకారం బుద్ధిమంతులూ, తెలివిగలవాళ్ళు ఒకడు మాత్రం దుర్మార్గుడూ, మంద బుద్ధీ, మరి - ఆ ముగ్గరివల్లా ఆ తలిదండ్రులకు పరువు ప్రతిష్టలు కలిగితే - ఆ ఒక్కడి వలనా వారికి అపకీర్తి వస్తున్నదికదా అని ఆ

ఒక్కడినీ తమ సంతానం కాదంటారా ? లేక ఆ సంతానాన్ని రూపుమాపుదా మనుకుంటారా ?'' ఆ చివరి మాటలు పలుకుతుంటే అమ్మ కంఠస్వరంలో మార్పు గమనిస్తూ మేము నివ్వెరపోయాము.

అంటే - అమ్మ ఆ వాక్యాలకూ, ఆ పదాలకూ, ఆ అక్షరాలకూ తల్లి అన్నమాట!

పూర్వం ఒకసారి సోదరులు శ్రీ అచ్యుతుని రామకృష్ణశర్మగారు 'నీ వెవరవు?' అని ప్రశ్నిస్తే -- "నేను అమ్మను'' అన్నది. "ఎవరికీ?'' అని పునః ప్రశిన్నస్తే "నీకూ, మీకూ, అందరికీ'' అంటూ పశుపక్ష్యాదులకూ అని విపులీకరించింది మాటల్లోనే కాకుండా అనేక సందర్భాల్లో అమ్మ ఆ విషయాన్ని ఋజువు చేసుకున్నది స్వర్ణోత్సవాల సమయంలోకూడా అమ్మ ఆ మహదానందాన్ని మనుషులకేగాక పశుపక్ష్యాదులకూ పంచి తానూ ఆనందించింది

ఒకసారి అమ్మ "రావణాసురుడు దుర్మార్గుడని ఆ తల్లి తనను ప్రేమించకుండా ఉంటుందా ?'' అని అడిగింది. అట్లాగే యీ వాక్యాల విషయంలోకూడా అమ్మ తన సర్వ మాతృత్వాన్ని మరోసారి ప్రకటించింది

(డిశంబరు 1974)



### తను మూలం ఇదం జగత్

ఏది చేసినా అంటే మేలు చేసినా, కీడు చేసినా, దగ్గరకు తీసినా, ముద్దుపెట్టుకున్నా, తిన్నా, తినక పోయినా, అలిగి పడుకున్నా - అన్నీ ఎవరయినా తమ తృప్తి కొరకే చేస్తారు.

- అమ్మ

# 98
# అవతారమూర్తుల్లోని విశిష్టత

"కాలవనిండా నీళ్ళున్నయ్. దాహం అవుతోంది. అయినా త్రాగటానికి రేవు కావలిగా" అన్నది అమ్మ. దైవం సర్వవ్యాపి అని నమ్మేవాళ్ళకు అమ్మ చెప్పింది - సర్వత్రా వ్యాపించిన దేవుడిని అర్థం చేసుకొనటానికి, ఆరాధించటానికి రేవులే దేవాలయాలని. ఆ దేవాలయాల్లో దేవుడు శిలారూపంలో సుప్రతిష్ఠుడై ఉంటాడు. నిత్యమూ మనం ఆయన్ను స్తుతిస్తాము; పూజిస్తాము; మన మొరలను విన్నవించుకుంటాము. కానీ - ఆయన మన స్తోత్రాలను అలిస్తున్నాడో, లేదో, మన పూజలను అందుకుంటున్నాడో, లేదో, మన మొరలకు ఆయనగుండె కరుగుతున్నదో లేదో; మనపై ఆయనకు ప్రేమ ఉందో, లేదో. కారుణ్యం ఉందో లేదో మనకు తెలీదు. ఎంతసేపటికీ మన మనస్సుతో, భావంతో, ధ్యానంతో ఏకాగ్రతతో నమ్మకంతో మనం ఆయన్ను పట్టుకోవలసిందే.

మన మనస్సులో యీషణ్మాత్రం చలనం కలిగినా, భావంబాట తప్పినా, నమ్మికలో లేశమాత్రం సడలింపు వచ్చినా - మన ప్రయత్నమంతా వృధా అయినట్లే. కానీ భగవంతుడు లేక భగవదంశ మానవరూపంలో మనకు లీలా మాత్రంగా గోచరించినా - వారినే మనం అవతారమూర్తులని, కారణజన్ములని అంటున్నాం - ఆ మూర్తిని ఒకసారి దర్శనం చేసుకుని, ఆ పాదాలను పట్టుకుని మనసారా "త్వమేవ శరణ"మ్మని సర్వార్పణ చేయగలిగితే - మనకు యిక ఏ చింతా ఉండదు మన సర్వబాధ్యతలూ ఆయనే వహిస్తాడు.

మనం మరచినా - తాను మరవడు
మనం వదిలినా - తాను వదలడు
మనం ద్వేషించినా - తాను ప్రేమిస్తాడు
మనం దూషించినా - తాను లాలిస్తాడు
మనం అలిగితే - తాను అనునయిస్తాడు
మనం పారిపోతే - తాను వెంటాడి వెన్నంటి ఉంటాడు.

అదే అవతార వ్యక్తుల్లోని మధుర స్వభావం అదే వారిలోని విశేషమూ, విశిష్టత, అందుకే ఏ పురాణం చదివినా - అవతార పురుషుల కాలంలో వారికోసం ప్రజానీకం వెఱ్ఱెత్తి పోయినట్లు కనిపిస్తుంది

అయితే - యీ అవతారపురుషులను గుర్తించటం ఎట్లా ? - అన్నది కూడ సమస్యే. కొందరు నక్షత్రాల్లో చంద్రుడివలే విరాజిల్లుతారు. కొందరు - రాళ్ళలో రత్నంవలే అతి సామాన్యంగా ఉంటారు విశేషదృష్టి ఉంటేనేగానీ వారిని మనం గుర్తించలేము ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు నన్నట్లు - వారికి మనకు వలెనే రెండు కాళ్ళు, రెండు చేతులు, ఒకే ఒక తల ఉంటాయి. చూట్టానికి అందరికివలెనే అతిసామాన్యంగా ఉంటారు. అనుభవంలోగానీ వారి ప్రత్యేకత అర్థంగాదు గుణాలు మనకూ ఉంటాయి; వారికీ ఉంటాయి. శక్తి మనకూ ఉంటుంది. వారికీ ఉంటుంది. బుద్ధి మనకూ ఉంటుంది. వారికీ ఉంటుంది, మనవన్నీ పరిమితమై ఉంటాయి వారికి అన్నీ అవధులు దాటి ఉంటాయి. మన రాగద్వేషాలు కారణాన్ని ఆశ్రయించుకుని ఉంటాయి. వారికి ఆగ్రహమే ఉండదు ఉన్న అనుగ్రహం అవ్యాజమై ఉంటుంది. మన ఆలోచనలో ద్వైదీభావం ఉంటుంది వారి మనస్తత్వంలో భిన్నత్వం ఉండదు. మనకు సృష్టి సమస్తమూ ద్వంద్వమయమై కనుపిస్తుంది వారిధృష్టిలో యీ ద్వంద్వాలకు ఆధారభూతమైన ఏకాత్మమాత్రమే భాసిస్తుంది

ఈ వ్యక్తులను మనం గుర్తించాలంటే - వారి సాన్నిధ్యంలో కొంత కాలం జీవించాలి. వారి జీవితం అధ్యయనం చేయాలి. వారి హృదయం అవగతం చేసుకోవాలి. వారి వాక్సుధను గ్రోలాలి. వారి చర్యలను పరిశీలించాలి మరి - యిది ఎవరికి సాధ్యం అవుతుంది? వారి అనుగ్రహం పొందినవారికి మాత్రమే యీ మహదవకాశం లభ్యమౌతుంది ఈ అనుగ్రహం రెండు విధాలుగా ప్రసారం కావచ్చు. ఒకటి అనుభవం ద్వారా; మరొకటి విశ్వాసంద్వారా, మొదటి తరగతివాళ్ళు అనుభవం ద్వారా గ్రహించి చెప్పిన దాన్ని రెండవ తరగతివాళ్ళు విశ్వాసం ద్వారా గ్రహిస్తారు

(జనవరి, ఫిబ్రవరి 1975)



# 99
# ఉడతాభక్తి

ఒక వ్యక్తియొక్క గ్రహస్థితి అతని జన్మదిన సమయంలో సువ్యవస్థితంగా ఉంటుందన్నది అందరకూ సువిదితమే. ఈ విషయంలో అవతారమూర్తులకు మినహాయింపేమీ లేదు.

చాలాకాలంనుండి పరమ పవిత్రమైన అమ్మ జన్మదినోత్సవాన్ని జరుపు కుంటున్నాము. ప్రతి సంవత్సరమూ ఆ పర్వదినాన జనసందోహం అత్యధిక సంఖ్యలో అమ్మను సందర్శించటానికి జిల్లెళ్ళమూడికి రావటం అనుభవగోచరమే 1973లో అమ్మ స్వర్ణోత్సవ సమయంలో సుమారు $1^1/_2$ లక్షల మంది జనం అమ్మప్రసాదాన్ని స్వీకరించటంగూడ తెలియని వారుండరు.

సాధారణంగా జన్మదినోత్సవవ సమయంలో సోదర సోదరీమణులు వేల సంఖ్యలో వచ్చి అమ్మను సందర్శించి తమ భక్తి ప్రపత్తులు ప్రకటించుకొని వెళ్ళుతూ వుంటారు. అయితే పరిస్థితులు ప్రాతికూల్యంవల్ల అలా సందర్శించ లేని వారుగూడ లక్షల సంఖ్యలో వున్నారు. అట్టివారు పరోక్షంగానైనా అమ్మను సేవించుకొని, చరితార్థత పొందటానికి ఈ సంవత్సరం ఒక ప్రణాళిక సిద్ధ పఱచబడింది.

ఈ సంవత్సరం అమ్మ జన్మదినోత్సవం 22.4.75న వస్తుంది. ఉదేశ్యముంటే ఇప్పుడు మీ విరాళాలను ద్రవ్యరూపంలో గానీ వస్తురూపంలో గానీ పంపవచ్చు మీరు పంపే ద్రవ్యం లేక వస్తువు కేవలం ఈ ఉత్సవానికయ్యే ఖర్చులకే ఉపయోగింప బడుతుంది. బియ్యం, పప్పు, మిర్చి, చింతపండు, బెల్లం, నూనె వంటి అత్యవసర పదార్థాలు ఆ ఒక్కనాటి ఉత్సవానికే పెద్దమొత్తాలలో కావలసి వస్తాయన్నది మీకు చాలా పరిచితమయిన విషయమే. మీరు పంపే ద్రవ్యం లేక వస్తువు జన్మదినోత్సవ సందర్భంలో సద్వినియోగం చేయటానికి అప్పుడే యేర్పాట్లు జరుగుతున్నాయి మీరు ఇచ్చే నివేదన అమ్మకు సమర్పింప బడుతుంది. ఆ పవిత్ర సమయంలో అమ్మకు నివేదించిన ఆ ప్రసాదము మీకు వెనువెంటనే పోస్టుద్వారా పంప బడుతుంది.

ఈ అపూర్వ పవిత్రావకాశాన్ని మీరందరూ ఉపయోగించుకోవలసి నదిగా సూచిస్తున్నాము ఈ విషయాన్ని మీ సన్నిహితులకూ హితులకూ తెలియజేయండి ఈ అవకాశాన్ని పురస్కరించుకొని మీమీ ఆఫీసుల్లోను, ప్రాంతాలలోను లేక గ్రామాలలోను దాతలనుండి యథాశక్తి విరాళాలను సేకరించి పంపండి.

డబ్బును పంపితే యం. ఒ ద్వారాగాని, డ్రాఫ్టురూపంలోగానీ "సెక్రటరీ, శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్లమూడి, గుంటూరుజిల్లా - అన్న చిరునామాకు పంపండి ధనరూపంలో పంపేవిరాళంఒక సంఘంపక్షాన పంపిన యెడల ఆ సంఘంలోని వారిపేర్లు తెలిపిన యెడల వ్యక్తి గతమైన రసీదులు వారివారి చిరునామాలకు పంపబడతాయి.

వస్తురూపంలో పంపేవారు తమ విరాళాలను బాపట్లకు ట్రయిను ద్వారా గాని, పార్సిలు సర్వీసుద్వారాగానీ పంపవచ్చు. దానికి సంబంధించిన U.R. లేక R.R శ్రీ విశ్వజననీ పరిషత్ సెక్రటరీకే పంపవలసి ఉంటుంది తమతమ విరాళరూప మయిన వస్తువులను లారిలో పంపేవారు లారీలను నేరుగా జిల్లెళ్ళమూడికే పంప వచ్చు ఈ పద్ధతిలోగూడ దాతలపేర్లను ఒక క్రమంలో వ్రాసి పంపవచ్చును

అమ్మ ఆశీస్సులు అనవరతమూ మీకు లభించాలని ఆశిస్తున్నాము.

(మార్చి 1975)



### తనకొరకే

ప్రేమించటమూ, ద్వేషించటమూ తనకొరకే. మనిషి ఏమి చేసినా తనకొరకే చేస్తాడు. మనిషి ఇతరుల కోసం త్యాగం చేశాను అనుకుంటాడు గానీ అందులోనూ తానే ఒక తృప్తినీ ఆనందాన్నీ పొందుతాడు. ఆ ఆనందం పొందటం కోసమే త్యాగం చేస్తాడు.

- అమ్మ

# 100
# చతురాలాపవినోదిని

ఏప్రియల్ 14వ తేదీ సాయకాలం అమ్మ మద్రాసు నుండి జిల్లెళ్ళమూడి బయలు దేరుతున్నది ఇరవై రెండు రోజుల నుండి అమ్మను తమ మధ్య నిలుపుకుని అమ్మ అనన్యమమతా మాధుర్యాన్ని తనవిదీరా అనుభవించిన మదరాసు సోదరులు కొద్ది క్షణాల్లో జరుగబోయే అమ్మ ఎడబాటును సహించగలిగే మనఃస్థైర్యాన్ని ప్రసాదించమని అమ్మనే వేడుకుంటున్నారు

అమ్మ మద్రాసులో ఉన్నన్ని రోజులు సోదరులు అచ్యుతరాం యింట్లో ఉన్నది ఆ యింటి ప్రతి అణువు అమ్మ పాదస్పర్శతో పులకించి పోయింది. అమ్మ ఆ యింట్లో నుండి బయలుదేరి బయటకు వస్తున్నది అచ్యుతరామ్, అతనిభార్య జ్యోతి, అతని తల్లిదండ్రులు, చెల్లెలు, తమ్ముడు, కుమారుడు అందరూ బరువుగుండెలతో అమ్మకు వీడ్కోలు పలుకుతున్నారు అమ్మ ఒకరిగడ్డం పట్టుకునీ, ఒకరిచెంపను తాకుతూ, ఒకరిభుజం తడుతూ ... ప్రతి ఒకరినీ పలకరిస్తూ ''వెళ్ళొస్తా' 'నని చెబుతున్నది

ఆ క్షణాల్లో అచ్యుత్ అడిగాడు అమ్మను "నువ్వు వీలయినంత త్వరగా మా యింటికి రావాలమ్మా -'' అని అమ్మ ''తప్పకుండా నాన్నా'' అంటూ వెళ్ళి వారి ఇంటి ముందు లాన్‌లో అమర్చిన కుర్చీలో ఆసీన అయింది. అమ్మను, అమ్మ ముఖంలో మహోజ్జ్వలంగా దీపించే ప్రశాంత దివ్య సౌందర్యాన్ని అవలోకించిన కొలదీ ఆనందంగా ఉంది. అమ్మ వెళ్ళిపోతోంది - అన్న భావం మరొక ప్రక్కన గుండెలను పిండుతూనూ ఉన్నది.

నేపథ్యగాయని జానకి అమ్మ సాన్నిధ్యంలో తన గాత్రమాధుర్యాన్ని అమ్మకు నివేదన చేసింది.

అమ్మకు నమస్కారాలు చేసుకుని అందరూ ప్రసాదం అందుకున్నారు. అమ్మ కుర్చీలో నుంచి లేచింది. అందరూ కారువద్దకు దారిచేశారు కానీ, అమ్మ

అచ్యుత్‌వాళ్ళ ఇంటిలోకి వెళ్ళింది గబగబా అచ్యుత్ కుటుంబం ఇంటిలోపలకు అమ్మను అనుసరించారు

వారివంక చిరునవ్వులు చిందిస్తూ అచ్యుత్‌ను చూసి -- "మళ్ళీ త్వరగా మాయింటికి రా, అమ్మా - అన్నావుగా త్వరగా వచ్చేశా, నాన్నా" అన్నది అమ్మ

అమ్మ వాక్చమత్కృతికి అందరమూ ఆశ్చర్యమూ, ఆనందమూ పొందాము. ఒకరోజున మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీ వైస్‌ప్రిన్సిపాల్, రామచంద్రమూర్తిగారు అమ్మ వద్ద కూర్చుని అమ్మకాళ్ళురాస్తూ 'అమ్మా-బ్రహ్మ కడిగిన పాదాలు యివేకదా' అని అడిగాడు వెంటనే అమ్మ "ఔను, నాన్నా" అన్నది అతని ప్రతిపాదనను నిర్నిబంధంగా అమ్మ బలపరచినందుకు అతను అమితానందం పొందుతుండగా అమ్మ వివరించింది. "మీరు రోజూ కడుగుతూనే ఉన్నారుగా, నాన్నా మీరందరూ బ్రహ్మకదూ ---" అని

మరొకరోజున ఒక తల్లి తన బిడ్డను అమ్మవద్దకు తీసుకునివచ్చి, అతని మానసిక చాంచల్యాన్ని అమ్మకు నివేదిస్తూ "వీడు ఇంట్లో వాళ్ళను వేధిస్తున్నాడమ్మా --" అని చెప్పింది

"ఇంట్లో వాళ్ళనేనా ?" అని అమ్మ అడిగింది "ఇతరులను ఏమీ అనడమ్మా ఇంట్లోవాళ్ళు కనిపిస్తే మాత్రం ఊరుకోడు" అని ఆ తల్లి బాధగా వివరించింది

వెంటనే పకపకానవ్వుతూ అమ్మ అన్నది - "నాకంటే వాడేనయం అమ్మా వాడికి ఇంట్లో వాళ్ళనీ, ఇతరులనీ తేడా తెలుస్తున్నది. నాకు అదీ తెలీటంలేదు ఇక నేను వాడి కేం సలహా యిచ్చేది?"

అమ్మ మాటలకు అక్కడున్న అందరూ గొల్లున నవ్వారు.

అమ్మ చమత్కారాల్లోనూ పరమ సత్యాలను వెలువరిస్తుంది గంభీర విషయ వివరణల్లోనూ చమత్కారాలు ఒలకబోస్తూ అందరినీ నవ్విస్తూ తాను నవ్వుతూ తనచుట్టూ వాతావరణాన్ని రసబంధురం చేస్తుంది

(ఏప్రిల్, మే 1975)



# 101
# మరో చైతన్య ప్రభువు

"హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥"

ఈ కలిసంతరణ నామమహామంత్రం ఉపనిషత్ ప్రతిపాదితమే అయినప్పటికీ - దీనిని దేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశంలో ప్రచారంచేసింది మాత్రం శ్రీ అవధూతేంద్ర సరస్వతీస్వామీజీ. వీరు యీ మధుర నామాన్ని తన శ్రావ్యమైన కంఠంతో భక్తిపారవశ్యంతో గానంచేస్తూ దేశంలో వాడవాడలా ఊరూరా వ్యాపింప జేశారు. భగవన్నామ సంకీర్తనలో అసక్తిలేనివారుగూడా - స్వామీజీ సంకీర్తన చేస్తున్నారంటే, వచ్చికూర్చోవటం, వారికి ఆ ఉద్దేశం లేక పోయినా, అసంకీర్తనలో అప్రయత్నంగానే పాల్గొనటం పరిపాటి అయింది. ప్రస్తుతం దేశంలో ఉన్న ఎన్నోసంకీర్తన సమాజాలు వారి ఆధ్వర్యంలో ఏర్పడి వారి ఆశీర్వచనంతో నడుస్తున్నవే. ఏకాహ, సప్తాహ ప్రక్రియలను బహుళ ప్రచారంలోనికి తీసుకువచ్చింది యీ మహనీయులే, ఎక్కడ ఏకాహం జరుగుతున్నదన్నా, సప్తాహం జరుగుతున్నదన్నా - అక్కడ స్వామీజీ మధురకంఠం వినిపించవలసిందే. అక్కడ స్వామీజీ పరవశులై నృత్యం చేయవలసిందే. అక్కడ స్వామీజీ భక్తిభావం ఉత్తుంగతరంగితం కావలసిందే. అక్కడ భగవత్ సాక్షాత్కారం అయితీరవలసిందే. ఇదంతా కేవలం స్వామీజీ యొక్క కంఠ మాధుర్యం వలనా, సంకీర్తనా నైపుణ్యంవలనా కాదు; వారిలో పరిపూర్ణత పొందిన భక్తిప్రభావం వలనా, చైతన్యవంతమైన ఆత్మదీప్తివలనా మాత్రమే.

తులసీదాసగోస్వామి విరచితమైన హనుమాన్ చాలీసాను ఆంధ్రదేశంలో ప్రచారంలోకి తీసికొచ్చింది కూడా యీ పూజనీయులే. ఆ పవిత్ర చాలీసాను రాతి పలకలపై చెక్కించి అనేక గ్రామాలలో పట్టణాలలో ప్రతిష్ఠింపచేశారు. అనేక విధాల యీ భగవన్నామ ప్రియుడు, యీనామయోగి, యీపరమ భాగవతోత్తముడు ప్రజలలో నిద్రాణమైన భక్తిభావాన్ని జాగృత మొనరించి చైతన్య స్వామిని తిరిగి సాక్షాత్కరింపచేశాడు.

స్వామీజీ మొట్టమొదటిసారిగా అప్పికట్లలో 1952లో అమ్మను చూశారు. ఆనాటి నుండి అమ్మకు వారిపై వాత్సల్యము, వారికి అమ్మపై భక్తి, విశ్వాసము.

1954లో మొట్టమొదటిసారిగా 'అవధూత'గా వారు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ ఎదురువెళ్ళి వారి కాళ్ళు కడగటానికి ప్రయత్నించింది. వారు అంగీకరించలేదు. "తప్పులేదు నాన్నా - బిడ్డవళ్ళు, కాళ్ళు తల్లి కడగ వలసిందేకాని ఇంకెవరు కడుగుతారు?" అని చెప్పింది. అయినా - వారు అమ్మను కడగనివ్వక సోదరి హైమచేత కడిగించుకున్నారు. అప్పుడే అమ్మ వారికి చెప్పింది - "నాన్నా, నీకు ఎప్పుడు అవసరం అనుకుంటే అప్పుడు వచ్చి నా దగ్గర ఉండు, ఇక్కడ నీతల్లి ఉన్నదన్న విషయం మరిచిపోకు" అని.

ఆ మాట ప్రకారమే అమ్మను ఎన్నిసార్లో చూశారు. తన మనోవేదన లెన్నిటినో అమ్మతో చెప్పుకుని ఉపశమనం పొందారు. అమ్మఒడిలో పడుకుని పసివాడై పరవశం చెందేవారు. అమ్మమంచంపై అమ్మఒడిలో చనువుగా కూర్చునేవారు, పడుకొనేవారు. ఆక్షణాల్లో వారు తన వయస్సునూ, స్థితినీ అన్నిటినీ మరచి చిన్న పిల్లవారివలె హాయిగా ఉండేవారు. అమ్మ అన్నం కలిపిపెడుతూ, పండ్లు తినిపిస్తూ, తానూ ఆనందించేది. అమ్మ అనురాగాన్నీ అనుగ్రహాన్నీ పొందిన అదృష్టశాలి.

అమ్మపై అకుంఠితమైన విశ్వాసమూ, అపారమైన భక్తీ గలవారు. అమ్మను నేటి "సిద్ధపురుషు" లెవరితోనూ పోల్చటం వారికి ఇష్టం ఉండేదికాదు. అమ్మ స్థితి, స్థానమూ అసమానమనీ, అత్యున్నతమని వారి అభిప్రాయం.

ఆ సర్వజన ఆరాధ్యుడూ, సర్వజనప్రియుడు హఠాత్తుగా యీనెల 11వ తేదీన పరమపదించి అమ్మలో ఐక్యమందారు.

వారి భౌతికకాయం మనకు కనిపించకపోయినప్పటికీ, వారి సంకీర్తన, నామలహరి అనంత వాతావరణం నుండి అనంతంగా మనలను చైతన్య వంతంచేస్తూ వినిపిస్తూనే ఉంటాయి.

(జూన్ 1975)



# 102
# బాధల భగవంతుడు

"నిజమే ననుకో అమ్మా - ఎదురుగా కనబడే బాధను చూచి మనస్సు నిబ్బరించుకోలేకపోతున్నాను. నీ స్థితి ఎక్కువ అనీ నాకు తెలుసు. నీ మనస్సు మామనస్సు కంటే విశిష్టమయిందనీ తెలుసు నీ శరీరం మా శరీరంకంటే విభిన్నమయిందనీ తెలుసు. నిన్ను ఎవరూ ఏవీ ఏమీ చేయలేరనీ తెలుసు. అయినా నీవు బాధపడుతూ కనుపించగానే అంతకు ముందున్న భావాలూ, విశ్వాసాలూ కరిగిపోతున్నాయమ్మా దీనికి కారణం మాత్రం నాకు తెలియటం లేదు..."

"ఇంత మాత్రానికే బాధపడితే, చలిస్తే ఎట్లా ? ముందు ముందు ఉన్నదంతా అదే -"

"ఏమో, కొన్ని సందర్భాల్లో నీవు సర్వశక్తి మంతురాలవనీ, సర్వజ్ఞురాలవనీ ఎంత నమ్మకమో, కొన్ని కొన్ని వేళల్లో నీకేమవుతుం[illegible]నీ, నీవే మవుతావోననీ నేను బాధపడుతుంటానమ్మా మరి ఆ విశ్వాసానికీ. భయానికీ సమన్వయం ఎట్లాగో నాకు అర్థంగావటంలేదు-"

ఈ సంభాషణ అమ్మకూ, చిదంబరరావుతాతగారికి - అమ్మకు పదిసంవత్సరాల వయస్సులో తీవ్రంగా జ్వరం తగిలినప్పుడు - జరిగింది. చివరకు అమ్మ "పిచ్చితాత గారూ - నాకు నయం కాదనుకుంటున్నారా ? నేను చేయవలసిన పనులు చాలా ఉన్నాయి" అని చెప్పింది

"అదేనమ్మా - నేనూ కోరుకునేది"

"మీ కోరిక నెరవేరుతుంది తాతగారూ" అని ఆనాడు అమ్మ హామీ నిచ్చింది.

తరువాత ఎన్నో సంవత్సరాలు గడిచినయ్. అమ్మకు ఎన్ని జ్వరాలో, ఎన్ని ప్రమాదాలో, ఎన్ని గాయాలో, ఎన్ని గండాలో, ఎప్పటికప్పుడు ఏదో ఒకటి కొండవలే రావటమూ, దూదిపింజవలే తేలిపోవటమూ.

1956లో ఒకసారి అమ్మ స్పృహలేకుండా, శరీరంలో ఏ మాత్రం చలనం లేకుండా నాలుగురోజులు పడుకున్నది మొదటిరోజునే నాన్నగారూ, బామ్మ చాలా భయపడ్డారు అప్పుడు వారికి అమ్మ హామీ నిచ్చింది. "నాకేమీ ఫరవాలేదు. మీకేమీ ఆందోళన వద్దు నాలుగు రోజుల తరువాత నేనే లేస్తాను" అని. ఆ నాలుగు రోజుల తరువాత అమ్మ ఏమీ అమృతం త్రాగిందో --- ఆరోగ్యవంతురాలు కావటమే కాక దివ్యదీధితులతో ప్రకాశించింది.

1963 ఏప్రియల్‌లో ఒక రోజు, అమ్మకు బాగా జ్వరం వచ్చింది. చలితో వణుకుతోంది ఇంట్లో ఉన్న దుప్పట్లన్నీ కప్పారు అప్పటికీ ఆగకపోతే - ఇద్దరక్కయ్యలు అమ్మను గట్టిగా పట్టుకున్నారు. అమ్మ ఏమి మాట్లాడటానికి ప్రయత్నించినప్పటికీ - వణుకువల్ల పలకలేకపోతున్నది

ఆ సమయంలో నలుగురు సోదరులు వచ్చారు వారిని నేనెప్పటి నుండో జిల్లెళ్ళమూడికి ఆహ్వానిస్తున్నాను వారికి ఆనాటికి ముహూర్తం కుదిరింది పైగా వచ్చీరాకముందే 'అమ్మను చూచి వెళ్ళాలి' అని త్వరపడటం మొదలుపెట్టారు వాళ్ళను కాదనలేక, అమ్మ దర్శనం చేయించటానికి వీలుకాక - ఆలోచనలో సతమత మవుతున్నాను.

నాన్నగారు నా మానసిక ఘర్షణను పసికట్టి 'నీకింకా' అనుభవం లేదు. మీ అమ్మగారు బాధలను - మనం చొక్కాను మేకుకు తగిలించినట్లు - తగిలిస్తుంది. నీవు వెళ్ళి విషయం మీ అమ్మగారితో చెప్పు, సమస్య సులభంగా పరిష్కార మవుతుంది" అని సలహాయిచ్చారు.

అక్షరాలా అదే జరిగింది. క్షణాల్లో అమ్మ స్నానం చేసి వారికి దర్శనం ఇచ్చింది. నేను అమ్మను చూచి - యీ అమ్మకేనా ఇందాకటి నుండి జ్వరం తగిలింది ? అని ఆశ్చర్యపోయాను

ఆనాటి నుండి యీ పన్నెండు సంవత్సరాల్లో ఇటువంటి సంఘటనలు ఎన్నోవేలు చూచాను; లెక్కలేదు.

అయినా ఎప్పటి కప్పుడు భయాందోళనలు తప్పటంలేదు. చిదంబర రావుతాతగారు అనుకున్నట్లు, అది మన మమకారము వల్లనో విశ్వాసలోపమో తెలియటంలేదు.

ఒక్కొక్కసారి అమ్మ ఎవరిబాధనన్నా తానే తీసుకుని అనుభవిస్తున్నదా - అనిపిస్తుంది. అందుకు తార్కాణాలు కూడా అనేకం కనుపిస్తున్నాయి.

ఏమయినా అమ్మ బాధపడేటప్పుడు మాత్రం - అమ్మ భరిస్తున్నప్పటికీ - మనకు దుర్భరంగానే ఉంటుంది. పైగా మనకోసం బాధను ఏమాత్రము పైకి

కనుపించనివ్వకుండా - లేచి తిరుగుతూ, చిరునవ్వు వెన్నెలను చిందిస్తూ ఉంటే అది మనకు మరింత కోతగా ఉంటుంది.

అందుకే అమ్మను చూస్తుంటే - మండుటెండల్లో తాను మాడుతూ మనకు నీడనిచ్చే మహావృక్షం మనసునంతా ఆక్రమిస్తుంది. మన మురికినంతా తాను తీసుకొని, మనను పవిత్రులను చేసే జాహ్నవి మనస్సులో ప్రవహిస్తుంది.

భక్తితోపాటు అమ్మపై జాలీ, సానుభూతి కలుగుతాయి వెంటనే మన ఆలోచనలకు మనకే నవ్వువస్తుంది.

ఇవ్వాళ్టి (12.7.75)కి సరిగా 50 రోజులక్రితం అమ్మకు ఒక గడ్డ లేచింది. అది అమ్మను పెట్టేబాధ అంతా, యింతా కాదు. పైగా "గడ్డకూడా బిడ్డే-" అని అమ్మ అంటుంటే - అమ్మ సర్వమాతృత్వానికి ఆనందం కలిగేకంటే, దుఃఖమే కలుగుతున్నది.

ఈఏభైరోజులనుండీ చేస్తున్న చికిత్సవల్ల ఫలిత మేమీ కనుపించటం లేదు డాక్టర్లు ఓడిపోతున్నారు. డాక్టరు యస్ వి. సుబ్బారావుగారు "అమ్మా - యీ బాధలపై నీకుగల ప్రేమముందు, మా వైద్య విజ్ఞానం తలవంచింది" అంటూ అమ్మ పాదాలకు ప్రణమిల్లారు. అందుకనే మహర్షి రహి ఎంతోకాలం క్రిందనే అమ్మను "బాధల భగవంతుడు"గా అభివర్ణించారు.

ఈ అభివర్ణనలు, అభినందనలు ఎట్లా ఉన్నా - ప్రస్తుతం వైద్యులు పూర్తి విశ్రాంతి అవసరమని ఎంత నొక్కి చెబుతున్నప్పటికీ, 'యింత' బాధతో క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా అనుక్షణం వచ్చిపోయే బిడ్డలకు దర్శనమిస్తూ వారి కష్టసుఖాలు వింటూ, వారికి తృప్తినీ, హాయినీ, ఆనందాన్నీ రెండుచేతులా పంచిపెట్టే తల్లిని చూచి ఏమనాలి ? ఏమనుకోవాలి ?

'అమ్మా - యీ బాధను తగ్గించుకోమ్మా - నువ్వు సుఖంగా ఉండమ్మా -' అని మనమందరం ఏకకంఠంగా విలపించటం ఒక్కటే మార్గంగా కనుపిస్తున్నది.

కామితార్థప్రదాయిని, కరుణామయి అయిన అమ్మ గుండె మన విలాపాలకు ఏమాత్రం కరగకపోవటం చూస్తే - మనలోని ఆర్తికి బలం చాలటం లేదేమో అనిపిస్తుంది.

మరి, ఆర్తిని కలిగించవలసిందీ దానికి బలాన్ని ప్రసాదించవలసిందీకూడా అమ్మే !!

(జూలై 1975)



# 103
# గడ్డ కూడా బిడ్డే

హమ్మయ్య ! ఎంత గండం గడిచింది ! కాలం మానవాళినే కనికరించింది. దైవం భక్తులయెడ తనకారుణ్యాన్ని మళ్ళీ ఒకసారి రుజువు చేసుకున్నాడు. బిడ్డలపై అమ్మ వాత్సల్యామృతవర్షాన్నే కురిపించింది. ఉరుములు, మెరుపులు భయంకరంగా చెలరేగి ఏక్షణాన పిడుగుపాటును కలిగించగలవో అవి వెరపించినప్పటికీ - చిరుజల్లులు మాత్రమేపడి ప్రకృతిలో ప్రశాంతికి ఏ మాత్రమూ భంగం కలిగించలేదు. రేడియోలు, పత్రికలు వాయుగుండంతో బాటు పెనుతుఫానునే సూచించినప్పటికీ - వాయుగుండం తీరంచేరకుండానే సముద్రగర్భంలోనే సమసిపోయింది.

సరిగ్గా నాలుగు నెలలక్రితం - జులై 17వ తేదీన

అంతకుముందు మూడు నెలలుగా అమ్మను బాధిస్తున్న రాచకురుపు తీవ్రస్థాయికి చేరుకుంది. అమ్మ ఆబాధను మౌనంగా సహిస్తున్నప్పటికీ చూచేవాళ్ళకు మాత్రం భరించరానిదైంది. వెంటనే నెల్లూరు డాక్టర్ ఎస్.వి. సుబ్బారావుగారికీ, నరసాపురం డాక్టరు కేశవరావుగారికి మదనపల్లి డాక్టర్ (శ్రీమతి) ఆర్. జానకీదేవిగారికీ టెలిఫోన్లు వెళ్ళాయి. ముగ్గురూ రెక్కలు కట్టుకు వాలారు. అమ్మను చూచారు. గడ్డ తాటికాయ ప్రమాణంలో బయటకు కనిపిస్తున్నది. ఇక లోపల ఎంత ఉన్నదో ! అది అమ్మను ఎంత బాధపెడుతున్నదో! అమ్మ మంచముపై పడుకుని అటునుండి యిటు పొర్లలేకుండా ఉన్నది. కాలంతా బరువెక్కి కదలించలేని స్థితిలో ఉన్నది. అయినప్పటికీ - అమ్మ దర్శనకార్యక్రమం నిర్విఘ్నంగా సాగుతూనే ఉన్నది. ఆ19వ తేదీన తొలిఏకాదశి, దాదాపు నాలుగువందలదాకా యాత్రికులు వచ్చారు. అమ్మ బయటకు వచ్చి కుర్చీలో కూర్చొని నాలుగు గంటల సేపు దర్శనం ప్రసాదించింది. వచ్చిన డాక్టర్లు అమ్మలో తరగని తేజఃపుంజాన్ని చూచి ఆనందించారు; అమ్మలోని సహనశక్తికి ఆశ్చర్య చకితులైనారు ! అమ్మ ఎంతబాధపడి ఉంటుందా - అని తామూ కన్నీళ్ళు పెట్టుకున్నారు.

తెల్లవారేసరికి గడ్డ పక్వమయింది ఆపరేషన్ తప్పనిసరి అయింది. డాక్టర్లు ముగ్గురూకలిసి అమ్మను జిల్లెళ్ళమూడి నుండి ఎక్కడికయినా అన్ని సౌకర్యాలు కలిగిన హాస్పిటల్‌కు తరలించడానికి ఏకగ్రీవంగా నిర్ణయించారు అందుకు అమ్మ నుండి అంగీకారం తీసుకోవటానికి ఉదయం నుండి సాయంకాలం దాకా పట్టింది చివరకు నాన్నగారు చెప్పినమీదట అమ్మ ఒప్పుకుంది

డాక్టర్ సుబ్బారావుగారు అమ్మను నెల్లూరు తీసుకువెళ్ళి తమయింట్లో ఉంచుకుని చికిత్సచేసి పంపుతామన్నారు అందరూ సరే నన్నారు

అమ్మ ప్రయాణం కావాలంటే - మూడు అంతస్తులు దిగిరావాలి. కాలు కదిలించలేని అమ్మ అడుగుతీసి అడుగువేయలేని అమ్మ అన్ని మెట్లు ఎలా దిగుతుంది ? ఎందరో బల సంపన్నులయిన బిడ్డలు ముందుకువచ్చి అమ్మను చేతులమీద దించుతామన్నారు కుర్చీలో కూర్చోపెట్టుకుని తీసుకువెళతా మన్నారు ఎన్నెన్నో ఉపాయా లాలోచించారు. అమ్మ అన్నిటినీ ససేమిరా అన్నది కారణం - అలా తీసుకువచ్చి తనను కారులో పడుకోబెడితే, చూచిన బిడ్డలు తట్టుకోలేరని తుదకు తానే డాక్టర్లకు ఉపాయం చెప్పింది. అక్కడనే గడ్డను ఆపరేషన్‌చేస్తే - తానే మెట్లు దిగుతా నన్నది మరి - గడ్డను ఆపరేషన్ చేయుటమెలా ? ఏ డాక్టరూ యీ పరిస్థితిని ఊహించి అవసరమయిన పరికరాలు తీసుకురాలేదు అయినప్పటికీ ఒక బ్లేడును స్టెరిలైజుచేసి కోసేయమని అమ్మ సలహా చెప్పింది చివరకు అమ్మ యిచ్చిన ధైర్యంతో డాక్టర్ సుబ్బారావుగారు విద్యుద్దీపమైనాలేని గదిలో కరదీపిక సహాయంతో మత్తుమందు యివ్వకుండా (లేదు) ఒక బ్లేడుతో ఆ గడ్డను కోసేశారు.

ఆ తర్వాత ఒక గంట విశ్రాంతి తీసుకొని అమ్మ మెట్లన్నిదిగి - బారులుతీరి నిలుచున్న జనసందోహానికి ధైర్యం చెబుతూ, ఆశీర్వదిస్తూ ప్రయాణమయింది

(నవంబరు 1975)



## నిజమయిన భాగ్యం

మనిషికి సంతృప్తియే నిజమయిన భాగ్యం.
అసంతృప్తిని మించిన దారిద్ర్యం లేదు. - అమ్మ

# 104
# అవతారపురుషులను గుర్తించడం ఎలా...

నిరాకారమూ నిర్గుణమూ అయిన శక్తి ఒక మానవాకృతిని ధరించినప్పుడు - వారిని అవతారవ్యక్తులు అంటాము. ఈ పరిణామం ఎందుకు జరుగుతుందీ, ఎప్పుడు జరుగుతుందీ అన్న సందేహానికి భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ సమాధానం యిచ్చాడు. లోకంలో అధర్మమూ, అన్యాయమూ ప్రబలిపోయినప్పుడు, దుష్టులను శిక్షించటంకోసమూ, శిష్టులను రక్షించటం కోసమూ తాను అవతరిస్తా నన్నాడు. కానీ యిక్కడ సామాన్య ప్రజానీకానికి సహజంగా ఒక ప్రశ్న ఉద్భవిస్తుంది. సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వశక్తుడు అయిన భగవంతుడు సంకల్పమాత్రం చేతనే తన యిచ్ఛాను సారం జగత్తును నడిపించవచ్చును గదా, తానొక రూపధారణ చేయవలసిన అవసరం ఏమిటీ - అనిపిస్తుంది

కనుక యీ అవతరణ 'కారణాన్ని యింకొకరకంగా ఊహిస్తే - కొంత ఔచిత్యం కనిపిస్తుంది భగవంతుడు తనదైన, తానైన సృష్టిలో, సృష్టితో తానూ ఆడుకోవటానికి కోరికై అవతరిస్తాడమో అనిపిస్తుంది. మనుషుల్లో మనిషిగా మెలిగినప్పుడే అది సాధ్యమవుతుంది. కనుకనే మనిషికి సహజంగా ఉండే లక్షణాలూ, గుణాలూ అన్నీ అవతారవ్యక్తులకూ ఉంటాయి. అందువల్లనే వారికీ శరీరంతోపాటు, శరీరానికి ఉండే బలహీనతలూ, పరిణామాలూ, వ్యాధులూ ఉంటాయి, గుణాలూ, వాటి ప్రకోపాలూ ఉంటాయి వారి జీవితాలూ నవరసభరితంగానూ ఉంటాయి వాళ్ళ జీవితాల్లోనూ ఆనందకర సన్నివేశాలూ ఉంటాయి; విషాదకర ఘట్టాలూ ఉంటాయి. వాళ్ళూ నవ్వుతారు; వాళ్ళూ ఏడుస్తారు. నవ్వేటప్పుడు వాళ్ళ పెదవులూ చలిస్తాయి; ఏడిచేటప్పుడు వాళ్ళ కళ్ళూ చెమరుస్తాయి.

కనుకనే మనలో ఒకరై మనతో మనవలే మసలే మనిషిలో దాగి ఉండే దైవత్వాన్ని గుర్తించటం ఏమంత సులభమైన విషయం కాదు కనుకనే రాముడు సీతావియోగంవల్ల దుఃఖించాడని సందేహం . కృష్ణుడు ఆశ్రిత పక్షపాతి అని అభిప్రాయం. రమణమహర్షికి, రామకృష్ణ పరమహంసకూ తమ వ్యాధిని తాము నయం చేసుకునే సమర్ధత లేదని శంక. కానీ వారి జీవితాలను నిశితంగా

పరిశీలిస్తేగానీ వారందరిలో నిక్షిప్తమై నిగూఢమై నిశ్చలమై దీపించే దివ్యజ్యోతి దృగ్గోచరం కాదు. సామాన్య చక్షువులకు అంతా సామాన్యంగానే కనిపిస్తుంది. నిత్యశంకితులకు ప్రతిదీ సందేహంగానే ఉంటుంది. అతీంద్రియమైన విశిష్ట భగవత్తత్త్వాన్ని అవగాహన చేసుకోవటానికి యీ సామాన్యమైన అల్పమైన ఈ ఇంద్రియజ్ఞానం సరిపోదు. అందుకు దైవానుగ్రహం కావాలి. ఆ అనుగ్రహం అనుభవాన్ని ప్రసాదించాలి. ఆ అనుభవం విశ్వాసాన్ని కలిగించాలి. ఆ విశ్వాసం ఏర్పడినప్పుడేగానీ నిజం నిజంగా కనుపించదు. నిజాన్ని చూడగలిగిన కళ్ళు మనకు అనుగ్రహింపబడినప్పుడు - మనిషిలోని మాధవుడు సహస్రపాదాలతో, సహస్ర బాహువులతో, సహస్రశీర్షాలతో విరాట్ స్వరూపుడై అనుక్షణమూ సాక్షాత్కరిస్తాడు. అప్పుడు ఆ అవతార పురుషునిలోని ప్రతి మాటలోనూ, ప్రతిక్రియలోనూ మనకు ఒక విలక్షణతతో కూడిన దివ్యత్వం సుస్పష్టంగా కనిపిస్తుంది. సామాన్య మానవుడికీ, అవతారవ్యక్తికీగల వ్యత్యాసం బిందువుకూ సింధువుకూ ఉన్నంత భేదంతో సమానంగా తెలుస్తుంది. మానవ శక్తీ, గుణాలూ... అన్నీ పరిమితులకు లోబడిఉండగా అవతారవ్యక్తులు తాము అవసరం అనుకుంటే అన్ని విషయాల్లోనూ సంపూర్ణాలై అపరిమితులై వ్యవహరించగలరు. నాడు పరిమితులకు లోబడి ఉంటున్నట్లు కనిపిస్తూ - అన్నిటికీ అతీతులై మెలగగలరు. వారిలో ఆ శక్తి ఉంటుంది. కానీ వారికి ఆసక్తి మాత్రమే ఉండదు. వారికి అది కావాలనీ ఉండదు. ఇది వద్దనీ ఉండదు. వారు ఆనందాన్ని కోరుకోరు. దుఃఖం నుండి పారిపోరు. వారు ఆరోగ్యంకోసం ప్రయత్నం చేయరు. వ్యాధులకు బాధలకూ భయపడరు.

కనుకేనే అమ్మ 'ఆనందో బ్రహ్మ' అన్న ఉపనిషత్ వాక్యాన్ని 'బాధకూడా భగవంతుడే' నని పూరించింది. సర్వమాతృమూర్తి అయిన అమ్మ పలుసార్లు - తన వ్యాధుల ప్రస్తావన వచ్చినప్పుడు - అవి పిల్లలే, మీకంటే అవేనయం. అవి నన్నెప్పుడూ అంటిపెట్టుకొని ఉంటున్నయ్..... అని వివరించింది.

కానీ అమ్మ జీవితాన్ని జాగ్రత్తగా పరిశోధిస్తే..... అమ్మకు ఇతర శరీరాలమీద, మనస్సులమీద తన శరీరం మీద, మనస్సుమీద అకుంఠితమైన అధికారం కనిపిస్తున్నప్పటికీ - అమ్మ భూమి మీద పడ్డక్షణంనుంచీ ఏదో ఒక బాధను అనుభవిస్తూనే ఉన్నది. సూర్యుని వేడిమినంతా భరిస్తూ లోకానికి చల్లదనం యిచ్చే చంద్రునివలే అమ్మ తాను బాధల ననుభవిస్తూ మనకు సుఖాలను అనుగ్రహిస్తూ ఉన్నది. అందుకనే ఒక కవి అమ్మను 'బాధాప్రియాయైనమః' అని అర్చించుకున్నారు. అమ్మకు అత్యంత ప్రీతిపాత్రుడయిన ఒక ఉపాసకుడు అమ్మను 'బాధల భగవంతుడా!' అని సంబోధించాడు.

(డిశంబరు 1975)



# 105
# నక్సలైట్లూ నా బిడ్డలే

డిశంబరు 30వ తేదీ అర్థరాత్రి హఠాత్తుగా జిల్లెళ్ళమూడిలోని హైమాలయంపై అందరింటిపై నక్సలైట్లు దాడి, దోపిడి చేశారన్న దుర్వార్త అందరికీ యీపాటికి తెలిసినదే. వారు సుమారుగా యిరవై మంది మాత్రమే ఉన్నప్పటికీ దాదాపు ఒక వందమంది ఉన్నట్లూ, వారి వద్ద ఎక్కువగా ఆయుధ సామాగ్రి లేకపోయినప్పటికీ అసంఖ్యాకంగా మారణాయుధాలు ఉన్నట్లూ భ్రమకల్పించి భయపెట్టి....... ఆ ప్రాంగణమంతా స్వేచ్ఛగా వీరవిహారం సల్పి, తాళాలు పగలగొట్టి, తలుపులు ముక్కలుచేసి, బీరువా బ్రద్దలుచేసి, బాంబులు ప్రేల్చి, కారుకూతలు కూసి ఆశ్రమ ప్రశాంత వాతావరణాన్ని కలుషితమూ, కల్లోలితమూ చేసి పశువులకంటే హీనంగా రాక్షసులకంటే నీచంగా అతిక్రూరంగా అమానుషంగా ప్రవర్తించారు.

నక్సలిజానికి ప్రధానలక్ష్యం - సాంఘిక దురన్యాయానికి ఆధారభూతమైన వ్యక్తులను రూపుమాపి సమసమాజాన్ని నిర్మించటమంటారు. మరి జిల్లెళ్ళమూడిలో ఏమి సాంఘిక దురన్యాయం జరుగుతున్నది ? అక్కడ ఏ రాజకీయ పక్షానికీ, ఏ మతప్రచారానికీ, ఏ వర్ణానికీ, ఏ వర్గానికీ సంబంధంలేని సర్వసమ్మతమైన ఆదర్శమైన పవిత్రమైన వాతావరణంతో ఒక ఆశ్రమం ఉన్నది. పగలతో, పట్టుదలలతో, అసూయలతో, ద్వేషాలతో అనేక విధాల కుళ్ళిపోయిన సమాజానికి ప్రేమామృతం అందించటానికి భువిపై అవతరించిన ప్రేమమూర్తి అమ్మ అక్కడ అందరికీ ఆరాధ్యమూర్తి. అమ్మకు కులంతోనే కాదు, గుణంతోకూడా ప్రమేయం లేదు. తల్లికి తప్పే - కనుపించదు అని అసందిగ్ధంగా ప్రకటించింది. అమ్మ దృష్టిలో మంచి చెడ్డల విచక్షణే లేదు. పతితులు, పాపులుకూడా అమ్మఒడిలో పసిపాపలూ, ప్రేమాస్పదులే. ఎవరిని చూసినా అమ్మకు తన బిడ్డయే అనిపిస్తుంది. ఈ నగ్న సత్యాలు జిల్లెళ్ళమూడి వచ్చి ఎవరు పరిశీలించినా స్పష్టంగా తెలుస్తాయి. మరి, ఈ నక్సలైట్లు కూడా ఈ దాడికి ముందుగా అనేక పర్యాయాలు భోజనంచేసే యాత్రికులతోపాటు తామూ కడుపారా భోజనం చేసినట్లూ తెలుస్తున్నది.

మరి, ఏ తేడాలు చూడని ఆశ్రమ విధానం దోషభూయిష్టమా ? అందరినీ కన్నబిడ్డలుగా ప్రేమించే తల్లి తత్వంలో తప్పున్నదా ? వచ్చిన వాడికెల్లా ఆశ్రయమిచ్చి అడిగినవాడికెల్లా అన్నం పెట్టటమే నేరమా ?

రాసులకొద్దీ నిలవచేసిన ధనాన్నిదోచి నలుగురికి పంచి సమాజంలో సమానత్వాన్ని సాధించటంకూడా వారి ధ్యేయాల్లో ఒకటి అంటారు మరి జిల్లెళ్ళమూడిలో ధనరాసులేమీ లేవే. అక్కడ రోజూ వందలకొద్దీ ప్రజలకు భోజనం పెట్టటానికి అక్కడి కార్యకర్తలు అనుక్షణమూ అనుభవించే పుర్షణ ఎవరికైనా సానుభూతి కలిగిస్తుందే ? ఈ సత్యం వాళ్ళకు తెలీదా ?

మరి అక్కడ మణుగులకొద్దీ బంగారం ఉందనుకున్నారా ? అమ్మ ధరించే నగలు వారిని భ్రమింపచేశాయా ? అమ్మ దివ్యశరీరంలోని కాంతులే ఎన్నోనగలుగా వారికి భ్రాంతిని కలుగ జేశాయా ? యదార్థవిషయాలేమీ తెలుసుకొనకుండా, వివేక రహితంగా ప్రవర్తిస్తే దోపిడి దొంగలకూ, వీరికీ భేదమేమిటి ? మరి, వీరువల్లించే ఆదర్శాల గతి ఏమిటి ?

దయామయి అయిన అమ్మ, ఎంతటి దుర్మార్గుడి నయినా 'వాడూ నాబిడ్డే, నని చెప్పగలిగిన అమ్మ తననిరవధికమయిన ప్రేమను సర్వజన విస్మయకరంగా మరొకసారి చూపింది. ఎవ్వరికీ ప్రాణహానీ, ఏ ప్రమాదమూ లేకుండా కాపాడింది. నన్ను ఆనాడు అప్పికట్లలో నిద్రచేయించింది వరండాలో దుండగులు భీభత్సంచేసిన స్థలంలో రోజూ నిద్రించే నాన్నగారిని మూడవ అంతస్తుకు పంపించింది ధీరోదాత్తుడయిన గోపాలకృష్ణమూర్తిని రణస్థలంలో నిలిపి మారణకాండకు అడ్డుపడింది. తల్లికి బిడ్డసొమ్ము, బిడ్డకు డబ్బుసొమ్ము అని ఎన్నడో వివరించిన అమ్మ తన బిడ్డలను కాపాడుకుని, ఆకతాయి బిడ్డలకు కావలసిన సొమ్మును సమకూర్చి "కొందరు పిల్లలు అడిగి తీసుకుంటారు. కొందరు పిల్లలు అడక్కుండా తీసుకుంటారు. కొందరు పిల్లలు అదరగండం చేసి తీసుకుంటారు. వీరు యీ రకం పిల్లలు.. " అని విలాసంగా వర్ణించింది.

(జనవరి 1976)



# 106
# అవతారవ్యక్తుల్లోని విలక్షణత

ఈ నెల 12 తేదీ సాయంత్రం కడపజిల్లా నుండి ఒక సోదరుడు వచ్చాడు. అమ్మను చూచాడు అమ్మ దగ్గర కూర్చుని - యిటీవల నక్సలైట్లు ఆశ్రమంలో చేసిన దౌర్జన్యపూర్వకమైన దోపిడిని గురించి ప్రస్తావించాడు.

"అమ్మా - మీరు సర్వజ్ఞులూ, సర్వసమర్థులూగదా యీ దోపిడిని ఆపి ఉండవచ్చునే వాళ్ళ మనస్సును మార్చవచ్చునుగదా -" అన్నాడు అమ్మ ఏమీ తొణక్కుండా నిశ్చలమైన స్వరంతో అన్నది "అని మీరు అనుకుంటున్నారు నాన్నా - నేను సర్వజ్ఞనూ కాను, సర్వ సమర్థనూ కాను. నాకు ఏమీ తెలీదు, ఏమీ చేతకాదు ఏమి జరిగినా చూస్తూ ఉండటమే తెలుసు. కష్టాలు, సుఖాలు, లాభాలు, నష్టాలు, నవ్వు, ఏడుపు ఇందులో ఒకటి కావాలనీ లేదు, మరొకటి వద్దనీ లేదు ఎప్పుడు ఏది వస్తే దానిని అనుభవించటమే.. ."

"మరి - మీరు దేవుడని మేము అనుకుంటున్నాం కాదా -"

"అది మీ గొప్పతనమే నాన్నా -"

"కొందరు మా అభిప్రాయాన్ని ఒప్పుకోవటం లేదుగా. ఈ నక్సలైట్లు అంతే కారణం ఏమిటమ్మా"

"మీకు నమ్మకం కలగటానికి కారణమేదో, వారికి కలగకపోవటానిక్కూడా అదే అన్నిటికీ ఒకే శక్తి కారణం. అదే 'యిన్ని' రూపాలూ, 'యిన్ని' భావాలుగా ఉంది"

"అమ్మా - నాస్తికులనుగూడా సృష్టించుకోవటంలో భగవంతుడి ఉద్దేశం ఏమై ఉంటుంది ?"

ఆస్తికులకూ నాస్తికులకూ తేడా ఏమీ లేదు ఆస్తికుడు అంతా 'వాడే' ననుకుంటాడు. నాస్తికుడు అంతా 'నేనే' అనుకుంటాడు. .... వాడన్నా, నేనన్నా ఒకటే నాన్నా. ."

ఎట్లా ఒకటో అర్థంగాక అతడు ఆకాశంలోకి చూడటం మొదలు పెట్టాడు అమ్మలోని అద్వైతస్థితి అతని మనస్సులోకి ఒక వెలుగురేఖను ప్రసారం చేసినట్లయింది.

ఆ సంభాషణ అక్కడ. ఆనాడు అంతటితో ఆగిపోయింది. కానీ యీ ప్రశ్న అనేకుల నుండి అనేక రూపాల్లో వినిపిస్తూనే ఉన్నది. ఈ ప్రశ్న తెలిసీ తెలియని స్థితికి సంబంధించినది. ఏమీ తెలియనివాడు దైవం అంటే ఏమిటో ఆలోచన లేనివాడు అమ్మ దైవం అన్న విశ్వాసం లేనివాడు - ఆనాడు జరిగిన దురంతానికి విచారిస్తాడు, సానుభూతిని వ్యక్తం చేస్తాడు. దైవమంటే ఏమిటో తెలిసినవాడికి, దైవం యొక్క అవతారాలయిన శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు మనసులోమెదిలి వారి చరిత్రలు స్ఫురణకు వస్తాయి.

శ్రీరాముడు అవతారపురుషుడు, దివ్యశక్తి యుతుడు. కానీ అతని చరిత్రను పరికిస్తే - సామాన్య మానవుడికంటే తక్కువస్థాయిలో అతడు ప్రవర్తించిన అనేక ఘట్టాలు మనం చూస్తాము. అతడు ప్రాణాధికంగా ప్రేమించిన అర్ధాంగిని రాక్షసరాజు యెత్తుకు పోగలుగుతాడు. అతడు ఆమె జాడతెలియక కన్నీరు మున్నీరుగా విలపిస్తాడు. కోతులసహాయం అర్థిస్తాడు.

రాముడు దేవుడయితే "యివన్నీ ఏమిటి ?" అనటం అవివేకం. ఇక శ్రీకృష్ణుని విషయం, కృష్ణుడు తనపై దండెత్తి వచ్చిన జరాసంధుని జయించలేక పోయాడు. దుర్యోధనుని మనస్సు మార్చలేకపోయాడు. కర్ణుని మనస్సును ప్రయత్నం చేసి తనవైపుకు మరల్చుకోలేకపోయాడు. ఏసుక్రీస్తు సంగతి మానవులే తనను శిలువపై ఎక్కిస్తే ఎదురు తిరగలేకపోయాడు; ఇటీవలి రమణమహర్షి వారి ఆశ్రమంలో దొంగలు జొరబడి ఉన్నదంతా దోచుకుని వారి కాలిపై కొడితే, వారు నవ్వుతూ రెండవకాలును కూడా చూపించారట.

వీరందరూ స్మృతిపథంలోకివచ్చి ఆలోచనచేస్తే ఒక సత్యం అవగతమవుతుంది. ఈ కష్టసుఖాలూ, మంచిచెడులూ, మానావమానాలూ సామాన్యులమైన మనకుగానీ అద్వైతసిద్ధిని పొందిన మహాత్ములకు ఏమి కావాలి ? ఏది వద్దు ? వారు 'ఇది కావాలని ఎందుకనుకోరూ?' అని మనం ప్రశ్నిస్తే మాత్రం మనకు సమాధానం దొరకదు.

(ఫిబవరి 1976)



# 107
# మార్జాల కిశోరన్యాయం

"అమ్మా - అన్నపూర్ణాలయం నిర్వహణ బాధ్యత మీదా, మాదా?" ఇటీవల ఒక సోదరుడు అమ్మను సూటిగా అడిగిన ప్రశ్న యిది

అమ్మ 1923లో యీ అవనీస్థలిపై అవతరించిన విషయం అందరికీ అవగతమే. అయినా 1923 నుండి 1958 వరకు అమ్మ నివురుగప్పిన నిప్పు; మబ్బులచాటున చంద్రుడు.

అమ్మ తన 4వ యేటనే "నేను అమ్మను" అని సుస్పష్టంగా ప్రకటించి నప్పటికీ, అమ్మకు లోకంలో ప్రతి ఒక్కరూ తన బిడ్డేనన్న భావం ఉన్నప్పటికీ - ఆ అమ్మ ప్రేమను 1956 వరకు చాలా పరిమిత సంఖ్యలో మాత్రమే పొంద గలిగారు. 1956 నుంచి 1958 వరకు అమ్మను చూడటానికి ఎందరు వచ్చినా, అమ్మే స్వయంగా వారందరికీ అన్నంవండి వడ్డించేది. ఆ రోజుల్లో అమ్మను గుర్తించినవారు ధన్యులు. వారికి అమ్మ రకరకాలయిన దివ్యానుభవాలు ప్రసాదించింది. రాత్రింబవళ్ళు ఆధ్యాత్మిక రహస్యాలు వివరించింది.

అందువల్లనే అప్పటివారు అంటారు - అమ్మ యింకా చెప్పవలసినది ఏమీలేదు, తాను చెప్పవలసినదీ, చెప్పదలచినదీ అంతా ఆకాలంలోనే చెప్పివేసిందని, కనుకనే అమ్మ "నేను గురువును కాను; మీరు శిష్యులు కారు" అని ఎంతగా చెప్పినప్పటికీ ఆనాటివారందరికీ అమ్మ యెడల అచంచల గురుభావం ఉన్నది. అమ్మయిచ్చే దివ్యానుభవాలవలన అమ్మ అంటే దైవమే నన్న విశ్వాసం ఉన్నది. అమ్మచూపే అపారవాత్సల్యం వలన అమ్మను ఎవరికివారు తమను కన్నతల్లిగానే భావించేవారు.

ఆనాటి వారి మార్జాల కిశోరన్యాయం. అందరి బాధ్యతలూ అమ్మే తాను స్వయంగా వహించేది.

1958లో అమ్మ "అన్నపూర్ణాలయా"నికి రూపకల్పన చేసింది. అందుకు కర్త అమ్మే అయినప్పటికీ కార్యనిర్వాహకులం మనమే అయినాము. ప్రేరణ అమ్మదేగానీ ప్రయత్నం మనది అయింది. ఏమయినా అన్నపూర్ణాలయ నిర్వహణలో 1970 వరకు అమ్మ అమృతహస్తం మనకు ప్రత్యక్షంగా కనుపిస్తూనే ఉండేది. 1970 నుండి మనను పాత్రధారులను చేసి అమ్మ సూత్రధారిగా మారిపోయింది.

అమ్మ అనుగ్రహానికి పాత్రులయినవారికిగానీ అన్నపూర్ణాలయ నిర్వహణ అమ్మ మాత్రమే చూస్తున్న సత్యం అవగతం కాదు. అమ్మే చూస్తున్న దన్నదానికి నిదర్శనం 1973లో జరిగిన లక్షమంది ఏకపంక్తి భోజనమే.

ఇంతకాలం అన్నపూర్ణాలయం ఏ విదంగా నిర్వహింపబడేదీ ఎవరికీ అర్థంగాని ఒక అద్భుత రహస్యమే. ఎవరికివారు తృప్తిగా భోజనం చేసి రెండు చేతులూ ముకుళించి - ఆ తల్లి పెడుతున్నది, మనం తింటున్నాము - అని భావిస్తూ నిశ్చింతగా ఉన్నారు.

కాని అమ్మ హఠాత్తుగా అన్నపూర్ణాలయ నిర్వహణకు సంబంధించిన విధానం మార్చివేసింది. ఈ గురుతర బాధ్యతను మనకు అప్పగించింది.

రోజుకు వెయ్యిమందిక తక్కువ కాకుండా అక్కడ భోజనం చేస్తున్నారు. మరి, ఈ బాధ్యత సామాన్యమైనదా ? అమ్మ చెప్పినట్లు బాధ్యతే బరువు. అందులో ఇది బృహత్తర బాధ్యత !

ఈ సంధికాలంలో ఒకసోదరుడు పై ప్రశ్నను అమ్మను అడిగాడు.

"బాధ్యత నాదే నాన్నా - నా బాధ్యతను మిమ్మల్ని నిర్వహించమని కోరుతున్నాను-" అన్నది అమ్మ నవ్వుతూ. అమ్మ "కోరుతున్నాను" అన్నా అందులో ఆదేశమే ఉన్నది.

అవును - ఆ బాధ్యత అమ్మకే చెల్లుతుంది. రోజూ అక్కడకు అనేక ప్రాంతాల నుండి అనేక మతాలు, జాతులు, వర్ణాలు, కులాలకు చెందిన వాళ్ళు వస్తారు. వాళ్ళ ముక్కూ ముఖాలుకూడా మనకు తెలియవు. వాళ్ళందరినీ ఆప్యాయంగా ఆదరించి భోజనం పెట్టాలి. భోజనానికి సంబంధించిన ఆర్థిక బాధ్యతను ఎట్లా భరించినప్పటికీ వారందరికీ మన ప్రేమను పంచవలెనంటే అది అంత సులభమైన విషయమా ? మన కుటుంబ సభ్యులనూ, మన స్నేహితులనూ, మన బంధువులనే మనం ప్రేమించలేము. ప్రేమిస్తే వారి నుండి ప్రతిఫలం కోరకుండా

ఉండలేము. ప్రతిఫలం కనుపించని చోటికి మన ప్రేమ ప్రవహించటానికి సుతరామూ అంగీకరించదు

అమ్మ నిత్యమూ అంతమందికి భోజనం పెట్టగలుగుతున్నదీ అంటే - వారందరినీ అమ్మ తన బిడ్డలుగా భావించగలగటమే కనుకనే అమ్మ ఆ బాధ్యత తనదేనని స్పష్టంగా అంగీకరించింది అందువల్లనే అమ్మ విశ్వసవిత్రి అయింది. ఆ బాధ్యతను మనం పంచుకోవటమంటే - ఆ మాతృత్వాన్ని మనలోకి ఆహ్వానించు కుంటున్నా మన్న మాట. అంటే తన అంశను మనలోకి ప్రవేశపెడుతున్నది అమ్మ

అంటే యింకో విధంగా చెప్పుకోవాలంటే - అమ్మ తన అంశను ఏలేశవెూ ప్రసాదించినవారుగానీ - అన్నపూర్ణాలయ నిర్వహణలో భాగస్వాములు కాలేరు అమ్మ రక్తమాంసాదులే కాక అమ్మ అమృత హృదయాన్ని కూడా పంచుకోగలిగినవారు అల్పసంఖ్యలోనే ఉంటారు, వారు అదృష్టవంతులు.

(మార్చి 1976)



## అవి, నా, భావ సంబంధం

రజ్జువును సర్పంగా చూచింది నా భావం. భయపడ్డది నా భావం. దీపం తెచ్చింది నా భావం. మళ్ళీ కాదనుకున్నది నా భావం. సర్వం నా భావం.

అవినాభావ సంబంధమంటే అవి-నా-భావ సంబంధం. అవి అంటే కనబడేవి. నా భావం అంటే కనబడే వాటిని ఊహించేది. ఊహనుబట్టి సంబంధం. ఏదయినా చూసేదాన్నిబట్టె కనబడుతుంది.

- అమ్మ

# 108
# మాతృప్రేమ

"అమ్మా ! ప్రేమంటే అర్థం కావటం లేదమ్మా" అన్నాను, యీ నెల 15వ తేదీన ఉదయం 5 గంటలకు అమ్మతోపాటే నడుస్తూ ఆ సమయంలో మేడపైన అమ్మనివాసానికి ప్రక్కనే ఉన్న ఖాళీస్థలంలో కొంతసేపు నడపటం అమ్మకు అలవాటు. పశ్చిమదిశలో క్రిందికి జారిపోతూ క్షణక్షణానికి ఎఱ్ఱబారుతున్న చంద్రుడు దీనంగా కనిపించాడు ఆ చంద్రుడ్ని చూస్తుంటే - ఆరు నెలలకు పైగా అమ్మ సన్నిధిలో ఉండి నిన్న వాళ్ళ దేశానికి బయలుదేరుతూ అమ్మ దగ్గర సెలవు తీసుకుంటున్న గ్రీకు సోదరుడు పోలో కనిపించాడు. వాతావరణం శీతలంగా అత్యంత ఆహ్లాదకరంగా ఉన్నప్పటికీ అతిభారంగా అడుగులు వేస్తూ చంద్రుడ్ని చూస్తున్న అమ్మ కన్నుల్లో విషాదఛాయలు గోచరించాయి. "ఏమిటమ్మా ?" అన్నాను.

"పోలో మళ్ళీ వస్తాడా, నాన్నా -" అని అడిగింది అమ్మ.

భవిష్యత్‌కు సంబంధించిన ఆ ప్రశ్నకు సమాధానం అమ్మకు తెలుసునా? నాకు తెలుసునా ? కాని ఆ విచిత్ర ప్రశ్న అమ్మనోటి నుండి వెలువడడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించలేదు. అందుకు జవాబు నే నేమివ్వగలను ?

అమ్మ అతని మంచి గుణాలు వివరిస్తూ "చాలా మంచివాడు, చాలా పేదవాడు, మళ్ళీ రావాలంటే కష్టం కదా...." అన్నది.

ప్రస్తుతం అమ్మ దగ్గర అనేక విదేశీ సోదరులు స్థిరనివాసం ఏర్పరచుకొని ఉన్నారు. మరెంతమందో వస్తూ పోతూ ఉంటారు. వారందరికి ఎవరికి ఎప్పుడు ఎట్లాంటి ఆహారం కావాలో అమ్మ స్వయంగా విచారించి చేయించి పెడుతుంది.

"అమ్మా - యింకా యింత మంది ఉన్నారుగా. ఒక్కరు వెళ్ళితే ఇంత బాధపడుతున్నా వేమిటి !" అన్నాను.

నడిచే అమ్మ ఆగి నావంక చూచింది, ప్రేరణరూపిణి అయిన అమ్మ ఏమీ మాట్లాడకపోయినా - వెంటనే నామనస్సులోకి అనేక సంఘటనలు ఒక దాని తరువాత ఒకటిగా వచ్చినయ్.

అమ్మ చిన్నతనంలో ఒకనాడు అందరూ భోజనానికి వచ్చారు గానీ రాఘవరావు మామయ్య రాలేదు అందుకు అమ్మ బాధపడుతుంటే - కారణం అడగ్గా - ఎందరు తిన్నా ఒక బిడ్డ తినకపోయినా తల్లికి బాధే కదా - అన్నది

రోజూ అమ్మను చూడటానికి వచ్చే వందలాది జనాన్ని చూస్తూ ఒక్కొక్కరిని "అన్నం తిన్నారా?" అని స్వయంగా కనుక్కుంటూ అందరికీ ప్రేమతో ఆదరంతో ఆనందంతో అన్నంపెట్టే అమ్మ - ఒక్కొక్కరు వెళ్ళిపోతుంటే ఎంతో బాధపడుతుంది .. స్వర్ణోత్సవంనాడు ఉదయం లక్షకు పైగా జనాన్ని తీసుకు వచ్చిన బస్సులను చూచి ఆనందపడిన అమ్మ సాయం కాలం అందరినీ తీసుకువెళ్ళే బస్సుల వంక దిగులుగా చూస్తూ -" ఆ బస్సులను చూస్తుంటే కోపంగా ఉన్నది. తల్లీ బిడ్డలను వేరు చేస్తున్నయ్" - అన్నది.

అమెరికా నుంచి వచ్చి తిరిగి వెళ్ళే మార్యాను కౌగిలించుకుని ఆమెతోపాటు అమ్మకూడా వెక్కివెక్కి ఏడిచింది

అనేక సంఘటనలు గుర్తుకువచ్చి - ఏమిటీ పిచ్చి అమ్మ ! వాళ్ళకూ యీామెకూ సంబంధం ఏమిటి ? వాళ్ళకోసం తానెందుకు బాధపడాలి ? - అనిపిస్తూ అవ్యాజమైన ప్రేమంటే ఇదేనేమో అన్న ఆలోచన కలిగింది.

"ప్రపంచంలో ఏ మూల ఏ కొంచెం ప్రేమ కనిపించినా - దానికి మూలం ఒకటే. ఆ మూలం ఇండియాలో ఉన్నది. వెళ్ళిచూడు -" అని ఒక స్నేహితురాలు పోలోకి సలహా యిచ్చిందట.

ఆ ప్రేమను చూడటమే కాదు, ఆ అమృతాన్ని పుక్కిటిబంటిగా త్రాగి యివ్వాళో రేపో స్వదేశానికి చేరుకోబోతున్నాడు పోలో.

ప్రయాణమైన పోలోని నిన్న సాయంకాలం చెంత కూర్చోబెట్టుకుని ఒక చేత్తో అన్నం కలిపి ముద్దలు పెడుతూ, మరొకచేత్తో చెక్కిళ్ళు పుణుకుతూ వీపు నిమురుతూ అతని అణువణువునూ వాత్సల్య పులకితం చేస్తున్న అమ్మ మనస్సులో మెదులుతుండగా - అమ్మ అడిగింది - "ఏమిటిరా - యిందాక అడిగావూ ?" అని. భానూదయ కాంతులతో ఎఱ్ఱవారుతున్న తూర్పు దిక్కును చూస్తూ - 'ఏమీ లేదమ్మా' - అన్నాను.

(ఏప్రిల్ 1976)



# 109
# భద్రపరచబడ్డ అమ్మ దివ్యవాణి...

అవతారపురుషులు, మహర్షులు, ప్రవక్తలు.. అనేకులు అమూల్యమయిన సందేశాలను ఇచ్చియున్నారు; సిద్ధాంతాలను చేసి ఉన్నారు; అద్భుత సత్యాలను ప్రవచించి ఉన్నారు

అనేకులు తమ పవిత్రమయిన జీవితాలను అలౌకిక సాధనలకు అంకితంచేసి అపారమైన అతీంద్రియజ్ఞానాన్ని సముపార్జించి అనేక సత్యాలను కనుగొన్న మాట వాస్తవం.

ఆ మహాత్ముల అనుభవసారాలే నేడు మనకు శాస్త్రాలై మార్గదర్శనం చేస్తున్నాయి కానీ ఇందులో పవిత్రమయినదీ, మనకు అర్థం కానిదీ ఒక్క విషయం. . అందరూ సత్యసందర్శనంచేసిన మహానుభావులే అయినప్పటికీ - వారు వెల్లడించిన అనేక విషయాల్లో పరస్పర విభిన్నత, పరస్పర వైవిధ్యమూ కనుపిస్తున్నాయి. దీనితో జిజ్ఞాసువు అయిన సామాన్య మానవుడు తికమకపడి కలత చెందుతున్నాడు. ఏది సత్యమో, ఏది అసత్యమో అవగాహనకాక అయోమయంలో పడిపోతున్నాడు.

ఈ కల్లోలిత పరిస్థితుల్లో అమ్మ అవతరించింది సర్వసృష్టినీ తన కన్నబిడ్డగా భావించగల ప్రేమమయిగా వెలసింది. సర్వమత సమ్మతమైనదే నా మతం - అని ప్రకటించింది. అన్ని సిద్ధాంతాలనూ సమన్వయంచేస్తూ క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదన చేస్తున్నది. కొత్త - అంటే పూర్వ సిద్ధాంతాలకు భిన్నంగా ఉండటమే కాదు, అది సులభగ్రాహ్యంగా ఉండటమే కాదు, అలతి పదాలతో అందంగా ఉండటమేకాదు అమ్మ చెప్పే ప్రతి విషయమూ అనుభవ జనితమై, హేతుబద్ధమై ఉంటున్నది. అవి లోగడ చెప్పబడిన విషయాలకంటే ఎంతో విశిష్టంగానూ, ఉన్నతంగానూ, పరిపూర్ణంగానూ ఉంటున్నాయని పలువురు జ్ఞానులూ, మేధావులూ ఏక కంఠంతో ఉద్ఘాటిస్తున్నారు.

అమ్మ చెప్పే విషయాల్లో అనేకం పూర్వశాస్త్రాలను నిర్ద్వంద్వంగా ఖండిస్తున్నాయి. జగత్తూ, బ్రహ్మవిషయంలోనూ, పునర్జన్మ విషయంలోనూ, పాపపుణ్యాల విషయలోనూ అమ్మ విప్లవాత్మక నిర్ణయాలను చేస్తున్నది

నిత్యమూ అమ్మను అనేకులు దర్శిస్తున్నారు. వారిలో కొందరు తాత్త్విక విద్యార్థులు, కొందరు సాధకులు కొందరు ఆస్తికులు కొందరు నాస్తికులు కొందరు యోగులు. కొందరు భోగులు ఎవరి జీవితవిధానం వారిది. ఎవరి సాధనమార్గం వారిదే.

కొందరిలో జిజ్ఞాస ఉంటుంది. కొందరిలో చిలిపితనం ఉంటుంది. అమ్మ అందరిప్రశ్నలకూ సమాధానాలు యిస్తుంది అమ్మ ఒక్కొక్కరితో మాట్లాడేటప్పుడు ఒక్కొక్క విధంగా ఉంటుంది. ప్రశ్నించేవాడి స్థాయిలోకి వచ్చి అమ్మ మాట్లాడుతుంది పరుగెత్తేవాడికి ఎదురువచ్చి వాడిని హఠాత్తుగా ఆపటంకాక - వాడివెంట కొంత దూరం పరుగెత్తి వాడు ఆగినప్పుడు పట్టుకొనటం అమ్మ విధానాల్లో ఒకటి.

అందువల్లనే యేమో అమ్మ చెప్పేదాని గురించి ద్వంద్వాభిప్రాయం ఏర్పడుతున్నది కొందరు అమ్మ చెప్పేది - పూర్వ సిద్ధాంతానుసారమే ఉంటున్నది - అంటున్నారు. మరికొందరు అమ్మ పూర్వశాస్త్రాలకు అతీతంగా చెబుతున్నది. అంటున్నారు.

ప్రస్తుతం అమ్మ నూతన సిద్ధాంతాన్ని తమ రచనలద్వారా, ఉపన్యాసాలద్వారా లోకానికి అధికంగా అందిస్తున్న వారిలో ప్రముఖులు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు. వారు భౌతిక శాస్త్రంలో నిష్ణాతులయినందున - ఆ శాస్త్రపు గీటురాయిపై అమ్మ సిద్ధాంతాలను పరీక్షించుకుని సంతృప్తులై, పలువురి మహానుభావుల జీవితాలనూ, వారి ప్రవచనాలను అధ్యయనంచేసి, పూర్వ శాస్త్ర గ్రంథాలను అవగాహన చేసుకొని - తులనాత్మక పరిశీలన జరిపి అమ్మచెప్పేది అన్ని విధాల పరిపూర్ణంగా భాసిస్తున్నదని నిర్ణయానికి వచ్చి - ఆ సిద్ధాంతాన్ని ప్రజాబాహుళ్యానికి అందించవలెనని దీక్షతో జీవితాన్ని అందుకు అంకితం చేసుకున్నారు

వారు గతమాస ఉత్తర భాగమంతా జిల్లెళ్లమూడిలో అమ్మసన్నిధిని ఉండి సోదరులు శ్రీ వీరమాచనేని ప్రసాదరావుగారి సహకారంతో అమ్మ 'దివ్య వాణి' యథాతథంగా టేపు రికార్డు చేయగలిగారు. లోగడ అనేకులు యీ ప్రయత్నంచేసి కృతకృత్యులు కాలేకపోయారు. కాని ఈ సోదరులు సాధించారు. వారు అమ్మను అనేక ప్రశ్నలు వేశారు. అనేక చర్చలు జరిపారు. అమ్మ ఎన్నో వినూతన అంశాలతో

కూడిన విప్లవాత్మక సిద్ధాంతాలు చేయుటమేకాదు, పాతశాస్త్రానికి సవరణలు, కొత్తవిషయాలకు వివరణలు అందించింది.

ఇది - అమ్మ - నిజంగా - వారికిచ్చిన వరం. వారికేగాదు - ఇది యావజ్జగతికీ అమ్మ ఒసగిన మహాప్రసాదం. ఇది తత్వశాస్త్రంలోనే సువర్ణాధ్యాయం. ఇది జిజ్ఞాసువులకు ప్రేమతో అమ్మ పెట్టిన భిక్ష.

ఈ వాటి ఆధారంగా నూతన గ్రంధరచన చేసి, యీ లోకానికి అందించాలని ఆ యిరువురి సోదరుల తీవ్రమైన అభిలాష వారి అభిలాష ఆకృతి ధరించేటట్లుగా వారిని ఆశీర్వదించమని అందరిపక్షాన అమ్మను వేడుకుంటున్నాము.

(మే 1976)



## అన్నదాతా ! సుఖీభవ !!

అన్నదాతా సుఖీభవ
అనసూయమాత సుఖీభవ
జన్మదాతా జయీాభవ - వి
జ్ఞానప్రదాతా విజయీాభవ

అన్నదాతా ! సుఖీభవ !!

అర్కపురం ! అమ్మ వరం !
అఖిలపాప సంతాపహరం !
అమ్మో అందాం అమ్మను కందాం
అందరు కలసి అన్నం తిందాం

అన్నదాతా ! సుఖీభవ !!

- నదీరా

# 110
# పత్రిక కూడా పుత్రికే

సరిగ్గా పది సంవత్సరాలైంది - యీ పత్రిక ప్రారంభించి, మొదట్లో 1962 ఏప్రిల్‌లో అమ్మ జన్మదిన మహోత్సవానికి "మాతృశ్రీ" సావనీర్ విడుదల చేశాము దాని యందు సోదరులు చూపిన ఆదరాన్నీ, అభిమానాన్నీ పురస్కరించుకొని వరుసగా నాలుగు సంవత్సరాలు సావనీరు ప్రచురించాము.

1968 నుండి వార్షిక సంచికను మాస పత్రికగా ప్రకటించాలనే అభిలాషను అభివ్యక్తం చేసినప్పుడు - కొందరు అమితానందాన్ని వెల్లడించినా - ఎందరో, "ఒక వ్యక్తిని గురించి ప్రతినెలా తెలియజేయటానికి ఏముంటుంది ? ఈ పత్రిక ఎన్నాళ్ళు నడుస్తుంది ?" అని నిరుత్సాహపరిచారు

అయినా అమ్మ ఆశీస్సు నందుకుని ధైర్యంగా ప్రారంభించాము. మొత్తం మీద యీ పదిసంవత్సరాలలో ఏ అయిదారు సంచికలు - అనివార్య కారణాలవల్ల - ప్రకటించలేక పోయినప్పటికీ పత్రిక నిర్విఘ్నంగా ప్రచురిత మవుతూనే ఉన్నది. పత్రికాముఖంగా తెలియజేయగలుగుతున్నది - తెలియ జేయవలసిన దానిలో శతాంశమే అయినా పాఠకులకు అమ్మనుగురించీ అమ్మ వివరించే క్షేత్రంలోని విశేషాల గురించీ రేఖామాత్రంగా నయినా తెలియజేయ గలుగుతున్నందుకు సంతోషిస్తున్నాము.

'పత్రిక' అని మేము ఎన్నిసార్లు అన్నప్పటికీ - అమ్మ మాత్రం 'పుత్రిక' అని సవరిస్తూనే ఉంటుంది.

ఈ నెల 20వ తేదీన ఈ పత్రికను ప్రచురిస్తున్న మాతృశ్రీ ప్రింటర్సు దశమవార్షికోత్సవం. ఈ శుభసందర్భంలో పత్రికా రచయితలకూ, పాఠకులకూ, చందాదారులకూ, ప్రకటనదారులకు, ప్రెస్‌వర్కర్సుకూ.. అందరికీ మా శుభాకాంక్షలతో పాటు అమ్మ ఆశీస్సులు కలగాలని మనసా అభిలషిస్తున్నాము

(జూన్ 1976)



# 111
# కాలం

కాలం అంటే... జరుగుతన్న కాలాన్ని గుర్తు తెలియపరిచేది గడియారం. గంటలు కాదు కదా కాలం అంటే. తెలిసి, తెలిసినా తెలియక పోయినా జరుగుతూనే వుంది. కాలం అంటే ఎప్పుడూ వున్నది. గ్రహించేదీ కాలమే కాలం అంటే సమయం అనీ వుంది. సమయం ఎప్పుడూ వుంది ఏ సమయానికి ఆ సమయమే కాలం. అంటే శక్తి అనీ, సమయం అనీ, పరిణామం చెందేదనీ, చెందడానికి ఆధారమైనదనీ, కాలం అంటే చైతన్య మనీ, కాలం అంటే బ్రహ్మ అనీ, కాలం అంటే సత్యమైన పదార్థమనీ, బ్రహ్మస్వరూపమనీ, బ్రహ్మ అంటే సత్యమైన పదార్థమనీ, ఎన్నోవున్నది కాలం అంటే ఆ కాలం, శక్తి ఎట్లా నిండివున్నదో, కాలం అలానే అట్లా నిండి వున్నదీ, వెలితి లేకుండా, చెప్పడానికి వీల్లేకుండా ఇంతనీ, ఎంతో అనీ, ఏదనీ, ఫలానానిదనీ చెప్పడానికి వీలులేనిదే కాలం అని, గర్భితంగా వుంది. ప్రత్యక్షంగా అర్థం అవుతూనూ వుంది, అర్థంకాకుండానూ వుంది. తెలుస్తూ వుంది, తెలియకుండాను వుంది. అటువంటిదే కాలం ఆ కాలమే దైవం ఆ కాలమే సర్వం ఒక గింజపెట్టాం. ఆ గింజ పెరిగే సమయాన్ని కాలం అంటాం. ఒక అక్షరం మొదలుపెట్టాం. ఆ వాక్యం పూర్తయ్యేదీ కాలమే. నీవు నన్ను కాలం అంటే ఏమిటని అడగడానికీ కాలమే. కాలం అంటే ఏమిటో చెప్పడానికి చేతకాని కాలం. చేతనైన కాలం. కాలం క్షణం అని చెబుతున్నాను; కానీ, క్షణం అంటే ఏమిటో తెలియని కాలం. క్షణం క్షణం అని ఏమిటో మాటలతో అంటున్నాం కానీ, ఆ క్షణాన్ని అర్థంచేసే కాలం. సర్వం కాలమే. చైతన్యమే కాలం. చైతన్యంకూడా కాలమే. దైవం, అంటే ఎంత విడదీసి చెప్పడానికి వీలులేనిదో, కాలంకూడా అంత చెప్పడానికి సాధ్యం కానిదే వ్యక్తం చెయ్యలేనిది, వ్యక్తం చెయ్య గలిగిందీ కాలమే. (నువ్వు నన్ను అడగడానికీ కాలమే. నాకు నేను చెప్పే ప్రశ్నలూ కాలమే) కాలం సర్వకాల సర్వావస్థలయందూ కాలమే. నీవూ కాలమే. గణితానికీ కాలమే. అక్షరాలకూ కాలమే. పదాలకూ కాలమే. ఒక కాలంలో వుండవలసింది. ఇంకో

కాలంలో ఉండ కూడదు. (ఆ ఒక కాలంలో ఉన్న అంకె ఇంకో కాలంలో వుంటే, దాని విలువ మారుతుంది. అంతా కాలమే. అందుకే ఆ కాలం గణేశ్వరుడన్నారు. కాలం వినాయకు డన్నారు. అలా తీసుకుంటే జగత్తంతా కాలంతోనే నిండివున్నది గోడమీద గడియారాలు మొదలు చేసుకొని, చూస్తూ, చేస్తూ, నడుస్తూ వున్న కాలం, వింటూ, అంటూ తిరుగుతన్న కాలం. ఇవి అన్నీ కాలమే... సర్వం కాలము ఉన్నది కాలమే

- అమ్మ

('సూక్తి ముక్తావళి' - ఆకాశవాణి సౌజన్యంతో)

(జులై 1976)



## అమ్మ

ఆలించుమా - 'మొర లాలించుమా
మముపాలించుమా'

జననీ నీవల్ల
జన్మించె మే మెల్ల
మనుచుంటిమి నీ కనులముందుగా
కినుచుంటిమి నిను కన్నులవిందుగా ! ఆలించుమా.....

ప్రేమకన్న మిన్న
పెన్నిధి లేదన్న
ప్రేమదేవతవు - పెన్నిధినమ్మా
ప్రణతులుగొమ్మా - బంగరుబొమ్మా ఆలించుమా....

- నదీరా

# 112
# అమ్మ వాత్సల్యానికి ప్రతిరూపం

కారణం మనం ఒకటి అనవచ్చునూ, అమ్మ మరొకటి చెప్పవచ్చునూ గానీ - అమ్మకు బాల్యం నుంచి తన ఆకలి గురించిన ఆలోచనే లేదు. అమ్మ తన చిన్నతనంలో తనకు పెట్టిన అన్నమేకాక, తాను అడిగి పెట్టించుకునీ కుక్కలకూ, పందులకూ బిచ్చగాళ్ళకూ పెట్టేది. ఆకలితో ఎవరు బాధపడుతున్నా తాను సహించగలిగేది కాదు అమ్మచరిత్రనంతనూ జాగ్రత్తగా పరిశీలిస్తే - మనిషి యొక్క ఆకలి బాధకూ, అన్నం యొక్క అవసరానికే అమ్మ ఎక్కువ విలువ యిచ్చినట్లు అర్థమవుతుంది.

అందువల్లనే బాల్యం నుంచీ అమ్మ ఆకలిగురించీ, అమ్మ ఆహారం గురించీ ఎవరు విచారించినా, విచారించక పోయినా --అమ్మను చూడటానికి ఎవరు వచ్చినా, అమ్మ ఎవరిని చూచినా - అమ్మ వాళ్ళకు తన చేతిమీదుగా ఏమీ పెట్టుకోకుండా ఉండలేదు.

చిన్న తనంలో గుంటూరులోని గుండేలురావును చూడటానికి అమ్మ వాళ్ళయింటికి వెళ్ళింది ఆయన జబ్బుతో మంచంలో ఉన్నాడు. అమ్మ మరిడమ్మ తాతమ్మగారిని అడిగి నారింజపండు తీసుకుపచ్చి దానిని ఒలిచి గుండేలురావుగారి నోటికి అందించి, తరువాత రోజూ అన్నం కలిపి వారికి పెట్టేది.

ఇట్లా అమ్మ ప్రసాదానికి, అనుగ్రహానికి, వాత్సల్యానికి పాత్రమైన వారిలో అన్ని జాతులవాళ్ళూ, అన్ని మతాలవాళ్ళు, అన్ని కులాల వాళ్ళూనే కాక పశుపక్ష్యాదులుకూడా ఉన్నాయి.

ప్రస్తుతంకూడా అమ్మను చూడటానికి ఎవరు వచ్చినా అమ్మ ముందుగా అడిగేది - నాన్నా అన్నం తిన్నావా ? - అని. వాళ్ళు అన్నం తినక పోతే అన్నం తినమంటుంది. తిన్నామని చెప్పినా - మళ్ళీ కొద్దిగానయినా తినమని వాళ్ళను బ్రతిమిలాడి అన్నం తినిపిస్తుంది. అందులో అమ్మకు ఎనలేని తృప్తి ఉన్నది

కొందరు అమ్మను చూచిన తరువా,త లేక అమ్మకు పూజ చేసుకున్న తరువాత భోజనం చేస్తాం అంటారు కానీ అమ్మ వాళ్ళ భోజనానికే అధిక ప్రాధాన్య మిస్తుంది. ఆకలితో కడుపు నకనకలాడుతూ, ఆకలి మంటలతో నరాలు దహింపబడుతుండగా - ఆధ్యాత్మిక చింతనకూ పరమార్ధ సాధనకూ అర్ధం లేదని అమ్మ అభిప్రాయం.

అందువల్లనే అమ్మ 1958 ఆగష్టు 15వ తేదీన "అన్నపూర్ణాలయం"కు ప్రారంభోత్సవం చేసింది. ఆనాడు చాలా కొద్దిమందితోనూ చాలా కొద్ది యేర్పాట్లతోనూ ప్రారంభమయినప్పటికీ, దానిని ప్రారంభిస్తూ "ఇది జగన్నాధరథం; కదిలితే ఆగదు" అని ఆశీర్వదించింది. అలాగే 1958లో చిన్నవాగుగా మొదలయిన అన్నపూర్ణాలయం 1973లో స్వర్ణోత్సవంతో మహాసాగరంవలే విరాట్రూపం ధరించింది.

అప్పటినుంచీ అన్నపూర్ణాలయంలో నిత్యం భోజనంచేసే వారి సంఖ్య దినదినం అభివృద్ధి చెందుతున్నది రోజుకు కనీసం వెయ్యిమందికి పైగా భోజనం చేస్తున్నారు. ఇప్పుడు కేవలం అక్కడ భోజనం చేసే వారికి ఆకలి తీరటమే కాదు; ఎన్నో రుగ్మతలు నయమవుతున్నాయి వారికి సంబంధించిన సమస్యలు పరిష్కార మవుతున్నాయి

అందువల్లనే అన్నపూర్ణాలయం అమ్మ వాత్సల్యానికి ప్రతిరూపమే కాకుండా అమ్మవిధానంలో ముఖ్యాంగం అయింది.

ఆ అన్నపూర్ణాలయం వార్షికోత్సవం ఈ నెల 15వ తేదీన అత్యంత వైభవోపేతంగా జరిగింది.

(ఆగష్టు 1976)



## అమ్మ దగ్గరకు

అమ్మ దగ్గరకు పిల్లలు రాకపోవటానికి ఏదైనా కారణం ఉండవచ్చును గానీ రావటానికి కారణం ఎందుకూ ?

- అమ్మ

# 113
# "మీరు నా అవయవాలు కూడ"

ఈ నెల 12వ తేదీ ఉదయం 10 గంటలకు గుంటూరు సోదరులు శ్రీ పన్నాల వేణుగోపాల కృష్ణమూర్తి, వారి కుటుంబమూ అమ్మవద్ద కూర్చున్నారు. ఆనాడు వారు హైమాలయంలో అభిషేకం చేసుకుందామనే ఉద్దేశంతో వచ్చి అమ్మ అనుమతి కోరటానికి అమ్మ వద్దకు వచ్చారు. వారిని తిలకంతో అలంకరిస్తూ ఆశీర్వదిస్తూ కాఫీ త్రాగి వెళ్ళుదురుగాని కూర్చోండి - అని చెప్పింది అమ్మ.

అమ్మ గదిలో సేవచేసే అమ్మాయి, సువర్ణ కాఫీ తీసుకు వచ్చి వారికి యిచ్చింది. వేణుగోపాల్ కాఫీ కప్పు చేతిలో పట్టుకుని - అమ్మకి తాగకుండా మేమెట్లా తాగటం ? - అన్నాడు అమ్మతోనే. వెంటనే అమ్మ అతని చేతిలోని కప్పును తనచేత్తో తాకింది.

''నువ్వు కొంచెం తాగమ్మా -'' అతను మళ్ళీ అర్థించాడు.

''తాకేనుగా నాన్నా -'' అన్నది అమ్మ నవ్వుతూ

అతనికి అర్థంగాక - ప్రసన్నతకు నిలయమైన అమ్మ ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

''తాకితే తాగినట్లే నాన్నా - తాకటమంటే తాగటమే'' అమ్మ వివరించింది.

ఈ వాక్యార్థము అతనికి అర్థంగాక అతను అట్లాగే కాఫీ కప్పు చేతిలో పట్టుకుని కూర్చుంటే - అమ్మ అతని చేతిలోని కప్పు తానూ పట్టుకుని అతని నోటికి అందించింది.

ఇక, అతను ఆ కాఫీ, కాదు, అమ్మ వాత్సల్యామృతం తాగటానికి క్షణమయినా ఆలస్యం చేయటానికి యిష్టంలేక గటగటా తాగేశాడు.

అతను ఆ కాఫీ తాగి కప్పు క్రింద పెడుతుండగానే అమ్మ చిన్నగా త్రేన్చింది.

అమ్మ మన నివేదనలను స్వీకరించటంలో అనేక మార్గాలున్నాయి. అవన్నీ అతి విచిత్రంగానూ, అత్యద్భుతంగానూ, మహిమాన్వితంగానూ ఉంటాయి. మనం నివేదనచేసిన పదార్థాలు మన వలెనే అమ్మ నోటితోనే భుజించాలని లేదు. స్పర్శతో, దృష్టితో కూడా అమ్మ ఆహారం తీసుకొనగలదని అనేక సంఘటనల ద్వారా మనం తెలుసుకున్నాము

ఎవరైనా నివేదన తెచ్చినప్పుడు - ఒక్కొక్కసారి అమ్మ అలా చూచి - యిక తీసుకువెళ్ళండి - అంటుంది. ఒకసారి గుంటూరు నుంచి వచ్చిన మా మిత్రునితో అమ్మను గురించి చెబుతూ యీ విషయం వివరించాను. అతను నమ్మలేనట్లుగా - అదెట్లా సాధ్యం ? - అని అడిగాడు. ఆరోజుననే మేమిద్దరమూ అమ్మ దగ్గర కూర్చుని ఉండగా - మహానివేదన అమ్మ వద్దకు తీసుకురాబడింది తెచ్చిన సోదరి పైనకప్పబడిన ఆకును తొలగించింది. అమ్మ దానిని ఒకసారి తృప్తిగా చూచి ఆమెను తీసుకువెళ్ళమని చెబుతూ - సన్నగా త్రేన్చుతూ మా మిత్రునివంక చూచి నవ్వింది సర్వజ్ఞ అయిన అమ్మ అతని సందేహం నివృత్తి చేసినందుకు అతను పరమానంద భరితుడైనాడు.

మద్రాసులో కృష్ణమూర్తిగారు అని ఒక దేవీ ఉపాసకులు ఉన్నారు. అతనికి అవతారవ్యక్తులపై ఏ మాత్రమూ విశ్వాసం లేదు. కాని ఒకసారి - అయినా చూడటంలో నష్ట మేముందీ ? - అని అమ్మను చూడటానికి జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ దర్శనంతో ప్రభావితులై, అనేక స్తోత్రాలుచేసి తన దగ్గర ఉన్న పండును అమ్మకు నివేదన చేశారు. అమ్మ దానిని తిన్నది అతను - అమ్మా, నేను రోజూ నీకు ఇలా నివేదన చేసుకునే భాగ్యం కలిగించు - అని ప్రార్థించాడు. అపుడు అమ్మ అన్నది - 'నిత్యం నీవు పూజ చేసుకుంటావుగదా, ఆ పూజ కాగానే ఆ స్థలానికి ఒక బల్లి వస్తుంది. నీవు పెట్టదలుచుకున్నది దానికి పెట్టు దానికి పెడితే నాకు పెట్టినట్లే - 'అయితే, యిక్కడ మనకు మరొక ప్రశ్న కలుగుతుంది. ఆ బల్లికి పెడితే అమ్మకు అందుతుందా ? అమ్మ ఆ బల్లి రూపంలో అక్కడకు వెళుతుందా? - అని. ఆ ప్రశ్నను అమ్మను అడిగితే ఒక చిరునవ్వును మాత్రమే మనం సమాధానంగా పొంద గలుగుతాము.

ఒకసారి సోదరులు శ్రీ కాశీరావు అమ్మకోసమని ఆపిల్ పండ్లు తీసుకురాగా, అమ్మకు సమర్పించకముందే వాటిని ఒక ఎలుక కొరికింది. ఈ విషయం అమ్మకు చెబుతూ అతను విచారిస్తుండగా అమ్మ అన్నది "నేనే ఎలుకరూపంలో వచ్చి తిన్నాను నాన్నా - విచారించకు-" అని ఇది కేవలం ఓదార్పు అని భావించటానికి వీల్లేని విషయం.

అనేకులు తమతమ ఇళ్ళలో అమ్మ ఫొటోకు నివేదనలు చెప్తారు అవన్నీ అమ్మ స్వీకరిస్తూ ఉన్నదనుకోవటానికి ఎవరికి వారికే అనేక అనుభవాలూ, అనుభూతులూ ఉన్నాయి.

అమ్మ తానేమీ తినకుండానే, మనకు అన్నపుముద్దలు పెడుతూ తాను తృప్తిగా త్రేన్చటం మనలో అనేకులు కళ్లారా చూచారు. "ఇదేమిటమ్మా ? మాకు పెడుతూ, నీవు త్రేన్చుతావు ?" అని ఆశ్చర్యంగా అడిగితే "మీరు తింటే నేను తిన్నట్లే నాన్నా -" అని చెప్పింది అమ్మ. అందుకనే అమ్మ "మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలు కూడా" అని చేసిన ప్రకటన ఎంతో అర్థవంతంగా కనుపిస్తుంది.

(అక్టోబరు 1976)



## భవిష్యత్ జ్ఞానం

నేను భవిష్యత్తు అని చెప్పటం లేదు. నాకు భవిష్యత్తు తెలుసుననికూడా అనుకోవటం లేదు. కాకపోతే నేను గతంలో అన్నది నేడూ, నేడన్నది రేపూ కార్యరూపం ధరించవచ్చును. ఉదాహరణకు ఎప్పుడో 1960కి పూర్వంలో మన ఇంట్లో కూర్చుంటేనే ఏడోమైలు నుండి వచ్చేవాళ్ళు కనిపిస్తే ఎంత బాగుంటుంది అనుకున్నాను. నేడది నిజమయింది. ఒక నాడు ఈ మేడ మీద ఏదయినా పూలతీగ ఉండాలని కోరుకున్నాను. దాని ఫలితమే కావచ్చును నేడు ఈ పూలు పూసే తీగలు. మొన్న పాలకొల్లు గోపిని చూడాలనుకున్నాను. నిన్న గోపి వచ్చి చెప్పాడు. మొన్నటి దాకా రావాలనే ఉద్దేశమే లేదు. హఠాత్తుగా బయలు దేరి వచ్చామూ అని. దీనినే మీరు భవిష్యత్ జ్ఞానం అనండి. వాక్శుద్ధి అనండి. సంకల్పసిద్ధి అనండి - మీ ఇష్టం. నేను మాత్రం తెలిసీ ఆలోచించీ ఏమీ అనను. ఆ మాటకు వస్తే మీరు అనేవి అనుకునేవి మాత్రం కొన్ని నిజం కావటం లేదూ ? నే నన్నవి మాత్రం అన్నీ అవుతున్నాయా ?

\- అమ్మ

# 114
# ఆదరణాలయం

నిత్యం యాత్రికు లెందరో జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించుకుని వెళుతున్నారు. అమ్మను దర్శించిన ప్రజలు అనేక విధాల లాభాలు, శుభాలు పొందుతున్నారు. ఆ అనేక శుభాల్లో ముఖ్యమయినది మనశ్శాంతిని పొందడం ఎటువంటి వారు జిల్లెళ్ళమూడి వచ్చినప్పటికీ అమ్మను చూడగానే ఏదో తెలీని మనశ్శాంతిని పొంది ఎంతో హాయిని అనుభవిస్తున్నారు.

ఉద్యోగం చేసుకునేవారు, వ్యాపారం చేసుకునేవారు ఆ హాయి ఎంత తీయని దైనప్పటికీ ఆ హాయిని శాశ్వతం చేసుకోవాలని ఆకాంక్ష ఉన్నప్పటికీ తమ స్వస్థానాలు విడిచి తమ కర్తవ్యాలు మరిచి అమృతపు మడుగులైన అమ్మ పాదాలసన్నిధిలో స్థిరంగానే కాదు, కొన్ని రోజులుకూడ నిలవ లేరు.

కానీ ఉద్యోగం చేసి విరమణ చేసినవారూ, వ్యాపారం చేసి విసుగు చెందినవారూ, జీవితంతో లోకంతో విరక్తి పొందినవారూ ఎందరో ఉంటారు వారు ఉద్యోగం చేస్తూ, వ్యాపారం చేస్తూ జీవితం ఎంత సుఖభోగాలతో గడిపినప్పటికీ జీవితంలో అనుభవించిన ఆటుపోటులకు అతలాకుతలమై జీవిత చరమదశలో నయినా ప్రశాంతంగా జీవించాలని కోరుకుంటారు.

లోకంలో ఎక్కడ చూచినా యాంత్రిక జీవనమూ, ఉరుకులూ పరుగులూ, ఏదో హడావుడి, అలజడీ, ఆందోళనా, కుట్రలూ, కుయుక్తులూ, పట్టింపులూ, పోటీలు, పగలూ, ఈర్ష్యలూ, ద్వేషాలూ.... ఈ అసుర ప్రవృత్తుల విలయతాండవం మధ్యనే మనిషి మనుగడ సాగించాలి. శరీరంలో రక్తం వేడిగా ఉన్నంతకాలం, గుండె దిటవు తప్పనంతకాలం, యౌవనం కవచమై ఉన్నంత కాలం మనిషి ఏ బాటనైనా, ఏ పరిస్థితులలో నయినా ధైర్యంగానే మనిషి శరీరానికి విశ్రాంతీ, మనస్సుకు ప్రశాంతీ కోరుకోవటం అత్యంత సహజం.

విశ్రాంతి అయితే ఎక్కడైనా పొందవచ్చును, కానీ మనస్సుకు ప్రశాంతి ఎక్కడ దొరుకుతుంది? అప్పుడే మనిషి ఆధ్యాత్మిక చింతనా, ఆశ్రమ జీవనమూ అభిలషిస్తాడు.

దురదృష్టవశాత్తూ మన రాష్ట్రంలో ఆశ్రమాలే బహుతక్కువగా ఉన్నయ్. అందులోనూ ఆశ్రమ జీవనం అభిలషించేవారు స్థిర నివాసం ఏర్పరచు కునేందుకు అవకాశాలు కల్పించే ఆశ్రమాలు అసలే లేవు.

ఈ పరిస్థితుల్లో - అందరి బిడ్డల యోగక్షేమాలూ అత్యంతా సక్తితో పర్యవేక్షించే ప్రేమస్వరూపిణి అయిన మన అమ్మ వృద్ధుల కొరకు వసతి కల్పించ సంకల్పించటం అమ్మకు సహజమే అయినప్పటికీ - ఎందరికో యీ వార్త విశేషమైన ఆనందాన్ని కలిగిస్తున్నది అందుకు అవసరమైన ఒక భవనానికి 'ఆదరణాలయం'అని నామకరణంచేసి యీనెల 19వ తేదీ శుక్రవారం ఉదయం తన అమృత హస్తంతో శంకుస్థాపన జరుపబోతున్న వార్త ముసలివారికి ముదావహమైనదే కాదు, పడుచు వారికి పండుగే. యువతీ యువకు లెందరో వారిబ్రతుకు తెరువుకోసం ఏడాది కొక ఊరుగా దేశాటనం చేస్తూ ముదుసలులైన తమ ప్రియతమ జననీ జనకులను తమ వెంట తీసుకుని వెళ్ళ లేకనూ, ఎక్కడో నిరాధారమైనచోట వదలలేకనూ డోలాయమానసులవుతున్నారు. వారి కిది నిశ్చింతను చేకూర్చగలదు.

ఇప్పటికే సుమారు 20 సంవత్సరాల నుండి అమ్మ సన్నిధిలో "అన్నపూర్ణాలయం" నిర్వహింపబడుతున్నది. నిత్యం వచ్చి వెళ్ళే యాత్రికులే కాక అక్కడ కొందరు ప్రజలు స్థిరనివాసం ఏర్పరుచుకున్న విషయం అందరికీ తెలిసినదే. కాని వారికి ప్రత్యేకమైన సదుపాయాలేమీ ప్రస్తుతం లేవు. అందరికీ భోజనమూ, వసతీ సమిష్టిగానే ఉంటుంది. కానీ ప్రస్తుతం ఏర్పరచబోయే వసతిగృహం నిర్వహణ అందుకు భిన్నమై రూపొందుతుంది. ఇందులో ఎవరి నివాసం వారికి ప్రత్యేకంగా ఉంటుంది. వారి ఆరోగ్యానికి, అలవాట్లకూ అనుగుణంగా ఆహారం తయారుచేయ బడుతుంది. వారికి కావలసిన వైద్య సదుపాయం అందించ బడుతుంది. వీటన్నిటికీ అయ్యే ఖర్చులు మాత్రం ఆ సభ్యుల నుండి వసూలు చేయబడుతాయి

ఈ విశిష్ట ప్రణాళికను నరసాపురం వాస్తవ్యులయిన డాక్టర్ ఆచంట కేశవరావు గారికి అమ్మ అప్పగించింది. డాక్టరుగారు అత్యంతాసక్తితో యీ గృహనిర్మాణం నిమిత్తం యిప్పటికే కొన్ని విరాళాలు వసూలు చేశారు. ఇంకా అనేక ప్రదేశాల్లో యిందుకు కృషి జరుగుతున్నది. ఈ భవనం అమ్మ నివాసానికి కొన్ని అడుగుల దూరంలో వాయువ్యమూలగా ఉంటుంది. తూర్పు దిశకు అభిముఖమై

అలరారుతుంది. సభ్యులు ఆ భవనం నుండి పడమటకు చూస్తే పచ్చని చేలు కనువిందు చేస్తాయి, తూర్పుకు చూస్తే ప్రేమస్వరూపిణి అమ్మ కళ్ళఎదుట ఉంటుంది. అతి చేరువలోనే పోస్టాఫీసూ పబ్లిక్‌కాల్ ఆఫీసూ ఉన్నయ్ దగ్గరనే ప్రభుత్వం వారిచే నిర్వహింపబడుతున్న హోమియో హాస్పిటల్ ఉన్నది. కొద్ది రోజుల్లోనే శ్రీ విశ్వజననీ పరిషత్ వారి ఆధ్వర్యంలో నిర్వహింపబడే అలోపతిక్ హాస్పిటల్ ప్రారంభింప బడుతుంది. ప్రక్కనే స్టేట్ బ్యాంకు వసతి ఉన్నది. బాపట్ల వరకూ రోడ్డూ, ప్రయాణ సౌకర్యాలూ ఉన్నయ్. ఎక్కడి కక్కడే నీటి సౌకర్యమూ, విద్యుత్ సరఫరాలతో వెలుగొందే ఆ భవనం అన్ని విధాల అధునాతన సౌకర్యాలతో విలసిల్ల గలదు.

అన్నిటికంటే ముఖ్యంగా అక్కడ - మనిషి అనవరతం ఏ భగవచ్ఛక్తి సాక్షాత్కారంకోసం యుగయుగాలుగా తపస్సుచేస్తున్నాడో - ఆ శక్తి మానవాకృతిలో రక్త మాంసాలతో కనుపిస్తూ మాతృవాత్సల్యంతో అందరినీ తన ఒడిలోకి తీసుకుని ప్రేమామృతాన్ని పంచుతూ ప్రశాంత జీవనాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది

అంతకంటే మనిషి కోరుకోతగినదేముంటుంది ?

(నవంబరు 1976)



## మంచితనం

సర్వత్రా మంచిని చూడటమే మంచితనం.
నన్నెప్పుడయినా మంచితనమే ఏడిపిస్తుంది.
కొట్టీ తిట్టీ ఎవరూ ఏడిపించలేరు.
చెడ్డవాళ్ళను చూస్తే జాలేస్తుంది.
మంచివాళ్ళను చూస్తే ఏడుపొస్తుంది.

- అమ్మ

# 115
# నామసంకీర్తన ప్రీత

ఈ నెల 13వ తేదీ ఉదయం .....

అమ్మ వరండాలో సింహాసనాసీన అయి ఉంది శ్రీ ఆదినారాయణగారి ఆధ్వర్యంలో భీమవరం నుంచి వచ్చిన భక్తబృందం నామసంకీర్తన చేస్తున్నది. వారితో వచ్చిన శ్రీ నిష్టల వెంకటరావుగారు నామం చెబుతున్నారు; మిగతా సోదరులు అనుగమిస్తున్నారు

"కృష్ణా - నీ పేరెంతో మధురమురా
గోపాలా నీ పేరెంతో మధురమురా
గోవిందా నీ పేరెంతో మధురమురా . ."

అని అతడు పాడుతుంటే - తేనే వాకలు కట్టి ప్రవహిస్తున్నట్లుగానే ఉన్నది. అతడి కంఠంలోని మాధుర్యం కంటే అతడి హృదయంలోని ఆర్తియే చుట్టూ వాతావరణాన్ని పులకితం చేస్తున్నది

"కృష్ణా - నీ పేరంటేనే నా కెంతో ప్రాణమురా
కన్నయ్యా - నీ పేరంటేనే నా కెంతో ప్రాణమురా ...
అమ్మా - నీ పేరంటేనే నాకెంతో ప్రాణమురా..."

అతడు పరవశించి పాడుతున్నాడు; అతడు మైమరచి పాడుతున్నాడు; అతడి గుండెలే కరిగి నాదమై మధువై బయటకు ప్రవహిస్తూ అందరి మనోస్సీమలను నింపివేస్తున్నది

అతడు "కృష్ణా..." అని పిలుస్తున్నాడుగానీ ఎదురుగా "అమ్మ"నే చూస్తున్నాడు. అపుడపుడు మైమరచి "అమ్మా..." అంటున్నాడు. అతడు కృష్ణుడినే పిలుస్తున్నాడో, అమ్మనే పిలుస్తున్నాడో - అతడు ఎదురుగా కృష్ణుడినే కంటున్నాడో, అమ్మనే కంటున్నాడో - మరి, వారిద్దరి అభేదస్థితినే అమ్మ అతనికి ప్రసాదించిందో ! అమ్మ అతనిలోకి చూస్తున్నది, అతడు అమ్మనే చూస్తున్నాడు.

"నీ నామామృత మెంత మధురమో కృష్ణా
ఎంత జుర్రినా తనివితీరదు తృష్ణా. ."

అతడి కంఠం బాష్పరుద్ధమై గద్గదమైంది. అతడి కన్నుల్లోని అన్వేషణకు అశ్రులహరి అడ్డగించింది

"నిన్న ఒంటరిని
నేడు ఒంటరిని
రేపు ఒంటరిని
నా జంట నీవే కృష్ణా
నా కెవరూ లేరిక కృష్ణా . . ."

అతడు ఇంకా పాడుతున్నాడు అతడి గుండె ఇంకా ఆక్రోశిస్తున్నది అక్కడ కూర్చున్న అందరూ తన్మయులై అతడ్ని అనుసరిస్తున్నారు.

అమ్మ చివాలున కుర్చీలోంచి లేచి నిలుచున్నది నేను అమ్మ పాదుకలు పాదాలకు అందిస్తున్నాను. ఒక కన్నీటి బిందువు నా చేతిపై పడ్డది తల పైకెత్తి అమ్మ ముఖంలోకి చూచాను. అమ్మ చరచరా లోపలకు వెళ్ళింది - మళ్ళీ వస్తానని చెబుతూ.

ఆ సంగీతంలోని మాధుర్యానికి అమ్మ వివశురాలైందా ? ఆ సాహిత్యంలోని భావలహరిలో కరిగిపోయిందా ? మరి అతడిలోని భక్త్యా వేశానికి కదిలిపోయిందా?

వీటిలో ఒక్కటిమాత్రమే కారణం కాకపోవచ్చు. అన్నీ కారణమే. అమ్మకు సంగీతమంటే చాలా యిష్టం బాగా పాడేవాళ్ళంటే మరి ఇష్టం అందుకు ఎవరైనా బాగాపాడేవాళ్ళు కనిపిస్తే మళ్ళీ మళ్ళీ పాడించుకుంటుంది.

అమ్మకు ఏ నామమన్నా యిష్టమే. ఒకసారి ఒక భక్త బృందం అమ్మ వద్దకు వచ్చి అక్కడ అమ్మనామమే చేయాలేమోనని అమ్మను అడిగారు "ఏనామమైతే ఏమి నాన్నా - మీకిష్టమైన నామం చేసుకొనండి. నాకేమీ అభ్యంతరం లేదు. నాకన్ని నామాలూ ఒకటే. 'జయహో మాత' అంటేనే అమ్మా ? - 'హరేహరే' అంటే అమ్మ కాదూ?" అని సమాధానం చెప్పింది.

అమ్మకు సంగీతమంటే ఇష్టమే కాదు. అమ్మకు సంగీతం బాగా తెలుసును అమ్మ బాగా పాడుతుంది. సంకీర్తనకూడా బాగా చేస్తుంది. అమ్మపాటనూ భజననూ విని ఆనందించిన అదృష్టవంతులు ఎందరో ఉన్నారు అమ్మ గానం ఎంతో

మధురమైంది. సహజంగా అమ్మ మాట్లాడుతుంటేనే - ఆగొంతులోనుండి అమృతపు బిందువులు చిందుతున్నట్లుగా ఉంటుంది

అమ్మ సాహిత్యప్రియ; సంగీతలోల, రసార్ద్రహృదయ. కనుకనే ఎందరో కవులూ, గాయకులూ అయిన కళాతపస్సులు అమ్మ పదసన్నిధికి వచ్చి తమ కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ, ఎన్నో ఏళ్ళుగా తాము సాధించిన కళాసంపదను అమ్మకు నివేదన చేసుకునే సందర్భాల్లో వారు పొందే అనుభవాలూ, అనుభూతులూ వింటుంటే ఆ సంగీత సాహిత్యాలకు అధిష్టాన దేవతయై రసస్వరూపిణి అయిన శారదా దేవియే వారికి అమ్మలో సాక్షాత్కరిస్తుందా - అనిపిస్తుంది.

(డిశంబరు 1976)



## అమ్మతత్వం

అమ్మ తత్వమును ఆలపించేము ఆలకించ రండి
అమ్మను జూడ అభయము వేడ అలసించకండి ॥ అమ్మ ॥
తక్కిన వేల్పుల తీరు వేరు మా తల్లి తీరు వేరు
మొక్కిన వారికి మ్రొక్కని వారికి మోక్ష మిచ్చి తీరు ॥ అమ్మ ॥
దుష్టులు భ్రష్టులు అమ్మదృష్టిలో దుష్టులు గారండి
సృష్టి తనది సమదృష్టి తన దని స్పష్టపరిచె నండి ॥ అమ్మ ॥
పాపులు పతితులు అమ్మ దృష్టిలో పాపులు కారన్నా
పాపులైన పసిపాపలె తన కను పాప లన్న దన్నా ॥ అమ్మ ॥
జారులు చోరులు జన్మతోనె దిగ జారచోర నంది
వారలుగూడా మారితీరు రహ దారులున్న వంది ॥ అమ్మ ॥
తస్కరించినా దొంగ దొరకిన సత్కరించ మనియె
తల్లిప్రేమ చవిచూచి అతడు తన దారి మార్చుకొనియె ॥ అమ్మ ॥
కుల మత గుణ గణ భేద మెఱుంగని గుణవతి మా యమ్మ
కూడి మెలగినా కీడు తొలగు నను కుందనంపు బొమ్మ ॥ అమ్మ ॥

- నదీరా

# 116
# మకర సంక్రాంతి

దృశ్యమానమయిన బాహ్య ప్రకృతి మానవుల అంతఃప్రకృతికి ప్రతీక వ్యక్తస్థితిలోనూ, అవ్యక్తస్థితిలోనూ ప్రకృతి ఒక్కటే కాబట్టి దాని ధర్మంలో భేదం ఉండదు.

సంక్రాంతి వచ్చింది కర్షకులు సంవత్సరమంతా చేసిన కృషికి ఫలితాన్ని అనుభవించే ఆనందకర సమయమిది. అయితే యీ సమయంలో ఎంతమంది ఆనందించ గల్గుతున్నారు ? ఎందఱు దుఃఖపు కౌగిలిలో నలుగుతున్నారు ? దీనికి సమాధానం చెప్పటం కష్టం. వర్షాలు చాలక పైరు కొన్ని చోట్ల ఎండిపోయింది కొన్ని చోట్ల వర్షాధిక్యంవల్ల గంగపాలయింది ? సమవర్షాలున్నా కొన్ని చోట్ల కారణాంతరాలవల్ల పైరు దెబ్బతిన్నది. అన్ని బాధలకూ తట్టుకొని కొన్నిచోట్ల పైరు చక్కగా పండింది.

ఈ అస్తవ్యస్తస్థితిలో ఒక అర్థవిశేషం అంతర్లీనమై ఉన్నది.

అఖండ ప్రకృతిలో అంతర్భాగాలైన మానవ ప్రకృతులలో కొన్ని బలహీనాలు, కొన్ని బలవిశిష్టాలూ 'నేనిలా ఉండాలి' - 'అది అలా కాకూడదు' అని శాసించటానికి ఎవ్వరికీ సామర్థ్యంలేదు. సర్వావాంతరభేద సమన్వితమై, సర్వశక్తి విలసితమైన మహాప్రకృతికే అటువంటి సామర్థ్యముంది.

మానవులయొక్క - చిత్త ప్రవృత్తుల వైపరీత్యాలనుబట్టి నేడు ప్రపంచంలో యిటువంటి దుర్భిక్ష, క్షామాది బాధలు కలుగుతున్నాయనికాదు దీని ఉద్దేశ్యం

బాహ్యమని, అంతరమని, ద్వివిధావిభక్తమయిన ప్రకృతి యొక్క మూల మొక్కటేనని, దాని స్వభావాన్ని అవగతం చేసుకుని అనుభవించటమే మన కర్తవ్యమని మాత్రమే మనం తెలుసుకోవాలి

అందుకే

"చేతలు చేతుల్లో లేవు"
"సృష్టి సహజం"

అంటుంది అమ్మ

మహాప్రకృతి స్వరూపిణి అయిన అమ్మ ప్రవచించిన యీ రెండు వాక్యాలలో సర్వవేదసారం గర్భితమై యున్నది; సర్వవేదాంత సౌరభం గుబాళిస్తోంది

అమ్మా ! మధురమాయా విలసితమైన నీ ప్రకృతి రహస్య విజ్ఞాన పరిష్వంగంలో నీ బిడ్డల నందరిని నిర్విశేషంగా లాలించి పాలించవా ?

పవిత్రమైన ఈ మకరసంక్రాంతి కాంతిలో క్రాంతిపథాన్ని మాకు చూపించు తల్లి !

(జనవరి 1977)



## అవినీతి

అవినీతి ఉన్నదని మనం అనుకుంటున్నాం గదా ! ఎవరికి వారు అవినీతి ప్రబలిపోతున్నదని అంటున్నారు. ఈ ప్రస్తావన చేయనివారూ లేరు; తమ వరకు వస్తే మానుకుంటున్నవారూ లేరు. అనుకుండేవారు కాక క్రొత్త వారెవరో అవినీతిని చేయటం లేదు. ఈ అనేవాళ్ళ మాటలలోని ఆసక్తి చేతోల్ల ఉంటే చాలు. ఆధ్యాత్మికచింతన వలన మనిషి అవినీతిని మానుకో లేడు. అవినీతిని మానుకోవటమే ఆధ్యాత్మికత కావచ్చు. అదీ వీడి చేతిలో ఉందని నా కనిపించటం లేదు.

\- అమ్మ

# 117
# అణోరణీయాన్

'అణోరణీయాన్

మహతో మహీయాన్ .'

అమ్మను గురించిన యీ వేదోక్తిని అమ్మే పలుకుతుండగా విన్న ఇద్దరు ముగ్గురి గుండెలు పులకించినయ్.

ఈ నెల 7వ తేదీ నుండి 14వ తేదీవరకు అమ్మ గుంటూరులో మకాం చేసింది. జిల్లెళ్ళమూడిలోని ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీపన్నాల రాధాకృష్ణశర్మ గారు గుంటూరులో కొత్తగా యిల్లుకట్టుకుని 7వ తేదీ రాత్రి గృహప్రవేశోత్సవం జరుపుకుంటూ అమ్మను ఆహ్వానించారు అందుకు అమ్మ అంగీకరించి గుంటూరు వెళ్ళింది. ఆ రాత్రి గృహప్రవేశోత్సవం వైభవోపేతంగా జరిగింది.

తెల్లవారింది. అనేకులు అమ్మను "మా యింటికి రామ్మా -" అంటూ ఆహ్వానించారు. అంటే "మాయింటికి రావా, అమ్మా -" అందులో ఎన్నో సంవత్సరాల నుండి అమ్మ చేసిన వాగ్దానాలు అనేకం ఉన్నయ్. వాళ్ళందరూ వచ్చి అమ్మకు అవి జ్ఞాపకం చేశారు. అమ్మ ఏవీ కాదనలేదు. ఎవరినీ కాదనలేదు.

అమ్మ అందరి యిళ్ళకూ వెళ్ళింది. అందరూ తమకు ఒక పెన్నిధి దొరికినట్లుగా, తమ యింట్లో ఒక పెండ్లి జరిగినట్లుగా అత్యంత వైభవోపేతంగా ఉత్సవం జరుపుకుంటున్నారు

కొండయ్య వచ్చి అమ్మను పిలిచాడు. అతడు చాలా పేద వాడు. సోడాల వ్యాపారం చేసుకుంటాడు. అమ్మ తప్పక వస్తానన్నది. వస్తానంటూ - అతనికి సలహా యిచ్చింది. "నాకోసం ఏమీ ఖర్చు పెట్టవద్దు. నాకోసం మీరు తిరగవద్దు నా వీలు చూసుకుని నేనే మీ ఇంటికి వస్తాను. వచ్చి మీ యింట్లో మీ లక్ష్మి (కొండయ్యభార్య) ఆపూట ఏమీ వండితే దానినే నేను తింటాను. నాకోసం చీరెలూ

సారెలూ కొనవద్దు. అటుచూడు నువ్వు అలా చినిగిపోయిన చొక్కా తొడుక్కుని నాకు కొత్త చీరె కొంటేమాత్రం నాకేమి హాయిగా ఉంటుంది ? అని.

ఆ రాత్రి అమ్మ వాళ్ళయింటికి వెళ్ళి.ది. వాళ్ళపూజ అందుకున్న తర్వాత అమ్మ తానే స్వయంగా వాళ్ళ వంటయింట్లోకి వెళ్ళి అన్నమూ, పులుసూ కలుపుకుని తింటూ - వంట చాలా బాగున్నది అని మెచ్చుకున్నది. లోగడ 1962లో చీరాలలో బెస్తవాళ్ళ యిళ్ళల్లో, యానాదుల యిళ్ళల్లో మాంసం, సారాయి రుచి చూసిన అమ్మకు విధినిషేధాలేమున్నయ్ ? అందుకనే అప్పటి ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు అమ్మను గురించి అన్నారు అమ్మ రాజరాజేశ్వరీ అవతారమే, దానికి సందేహం ఏమీలేదు. కాని వర్ణసంకరం చేస్తున్నది. అదే బాధగా ఉన్నదీ అని.

తర్వాత సంగావు శ్రీనివాస్ యింటికి వెళ్ళింది. అతను అతని భార్య రమణమ్మతో - అమ్మ మన ఊళ్ళో ఉన్నప్పటికీ మన యింటికి పిలవలేము గదా - అనుకున్నాడుట. ఆ విషయం అమ్మకు తెలిసింది "పిచ్చివాడు, అమ్మను పిలవటానికి ఒక తాహతు కావాలి అనుకుంటున్నాడు. అదేమీ అవసరం లేదు..." అంటూ అమ్మ తానుగానే వాళ్లయింటికి వెళ్ళింది. ఊరికి దూరంగా ఉన్న వాళ్ళ పేద గుడిసెలోకి దూరి వెళ్ళి వాళ్ళు పెట్టిన చీరె కట్టుకుని 'ఇప్పుడు మేడలో ఉన్నప్పటికీ పూర్వం నేను చాలాకాలం యిలాంటి యింట్లోనే ఉన్నాము. అప్పటి మనస్సే యిప్పుడూ. నా కెందుకో - మేడల్లో కంటే, గుడిలోకంటే గుడిసెలోనే హాయిగా ఉంటుంది" అన్నది.

మరునాడు శ్యామల అని ఒక అమ్మాయి ఇంటికి వెళ్ళింది. కారుదిగి వాళ్ళయింటికి కొంతదూరం నడిచి వెళ్ళాలి ఆ దారి చాలా ఇరుకుగా ఉంటుంది. వాళ్ళయిల్లు చాలా చిన్న అద్దెయిల్లు. వాళ్ళు మరీ పేదవాళ్ళు. అందువల్ల వాళ్ళు అమ్మను పిలవకపోగా, అమ్మతానే వస్తానని కబురుపెట్టినా - అమ్మ రాకపోతేనే బాగుండును - అని వాళ్ళు కోరుకున్నారు. అమ్మకు ఎక్కడ శ్రమ కలుగుతుందోనని. కాని అమ్మ మన ఇష్టాయిష్టాలపై ఆధారపడి నడుస్తుందా ? మనం రమ్మని ప్రాధేయపడితే వస్తుందా ? రావద్దని వేడుకుంటే రాకుండా ఉంటుందా ? తన యిచ్ఛ !

అమ్మ - వాళ్ల ఇంటికి వెళ్ళింది. దారి చాలా ఇరుకుగా ఉన్నది. చీకటిగా ఉన్నది. పైగా దారిలో ఒక అరుగు. దాని ప్రక్కనే ఒక చెట్టు. దాని ప్రక్కనే గోడ.

అమ్మ ఎట్లా వెళుతుందా - అని మేము ఆలోచిస్తుండగానే అరుగుకు చెట్టుకు మధ్య ఉన్న చిన్న ఖాళీగుండా అమ్మ 'సువ్వున' దూసుకు వెళ్ళింది. వెళుతూ అమ్మ అనుకున్నది - అణోరణీయాన్. . అని. ఆ రెంటిమధ్యా అంత చిన్న ఖాళీగుండా అమ్మ ఎలా వెళ్ళిందో మా కెవరికీ అర్థంగాలేదు.

లోగడ 1962లో అమ్మ చీరాల వెళ్ళినప్పుడు శ్రీరాజుపాలెం రామచంద్రరావు గారింటికి వెళ్ళింది. వాళ్ళయింట్లో దేవుడి మందిరం ఒకటి ఉన్నది. అది చాలా చిన్నది. అమ్మ గబాలున దానిలోకి దూరి కూర్చున్నది. ఆనాడు వాళ్ళూ యిట్లాగే ఆశ్చర్యపోయారు. 'అంత' చిన్న మందిరంలో 'యింత' పెద్ద అమ్మ ఎలా కూర్చున్నదా - అని.

అమ్మరూపం విచిత్రమైనది. అమ్మ మనసు లోతు తెలియని సముద్రం కంటే లోతైనది అమ్మ లీలలు అత్యద్భుతమైనది. అమ్మ మనకేమీ అర్థంకాని వ్యక్తి. కాని అమ్మ మాత్రం - అమ్మ అంటే అంతులేనిదీ. అడ్డు లేనిదీ - అని నిర్వచిస్తుంది.

(ఫిబ్రవరి 1977)



## అదృష్ట దురదృష్టాలు

జాతకరీత్యా అందరికంటే అదృష్టవంతురాల్ని నేనొక్కదాన్నే. ఎందుకంటే 'ఇది అవస్థ' అనే చింత నాకు లేకపోవటమే నా అదృష్టం. అటువంటప్పుడు కష్టానికి బాధకూ చోటేది ? ఎన్ని ఉన్నా, ఎంత సుఖంగా ఉన్నా - 'నాకు లేదు' అనుకోవటమే దురదృష్టం. అదృష్ట దురదృష్టాలు రెండూ భావనలే.

- అమ్మ

# 118
# అమ్మ అనారోగ్యాలు

ఫిబ్రవరి 26వ తేదీన అమ్మ సన్నిధిలో ఒక వివాహం జరగబోతున్నది. లగ్నం షుమారు మధ్యాహ్నం 12 గంటలకు. వందల్లో అతిథులు వచ్చి ఉన్నారు. అమ్మ వివాహం చేయబోతున్నదంటే స్థానికులు కూడా వందల్లో వస్తారు. ప్రాంగణమంతా పెండ్లి సందడితో, మంగళవాద్యాలతో నిండిపోయింది - కాని అమ్మ మాత్రం చాలా అనారోగ్యంగా ఉన్నది. మంచంపై పడుకున్న అమ్మ మంచంమీద లేచి కూర్చొనటమే అతికష్టంగా ఉన్నది. మరి పెండ్లి వేదిక నలంకరించాలంటే - అమ్మ రెండంతస్తులు దిగిరావాలి. రమ్మని అడగటం - స్వార్థపరత్వమే కాక అమానుషమని కూడా అనిపించింది. అందువల్ల అమ్మను అర్థించాము - కల్యాణం తన గదివద్దనే జరిపించమని. "పై అంతస్తులో పెండ్లి చేస్తే - నాకు సుఖమే. మరి, మీరందరూ ఎక్కడ కూర్చుంటారు ? అందరూ ఎండలో కూర్చోవలసివస్తుంది. అంతకంటే - నేను దిగి రావటమే నాకు హాయి..." అని స్పష్టంగా చెప్పింది అమ్మ.

అంటే పై అంతస్తులో వరండా చాలా చిన్నది. వివాహం ఆ వరండాలో జరగాలి. అది చాలక - జనం బయట ఎండలో నిలుచో వలసి వస్తుంది. అది అమ్మ భరించలేదు. నిత్యమూ కూడా యిదే సమస్య ఎదురవుతుంది. అమ్మ వరండాలో దర్శనం ప్రసాదిస్తుంటే - ప్రజలు ఎండా, వానా లెక్కచేయకుండా నిలుచుని ఆనందస్వరూపిణీ ఆనందదాయినీ అయిన అమ్మను చూస్తూ హాయిగా ఉంటారూ, వారిని చూస్తూ అమ్మ మాత్రం గిలగిలలాడుతుంది.

తరువాత మార్చి 7వ తేదీన యింకొక వివాహం నిశ్చయ మయింది. అమ్మ ఆరోగ్య పరిస్థితిలో ఏమీ మార్పు లేదు అందువల్ల క్రితంసారి అనుభవంతో యీ పెండ్లిని రాత్రి జరపటానికి లగ్నం నిర్ణయించి పై అంతస్తులోనే పెండ్లి ఏర్పాటు చేశాము. ఇంకొక రెండు గంటల్లో పెండ్లి జరుగుతుందనగా - ఆ విషయం అమ్మకు విన్న వించాము. అమ్మ అంగీకరించలేదు, "అమ్మా - నీచేతిమీదుగా పెండ్లి జరగాలని

వాళ్ళ కోరికగానీ, నువ్వు ఎక్కడ జరిపితేనేం ?'' అని అమ్మను సమ్మతింపజేయాలని మేము ప్రయత్నిస్తే - అమ్మ అన్నది ''నేను పెండ్లిచేస్తే సరిపోతుంది అనుకుంటే ఆ వధూవరులు మాత్రమే వచ్చినా చాలు, మరి, యింతమంది బంధువులూ, ప్రేక్షకులూ వచ్చారు పైన చేస్తే - వేదిక లేదుగదా అందరికి పెండ్లి కనపడదు నేను పెండ్లి చేయటం చూడాలని కుతూహలంతో అనేకులు వచ్చి ఉంటారు. వాళ్ళందరూ ఆశాభంగం పొందుతారు. అంతెందుకు ? - నేను క్రిందికి వస్తాను వేదిక పైనె ఏర్పాట్లు చేసుకొనండి -'' అని.

1975 మే 19వ తేదీన అమ్మ సన్నిధిలో ఒక వివాహం జరిగింది ఆ రాత్రి పెండ్లి. ఆ పగలల్లా అమ్మకు మంటల జ్వరం అమ్మకు లేచిన రాచకురుపుకు ప్రారంభదశ. కాలు కదిలించలేనంతగా బరువెక్కిపోయింది లగ్నసమయం సమీపిస్తున్నది అమ్మ అమితంగా బాధపడుతున్నది. పెండ్లివాళ్ళకు ఆ సమయం తెలియక త్వరపడుతున్నారు. ఏమీ చేయటానికి మాకు స్ఫురించలేదు. వాళ్ళు ఎంతో ఆశతో హైదరాబాద్ నుండి అమ్మ అమృత హస్తంతో పెండ్లి చేయించుకోవాలని వచ్చారు. అమ్మ పరిస్థితేమో, యిట్లా ఉన్నది. అమ్మ వద్దకు వెళ్ళి, చాలా బాధతోనే, అమ్మను సలహా అడిగాము, ఏమి చేయమంటావు-అని. పెండ్లి వాయిదా వేయటమా, లేక అమ్మ లేకనే పెండ్లి జరిపించటమా - అని. అమ్మ వెంటనే అన్నది.. ''అవేమీ వద్దు నాన్నా నేను లేచి స్నానంచేసి వస్తాను. పురోహితుని ఏర్పాట్లు చూడమనూ - '' అని అమ్మ పలికిన ఆ మాటలు ఆనందాన్ని కలిగించలేదు. అమ్మ మనకోసం ఎంత బాధను సహించ వలసి వస్తున్నదీ అని దుఃఖం వచ్చి కారే కన్నీళ్ళతో ''వద్దమ్మా - నువ్వు యిప్పుడు లేవద్దు. లేవలేవు....'' అని ప్రాధేయపడ్డాము. అయినా అమ్మ పడుకొనలేదు లేచింది; స్నానం చేసింది; తెల్లని చీరె కట్టుకున్నది. తల్లో తెల్లని మల్లెపూలదండ పెట్టుకున్నది. అంతకంటే తెల్లగా నవ్వుతూ గదినుండి బయటకు వచ్చింది. బయట వెన్నెల అమ్మను చూసి మురిసిపోయింది. చల్లగా ఉండాల్సిన వెన్నెల అమ్మలోని జ్వరాన్ని తీసుకున్నదేమో, కొద్దిగా వేడెక్కింది. అమ్మ చెయ్యిపట్టుకుని అమ్మను వేదికవద్దకు నడిపిస్తున్నాను. వెంట మరెవ్వరూ లేరు. అమ్మ అడిగింది - ''నాలో యిప్పుడు జ్వరలక్షణాలేమయినా కనిపిస్తున్నవా?'' అని. అమ్మచెయ్యి వదిలి దూరంగా రెండడుగులు వేసి - అమ్మవంక చూశాను. చంద్రుని నుండి జారిపడిన వెన్నెల కిరణంవలే ఉన్నది, తప్తకాంచన రేఖవలే ఉన్నది అనుగ్రహం మానవాకృతి ధరించినట్లున్నది. మృదువైన స్వరంతో అమ్మ అన్నది ''నాకు జ్వరం ఉన్నట్లు వాళ్ళకు తెలిస్తే వాళ్ళు బాధపడతారని '' అని. అమ్మను

చూస్తూ పొంగిపోయే ఆనంద తరంగం కుప్పన కూలి పోయింది. వెంటనే లోగడ అమ్మ చెప్పిన ఒక వాక్యం స్మృతికి వచ్చింది. "మీ బాధలు నాకు చెప్పుకుంటే, అవి తీరుతాయని నాకు చెప్పుకుంటారు. నా బాధలు మీకు చెబితే బాధపడుతారని నేను దాచుకుంటాను" అన్నది ఒకసారి.

బిడ్డలపై అమ్మకు ఎంతప్రేమ ! అందుకనే అమ్మ యింకొక వాక్యం కూడా చెప్పింది. తనను కన్నవాళ్ళమీద కంటే - ఎవరి కయినా తాను కన్నవాళ్ళమీదనే ప్రేమ ఎక్కువట ! మనం మన సుఖమే ఆశిస్తాము; అమ్మ విషయం ఆలోచించము. అమ్మ మన సుఖంకోసం తాను బాధను సహిస్తుంది.

అయితే ఇతరుల సుఖంకోసం తన సుఖాన్ని త్యాగం చేయటం అమ్మకు చిన్నతనం నుంచీ అలవాటే. ఇతరుల ఆకలి తీర్చటం కోసం తనకు పెట్టిన అన్నం తీసుకువెళ్ళి ఆకలితో నకనకలాడే బిచ్చగాళ్ళకూ, పందులకూ, కుక్కలకూ పెట్టటం అమ్మ బాల్యంతో పరిచయమున్న అందరికీ తెలిసన విషయమే. అందుకనే ఒక సందర్భంలో అమ్మ అన్నది - 'అన్నం నన్ను వదిలిందికానీ అన్నాన్ని నేను వదల్లేదు' అని. ఆ వాక్యంలోని యదార్థాన్ని విచారించి తెలుసుకుంటే - ఎవరికైనా మనస్సును పిండినట్లవుతుంది. మనిషి శరీరపోషణకు అత్యంతావశ్యకమైన అన్నాన్ని సంత్సరాల పాటు వదిలి అమ్మ ఎట్లా జీవించగలిగిందా - అని ఆలోచిస్తే, సమాధానం లభ్యంకాక చివరకు అమ్మ దివ్యత్వంలో ప్రశ్న కరిగిపోతుంది.

సహనమనే దేవతను అరాధించాలంటే బాధలనే పూజా ద్రవ్యాలు కావాలి. అని చెప్పిన అమ్మ "ఇతరులతృప్తి" అనే యజ్ఞంలో తన ఆరోగ్యం, తన సుఖం, తన తృప్తి. తన ఆనందం అనేవి సమిధలుగా చేసి - మనిషి ఏమి చేసినా తన తృప్తికోసమే చేస్తాడు అని నిర్వచించి - తనకు అందులోనే అనిర్వచనీయమైన తృప్తి ఉన్నదని వివరిస్తూ "అయినా అంతా నేనే, మీరంతా నేనే అనుకుంటున్నప్పుడు, ఇంకా ఇతరు లెవరూ?" అని మనసు ప్రశ్నించి నిరుత్తరులను చేయటం అమ్మ అద్వైత సిద్ధికి నిదర్శనం.

అమ్మ తన పెండ్లి సందర్భంలో ఒక ప్రశ్నకు ఇచ్చిన సమాధానం కూడా జ్ఞాపకం చేసుకొనదగినది. "శరీరానికి ఎన్ని కష్టాలు వచ్చినా, శరీరానికి మనస్సుకూ సంబంధం లేదని లోకానికి తెలియజేసేందుకే పెండ్లి చేసుకుంటున్నాను -" అని వివరించింది

అమ్మ క్షేమ సమాచారం గురించి ఎవరు ఎప్పుడు ప్రశ్నించినా, అమ్మ "కులాసాగానే ఉన్నాను నాన్నా" అంటుంది వారడిగేది అమ్మ ఆరోగ్యం గురించీ, అమ్మ చెప్పేది కులాసా గురించీ ఆరోగ్యం శరీరానికి సంబంధించినదైతే, కులాసా మనస్సుకు సంబంధించినది.

1969 దసరా ఉత్సవాలు జరుగుతున్నయ్ దసరా ఉత్సవాల్లో అమ్మదర్శన కార్యక్రమం కనీసం నాలుగు గంటలకు తక్కువ పట్టదు కానీ అమ్మకు ఒక రోజున విపరీతంగా విరోచనాలు కావటం మొదలు పెట్టినయ్ గంటకు పదిసార్లు తక్కువ కావటం లేదు. అందువల్ల ఆనాడు పూజాకార్యక్రమం రద్దు చేద్దామని ఆలోచించాము. కానీ అందుకు అమ్మ అంగీకరించక - పూజావేదికపైకి వచ్చింది, ఆనాటి కార్యక్రమం నిర్విఘ్నంగా జరిగింది.

1971 అమ్మ జన్మదినోత్సవంనాడు అమ్మకు బాగా దగ్గు వస్తున్నది నిర్విరామంగా దగ్గుతున్నది జన్మదినోత్సవం పూజలో అమ్మకు కిరీటాలంకరణ చేస్తాము కానీ యీ దగ్గువల్ల మానుకుందాము, అనుకున్నాము కిరీటం పెడితే, ఆ సమయంలో దగ్గుతెరవస్తే అమ్మకు చాలా యిబ్బంది కలుగజేసిన వాళ్ళ మవుతాము. కానీ ఆ నాడు ఎందరో భక్తులు దూరదేశాల నుండి కూడా అమ్మను సర్వాలంకార శోభితగా చూడాలని వచ్చారు. వాళ్ళను అసంతృప్తులను చేయటమూ యిష్టం లేదు. అదే అమ్మతో విన్నవించాము... ఆ నాడూ అమ్మ కిరీటధారణ చేసింది; కార్యక్రమం యధావిధిగా జరిగిపోయింది. వారితో సంభాషణలతోనూ, వారి సమస్యల పరిష్కారాలతోనూ, ఆధ్యాత్మిక చర్చలతోనూ - వ్యవధి లేనందున - తనవద్ద నివసించే ఎవరిచేత నయినా వండించి వచ్చిపోయే వారందరికి అన్నం పెట్టించేది. వీలయినంతవరకూ తాను పెట్టటంలోనే తృప్తిపడేది అమ్మ. ఇప్పటికీ అమ్మ అంటుంది "మాకు నా చేతిమీదుగా అన్నం పెట్టుకోవటంలో నేను పొందే తృప్తి నాకు మరెందులోనూ దొరకదు --" అని. అందుకే యీనాటికీ అమ్మ ఆరోగ్యం ఎట్లా ఉన్నా, రోజూ ఒకరికో ఇద్దరికో నయినా తన చేతిమీదుగా గోరుముద్దలు చేసి - వారి వయస్సుతో నిమిత్తం లేకుండా - వారి నోటికి అందిస్తేగానీ అమ్మకు తృప్తిగా ఉండదు.

1958 ఆగష్టు 15వ తేదీ వరకు అమ్మ చేసే యీ భోజనం ఏర్పాట్ల కయ్యే ఖర్చు నాన్నగారే భరించేవారు. కానీ నాన్నగారు సామాన్య కుటుంబీకులయినందున వారిపై అధికభారం వేయటం యిష్టంలేని బిడ్డలు - అమ్మ అనుమతితో - తమకోసం తాము ఒక భోజనశాలను ఏర్పరుచు కున్నారు. దాని నిర్వహణ విషయం చర్చకు వచ్చినప్పుడు, దాని నిర్వహణ గురించి బయపడేవారిని ఉద్దేశించి "ఇది జగన్నాథరథం,

కదిలితె ఆగదు'' అని ఆశీర్వదిస్తూ, అభయమిస్తూ దానికి ప్రేమతో 'అన్నపూర్ణాలయం' అని నామకరణం చేసింది అమ్మ. ఆగష్టు 15న అమ్మ వెలిగించిన గాడిపొయ్యి అవిచ్ఛిన్నంగా వెలుగుతూనే ఉన్నది. ఆనాడు అమ్మ చేసిన ఒక ప్రకటన అవిస్మరణీయమైనది ఆగష్టు 15 భారతీయులకే కాదు స్వాతంత్ర్యదినం; జిల్లెళ్ళ మూడికి సంబంధించినంతవరకు ప్రపంచ పౌరులందరికి స్వాతంత్ర్యం ప్రసాదించిన మహా పర్వదిన మది వేరుగా భోజనశాల ఏర్పడడంతో అమ్మదగ్గరకు వచ్చేవారికి అమ్మకూ మధ్యగల అడ్డుగోడ తొలగిపోయినట్లయింది. ఆనాటి నుండి అమ్మ అంతులేనిదీ, అడ్డులేనిదీ అయింది.

"అసలైన అమ్మకు ఎవరిని చూసినా తన బిడ్డే అనిపిస్తుంది'' అని అపూర్వ నిర్వచనం ప్రసాదించిన అమ్మను చూట్టానికి వచ్చి ఆప్యాయంగా అమ్మ పెట్టే అన్నం తిని 'ఇది అన్నమా ? అమృతమా ?' అన్న విచికిత్సలో పడేవారి సంఖ్య దినదినాభివృద్ధిచెంది అసంఖ్యాకమై పోయింది అమ్మను చూడవచ్చే వారిలో ఎట్లా విభేదమూ లేదో - యీ భోజనం దగ్గరకూడా ఏ విచక్షణా లేదు. అక్కడ భోజనం చేయటానికి 'ఆకలే' అర్హత. సమయ నియమం కూడా లేదు. దివారాత్రాల్లో ఎప్పుడు ఎంతమంది వచ్చినా అన్నం పెట్టవలసిందే. వారి కులంతోగానీ, గుణంతోకానీ, మతంతోకానీ, మనస్సుతోకానీ ఏమీ సంబంధం లేదు. రోజూ ఎంతమంది ఎక్కువగా భోజనంచేస్తే అమ్మకు అంతగా తృప్తి ! గాడిపొయ్యి ఎంత గణగణా మండితే అమ్మకు అంతగా ఆనందం ఒకసారి ఒక నవరాత్రి ఉత్సవాలలో ఒకరు ఏదో యాగం చేసుకుని పూర్ణాహుతి రోజున హోమగుండంలో నెయ్యి వెయ్యమని అమ్మను అడిగితే అమ్మ పలికిన "నేను ఏమి వెయ్యవలసి వచ్చినా అది గాడిపొయ్యిలోనే వేస్తాను. అంతకంటే నాకు ప్రీతికరమైనది ఏమీ లేదు'' అన్నమాటల్లో అమ్మహృదయం సుస్పష్ట మవుతుంది.

రోజూ ఎన్ని వందలూ వేలూ జనం భోజనం చేసినప్పటికీ అమ్మకు తృప్తి కలగలేదేమో - 1973లో అమ్మ స్వర్ణోత్సవ సందర్భం పురస్కరించుకుని - ఒక్క పంక్తిన లక్షమంది భోజనం చేస్తుంటే చూడాలని ఉన్నదని వింతైన కోరికను వ్యక్తం చేసింది. ముందు నిర్వాహకులు సందేహించినా, భయపడినా - చివరకు ఆ కార్యక్రమం నిర్విఘ్నంగా జయప్రదంగా జరిగి అమ్మకు అత్యంతానందాన్ని చేకూర్చటమేకాక ఆ అద్భుత కార్యం అమ్మ సర్వసామర్థ్యానికి, దివ్యత్వానికి, నిరుపమాన మాతృ వాత్సల్యానికి ప్రతీకగా చరిత్రలో సువర్ణాక్షర లిఖితమైంది ఈ సముజ్వల సంఘటనతో అన్నపూర్ణాలయ దివ్యకాంతులు దిగంత పరివ్యాప్తమైనాయి.

సంవత్సరం పొడుగునా లక్షల జనానికి అనురాగంతో, ఆప్యాయతతో అన్నం పెడుతూ, అమ్మ అనుమ అనంత మాతృవాత్సల్యానికి ప్రతిరూపమై వెలుగొందుతున్న అన్నపూర్ణాలయం వార్షికోత్సవం యీనెల 15వ తేదీన. పవిత్రమైన సముద్రస్నానం రోజూ చేయగలిగితే అదృష్టమే. ఆ భాగ్యం లేనివాళ్ళు పర్వదినాల్లోనయినా సాగర జలంలో సుస్నాతులై పునీతులై పులకించాలి !

1968 జనవరిలో ఒక రోజున నా స్నేహితులు కొందరు అమ్మను దర్శించేందుకు వచ్చారు వాళ్ళను అనేక పర్యాయాలు నేను ఆహ్వానించి ఉన్నాను. ఆనాడు అమ్మకు 106 డిగ్రీల జ్వరం విపరీతమైన చలిగా ఉన్నది. ఇంట్లో ఉన్న దుప్పట్లు అన్నీ కప్పాము అప్పటికీ అమ్మ మంచంమీద ఎగిరెగిరి పడుతున్నది. మాట్లాడుతున్నటే - తీవ్రమయిన వణుకువల్ల మాటలు తడబడుతున్నాయి ఆడపిల్లలందరూ అమ్మను గట్టిగా పట్టుకుని మంచంచుట్టూ కూర్చున్నారు ఏమి చేయాలో తోచక నేను పచార్లు చేస్తున్నాను. ఆ పరిస్థితిలో నాన్నగారు నన్ను చూసి "ఏమిటీ?" అని విచారించారు. నేను చెప్పాను. "దానికింత ఆలోచన ఎందుకు? మీ అమ్మగారికి చెప్పు. మీ అమ్మగారు బాధలను గుడ్డలను చిలకకొయ్యకు తగిలించినట్లు తగిలించ గలుగుతుంది" అని చెప్పారు. నేను వెళ్ళి అమ్మతో చెప్పాను పది నిమిషాల్లో వాళ్ళను తీసుకురా - అన్నది అమ్మ. నేను వాళ్ళకు అమ్మ ఆరోగ్యపరిస్థితి తెలియజేసి, అయినా అమ్మ దయతో దర్శనం ప్రసాదిస్తున్నది కానీ అమ్మతో మాట్లాడటానికి అవకాశంలేదు, అమ్మ మాట్లాడగలిగే పరిస్థితిలో లేదు - అని చెప్పాను వాళ్ళూ సరేనని సంతోషపడ్డారు. పది నిమిషాల్లో స్నానం ముగించుకుని అమ్మ మంచంపై కూర్చున్నది. వాళ్ళూ లోపలకు వచ్చారు. అమ్మను చూడగానే నాకు ఆశ్చర్యం కలిగింది. అపుడే విరిసిన పువ్వువలే ఉన్నది అమ్మ నేను ఆశ్చర్యపోతుండగానే సంభాషణ ప్రారంభమయింది. చాలా మామూలుగా అమ్మ మాట్లాడు తున్నది. ఈసారి నాకు ఆశ్చర్యం కలుగలేదు భయమేసింది. కారణం - ఆ వచ్చిన నా స్నేహితులు నన్ను అపార్థం చేసుకుంటారేమో నని. అమ్మ అనారోగ్యంగా ఉన్నదని నేను అసత్యమాడా ననుకుంటారేమో నని.

ఇటువంటి సంఘటనలు అసంఖ్యాకంగా ఉన్నయ్ !

నాన్నగారు చెప్పినట్లు అమ్మ తన బాధలను చిలుక కొయ్యకు తగిలించటమే నిజమయితే - మంచిదే. కాని అమ్మవాక్యం ప్రకారం అమ్మ తన బాధలను దాచుకోవటమే అయితే, అది అమ్మకు బాధ కాకపోవచ్చును కానీ మనకు బాధాకరమే

ఇటీవల 17వ తేదీన బాపట్ల ఆదాయపు పన్ను అధికారి శ్రీ వెంకటేశ్వర్లుగారు అమ్మను దర్శించుకుని అమ్మను అడిగారు "అమ్మా ! నా అర్హతబట్టి నాకు జీవితాన్ని ప్రసాదించు - అది సుఖంకానీ, కష్టంగానీ కష్టాలూ, బాధలూ వద్దు - అననుగానీ అవి ప్రసాదించినప్పుడు వాటిని హాయిగా భరించే శక్తికూడా యివ్వు" అని వెంటనే అమ్మ అన్నారు "హాయిగా భరించేటప్పుడు అవి కష్టాలూ, బాధలూ ఎట్లా అనిపించు కుంటయ్ నాన్నా?" అని.

అందుకనే అమ్మ అన్నారు "ఇష్టం లేనిదే కష్టం" అని, 'భరించలేనిదే బాధ' అనీ

ఏ మనిషి జీవితంలో నయినా అన్నీ యిష్టమైనవే రావు; అన్నీ యిష్టం లేనివే జరగవు అన్నీ భరించగలిగిన సంఘటనలే వుండవు; భరించకనూ తప్పదు అనుకున్నవి జరగవు; తనకున్నవి తప్పవు. ఈ ద్వంద్వాల్లో సమానస్థితియే మానవునకు ఆదర్శం. ఈ ఆదర్శాన్ని లోకానికి ఆచరణాత్మకంగా ప్రబోధిస్తున్నది అమ్మ. ఈ స్థితికే అమ్మ సహజ సమాధి అని నామకరణం చేసింది ఈ స్థితి అమ్మలో మనం గుర్తించలేనంతగా సహజమైపోయింది.

కానీ - ఏది ఏమైనా మనకు పాఠంచెప్పటం కోసం అమ్మ అసామాన్యమయిన బాధలకు గురికావటం మనం సహించలేని విషయం. డాక్టర్ సుబ్బారావుగారు చెప్పినట్లు - అమ్మ శరీరంపై మందులకంటే అమ్మ మనస్సుకే అత్యంతమయిన ప్రభావం ఉండటం నిర్వివాదం.

కనుకనే - యీ 55వ జన్మదిన మహోత్సవం పురస్కరించుకుని - అమ్మ బిడ్డలమయిన మన మందరం సాగిలబడి అమ్మను అర్థిద్దాము - 'అమ్మా, నీ ఆరోగ్యాన్ని బాగుచేసుకో. నీకోసం కాకపోయినా మాకోసం నువ్వు ఆరోగ్యంగా ఉండు. నువ్వు ఇంకా వెయ్యేళ్ళు చల్లగా ఉండు. నీ చల్లని ఒడిలో మమ్మల్ని హాయిగా ఆదమరచి ఆడుకోనీ...." అని.

అమ్మ బహుసంతానవతే కాదు; సంతాన ప్రియ.

మా అమ్మ 'ఎంతో' మంచిది ! బిడ్డల కోరికను మన్నిస్తుంది !!

(మార్చి 1977)



# 119
# "తపించాడు, తరించాడు"

పుట్టినవాడెల్లా మరణించవలసిందే ఇది అందరికీ తెలిసిన సత్యమే అయినా సాధారణంగా ప్రతి మరణమూ దుఃఖానికి కారణం అవుతూనే ఉంటుంది అయితే, మృతుని వ్యక్తిత్వాన్ని అనుసరించి దుఃఖ తీవ్రతా, దుఃఖితుల సంఖ్యా మారుతూ ఉంటాయి

ఏప్రిల్ 2వ తేదీన డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, మరణించారు. దేశంలో అనేకులు - యీ వార్త విని తీవ్ర సంతాపాన్ని అనుభవించారు

వారి మరణం వారి కుటుంబానికి ఆశనిపాతమే. అది వారిలో కార్చిచ్చులాంటి ఆవేదనకు కారణం కాక తప్పదు. ఇక బంధువు లందరికీ - వారి వారి అనుబంధాన్ని బట్టి మనఃక్లేశాన్ని కలిగించితీరుతుంది. కాని దేశంలో యింకా ఎందరికో, ముఖ్యంగా విద్యాధికులెందరికో వారు సుపరిచితులు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి అనేక రంగాల్లో తీవ్రంగా కృషిచేసి ఘనవిజయాలు సాధించారు. వారి తత్వమే అంత ! ఎందులోనైనా అంటీ అంటకుండా ఉండే స్వభావం కాదు. ఎందులో అడుగు పెట్టినప్పటికీ అక్కడ అడుగు చూడవలసినదే , శిఖరాగ్రం అధిరోహించవలసినదే.

వారు భౌతికశాస్త్రంలో డాక్టరేటు పొందినప్పటికీ - సాహిత్యంలో, సంగీతంలో, శిల్పకళలో, చారిత్రిక పరిశోధనలో విశేష పరిశ్రమచేసి అపూర్వమైన సత్యాలను లోకానికి వెల్లడి చేశారు ఏ విషయంలోనైనా పరిశోధన చేయడంలో సత్యాన్ని ఆవిష్కరించడంలో ఎంతటి మేధా సంపన్నులో - ఆ విషయాన్ని వ్యాసాలరూపంలో, గ్రంధరూపంలో ఉపన్యాసరూపంలో, సోదర ప్రజానీకానికి అందించి, వారిని అంగీకరించి చేయడంలోకూడ అంతటి విశేష ప్రతిభావంతులు. కనుకనే అనేక రంగాల్లో కృషిచేసే విద్యావంతులందరూ వారి మరణానికి కన్నీరు కార్చారు

వారితో పరిచయం ఉన్న అందరూ ఆశ్చర్యపడేటట్లు వారి జీవిత ఉత్తర భాగంలో అనూహ్యమైన పరిణామం జరిగింది అదే వారికి అమ్మదర్శన ప్రాప్తి.

1964 డిసెంబరులో - అప్పట్లో వారు బాపట్ల కాలేజిలో ప్రిన్సిపాల్‌గా పని చేస్తుండేవారు - 6వ తేదీన జిల్లెళ్ళమూడి వచ్చారు - నెల్లూరులోని వారి స్నేహితులు

శ్రీ పద్మాజీ ప్రోత్సాహ, ప్రోద్బలాలతో, అదీ - ఇంతమంది దైవమని ఆరాధించే అమ్మ అంటే ఎవరో, ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలంతో మాత్రమే.

వచ్చారు, అమ్మను చూచారు. అమ్మలో - మరెక్కడా ఎవరిలోనూ చూడని 'ప్రశాంతి'ని చూచారు ఈ 'ప్రశాంతి'ని గురించే వారు తర్వాత అనేక వ్యాసాల్లో, ఉపన్యాసాల్లో ఉద్ఘాటించారు. కానీ అమ్మ-తానే దైవంగా-పూజ లందుకోవటం వారికి అర్థం కాలేదు. ఈ విషయాన్నే తెలియజేస్తూ - వారు వారి స్నేహితులు శ్రీ పద్మాజీకి ఉత్తరం వ్రాసి దానిని ముందున్న టేబిల్‌పై విసురుతుండగా - "ఆఁ - ఏమంటున్నావ్?" అన్న ప్రశ్న వినిపించింది ఆ కంఠం మృదువుగానే ఉన్నప్పటికీ - అత్యంత స్పుటంగా ఉన్నదట. ఆ గొంతు తనలో నుండే వినిపించిందో, బయటినుంచే వినిపించిందో వివరంగా చెప్పలేను - అనేవారు. వారు ఆశ్చర్యంగానూ, కొంచెం భయంగానూ - ఆ టేబిల్‌పై చూచేసరికి - ఆ టేబిల్ క్లాత్‌పై సిరామరక రూపంలో - అమ్మ అసందిగ్ధంగా కనుపించింది. ఆ మరక కొన్ని రోజుల క్రిందటే - అక్కడ సిరా ఒలికి పడినది కాని అది యిప్పుడు - ఏమీ తేడా లేకుండా - అమ్మ రూపంలో దర్శనం యిచ్చింది. పైగా - ఆ బొమ్మకు భ్రుకుటిలో కుంకుమ ఉన్నది. అది కుంకుమేనా - అని సందేహంతో ఊదేసరికి - గాలికి పోయిందట.

వారికి ఆ క్షణంలో అనిపించిందట - తాను జిల్లెళ్ళమూడికి పోకముందే - అమ్మ తమ ఇంటికి వచ్చి సుప్రతిష్ఠిత అయిందీ అనీ, అమ్మే తనను జిల్లెళ్ళమూడికి చెయ్యి పట్టుకుని తీసుకు వెళ్ళింది - అనీ, అమ్మే తనదారిని మళ్ళించింది అని

అప్పటికే మేము ప్రతి సంవత్సరమూ - అమ్మ జన్మదిన మహోత్సవానికి అభినందన సంచికను ప్రచురిస్తున్నాము. 1965 ఏప్రిల్‌లో సమర్పించే సంచికలో వివిధ రచయితలనుండి వ్యాసాలను కోరుతూ - శ్రీపాదవారికి ఉత్తరం వ్రాశాము - వారు రచయితగా లబ్ధ ప్రతిష్ఠులు గనుక. కానీ - ఒక్కసారి అమ్మను చూచినంత మాత్రాన అలా మేము ఉత్తరం వ్రాయటం వారికి ఉచితంగా తోచ లేదు. వెంటనే బయలు దేరి జిల్లెళ్ళమూడి వచ్చారు.

వారు వచ్చేసరికి 'అమ్మదర్శనం' జరుగుతున్నది నేను అమ్మ కుర్చీ ప్రక్కనే క్రింద కూర్చుని ఉన్నాను. వారు రాగానే మాకు అల్లంత దూరంలో శ్రీ సాగర్‌గారితో యీ విషయమే మాట్లాడుతున్నారు. పూజ లందుకుంటున్న అమ్మ నన్ను ఉద్దేశించి - గోపాల కృష్ణమూర్తిగారిని చూపించి - 'వారికి మీ ఉత్తరం బాధ కలిగించి నట్లున్నది - నీవెళ్ళి వారితో మాట్లాడి, రా -' అని చెప్పింది ఆ ఉత్తరం వారికి బాధ కలిగిస్తుందని ఊహించని నాకు అమ్మమాటలు అర్థం కాలేదు. అమ్మతోగల చనువుకొద్దీ - 'అమ్మా - నువ్వు పొరబడుతున్నావేమో..'' అన్నాను. కానీ అమ్మ నన్ను వెళ్ళి మాట్లాడిరమ్మని శాసించింది. నేను వెళ్ళి కనుక్కున్నాను. అమ్మ

చెప్పింది నూటికి నూరుపాళ్ళూ సత్యం. నాకు ఆశ్చర్యం కలిగింది. నేనూ, అమ్మా వారికి సమాన దూరంలోనే ఉన్నాము. అయినా వారి మాటలు అమ్మకు అర్థమైనాయి, నాకు కాలేదు. నేను యీ విషయం వారితో చెప్పాను. అమ్మను గురించి తెలుసుకుందామని వారిలో ఉత్కంఠ బలీయంగా ఉత్పన్నమయింది తర్వాత అమ్మతో మాట్లాడారు ·

అప్పటికే-అమ్మదినచర్యను రికార్డుచేసే పవిత్ర కార్యక్రమం ప్రారంభమయింది. సోదరి భవానీ అనుక్షణం అమ్మతో ఉండి - అమ్మ ఏమి చేసినా, ఎవరితో ఏమి మాట్లాడినా - అంతా గ్రంథస్థంచేసేది. వాటిని చూడమని అమ్మ సలహా యిచ్చింది

వారు వాటిని చదవటం మొదలు పెట్టారు. ముందు సాధారణ గ్రంథాలవలే పఠించారు తర్వాత శాస్త్రాల వలే పరిశీలించారు తర్వాత ఉపనిషత్తుల వలే అధ్యయనం చేశారు. ఆ అధ్యయనమే వారిలో బ్రహ్మాండమైన పరిణామం తీసుకు వచ్చింది. బహుమేధావి అయిన వారి నిశితబుద్ధికి అమ్మ అప్పుడప్పుడు వెలిబుచ్చిన సూక్తులలో, సందేశాలలో, సిద్ధాంతాలలో విలక్షణత, విశిష్టత వినూత్నత, గోచరించాయి. అమ్మ వ్యక్తిత్వమూ, అమ్మ వాక్యాలూ వారిని ఆకట్టుకున్నాయి. అమ్మవాక్యాలలో అంతటా అత్యున్నతమైన అద్వైతమూ, దాన్ని పొందేందుకు అధునాతనమైన మార్గమూ కనుపించాయి. వారికి దొరకంది ఏదో దొరుకుతున్నట్లుగా, అందనిదేదో అతి సమీపంలోకి వచ్చినట్లుగా తోచింది

కనుకనే ఒకచోట - 'బ్రహ్మము గురించి ఇంద్రునికి ఉమాహైమవతి చెప్పింది. ఐతరేయ మహిదాసుకు దయామయి భూదేవి చెప్పింది. ప్రాయోపవేశము చేసిన ఉపకోసలుడికి అగ్నులు ఉపదేశించాయి. నాకు అమ్మవాక్కు లుపదేశించాయి..." అని చెప్పుకున్నారు.

అమ్మవాక్కుల్లోని ప్రత్యేకతయే శ్రీపాదను అమ్మకు సన్నిహితుణ్ణి చేసింది. వారు క్రమేణా జిల్లెళ్ళమూడి రావటం అధికం చేశారు. అమ్మవాక్కులను అధ్యయనం చేయడమేకాక అమ్మ జీవితాన్ని కూడా తెలుసుకోవడం మొదలు పెట్టిన తర్వాత - వారి హృదయంలో అమ్మ మేరుపర్వత శిఖరాగ్రం యెక్కి కూర్చున్నది. అమ్మ జీవితంలోని ప్రతి సంఘటన వారి మనస్సుపై చెరగని ముద్రను వేసింది. అమ్మ పలికే ప్రతి అక్షరమూ వారి పదునైన మేధకు మరింత పదునుబెట్టింది. దానితో అమ్మయెడల వారికి పూజ్యభావమూ. అమ్మ అలౌకిక శక్తియెడల విశ్వాసమూ, అమ్మ బోధలయెడల గౌరవమూ కలిగాయి. అమ్మ మంచితనం చూచి నిలువలెల్లా కరిగిపోయేవారు. లోకంలోని ప్రతిజీవిపట్ల అమ్మచూపే కరుణనూ, వాత్సల్యాన్నీ చూచి పులకించిపోయేవారు. అమ్మ అద్వైత సిద్ధికి ఆశ్చర్యచకితులయ్యేవారు.

అమ్మకు గల భాషా సౌందర్యానికి భావనా పటిమకూ సమ్ముగ్ధులయ్యేవారు అమ్మకు గల జ్ఞాపకశక్తికి అబ్బురపడేవారు అమ్మను పరిపూర్ణ మానవిగా పరిగణించేవారు.

అందువల్లనే ఒకసారి వారు అమ్మతో "అమ్మకి తానే అయి ఉండడానికంటే లోకంవైపు చూడడానికి ఎక్కువ కాలం ఖర్చు అవుతున్నదమ్మా" అంటే అమ్మ వెంటనే అన్నది "ఈ వ్యాపారంలో లాభ నష్టాలు లేవు నాన్నా' అని తానే అయి ఉండడమూ, లోకంవైపు చూడడమూ రెండూ ఒకటే అమ్మకు. ఇది 'సహజస్థితి'. ఈ సర్వ సమానస్థితినే అమ్మ "సహజ సమాధి' అన్నది. అమ్మకుగల యీ 'స్థితే' శ్రీపాదవారిని జిల్లెళ్ళమూడికి బంధించివేసింది. ఈ స్థితిలో నుండి అమ్మ ప్రవచించే ప్రతిమాటా వారికి సమగ్రంగా తోచింది.

అమ్మ పరిచయంతో వారిలో గల ఆధ్యాత్మిక చింతన మూడు పువ్వులూ, ఆరుకాయలుగా వర్ధిల్లితే - అమ్మబోధ వారిని తాత్త్విక తులనాత్మక పరిశీలనకు పురిగొల్పింది.

అమ్మను దర్శించిన తర్వాత వారు అనేక మహాపురుషులను కలుసుకొన్నారు, వారి మాటలు విన్నారు. అనేక గ్రంథాలు చదివారు ఉపనిషత్తులను చదివారు. అవతార వ్యక్తుల జీవితాలు చదివారు. వారి బోధలు చదివారు. ఎక్కడా అమ్మలోని పరిపూర్ణత వారికి కనుపించలేదు ఎక్కడా అమ్మవాక్కుల్లోని నిండుదనం వినిపించ లేదు

అందువల్లనే వారు - "పూర్ణచంద్రుణ్ణి చూడాలంటే మీరు జిల్లెళ్ళమూడి వెళ్ళవలసిందే. మరెక్కడైనా మీరు చంద్రవంకలను మాత్రమే చూడగలరు" అనేవారు.

అమ్మవాక్యాలలోని నిండుదనానికీ, నవ్యతకూ మురిసి పోయి - వాటిని అనేక గ్రంథాలుగా సంకలనం చేయడమే కాక అనేక ఉపన్యాసాల ద్వారా లక్షలాది ప్రజానీకానికి అందించారు. అందుకు తమ జీవితమే అంకితం చేశారు నిరంతరం అమ్మ బోధలను అధ్యయనం చేయడమూ, వానిలోని విశిష్టతకు తాను ముగ్ధుడు కావడమూ, వానిని యితర శాస్త్ర గ్రంథాలతో తులనాత్మక పరిశీలన చేయడమూ, అన్నిటికంటే యివి 'నిండు'గా ఉన్నాయని లోకానికి అనేక రీతుల్లో తెలియ జేయడమే వారు ఏకైక లక్ష్యంగా చేపట్టారు. దానినే వారు ఆధ్యాత్మిక సాధనగా తపస్సుగా భావించారు. ఏ కర్మకాండలు లేకున్నా - యీ విచారణ (ఆలోచన) మార్గాన గమ్యాన్ని చేరాలనీ, సిద్ధిని పొందాలనీ దృఢసంకల్పంతో కృషి చేశారు. వారి స్థిర విశ్వాసాన్ని అమ్మ ఆశీర్వదించింది

కనుకనే వారిని గురించి ప్రస్తావిస్తూ "తపించాడు; తరించాడు; తానంతా అమ్మే అయినాడు" అని అమ్మ వివరించింది.

వారు రాజమండ్రిలో అనువులు కోల్పోయినా వారి మృతదేహం జిల్లెళ్ళమూడికి తీసుకు రాబడింది ముద్దుబిడ్డ మరణానికి అమ్మ ఎంత విలపించిందో వివరించలేము అమ్మ కార్చిన కన్నీటికి అంచనా లేదు చివరసారిగా ఆ శరీరాన్ని స్వహస్తాలతో స్నానం చేయించిందీ, అలంకరించింది. అంతిమయాత్రకు శరీరం కదులుతుండగా తనువెల్లా వాత్సల్యమై కన్నీటివాగులతో ఆ కళేబరాన్ని ముద్దుపెట్టుకున్న అమ్మను చూస్తే - ఏ గుండె అయినా కరగక తప్పదు.

సంప్రదాయాలకు అతీతంగా - తన తండ్రికి తానేమీ సేవ చేసుకొనలేక పోయానని విలపించే శ్రీమతి గాయత్రికి - కర్మాధికారం ప్రసాదించి, తనయులు లేకపోయినా, తండ్రిచితికి నిప్పు అంటించే అవకాశమూ, అధికారమూ కూతురికైనా ఉన్నదని అమ్మ క్రియాత్మకంగా చెప్పింది.

14వ తేదీన జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిలో శ్రీపాద సంస్మరణ సభ జరిగింది. వారి ఆత్మ శాంతికి అందరూ అశ్రుతర్పణ చేశారు వారికి అత్యంత సన్నిహితులూ, ప్రీతిపాత్రులూ అయిన వీరమాచనేని ప్రసాదరావు ఒక ముఖ్యమైన సూచనచేశారు. వారు ఒక బృహత్తర కార్యక్రమం చేపట్టి - ఆ పవిత్ర కార్యక్రమంలోనే అసువులు విడిచారు కనుక - ఆ కార్యక్రమాన్ని మనం కొనసాగించడమే వారికి మనం చూపగల కృతజ్ఞత అన్నారు అదే వారికి నిజమైన శ్రద్ధాంజలి అన్నారు. అందుకు జిల్లెళ్ళమూడిలో ఒక పరిశోధనాలయం నిర్మించాలని, దానికి "మాతృశ్రీ పరిశోధనాలయం" అని పేరుపెట్టాలనీ, విద్వద్వరులయిన తాత్వికులూ, వేదాంతులూ అందులో నిరంతర కృషిచేస్తూ - ఆధ్యాత్మిక పరమైన అమూల్య సత్యాలను కనుగొనడమే కాక, అమ్మ సిద్ధాంతంలోని ప్రత్యేకతనూ, నిండుదనాన్నీ అన్ని భాషల్లోనూ వ్యాప్తి చేయాలన్నారు. అది లోకమంతటికి ఆధ్యాత్మిక కేంద్రం కావాలన్నారు. అమ్మ ఆ సూచనను అంగీకరించి ఆశీర్వదించింది

శ్రీపాదవారు ఇతరులకు ఆచార్యులయినా, అమ్మపాదాల చెంత నిత్య విద్యార్థి. అమ్మను గురించి అంత తెలుసుకుని, ఇతరులకు వివరించీ "నిన్నెరుగుదునని అనుటకు దమ్ములేదు" అన్న పరమ వినయశీలి ఎందరికో శాస్త్రజ్ఞులుగా, మేధావిగా, రచయితగా, విమర్శకులుగా, వక్తగా పరిచయమేగానీ కొందరికి మాత్రమే వారి రాగ హృదయం, ధార్మికజీవనం, ఉత్తమోత్తమ ఉన్నత వ్యక్తిత్వం తెలుసును. వారు మనందరికి అగ్రజులే కాదు, ఆదర్శమూర్తికూడా వారు మన మధ్య లేని లోటు ఎవరూ తీర్చలేనిది. సోదరులందరి పక్షాన వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

(ఏప్రిల్ 1977)



# 120
# "తప్పొప్పుల పట్టిక నా వద్ద లేదు"

"అమ్మా! పెద్ద తప్పు చేశానమ్మా. అప్పటి నుండి మనస్సుకు శాంతి లేదు. ప్రభుత్వపు చట్టానికి అందే తప్పు అయితే కోర్టు విచారించేదీ; శిక్ష విధించేదీ. దానితో సరిపోయేదీ...."

అమ్మ మౌనంగా వింటున్నది. చుట్టూరా ఎంతోమంది కూర్చున్నారు. "ఇది అట్లాంటి తప్పు కాదమ్మా - నేను నోరు తెరచి ఎవరికీ చెప్పుకోలేను. అది నిరంతరం నన్ను వెంటాడుతున్నది. ఆ జ్ఞాపకం నాలో ఆరని కాష్టమై నన్ను నిలువెల్లా కాల్చివేస్తున్నది".

అతని గొంతు వణికింది. అతని కళ్ళు కాలువలు గట్టినయ్. అప్పటిదాకా చుట్టూ కూర్చున్న జనాన్ని చూచి సిగ్గుపడుతున్నవాడు అభిమానం విడిచి వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు.

అమ్మ అతనిని దగ్గరకు పిలిచింది. అతడు దగ్గరకు జరిగి అమ్మ ఒడిలో వాలిపోయాడు.

సర్వశాస్త్రాలు మనిషి ప్రవర్తనను రెండుగా విభజించాయి - మంచిపనులనీ, చెడ్డపనులనీ, మంచిపనులకు పుణ్యకార్యాలనీ, చెడ్డపనులకు పాపకార్యాలనీ మతాలు నామకరణంచేసి - పుణ్యకార్యాలకు ఫలితం స్వర్గసుఖాలనీ, పాపకార్యాలకు పర్యవసానం నరకయాతన అనీ నిర్దేశించినయ్.

మనిషికి గల ప్రకృతి సహజమైన బలహీనతతో ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాడూ ఏదో ఒక తప్పు చేయకపోడు అందుకు ఫలితంగా అతడు ఆమరణాంతం - మరణానంతరం అనుభవించబోయే నరక యాతనలను ఊహించుకుని దహించుక పోక తప్పదు. ఈ భయంతో నిత్యజీవితంలో అనేక విధాల కృంగిపోతూ జీవితమంతా నిరాశానిస్పృహలతో నిస్సారం చేసుకోవడమే కాక బ్రతుకును చితిపై కెక్కించి నిప్పంటించుకొనే వారెందరో ఉన్నారు అటువంటి సోదరీ సోదరులెందరో అమ్మవద్దకు వచ్చి పశ్చాత్తాపంతో అమ్మచరణాలపై వాలిపోతారు.

అమ్మకు అందరి బిడ్డలపై అనురాగమే అయినా, 'పతితులం' అని వాపోయేవారి యెడల, సమాజం దృష్టిలో, శాస్త్రందృష్టిలో "పాపులు' అని ముద్ర వేయబడిన వారి యెడల అనురాగమూ, అనుకంపా అధికం. అందుకనే అమ్మ "మంచివాళ్ళను లోకమెలాగూ మెచ్చుకుంటుందీ, ప్రేమిస్తుందీ, గౌరవిస్తుందీ. వాళ్ళ మంచితనమే వారిని కాపాడుతుంది. కానీ చెడ్డవాళ్ళనబడే వాళ్ళను నేను కూడా దగ్గరకు తీయకపోతే ఎట్లా ? వాళ్ళకు నా ఒడిలో ఎప్పుడూ చోటుంటుంది. వాళ్ళ కన్నీటిని తుడవటంలోనే యీ చేతులకు సార్థకత.." అని అనేక పర్యాయాలు చెప్పింది.

వట్టి మాటలు చెప్పడం, ఓదార్చడం మాత్రమే కాదు ఎంతో ఘోరమైన తప్పిదాలను చేసినవారినికూడ అపారమైన దయతో క్షమించి వారికి దుఃఖ నివారణనూ, నిర్మలమైన మనస్సునూ, నిండైన జీవితాన్నీ అమ్మ ప్రసాదించిన ఘట్టా లనేక మున్నాయి.

తప్పు అన్నా పాపం అన్నా యితరులకు బాధను కలిగించడమే కదా. ఇతరులకు బాధను కలిగించినవారిని, అదీ హత్య చేసిన వారిని అయినా మనమూ క్షమించ వచ్చునూ, సహించవచ్చునూ. కానీ మనపై కాలు దువ్విన వారినీ, మనపై కత్తి నెత్తిన వారినే కాదు మనను కటువుగా ఒక్కమాట అన్నవారినే మనం సహించలేము. అమ్మ తనను హింసించినవారినీ, తనకు ద్రోహం చేసినవారినికూడా నిరవధిక ప్రేమతో కరుణతో క్షమించిన సంఘటనలను మనం కళ్ళారా చూసి నప్పుడు, ఆ అసాధారణ మనస్తత్వానికి విభ్రాంతులం కావడమే కాదు, ఆ అత్యున్నత మైన వ్యక్తిత్వానికి వినమ్రులమై అంజలిఘటిస్తాము.

అమ్మయౌవనంలో అమ్మ స్త్రీత్వాన్నే మలినపరచటానికి ఉద్యమించిన కీచకుడొకడు యిటీవల అమ్మపాదాల నాశ్రయించాడు. అమ్మ అతనిని ఆప్తునివలే దగ్గరకు తీసుకుని అతని కన్నీళ్ళు తుడిచి, అతనికీ పసిబిడ్డకువలే నోట్లో అన్నంపెట్టి, బంధువుకువలే, నూతన వస్త్రాలను బహూకరించింది.

మారణాయుధాలతో తన యింటిపై దాడిచేసి, ఎందరిపైననో హత్యాప్రయత్నం చేసి, గాయపరచి యింట్లోని సొమ్మునంతనూ అపహరించి, ఆకాశచుంబితమైన తన కీర్తిపతాకను భూపతనం చేయటానికి కక్షతో పూనుకున్న దుండగులను పోలీసులు పట్టుకుని తన ఎదుటకు తీసుకువస్తే యితరులైతే సామాన్యంగా ఏం చేస్తారు ? వారిపై ప్రతీకారం తీర్చుకుంటారు; లేకపోతే తీర్చుకోవటానికి ప్రయత్నిస్తారు కానీ, అమ్మ ఏం చేసిందీ ? ముందుగా వాడికి కాఫీ ఇవ్వండి కడుపు నిండా అన్నం పెట్టండి అని ఆదేశించింది.

తనపై కత్తిదూసిన వాడిని కూడా "వాడూ నాబిడ్డే -" అని అమ్మ మాత్రమే అనగలుగుతుంది. అందుకే అమ్మ అందరికీ అమ్మ అయింది. ఆ అమ్మ "తల్లికి తప్పే కనుపించదు" అని ఉద్ఘాటించింది.

అమ్మ దృష్టిలో - మనిషి ఏ పనిచేసినా, అందుకు మూలం అతనిలోని ప్రేరణ మాత్రమే. ఆ ప్రేరణ విధిచోదితం. కనుక మనిషి చర్యలకు మనిషి బాధ్యుడు కాడు మంచిచేసినా, చెడ్డచేసినా మనిషి కర్తకాదు. అతనికి కర్తృత్వం లేదు. అతనికి ప్రేరణ ఇచ్చిన దైవమే కర్త. కనుక మనిషి మంచిపని చేస్తే అతడిని పొగడనవసరం లేదు; చెడ్డపని చేస్తే తెగడనవసరంలేదు. "నా దృష్టిలో పాపపుణ్యాలనేవే లేవు. పాపమనేది ఏమైనా ఉంటే - భగవంతుడంత పాపిష్టి లేడు. అందుకు శిక్ష ఏమైనా ఉంటే - అది వాడికే వేయాలి..." అంటుంది అమ్మ.

"కొట్టి తిట్టీ నన్ను ఏడిపించలేరు. మీ మంచినతమే నన్ను ఏడిపిస్తుంది -" అని చెప్పిన అమ్మ బిడ్డలోని మంచితనానికి తాను కరిగిపోతూ, తమ చెడ్డ తనానికి కుమిలిపోయే బిడ్డలకు నిష్కృతిని ప్రసాదించడమే కాక, వారిని ఓదారుస్తూ, లాలిస్తూ వారివెంట తానూ నడుస్తూ వారినీ మంచిదారుల నడుపుతుంది. మంచి చెడ్డలు రెండూ ఒకదాని కొకటి వైరుధ్యం కావు; సృష్టి వైవిధ్యానికి చిహ్నాలు మాత్రమేననీ రెండూ ఉన్నప్పుడే సృష్టి పరిపూర్ణ మవుతుందనీ వివరిస్తుంది.

(మే 1977)



## విచక్షణ లేని వీక్షణ

మీకు డబ్బున్నది గనుక (మావూరు రమ్మని) అడగ్గలుగుతున్నారు. కారున్నది కనుక కారుమీద తీసుకెళతా మంటున్నారు. కానీ - డబ్బులేనివాడు అడుగ లేడుకదా - నాకు ప్రతివాడి దగ్గరికీ వెళ్ళాలని ఉంటుంది. ఉన్నవాడు కార్లలో తీసుకెళ్ళొచ్చు. గాలి గదుల్లో ఉంచొచ్చు. కానీ లేనివారు మనం అమ్మకు అన్ని సౌకర్యాలు చెయ్యలేం కదా అని నన్ను రమ్మని అడగలేరు. నేను అటువంటి వారి యిళ్ళకున్కూడా వెళ్ళ గలిగినాడు బయలుదేర్తాను.

- అమ్మ

# 121
# ప్రాప్తకాముడు

1971 జనవరి 24వ తేదీ గుంటూరు హిందూ కాలేజీ ఆవరణంలో అమ్మ దర్శనం ఏర్పాటు చేయబడింది. నిర్వాహకులు భద్రతకోసం పోలీసువారి సహాయం అర్థించారు. అందుకు పోలీసువారు యిద్దరు, ముగ్గురు పోలీసువారిని పంపించారు వారి ఉద్దేశం ఒక ఆధ్యాత్మిక వ్యక్తిని, అదీ, ఒక స్త్రీని చూడటానికి ఎంతమంది వస్తారులే - అని

దర్శన సమయం దగ్గరకు వచ్చింది. కాలేజీ ఆవరణం నిండిపోయింది ఎదురుగా ఉన్న రోడ్లపై, చెట్లపై, యితర భవనాలపై చివరకు విద్యుత్ స్తంభాలపై ఎక్కి కూర్చున్నారు జనం - అమ్మను చూడాలనే తీవ్రమైన ఆసక్తితో భద్రత ఏర్పాటు కోసం వచ్చిన పోలీసువారికి ఏమి చేయటానికి తోచలేదు వారు వారి ఆఫీసర్‌కు కబురు చేశారు. వెంటనే బయలుదేరి ఆయన వచ్చారు ఆయన ఆశ్చర్యానికి అవధుల్లేవు అదెక్కడి జనం ! ఒక ఆధ్యాత్మిక స్త్రీని చూడటానికి ఇంతమంది జనమా ? ఏమిటి ఆమెలోని యీ అత్యద్భుత ఆకర్షణ ?

ఆనాడు ఆయనకు అతికష్టంపై అమ్మదర్శనం అయినప్పటికీ - ఆయనభార్య ఆ జనాన్ని చూసి భయపడి అమ్మను దర్శనం చేసుకొనకనే ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. ఆయనే శ్రీ మరకాని సత్యనారాయణ గారు, డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్. ఆ డిపార్టుమెంట్‌లో ఎంతో సమర్థంగా ఉద్యోగంచేసి అందరి ప్రశంసాపాత్రమైనారు. నిజాయితీకి, ధైర్యానికి మారుపేరుగా మెలిగిన వ్యక్తి. తరువాత ఆ దంపతులు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మను చూచి, మాట్లాడి అమ్మ ప్రేమామృతాన్ని రుచి చూశారు. ప్రథమ దర్శనంలోనే అమ్మపై అంకురితమైన విశ్వాసం ఏర్పడింది. అందువల్లనే అమ్మపాదాలు పట్టుకుని "నేను సిన్నర్ నమ్మా! నన్ను దైవంకూడా క్షాళన చేయలేడు...." అని అమితంగా దుఃఖించారు. అమ్మ ఆయనను తన చల్లని ఒడిలోకి తీసుకుని అనేక విధాల ఓదార్చింది

ఒక రోజున ఆయనకు ఒక విచిత్రమైన కల వచ్చిందట. అది, ఆయన కందుకూరులో ఉద్యోగం చేసేకాలం. ఒక నేరస్తుణ్ని ఆయన చిత్రహింస పెడుతున్నాడు. సరిగ్గా ఆ సమయంలో అమ్మ ఆదారిన వచ్చి అక్కడ ఉన్న అందరినీ ఎంతో లాలనగా, ప్రేమగా పలకరిస్తున్నదిగానీ, తనవంక తలయెత్తి అయినా చూడలేదు. అది ఆయనకు ఎంతో అవమానకరమైనదట; బాధను కలిగించినదట.

ఇది కేవలం కలే. కానీ కలచెరిగిని తరువాతకూడా ఆయనకు ఆ బాధ తొలగలేదు వెంటనే అమ్మకు ఉత్తరం వ్రాసుకున్నారు - తనను క్షమించమని. అదే ఆయన జీవితంలో ఒక ముఖ్యమైన పరిణామాన్ని తీసుకు వచ్చింది. ఆ తర్వాత ఆయన ఎప్పుడూ, ఎటువంటి దోషినికూడా హింసించ లేదట. ఇతరులను ఏ మాత్రం బాధించినా తను సహించలేనని అమ్మ ఆ విధంగా తనకు పాఠం చెప్పిందని ఆయన నమ్మకం. ఇటీవల ఆయన ఉద్యోగ విరమణచేసిన తర్వాత జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిన స్థిరనివాసం ఏర్పరుచుకోవాలని ఆశించారు. కాని ఆయన అనారోగ్యం కారణంగానూ, కుటుంబపరిస్థితుల కారణంగానూ అది జరగలేదు.

ఇటీవల అమ్మను చూసిన ప్రతిసారీ "నాకు టిక్కెట్టు యిప్పించమ్మా" అని వేడుకోవటమే కాక అమ్మకు సన్నిహితులందరినీ "అమ్మకు చెప్పి నాకు టిక్కెట్టు యిప్పించరా...." అని ప్రాధేయపడే వారు కాలస్వరూపిణి అయిన అమ్మ ఆయన వేడికోలును కరుణతో విన్నది. అరవై సంవత్సరాలైనా నిండకుండానే జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించి - మే 25న విశాఖపట్నంలో ఆయనకన్ను మూశారు అమ్మపై అచంచలమైన విశ్వాసంకల వారి కుటుంబ సభ్యులందరికీ, మరింత ధైర్యాన్నీ స్థైర్యాన్నీ ప్రసాదించాలని అమ్మను అర్థిస్తున్నాము.

(జూన్ 1977)



## సమదర్శనం

కొట్టవలసివస్తే నేను శివలింగంతో కుంకుడుకాయలు కొడతాను.

- అమ్మ

# 122
# అందరికి అమ్మ

"అమ్మా - మీ కోడలును తీసుకువచ్చానమ్మా చూడు - నీకు నచ్చిందా ?" అని అడిగాడు మురళి అమ్మకు నమస్కారం చేస్తూ. ఈ నెల 6వ తేదీన.

మురళి ఎంతోకాలం నుంచి అమ్మవద్దకు వస్తున్న భక్తుడు. అతడంటే అమ్మకు ఎంతో ప్రేమ అతుడ యిటీవలనే పెండ్లి చేసుకోబోతూ, పెండ్లికి అమ్మను ఆహ్వానించాడు పెండ్లికి రావటం తనకు సంతోషమే నని చెబుతూ - రాలేని తన అనారోగ్య స్థితిని వ్యక్తం చేస్తూ - పెండ్లి చేసుకుని వధూవరు లిద్దరూ జిల్లెళ్లమూడి వచ్చి కనిపించి వెళితే తనకు ఆనందంగా ఉంటుందని సూచించింది అమ్మ.

మామూలుగానే పెండ్లిండ్ల రోజులలో అనేక నూతన వధూవరులు అమ్మవద్దకు వచ్చి ఆశీస్సులు పొందుతారు కొందరు పెండ్లికి ముందువచ్చి అమ్మకు పూజ చేసుకుని అమ్మచేత పెండ్లికూతురునూ, పెండ్లికొడుకునూ చేయించుకుంటారు. కొందరు పెండ్లిఅయిన తరువాత వచ్చి దంపతు లిద్దరూ కలిసి పూజ చేసుకుంటారు ఎలాగయినా పార్వతీదేవి అవతారమైన అమ్మను అర్చించుకుని తమకాపురం సుఖప్రదం కావాలని కోరుకుంటారు అందరూ.

ఇక, అమ్మయే రమ్మని కోరితే ఎవరు రాకుండా ఉండగలరు ? పెండ్లి చేసుకున్న మురళీ దంపతులు అమ్మ వద్దకు వచ్చారు. పెండ్లి కూతురు అదే మొదటిసారి అమ్మను చూడటం అయినందున అమ్మ వదన మండలంలో ప్రకాశించే ఉజ్జ్వలదీప్తిని కన్నార్పకుండా చూస్తున్నది. అమ్మకూడా తప్పిపోయిన తన బిడ్డ ఎన్నేళ్ళ తర్వాతనో తనవద్దకు వచ్చినట్లుగా ఆప్యాయంగా చూస్తున్నది.

తనమాట అమ్మ వినలేదు అనుకుని మురళీ మళ్ళీ అన్నాడు. "అమ్మా - మీ కోడలును తీసుకు వచ్చాను" అని. అమ్మ ఆ పెండ్లి కూతురుని ప్రేమగా తన దగ్గరకు తీసుకుంటూ "ఇది కోడలుకాదురా. నా కూతురే" అన్నది. అదే అమ్మ సాన్నిధ్యంలో అతివిచిత్రమైన విషయం ! తండ్రి కొడుకూ అమ్మదగ్గరకు వస్తే - అమ్మకు తండ్రి కొడుకే. కొడుకూ కొడుకే. తాతా, మనవడు వస్తే - అమ్మకు ఆ

తాతా కొడుకే: ఆ మనవడూ కొడుకే అత్తా కోడలు వస్తే - అమ్మకు అత్తా కూతురే, కోడలూ కూతురే భార్యా భర్తలు వస్తే - అమ్మకు భర్త కొడుకూ, భార్య కూతురూ, అమ్మను అందరూ 'అమ్మా' అనే పిలుస్తారు

ఇంకా విచిత్ర విషయం ఏమిటంటే - యితరుల విషయంలో సరే తన బంధువుల సంగతిలోనూ అంతే. అమ్మను బంధువులందరూ 'అమ్మా' అనే పిలుస్తారు తన తండ్రి 'అమ్మా' అనే పిలిచేవాడు ఇపుడు పినతల్లీ 'అమ్మా' అనే పిలుస్తుంది ఇతర సన్నిహిత బంధువు లందరూ 'అమ్మా' అనే పిలుస్తారు, అత్తగారూ 'అమ్మా' అనే పిలిచేది అమ్మ పెద్ద కుమార్డు సుబ్బారావు పెండ్లి అయినప్పుడు కోడలుకూడా 'అమ్మా' అనే పిలవటం మొదలు పెట్టింది. అనేకులు ఆ అమ్మాయి చేత 'అత్తయ్యా' అని పిలిపించాలని ప్రయత్నించారు. కాని ఆ అమ్మాయి ససేమిరా అంగీకరించలేదు. ఇపుడు కోడళ్ళిద్దరూ 'అమ్మా' అనే పిలుస్తారు. అందుకనే అమ్మ అన్నది, "నాకు ఎవరిని చూసినా - నా బిడ్డే అనిపిస్తుంది" అని. కనుకనే అమ్మను చూసిన ప్రతివారికి - అమ్మ తమ అమ్మే అనిపిస్తుంది భావనలో, ఆప్యాయతల్లోనే కాక ఎందరికో అమ్మ రూపురేఖల్లో కూడా తమ అమ్మనే తలపింపజేస్తూ ఉంటుంది.

ఇపుడు నాన్నాగారు మినహా అందరూ అమ్మను 'అమ్మా' అనే పిలుస్తారు. కాని అమ్మ ఒకసారి 'పవిత్రత'ను వివరిస్తూ, 'పంచభూతాలనూ జయించినదే పతివ్రత' అని నిర్వచిస్తూ "భర్తచేత కూడా 'అమ్మా' అని పిలిపించుకున్నప్పుడే ఆ స్థితికి పరాకాష్ఠ" అని ప్రవచించింది.

(జూలై 1977)



## గాడిపొయ్యి

ఈ యజ్ఞ గుండాలూ యాగ హోమాలూ కంటే నాకు గాడిపొయ్యే ముఖ్యం అనిపిస్తుంది. నేను ఏమయినా వెయ్యగలిగినా, వెయ్యవలసి వచ్చినా అది గాడి పొయ్యిలోనే వేసుకుంటాను.

నా ఆయుధాలు గిన్నెలూ గరిటెలే.

- అమ్మ

# 123
# మీరు తింటేనేను తిన్నట్లే




"మనిషికి అన్ని బాధలకంటే ఆకలిబాధే ఎక్కువ అనిపిస్తుంది నాకు" ఇది అమ్మ పలికిన వాక్యం ఇంత ధైర్యంగా పూర్వం ఏ ఆధ్యాత్మిక వ్యక్తి ప్రవచించలేదు మనిషికి తప్పనిసరి అవసరాలలో మొట్టమొదటిది ఆహారమే. ఈ ఆహారమే లోపిస్తే మనిషికి మనుగడే లేదు ఈ ఆహార సంపాదనకోసమే మనిషి అహర్నిశం పరిశ్రమ చేస్తున్నాడూ. తన మేధాసంపదను ఉపయోగిస్తున్నాడూ; తన యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నాడూ అందుకే 'కోటి విద్యలూ కూటికొరకే' అనే నానుడి ఏర్పడింది అన్నంనుండే రక్తం పుడుతుంది రక్తమే మనిషిశక్తికి మూలధారం. అందుకే అమ్మ రక్తమంతా ఈశ్వర తత్వమే - నన్నది. ఒక్క మనిషి కేమిటి సర్వప్రాణికోటి జీవనానికి అన్నమే ఆలంబం అందుకే మన మహర్షులు అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపంగా అభివర్ణించారు సృష్టి యావత్తులోనూ అన్నానికి, అమ్మకూ బలమైన అవినాభావ సంబంధం మనకు గోచరిస్తుంది. పశువులు, పక్షులు, మనుషులు ... అందరికీ పుట్టగానే ఆహారం తల్లి నుండే లభిస్తుంది. తన రక్త మాంసాలనే ఆహారంగా మార్చి బిడ్డకు అందివ్వడం తల్లికెంత ముదావహమో చెప్పలేము.

బాల్యంలో పిల్లల ఆహారబాధ్యత తల్లే తీసుకుంటుంది. పశుపక్ష్యాదుల్లో అయితే పిల్లలు పెద్దవి కాగానే అవి స్వతంత్రంగా జీవిస్తాయి. కాని మనుషుల్లో మాత్రం పిల్లల వయస్సుతో సంబంధం లేకుండానే సంతానం ఆహారవిషయంలో తల్లే బాధ్యత తీసుకుంటుందీ, అత్యంత శ్రద్ధవహిస్తుందీ బిడ్డ ఆకలి తల్లికి తెలిసినట్లు బిడ్డక్కూడా తెలియదనటం అత్యుక్తికాదు కనుకనే 'తల్లి కడుపు తడుము తుందీ, భార్య జేబు తడుముతుందీ ....' అన్న సామెత ఏర్పడింది.

జిల్లెళ్ళమూడి వచ్చిన ప్రతివారూ అమ్మవద్దకు రాగానే వారికి అమ్మ నుండి వినిపించే మొదటి ప్రశ్న 'అన్నం తిన్నావా నాన్నా?" అని. తిని వచ్చామంటే "ఇది అమ్మ ప్రసాదం కదా - కొద్దిగానయినా తిని రా-" అంటుంది. తినలేదంటే వెంటనే

వారిని "అన్నం తిని రా నాన్నా-" అని ఆదేశిస్తుంది కొందరికి యిది బాధగాకూడా ఉంటుంది. వాళ్ళు ఎన్నాళ్ళుగానో అనుకునీ అనుకునీ అమ్మను చూట్టానికి వస్తారు. కొందరు ఎన్నో సమస్యలను మూటకట్టుకుని అమ్మకు విన్నవించుకోవాలని వస్తారు కొందరు ఎంతో దుఃఖభారంతో - అమ్మ ఒడిలో వాలిపోయి ఉపశమనం పొందాలని - వస్తారు. అమ్మ అవేమీ పట్టించుకోకుండా వారిని ముందుగా అన్నం తిని రమ్మని తరుముతుంది. కానీ తమాషా ఏమిటంటే - వారికి అమ్మ ఆదేశంలోని అంతరార్థం అవగాహన కాకపోయినప్పటికీ - తృప్తిగా భోజనంచేసి బయటకు వచ్చేసరికి వారికెంతో హాయిగా ఉంటుంది. తర్వాత కొన్నాళ్ళకు - వారిని ఎన్నేళ్ళుగానో పీడిస్తున్న రుగ్మతలు మటుమాయమయినట్లు - తమలో వెన్నెలలు పరుచుకున్నట్టు - అవ్యక్తమయిన శక్తి తమలో ప్రవేశించి ప్రకాశిస్తున్నట్లు అనుభవమవుతుంది.

అమ్మకు బాల్యం నుండి తన చుట్టూ ఉన్న పశుపక్ష్యాదులకూ, మనుషులకూ ఆహారాన్ని పంచడం అలవాటే. అందులోనూ తనవంతు ఆహారాన్ని ఇతరులకు పెట్టి తాను తృప్తిపడేది తన ఆకలి నోట్లో గుడ్డలు కుక్కి ఇతరుల ఆకలి తీర్చేందుకే తానెప్పుడూ శ్రద్ధ వహించేది. అందువల్లనే అమ్మ "మీరు తింటే -నేను తిన్నట్లే" ననీ, "మీకు పెట్టుకుంటే నేను చక్కగా ఉంటానూ, మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతానూ" అని తనను గురించి తానే చెప్పుకున్నది.

దాదాపు 1958 వరకూ అమ్మ తనను చూట్టానికి వచ్చే ప్రతి వారికి తానే అన్నం వండి వడ్డించేది. తర్వాత తర్వాత వచ్చి పోయే వారి కొరకు అన్నపూర్ణాలయం ఏర్పాటు చేసింది.

(ఆగష్టు 1977)



**ఆకలి**

వచ్చినవాడి డ్రస్‌నుబట్టీ అడ్రసునుబట్టీ కాదు, వాడి ఆకలినిబట్టి అన్నం పెట్టాలి. అన్ని బాధలకన్నా ఆకలి బాధ గొప్పది అనిపిస్తుంది నాకు.

- అమ్మ

# 124
# అన్నిమంత్రాలు సమానమే

"అమ్మా - అవసరమైనప్పుడు ఆపదవేళలో భగవంతుడు ఆదుకోనప్పుడు - ఎందుకు ఆయన్ను ఆరాధించటం ? ఆ దైవాన్ని పూర్తిగా నమ్మి నిరంతరం పూజిస్తున్నప్పటికీ, మాకు కష్టాలు తప్పటం లేదంటే - అది మా భక్తి లోపమా ? దేవుని శక్తి లోపమా ?"

ఈ నెల 3వ తేదీన హైదరాబాద్ నుంచి వచ్చిన శ్రీపతి మోహన్ అనే సోదరుడు అమ్మను సూటిగా అడిగిన ప్రశ్న అది

అతని కళ్ళలోని ధైర్యాన్నీ, ఆవేశాన్నీ తదేకంగా చూస్తున్న అమ్మకళ్ళల్లో కారుణ్యం తొణికసలాడింది. కొన్ని క్షణాలు అమ్మ ప్రత్యుత్తరం యివ్వకపోయేసరికి - ఆ ప్రశ్నవెనుక ఉండి అతన్ని అనుక్షణం దహిస్తున్న విషాద ఉదంతాన్ని అతను అమ్మకు నివేదించుకున్నాడు

అతని తండ్రి ప్రఖ్యాతమైన వీరభద్రస్వామిభక్తులు మహామంత్రోపాసకులు. తన ఉపాస్యదైవమందు అచంచలమైన పరిపూర్ణమయిన విశ్వాసం కలవారు. ఎందరికో మంత్రదీక్షను ప్రసాదించిన వ్యక్తి. మంత్రశక్తితో అనేకులకు అనివారమయిన వ్యాధులను సైతం నివారణచేసిన ప్రతిభావంతులు... అటువంటి మహనీయునిపై చివరకు క్షుద్రమంత్రప్రయోగం జరిగింది. క్షుద్రమయిన నీచమయిన మంత్రశక్తి ముందు - వారి ఉపాసన, ఆరాధన, విశ్వాసం, మహామంత్రం... సర్వం పరాజిత మయి పరాభూతమయినయ్ వారి మంత్రాధిష్ఠాన దైవమయిన వీరభద్రస్వామి సామర్థ్యం తలవంచి ప్రక్కకు తప్పుకున్నది; తన భక్తుని రక్షించుకొనలేక పోయింది. ఆ మహోపాసకులు తుదకు - ఒక తుచ్ఛమంత్ర ప్రయోగానికి గురై, లోనై, బలై దుర్మరణం పొందవలసి వచ్చిందట.

"తనకు అంతగా నమ్మి ఆరాధించినప్పటికి - తన భక్తుని కాపాడుకోలేక పోయిన స్వామిని ఏమని నమ్మాలి? ఎందుకు ఆరాధించాలి? ..... అందుకే క్రమంగా దైవంపై విశ్వాసమే క్షీణిస్తున్నది. మ్రొక్కిన వరమీయని వేల్పును కొలిచిన ప్రయోజన మేమిటి ? జీవితమంతా దైవసేవకే అంకిత మొనరించినప్పటికీ - వారిక్కూడా

కష్టాలూ కడగళ్లూ తప్పకపోయినట్లయితే - ఇక, ఆ సేవలకూ పూజలకూ అర్ధమేమిటి? - ఒక క్షుద్రమంత్ర శక్తి ముందు వీరభద్రస్వామి శక్తి సామర్ధ్యాలు ఎందుకూ పనికిరానివైపోతే, ఆ స్వామిని గురించి మనం ఏమి అంచనాలు వేసుకోవాలి ?''

ఆ విధివంచితుని హృదయవేదనను అర్థం చేసుకున్న అమ్మ అతనికి ఓపికగా మంత్రాన్ని గురించి వివరించింది.

మంత్రమంటే - మన శాస్త్రాల ప్రకారం - మననంవల్ల రక్షించేదీ అని అర్థం అసలు 'మంత్రం' అని ప్రత్యేకంగా ఏమీ లేదు. ఆ మంత్రాలకు సహజమైన బలం అసలే లేదు మనస్సుకు ఉన్న శక్తి మననంవల్ల మంత్రాలకు ఆరోపించబడు తున్నది. ఉదాహరణకు... అగ్నికి ఒక శక్తి ఉన్నది. కానీ ఆ అగ్నికి స్వతంత్రమయిన ఉనికి లేదు. అది కట్టెను ఆధారం చేసుకొని ఉండవలసినదే. అట్లాగే మనస్సు అక్షరాలను ఆధారం చేసుకుని మంత్రాన్ని మననం చేసుకుని బలవత్తరమౌతుంది ఆ మననం ఎంత పటుతరం అయితే - మనస్సు అంతగా బలాన్ని సంపాదించు కుంటుంది. అంతేగానీ, శివమంత్రం బలమైనది. అంతకంటే రామమంత్రం బలవత్తరమైనది, అంతకంటే వీరభద్రస్వామిమంత్రం శక్తి సంపన్నమైనది, అంతకంటే నరసింహస్వామిమంత్రం సమర్థమైనది. అంతకంటే ఆంజనేయస్వామి మంత్రం సర్వోత్కృష్టమైనది... ఇట్లా ఒక దానితో ఒకటి పోల్చవలసిన పని లేదు అన్ని మంత్రాలూ సమానమే. బలాలలో భేదం ఎక్కడ వస్తున్నదీ అంటే - మంత్రోపాసన చేసే మనస్సు యొక్క పవిత్రత, చేసే సాధన యొక్క తీవ్రతను అనుసరించి.

ఇక - మహామంత్రాలూ, క్షుద్రమంత్రా లంటూ రెండు విధాలు లేవు. మంత్రశక్తిని మంచికి ఉపయోగిస్తే - అది మహామంత్ర మౌతుంది ఇతరులకు అపకారం చేయటానికి ప్రయోగిస్తే - అది క్షుద్ర మౌతుంది.

అందువల్లనే మహామంత్రాలు బలమైనవా, లేక క్షుద్ర మంత్రాలు బలమైనవా అన్న ప్రశ్నకూడా లేదు. మంత్ర బలాల పరీక్ష అంటే - అధిష్ఠానదేవతలయొక్క సామర్థ్యాల తూకం కాదు ఉపాసకుల మనోబలాల తులనాత్మక పరీక్ష మాత్రమే

అసలు... మంత్రోపాసన రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి నిష్కామ్య పద్ధతి. అందులో కేవలం ఉపాసకుడు మంత్రం కోసమే మంత్రానుష్ఠానం చేస్తాడు. అందువల్ల అతడు ఏమీ పొందాలని కోరుకొనడు అందులో ఆత్మతృప్తి మాత్రమే ఉంటుంది. భగవత్ సాక్షాత్కారం కలిగినా - అది వాంఛితార్థం కాదు; సహజమైనది.

రెండవ పద్ధతి - కామ్యంతో కూడినది. ఇందులో లౌకికమైన కోరికలుంటాయి మళ్ళీ ఈ కోరికలు రెండు రకాలు. తనకూ తనవాళ్ళకూ మేలు చేకూర్చాలనీ; ఇతరులకు అంటే గిట్టని వాళ్ళకు హాని చేయాలనీ.

కానీ మంత్రసిద్ధి అంటే మానవతాతీతమైన మానసికస్థితి ఏర్పడిన తరువాత ఎవరూ ఇతరులకు అపకారం చేయాలని ఉద్దేశించరు వాళ్ళకు తనవాళ్ళూ, ఇతరులూ అన్న భేదమే తెలీదు. మంచీ చెడుల విచక్షణే ఉండదు. వారి ఆలోచనలూ, అభిప్రాయాలూ, ఆకాంక్షలూ సర్వజనశ్రేయోదాయకమయ్యే ఉంటాయి.

ఇక - మంత్రోపాసన కానీ, ధ్యానం కానీ పూజలు కానీ చేసినంతమాత్రాన వారికి అన్నీ శుభాలే జరగాలనీ, లాభాలే కలగాలనీ ఎక్కడా లేదు. వారికి కష్టంగానీ, నష్టంగానీ సంభవించకూడదనుకోవటం సృష్టి రహస్యాన్ని అర్థం చేసుకోనందువల్లనే, మనిషి పూజలు చేసినా, చేయకపోయినా - సుఖాలూ వస్తయ్; కష్టాలూ వస్తయ్ సుఖాలు వచ్చినప్పుడు పూజాఫలం అని ఆనందిస్తాము. కష్టాలు కలిగితే కారణం అర్థం చేసుకోలేము.

మంత్రం విషయంలో మనస్సుకూ మంత్రానికీ అర్థంకాని అవినాభావ సంబంధం ఉంది. మనస్సువల్ల మంత్రం ప్రతిభావంత మవుతున్నదా, మంత్రంవల్ల మనస్సు ప్రకాశవంత మవుతున్నదా - అని విశ్లేషించటం అనవసరం ముసలివాడు ముందు తాను కఱ్ఱను పట్టుకుంటే, తదుపరి ఆ కఱ్ఱ అతనికి ఊతాన్ని యిస్తుంది. మరి, తాతకు కఱ్ఱ ఆధారమా కఱ్ఱకు తాత ఆధారమా - అంటే చెప్పటం కష్టం. ఒకదానికి ఒకటి ఆధారం. ఏమయినా, మనస్సుకు ఊహాతీతమైన శక్తి ఉన్నదన్న విషయం నిస్సందేహం. అందుకే - అమ్మ మనిషికి మనస్సును మించిన మిత్రమూ, గురువూ, దైవమూ ఎక్కడా లేదు - అంటుంది. అయితే - ఆ మనస్సుకు శక్తి ఎక్కడ నుండి ఎట్లా, ఏ సాధన చేస్తే వస్తుందీ - అన్న విషయంపైననే భిన్నాభిప్రాయా లున్నయ్. మనిషిని నడిపేది మనస్సు అయినప్పటికీ - మనస్సును నడిపేది ఏమిటి - అనేది నేటికీ చర్చనీయాంశమే. 'కర్మ' అని కొందరంటే 'కాలం' అని మరికొంద రంటున్నారు.

మనస్సు అస్వతంత్రమైనప్పుడు మానవత్వమైతే - స్వతంత్రమైనప్పుడు దైవత్వ మవుతుంది. అదే అమ్మకూ మనకూ తేడా. మన మనస్సులు కర్మాధీనం; కాలాధీనం; తుదకు శరీరాధీనం కూడా శరీరంలో ఏ అవయవానికి బాధ కలిగినా మనస్సు సరిగా పనిచేయదు. కానీ అమ్మ మనస్సు స్వతంత్రమై స్వయంప్రకాశితమై దీపిస్తూ తన శరీరం పైననే కాకుండా మన శరీరాలనూ మనస్సులనూ కూడా నడుపుతూ ఉంటుంది.

కనుకనే అమ్మ మనందరికీ గురువూ, దైవమూ అయి మనకు ఆరాధ్య మయింది.

(సెప్టెంబరు 1977)



# 125
# సర్వదేవ స్వరూపిణి

"ఈ పూజలు నాకని చేస్తున్నారా ? ఏ పార్వతి అనో, లక్ష్మి అనో - సరస్వతి అనో చేస్తున్నారుగాని ---"

ఈ అభిప్రాయాన్ని అమ్మ అనేక పర్యాయాలు అనేక రీతుల్లో అభివ్యక్తం చేసింది.

అను నిత్యం, అమ్మను అనేకులు అర్చించుకుంటారు. అర్చన ఎప్పుడూ దైవానికే జరుగుతుంది. అయితే, దైవం రెండు రకాలు. ఒకటి నిర్వికారం; రెండు సాకారం.

నిరాకార దైవాన్ని మాత్రమే విశ్వసించే వాళ్ళు ఎల్లప్పుడూ జిజ్ఞాసువులై విచారణ మార్గంలోనే పయనిస్తూ ఉంటారు. వాళ్ళు చింతనలో ధ్యానంలో జపతపాల్లోనే వాళ్ళకాలాన్ని గడుపుతారు. వాళ్ళూ అమ్మ దగ్గరకు వస్తారు. వాళ్ళు అమ్మలో 'జ్ఞాని' ని మాత్రమే దర్శిస్తారు. అమ్మ వాళ్ళకు అవసరమైన విజ్ఞానాన్ని కరతలామలకం చేస్తుంది. వాళ్ళ చీకటిదారుల్లో జ్ఞానరోచిస్సులను నింపి దారిని సుగమం చేస్తుంది. వాళ్ళకంతే చాలు. వాళ్ళకదే తృప్తి. అందుకనే వాళ్ళు అమ్మను గురువుగా భావిస్తారు.

రెండవ వర్గం వాళ్ళు దైవాన్ని సాకారంగా భావిస్తారు. వీళ్ళ భావనే అనేక రీతుల్లో చీలిపోయింది. సాకార దైవం అనేక రూపాలు గ్రహించాడు. వీళ్ళందరి చుట్టూ అనేక పురాణాలు అల్లబడ్డాయి. ఆ పురాణాల్లో అనేక కథలు చెప్పబడ్డాయి. ఆ కథల్లో అనేక వర్ణనలు చేయబడ్డాయి. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క రూపం ఇష్టం. ఒక్కొక్క మనసుకు ఒక్కొక్క గుణం ఇష్టం. కనుకనే ఒక్కొక్కళ్ళకు ఒక్కొక్క ఇష్టదైవం. చివరికి వారికి వాళ్ళ యిష్టదైవమే ఈ జగత్ సృష్టి స్థితి లయాలకు కర్త అనిపిస్తుంది. మిగతా దైవస్వరూపాలన్నీ అల్పమైనవిగా గోచరిస్తాయి.

అందువల్లనే భక్తుల్లోకూడా పరస్పర వైవిధ్యమూ, ద్వేషమూ రగులుతూ అనేక అవాంఛనీయ దుర్ఘటనలు సంభవిస్తూ ఉంటాయి. ఈ కారణంగా జరిగిన

యెన్నో దారుణ మారణ హోమాలు మానవజాతి చరిత్రకు శాశ్వత కళంకాన్ని ఆపాదించి పెట్టాయి.

కానీ అమ్మలో విశేషమేమిటి అంటే - ఎవరికి వాళ్ళు వాళ్ళ ఇష్టదైవాన్నే - అమ్మలో దర్శిస్తున్నారు ఎందరో అమ్మ దగ్గరకు వచ్చి "మీరు నా ఇష్టదైవంగా సాక్షాత్కరించారమ్మా" అని విన్నవించుకుంటారు. అమ్మ మాత్రం వాళ్ళతో "అది కాదు నాన్నా. మీ ఇష్టదైవమే నారూపంలో కనిపించి ఉంటుందేమో...." అని నవ్వుతుంది

అయితే ఇక్కడ రెండు రకాలయిన ఊహలకు అవకాశం ఉన్నది. భక్తులు వాళ్ళ పరిపక్వ మయిన భక్తితో అమ్మలో వాళ్ళ ఇష్టదైవాన్ని దర్శించగలుగుతున్నారా? లేక అమ్మే సర్వదేవతా స్వరూపిణియై వారి వారి మనోభీష్టానుసారం అన్ని రూపాల్లోనూ ప్రత్యక్షమవుతున్నదా ?.... ఇది విజ్ఞులు విచారణ చేసి నిర్ధారణ చేయవలసిన తాత్విక విషయం.

ఇకపోతే హిందువుల్లో స్థూలంగా మూడు కోవలు ఉన్నాయి. ఒకటి వైష్ణవులు; రెండు శైవులు, మూడు శాక్తేయులు. అమ్మను మూడు కోవలవాళ్ళూ మూడు త్రోవల వాళ్ళూ ఆరాధించటం విశేషం

అమ్మను విష్ణుమూర్తిగానూ, ఆ విష్ణువు అవతారాలైన రాముడుగానూ కృష్ణుడు గానూ ఆరాధిస్తారు పరమేశ్వరుడుగానూ, గణపతిగానూ అర్చిస్తారు స్త్రీ ఆకృతిలో ఆవిర్భవించటం చేతనేమో - అధికులు అమ్మను శక్తిస్వరూపిణిగానే మనోమందిరాల్లో ప్రతిష్ఠించు కుంటారు.

అమ్మ జీవిత చరిత్రకూడా అమ్మ శక్త్యవతార మనటానికే దోహదం కలుగు జేస్తున్నది. అమ్మ యీ అవనీతలంపై అవతరించిన సంవత్సరంలో మన్నవలో రాజ్యలక్ష్మి దైవ్యాలయంలో రాజరాజేశ్వరీ యంత్రాన్ని ప్రతిష్ఠించటం జరిగింది. కనుక ఆ అమ్మవారే అమ్మరూపం ధరించిందని ఆ గ్రామస్థులు ఊహించటమే కాక తర్వాత అనేక పండితులు దానిని ధృవపరిచారు.

కాలగమనంలో అమ్మ ప్రతిమనిషినీ తన కన్నబిడ్డగా ప్రేమించటంతోనూ, జగత్తునంతనూ కన్నతల్లి వలే ఆదరించటంతోనూ జగజ్జనని అయింది. లలితమైన ప్రవృత్తిచేత లలితగా భావించబడింది. కోరిన కోరికలెల్లా తీర్చటంతో కామేశ్వరి అయింది. పాతివ్రత్యంతో పంచభూతాలను జయించి సీత అయింది. సహనంలో సరిహద్దులను చూసి భూదేవి అయింది. అపారమైన జ్ఞానంతో సరస్వతి అయింది. అందరికీ అడిగినవన్నీ అనుగ్రహిస్తూ. అన్నిటికీ కారణం కాలమేనని వివరిస్తూ ఆ

కాలమే తానై కాళిక అయింది అందరికీ అందినట్లే కనుపిస్తూ ఎవ్వరూ అధిరోహించలేని 'వల్లకాని మిట్టపై' అధివశించి అందరికీ దుర్గమమై దుర్గ అయింది మనిషిలోని పశుప్రవృత్తినీ, అమరభావాన్నీ సన్మార్గానికి మళ్ళిస్తూ మహిషాసుర మర్దని అయింది

కనుకనే 'దేవి'ని విభిన్న మూర్తుల్లో ఆరాధించే నవరాత్రి ఉత్సవాలకు జిల్లెళ్ళమూడిలో మరింత ప్రాధాన్యం. బిడ్డలందరూ భక్తులై అనేకరీతుల్లో అత్యధికోత్సాహంతో అమ్మకు పూజలు చేసు కుంటారు.

అమ్మ అన్నిటినీ అంగీకరిస్తుంది. అదే విచిత్రమూ, విశేషమూ కూడా !

మామూలుగా అమ్మ 'దైవా'న్నే ఒప్పుకోదు. ఈ 'కనుపించే దంతా దైవమే' ననటమేగానీ ఈ సృష్టికి భిన్నమై యీ సృష్టిస్థితి లయ కర్తయై ఎక్కడో ఒక రూపంతో దేవుడుంటాడనే భావాన్ని అమ్మ సమ్మతించదు. అన్ని రూపాలూ దైవమేనని బోధించే అమ్మ అవతార వ్యక్తులని ప్రత్యేకంగా ఎవరిని చూపిస్తుంది ? అవతారవ్యక్తులే లేనప్పుడు అర్చన లెవరికి ? 'దేవు'డే లేనప్పుడు పూజ లెందుకు ? - కనుకనే అమ్మ తాను ఎప్పుడూ ఎవరికీ పూజ చేయలేదు. పూజ చేయమని ఎవరినీ ఆదేశించ లేదు.

కానీ -

సర్వసామర్థ్యానికి, సర్వవిజ్ఞానానికి అని అయిన మనస్సు మాత్రమే మనిషికి మహోన్నతమైన, అసమానమైన, అమూల్యమైన సంపద అనీ, అత్యుత్తమ గురువనీ, దైవమనీ అభిభాషించే అమ్మ - ఆ మనోనిశ్చలతకు, నైర్మల్యానికి పూజను ఒక సాధనంగా మాత్రమే అంగీకరిస్తుంది.

కనుకనే దేవుడే లేడనే అమ్మ అవతారాలనే అంగీకరించని అమ్మ, ప్రతిమనిషికి అస్తిక భావమూ, దైవవిశ్వాసమూ, అవసరమని చెప్పని అమ్మ- పూజా సాంప్రదాయాన్ని అంగీకరించటమే కాక తాను ఆ దైవప్రతీకగా పూజావేదికపై ఆసీనకాపటం, ఆ పూజలూ, నివేదనలూ అందుకొనటం విచిత్రంగా కనుపించినా, అది మనందరి అదృష్టం. అమ్మకు బిడ్డలపైగల అత్యంతానురాగానికి నిదర్శనం.

(అక్టోబరు 1977)



# 126
# "నాకే వెలితి ఉంది"

ఈ నెల 5వ తేదీన మధ్యాహ్నం . . విశాఖపట్నం నుంచి వచ్చిన శ్రీ రామకృష్ణ శెట్టిగారికి అమ్మ ఎన్నో కబుర్లు చెబుతూ అన్నం కలిపి పెట్టింది. మరి, ఆ అన్నంలో ఎంత అమృతం కలిసిందో ! ఎంత అనుగ్రహం కలిపిందో !!

కడుపునిండా అన్నం పెట్టిన తర్వాత ఆయన్ను దగ్గరకు తీసుకుని కుంకుమతో బొట్టుపెట్టి అమ్మ క్రొత్తగుడ్డలు ప్రసాదించింది అప్పటిదాకా దివ్య వాత్సల్యపయోధిలో తలమునకలై పరవశిస్తున్న ఆ సోదరుడు కొన్ని క్షణాలు నిశ్చేతనుడై 'అమ్మా-చిన్నతనం నుంచీ నాకు అన్నీ ప్రసాదించావు నాకు ఏ వెలితీ లేదు నాకీ కొత్తగుడ్డలు ఎందుకమ్మా'' అని అడిగాడు అమాయకంగా.

వెంటనే అమ్మ అన్నది ''నీకు వెలితి ఉందని కాదు, నాన్నా ! నాకే వెలితి ఉంది. దాన్ని పూడ్చుకోడానికే యివన్నీ -''

ఆ సమాధానానికి అతడు అ ప్రతిభుడై నిరుత్తరుడై పోయాడు.

అమ్మకు వెలితి !? సంపూర్ణత్వమే తానైన అమ్మకు లోపమా ?

అతనిలో ఏమి ప్రశ్నలు ప్రభవించాయో, ఏమి సమాధానాలు సముత్పన్నమైనాయో..... అతడిలో శోకం సముత్తుంగ తరంగిత మయింది. అతడి కపోలాలు తడిశాయి. అమ్మ కొనగోట లాలనగా మృదువుగా అతడి కన్నుల్లో మెరిసే అశ్రువీణను మీటుతూ, తన పమిటచెంగుతో సిక్త కపోలాలను తుడిచింది.

ఏమీ వెలితిలేని అతడు దుఃఖలహరిలో కొట్టుకొనిపోతూ ఉంటే - వెలితి గల అమ్మ చిద్విలాసంగా ఆనందతీరాన ఆసీనయై అతడికి కరావలంబ మొసగి చేరువకు చేదుకుంటున్నది.

అదొక విచిత్ర సన్నివేశం !

ఒకసారి ఒక సోదరుడితో మాట్లాడుతూ అమ్మ "ఆశా అసంతృప్తుల కలయికే జీవితం" అని రమణీయంగా నిర్వచించింది. ఆ సోదరుడు "యీ సూక్తి నీక్కూడా వర్తిస్తుందా ?" అని అడిగితే "ఎందుక్కాదూ ? పిల్లలు కావాలని నాకూ ఆశ; ఉన్నవాళ్ళు చాలక అసంతృప్తి. ఎంతగానో మీకు పెట్టుకోవాలని ఆశ; ఆశించినంతగా పెట్టుకోలేకపోతున్నానే అని అసంతృప్తి. ... అట్లాగే నా మనస్సు ఆశా అసంతృప్తుల మధ్య ఊగిసలాడుతూనే ఉంటుంది నాన్నా -" అని వివరించింది అమ్మ.

అమ్మ మనకు అన్నం పెడుతూ మనం తింటుంటే తాను తేన్చుతూ "మీరు తింటే నేను తిన్నట్లే నాన్నా -" అంటుంది

"మీకు పెట్టుకోకపోతే, మీరు తినకపోతే నేను చిక్కిపోతాను" అని విచిత్రమైన సత్యాన్ని పదే పదే వ్యక్తం చేస్తుంది.

అమ్మ తన దగ్గరకు వచ్చిన ప్రతివాడిచేత బతిమిలాడి అన్నం తినిపిస్తూ ఉంటుంది. "నీకీ శ్రమ ఎందు కమ్మా?" అంటే అది తన తృప్తికోసమే నంటుంది.

ఒక్కొక్కసారి తాను లేవలేని స్థితిలో చాలా అనారోగ్యంగా ఉండికూడా - ఆరోగ్యంగా, బలంగా ఉండి కరచరణాదులు సవ్యంగా పనిచేసేవారిక్కూడా - [illegible] వయస్సుతో, హోదాలతో నిమిత్తం లేకుండా - ఆప్యాయంగా, ఆదరంగా [illegible] చెబుతూ కథలు చెబుతూ.... అల్లరిచేసే పిల్లలను తల్లి చంకన వేసుకుని ఆకాశాన్ని చందమామనూ చూపించి అన్నం తినిపించినట్లు.... అమ్మ స్వయంగా అన్నం కలిపి ముద్దలుచేసి నోటికి అందిస్తూ ఉంటుంది. అన్నం పెట్టిన తర్వాత వాళ్ళ మూతిని తానే కడిగి తన చీరెపమిటితో తుడుస్తుంది. ఆ తరుణంలో అమ్మ నయనాంచలాల వెలిగే దీప్తిలో ఎంతో ఆనందమూ, సంతృప్తి స్పష్టంగా కనిపిస్తాయి.

ఈ సంఘటనలు చూస్తూ ఉంటే - అమ్మ ఎవరికి పెడుతున్నది అన్న విషయంలో ఏ మాత్రం ప్రాధాన్యం ఉన్నట్లు కనిపించదు. అమ్మకు అన్నం పెట్టడమే కావాలి. ఎవరికి అన్నది కాదు.

అట్లాగే ఎందరికో గుడ్డలుకూడా పెడుతుంది. వాళ్ళు కట్టుకుంటే తాను ఆనందిస్తుంది. "ఈ చీరె నేను కట్టుకునే కంటే నువ్వు కట్టుకుంటేనే ఎంతో బాగున్నదమ్మా---" అని ప్రశంసిస్తూ ఉంటుంది.

ఈ సంఘటనలన్నీ సమీకరించుకుని సమీక్షించుకుంటే -- మనకు అమ్మ బహురమ్యంగా దర్శన మివ్వడమే కాక, మన ఆలోచనలకు కొత్త బాటలు వేస్తుంది.

"మీ ధ్యేయమూర్తి ఎవరమ్మా?" అన్న ప్రశ్నకు సమాధానంగా "మీరే నా ధ్యేయమూర్తులు" అనీ. ... "మీరు దేవుణ్ణి చూశారా ?" అంటే "మిమ్మల్ని చూస్తున్నానుగా మీరు దేవుడు కాకపోతే గదా" అనీ..... "ఈ కనిపించేదంతా దైవమే" ననీ ప్రవచించింది అమ్మ.

భక్తికి అనేక ముఖాలు. ఆరాధన పలు రకాలు. ఒకడు తన భక్తిని సాహిత్యం ద్వారా మరొకడు సంగీతం ద్వారా ప్రకటించుకుంటాడు. ఒకడు ఒక్క సత్యవాక్కు ద్వారా సిద్ధిపొందితే, మరొకడు అహింసద్వారా జీవిత పరమార్థాన్ని అందుకుంటాడు. ఒకడు త్యాగం ద్వారా, మరొకడు యోగంద్వారా జీవిత లక్ష్యాన్ని చేరుకుంటాడు. ఒకరు తన బిడ్డలో దైవాన్ని చూస్తే, మరొకడు దైవాన్ని. తన బిడ్డగా భావిస్తాడు. రాతినే దైవంగా భావించి, దాన్ని సజీవంగా ఊహించి, దానికి నిత్యమూ స్నానం చేయించి, అలంకరించి, అన్నంపెట్టి, జోలపాడి, నిద్రబుచ్చి...... ఆ సేవలో ఆ ప్రేమలో ఎంతో ఆనందాన్ని అనుభవించే కొందరిని మనం చూస్తున్నాం.

అట్లాగే అమ్మకూడా మనలో దైవాన్ని చూస్తూ ఆరాధిస్తున్నదా ? అమ్మకు ఇది సాధన మార్గమా ?

ఏ సామాన్యమైన తల్లి అయినా - తాను తిన్నా తిన[illegible]నా తన బిడ్డకు కడుపునిండా పెట్టుకోవాలని ఆకాంక్షిస్తుంది. తన బిడ్డ కంటికింపుగా గుడ్డలు కట్టుకోవాలని అభిలషిస్తుంది. అదే విధంగా ఏ విచక్షణా లేకుండా భిన్నత్వంలేని మనస్తత్వంతో మనందరికి అన్నం పెట్టుకుని, గుడ్డలు పెట్టుకుని ఎనలేని ప్రేమను కురిపిస్తూ బిడ్డల ఆనందమే తన ఆనందంగా భాసిల్లే తత్వం అమ్మలోని సర్వమాతృత్వానికే నిదర్శనమా ?

"మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలుకూడా"ననీ, "ఇదంతా (లోకమంతా) [illegible]"ననీ, "నేను మీరు కానప్పుడు గదా" అనీ, అమ్మ పలికిన అనేక వాక్యాల్లో అమ్మకు మనతో అంటే యీ సర్వ [illegible] పరిపూర్ణ తాదాత్మ్యం కని[illegible]. [illegible] అందువల్లనే మన సంతోషాన్నే తన సంతోషంగానూ మన సంతృప్తినే తన స[illegible] గానూ అనుభవించ గలిగిన అమ్మకు మన వెలితే తన వెలితి అ[illegible]ందా? [illegible] ఎక్కడ పూరించినా ఫలితమొకటేనా - మనకు ఒక చేతికి జబ్బు వస్తే మరొక చేతికి ఇంజక్షను ఇచ్చినా నయమైనట్లు. కనుకనే మన వ్యాధులన తాను భరిస్తూ తాను మందులు సేవించి మనకు బాధావిముక్తినీ, ఆరోగ్యాన్నీ ప్రసాదిస్తున్నదా ? కాకపోతే - ఏమీ ఆహారాన్ని తీసుకొనని అమ్మకు వ్యాధులేమిటి? చికిత్స ఎందుకు?

ఈ అత్యద్భుత అపూర్వ తత్వం అమ్మకు సర్వసృష్టితోనూగల తాదాత్మ్యస్థితిని వివరిస్తున్నదా ?

ఇటీవల ఒక మిత్రుడు నన్ను "రోజూ అమ్మ ఒక వెయ్యి మందికి అన్నం పెట్టినంత మాత్రాన వందల కోట్ల జనాబా గల ప్రపంచానికి ఏమి ఉపకారం జరుగుతుంది ? ఎందరో లోకంలో పస్తులతో ఉన్నారు గదా......" అని అడిగాడు.

ఆ మాట నిజమే !

లోకంలో వందల కోట్ల జనాభా ఉంది. అందులో ఎందరో అతిపేద ప్రజలు నిత్యమూ అన్నం తినలేని వారున్నారు. ఏ ఒక్కరూ అందరి ఆకలినీ తీర్చలేని మాట వాస్తవమే. అట్లా అని అందరూ ఉపేక్ష వహిస్తే - ఏమవుతుంది ? చైనాభాషలో ఒక చక్కని సామెత ఉంది..... నీ చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చునేకంటే - నీకు చేతనైన ఒక చిన్న కొవ్వొత్తిని వెలిగించడం మంచిది !

(నవంబరు 1977)



## విగ్రహ ప్రతిష్ఠ

భగవంతుని - ప్రతిష్ఠ మనం కాదుగా చేయాల్సింది. మనకు ఏం సాధ్యమవుతుంది ? అంతటా ఉన్న భగవంతుడు ఒక చోట 'ఇక్కడ ఉన్నా'డని ప్రతిష్ఠిస్తున్నా మంటే మన గుర్తుకోసం, మన లక్ష్యంకోసం. దాన్ని విగ్రహం, రాయి - అనుకోవటం లేదుగా.

అందులో ఉన్నాడనుకుంటున్నాము. అక్కడ ఆయనకు ఉండాలనిపిస్తే అదే జరుగుతుంది.

- అమ్మ

# 127
# "నా ఉనికే కొండంత ధైర్యం"

1977 నవంబరు 19వ తేదీ కాలం కసిగా తెలుగు ప్రజలను కబళించిన రోజు. ప్రకృతి పగబట్టినట్లు విజృంభించిన రోజు

తీరప్రాంతంలోని అన్ని గ్రామాలవలనే జిల్లెళ్ళమూడి కూడా ఆనాడు వాయువు చేసిన విలయతాండవంలో విలవిలలాడి పోయింది. ఫలితంగా జిల్లెళ్ళమూడి గ్రామంలోని పూరిళ్ళన్నీ పూర్తిగా నేలమట్టమయినాయి ఉన్న పది పెంకుటిళ్ళూ కప్పాలు లేచి పోయినాయి ఆశ్రమంలోని పర్ణశాలలన్నీ పతనమయినాయి. కళాశాల పాకలు విధ్వంసమయినాయి. అధ్యాపకబృందం నివాసంచేసే ఇళ్ళన్నీ కూలిపోయినాయి సిమెంటు రేకులతో కప్పిన భోజన మందిరం రేకులన్నీ వాయువేగానికి ఎక్కడకో ఎగిరిపోయి నేలకూలి తునాతునకలైనాయి

మరి, మిగిలిన దేమిటి ?

అమ్మ నివసించే భవనమూ, అన్నపూర్ణాలయమూ.

అందుకే గ్రామస్తులూ, ఆశ్రమవాసులూ, కళాశాల అధ్యాపకులూ, విద్యార్థినీ విద్యార్థులూ.... అందరూ "అమ్మా.. . అమ్మా....." అని ఆర్తనాదాలూ, హాహాకారాలూ చేస్తూ ప్రచండ వాయు ఘాతాలనూ, ప్రళయ వర్షపాతాన్నీ తప్పుకుంటూ కట్టుబట్టలతో, కడబట్టిన ప్రాణాలతో - అమ్మ పాదాల నాశ్రయించినట్లుగా కొందరు అమ్మ నివసించే భవనంలోని క్రింది అంతస్తులోకి, అమ్మ ఒడిలోకి చేరినట్లుగా కొందరు మధ్య అంతస్తులోకి అమ్మ చంకలోకి చేరినట్టు పై అంతస్తులోకి సర్దుకున్నారు.

బయట వాయువు కాలనాగై బుసలు కొట్టినప్పటికీ, వరుణుడు కాలరుద్రుడై విలయతాండవం చేసినప్పటికీ - కరుణామయి అమ్మ సాన్నిధ్యంలో ఆ రాత్రి అందరూ సురక్షితంగా కాలం గడిపారు.

తెల్లవారి చూస్తే గ్రామం మరుభూమివలే కళావిహీనమై విపన్నమై విషణ్ణమై ఉన్నది. చెట్లన్నీ కూలిపోయాయి. విద్యుత్ స్తంభాలన్నీ మెలికలుతిరిగిపోయాయి. ఇళ్ళన్నీ నేలకూలి రణరంగంలో పరాజితులై క్షతగాత్రులై నిహతులైన వీరుల్లాగా కనపించాయి.

ఆనాడు అమ్మ అన్నపూర్ణాలయంలోనే వంట చేయించి అందరికీ అన్నం పెట్టించింది.

ఏడాది పొడుగునా కడుపు నింపే పంట నీటిపాలైపోగా, కాపురం ఉండే యిళ్ళు నేలకూలిపోగా గ్రామస్తులు నిర్వాసులై నిరాశ్రయులై నిరాధారులై నిరాశా నిస్పృహలకులోనై నిస్తేజులై నిశ్చేతనులై ప్రాణం కడబట్టి ఉండగా మరునాటి రాత్రి - కసి తీరినట్లుగా - కాలం మరోసారి గర్జించింది. అంబరం చిల్లిబడ్డట్టుగా వర్షం కురిసింది. జిల్లెళ్ళమూడిని పరివేష్టించి ఉన్న వాగులు పొంగి వెల్లువలైనాయి. చుట్టూ జలార్ణవం. మధ్యలో ద్వీపంవలే జిల్లెళ్ళమూడి.

మిగతా లోకంతో జిల్లెళ్ళమూడికి ఏ విధమైన సంబంధమూ లేకపోయింది. జిల్లెళ్ళమూడి నుంచి వార్తలే బయటకు రాలేదు.

అమ్మ భవనం మినహా అంతా జలమయమే. అందువల్లనే ఆ భవనం అందరికీ ఆశ్రయమయింది. అందరికీ రక్షణ నిచ్చింది.

ఆ విపత్సమయంలో ఆపదార్భంధవి అమ్మ "నేనున్నాను" అన్నది. వరద తగ్గేంతవరకూ వారి నివాసాలు బాగుచేయించుకునే వరకూ వారం రోజులు గ్రామస్థులందరూ ఆ ఒక్క భవనంలోనే తల దాచుకుని పునర్జీవనం పొందారు.

ఆనాడు ఆ భవనమే లేకపోతే ఆ గ్రామంలో ఎన్నివందల మంది. అనువులు గోల్పోయేవారో ! పూర్వం 1969వ సంవత్సరం వేసవిలో అత్యంత భయానకంగా వచ్చిన వరదలోకూడా ఈ భవనమే వేలాది ప్రజలకు ఆశ్రయమయింది.

ఆ వారం రోజులు 2, 3 వేల జనం ఆ ఒక్క భవనంలోనే నివాసం. భవనం చుట్టూ వరద ఆ వరదలో కొట్టుకువచ్చిన కళేబరాలూ, కుళ్ళిపోయిన గడ్డీ గాదమూ, అక్కడనే సర్వజనుల మలమూత్ర విసర్జన అంతా దుర్వాసన. అసహ్యాకర వాతావరణం, అయినా, ఆ నీళ్ళే అందరూ త్రాగాలి అవే నీళ్ళు స్నానానికీ; అవే నీళ్ళు వంటకూ.

అహో ! ఏమి దుర్గతి ! ఎంత దుర్భర పరిస్థితి ! ఏ క్షణాన అయినా ఏ ఉపద్రవమయినా అక్కడ ముంచుకురావచ్చు.

అయినా - అమ్మ త్రాగటానికీ, స్నానం చేయటానికీకూడా అంత కంటే నీళ్ళు లేవు అది ఆశ్రమ నిర్వాహకు లెవ్వరికీ ఇష్టం లేకపోయింది. అందుకని "అమ్మా ! కొన్నాళ్ళు మళ్ళీ కరెంటు వచ్చి మోటారు పనిచేసి నీళ్ళు వచ్చేంతవరకూ నువ్వు ఏ మదరాసో, హైదరాబాదో, నరసాపూరో..... అక్కడి నుండి ఎట్లాగూ ఆహ్వానాలు ఉన్నయ్ కాబట్టి - వెళితే మంచిదమ్మా......'అరి సూచించారు.

"నిజమే నాకు బాగానే ఉంటుంది. నన్నయితే ఎవరైనా ఆహ్వానిస్తారు; తీసుకు వెళతారు; సర్వ సౌకర్యాలు చేస్తారు. కానీ, ఈ వేలాది జనం మాటేమిటి ? వీళ్ళందరినీ ఎవరు భరిస్తారు ? ఈ క్లిష్టసమయంలో నాచుట్టూవున్న ఈ ప్రజలను వదిలేసి నా సుఖం నేను చూసుకునేదా? అది నావల్లకాదు. మీ అందరికీ పనికివచ్చిన నీళ్ళు నాకు పనికిరావా ? మీ అందరితో నేనూ; నాతో మీరందరూ, అంతే.

ఈ పరిస్థితుల్లో నేను లేకపోతే ఈ జనం యిక్కడ ఉండగలరా ? అంటే నేనుండి ఏదో చేస్తాను - అని కాదు. నా ఉనికే కొంత ఊరట; కొండంత ధైర్యం.

కష్టమో సుఖమో - మీతోనే నేను.

ఈ కష్టాలక్కరలేదు - సుఖాలే కావాలనుకోవటం లేదు అని అమ్మ నెమ్మదిగానూ ఖండితంగానూ పలికిన పలుకులు విని నిర్వాహకులు ఏమీ చేయలేక అమ్మకు ఎదురు చెప్పలేక మౌనం దాల్చారు.

ఔను, నిజమేకదా ! మనందరితోపాటు ఉండాలనుకొని, సుఖదుఃఖాల సమ్మిశ్రితమైన మానవ జీవితమ్మీది మమకారంతోనే అమ్మదివినుండి భువికి దిగివచ్చింది. ఆ సత్యాన్ని అమ్మ అనేకరీతుల్లో ఉద్ఘాటించింది. అట్లా కాకపోతే 'అవతారవ్యక్తి' లనేవారే ఉండరు.

తర్వాత వరద తగ్గింది. అయినా విద్యుత్ సరఫరా రాలేదు. అధ్యాపకులూ, విద్యార్థులూ ఎద్దులబండిమీద నీళ్ళు తోలటం జరుగుతున్నది. వాళ్ళకష్టం అమ్మకు భరించలేనిది అయింది.

దివిసీమలో సాంత్వనయాత్ర ముగించుకున వస్తూ అమ్మ బాపట్లలో ఆగి -- "అక్కడ ఆ పిల్లల కష్టం చూడ లేకుండా ఉన్నాను. ఆ ఎద్దులు - నోరులేనివి కనుక అవి చెప్పుకోలేకపోయినా, మనకు వాటి కష్టం కనిపిస్తూనే ఉన్నది కరెంటు వచ్చినాక వస్తాను" అన్నది.

మన సుఖంకోసం తాపత్రయమే కాదు. మన కష్టంతో అమ్మ కెంత సానుభూతి! తానెన్ని కష్టాలనయినా సునాయాసంగా భరిస్తూ 'సహనదేవత'గా ప్రశస్తిని పొందిన అమ్మ - మన కష్టాన్ని కించిత్ కూడా భరించలేక క్షణంలో కన్నీళ్ళు పెట్టుకుంటుంది.

సర్వ సృష్టి స్థితి లయాలకు ఆధారభూతమయిన శక్తియే అమ్మగా రూపుదాల్చినదని ప్రగాఢంగా విశ్వసించే మనకు - అమ్మ "లీలా వినోదం" మాత్రం ఏనాటికీ అర్థంగాదు. అమ్మ వివరించదు.

(డిశంబరు 77, జనవరి 1978)



# 128
# సంస్కరణ

జనవరి 2వ తేదీ ఉదయం సోదరుడు తూమగుంట్ల త్రిలోక అప్పారావు మరొక సోదరుని వెంటబెట్టుకుని అమ్మవద్దకు వచ్చాడు.

ఆ సోదరుని అమ్మకు పరిచయం చేశాడు పేరు టిఫిన్‌కుమార్ బెహరా. కటక్ వాస్తవ్యుడు. స్మగ్లింగ్‌లో సిద్ధహస్తుడు. వంచనలో ప్రవీణుడు. అతని రూపమే మోటుదనానికీ, మొరటుదనానికీ ప్రతీకగా ఉన్నది. అతని కళ్ళల్లో క్రౌర్యం ఎఱ్ఱటి చారలుకట్టి కనిపిస్తున్నది.

పరిచయం చేయగానే అతడు అమ్మకు నమస్కరించి అతనిలోని దుర్గుణా లను ఏకరువుపెట్టాడు. ఆ సమయంలో అతని రాతి గుండె కరుగుతన్నట్లుగా అతని కళ్ళల్లో చెమ్మ కనుపించింది. అతని స్వరంలో స్పందన వినిపించింది.

"అబద్ధంకూడా ఆడుతావా, నాన్నా?" అని ప్రశ్నించింది అమ్మ లాలనగా.

"అదొక్కటే నమ్మా - నాలో లేనిది. ఏమి తప్పు చేసినా బహిరంగంగా చెప్పేస్తాను" అన్నాడు వినయంగా

'ఆ ఒక్కటి చాలు నాన్నా, ఎందరిలోనో లేనిదే అది నీలో ఉన్నదే అది. నీ వనుకునే అన్ని అవగుణాలు ఆ ఒక్క సుగుణం ముందు మరుగున పడిపోతయ్'.

"నన్ను బాగుచేయమ్మా -" అని వేడుకున్నా డతడు.

"ఇప్పుడు నువ్వు బాగానే ఉన్నావు నాన్నా ఇప్పుడే కాదు, ఎప్పుడూ బాగానే ఉన్నావు" అంటూ అమ్మ తన దగ్గర ఉన్న కమలాఫలం ఒలిచి తొనలు అతని నోట్లో పెట్టింది. అతణ్ణి దగ్గరకు పిలిచి అతనివీపు నిమిరింది. ఆస్పర్శలో ఎంత అనురాగం ఉన్నదో. ఎంత లాలన ఉన్నదో ఎంత దివ్యత్వం ఉన్నదో !..... అతను విచలితుడయ్యాడు. విభ్రాంతు డయ్యాడు. అనురాగ స్రవంతీ మగ్ను డయ్యాడు. ఆనందపరవశుడయ్యాడు.

ఆ అనుభవం అతనికి అపూర్వం. అతనికి పరిచయమున్న లోకమూ, మనుషులూ యిందుకు పూర్తిగా భిన్నమయినవారు. కనుకనే ఆ పవిత్ర స్థలమూ అమ్మ ఆప్యాయతా, ఆదరణా అతనికి ఒక వినూతన అనుభవాన్ని ప్రసాదించాయి.

అమ్మను చూస్తూ ఆ మమతామృతాన్ని తనివిదీరా పానం చేస్తూ అమ్మ చేతిలోని పండునే తీసుకుని వణికే తన చేత్తో అమ్మ నోటికి అందించి తినమని ప్రాధేయపడ్డాడు. అమ్మ కాదనకుండా ఆ తొనను చప్పరిస్తూ కరుణ లొణికిసలాడే కనులతో అతణ్ణి చూసింది అమ్మ పరిపూర్ణ కృపామృత ధారల్లో తడిసిన అతను - ఎంత అదృష్టవంతుడో - అనుకున్నా రక్కడ కూర్చున్న అందరూ.

అతడు అమ్మసన్నిధికి చేరిన ఉదంతం ఆశ్చర్యకరమైనది.

తూమగుంట్ల త్రిలోక అప్పారావు ఏలూరు వాస్తవ్యుడు అమ్మసన్నిధికి చిరకాలంనుంచీ వచ్చేవారిలో ఒకడు అమ్మను పరిపూర్ణంగా విశ్వసించి అనుక్షణం అమ్మనే స్మరిస్తూ ధ్యానించే వ్యక్తి. సర్వంలోనూ అమ్మనే చూట్టానికి ప్రయత్నించే ఉపాసకుడు జీవితంలోని ప్రతిఘట్టంలోనూ అమ్మసూక్తులను సమన్వయం చేసుకునే సాధకుడు. అమ్మ కటాక్షాన్ని పొందిన భక్తుడు.

అతడు వేరుశనగ నూనె వ్యాపారం చేస్తున్నాడు. 1977 జూన్ 20వ తేదీన ఎమ్మిగనూరులో రూ. 70,000/- లకు 40 పీపాల నూనె కొనుగోలుచేసి లారీపై ఏలూరుకు ఎగుమతికి ఏర్పాటు చేశాడు.

ఆ లారీ AAT 2197. దాని స్వంతదారూ, డ్రైవరూ కూడా పైన ఉదహరించిన బిపిన్‌కుమార్ బెహరా. అతని వృత్తీ ప్రవృత్తీ ననుసరించి అతనికి యీ నూనెను దొంగతనంచేసి డబ్బు చేసుకొవాలనే దురూహ కలిగింది. దారిలో విజయవాడ వచ్చి కొబ్బరి కాయలుకొని నూనెపీపాలు కనుపించకుండా కప్పివేసి 'కనకదుర్గ'కు - తనను సురక్షితంగా గమ్యస్థానం చేర్చు - మని మ్రొక్కుకున్నాడు అతని ప్రార్థన ప్రకారమే అతడు ఏ ఆటంకమూ లేకుండా గమ్యం చేరుకున్నాడు. నూనెను డబ్బు చేసుకున్నాడు.

నిర్ణీతకాలంలో లారీ ఏలూరు చేరకపోయే సరికి అప్పారావుకు అనుమానమూ, ఆందోళనా కలిగి వెంటనే ఎమ్మిగనూరు వెళ్ళి - అక్కడ పోలీసు రిపోర్టు యిచ్చాడు.

తిరిగివస్తూ - విజయవాడలో నటరాజ్ హోటల్ నుండి అమ్మకు ఫోనుచేసి జరిగిన దుర్ఘటనను వివరించాడు.

అతను ఆ వ్యాపారంలో ఒక భాగస్తుడు మాత్రమే అయినప్పటికీ - అతనికి ఉన్న డబ్బునంతా అందులో పెట్టుబడి పెట్టాడు. క్రితం సంవత్సరాల్లో అతనికి ధాన్యం వ్యాపారంలో నష్టం వచ్చింది. అతని యింట్లో దొంగతనం జరిగి రూ. 20,000/- లు పోయినయ్. గోరుచుట్టుపై రోకటిపోటుగా యిప్పుడు యీ విషాదోదంతం. అందువల్ల అతని మనస్సు బాగా దెబ్బతిన్నది. అతని మనస్సు పూర్తిగా చంచల మయింది.

అతని మొరను ఫోనులో విన్న అమ్మ అన్నది "నాన్నా - అవతల మనిషి ఎంత అవసరంలో ఉండి అట్లా చేశాడో. అదీగాక యిప్పుడు నీకంటే అతడే ఎక్కువ బాధపడుతూ ఉంటాడు".

"మరి, యిప్పుడు నన్ను ఏమి చేయమంటా వమ్మా --"

"నువ్వు చేసే దేమున్నది ? ఏదో ఒకటి అదే జరుగుతుంది కదా. జరిగేదాన్ని చూస్తూ ఉండు".

అమ్మ సలహా విన్న అప్పారావుకు అమితమైన బాధతోపాటు కోపం కూడా వచ్చింది. తాను ఇన్నేళ్ళుగా అమ్మనే నమ్మి కొలిచి నందుకు ఇదా ఫలితం ! ఇదా సమాధానం ? జరగవలసినదేదో జరగక తప్పనప్పుడు, జరిగేది చూస్తుండవలసినప్పుడు - ఇక ఈ దేవుళ్ళెందుకు ? ఈ పూజ లెందుకు ? ఈ ప్రార్థన లెందుకు ? అయినా, తాను ఇంత బాధలో జ్వలిస్తూ తెలియజేస్తే - తన సంగతి ఆలోచించడం, తనకు సానుభూతి అందజేయడం లేకపోగా, పైగా తనను మోసం చేసినవ్యక్తి కష్టాల గురించి సానుభూతి కనుపరుస్తూ అతనిపై కరుణను క్రుమ్మరించడం అప్పారావుకు విస్మయాన్ని కలుగజేసింది. అయినా అమ్మను ఏమనగలడు ?

"అమ్మా - నేనీ బాధనూ, నష్టాన్నీ, తట్టుకునే శక్తి నయినా ప్రసాదించు" అని వేడుకున్నాడు.

"నేను ప్రసాదించేది ఏముంది నాన్నా. ఆ శక్తి నీలోనే ఉన్నది....." అన్నది అమ్మ స్ఫుటంగా.

విచిత్ర మేమిటి అంటే - ఆ క్షణం వరకూ ఆందోళనతో అలమటించి పోతున్న తనలో ఆ క్షణంనుండీ ఒక విధమయిన స్థిమితం ఏర్పడిందీ - అంటాడు అప్పారావు.

"సరే నమ్మా - నేనెట్లాగో సర్దుకుంటాను. మా ఆవిడకు ఏలూరు ఫోనుచేసి కొంచెం ధైర్యం చెప్పమ్మా --" అని బతిమిలాడు కున్నాడు. ఏలూరులో అతని

భార్య గుండె నిబ్బరం కోల్పోయి కుప్పకూలి పోయింది. దిగులుతో నిద్రాహారాలు మరచిపోయింది.

అమ్మ వెంటనే ఏలూరు ఫోనుచేసింది. ఆవిడతో మాట్లాడింది. ధైర్యాన్ని ప్రసారం చేసింది. "నువ్వేమీ భయపడొద్దు. నే వున్నాను. అన్నీ నేను చూసుకుంటాను'' అని.

ఆ వాక్కూ హామీ విన్నప్పటినుంచీ ఆమెలోకూడా ఆందోళన తగ్గిందట.

అప్పటినుంచీ అమ్మ దివ్యశక్తి యీ విషయంలో పనిచేయ నారంభించిందని అప్పారావు అభిప్రాయం. ఎందుకంటే బెహరా కథనం ప్రకారం - అతను లోగడ ఎన్ని దొంగతనాలు చేసినప్పటికీ, ఎంత పెద్ద మొత్తాలు హరించినప్పటికీ - అతనిలో మున్నెన్నడూ కలుగని కొన్ని అపూర్వమయిన భావసంచలనాలు ప్రారంభమయి నాయట. అనిర్వచనీయమూ, అదృశ్యమూ అయిన ఏదో దివ్యశక్తి ఒకటి తనను వెన్నాడు తున్నట్లు అనుభూతి కలిగేదట.

తత్ఫలితంగా జులై 12వ తేదీన విజయవాడ వచ్చి తన తప్పును ఒప్పుకుని, తాను కాజేసిన డబ్బుకుగానూ తన లారీని అప్పారావుకు యిస్తానని వాగ్దానం చేశాడు. తనను తన తమ్మునిగా భావించి, కోర్టులో కేసు లేకుండా కాపాడ మన్నాడు. అతనికి కొద్దికాలం క్రితమే వివాహ మయిందట. కానీ ఈ వ్యసనాలకులోనై భార్యతో ఎక్కువకాలం గడపలేదట. భార్యకూ, సంసారానికి తాను దూరమై పోతాననే భావం ఏర్పడినప్పుడుగానీ అతనికి దాని విలువ అర్థం కాలేదు.

ఈ జాలిగాథ వినేసరికి అప్పారావులో అనురాగం పొంగిపొరలింది. తన తమ్ముడే ఏదయినా తప్పుచేస్తే, అతణ్ణి తాను పోలీసులకు అప్పచెబుతాడా, కటకటాల వెనక్కు పంపుతాడా ? వెంటనే అప్పారావుకు - అమ్మతో తాను ఫోనులో మాట్లాడి నప్పుడు అమ్మ పలికిన పలుకులు స్ఫురణకు వచ్చినయ్. అమ్మ అతనిపై అపారమైన ప్రేమనూ కరుణనూ కనుపరిచింది.

మరి, అమ్మకు అందరూ బిడ్డలే కదా. మంచివాడూ బిడ్డే. చెడ్డవాడూ బిడ్డే. దొంగా బిడ్డే. దొరా బిడ్డే. బిడ్డలు ఏం చేసినా తల్లికి తప్పే కనుపించదు. మరి, అమ్మకు అతడు బిడ్డ అయినప్పుడు తనకు సహోదరుడే గదా. మరి, యిక తన తమ్మునిపై తనకు కక్షసాధింపు ఎందుకు ? అదీగాక అమ్మ అనేక పర్యాయాలు చెప్పింది - "ఎవరు ఏమి చేసినా అందుకు వారేమీ బాధ్యులు కారు. అందరినీ నడిపే ప్రేరణ ఒకటి ఉన్నది. కనుక ఒకడు మంచి చేసినా వాడిని పొగడ నవసరం

లేదు ఒకడు తప్పుచేసినా నిందించ నవసరం లేదు" అని మరి, భగవన్నిర్ణయమయిన కార్యక్రమంలో అతడూ ఒక సాధనం మాత్రమే అయినప్పుడు అతనిపై విరోధం ఎందుకు? - ఎప్పుడూ అమృతత్వాన్నీ అమ్మ వాక్యాలనూ పునశ్చరణ చేసుకుంటూ ఇతరులకు బోధించే తాను తన విషయం వచ్చేసరికి పారిపోతే ఎలా?

అమ్మకు అందరూ బిడ్డలయినప్పుడు లోకంలో అందరూ తనకు సోదరులే కదా. అసలు, అమ్మ మనలో విశ్వసహోదరభావం కలిగించేందుకే తాను 'విశ్వజననీ' సంభావనను ప్రపంచానికి ప్రసాదించిందా ? మరి, అమ్మ ప్రసారంచేస్తున్న యీ మహాసందేశాన్ని తాను ఏమి అర్థం చేసుకున్నట్లు ? ఆచరణలేని ఆదర్శానికి ప్రయోజన మేమున్నది ?

... ఇట్లా ఆలోచనలు అంతరంగంలో తరంగిత మయ్యేసరికి - అప్పారావులో బెహరాపై అవ్యాజమైన అభిమానం ఏర్పడింది. అతడిని ఎలాగైనా రక్షించాలనే అభిప్రాయం కలిగింది అలా అతనికి వాగ్దానం చేశాడు.

ఈలోగా బెహరా అన్నదమ్ములు చాలా వక్రగత్తుల్లో ఆలోచనలు చేసి - లారీ అప్పారావుకు యివ్వవద్దని సలహా యిచ్చారు. కానీ బెహరా వారి సలహాను సమ్మతించలేదు.

జులై 21వ తేదీన బెహరా అదోని మేజిస్ట్రేట్ కోర్టులో లారీని అప్పగించాడు. అంతకుముందే 407వ సెక్షనుక్రింద కేసు రిజిష్టరు అయినందువల్ల బెహరాను అదోని తాలూకా జెయిల్లో బంధించారు.

అక్కడ అతనికి ఒక అనుభవం అయింది. తనతోపాటు కారాగారంలో ఉన్న ఇద్దరు ఖైదీలు మాట్లాడుకుంటూ ఉండగా అతను విన్నాడు. ఒక ఖైదీ మరో ఖైదీని అడిగాడట - తాను ఏమి తప్పు చేస్తే శిక్ష విధించబడిందని. తన కుటుంబం పస్తులతో ఉంటే చూడలేక అతడు అరబస్తా ధాన్యం మాత్రం దొంగతనం చేశాడట. రెండో అతనుకూడా చాలా చిన్న దొంగతనం - అదీ అత్యవసరమై చేశాడట.

ఆ సంభాషణ నిన్న బెహరాలో పశ్చాత్తాపం రగిలింది. వాళ్ళు అత్యవసర పరిస్థితుల్లో చాలా చిన్న దొంగతనాలు చేస్తేనే వాళ్ళకు శిక్ష తప్పలేదు. మరి - తాను ధన ప్రలోభంతో, విలాస జీవితంపై వ్యామోహంతో ఒక ఉత్తముని మోసంచేసి ధనం అపహరించాడు. కనుక తాను శిక్ష అనుభవించడం న్యాయం. మరి, తాను శిక్ష అనుభవిస్తూ బందిఖానాలో ఉంటే తనను నమ్మి తన జీవితాన్ని పంచుకున్న ఉత్తమురాలైన భార్య గతి ఏమిటి ?

దుస్సహమైన యీ ఆలోచనలతో కన్నీటిధారలతో అప్పారావును వేడుకున్నాడు. అప్పారావు యిచ్చిన హామీవలన బెహరా తాత్కాలికమైన విడుదల పొందాడు.

డిశంబరు చివరివారంలో అదోని కోర్టులో విచారణ బెహరా అప్పారావూ ఇద్దరూ అదోని వెళ్ళారు.

క్షణక్షణానికీ అప్పారావులో సోదరభావం ఉత్తుంగ తరంగితమై అతణ్ణి నిలువెల్లా ఆక్రమించి అతని రక్తంలోని కణకణాన్నీ మధురభావ ప్రభావితంచేసి అతని సమస్త నాడీమండలాన్ని సముత్తేజపరచి కర్తవ్యోన్ముఖంచేసింది. బెహరాను ఎట్లాగైనా గత మార్గాన్నుంచి మళ్ళించి ఉత్తమ మానవునిగా సత్పాదునిగా తీర్చి దిద్దాలనే పట్టుదల మనసంతా నిండిపోయింది. కనుకనే బెహరాను వెంటబెట్టుకుని మహానంది, మంత్రాలయం వగైరా పుణ్యక్షేత్రాలన్నీ చూపించాడు. ఎన్నో కథలూ, గాథలూ వివరించాడు. సమయం దొరికినపుడెల్లా అమ్మ గురించి తెలియజేశాడు. అమ్మ ప్రేమమార్గాన్ని విపులీకరించాడు.

పాపులయెడల, పతితుల యెడల అమ్మకు గల ఔదార్యమూ, క్షమా, అనురాగమూ సోదాహరణంగా బోధించాడు. పుణ్యశీలురనూ, పావన చరితులనూ సన్మార్గులనూ ప్రేమించే గౌరవించే వ్యక్తులు ఎక్కడైనా ఎందరైనా ఉండవచ్చును గానీ - పాపులనుకూడా "నాబిడ్డలే" అని అనుకోవడమే కాక బాహాటంగా ప్రకటించి వారినీ తన ఒళ్ళో చేర్చుకుని ఓదార్చే వ్యక్తులను జీవితంలోగానీ, లోకంలో గానీ, చరిత్రలోగానీ మరెక్కడా చూడలేదని ఉద్ఘాటించాడు. తనకు అమ్మే ఆదర్శమన్నాడు. అమ్మే ఆరాధ్య మన్నాడు. అమ్మే సర్వస్వమన్నాడు. తన జీవితానికి ఆధారమూ ఆలంబమూ గమ్యమూ అమ్మేనన్నాడు. తనకే కాదు సర్వలోకానికీ సమస్త జీవులకూ, సర్వ సృష్టి స్థితి లయాలకూ మూలం అమ్మేనని తన విశ్వాస మన్నాడు.

బెహరా అన్నీ విన్నాడు. అంతా జీర్ణించుకున్నాడు. అతనికి తానొక కొత్తలోకానికి వచ్చినట్లుగా ఉన్నది. వీళ్ళందరూ మనావులుగా కనుపించడం లేదు. దేవతలుగా దర్శనమిస్తున్నారు. అపకారులకూ ఉపకారం చేయడం 'నేర్పరి' లక్షణంగా తాను విన్నాడుగానీ అది సహజగుణంగా కలవారిని తానింతవరకూ చూడక పోవటమే కాదు, విననుగూడా లేదు. సాధారణ మనుషుల్లో ఇంత గొప్పగుణం ఆదర్శమే ననుకున్నాడు గానీ లోకంలో ఇటువంటి వ్యక్తులను తాను ఎరుగనన్నాడు. కనుకనే అవినీతి పూరితమైన గత నికృష్ట నీచ జీవితమంటే తనకు అసహ్యమనిపించింది. నిజాయితీ జీవితంలోని సుధామాధుర్యం తనను ఆకర్షించింది. శేషజీవితం పవిత్రంగా గడపాలనే దృఢ నిశ్చయం కలిగింది.

డిసెంబరు 31వ తేదీన తీర్పు చెప్పారు. బెహరాకు ఆనాడు కోర్టు ముగిసేవరకూ నిర్బంధమూ, రూ 2000/-లు అపరాధమూ విధించారు. బెహరావద్ద పైకం ఏమీ లేదు. తన బంధువులు ఎవరూ తనకోసం రాలేదు ఆ సమయంలో అప్పారావు తానే ఆ పైకాన్ని న్యాయస్థానంలో కట్టి అతణ్ణి విడుదల చేయించాడు.

ఇక, అతను ఒక్కక్షణం వృధాపోనీయక - అమ్మను చూపించమని అప్పారావును వేడుకున్నాడు. ఇద్దరూ కలిసి జిల్లెళ్ళమూడి వచ్చారు.

అనుక్షణమూ అమ్మసూక్తులను అధ్యయనంచేసే తనకు ఒక క్లిష్ట పరిస్థితిలో అమ్మ సందేశాన్ని ఆచరణలో పెట్టకలిగిన హృదయాన్ని ప్రసాదించినందుకు అప్పారావు అమ్మ పాదాలకు ప్రణమిల్లాడు. తన కొక కొత్త మార్గాన్ని చూపి కొత్త జీవితాన్ని ప్రసాదించినందుకు బెహరా అమ్మ ముందు మోకరిల్లాడు.

ఇద్దరినీ చెరొక చంకలోకి తీసుకుని ఆనందపరవశురాలయిన 'విశ్వజనని' నయన యుగళిలో వెలిగిన కాంతిరేఖలతో ఆ గదిఅంతా దివ్యదీప్తి భాసితమయింది. ప్రతివాడూ అప్పారావువలే ప్రతి తోటి వాడినీ తోడబుట్టువుగా భావించి ప్రేమించ గలిగితే అమ్మను 'విశ్వజనని'గా ఆరాధించే మన పూజలకు సార్థకత కలుగుతుంది. అవతార మూర్తి అమ్మ అందరినీ తన బిడ్డలుగా చూడడంలో అంతర్యం 'మన మందరం ఒక తల్లి బిడ్డలమే' అన్న భావం మనలో పాదుకొల్పడమే కదా ! అది మనం అర్థం చేసుకుని ఆచరించ గలిగితే - ఆ భావం మన రక్తగతమైతే - అప్పుడు మనందరం అమ్మకు నిజమైన వారసుల మవుతాం. ఆ రక్తమాంసాల్ని పంచుకు పుట్టినవాళ్ళ మవుతాం.

అప్పుడు యీ లోకం నాకమే కాదూ ?

(ఫిబ్రవరి 1978)



# 129
# నిరీక్షణ

"అమ్మను చూట్టానికి జిల్లెళ్ళమూడి ఎన్ని గంటలకు వెళ్ళమంటారు ?"

బాపట్లలో ప్రెస్సులో పనిచేసుకుంటున్న నన్ను ఒక సోదరుడు అడిగాడు.

"మీ వీలు ప్రకారమే వెళ్ళండి - ఎప్పుడు వెళ్ళినా ఫర్వాలేదు" అని చెప్పాను.

"అట్లాగాదు - దర్శనం ఎన్నిగంటలకో సరిగా చెప్పండి" అతను స్పష్టమైన సమాధానం కోరాడు.

"ఇన్ని గంటలకు దర్శనం అని నియమం ఏమీలేదు. అహర్నిశం అమ్మదర్శనం చేసుకొనవచ్చును".

"మీరు ఏమీ అనుకోవద్దు - యింతగా ఎందుకు అడుగుతున్నానంటే - క్రిందటి నెలలో నేను ఒకసారి ఉదయం జిల్లెళ్ళమూడి వెళ్ళాను. మధ్యాహ్నానికిగానీ నాకు దర్శనం కాలేదు. ఎంతోకాలం వృధా అయిపోయింది" నేను వింటూ ఉన్నాను. అతను మళ్ళీ అడిగాడు

"అందువల్ల... నేను ఏ సమయానికి వెళితే వెంటనే అమ్మ దర్శనం అవుతుందో చెప్పండి. సరిగ్గా ఆ సమయానికే వెళ్ళి అమ్మను చూసి తిరిగి వస్తాను".

అమ్మ తన కొక ప్రత్యేక కార్యక్రమమంటూ లేదని వివరిస్తూ "నాకు పని అంటూ ఉంటే - అది మీకు కనపడటమే" నని ఉద్ఘాటించింది. "అమ్మ"ను నిర్వచిస్తూ "అమ్మ అంటే అంతులేనిదీ అడ్డు లేనిదీ" అని ప్రకటించింది.

కనుకనే అమ్మను ఎవరయినా ఎప్పుడయినా చూడవచ్చును. అమ్మను చూడటానికి ఏ కాలనియమమూ లేదు; ఏ అర్హతా, యోగ్యతా అక్కరలేదు. ఏ మ్రొక్కుబడులూ చెల్లించ నవసరం లేదు. ఏ ముడుపులూ కట్టనవసరంలేదు. అందరూ నిర్నిబంధంగా అమ్మను దర్శించవచ్చును... అమ్మలో అదికూడా ఒక విశేషమే !

తాను 'వల్లకాని మిట్ట' అధిరోహించి నప్పటికీ - తనను చూడకోరి వచ్చినవారిని అమ్మ ఎంతో ఆదరంగానూ, అపేక్షతోనూ చూస్తుంది. వారికి ఏ మాత్రం అసౌకర్యం కలిగించదు. ప్రతివారికీ దర్శనం ఇచ్చి సంఘటంలో అమ్మ చూసే శ్రద్ధ నిరుపమాన మయినది. ఒక్కొక్కసారి ఒక్కొక్కడు ఆవరణలోకి వచ్చి తెలియక ఎక్కడెక్కడో తిరుగుతుంటే - అమ్మే వాళ్ళను పిలిపించి దర్శనం ప్రసాదిస్తుంది.

కాని ప్రస్తుతం అమ్మ ఆరోగ్యం ఏమీ బాగాలేదు. అమ్మ మాటల్లో చెప్పాలంటే - అమ్మ శరీరం 'చివికిన గుడ్డ' వలే ఉన్నది. 'గాజుబొమ్మ' లాగున్నది. విశ్రాంతి అవసరమని వైద్యులు పదే పదే తీవ్రంగా హెచ్చరిస్తున్నారు అయినప్పటికీ అవసరం ఎంతో బలవత్తర మయితే కానీ అమ్మ విశ్రాంతి తీసుకోదు. అటువంటి సమయాల్లో వచ్చినవారికి వెంటనే అమ్మ దర్శనం లభ్యంకాదు.

ఇంకొక తరుణం ఉన్నది - అమ్మ దర్శనానికి వీలుకానిది - అది అమ్మ స్నానం వేళ.

అమ్మ స్నానం చేయటానికి కనీసం గంటపడుతుంది. అటువంటి స్నానాలు రోజుకు నాలుగయిదు చేయవచ్చును. అమ్మ ఆధ్యాత్మిక రహస్యం ఈ స్నానంలోనే ఉన్నదని అనేకులు అభిప్రాయ పడతారు. కొన్ని వందల బిందెల చన్నీళ్ళు పోసుకుంటే కానీ అమ్మ శరీరానికి తృప్తిలేదు; శరీరంలో నిరంతరం రగిలే మంటలు చల్లారవు. ఆ మంటలు రోగానికి సంబంధించినవని అమ్మ అంటుందీ; యోగానికి సంబంధించిన వని విజ్ఞులు భావిస్తారూ.

కానీ అవాంతరం ఎందుకు ఏర్పడినప్పటికీ - అమ్మ దర్శనంలో ఆలస్యం కావటంకూడా మంచిదే. ఆ నిరీక్షణలోని సమయం ఏ మాత్రమూ వ్యర్థంకాదు. అసలు వెంటనే దర్శనం అయ్యేకంటే - ఆ నిరీక్షణ అవసరంకూడా. సరాసరి క్షణాల్లో - ఏ వాహనంలోనో అమ్మ నివాసం చేరేకంటే - ఏడోమైలు వద్ద బస్సు దిగి ఆ మైలున్నర దూరం కాలినడకన రావటంలో కూడా అనితర సాధ్యమయిన ఒక మధురానుభూతి ఉన్నది.

అమ్మ నివాసమునకు రాగానే అమ్మదర్శనం వెనువెంటనే చేసుకుని మరుక్షణంలోనే వెనుదిరిగి వెళితే అది యాంత్రికంగానే ఉంటుంది. అందులో సౌకర్యం ఉండవచ్చునూ; కాలహరణం లేక పోవచ్చునేమోగానీ రసానుభూతి మాత్రం కలగదు.

అమ్మ గదిముందు కూర్చుని అమ్మ రాకకోసం ఎదురు చూడడంలో ఎంతో ఆనందం ఉన్నది. ఆ ఉత్కంఠలో ఒక మధురానుభవం ఉన్నది. కనపడబోయే అమ్మను గురించి ఆలోచించుకుంటూ ఉంటే - అమ్మ మూర్తితోపాటు మన గత జీవితంలోని అనేక ఘట్టాలు తెరమీద బొమ్మలవలే మనకు దృగ్గోచరమౌతాయి. మనం అనుకోకుండానే మన పాపపుణ్యాల బేరీజు జరుగుతుంది. పశ్చాత్తాపాగ్నిలో మనసు పునీతమవుతుంది పునీతమయిన మనస్సు క్రమేణా అమ్మ మూర్తితో నిండి పోతుంది. అమ్మ మూర్తితో నిండడం అంటే అమృతంతో నిండడమేగదా !

అపుడు అమ్మకూ తనకూ మధ్యగల గోడలూ, తలుపులూ బదాబదలై పోతాయి. ఎవరిని చూసినా అమ్మే అనిపిస్తుంది. కనుపించిన ప్రతివారిపై పూజ్యభావం ప్రభవిస్తుంది. అందరిపైనా ప్రేమ జన్మిస్తుంది. కన్ను తెరిచినా, మూసినా అమ్మరూపమే కనిపిస్తుంది. ఒంటికి గాలి తగిలితే - ప్రేమతో అమ్మే నిమురుతున్న దనుకుంటాడు. శబ్దం వినిపిస్తే ఆప్యాయంగా అమ్మే పలకరిస్తున్న దనుకుంటాడు. ఆకలి ఉండదు; దాహం ఉండదు. ఈ లోక స్ఫురణే ఉండదు.

అదొక అపూర్వానుభవం. అదొక అనుపమానుభవం. ఆ అవస్థను సమాధి అనవచ్చును; సాలోక్యమనవచ్చునూ; సామీప్యమనవచ్చునూ, పేరు ఏదయితే నేమీ, ప్రతివాడూ కోరుకొన దగినస్థితి.

అందుకనే ప్రెస్సులో ఆ సోదరునితో చెప్పాను.... అమ్మ సన్నిధిలోని అనుభవం ఎంత గొప్పది అయినప్పటికీ, అమ్మకోసంచేసే నిరీక్షణకూడ ఒక అద్భుతమయిన అనుభవమనీ, దానిని ఎవరూ వదులుకో రాదని....

(మార్చి 1978)



**దేవుడు**

దేవుడిని గురించి తెలుసుకోవటమంటే - వాడు (ప్రత్యేకంగా) లేడని తెలుసుకోవటమే. - అమ్మ

# 130

# న్యూనాధికవివర్జిత

"అమ్మా - మేము క్రీస్తును దైవం అని నమ్ముతున్నాము. కాని క్రీస్తు తాను దైవం యొక్క కుమారుణ్ని మాత్రమే అని చెప్పుకున్నాడు. మీ విషయమై మీ రే మంటారు ?" అని ఇజ్రాయిల్‌కు చెందిన ఒక క్రైస్తవ సోదరుడు అమ్మనే సూటిగా ప్రశ్నించాడు.

"నేను అట్లా అనుకోవడం లేదు - నాన్నా. నా కంటెపైన మరొకరు ఉన్నారని అనుకోవడమూ లేదు. నాకంటే క్రింద ఉన్నారని అనుకోవడమూ లేదు" అమ్మ చాలా ఉదాసీనంగా జవాబిచ్చింది.

అంటే - ఉన్నదంతా తాను మాత్రమేనని గదా ! "అహం బ్రహ్మాస్మి" అన్న ఉపనిషత్ వాక్యాన్ని ఎంత నిర్లిప్తంగా అమ్మ చెప్పింది !

అమ్మలోని విశేషమే అది. ఎన్ని రకాలుగా అడిగినా, ఎన్నిసార్లు అడిగినా, ఎప్పుడు అడిగినా, ఎందరు అడిగినా - అమ్మ నుండి ఒకటే సమాధానం.

"అంతా అదే" నని.

"అన్నీ నేనే" నని.

అమ్మ అద్వైతసిద్ధి అపూర్వమయినదీ; అనితరసాధ్యమయినదీ; అనుపమాన మయినదీ. అమ్మ ఏమి చెప్పినా, తన స్వానుభవం నుండి మాత్రమే చెబుతుంది కనుకనే అమ్మపలుకుల్లో అంత సౌందర్యమూ, సౌరభం సౌలభ్యమూ వెల్లివిరు స్తుంటాయి.

ఒకరు 'అమ్మా - మీరు సాక్షాత్తు రాజరాజేశ్వరి అవతార మమ్మా --' అంటే "మీరు కానిదీ నేనేమీ కాను నాన్నా" అన్నది.

ఒకరు 'మిమ్మల్ని గురించి ఆలోచించు కుంటున్నారా ? మమ్మల్ని గురించి ఆలోచిస్తున్నారా ? అని అడిగితే - "ఏదైనా ఒకటే నాన్నా. మీరు నేను కాకపోతేనేగా' ' అని అమ్మ సమాధానం చెప్పింది.

"అమ్మా - మీలోకి చూచుకుండేకంటే మా గురించిన ఆలోచనలోనే మీ కాల మంతా వృధా అవుతున్నది' అన్న సోదరునితో "తానే అయి ఉన్నా, లోకంవైపు చూచినా, యీ వ్యాపారంలో లాభ నష్టాలు లేవు" అని ఉద్ఘాటించింది అమ్మ.

"కనబడే జగత్తూ, కనబడని బ్రహ్మ - వేరు కావు" అని అనేక పర్యాయాలు ప్రకటించింది అమ్మ

"అంతా నేనే అనుకుంటున్నప్పుడు ప్రత్యేకించి భక్తులెవరూ?" అని ప్రశ్నించింది అమ్మ

"మీరంతా నా అవయవాలనుకుంటున్నాను. చెయ్యి నొప్పి కాలికి తెలియదు. కాలినొప్పి కంటికి తెలియదు. కాని అన్నిటి నొప్పి నాకు తెలుస్తుంది".

"బాధ ఎవరిదైనా అనుభవం నాదే".

ఒకసారి అమ్మ సృష్టిని గురించి వివరిస్తూ "సృష్టి అనాది" అంటూ "నాది" అని కూడా స్పష్టంగా చెప్పింది.

ఎన్నో రీతుల్లో అమ్మ -తనకూ, దైవానికీ; తనకూ, యీ సర్వసృష్టికి - అభేదాన్ని అభివ్యక్తం చేసింది. దైవంతో తాదాత్మ్య స్థితిని అంగీకరిస్తూనే "నేనూ మీలాంటిదాన్నే' ' అని మన సరసనూ నిలుచుంటున్నది.

ఇటీవల అమ్మ నివసించే గది ప్రక్కనే 'దర్శన మందిరం' నిర్మించాలని ఆలోచనచేసి కారణాంతరాలవల్ల ఆ స్థలంలో అందరకూ పనికివచ్చే గదులు కట్టించడమే చేయాలని ఆలోచిస్తుండగా - సోదరుడు జేమ్సు 'అమ్మతో సమానంగా మనం నివసించడమా ?' అని ప్రశ్న వేశాడు. అమ్మ వెంటనే "నేను మీతో సమానంగా ఉంటున్నప్పుడు - మీరు నాతో సమానంగా ఉండటానికి ఏమిటీ ?" అని ప్రశ్నించింది.

ఎవరైనా సరే - సామాన్య మానవ సరిహద్దులు దాటిన తరువాత - దైవంతో తాదాత్మ్యస్థితిని ప్రకటించుకొన వచ్చును, నాకంటె పైన ఎవరూ లేరని ప్రకటించ వచ్చును కానీ - ఆ స్థితిలో నుండి 'నా కంటే క్రింద ఎవరూ లే'రనీ 'నేనూ మీలాంటి దాన్నే'ననీ చెప్పుకొన గలగడం అపూర్వమయిన విషయం. అదే అమ్మలోని అద్భుతమైన విశేషం.

(ఏప్రిల్ 1978)



# 131
# "రోగి కూడా నారాయణుడే"

ఈ నెల 14వ తేదీన జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ మెడికల్ సెంటరుకు అమ్మ ప్రారంభోత్సవం చేసింది. ఆ పవిత్ర సమయంలో అమ్మ డాక్టర్లను ఉద్దేశించి - "వైద్యో నారాయణ హరిః - అని పూర్వోక్తి. నా అభిప్రాయంలో అది అసమగ్రమైన వాక్యం. తనకు అయురారోగ్యాలనూ నవజీవనాన్నీ ప్రసాదించే వైద్యుని రోగి నారాయణ స్వరూపుడుగా భావించడమే కాదు, వైద్యుడుకూడా రోగిని నారాయణ స్వరూపుడుగానే భావించాలి. అపుడే డాక్టర్లు హృదయ పూర్వకంగా శ్రద్ధగా ప్రేమగా చికిత్స చేయగలుగుతారు. రోగికి చేసే ఏ చిన్నసేవ అయినా అది భగవంతుడుకి చేసే పూజ అవుతుంది. అసలు భగవంతుడంటే ఒక మూర్తి దాల్చి సింహాసనాసీనుడై పరిపాలకుడై సర్వ సృష్టి స్థితి లయకారుడై ఎక్కడో లేడు. ఈ కనిపించే సృష్టి సర్వమూ దైవ స్వరూపమే ఈ సృష్టికి ఆవల యిందుకు భిన్నంగా అవాఙ్మానస గోచరుడై దైవం ఎక్కడో లేడు. సృష్టియే దైవం. సృష్టిలో దైవం కానిది ఏమీ లేదు. భగవంతుడు రూపరహితుడుకాడు. మనకు కనిపించే అన్నిరూపాలూ అయినవాడు. కనుకనే ఎక్కడ ఎవరికి ఏ మాత్రం పరిచర్య చేసినా ఏ రూపంలో ఏమాత్రం సేవ చేసినా - అది దేవతార్చనయే అవుతుంది-" అని హితోపదేశం చేసింది.

అక్కడ స్థిరనివాసం ఏర్పరుచుకున్న ఆంగ్లసోదరుడు శ్రీ విలియం జేమ్సు కాంపియన్ ఆర్థిక సహాయంతో దాదాపు రూ. 80000/-ల ఖర్చుతో శ్రీ విశ్వజననీ పరిషత్‌వారు భవన నిర్మాణం చేశారు. అందులో పిల్లలకూ స్త్రీలకూ ప్రత్యేకమయిన ఉచిత చికిత్స జరుగుతుంది. ఆశ్రమవాసులకూ ఆ గ్రామస్థులకేగాక సర్వజనులకూ ఇక్కడ ఉచిత చికిత్స జరుగుతుంది. ప్రజల, ప్రభుత్వ సహకారం కూడా లభ్యమైతే - నిత్యమూ పరిసర గ్రామాలక్కూడా వెళ్ళి వైద్య సలహాలూ మందులూ ఉచితంగా యిస్తూ - పేద ప్రజలకూ బలహీన వర్గాలకూ కూడా వైద్యచికిత్సను అందుబాటులోకి తీసుకురాగల మొబైల్ హాస్పిటల్‌ను నిర్వహించాలని నిర్వాహకుల ఆశయం.

ప్రస్తుతం హాస్పిటల్లో నాలుగు పడకలుమాత్రం ఏర్పాటయినాయి. ఆ భవనంలోనే డాక్టరు నివాసంకూడా నిర్మించడం ఎంతో అనుకూలంగా ఉంది.

అక్కడనే క్లినికల్ లేబరేటరీకూడా ఉచితంగా ఏర్పాటుచేయడం హర్షించదగ్గ విషయం. అన్ని సదుపాయాలతో సౌకర్యాలతో ఆ భవనం అత్యంత రమణీయంగా అలరారుతోంది.

ఈ హాస్పిటల్లో డాక్టరుగా ఏ. ఇనజకుమారి ఎం.బి.బి.యస్. నియమించ బడింది. ఈ బృహత్ కార్యక్రమం నిర్వహణకోసం యీమెకు నెల్లూరులో శ్రీ అన్నపూర్ణా క్లినిక్‌లో ప్రసిద్ధ డాక్టర్ యస్.వి. సుబ్బారావు గారి దగ్గర మూడు సంవత్సరాలు శిక్షణ యిప్పించబడ్డది. ఇక్కడ విచిత్రం ఏమిటంటే - నేడు ప్రారంభమైన హాస్పిటల్‌కు డాక్టరును అమ్మ మూడేళ్ళక్రితమే నియమించింది. జిల్లెళ్ళమూడిలో స్థాపించ బడ్డ ఓరియంటల్ కాలేజీకి కూడా అమ్మ ఎనిమిది సంవత్సరాలు ముందుగానే ప్రిన్సిపాల్‌ను నియమించడం జరిగింది. సంస్థలను స్థాపించి తర్వాత వ్యక్తులను నియమించడం సాధారణ ప్రక్రియ అయితే అమ్మ మాత్రం ముందుగా వ్యక్తులను ఏరుకుని తర్వాత సంస్థలను నిర్మిస్తుంది.

ఈ ఆరోగ్య సముద్ధరణ కార్యక్రమానికి తమః సహకారాన్ని ప్రకటిస్తూ - బాపట్లలోని 'సేవ్ ది చిల్డ్రెన్' సంస్థవారు రూ. 15000/- లకు చెక్కును అమ్మకు సమర్పించగా అమ్మ హాస్పిటల్ నిర్మాహకులకు దానిని ప్రసాదించింది.

అమ్మ మనకు ప్రసాదించిన మూడవ వరం హాస్పిటల్. మొదటిది - అన్నపూర్ణాలయం. రెండవది - విద్యాలయం, మూడవది - వైద్యాలయం. ఈ మూటి ద్వారా అందరికి అన్నమూ, విద్యా వైద్యమూ ఉచితంగా అందించాలని అమ్మ సంకల్పం.

ఒక ఆధ్యాత్మిక కేంద్రంలో సామాజిక సేవా కార్యక్రమాలకు యింత ప్రాధాన్యం యిచ్చి అందులో తాను పాల్గొంటూ యితరులకు ఉద్బోధనూ ఉత్తేజాన్నీ అందించడం అమ్మలోని మానవతావాదానికి సర్వజన మమకారానికీ తార్కాణమే కాదు, ఉపదేశాలూ, సందేశాలూతోనే కాలయాపన చేయని కార్యశీలతక్కూడా ప్రత్యక్ష నిదర్శనం.

ప్రతివాడూ తమ అధివ్యాధుల నివారణకోసం ఆధ్యాత్మిక వ్యక్తులవద్దకూ ఆశ్రమాలకూ పరుగులుతీస్తున్న ఈ కాలంలో అమ్మ తన ఆశ్రమంలోనే రెండు వైద్యాలయాలను నిర్వహించడం గమనించదగిన విషయం.

ప్రభుత్వంవారు ఎంతగా ప్రోత్సాహపరుస్తున్నప్పటికీ - డాక్టర్లు పల్లెటూళ్ళకు వెళ్ళి ప్రాక్టీసు చెయ్యటానికి ఇష్టపడక - పట్టణాల్లోనే ప్రాక్టీసుచేయటానికి ఉబలాటపడే కాలంలో - ఒక వైద్యశాస్త్ర పట్టభద్రురాలు స్వార్థరహితంగా సాహసంతో మారుమూల

గల ఒక కుగ్రామానికి రావటం ప్రశంసనీయమైన విషయం. అందుకు దోహదం కలుగజేస్తూ ఒక బృహత్తర ప్రణాళికను సిద్ధంచేసిన శ్రీ విశ్వజననీ పరిషత్‌వారి ఔదార్యమూ, ప్రజాహితచింతన ఆదర్శప్రాయమైనవి.

హాస్పిటల్ ప్రారంభోత్సవ సమయంలో జరిగిన ఒక ఘటన సంస్మరణీయ మైనది. నిత్యరోగి అయిన అమ్మ డాక్టర్ చెయిర్‌లో అసీనకాగా - ప్రసిద్ధుడైన డాక్టర్ సుబ్బారావుగారు - మొదటి పేషెంటుగా వెళ్ళి బల్లపై కూర్చున్నాడు అమ్మ అతడిని ఆ పరీక్షా ఈ పరీక్షా చేస్తూ కుడిచేయి మణికట్టువద్ద పట్టుకున్నది. డాక్టరుగారికి అంతకు ముందు కొన్ని వారాలుగా అక్కడ నొప్పి ఏర్పడి, ధర్మామీటరు కూడా విదలించ నివ్వటంలేదట. కాని అమ్మ అమృతహస్తం తగిలిందో, లేదో ఆ నొప్పి మాయమైంది.

అదేదో కాకతాళీయమనుకోనటానికి - లోగడ ఇటువంటి సంఘటనలు అనేకం జరిగాయి. జిల్లెళ్ళమూడి నివాసి గాదె ముకుందు, గుంటూరు నివాసులు ఏకా పుండరీకాక్షయ్యగారు, అన్నం దుర్గమ్మగారు, వేటపాలెం గ్రామస్థులు, రాజుపాలెం రామచంద్రరావుగారు ఇంకెందరో ఉన్నారు. ఈ అదృష్టాన్నిపొంది ఇందుకు సాక్షులైనవారు. కానీ అమ్మను అడిగితేమాత్రం అందుకేవో భౌతికమయిన కారణాలు చూపించి - తన మహత్తు ఏమీ లేదనిచెప్పి మన నోళ్ళు మూయిస్తుంది అమ్మకూ మనకూ మధ్య ఇటువంటి తెరలు వేయటం అమ్మకు వేడుక.

అటువంటి ఒక తెర - ఈ హాస్పిటల్ కావచ్చు !

ఏమయినా - అనేక జబ్బులతో తాను అహర్నిశమూ బాధపడుతూ - మన ఆరోగ్యంకోసం మన ఆనందంకోసం ఆలోచిస్తూ ఆరాట పడటం ఒక్క అమ్మ మాత్రమే చేయగలుగు.

ఆకలి విషయంలోనూ అంతేగదా - చిన్నతనంనుంచీ తన ఆకలినోట్లో గుడ్డలు కుక్కి మన ఆకలి తీర్చటానికే అమ్మ నిరంతర ప్రయత్నం చేస్తున్నది.

మరి --

బిడ్డల గురించిన తపనే మాతృత్వమా ?

(మే 1978)



## 132
# "నువ్వేం చేసినా నా కోసమే"

జూలై 7వ తేదీ మధ్యాహ్నం అమ్మ పదసన్నిధిన ఒక్కడనే కూర్చున్నాను. ఇతరులెవరూ లేరు. ఇటువంటి సదవకాశం ఈమధ్య దొరకలేదు. ఇటీవల ఎప్పుడూ ఇరవైనాలుగు గంటలూ అమ్మ బహుజన పరివేష్ఠిత అయ్యే ఉంటున్నది. ఎన్నో విషయాలు అమ్మతో ఏకాంతంలో మాట్లాడాలని అభిలాష. అది తీరని కోరికగానే మిగులుతున్నది. నేను సారధ్యం వహించి ఎందరికో ఏకాంత సంభాషణకూ, అంతరంగిక విషయ నివేదనకూ అవకాశం కల్పిస్తూనే ఉన్నప్పటికీ - ఆ అవకాశం నాకుమాత్రం లభించటం లేదంటే - వినటానికి విడ్డూరంగానే ఉండవచ్చునుగానీ వాస్తవానికి ఏమాత్రమూ దూరమైన విషయం కాదు. ఎన్నో విషయాలు మనస్సులోకి తెచ్చుకుని ఒక విషయాన్ని అమ్మ ముందు ఉంచాను.

సాధారణంగా అమ్మతో నేనెప్పుడు సంభాషణకు ఉపక్రమించినా - ఒక తమాషా జరుగుతుంటుంది. నేను నా వ్యక్తిగత విషయమేదైనా అడిగితే - దాని సంగతి నీకెందుకూ, నేను చూసుకుంటానుగా - అంటుంది. ఆ విషయం నిజమే - సర్వసృష్టి స్థితి లయాలకు అమ్మే కారణమని గాఢంగా నమ్ముతూ ఈ ప్రశ్న అడగడంలో అర్థమేమున్నది ? ప్రతిసారీ ఒక ప్రశ్న అడగడమూ, అమ్మ సమాధానం విని సిగ్గుపడి నాలిక్కొరుక్కుని తలవంచుకోవడమూ జరుగుతూనే ఉన్నది. ఒక వేళ ఆధ్యాత్మికంగా ప్రశ్న ఏమయినా అడిగితే - ఇవన్నీ నీకెందుకు నాన్నా ? ఇది తెలుసుకోనందువల్ల నీకు కలిగే నష్టం ఏమిటి ? - అని ఎదురు ప్రశ్న వేస్తుంది అమ్మ. నిజమే. ఏమి తెలుసుకోవడానికి అయినా చరమస్థితి - దైవాన్ని తెలుసుకోవడమేగదా. దైవాన్ని తెలుసుకోవడం దైవానుగ్రహం పొందటంకోసమే మరి. ఆ కృప జడివానగా కురుస్తుంటే - ఇక విచారణ లెందుకూ ? సాధన లెందుకూ ?

మరి, ఆనాటి ప్రశ్నకు అమ్మ సమాధానం చెప్పేదో, లేదో... అంతలో ఒక సోదరుడు అమ్మ గదిలోకి ప్రవేశించి అమ్మ మంచం ప్రక్కనే కూర్చున్నాడు.

అమ్మ అతణ్ణి ఉద్దేశించి "అతనికి జీవితం వృధాగా గడిచి పోతున్నట్లు ఉన్నదట. జీవితానికి సార్థకత లేకపోతే బ్రతికి ప్రయోజన మేమిటి ? - అని అడుగుతున్నాడు...." అన్నది.

అతడు కృష్ణాజిల్లా నివాసి. సంపన్న కుటుంబీకుడు. బ్రహ్మచారి. గణనీయమైన ప్రభుత్వ ఉద్యోగి దురదృష్టవశాత్తూ - అతనికి ఒక మానసికవ్యాధి కలిగింది. ఎప్పుడూ తాను చనిపోతున్నా నన్న భావన కలుగుతూ అతడ్ని భయకంపితుణ్ణి చేస్తుంది.

అతని స్థితి అతనికి దుర్భరం కావటమే కాక అతని బంధువులకూ స్నేహితులకూ కూడా బాధాకరంగా పరిణమించింది.

అనేక విధాల చికిత్స జరిగింది. ఫలితం కనుపించలేదు, అతని హితాభిలాషు లందరూ అతని గురించి విచారగ్రస్తులయినారు.

ఆ సమయంలో అతణ్ణి చికిత్స నిమిత్తం దూరప్రదేశాలకు పంపే ఏర్పాట్లు చేస్తుండగా అతడే - నన్ను కాపాడ గలిగితే, ఒక అమ్మ మాత్రమే. ఇతరు లెవరూ నన్ను రక్షించలేరు - అన్నాడు.

అతని కోరిక మేరకు అతణ్ణి అమ్మ వద్దకు తీసుకువచ్చి విషయం విన్నవించారు. ఏ విషయంలోనూ కర్తృత్వమూ, బాధ్యతా తనపై పెట్టుకోవడం అమ్మకు అలవాటు లేదుగదా.

"ఇక్కడ ఉంచండి, డాక్టర్‌చేత చికిత్స చేయిస్తాను, నయం కావచ్చును" అన్నది అమ్మ.

అమ్మ తత్వమూ, అమ్మ సర్వసామర్థ్యమూ, అమ్మ మాటల తీరూ తెలిసిన వాళ్ళు - ఆ మాటలనే అమ్మ హామీగా, అభయప్రదానంగా భావించి అతణ్ణి జిల్లెళ్ళమూడికి వదిలి నిశ్చింతగా నిశ్చల చిత్తంతో వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు.

ఆనాటి నుండి అతని బాధ్యతను అమ్మ స్వయంగా తానే స్వీకరించింది. అతనికి ఏవేళ ఏ ఆహారం కావాలో తన నివాసంలోనే ఇప్పించేది. ఎక్కువ కాలం తన సన్నిధిలోనే కూర్చోబెట్టుకునేది. అతడు సహజంగానే చాలా బిడియస్తుడు అయినందువల్ల - అతడు అడగకుండానే అతని అవసరాలన్నీ తీరే ఏర్పాటు చేసింది. అమ్మ అంటే అడగకుండా పెట్టేదే అయినప్పటికీ - అందరి విషయంలో ప్రత్యక్షంగా బాధ్యత తీసుకోవడం భౌతికంగా సాధ్యపడని విషయం గదా !

అతనికి హోమియోలో చికిత్సకూడా ఏర్పాటు చేసింది.

ఒక వారం రోజులు కూడా గడపకుండానే అతనిలో అనల్పమైన పరిణామం గోచరించింది. స్థిమితం ఏర్పడింది. మనస్సుకు ధైర్యమూ వచ్చింది. ఈ స్థితికి అమ్మ అనుగ్రహమే కారణం - అని మనం అంటే, వైద్య ప్రభావమే నని అమ్మ అంటుంది. ఇలాంటి అనేక విషయాల్లో - ఒకరి జీవితంలో శుభపరిణామదశ రావడమూ, అతడు నా దగ్గరకు రావడమూ .... రెండూ ఏకీభవిస్తాయిగానీ, అతడు నా దగ్గరకు వచ్చినందువల్ల అతనికి శుభం చేకూరడం కాదు - అంటుంది. ఈ విషయాల్లో మనం అమ్మతో వాదనకు దిగి మన విశ్వాసాన్ని వ్యక్త పరిస్తే - చివరకు అమ్మ ఈ సత్ఫలితాలను మన 'విశ్వాసా'నికి ఆపాదించి 'విశ్వాసమే దైవం' - అని మనకు ఒక క్రొత్త పాఠం చెబుతుంది. మరి, మనం విశ్వాసంవల్ల దైవానుగ్రహం సంపాదించగలం అనుకుంటున్నాముగానీ - విశ్వాసమే దైవం - అన్న నిర్వచనం చదువుకోలేదు అట్లాగే జ్ఞానంవల్ల దైవాన్ని తెలుసుకో వచ్చుననీ, దైవాన్ని చేరుకోగలమనీ అనుకుంటున్నాముకానీ 'జ్ఞానమే దైవం' అనే మాట మనకు క్రొత్త విషయం. ఒకసారి అమ్మ అన్నది 'బ్రహ్మజ్ఞానం సరైన మాట కాదు, జ్ఞానమే బ్రహ్మ' అని

ఇప్పుడు అతనిలో ఒక కొత్త ఆలోచన, ఆవేదన బయలు దేరాయి. తన జీవితం నిరర్థకంగా గడిచిబోతున్నదని అతని తపన వ్యర్థంగా జీవించేకంటే మరణం మేలు అని అతని అభిప్రాయమూ. అందుకు అభిలాష. ఇదే విషయాన్ని అమ్మకు నివేదిస్తే - జీవితానికి సార్థకత ఏమిటీ ? - అని అతడ్నే అమ్మ అడిగింది. తన శరీరాన్నీ, శక్తినీ, మనస్సునూ, డబ్బునూ - అన్నిటినీ దైవమే తనకు ప్రసాదించాదని నమ్మి, ఆ సర్వమూ సంకోచంలేకుండా దైవానికే అర్పించడమూ, అంటే దైవసేవకే వినియోగించడమూ - అని వివరించి విషణ్ణ వదనంతో ఇంకా అన్నాడు "అమ్మా - మేము నిన్ను దైవం అని నమ్ముతున్నాము మా జీవనాకికి జీవితానికీ నీవే మూలం అనీ అనుకుంటున్నాము. మా జీవనానికి జీవితానికి నీవే మూలం అనీ అనుకుంటున్నాము. అయినా మాకు నీనుండి ఎన్నో దాపరికాలు. ఎన్నో రహస్యాలు. కనీసం మా బ్యాంక్ అకౌంట్లను నీకు సరెండర్ చేయలేక పోతున్నాము, వట్టి స్వార్థజీవనులం" అని.

"నాన్నా - నువ్వు చాలా పొరబడుతున్నావు. నువ్వు బ్రతుకు తున్నది నాకోసమే. ఉద్యోగం చేస్తున్నదీ నాకోసమే. ఇది నీకు తెలియక పోవచ్చును. అంతమాత్రంచేత నష్టం లేదు, నువ్వు ఏం చేసినా నాకోసమే. అది నాకే చెందుతుంది. ఈ విషయంలో నువ్వు దిగులుపడకు. ఈ కనుపించేవన్నీ దైవస్వరూపాలే. దైవం కాని

ప్రాణి, వస్తువు... ఏమీ లేదు. నువ్వూ దైవమే. ఈ సృష్టిలో ఏ ప్రాణికీ నీకూ కాకుండా నీ శక్తీ, సేవలూ ఎక్కడికి పోతున్నయ్ ? ఇందులో ఎవరికి చెందినా - అది దైవానికి చెందినట్లే. కనుక ఇందులో స్వార్థం అన్న ప్రసక్తే లేదు; అంతా పరమార్థమే" నని అమ్మ హితోపదేశంచేసి అతనిలో కొడిగట్టిన జీవితేచ్ఛను ఉజ్జ్వలం చేసింది.

జీవితంలో పరాజయాలూ, పరాభవాలూ పొంది నిరాశా నిస్పృహలకు లోనై లోకంపై విరక్తి విసుగూ పెంచుకుని జీవితాన్ని తుదముట్టించు కుందామని బలీయమైన ఇచ్ఛ కలిగి - తుదిక్షణాల్లో అమ్మదర్శనం చేసుకుని ఆ పావనపాదాలు కడసార స్పృశించి వెళదామని అమ్మ చెంతకు వచ్చే అనేకులు పరోక్షంగానో - ప్రత్యక్షంగానో, అమ్మ హితోక్తులచే, అమ్మ మమకారంచే ప్రభావితులై ప్రక్షాళితులై కొత్తరక్తంతో క్రొంగొత్త దృక్పథంతో ఉత్తేజితులై ఉత్సాహవంతులై జీవితం గురించి కొత్త నిర్వచనాలు తెలుసుకుని లోకంపై అభిమానమూ అనురాగమూ పెంచుకుని లోకంనుండి తామెలా ఆనందం పొందవచ్చునో పాఠాలు చదువుకుని తాము లోభులు కాక లోకహితంగా తమ జీవితాలను ఎలా మలుచుకోవాలో నేర్చుకుని తృప్తిగా జీవన మార్గాల పయనిస్తున్నారు.

అమ్మ ఒడిలో పెరిగినవానికి జీవితం ఒక అమృతకలశం !

అమ్మ బడిలో నేర్చినవానికి లోకం ఒక నందనవనం !!

(జూన్, జూలై, 1978)



నీడ

ఒక చెట్టున్నది. అది నీడ అందరికీ ఒకటిగానే యిస్తుంది. మంచివాళ్ళకు, చెడ్డ వాళ్ళకు - అందరికీ. ఆశ్రయించిన వాళ్ళందరికీ సమానంగానే నీడ నిస్తుంది.

- అమ్మ

# 133
# మహిమలు

ఆగష్టు 14న ఈ మాసపు సంపాదకీయం రాయాలని కూర్చున్నాను.

ఏ విషయంపై రాయాలీ అన్న ఆలోచనలో ఎన్నో సంఘటనలు, సంభాషణలు, సందేశాలు ముందుకు వచ్చి నిలుచున్నాయి.

అన్నీ ముఖ్యమయినవే. అన్నీ విలువైనవే. అన్నీ పాఠక సోదరులకు తెలియజెప్ప వలసినవే అయినా ఇన్ని ఒకేసారి చెప్పలేము కదా. ఏదో ఒకటే చెప్పాలి

సాధారణంగా సంపాదకీయం రాయాలని ఆలోచించేటప్పుడు - అమ్మ ఆధ్యాత్మిక వ్యక్తిత్వం, అమ్మ లౌకిక పరిజ్ఞానం, అమ్మ మహిమలు, అమ్మ మమతలు... వీటికి సంబంధించిన అసంఖ్యాక సంఘటనలు జ్ఞాపకాల తెరలను చీల్చుకుని బయటకువచ్చి కళ్ళముందు నిలబడి కలంలోకి ప్రవేశించటానికి పోటీపడతాయి.

బయట వాన కుండపోతగా కురుస్తున్నది. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడ్డట్లు పత్రికలూ, రేడియోలూ ప్రకటించాయి. అప్పటికి కురిసిన వానతోనే చుట్టూ జలార్ణవమై కనుపిస్తున్నది.

ఆలోచన ఆకస్మికంగా మహిమలపైకి పోయింది. ఈ మహిమలనేవి రెండు రకాలు. ప్రత్యక్షంగా జరిగేవి; పరోక్షంగా జరిగేవి. ప్రత్యక్షంగానంటే - చెప్పి చేసేవి; ఎవరైనా అడిగితే చేసేవి; చూసే వాళ్ళకు ఇంద్రియ గోచరమయ్యేవి. మహిమలను ప్రదర్శించేవాళ్ళ ఇచ్ఛాశక్తివల్ల, సంకల్పబలంవల్ల, మనోసిద్ధివల్ల ఇవి జరుగుతాయి.

పరోక్షంగా జరిగేవి అంటే - ఇందులో ప్రదర్శకులు ఉండరు; ప్రదర్శన ఉండదు, సంకల్పం ఉండదు, ప్రయత్నం ఉండదు. ఎంతటి అసాధారణక్రియ అయినప్పటికీ అత్యంత సహజంగా అలవోకగా జరిగిపోతుంది. ఆ సమయంలో అది అసాధారణ సంఘటన అనికూడా అనిపించక సర్వసామాన్యమయిన విషయం

వలెనే గోచరిస్తుంది. తీవ్ర పరిశీలనానంతరంకానీ అందులోని అసాధారణత్వమూ, అద్భుతమూ మహిమా స్ఫురించవు. అప్పటికయినా అందులోని అలౌకికత అభివ్యక్తం కావచ్చునుకానీ అందుకు కర్త యెవరో బోధపడదు. కర్త యొక్క గుర్తింపు కేవలం "విశ్వాసం" పైనే ఆధారపడి ఉంటుంది. అందువల్లనే "కర్త" వివాదస్పదమైన విషయమై పోతుంది. ఆ మాటకు వస్తే - అసలు విశ్వాసమే వివాదాస్పదమైన అంశం కదా !

మొదటిరకంవారు "సిద్ధవ్యక్తులు" అని పిలువబడితే - రెండవ రకంవారు "అవతారమూర్తులు' అని స్తుతింపబడుతారు.

ఈ నెల 9వ తేదీన జిల్లెళ్ళమూడిలో రెండు వివాహాలు జరగాల్సి ఉన్నాయి. లగ్నం మధ్యాహ్నం 1 - 2 గంటల మధ్య. క్రిందటి రోజుననే వధూవరులూ, బంధుజనమూ వచ్చి ఉన్నారు. కావల్సిన ఏర్పాట్లన్నీ జరిగాయి. కానీ 8వ తేదీ రాత్రినుండే జోరున వాన. ధార ఆగటం లేదు. పెండ్లి నిర్ణయం జరిపేటప్పుడే అనుకున్నాము - పెండ్లి మేడపైన అమ్మ సన్నిధిలోనే జరగాలని. వర్షం తగ్గకపోయినా క్రింద మందిరంలో వేదికపైన జరుపవచ్చునుగానీ అక్కడకు అమ్మ దిగి రాలేదు. అమ్మ ఆరోగ్యం ఏమీ బాగాలేదు. అమ్మ లేకుండా జరుపుకోవడం వాళ్ళకు ఎవరికీ యిష్టం లేదు.

పైన జరపటానికి - వర్షం గంటగంటకూ ఎక్కువ అవుతున్నది కానీ తగ్గే సూచనలకూడా కనిపించటం లేదు. ముహూర్తం సమీపిస్తున్నది. అందరికీ ఆందోళన అధికమవుతున్నది.

మధ్యాహ్నం పన్నెండయింది. ఆకాశం చిల్లిపడ్డదా - అనిపిస్తూన్నది వర్షం. వధూవరుల్లో ఎవరో బియ్యం బాగా తిని ఉంటారని కొందరు అనుకుంటున్నారు. కొందరు అమ్మా - యీ కార్యం నెరవేర్చి కాపాడు - మని వారి వారి మనస్సుల్లోనే ప్రార్థిస్తున్నారు.

అంతా అలజడిగా ఆందోళనగా ఉంది. మాక్కూడా కర్తవ్యం తెలీక - అమ్మ వద్దకు వెళ్ళాము. అమ్మనే అడుగుదామని. కానీ ఆ అవకాశమూ మాకు దక్కకుండా అమ్మ స్నానం చేస్తున్నది.

పరిస్థితి మరీ అయోమయమై పోయింది. కానీ ఒక్క ఆశమాత్రం మెరపులాగ మెరిసింది. సాధారణంగా అమ్మ వివాహవేదిక పైకిగానీ పూజా స్థలికిగానీ వచ్చే

ముందు స్నానం చేస్తుంది. మరి - యీ స్నానం పెండ్లికి తాను బయలుదేరే ముందు స్నానం యేమో !

.. .. అని ఆలోచిస్తుండగానే - వర్షపు ధారలు చినుకుల్లోకీ, చినుకులు తుంపరల్లోకి మారి క్రమంగా వాన ఆగిపోయింది అందరి మనసులు ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ నిండిపోయాయి.

గబగబా షామియానా వేయబడింది తోరణాలు కట్టబడ్డాయి. వేదిక అమర్చబడ్డది. అలంకరణ జరిగింది మంగళవాద్యాలు మ్రోగాయి. పురోహితులు క్రతువు ప్రారంభం చేశారు. కల్యాణ కారిణి అమ్మ వచ్చి సింహాసనాసీన అయింది. రెండు కల్యాణాలు అత్యంత వైభవంగా జరిగాయి. ఆ ముహూర్తాన ఆ పెండ్లిండ్లు అలా పూర్తికాగలవని ఎవరూ ఊహించలేదు. అందరి మనస్సులు కరుణామయి అయిన అమ్మ యెడల కృతజ్ఞతాభావంతో నిండిపోయాయి

కానీ ఇందులో ఇంకొక వింత ఏమి జరిగిందంటే - పెండ్లి కాగానే భోజనాలు అయినాయి. భోజనాలు పూర్తిఅయి అందరూ ఇంకా చేతులు కడుక్కున్నారో లేదో, మళ్ళీ వర్షం మొదలయింది.

ఈ సంఘటన కేవలం అమ్మ అనుగ్రహ ఫలితమేనని అందరికీ అవగతమే కారణం ఒక అదృశ్య శక్తి రెండు చేతులూ ముహూర్తకాలానికి అటూ యిటూ అడ్డుపెట్టినట్లు సుస్పష్టంగానే ఉన్నదాయె. ఇక ఆ శక్తి అమ్మకాక మరెవరు ?

పోనీ, ఈ సంఘటన కాకతాళీయ మనుకుందామా, అంటే లోగడ ఇటువంటి సంఘటనలు అనేకం జరిగాయి.

జూన్ 17వ తేదీన లాల పెండ్లి. ఆ పెండ్లికి రెండు రోజులు ముందుగానే రేడియోలు 'తుపాను, తుపాను' అని గగ్గోలు పెట్టాయి. జిల్లెళ్ళమూడికి 5,6 మైళ్ళ పరిధిలో మినహా దేశమంతా భారీవర్షాలే. జిల్లెళ్ళమూడిపైన ఎవరో గొడుగు పట్టినట్లుగా తెరిపి.

1971లో చంద్రమోహన్ పెండ్లి; అచ్యుతరామ్ పెండ్లి..... ఒకటేమిటి ? ఎందరో వర్షాకాలం అని కూడా సందేహించక జిల్లెళ్ళమూడిలో పెండ్లిండ్లు ఏర్పాటుచేసు కోవడమూ; అమ్మా - నీదే భారమని ప్రాధేయపడడమూ.... అనుగ్రహస్వరూపిణి అమ్మ కనికరించడమూ.

ఇవన్నీ అమ్మ సర్వసామర్థ్యానికి, పంచభూతాలపై అమ్మకు గల అధికారానికి నిదర్శనాలని మనం భావిస్తాము. కానీ అమ్మ మాత్రం సాధారణమయిన సంఘటనలే అంటుంది. ఇందులో నా ప్రయత్నమేమీ లేదు - అంటుంది. కనుకనే మనం - ప్రకృతియే అమ్మని అనుసరించి అమ్మకు అనుగుణంగా ప్రవర్తిస్తుంది - అని భావిస్తాము.

ఈ విషయాన్నే ఈ మాసపు విషయంగా వివరిద్దాము - అని నిర్ణయించుకునే సరికి - బయట వాన సంరంభం ఎక్కువయింది. వెంటనే ఒక ఆలోచన వచ్చింది. మరునాడే ఆగష్టు 15; అన్నపూర్ణాలయ వార్షికోత్సవం కదా. అందుకు ప్రత్యేకమయిన పలు ఏర్పాట్లు చేయబడుతున్నాయి. ఈ సందర్భంలో అమ్మ యీ వానను ఏం చేస్తుందో చూద్దాము. ఇందులో అమ్మ ప్రమేయంగానీ, ప్రతిభగానీ ఏమయినా ప్రదర్శితమైతే ఈ వ్యాసాన్ని ప్రచురిద్దాము, లేకుంటే మానేద్దాము - అని ఒక భావన కలిగింది.

ఆ రోజుల్లా కురిసింది; ఆ రాత్రంతా కురిసింది. తెల్లవారింది. వాన మరీ ఎక్కువయింది. రేడియోలు ప్రమాదపు హెచ్చరికలు చేస్తున్నాయి. నదులు పొంగుతున్నాయి.... ప్రకృతి మరీ విజృంభిస్తున్నది.

మరి ఉత్సవం ఎలా జరిగేటట్లు ?

విచిత్రం - మధ్యాహ్నం 12 గంటలయింది. వాన వెలిసింది. ఆకాశం నిర్మలమైంది. సోదరులు అనేకులు వచ్చారు. మేము బాపట్ల నుండి పూలూ, దండలూ తెప్పించలేక పూజ ఎట్లాగా అనీ విచారిస్తుంటే - గుడియాత్తం నుండి దండిగా దండలు వచ్చినయ్. పూజ వైభవంగా జరిగింది. ఉత్సవం ఆనందంగా ముగిసింది. వచ్చిన జనం తృప్తిగా భోజనం చేసి బాపట్ల చేరారు. జిల్లెళ్ళమూడి ద్వీపమే అయింది. చుట్టూ సముద్రం ఏర్పడింది.

రెండు చేతులూ ఎత్తి అమ్మకు నమస్కరించి - కాగితాలూ కలమూ అందుకొనక తప్పలేదు.

(ఆగష్టు 1978)



# 134
# రక్షణ

కటాక్షం, రక్షణ - అనేవి తెలుసుకోవడం చాలా కష్టం. భగవదనుగ్రహం పొందిన వ్యక్తి తన జీవితంలో అనుక్షణమూ రక్షణ పొందుతున్నప్పటికీ, కొన్ని సమయాల్లో తెలుసుకోగలుగుతాడు; కొన్ని సమయాల్లో తెలుసుకోలేడు. భగవల్లీల ప్రత్యక్షంగా అనుభూతమయితేనే గానీ - మనిషికి భగవంతునిపై, భగవంతుని సర్వసామర్థ్యంపై, అనుగ్రహంపై, రక్షణపై విశ్వాసం స్థిరపడదు. శాస్త్రాలవల్లా, మాటలవల్లాకూడా నమ్మకం ఏర్పడవచ్చును గానీ దానికి అచంచలత్వం ఉండదు. ఒక మాటవల్ల కలిగిన నమ్మకం మరో మాటవల్ల క్షీణించ వచ్చును; సమూలంగా క్షయం పొందవచ్చును. కానీ అనుభవం పునాదిగా నిర్మితమయిన విశ్వాస సౌధం - ఎంత తీవ్రమయిన ఎన్ని తుపానులు వచ్చినా - యీషణ్మాత్రమూ చలించదు.

అమ్మ పాఠాలు చెప్పే తీరు అత్యంత విలక్షణంగా ఉంటుంది. వీలయినంత వరకూ అమ్మ ఉపదేశమూ, సందేశమూ అన్యాపదేశంగా ఉండడమేకాదు, సోదాహరణంగానూ, క్రియాత్మకంగానూ ఉంటాయి. కారణం, మనిషికి మాటలు నీటిపైని వ్రాతలు అని తెలుసును కనుక. మనస్సులపై శాశ్వత ముద్రను వేయటంలో అమ్మ అనమాన ప్రవీణ.

ఆగష్టు 22వ తేదీ ఉదయం....

అమ్మ సాన్నిధ్యంలో కూర్చుని కొందరు సోదరులు 'మాతృశ్రీ' గత సంచికల్లోని సంపాదకీయాలు చదువుకుంటున్నాము. 1976 జనవరి సంచికలోని సంపాదకీయం చదవబడ్డది. అందులోని విషయం నక్సలైట్లు అమ్మ ఆవరణపై దాడిచేయడమూ; సోదరుడు గోపాల కృష్ణమూర్తిపై హత్యా ప్రయత్నమూ, అతణ్ణి అమ్మ రక్షించ .

ఈ విషయం చర్చనీయాంశమై, పఠనం ఆగిపోయింది.

వాదప్రతివాదాలు తీక్షణంగా సాగాయి.

ఒక సోదరుడు - "ప్రమాదాన్ని తప్పించగల శక్తి ఉంటే, అమ్మ ఆ సంఘటననే నిరోధించవచ్చును గదా !" అన్నాడు.

ఈ ప్రశ్నలో తార్కిక లక్షణం ఉండవచ్చునుగానీ, ఔచిత్యం కనుపించదు మనం పై ప్రశ్నను ఆధారం చేసుకుని ఆలోచిస్తే - రామాయణమూ లేదు; మహాభారతమూ లేదు. జగదీశ్వరుడైన మహావిష్ణువు అవతారమూర్తి శ్రీ రామచంద్రునికి తెలియకుండానే - రావణుడు సీతాదేవిని అపహరించాడా ? సర్వజగత్ సమ్మోహన కరుడైన శ్రీ కృష్ణపరమాత్మ సామర్థ్య సంగీత లహరి కౌరవుల మనః పాషాణాలను కరిగించడంలో పరాజితమై పోయిందా ?

ఎవరు ఎవరినీ సమాధానపరచలేక సంతృప్తి పరచలేక సతమతమవుతూ చివరకు అమ్మనే అర్థించాము - పరిష్కారం కోసం.

జవాబేమీ చెప్పకుండా - అమ్మ మంచం దిగి స్నానాల గదికి వెళ్ళి.ది. అమ్మ మళ్ళీ వస్తుంది; సమాధానం చెబుతుంది - అని కొన్ని క్షణాలు నిరీక్షించాము. అంతలో స్నానాలగది నుండి నీటి సవ్వడి వినిపించింది. అమ్మ స్నానం చేస్తున్నదని మాకు అర్థమైంది.

ఇదేమిటీ ? ... అమ్మ అంత నిర్లిప్తంగా వెళ్ళి పోయింది ! నిర్బాధ్యతగా వ్యవహరించింది ! బిడ్డలు తేలని చర్చలో తల బ్రద్దలు కొట్టుకుంటుంటే - తనకేమీ పట్టదా ? తెలియచెప్పేవాడు గురువు, తెలియజేసేవాడు దైవమూ - అని అమ్మేగదా వివరించింది. తెలియనిది తెలియ జేయడానికే తన రాక - అని గూడా అమ్మ అతి బాల్యంలోనే ప్రకటించిందిగదా !

మరి, ఏమిటి విడ్డూరమూ, వింత ప్రవర్తన ! తననుగురించిన రహస్యం తాను వివరిస్తేనే, అందులో సత్యం ఉంటుందిగానీ మన వాదాలు ఊహాజనికాలే గదా !

"మరుగే నా విధానం" - అని ప్రవచించిన అమ్మ నిగూఢ తత్వాన్ని అర్థం చేసుకొనే ప్రయత్నంలో విఫలులమై ఆ చర్చను వాయిదా వేసుకున్నాము. అందరూ క్రిందికి వెళ్ళిపోయారు. నేను కూడా వెళుదామని బయటకు వచ్చాను. చెలమచర్ల రఘునాథ్ అనే విద్యార్థి కనుపించాడు. అతని చేతిలో బ్లీచింగ్‌పౌడరు గల బొక్కెన ఉన్నది. అంతకు కొద్దిరోజుల క్రితమే వరద వచ్చి తగ్గినందున నీళ్ళన్నీ నిర్జీవ పదార్థాలతో కలిసి మలినమై ఉన్నాయి. అందువల్ల అతడు నీళ్ళట్యాంకుల్లో ఆ మందు కలిపే పనిలో ఉన్నాడు.

పై ట్యాంకులో కలపడానికి అమ్మ ఉండే గది దక్షిణపు దిశన కబ్జిల వంతెన దాటిపోవాలి ఇది నేల మట్టానికి సుమారు 30 అడుగుల ఎత్తున ఉన్నది. క్రింద నాపరాళ్ళు పరిచి ఉన్నాయి. మధ్యలో అనేకం ఇనుపకడ్డీలూ, ఎలక్ట్రిక్ తీగెలూ ఉన్నాయి పై నుంచి చూస్తే అదొక మృత్యు గహ్వరంలా కనుపిస్తుంది.

అతడు నవ్వుతూ నన్ను పలకరించాడు నేను సమాధానం చెప్పి ముందుకు సాగాను నాలుగు అడుగులు వేశానో లేదో - దభీమని పెద్ద శబ్దం వినిపించింది వెనుదిరిగి చూశాను... ఆ కుజ్జివాడు కనుపించలేదు. కబ్జిలవంతెన ఒక ప్రక్క విరిగి హంతకుడువలే గజగజ వణుకుతూ గాలిలో వ్రేలాడుతున్నది. క్రిందికి చూశాను. అతడు రాళ్ళపై పడి అమ్మా. ... అమ్మా. ... అంటున్నాడు.

నేను గబగబా క్రిందికి పరుగెత్తాను అతణ్ణి చేతులపై తీసుకువచ్చి ఆసుపత్రిలో పడుకోబెట్టాము డాక్టర్ సత్యమూ, డాక్టర్ జనజకుమారీ వచ్చారు. ప్రాథమిక చర్యలు గైకొన్నారుకానీ పరిస్థితి వాళ్ళకు ఏమీ అర్థంకాలేదు. ప్రాణభయం లేదని చెప్పలేమన్నారు. ఎముకలు విరిగి ఉండవచ్చును; మూత్రకోశం దెబ్బతిని ఉండ వచ్చును, లోన కనపడని గాయాలు తగిలి ఉండవచ్చును; షాక్ తగిలి మెదడు దెబ్బతినవచ్చును . . ఖచ్చితంగా ఏమి జరిగిందో ఆ సమయంలో చెప్పలేమని తమ అసహాయస్థితిని వ్యక్తం చేశారు.

ఆ రాత్రి అందరికీ ఆందోళనే ఎవరికీ నిద్రపట్టలేదు. అతడు మాత్రం ఆదమరచి నిద్రపోయాడు. మరునాడు ఉదయానికే ఆ విద్యార్థి లేచి తిరగడం మొదలుపెట్టేడు. అందరికీ ఆశ్చర్యం వేసింది. అతనికి ఒక్క ఎముకా విరగలేదు. మామూలుగా ఉన్నాడు.

(సెప్టెంబరు 1978)



**రోగి**

రోగికి వైద్యుడు నారాయణ స్వరూపుడే కాక - వైద్యునికి రోగి కూడా అంతే.

- అమ్మ

# 135
# పూనకాలు

ఈ నెల 14వ తేదీ రాత్రి అమ్మదర్శనం జరుగుతున్నది. రాజమండ్రి నుండి ఒక సోదరుడు వచ్చాడు. అతడి పేరు శ్రీ వాడ్రేవు జగన్నాథం. అతడు అమ్మదర్శనం చేసుకుని ప్రసాదం తీసుకుని మౌనంగా కూర్చున్నాడు.

"అమ్మతో ఏమయినా చెప్పకోవాలా ?" అని నే నడిగాను.

తమ కుమారుని గురించిన విషాదగాధను విన్నవించుకున్నాడు. అనేక చికిత్సలు చేయించాడట. అతని వ్యాధి తగ్గలేదట. కొన్నాళ్ళక్రిందట విశాఖపట్నంలో ఒకామెకు చూపించారట. ఆమెపైకి "అమ్మ' వచ్చిందట; రెండు మాసాల్లో ఆ జబ్బు నయమవుతుందని చెప్పి విభూతి, కుంకుమా ఇచ్చిందట కానీ, ఇప్పటికి నాలుగు నెలలు గడిచినా అతని వ్యాధిలో మార్పు ఏమీ కనుపించలేదట.

ఈ ఉదంతం చెప్పి - "ఏమి చేయమంటా వమ్మా ?" అని అమ్మను సలహా అడిగాడు. "సరిఅయిన వైద్యునికి చూపించి మంచి చికిత్స చేయించు నాన్నా -" అని మృదువుగా చెప్పింది అమ్మ.

ఇటీవల అనేకులు అనేక ప్రాంతాల నుండి వచ్చి 'అమ్మ' ఎవరెవరిపైకో వస్తున్నదనీ, ఏమేమో చెబుతున్నదనీ అమ్మకే నివేదిస్తున్నారు.

ఆ చెప్పినవి చెప్పినట్లుగానే జరిగితే మన కేమీ సందేహం కలుగదు. 'నిజంగానే అమ్మ చెప్పిందేమో' అనుకుంటాము. అమ్మ మహిమకూ మమకారానికీ పొంగిపోతాము.

కానీ, ఆ చెప్పినవి జరగనప్పుడే సంశయం కలుగుతుంది. ఆలోచన పుడుతుంది.

మామూలుగా మనం ఎదురుగా కూర్చుని అనేక ప్రశ్నలు వేస్తేనే - పెదవి కదిపితే ఎక్కడ ముత్యాలు రాలుతాయో నని ఆలోచించే అమ్మ ఎక్కడికో అశరీరయై వెళ్ళి సమాధానాలు చెబుతుందా ? అమ్మకు అంత అవసర మేమిటి ?

అదే ప్రశ్నను అమ్మను అడిగితే అమ్మ చాలా నిర్వికారంగా అన్నది. "అసలు అంత శక్తి నాకు ఉంటేనేగా ?" అని.

"అదేమిటమ్మా - అక్కడివాళ్ళు చెబుతున్నారుగా అపుడు - అంటే నీవు వాళ్ళను ఆవేశించినపుడు వాళ్ళు అచ్చగా నువ్వు మాట్లాడినట్లే మాట్లాడటం. నువ్వు ప్రవర్తించినట్లే ప్రవర్తించటం చూస్తున్నామని" అని అంటే -

"నాకు తెలీకుండా నాశక్తి మరొకరిని ఆవేశించటం ఏమిటి"..... అయినా నాశక్తి అని ప్రత్యేకించి ఏముంటుందీ? ఉన్నదంతా ఒకే శక్తి" అని అమ్మ వివరించింది.

కానీ - ఇక్కడ మనం మరొక విషయం గమనించాలి. అలా ఆవేశంపొందిన వ్యక్తులు "నేను జిల్లెళ్ళమూడి అమ్మను" అని చెప్పటం అనేకులు అనేక సందర్భాల్లో విన్నారు.

ఇలా చెప్పేవాళ్ళను రెండు వర్గాలుగా విభజించ వచ్చును. ఒక వర్గంవారు కొందరు నటిస్తారు. అందుకు వ్యక్తిగతమయిన కారణాలు ఉండవచ్చునూ, పరవంచన లక్ష్యం కావచ్చునూ. కానీ అది పరవంచన మాత్రమే కాదు ఆత్మవంచన కూడా అవుతుందని వాళ్ళకు తెలీదు. పాపం ! వాళ్ళను గురించి మనం ఆలోచించడం అనవసరం.

కానీ - కొందరు సహజంగానే అమాయకంగానే ఆవేశానికి గురి అవుతారు. మళ్ళీవీరిలో రెండు రకాల వారుంటారు

మొదటి రకంవారు భక్తులు నిరంతరం అమ్మను (లేక మరో వాళ్ళ యిష్టదైవాన్నో) ఆరాధిస్తూ ఉంటారు. అమ్మను గురించే ఆలోచిస్తుంటారు. వాళ్ళ మనోమందిరాల్లో అమ్మతప్ప మరొకరు ఉండరు. వాళ్ళస్మృతి మండలం అమ్మ మూర్తితో ముద్రితమై ఉంటుంది. వాళ్ళ ఆలోచనా మార్గాలు అమ్మ బోధలతో క్రిక్కిరిసి ఉంటాయి. అటువంటి వాళ్ళకు కొన్ని దివ్యఘటికల్లో వాళ్ళ అహంకారం సన్నగిలిపోతుంది. ఒక్కొక్కప్పుడు మరీ పల్చబడి పోతుంది.

అపుడు వాళ్ళ మనసు అమ్మ భావనతో నిండిపోతుంది. ఆపాదమస్తకం అమ్మ ఆవరించినట్లు, అమృతం ప్రవహించినట్లు పులకించి పోతారు. తమ్ము తాము మరిచి నిలువెల్లా అమ్మను నింపుకుని అమ్మకు అంకితమైపోతారు. అపుడు వారు చేసిన ప్రతిక్రియా, పలికిన ప్రతిమాటా అమ్మదై పోతుంది.

అదొక అలౌకికమయిన స్థితి. తాత్కాలికమైనప్పటికీ - అదొక దివ్యానుభూతి.

అపుడు ఆ ఆవేశం పొందిన వ్యక్తేకాక ఆ పరిసరాలుకూడా దివ్యమై వెలుగొందుతాయి. ఆ పరిసరాల్లోని ఇతరులుకూడా ప్రభావితులైతారు.

ఈ ఉదంతాల్లో అమ్మ ప్రమేయం ఉండకపోవచ్చును. మరొకరకం సంఘటనలు ఉంటాయి. అమ్మ తనను అర్థించినవారిని రక్షించేందుకు తాను ధరించిన శరీరాన్ని ఉపయోగించుకోవటానికి అవకాశంలేని సందర్భాల్లో తన కిష్టమయిన మరే శరీరంద్వారా నయినా తన కార్యక్రమం నిర్వహించుకొనవచ్చును.

1962లో అనుకుంటాను - ఒకనాడు శృంగేరీ పండితుడు ఒకాయన అమ్మదర్శనార్థమై వచ్చారు. అమ్మను ఏవో వేదాంతపరమైన ప్రశ్నలు అడిగారు. అమ్మ మౌనంగానే కూర్చున్నది. కానీ అక్కడనే కూర్చున్న సోదరి వసుంధర వాటన్నిటికీ ఖచ్చితమయిన జవాబులు ఇచ్చి ఆ పండితుడినే కాక అక్కడ ఉన్న జనులందరినీ ఆశ్చర్య చకితులను అప్రతిభులను చేసింది. ఆ జవాబుల్లో చెప్పబడ్డ విషయాలు వసుంధరకు అంతకుపూర్వం తెలియనివీ, ఆలోచించనివీ.

మరి - వసుంధర ఎలా చెప్పగలిగింది ? అమ్మను అడిగిన ప్రశ్నలకు అమ్మే వసుంధరద్వారా చెప్పింది. అంటే, ఆ క్షణాల్లో అమ్మశక్తి వసుంధరను ఆవహించినట్లేగదా !

1977 అక్టోబరు 9వ తేదీన విశాఖపట్నం నుండి మద్రాసు రైల్లో వెళ్ళాను. దారిలో టికెట్ ఇన్‌స్పెక్టరు నావద్ద నుండి నా టిక్కెట్టు తీసుకుని తిరిగి నాకు ఇవ్వకుండా వెళ్ళిపోయాడు. నేను మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో దిగి టికెట్‌కోసం అతనిని వెతకటం మొదలుపెట్టాను. ఆ టికెట్ దొరక్కపోతే - నా దగ్గర ఒక్క రూపాయి కూడా లేదు. చాలా ఆందోళనగా ఉన్నది. అపుడు కూలీ ఒకడు నా వద్దకు వచ్చి నావిషయం తెలుసుకున్నాడు. ఎలా బయటకుపోవాలో తెలీక తికమకపడే నాకు ధైర్యం చెప్పాడు. "ఏమీ ఫరవా లేదు. మీరేమీ కంగారు పడకండి. మీ సామానులు తీసుకుని నేను ముందు నడుస్తుంటాను. మీరు పక్కలకుకూడా చూడకుండా నా వెంటనే రండి" అని చెప్పాడు.

అనుమానంగా చూసే నావంక చూస్తూ మళ్ళీ అన్నాడు "మీకేమీ భయం లేదు. నే నున్నాను నావెంట రండి" అని ఇక నా సమాధానం కోసం చూడక నా సామానులు నెత్తిన పెట్టుకుని ముందుకు సాగాడు. నేను అతణ్ణి అనుసరించక తప్పలేదు.

ఇద్దరం బయటకు వచ్చాం. అతను నా సామానులు నాకు అప్పగించి కూలిడబ్బులైనా అడక్కుండా వెళ్ళిపోయాడు.

అపుడు నాకు అమ్మే ఆ కూలి రూపంలోనైనా వచ్చి ఉండాలి. లేక అమ్మశక్తి ఆకూలిలోనయినా ప్రవేశించి ఉండాలి అనిపించి - అమ్మా - నాకోసం నీకెంత కష్టం వచ్చిందీ ! - అని రెండు చేతులూ యెత్తి నమస్కరించాను.

అటువంటి సంఘటనల్లో అమ్మ శక్తి ఇతరులను ఆవేశించినట్లుగూడా అర్థంగావటం బహుకష్టం ఎంతో లోతైన పరిశీలన ఉంటే గానీ మనకు సత్యం బోధపడదు

కపటంగా నటించే వాళ్ళూ, వాళ్ళ భక్తివల్ల ఆవేశం పొందే వాళ్ళూ, భగవచ్ఛక్తియే తనకు తానై ఆవేశించేవాళ్ళూ మనకు అందరూ ఒకటిగానే కనపడతారు "ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు" కానీ రుచిలో తేడా తప్పక ఉంటుంది మనం అసలు విషయం అర్థంచేసుకుని మెలగాలి. మనం కనిపెట్టి ఉండకపోతే కన్నతల్లి పోలికలోనే కొన్ని పుల్లలు కంటికి తగులుతాయి.

(అక్టోబరు 1978)



## కరుణ

వాడి కరుణ లేకపోతే మనం లేము. మనం చేసే పనులన్నీ వాడి కరుణవల్లనే. నా దృష్టిలో కష్టసుఖాలు రెండూ కూడా కరుణవల్లనే. ప్రతి చిన్నపనీ మనం చేతులతో చేస్తున్నామనుకున్నా, మనసుతో చేస్తున్నా మనుకున్నా, మనం ఎట్లా చేసినా - వాడి కరుణవల్లనే - మనకు కనపడకుండా ఆయా తరుణాల్లో ఆయా పనులు చేయించడమే కరుణ.

- అమ్మ

# 136
# మూగజీవాలు

"లోగడ ఈఊళ్ళో ఖగ్గా మునలయ్య అని ఒకాయన ఉండే వాడు. ఆ రోజుల్లోనే ఒక ఆఁబోతు ఉండేది. దానినీ ఆయన చాలా ప్రేమగా చూసుకొనేవాడు అదికూడా ఆయనను అధికంగా ప్రేమించింది.

ఒక రోజున ఆ ఎద్దు వాగుదాటి ప్రక్కనే ఉన్న పూండ్ల గ్రామం వెళ్ళింది. అక్కడ ఎవరి దొడ్లోనో ఉన్న వామిలో గడ్డి మేసిందట. అందువల్ల ఆ రైతుకు కోపం వచ్చి గడ్డపలుగుతో దాని మెడమీద క్రూరంగా విపరీతంగా కొట్టాడు. మెడంతా బాగా వాచింది. నల్లబడిపోయింది. నోటి వెంట చొంగ కారుతన్నది. ఎద్దు ప్రాణావస్థాన దశకు వచ్చింది. వారు అప్పుడు దానిని వదిలేశారు.

అది నడవలేక నడుస్తూ రొప్పుతూ రోజుతూ చేలు దాటి వాగులు దాటి ఎలాగో జిల్లెళ్ళమూడి చేరింది. మునలయ్యగారింటికి వెళ్ళింది. అక్కడ ఆయన కనుపించ లేదు. అలాగే ప్రాణాలు బిగబట్టుకుని ఆయన ఎక్కువగా ఉండే వారి నారింజతోటకు వెళ్ళింది.

అక్కడ ఆయన మరోవైపు తిరిగి తాళ్ళు పేనుకుంటూ కూర్చున్నాడు. ఎద్దు వెనకగా వెళ్ళి ఆయన భుజంపై తల ఆన్చింది. అది ఆ ఎద్దుకు అలవాటే. ఆయన వెనుదిరగకుండానే చేత్తో దాని ముట్టె నిమిరాడు. చేతికి తడి తగిలింది. బరువైన శ్వాస చెవికి తగిలింది. అర్థంగాక వెనుదిరిగాడు.

దాని దారుణమైన ప్రమాదకరమైన పరిస్థితి అర్థమైంది. అతనికి దుఃఖం ఆగక దాని ముట్టెను కౌగిలించుకుని కన్నీరు కార్చాడు. ఆప్తమిత్రుని చూచిన దానివలే - అప్పటిదాకా దాగిన ఆగిన కన్నీళ్ళు ఆ ఎద్దు రెండు కన్నులా జలజలా రాలేయి.

కొన్ని క్షణాలు ఏమి చేయాలో తెలియక అయోమయమై పోయినప్పటికీ - వెంటనే ఆయన తెప్పరిల్లి బండి కట్టించి అతి కష్టంపై దానిని ఆ బండిపై పడుకోబెట్టి ఇంటికి తీసుకు వచ్చాడు.

ఎన్నో చికిత్సలు చేయించాడు. కానీ ఫలితం లేక పోయింది. ఆ మర్నాడే అది అసువులు వీడింది....'' - అని చెబుతుంటే అమ్మ కంఠం రుద్ధమైంది. కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి.

అమ్మ మళ్ళీ అన్నది "ఈ సంఘటనబట్టి మనకు ఏమి అర్థమవుతుందీ ? . ఆ ఎద్దుకు ఎంతో ఆలోచన ఉన్నదని తెలియడం లేదూ ? దానికీ ప్రేమ ఉన్నదని అర్థంగావడం లేదూ ?''

అక్కడ కూర్చున్న మేమందరమూ ఆలోచనలో పడి పోయాము. మా ఆలోచనకు అంతరాయం కలుగజేస్తూ అమ్మ మరో సంఘటన చెప్పింది.

"అవి 1947, రోజులు. ఈ గ్రామంలో రెండు పార్టీలుండేవి. నాన్నగారు ఒక పార్టీ పక్షాన ఉండేవారు. రెండో పార్టీ వాళ్ళు నాపై అత్యాచారాలు చేయాలని ప్రయత్నం చేస్తూండేవాళ్ళు.

ఆ రోజుల్లో ఒకనాడు నేను ఊరిబయటకు ఒంటరిగా వెళ్ళాను. ఒక తుంటరి నా దారికి అడ్డువచ్చాడు. నన్నేదో అవమాన పరచాలని అతని ఉద్దేశం. అంతలో ఎక్కడ నుండి వచ్చిందో మా గుడ్డిబఱ్ఱె.... ఆ కాలంలో మా దగ్గర ఒక గుడ్డిబఱ్ఱె ఉండేది... మా యిద్దరి మధ్యకీ వచ్చి నిలుచుని అతనెంత గింజుకున్నా అతను నన్ను సమీపించకుండా చేసింది. అప్పుడే కాదు అదేమిటో నిరంతరమూ నేను ఎక్కడకు వెళ్ళినా రక్షకభటునివలే నన్ను వెన్నంటి ఉండేది.

మఱి - పశువులకు ఆలోచన లేదని ఎలా అనగలం ?''.

అమ్మ ఒక్కొక్క సంఘటన చెబుతుంటే - అందరం చెవులు 'ఇంతలు' చేసుకుని వింటున్నాం.

"1956 శ్రీరామ నవమినాడు -

జిల్లెళ్ళమూడి, గ్రామస్తులు రేటూరు నుండి ఒక కోడెదూడను తీసుకువచ్చి అబోతును వేయదలుచుకుని ముందుగా స్నానం చేయించటం కోసం చెరువులో దించారు. అక్కడ ఆ క్రతువు పూర్తి అయి దానిని గట్టు ఎక్కించటం కోసం ప్రయత్నించారు. కానీ అది చెరువులో నుండి బయటకు రాలేదు. ఎన్నో విధాల ప్రయత్నం చేశారు. ఏమీ ప్రయోజనం లేకపోయింది .... చివరకు "నిన్ను అమ్మ వద్దకు తీసుకువెళ్ళి అమ్మచేత ముద్రవేయిస్తా' మని దానికి చెప్పారు. ఆ మాటలు విని అది బుద్ధిమంతుడైన కుఱ్ఱవాడువలే ఒడ్డుకు వచ్చింది.

మరి... జంతువులకు మన మాటలనూ, భావాలనూ అర్థం చేసుకొనగల సామర్థ్యం లేదని ఎలా అనగలం ? అయితే - అవి వాటి భావాలను మనలాగా భాషలో వ్యక్తం చేయలేక పోవచ్చును."

మా ఉత్సుకత గమనించిన అమ్మ మళ్ళీ మొదలు పెట్టింది.

"ఆ ఎద్దు ఎంత జాగ్రత్తగా ప్రవర్తించేదని ? రాత్రివేళ నా దగ్గరకు వచ్చి పడుకునేది. అలా రాత్రిళ్ళు వచ్చేటపుడు నా మంచం చుట్టూరా నేలపై పడుకుని ఎందరో నిద్రపోతుండేవాళ్ళు. అది వాళ్ళను ఎవరినీ తొక్కకుండా మనిషి మనిషికీ మధ్యనున్న కొద్ది స్థలంలో అడుగులు చేసుకుంటూ నా దగ్గరకు వచ్చి పడుకునేది"

అమ్మ యీ జంతువుల మనోగతుల పరిశీలనలో కూడా ఎంత శ్రద్ధ తీసుకుంటుందీ - అని ఆశ్చర్యపోతూ వింటున్నాము.

"మీలో కొందరికి గుర్తు ఉండి ఉంటుంది.... లోగడ నేను పూరింట్లో ఉండే కాలంలో ఒక కుక్క ఉండేది. అది ఎప్పుడూ నా మంచం, క్రిందనే పడుకునేది. నేను దర్శనం యిచ్చే సమయంలో అందరిలాగా అదికూడా నా ఎదురుగా కూర్చునేది. నే నేదన్నా మాట్లాడుతుంటే శ్రద్ధగా వినేది. కొందరు దానిని అక్కడ నుండి తోలటానికి ప్రయత్నించినా అది కదిలేది కాదు. అప్పుడు కొందరనే వాళ్ళు - అది క్రితం జన్మలో ఏ ఋషో అయి ఉంటుందని. ఎప్పటి సంగతో ఎందుకూ, ఇప్పుడు కాకపోతేగదా - అంటాను నేను. ఋషులంటే మనుషులే అయి ఉండాలని మీ భావం. నేను అలా అనుకోలేదు."

ఒక ఋషి స్మరణలో అమ్మ కన్నులు జ్వలించాయి.

"కొమ్మూరి డాక్టరుగారూ, ధర్మయ్యగారూ మొదటిసారి నా దగ్గరకు వచ్చిన రోజు 1956 మే 9వ తేదీ. నేను క్రింద కూర్చుని ఉన్నాను. డాక్టరుగారు ... మరి, ఆయనడాక్టరుగదా... కుర్చీపైన కూర్చున్నారు. ధర్మయ్యగారు మంచంపై కూర్చున్నారు వాళ్ళు నాతో మాట్లాడుతూ ఉండగా ఒక పిల్లీ, ఎలుకా కలిసి నా దగ్గరకు వచ్చినయ్. నేను నా పమిట చెంగు నేలపై పరిచాను. దానిపై అవి ఆడుకోవటం మొదలు పెట్టాయి. వాళ్ళు అదేమిటీ అని అడిగారు. నేను చెప్పాను వారిద్దరూ వెంటనే వాళ్ళ ఆసనాలు దిగినాతోపాటు క్రింద కూర్చున్నారు.

మా యింట్లో ఒక కుక్క పిల్లిపిల్లలకు పాలివ్వటం ఎందరో ఎరుగుదురు ఆ దృశ్యం అందరూ వింతగా చూసేవారు. సహజీవనం అంటే - అదే గదా !"

అది - ఈ నెల 10వ తేదీ మధ్యాహ్నం. అమెరికా నుండి వచ్చిన సోదరుడు డేవిడ్ అమ్మతో మాట్లాడుతుండగా జంతువుల మనస్తత్వ ప్రసక్తి వచ్చింది - అతడు మనస్తత్వ శాస్త్రంలో ఆచార్యుడట. అందువల్ల ఎంతో ఆసక్తిగా అమ్మను అడిగాడు.

అమ్మ ఎంతో ఆప్యాయంగా ఆ విషయాన్ని చెబుతూ 'మనకు తెలీదు గాని, జంతువులక్కూడా ఆలోచనలూ, గుణాలూ, ప్రేమలూ, ద్వేషాలూ... అన్ని మనిషికి లాగానే ఉన్నాయి. వాటిని జాగ్రత్తగా నిశితంగా పరిశీలిస్తే మనకు అవగతమౌతాయి' అని వివరించింది ప్రక్కన ఉన్న మనుషుల మనస్తత్వమే కాదు, మన ఆత్మీయులు, ఆప్తులు అనుకునేవారి మనస్తత్వమే మనకు అర్థంకాదు. ఇక - పశుపక్ష్యాదుల మనస్సేమి అర్థమౌతుంది ?

అమ్మ తాను అందరికీ అమ్మను అని వివరిస్తూ "పశు పక్ష్యాదులక్కూడా -" నని ప్రకటించింది

అమ్మ స్వర్ణోత్సవ సందర్భంలో పశువులకూ, పక్షులకూ, జలచరాలకూ కూడా విందు చేయమని ఆదేశించింది

అందువల్లనే మనం అమ్మను "సర్వజనని"గా ఆరాధిస్తున్నాం.

(నవంబరు 1978)



## గుర్తింపు

భగవంతుడి కటాక్షం ఎప్పుడూ ఉన్నది. కానీ నువ్వనుకున్నది అనుకున్నట్లు జరిగినప్పుడు దానిని గుర్తిస్తావు.

నువ్వనుకున్న రూపంలో కనిపిస్తే భగవంతుడ్ని అయినా గుర్తిస్తావు. లేనప్పుడు నీ ముందు నిలబడ్డా భగవంతుడు అని అనుకోలేవు.

- అమ్మ

# 137
# నామ మహిమ

1978 డిసెంబరు 31వ తేదీ రాత్రి....

ప్రతి సంవత్సరం డిసెంబరు 31వ తేదీ రాత్రి సరిగ్గా 12 గంటలకు అమ్మ దర్శనం ఇస్తుంది. ఆ దర్శనం చేసుకుని గత సంవత్సరానికి వీడ్కోలు పలికి రాబోయే సంవత్సరానికి స్వాగతం చెప్పటానికి అనేకులు జిల్లెళ్ళమూడి వస్తారు. క్రొత్త సంవత్సరాన్ని ఆనందప్రదంగా చేయమని కాలస్వరూపిణి అయిన అమ్మను అర్థిస్తారు.

ఆ రోజున వచ్చిన బిడ్డల పూజలు అందుకుని అమ్మ అందరికి బిస్కెట్లూ, రస్కూలూ, టీ అందజేస్తుంది. అందరూ కలిసి టీ త్రాగుతూంటే వాళ్ళను చూసి అమ్మ తానూ ఆనందపడుతుంది.

ఆ ఉత్సవంకోసం ఏర్పాట్లు అన్నీ పూర్తి అయ్యాయి. వేదిక అలంకృతమై సోయగాలను విరజిమ్ముతున్నది. పూజాద్రవ్యాలన్నీ వేదికవద్దకు తీసికొనరాబడు తున్నాయి.

గం. 11.45 ని. లయింది. అందరూ అమ్మ కోసం ఎదురు చూస్తున్నారు. అమ్మ నామ సంకీర్తన చేసేందుకు మైకు అమర్చాలని ఆంగ్ల సోదరుడు జేమ్సు ఆ పరికరాలన్నీ సిద్ధం చేశాడు. వాటిని ఒక్కొక్క దానినే కనెక్టు చేస్తున్నాడు. అంతలో దభీమని పడిపోయాడు. ఆదుర్దాగా అందరూ చుట్టూ చూచారు. ఏముంది ? కరెంటువైర్ అతని చేతిలో మంటలు విరజిమ్ముతున్నది. చేతిలో నుండి దానిని ఎవరు వేరుచేయగలరు ? పొరపాటున అందుకు ఎవరైనా ప్రయత్నంచేస్తే - వారికి ఆ షాక్ తగులుతుందిగదా. కొందరు చూస్తూ నిశ్చేష్టులై పోతే - మరికొందరు కర్రలతోనూ, పైగుడ్డలతోనూ ఆ మండే వైరును అతని చేతి నుండి తప్పించటానికి సతమతమై పోతున్నారు.

ఆ ప్రయత్నంలో ఎవరూ సఫలీకృతులు కాలేదు.

సరిగ్గా ఆ సమయంలో మచిలీపట్నం నుంచి సోదరులు శ్రీ ప్రసాద్ వచ్చాడు. అతడు ఎలక్ట్రికల్ ఇంజనీరు వెంటనే పరిస్థితిని అర్థం చేసుకుని ఆ వైరుకు మూలంలో ఉన్న ప్లగ్‌ను డిస్‌కనెక్టు చేశాడు. అతడు చెప్పాడు... జేమ్సు చేతిలో కరెంటువైరు అగ్నిశిఖలను విరజిమ్ముతున్నా అతడు నేలపై పడిపోయాడుకానీ స్పృహను ఏమాత్రమూ కోల్పోలేదు. పైగా "అమ్మా..... అమ్మా. ...." అని నామం చేస్తున్నాడట ముఖంలో భయంగానీ ఆందోళనగానీ ఛాయా మాత్రంగానయినా కనిపించలేదట. అతని శరీరంలో దాదాపు రెండు నిమిషాలు విద్యుత్తు ప్రసార మయిందట. మామూలు పరిస్థితులలో మరెవరయినా అయితే తప్పక మరణించ వలసినదేనట

వైర్ చేతి నుండి విడివడిన తర్వాత చూస్తే - చెయ్యి కాలిపోయి గుంటలు పడ్డది, తర్వాత కూడా అతని మానసిక స్థితిలో ఏమాత్రమూ చలనం కలగకపోవడం అత్యంత విశేషం. ఆ దుర్ఘటన జరిగిన సమయంలో అతని మనఃస్థితి ఎట్లా ఉన్నదని అతణ్ణి అడిగితే - అతనికేమాత్రమూ భయంగాని విచారంగానీ వేయలేదని చెప్పాడు. ఆ సమయంలోకూడా అమ్మనామం మరుపుకు రాకపోవటమే అతని అదృష్టం. జేమ్సు సోదరుడు బుద్ధిమంతుడితో మాట్లాడుతూ "అమ్మ గోపాలన్నయ్యను రక్షించిందీ; బుద్ధిమంతుడన్నయ్యకు ప్రాణదానం చేసిందీ అని వింటూంటే అదేమిటో నాకు అర్థమయ్యేది కాదు. ఇవ్వాళ నాకు అనుభవపూర్వకంగా అవగతం అయింది. అమ్మ కరుణామయి... అమ్మ ప్రాణదాత్రి..." అని వివరించాడు.

12 గంటలకు అమ్మ చిరునవ్వులు చిందిస్తూ వేదికపైకి వచ్చింది; పూజలూ, వేడుకలూ నిర్విఘ్నంగానూ ఆనందంగానూ గడిచిపోయాయి. అందరూ అమ్మ కారుణ్యానికి అంజలి ఘటించారు.

ఇటు వంటి సంఘటనే 1968లో జరిగింది. అది మే 10వ తేదీ. జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిలో స్థిరపడిపోయిన కుటుంబాల్లో శ్రీ పోతుకూచి విద్యాసాగర్‌గారి కుటుంబమొకటి. ఆ కుటుంబంలోని సభ్యులందరూ అమ్మపై ఎనలేని భక్తి విశ్వాసాలు కలవారు. ఎల్లప్పుడూ అమ్మనామం చేస్తూ ఉంటారు.

శ్రీ సాగర్‌గారి కుమార్తె కుమారి ఝాన్సీ. ఆ అమ్మాయికి హఠాత్తుగా పెద్ద ప్రమాదం జరిగింది. తిరిగే మోటారు చక్రంలో ఆ అమ్మాయి జుట్టు ఇరుక్కుంది ఆ చక్రభ్రమణవేగానికి చక్రంలో ఇరుక్కుపోయిన ఆ అమ్మాయి జుట్టు - తలపై చర్మాన్నికూడా లాగేసింది. కేవలం దైవలీలే అనుకోవాలి - హఠాత్తుగా ఎక్కడినుండో ఎవరో వచ్చి స్విచ్ ఆఫ్ చేశారూ, చక్రం ఆగిపోయింది. కానీ ఆ అమ్మాయి

స్పృహలేని స్థితిలో నెత్తురు పిడుగులా పడిపోయింది. వెంటనే కారులో ఝాన్సీని గుంటూరు ఆసుపత్రికి తీసుకువెళుతున్నాము. మా కందరికి చాలా ఆందోళనగా ఉంది. ఆ అమ్మాయి బ్రతుకుతుందా - అని సందేహంగాకూడా ఉంది కానీ - విచిత్రమేమంటే .. స్పృహలేని పరిస్థితిలో కూడా ఝాన్సీ లయ తప్పకుండా నామం చేస్తున్నది. అంటే ఆ అమ్మాయి శరీంరలో ప్రతి అణువూ కూడా నామాంకితమై పోయింది. ఇక - సర్వశక్తిమంతమయిన ఆ నామం ఆ అమ్మాయిని ఎందుకు రక్షించదూ ?

ఆ స్థితిలో ఆ అమ్మాయిని చూస్తున్న మాకు దుఃఖం వచ్చింది. అంటే ఆ అమ్మాయికి జరిగిన ప్రమాదానికి కాదు ఆ అమ్మాయి గాఢ భక్తికి. అటువంటి ప్రమాద పరిస్థితిలో కూడా స్పృహలేని స్థితిలోకూడా లయతప్పకుండా రాగం చెడకుండా నామం చేస్తున్నదంటే ఆ శరీరంలో నామం ఎంతగా జీర్ణం చేసుకుని ఉండాలి ? .... ఆ ఆలోచనతో మా కళ్ళు అశ్రుపూరిత మయ్యాయి.

తర్వాత వైద్యులు ఊహించనంతగా ఆ అమ్మాయికి ఆ గాయం నయం అయింది. అతి త్వరలో కోలుకున్నది. అపుడు ఆ అమ్మాయి బ్రతికినప్పటికీ - ఆ అమ్మాయి మెదడు దెబ్బతినవచ్చునూ. జ్ఞాపకశక్తీ, ఆలోచనాశక్తీ నశించవచ్చునూ, లేక బాగా తగ్గి పోవచ్చునూ - అన్నారు వైద్యులు. కానీ అత్యాశ్చర్యకరంగా ఝాన్సీ విద్య నభ్యసించి, జాతీయ స్థాయిలో అనేక బహుమతులు గెల్చుకుని, సాహిత్య విద్యాప్రవీణలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలై ప్రస్తుతం జిల్లెళ్ళమూడి కళాశాలలోనే అధ్యాపకురాలుగా ఉద్యోగంచేస్తూ అమ్మకారుణ్యానికీ అమ్మ నామమహిమకూ సజీవతార్కాణంగా నిలిచింది.

కనుకనే కొందరు ఎంతసేపూ అమ్మను చూస్తూ, ఆ మూర్తిలోని అలౌకిక తేజస్సుకు ముగ్ధులవుతూ, అమ్మ మృదు మధుర వాక్కులు వింటూ, ఆ వాక్ వైభవానికి సమ్మోహితులవుతూ, ఆ వచస్సౌందర్యానికి అబ్బురపడుతూ, ఆ సన్నిధిలో అనవరతం అనేక విధాల ప్రకటితమయ్యే దివ్యత్వాన్ని ఆస్వాదిస్తూ కాలంగడపడానికి ఉవ్విళ్ళూరుతుంటే - కొందరు నిరంతరం అమ్మనామసంకీర్తన చేస్తూ తన్మయత్వం చెందుతారు. అమ్మ అనామ మధువును త్రాగుతూ పరవశిస్తారు. క్రమేణా నామ మంత్రం వారి శరీరంలో అణువణువునా, రోమరోమానా జీర్ణమైపోతుంది. అపుడు అమ్మ వారివెంట వుండడం కాక వారిలోనే అమ్మ ఉన్న అలౌకిక అనుభూతి వారికి కలిగి వారి జీవితాన్ని మధురతమం చేస్తుంది. ఆ నామశక్తి వారిలో ఎల్లప్పుడూ ఒక దివ్య ప్రభవలే జ్వలిస్తూ వారిని నిరంతరం రక్షిస్తూ ఉంటుంది. వారు పాడుతూ ఉంటే - అది కాపాడుతూ ఉంటుంది.

అట్లా నామాన్ని జీర్ణం చేసుకోవాలని ప్రయత్నం చేస్తున్న వాళ్ళలో సోదరుడు జేమ్స్ ముఖ్యుడు. అతడికి అదే సాధన, అదే తపస్సు. కనుకనే అంత విద్యుత్తు శరీరంలో అంతకాలం అప్రతిహతంగా ప్రవహించినప్పటికీ అతడు స్పృహను కోల్పోకపోవడమే కాక మనోస్థయిర్యాన్ని కూడా ఏ మాత్రమూ కోల్పోలేదు.

అతడు నామాన్ని వదల్లేదు. నామం అతణ్ణి వదల్లేదు.

నామంలో ఎంతో మాధుర్యం ఉంది. ఎంతో మహిమ ఉంది. అనంతమైన శక్తి ఉంది. అపరిమితమయిన ప్రభావం ఉంది. మనస్సుకు శాంతి నిస్తుంది. మనస్సును ఆనందంతో నింపుతుంది.

మనం కోరినప్పుడల్లా మూర్తి మనకు అందుబాటులో లేక పోవచ్చును కానీ నిజంగా అమ్మ చెప్పినట్లు అడ్డులేనిది నామమే.

"జయహో మాతా శ్రీ అనసూయా
రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి....."

(డిసెంబరు 78, జనవరి 1979)



## పాదస్పర్శ

పాదాలు ముట్టుకుంటే మంటలు పుడతై - అంటారు. పాదాలు ముట్టుకుంటే ఎదుటివాళ్ళ పాపాలవల్ల కాళ్లు మంటలు పుడతైయట. అదే జరిగితే వాళ్ళల్లోని గొప్పతనంకూడా అంటుకోవాలిగా. నేను అందర్నీ తాకుతూనే వున్నాను. అనేక వేలమంది తాకి నమస్కారం చేస్తూనే వున్నారు. కానీ నాకా అనుభవం లేదు.

- అమ్మ

# 138
# సన్యాసం

ఏలూరు నుంచి శ్రీ లక్ష్మణయతీంద్రులు, మరికొందరు యతులు, వారి శిష్యులు అమ్మను చూసేందుకు జిల్లెళ్ళమూడి వస్తారని కబురు తెలిసింది. దూరదేశంలో ఉండే పిల్లలు యింటికి వస్తున్నారని తెలిసిన తల్లి పొందే అపారమైన ఆనందం అమ్మ ముఖంలో వికసితమైంది. వాళ్ళకోసం క్రొత్త గుడ్డలు తెప్పించమన్నది తనదంటూ, తనకంటూ ఒక ప్రత్యేకమైన సంప్రదాయం ఏమీ లేప్పటికీ అమ్మ అందరి సంప్రదాయాలనూ మన్నిస్తుంది కదా. కనుకనే వారు - ఏ గుడ్డలు కట్టుకుంటారో, ఏరంగు వేసుకుంటారో, ఎంతగుడ్డ కావాలో వివరంగా కనుక్కొని వారికి సరిపోయేటట్లు తెప్పించమన్నది. ఆ గుడ్డలు తన చేతి మీదుగా వారికి ప్రసాదించాలనీ, వారు కట్టుకుంటే తాను చూడాలనీ అమ్మ ఉద్దేశం. అందులో అమ్మకు ఎనలేని ఆనందం. అందుకే లోగడ ఒకసారి అమ్మ అన్నది "నేను కట్టుకునేకంటే, మీరు కట్టుకుని కనబడితే నాకెంతో తృప్తిగా ఉంటుందీ" అని.

వారు ఏమి తింటారో - ఏమి తినరో విచారించమన్నది. వాళ్ళకు తన చేతిమీదుగా స్వయంగా భోజనం పెడతా నన్నది. అమ్మా - నీ సన్నిధానంలో, అదీ నువ్వే పెట్టేటప్పుడు ఇంకా ఈ నియమ నిబంధనల ఆలోచన లేమిటమ్మా ? - అని అడిగితే "నేను పెడుతున్నానన్న ఆనందం వారికి మిగల్చకుండా - 'మా నియమభంగం అయిందే' అన్న బాధను కూడా వారికి పంచిపెట్టాలా" అని అమ్మ నవ్వింది.

వారికి వసతికోసం ప్రత్యేకమయిన గదులను ఏర్పాటు చేయమన్నది. వాటిని పరిశుభ్రం చేయమనీ చెప్పింది. ప్రయాణంచేసిన బడలికతో ఉంటారు కదా, రాగానే స్నానం చేస్తారేమో కనుక్కోమన్నది. ఇలా ఎన్నో చిన్న చిన్న విషయాల్లో కూడా అమ్మ కనబరిచే ఆసక్తిచూసి మేము ఆశ్చర్య చకితుల మయినాము.

ఫిబ్రవరి 11వ తేదీన - అనుకున్నట్లుగానే - వాళ్ళందరూ వచ్చారు. అమ్మ అందరినీ దగ్గరకు తీసుకున్నది. యతులందరికీ నూతన వస్త్రాలను ప్రసాదించింది. వారందరికీ తానే స్వయంగా అన్నం కలిపి ముద్దలు నోటికి అందించింది. తర్వాత

వారి శిష్యులందరినీ బారులు తీర్చి కూర్చోబెట్టి అమ్మ తానుకూడా స్వయంగా వడ్డించింది. చాలాకాలం తర్వాత అట్లా వడ్డిస్తున్న అమ్మను చూసి మేమందరమూ ఎంతో ఆనందపడ్డాము.

వారియెడల అమ్మచూపిన వాత్సల్యానికి వారు అమితానంద భరితులయ్యారు. వారు తల్లి ఒడిలో ఆడుకునే పసివాళ్ళలాగానే కనుపించారు. వాళ్ళ ఆనందంలోనే అమ్మతానూ తాదాత్మ్యం పొందింది. ఆరోగ్యం సరిగా లేకపోయినప్పటికీ ఆనాడు అమ్మలో ఎంతో ఉత్సాహం కనబడింది. ఆ సాయంకాలం అమ్మ సమక్షంలో శ్రీ లక్ష్మణ యతీంద్రులు ప్రసంగం చేశారు. సత్ పదార్థంలో మనస్సును లగ్నం చేయడమే - సన్యాసం అని నిర్వచించి సన్యాసియొక్క ధర్మాలను వివరిస్తూ సన్యాసిని 'జాతీయ సంపద'గా అభివర్ణించారు.

అనేక సందర్భాలను పురస్కరించుకుని అమ్మ యీ తురీయా శ్రమము గురించి చక్కగా వివరించింది. "వివాహం చేసుకుని గృహస్థుగా ఆధ్యాత్మిక సాధన చేయటం కోటలో ఉండి యుద్ధం చేయటం; సన్యసించటం కోట విడిచి యుద్ధానికి వెళ్ళటం" అని బహురమ్యంగా వర్ణించింది. మరొక సమయంలో "బుద్ధుడు వెళ్ళాడని అందరూ వెళ్ళడం కాదు. ఆయన వెళ్ళినట్లుగా వెళ్ళాలి" అని హితోపదేశం చేసింది. బుద్ధుడెందుకు వెళ్ళాడూ ? జగత్తులో అనేక రూపాల తాండవిస్తున్న దుఃఖాన్ని చూసి, ఆ వేదనకు మూలాన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. వెదికి వెదికి మానవుడి దుఃఖానికి కారణం 'కోరిక'యే నని తెలుసుకున్నాడు.

"ఆ కోరిక లేని స్థితిని సంపాదించుకోవడానికి ప్రయత్నమే సన్యాసం" అని అమ్మ వివరించింది. అయితే, "మంచంమీద వద్దు, చాపమీదనే పడుకుంటా ననటం కోరికే. తెల్లగుడ్డవద్దు, కాషాయగుడ్డ కావాలనటమూ కోరికే. వైరాగ్యం అంటే వేపాకుతిని ఉండడమే కాదు, ఏది దొరికితే అది తృప్తిగా స్వీకరించడమే. వేపాకే తింటాను, అంటే - అదీ కోరికే" అని విపులీకరిస్తూ "సర్వభక్షకు డయినవాడే భిక్షుకుడవుతా"డనీ, "లింగ భేదం, రూపభేదం, స్పర్శభేదం లేనివాడే సన్యాసి" అనీ అమ్మ ఉద్ఘాటించింది.

ఆ స్థితి వస్తే ఇంట్లో ఉన్నా, ఆశ్రమంలో ఉన్నా ఒకటే. కషాయవస్త్రాలు కట్టుకున్నా, తెల్లగుడ్డలు కట్టుకున్నా ఒకటే. సంసారంలో ఉన్నా, సన్యాసం తీసుకున్నా ఒకటే. కానీ ఇంట్లో ఉండి సాధించలేమన్న జంకు కలిగిన తర్వాత ఒక కట్టుబడిలో ఉండవచ్చునన్న ఉద్దేశంతో సన్యాసం తీసుకుంటారు. అపుడు మనస్సులో ఏమున్నా ప్రయోగాలుండవు. కొన్ని నియమాలకు కట్టుబడి ఉంటారు" అని అమ్మ అతి సున్నితంగా చెబుతూ "సన్యాసి కావలెగానీ సన్యాసం పుచ్చుకొనటం కాదు" అని అందంగా విభజన చేసింది.

మన సమాజంలో గృహస్థాశ్రమం ఆధ్యాత్మిక సాధనకు ప్రతి బంధకం అన్న నమ్మకం ఉన్నది. ఆ గృహస్థాశ్రమానికి పెండ్లి సింహ ద్వారం కనుక పెండ్లి ఆధ్యాత్మికతకు విరోధియని భ్రాంతి. ఆ భ్రమను తొలగించడానికే పెండ్లిలో పెద్దపులి ఉన్నదనుకునే వారి భయం పోగొట్టడానికే నేను పెండ్లి చేసుకుంటున్నాను'' అని అమ్మ తన వివాహ సందర్భంలో ఒక ప్రకటన చేసింది.

"అన్ని ఆశ్రమాలకూ ఒకటే విలువ'' అని కూడా అమ్మ స్పష్టం చేసింది. ఏ ఆశ్రమం నుండి అయినా ముక్తిని పొందవచ్చుననేది అమ్మ అభిప్రాయం. ముక్తి అంటే అమ్మ దృష్టిలో నిత్య తృప్తి. తృప్తి అంటే అనుభవించేది మినహా మరింకేమీ అవసరం లేని స్థితి. మరి - మనిషికి అందనిదీ, అనుభవించేదీ అంటే అలసభావమూ, అందనిదాని కొరకు ఆరాటమూకదా. అందిన దానితో తృప్తి, అందని దానికొరకు ఆరాటం లేకపోవడమే ముక్తి అని అమ్మ ఘంటాపథంగా చెప్పింది. అమ్మకు తొమ్మిదవ సంవత్సరం ప్రాయంలో అమ్మ బంధువులు అమ్మను శ్రీ వాసుదానస్వామి వారి వద్దకు తీసుకుని వెళ్ళారు. వారికి అమ్మను "తల్లిలేని పిల్ల'' అని పరిచయం చేయగా వారు సానుభూతిని వ్యక్తం చేస్తూ "నీ కేమి కావాలమ్మా?'' అని అడిగారు. వెంటనే అమ్మ "ఏమీ కావాలనేది అక్కర లేకుండా కావాలి'' అని సమాధానం చెప్పింది. ఆ సమాధానానికి ఆయన దిగ్భ్రాంతి చెంది, అటువంటి వాక్యం తానెప్పుడూ వినలేదని అనుకున్నారట. అప్పటికీ యిప్పటికీ అమ్మ అదే స్థితి. అది కావాలీ - అని లేదు. ఇది వద్దూ - అనీ కాదు. పట్టుచీరెలూ కట్టుకోవచ్చునూ, గోనెపట్టాలూ చుట్టుకోవచ్చునూ; పంచభక్ష్యపరమాన్నాలూ తినవచ్చునూ; పస్తులూ ఉండవచ్చునూ; పూలతో పూజలు చేయించుకో వచ్చునూ, పిడకలతో పూజ చేయించుకోవచ్చునూ; కొందరిచే స్తుతించబడవచ్చునూ, కొందరిచే నిందించబడ వచ్చునూ -- అమ్మకు అన్ని వేళలా ఒకటే మనఃస్థితి. ఆ భిన్నత్వం లేని మనస్తత్వమే అమ్మను దేవతా పీఠంపై ఆశీనను చేసి లోకారాధ్యను చేసింది.

సంసారం అంటే మన దృష్టిలో భార్యా, భర్తా సంతానమూ - అని. కానీ అమ్మ నిర్వచనం సంసారం అంటే సంకల్పమే. తెనాలిలో ప్రఖ్యాత పండితులు శ్రీ మూల్పూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో సంభాషిస్తూ ఈ విషయం వెల్లడించగా - ఆ పండితుడు నివ్వెరపోయి ఆ అపూర్వ నిర్వచనాన్ని వెంటనే ఒక కాగితంపై వ్రాసుకున్నారు.

మరి సంకల్పం లేని మనిషి ఉంటాడా ? తరంగం లేని సముద్రం వుండవచ్చు నేమో కానీ సంకల్పంలేని మనస్సు వుండదు గదా. సంకల్ప రాహిత్యం చేసుకుంటేగానీ మోక్షం లభించదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మరి, ఇదేలా

సాధ్యమవుతుంది ? దీనికి అమ్మ చక్కని పరిష్కారం సూచించింది. సంకల్ప రాహిత్యమంటే - సంకల్పాలు లేపోవటం కాదట. తనకు వచ్చే ప్రతి సంకల్పమూ దైవదత్తమని విశ్వసించటమట. ఎంత చక్కని నిర్వచనం ? ఎంత సులభ పరిష్కారం!! అందుకనే అమ్మ 'తానొకటి తలిస్తే దైవం ఒకటి తలుస్తాడు' అన్న సామెతను ఖండిస్తూ దైవం తలుపే మనిషి తలుపు అని నిర్ద్వంద్వంగా చెప్పింది. 'చేసే పని అంతా దైవసేవ అనుకోగలిగితే ఆధ్యాత్మిక సాధనకు సంసారం ప్రతిబంధకం కానేరదు' అని అమ్మ ఇహ పరాలకు రెండికీ అందమయిన సేతువు నిర్మించింది.

మామూలు అర్థంలో సన్యాసమంటే సత్ పదార్థమందు మనస్సుకు లగ్నం చేయటమని లోగడమే చెప్పుకున్నాం కదా. సన్యాసులు - ఈ లోకం మిథ్యయనీ, ఇదికాక 'సత్' అనేది మరెక్కడనో ఉన్నదనీ, విశ్వసిస్తూ దానిని వెదుకుతూ, దాని గురించి ఆలోచిస్తూ అదే గమ్యంగా, అదే ధ్యేయంగా జీవనం సాగిస్తారు అమ్మ ఈ లోకం 'సత్' కాకపోలేదని చెబుతూ ఈ లోకంలో ప్రత్యణువూ ప్రేమాస్పదమే నని చెప్పింది.

కనుకనే సాంప్రదాయిక సన్యాసం మమకారాలను ఛేదించుకొనమని ప్రబోధిస్తుందే - అమ్మ మమకారాలను పెంచుకొనమని ఉద్బోధిస్తూ "నావైరాగ్యం ఏమిటో తెలుసా ? సర్వత్రానురాగమే నా విరాగం" అని ప్రేమామృతాన్ని లోకంపై దోసిళ్ళతో వెదజల్లింది.

సన్యాసులు తమ చుట్టూ గిరులు గీచుకుని కూర్చుని, కనబడే జగత్ సౌందర్యాన్ని చూడక కళ్ళుమూసుకుని, సహజంగా ప్రతి హృదయంలోనూ ఉత్పన్నమయ్యే అనురాగామృతలహరులను అణచివేసుకుంటూ జడప్రాయులై జటాధారులయ్యే కంటే - అమ్మ అభిప్రాయం ప్రకారం సన్యాసులు విశ్వమే తమ కుటుంబంగా భావించి ప్రతిజీవిని తమ సోదరుడుగా ప్రేమించి ఆర్తులకు తాను సేవకుడనని ప్రవర్తిస్తే... ప్రస్తుతం అనేక అపోహలకు ఆలవాలమయిన 'సన్యాసం' పవిత్రమై, సుందరమై, సర్వజన పూజ్యమై విలసిల్లదూ?

గృహస్థుకూ సన్యాసికీ - ఇద్దరికీ ప్రేమే మార్గమయినప్పుడు ప్రవృత్తికీ నివృత్తికీ భేదం ఏమున్నదీ ? ఒక ఆశ్రమం గొప్పదనీ, మరొక ఆశ్రమం అల్పమనీ అంతర మేమున్నదీ ?

(ఫిబ్రవరి 1979)



# 139
# కవలపిల్లలు

నిత్యము కొన్ని ఉత్తరాలు అమ్మ పేరునా, కొన్ని ఉత్తరాలు సంస్థపేరునా వస్తుంటాయి. సంస్థకు సంబంధించిన ముఖ్యమయిన ఉత్తరాలు మాత్రమే అమ్మకు వినిపించినా, అమ్మ పేరున వచ్చిన ఉత్తరాలన్నీ అమ్మకు చదివి వినిపిస్తాము.

అమ్మ కొన్నిటికి సమాధానాలు చెబుతుంది. కొందరికి చెప్పదు. కానీ అందరికీ ప్రసాదం పంపమంటుంది. కొందరికి సమాధానం చెప్ప వలెనని అమ్మకు అభిప్రాయం ఏర్పడినప్పటికీ - అది అక్షరాలలో సాధ్యపడదనో, మేము అమ్మ సందేశాన్ని సరిగ్గా అందజేయలేమోనన్న సందేహంతోనో, లేక అమితానురాగంతో వారిని అనుగ్రహ జలధిలో ముంచెత్తేందుకో.... అమ్మ ఆ ఉత్తరాలు వ్రాసిన వారిని తన వద్దకురమ్మని వ్రాయమంటుంది.

ఈ నెల 10వ తేదీన అమ్మకు కొన్ని ఉత్తరాలు చదివి వినిపిస్తున్నాను. అందులో ఒక ఉత్తరం విశాఖపట్నం నుంచి వచ్చింది. చొదిమెళ్ళ చంద్రశేఖర్ వ్రాశాడు. అతడక్కడ యం.బి.బి.యస్. చదువుతున్నాడు. అతడిలో అధ్యాత్మిక చింతన అత్యధికంగా ఉంది. అధ్యాత్మిక జీవనం అంటే అతనికి అపారప్రేమ, సన్యాసమే అతని జీవనమార్గం కావాలని మనసా అభిలషిస్తున్నాడు. అదొక్కటే అతడ్ని మోక్షానికి చేర్చగలదని అతని ప్రగాఢ విశ్వాసం. ఆ దారి తనకు దొరక్కపోతే తన జీవితమే వ్యర్థం కాగలదని అతని అభిప్రాయాన్ని అభివ్యక్తం చేస్తూ అందుకు అమ్మ ఆశీస్సుల నర్థించాడు.

ఉత్తరమంతా విని అమ్మ ఆ చిరంజీవియందు అపారమైన దయను కనబర్చింది. అవకాశం చూసుకుని అతడ్ని ఒకసారి జిల్లెళ్ళమూడి రమ్మని వ్రాయమన్నది.

సంప్రదాయబద్ధంగా ఆలోచించే వారికి - ప్రాపంచికమనీ, పారమార్థికమనీ రెండు. వారి దృక్పథంలో ఇవి ఒక వరలో ఇముడని రెండు కత్తులు; ఎన్నడూ

ఎక్కడా కలవని సమాంతర రేఖలు, వారి దృష్టిలో పాంచభౌతికమైన ప్రపంచం వేరు; సర్వాతీతమైన పరమాత్మ వేరు. ప్రపంచం భ్రమసంజనితమైనది, అశాశ్వతమైనది, దుఃఖకరమైనది. పరమాత్మ సత్యమయినది. శాశ్వత సుఖ సంధాయకమైనది. కనుక మానవుడు జ్ఞానసంపన్నుడై ప్రాపంచిక వ్యామోహాలకు దూరుడై, మోక్షగామియై పరివ్రాజకుడై పరమాత్మను తెలుసుకుని పరమపదాన్ని పొందాలని వారి అభిప్రాయం.

వారి అభిప్రాయం ప్రకారం మోక్షసామ్రాజ్యానికి సన్యాసం ఒక్కటే ద్వారం. ఏ మార్గాన పయనం చేసినా - చివరకు ఆ కవాటం ద్వారానే ఆ సామ్రాజ్యంలో అడుగు పెట్టాలి. వారి సిద్ధాంతం ప్రకారం గృహస్థాశ్రమం, లౌకిక విషయాలు అందుకు ఆటంకాలు. కనుకనే ఇవి తొలగించుకోవాలని నిరంతర తపన ఈ లోకానికి సంబంధించని వాటిని గురించీ, మనకు వ్యక్తంకాని వాటిని గురించీ, వాగ్మానసాతీతమైన పదార్థం గురించీ ఆలోచన. దానినే ఆధ్యాత్మిక చింతన అన్నారు.

కేవలం కనిపించే పదార్థాల గురించి మాత్రమే ఆలోచించే వారిని, నమ్మేవారిని పదార్థవాదులు అన్నారు.

పదార్థవాదుల దృష్టిలో ఆధ్యాత్మిక వాదులు వట్టి ఛాందసులు; మానసిక వ్యాధిగ్రస్తులు. ఆధ్యాత్మిక చింతన అంటే అదొకరకం ఉన్మాదం. ఆధ్యాత్మిక విచారణ పనిలేని సోమరులు చేసే వ్యర్థ కాలక్షేపం.

ఆధ్యాత్మిక వారుల దృష్టిలో పదార్థవాదులు అజ్ఞానులు; కళ్ళున్న అంధులు.

ఈ విదుద్ధవాదాల మధ్య అమ్మ పసిడివంతెన నిర్మించింది.

ప్రపంచమనీ, పరమాత్మయనీ రెండు లేవన్నది. కనుపించే విశ్వమూ, విశ్వనాథుడూ ఒకటే నన్నది. కనుక మనం చేసే ప్రతిపనీ పారమార్థికమే నట. మనం చేసే ప్రతి ఆలోచనా ఆధ్యాత్మికమేనట. కనుక ఏ లౌకిక వృత్తీ, ప్రవృత్తీ ముక్తి ప్రాప్తికి ప్రతిబంధకం కాదట.

అసలు, ప్రతినిత్యకీ ఆద్యాత్మిక చింతన అవసరమా ? శరీరానికి పోషకపదార్థాల వలే మనస్సుకు ఆధ్యాత్మిక చింతన ఆవశ్యకమా ? అధ్యాత్మిక సాధన లేని జీవితం వ్యర్థమా ?

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క విషయంలో ఆసక్తీ అభినివేశమూ కలుగుతాయి. ఒకడికి కవిత్వంలో, ఒకడికి చిత్రరచనలో ఒకడికి శిల్పంలో, ఒకడికి సంగీతంలో, ఒకడికి నాట్యంలో, ఒకడికి వైద్యంలో, ఒకడికి క్రీడలలో, ఒకడికి గణితంలో,

ఒక్కొక్కడికి ఒక్కొక్క ప్రత్యేకశాస్త్రంలో ఆసక్తి ఏర్పడవచ్చునూ; అందులో అతడు పరిశ్రమను చేయవచ్చునూ; అద్భుత విజయాలు సాధించవచ్చునూ; ఉన్నత శిఖరాలు అధిరోహించవచ్చునూ, అలాగే ఒకడు ఆధ్యాత్మిక చింతన చేయవచ్చునూ; సాధన చేయవచ్చునూ; ఒక్కొక్క సోపానం ఆరోహించవచ్చునూ; తుదకు ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చునూ, అన్ని కళలతోపాటు, శాస్త్రాలతోపాటు ఇదీ ఒక విషయమేనా ? దీనికేమయినా విశిష్టత ఉన్నదా ? ఏ కళాకోవిదుని కయినా, ఏ శాస్త్ర నిష్ణాతునికయినా - ఆధ్యాత్మిక చింతన, సాధన, జ్ఞానసముపార్జన లేనిదే - అతని జీవితం అసమగ్రమూ, అసంపూర్ణమూ అపక్వమూ యేనా ?

ఇదే విషయాన్ని అమ్మను అడిగాను. ప్రతిజీవికీ ఆధ్యాత్మిక చింతన అవసరం లేదన్నది. ఆధ్యాత్మిక చింతన, సాధన చేయదలుచుకున్న వ్యక్తికి సంసారం అడ్డు కాదని స్పష్టం చేసింది.

పదార్థవాదీ పరిశోధనలు చేసి చేసి ఈ విశ్వంలోని ప్రతి పదార్థానికీ అవినాభావ సంబంధ మున్నదనీ, అన్ని వస్తువుల, జీవుల మూలపదార్థం ఒకటే ననీ మనిషి యొక్క ఆలోచనలు కూడా సామూహికమైనవేగానీ వ్యక్తిగతమైనవి గావనీ, ఈ సృష్టి యావత్తును మనకు అవ్యక్తమయిన ఒక మహాద్భుతశక్తి నడుపుతున్నదనీ తెలుసుకుంటున్నాడు. వానికి ప్రపంచంలో ఒకడు అధికుడనీ ఒకడు అల్పుడనీ తోచదు. పాపపుణ్యాలు స్ఫురించవు. అందరూ అన్నీ ఒక ప్రకృతి సూత్రానికి నిబద్ధమైన పరమసత్యం సుబోధకమవుతుంది.

ఆధ్యాత్మిక వాదీ సాధన దశలో "నేతి నేతి" అనుకున్నా ఆత్మజ్ఞానం పొందగానే సృష్టిలో తనకంటే భిన్నమయిన దేమీ లేదనీ, కనుపించే దంతా ఒకే ఆత్మయొక్క భిన్నరూపాలు మాత్రమే ననీ... తెలుసుకుని సమభావంతో సమచిత్తంతో మెలుగుతూ అన్నిటియందూ తాదాత్మ్యం చెంది, అందరియందూ, అన్నిటియందూ అవ్యాజమైన అమలినమైన అనురాగాన్ని పొంది ప్రేమమయుడై ఆనందమయుడై ఆత్మస్వరూపు డవుతాడు.

ఏ మార్గంలో ప్రయాణం చేసి పూర్వజ్ఞానం సంపాదించినప్పటికీ - వానికి ఈ లోకం ఆనందనిలయమే అవుతుంది గానీ విసర్జనీయం ఏ మాత్రమూ కాదు. సత్యం సుప్రతిష్ఠితమయిన హృదయంలో అరిషడ్వర్గానికి తావు లేదు. ప్రేమ నవనవోన్మేషంగా వికసితమై మధుర పరిమళాల వెదజల్లుతూ ఉంటుంది. జ్ఞానికి ప్రకృతీ పురుషులు అభిన్నులు. వానికి జగత్తు సత్యం, శివం, సుందరం. వానికి

లోకంలో అణువణువూ ప్రేమాస్పదమూ, పూజ్యమే. వానికి ప్రతిజీవీ దైవ స్వరూపమే. వానికి అంతా చైతన్యంగానే భాసిస్తుంది. జడమే తోచదు. వానికి ఎంత వెదికినా "అది" కానిది కనుపించదు. వానికి ఏం చేసినా దైవారాధనగానే భావన కలుగుతుంది.

అందువల్లనే -

అమ్మను ఆధ్యాత్మిక వాదులు నాస్తికురాలు అన్నప్పటికీ, పదార్థవాదులు ఛాందసురాలు అన్నప్పటికీ... అమ్మమాత్రం అస్తికులనూ నాస్తికులనూ కవలపిల్లలనువలే చంకనవేసుకుని సమంగా లాలిస్తున్నది; పాలిస్తున్నది.

(మార్చి 1979)



## లోపల ఏదో వెలుపలా అదే

నా చిన్న తనంలో ఒక రోజున మధ్యాహ్నం కూర్చుని నిద్రపోయి లేచాను. కళ్లు తెరిచేప్పటికి నా శిరస్సుపై సర్పం కనిపించింది. ప్రక్కకు తిరిగితే ప్రక్కన కనిపించింది. ఎదురుగుండా చూస్తే ఎదురుగుండా కనిపించింది. ఎటు చూస్తే అటు కనిపించింది. చింతచెట్టువేపు చూస్తే చింతచెట్టు అంతా అదిగానే కనిపించింది. రోడ్డునే బయలుదేరితే రోడ్డుననే నడిచినట్లే నడిచింది. శివాలయం వాకిలి ముందర నిల్చుని ధ్వజం వంక చూస్తే ధ్వజం పొడుగునా కనిపించింది. నా పాదాలవద్ద నుండి గుడివాకిలిదాకా వున్నది. ఆశ్చర్యంలో భావనారాయణ స్వామి దేవాలయానికి వెళ్ళాను. అక్కడా వున్నది. అక్కడ కూర్చున్నాను. చివరకు 'ఇది ఏమిటి' అని ఆలోచించాను. ఇదంతా నాలోదే అనిపించింది.

- అమ్మ

# 140
# సామరస్యం

అనేక సంవత్సరాలుగా అమ్మ పాద సన్నిధికి వస్తూ ఉన్న నరసాపురం వాస్తవ్యులు డాక్టర్ ఆచంట కేశవరావు ఈ నెల 5వ తేదీన శ్రీ రామనవమినాడు జిల్లెళ్ళమూడిలో షష్ట్యబ్దపూర్తి ఉత్సవం జరుపుకున్నారు.

ఆ ఉత్సవానికి అనేకులు బంధుమిత్రులను పిలిచి వేడుక చేసుకునే కంటే - జగజ్జనని సమక్షంలో జరుపుకుని ఆశీర్వచనం పొందాలనీ, ఆధ్యాత్మిక మహోన్నత వ్యక్తులను కొందరినయినా ఆహ్వానించి వారి నుండి దీవెనలనూ, మహాకవుల ఆశీస్సులనూ అందుకోవాలనీ డాక్టర్‌గారు ఆకాంక్షించి... ఉత్సవానికి వేదికగా జిల్లెళ్ళ మూడిని నిర్ణయించుకుని అమ్మ అనుమతి పొంది శ్రీ బషీర్‌బాబానూ, శ్రీ గాయత్రీ బాబానూ, శ్రీ లక్ష్మణయతీంద్రులనూ ఆహ్వానించారూ; ప్రఖ్యాత కవులనేకులనూ ఆహ్వానించారూ.

ఆహూతులందరూ విచ్చేశారు; ఉత్సవం అత్యంత వైభవోపేతంగానూ జరిగింది.

అందరూ ఏకగ్రీవంగా డాక్టరుగారిని ఆశీర్వదించాలని అమ్మను అర్థించారు. శ్రీ లక్ష్మణ యతీంద్రులవారు మాట్లాడుతూ .... అందరినీ ఆశ్వీదించే హక్కు ఒక్క అమ్మకు మాత్రమే ఉన్నదని ఉద్ఘాటిస్తూ... అమ్మకూ తనకూ ఒక పోలిక ఉన్నదని రమణీయంగా చమత్కరించారు. అమ్మ అందరికీ అమ్మట; తన కంటే వయస్సులో పెద్దవారికి కూడా, తాను అందరికీ కొడుకట; తన కంటే చిన్నవాళ్ళకు కూడా, కనుకనే అందరినీ ఆశీర్వదించే హక్కు అమ్మది కాగా అందరి నుండీ ఆశీర్వచనం పొందే హక్కు తనది అయిందట. రాముడికీ, అమ్మకూ భేదం లేదని చెబుతూ... ఉందని ఎవరయినా అంటే - వారికి రాముడన్నానూ, అమ్మ అన్నానూ తెలియదని మనం అనుకోవాలి - అన్నారు.

శ్రీ బషీర్‌బాబా బహు గంభీరంగానే కాక అత్యంత కమనీయంగా కూడా ప్రసంగం చేశారు. ప్రతి సంవత్సరం శ్రీరామనవమినాడు వారి నివాసస్థలమైన

రామ్‌సాయినగర్‌లో బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. అందుకు వేలసంఖ్యలో భక్తులు వస్తారు. అయినప్పటికీ లోగడ డాక్టరుగారికి చేసిన వాగ్దానం ఫలితంగానూ, తన మాటను తానే భంగంచేయటం ఇష్టం లేకనూ - శ్రీ రామనవమికి వారు జిల్లెళ్ళమూడి విచ్చేశారు.

బాబా మాట్లాడుతూ... డాక్టరుగారి షష్ఠిపూర్తి పండుగా, వారి పిలుపూ బహిరంగమయిన కారణాలు మాత్రమేననీ, తనను నిజంగా జిల్లెళ్ళమూడికి తీసుకు వచ్చింది అమ్మ ప్రేమేననీ అన్నారు. అమ్మ ప్రేమ పవిత్రమయినదీ బలమయినదీ అని వివరించారు. ప్రేమను మించిన శక్తి ప్రపంచంలో లేదన్నారు. అమ్మ ప్రేమకు పాత్రులు కాగలగటం ఎవరి కయినా అదొక మహా పుణ్యఫలమనీ, అదృష్ట సంఘటన అనీ అభివర్ణించారు. తాను అమ్మను ప్రేమించటానికికాక అమ్మ ప్రేమను పొందటానికి మాత్రమే వచ్చానని వక్కాణిస్తూ - తాను ఆ ఉదయమే అమ్మ ప్రేమను పరిపూర్ణంగా పొందానని సగర్వంగా చెప్పుకున్నారు. విశ్వంలో ప్రతివాడూ తప్పనిసరిగా అమ్మను చూడాలని అభిభాషిస్తూ... అమ్మ అంటే ఏమిటో తెలియని వాడూ, ప్రేమ అంటే ఎరుగనివాడూ మాత్రమే అమ్మను చూడలేడు । అన్నారు. తాను ఎప్పుడూ భగవంతుడికీ, భక్తుడికీ మధ్యవర్తిని మాత్రమేనని వివరిస్తూ... ప్రస్తుతం కూడా కేశవపక్షాన ఆశీస్సుకోసం అమ్మను అర్థించటానికీ అమ్మ ఆశీస్సును కేశవరావుకు అందించటం కోసమే తాను వచ్చానన్నారు.

శ్రీ లక్ష్మణయతీంద్రులుగానీ, శ్రీ బషీర్‌బాబాగానీ లబ్ధ ప్రతిష్ఠులు; అనుచర సహస్రాలు గల సుప్రసిద్ధ వ్యక్తులు. వారు అమ్మవద్దకు వచ్చారూ; హాయిగా అమ్మను చూచారూ; వారి చరిత్రనూ, అంతస్తులనూ మరిచి నిస్సంకోచంగా పసిబిడ్డలు వలే అమ్మ వద్ద కూర్చున్నారూ; నిరవధికమూ, నిర్వ్యాజమూ అయిన అమ్మప్రేమ పీయూషాన్ని పుక్కిటి బంటిగా పానంచేసి పరవశించారు. అమ్మ బషీర్‌బాబాకు చిన్న పిల్లవాడికివలే ఇడ్లీ ముక్కలు నోటికి అందిస్తూంటే, అవి తింటూ వారు అనుభవించిన ఆనందం అక్షరాల్లో ఇముడదు. వారు మామూలుగా ఒక ఇడ్లీగానీ, అందులో కొంతభాగం మాత్రమేగానీ తింటారట. కానీ అమ్మ వాత్సల్యం తొణికిసలాడే కందోయితో వారిని చూస్తూ గోరుముద్దలవలే తినిపిస్తూంటే - బాబా అన్నారు "ఇవ్వాళ నేను ఎన్ని ఇడ్లీ అయినా తింటాను. అమ్మ పెట్టినన్ని తింటాను. వద్దూ అననూ; చాలూ అననూ. ఎందుకంటే ఇది పదార్థం అనుకోవటం లేదు, ఇది అమ్మ ప్రేమ; అమ్మ నాకు ఇస్తున్న పవర్ అనుకుంటున్నాను."

"లోకంలో ఎవరిని చూసినా నా బిడ్డే అనిపిస్తుంది" అని ఘంటాపథంగా చెప్పగలిగిన అమ్మ యతీంద్రులవారినిగానీ, బాబా గారినిగానీ తన అనుగు బిడ్డలవలే చూడంలో ఆశ్చర్య మేముంటుంది? వారి విశేష వస్త్రధారణగానీ, వారి ఆధ్యాత్మిక ఔన్నత్యంగానీ అమ్మ అనురాగానికీ, ఆదరణకూ ఏ విధంగానూ అడ్డుకాలేకపోయాయి

యతీంద్రులు జిల్లెళ్ళమూడికీ, అమ్మకూ కొత్త కాదుగానీ శ్రీ బషీర్‌బాబా జిల్లెళ్ళమూడి రావటం మొట్టమొదటిసారి, కనుక అమ్మ - బాబాల సమావేశం ఎంత విచిత్రంగా ఉంటుందోనని అనేకులకు ఉత్కంఠ, కానీ వారి ఔత్సుక్యాన్ని చల్లారుస్తూ వారి సమ్మేళనం అతి నిరాడంబరంగానూ నిసర్గసుందరంగానూ జరిగిపోయింది. ఒక బిడ్డ తల్లి వద్దకు వచ్చినట్లు బాబా వచ్చారు. తల్లి బిడ్డను దగ్గరకు తీసుకున్నట్లు అమ్మ అనురాగాన్ని వర్షించింది.

ఆ మధుర సన్నివేశం అందరినీ ఆహ్లాదపరిచింది. ఆ ఘట్టం బాబా నిరాడంబరతకూ, అమలిన మనస్సుకూ ప్రతిబింబం కాగా, అమ్మ సహజసుందర సర్వమాతృత్వానికి మరొక నిదర్శనంగా భాసిల్లింది.

ప్రపంచంలో, ముఖ్యంగా మన దేశంలో ఎందరో మహానుభావులు ఉన్నారు. ఎందరో సత్యదర్శనం చేసుకున్నవారుగా, దైవ సాక్షాత్కారం పొందినవారుగా, జ్ఞానసిద్ధిని సాధించినవారుగా, అవతార వ్యక్తులుగా భావింపబడుతూ అశేష ప్రజానీకంచేత ఆరాధింపబడుతున్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అనుచరవర్గం ఉంటున్నది. వీరిలో ఒకరిని ఆరాధించేవారు మరొకరిని ఆరాధించక పోవడమే కాదు, వారిని విశ్వసించరు. అల్పజ్ఞానంతో వారిని త్రాసులోపెట్టి తూచటానికి ఎక్కువ తక్కువుల నిర్ణయించటానికీ వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. వీరిలో లోపాలు వారి అనుచరులూ, వారిలో దోషాలు వీరి అనుయాయులూ వేలెత్తి చూపిస్తూ ఒకరిని ఒకరు ద్వేషిస్తూ దూషిస్తూ ఉంటారు. ఈ అలజడులతో ఏ ఆత్మశాంతికోసం, ఏ ఆధ్యాత్మికోన్నతికోసం యీ అనుచరులు మహాత్ముల సాన్నిధ్యానికి చేరుతున్నారో, ఆ పవిత్ర ఉద్దేశం పూర్తిగా పరాజితం అవుతున్నది. ఒక రకంగా ఆలోచిస్తే... ఈ అనిశ్చిత స్థితికీ, ఈ అనుమానాలకూ, ఈ అలజడులకూ "మహాత్ములు"గా భావింపబడే వారికి కూడా బాధ్యత ఉన్నదేమో ననిపిస్తుంది.

ఒకే విషయంపై వీరు చేసే ప్రకటనలూ, ప్రవచనాలూ విభిన్నంగానే కాదు; విరుద్ధంగాకూడా ఉంటున్నాయి. అందులో అందరూ తాము 'సత్యదర్శనం' చేశామనే

చెబుతారు ! మరి ఎవరు చెప్పింది ఒప్పో; ఎవరు పలికింది తప్పో ఎలా నిర్ణయించడం, నిర్ణయించలేక - శిష్యులలో వాదోపవాదాలూ, అంతఃకలహాలూ.

అలా కాక ఈ జ్ఞానసంపన్నులూ, దైవస్వరూపులూ అందరూ ఒకచోట సమావేశమై అంతరాలు లేక చర్చించుకుని ముఖ్యమైన విషయాలపై ఏకగ్రీవ నిర్ణయాలు చేసి వాటినే నిర్ద్వంద్వంగా ప్రజలందరికీ ప్రబోధం చేస్తే ఎంత బాగుంటుంది !

ప్రజలకు ఆదర్శజీవులుగా, ఆరాధ్యమూర్తులుగా ఉన్న వీరు - పరస్పర అవగాహనతో, పరస్పర అనురాగంతో పవిత్రమయిన హృదయాలతో మెలుగుతూ.... "దైవం ఒక్కటే. మనకోసం ఇన్ని రూపాలు ధరించింది" అన్న అభిప్రాయానికి అనుచరులగుండెల్లో పాదుచేస్తే ఎంత ఆనందంగా ఉంటుంది.

(ఏప్రిల్ 1979)



## ప్రేమతత్వం

తత్వమే ప్రేమ అయినప్పుడు ఒకరిమీద ఉండీ ఒకరిమీద ఉండకుండా ఉంటుందా ? అన్నింటినీ ప్రేమిస్తుంది. చివరకు తనను చంపటానికి ఉపయోగపడే కత్తిని కూడా ప్రేమిస్తుంది.

ప్రేమే తల్లిగాని తల్లిప్రేమ కాదు. ఏం చేసినా మారనిది, చెదరనిది ఎక్కడుంటే అదే తల్లితత్వం.

- అమ్మ

# 141
# మాతృవిద్య

అమ్మ కల్యాణ దినమయిన మే 5న ప్రతిసంవత్సరమూ ఏదో ఒక మహత్కార్యం జరుగుతూనే ఉన్నది. ఏదో ఒక రూపంలో అమ్మ అనుగ్రహం విశేషంగా ప్రసారమవుతూనే ఉన్నది.

అది ఈ సంవత్సరం "మాతృవిద్య" రూపంలో అభివ్యక్తమయింది. మాతృ విద్య పరిశోధన పత్రిక. భారతీయ సంస్కృతీ, సంస్కృత భాషలకు సంబంధించిన పరిశోధన విషయాలనూ, విశేషాలనూ పదిమందికీ అందించడం ఈ పత్రిక ప్రధానోద్దేశం.

దేశం ఏది అయినా, భాష ఏది అయినా - మానవమేధ అపారంగానూ, అనంతంగానూ అతి విచిత్రంగానూ అనుక్షణమూ పరిణతి చెందుతున్నది. అది ఒక్కొక్కచోట ఒక్కొక్క రకంగా వికసిస్తున్నది. ఒక్కొక్కచోట ఒక్కొక్క విధంగా పరిమళాన్ని వెదజల్లుతున్నది. ఒక్కొక్కచోట మహాద్భుతంగా ఆవిర్భూతమైన లోకానికే క్రొంగొత్త కాంతులను అందిస్తున్నది. ఈ జగద్ధిత మహత్‌కార్యాలకు ఏ ఒక్క వ్యక్తి, ఏ ఒక్క సంస్థ కారణమయినప్పటికీ - ఫలితాలు మాత్రం విశ్వజనీనమయిన వనటానికి ఏమీ సందేహం లేదు. ఆ వెలుగు రేఖల్లో ప్రతిమనిషీ ఒక అడుగు ముందుకు వేయాలి. ఆ పరిమళాల్లో ప్రతి హృదయమూ పరవశించాలి. ఆ విజ్ఞానం ప్రతిమానస సరోవరంలోనూ మరో కమలాన్ని వికసింపజేయాలి.

ఎక్కడ అవిర్భూతమయినప్పటికీ - అలాంటి విజ్ఞాన రోచిస్సులనూ, సంస్కృతీ మలయ సమీరాలనూ సర్వజనోపయుక్తంగా అందించడం పత్రిక లక్ష్యం. ఆధ్యాత్మిక చింతనలో, సాధనామార్గంలో విలక్షణ రీతులను సూచిస్తూ, అనురాగపీయూషధారలతో సర్వజగతినీ పులకింప జేస్తున్న జ్ఞాననిధీ, కారుణ్యపయోనిధీ అయిన అమ్మ ప్రవచించే సూత్రాలనూ, సూక్తులనూ హేతుబద్ధమయిన వైజ్ఞానిక చక్షువుతో - వీక్షించడమూ, వ్యాఖ్యానించడమూ కూడా ఈ పత్రిక అభీష్టం.

ఈ పత్రిక ఇంగ్లీషు సంస్కృత భాషల్లో ప్రచురింపబడుతూ ప్రాక్పశ్చిమ దేశాలకు సేతువు నిర్మించి, పరస్పర అవగాహనను అభివృద్ధిజేసి విశ్వసౌభ్రాత్రానికి దోహదకారి కావాలని - ప్రచురణకర్తల పవిత్రాశయం.

ఇది మాతృశ్రీ విద్యాపరిషత్ పక్షాన ప్రచురింపబడుతుంది. ఇది సంవత్సరంలో రెండుసార్లు - చైత్ర ఆశ్వయుజ మాసాల్లో వెలువడుతుంది. దీనికి గౌరవ సంపాదకులు విద్వన్మణులూ ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆచార్యులూ డాక్టర్ వి. సుబ్బారావుగారూ, డాక్టర్ పి. శ్రీరామమూర్తి గారూ, ప్రధాన సంపాదకులు డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మగారు. వీరు పండితులూ, కవులూ, సహృదయులూ, సమర్థులూ మాతృచరణ సేవానిరతులూ, జిల్లెల్లమూడిలోని మాతృశ్రీ ప్రాచ్య కళాశాల వ్యవస్థాపకులూ, ప్రధానధ్యాపకులూ.

దీని మొదటి సంచికను విశ్వజననీ విజ్ఞానపు గనీ అయిన అమ్మకు సమర్పించి అమ్మచేత ఆవిష్కరింపజేశారు. కందోయి నుండి కారుణ్యామృతలహరులు ప్రవహిస్తుండగా, పెదవులపై చిరునవ్వుల చిత్కాంతులు దీపిస్తుండగా ....... తన చరణపీఠిపై సమర్పింపబడిన ఆ పత్రికను అందుకుని, తాను అప్పుడే ప్రసవించిన తన చిన్నారి పుత్రికను వలే అల్లారుముద్దుగా తన కరకమలాల్లోకి తీసుకుని, అచ్ఛాదితాలయిన రంగుల కాగితాలను రమ్యంగా తొలగించి అలవోకగా పేజీలు తిప్పుతూ తన ప్రతిబింబాన్నే చూసుకుని మరొక్కసారి దరహాసం చేసి ఆ పత్రికను ఆశీర్వదించి, అందరికీ ప్రదర్శించింది. ఆ చూపడం 'ఇదిగో మీ తొబుట్టువు' అని చెబుతున్నట్లుగా ఉన్నది... అదొక రమణీయదృశ్యం.

ఆ సందర్భంలో ప్రధానవక్త కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు. వీరు ప్రాక్ పశ్చిమ విజ్ఞానాన్ని పుక్కిటబట్టినవారు; ఆధ్యాత్మికవిద్య కరతలామలకమయిన వారు; సిద్ధపురుషులు; జగద్గురువులు అర్ష విజ్ఞాన సర్వస్వాన్నీ జీర్ణం చేసుకుని తనదైన కొత్త గొంతుకతో సర్వజగతికీ మేలుకొలుపు పాడుతున్న మహామనీషి; ఆధునిక ఋషి.

వారు ఆనాటి సభలో అవిస్మరణీయమయిన విశిష్టమయిన ప్రసంగం చేశారు. ప్రస్తుత కుహనా పరిశోధన పద్ధతులను సమీక్షిస్తూ నిర్దయగానూ, నిర్ద్వంద్వంగానూ ఖండించారు. అనవసరమూ, అసంగతమూ, అనుచితమూ అయిన విషయాలపై 'పరిశోధన' పేరుతో కాలాన్ని వృధాచేయడమే కాక, దాస బుద్ధితో, అన్యులకు అమ్ముడుపోయి, ఆత్మవంచన చేసుకుంటూ, జాతికీ నీతికీ ద్రోహం చేస్తూ, పూజనీయమయిన మన సనాతన సంస్కృతి అంటే - దార్శనికులూ నిస్వార్థజీవనులూ

అయిన మహర్షుల మహోన్నత భావ(మ) హిమాలయం నుండి సముత్పన్నమై సముత్తుంగ తరంగితమై అఖిల జగతినీ ప్రబుద్ధమూ పునీతమూ చేసిన పావనగంగా ప్రవాహం కదా ! వాల్మీకి, వ్యాసుడు, శంకరుడు, వివేకానందాదులు ప్రభవించి ప్రభావితంచేసిన ఈ పుణ్య భూమి నేడు విజ్ఞాన దారిద్ర్యంతో భిక్షాపాత్ర చేబూనటం దురదృష్ట మన్నారు. అపేరుషేయాలయిన పవిత్ర వేదాలపై, విజ్ఞానఖనులయిన ఉపనిషత్తులపై పరిశోధనలు జరపటం - సాహసమూ, అపచారమూ కాగలదని ఉద్ఘోషించారు. అగ్నిగోళమైన అహస్కరుడ్ని మిణుగురు పురుగుల కాంతితో అవలోకించాలన్న ప్రయత్నంలాంటిది కదా అది ! సనాతన సంస్కృతీ విజ్ఞాన భాండాగారాలయిన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలలోని విషయాలను అధ్యయనం చేసి అవగాహన చేసుకొనటానికి మాత్రమే పరిశోధనలు జరగాలని ఆదేశించారు. అందుకు ఈ పత్రిక దోహదకారి కావాలని ఆశీర్వదించారు.

తర్వాత, గౌరవ సంపాదకుల్లో ఒకరైన ఆచార్య పి. శ్రీరామమూర్తిగారు మొదటి సంచికను సమీక్షించారు.

ఈ పత్రిక సంపాదకీయంలో నుడివినట్లుగా - మన దేశంలో ఇతర ప్రాంతాల్లో అనేకంగా ఉన్నప్పటికీ మన రాష్ట్రంలో పరిశోధన పత్రికలు చాలా అరుదు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ పరిశోధన కేంద్రం నుండి ఒక పత్రిక మాత్రం వెలువడుతున్నది.

అసలు ఈ పరిశోధన ప్రక్రియే మన దేశంలో అరుదైన విషయం. రేఖా మాత్రంగా ఉన్నప్పటికీ పరిశోధనలో కేంద్రీకృత కృషి ఏ రంగంలోనూ జరగలేదు. ఇది పాశ్చాత్య దేశాల్లో ఉద్బుద్ధమై అభివృద్ధిని సాధించింది. ప్రస్తుతం మనదేశంలోనూ వ్యాప్తిపొందుతున్నది. అయితే ఇందుకు అవకాశం అధికంగా విశ్వవిద్యాలయాల్లోనే ఉన్నది. అక్కడ పరిశోధకుడికి స్వేచ్ఛ లేదు. అతని ఆలోచన ప్రబోధితమైన మార్గంలోనే సాగాలి; ప్రబోధితమైన గమ్యాన్నే చేరాలి. ఈ విధానమే సక్రమమయినది కాదు కాబట్టి ఫలితాలూ సత్యమయినవి వెలువడడం లేదని కొందరు విజ్ఞుల ఆవేదనా, ఆందోళనా. అకలంకమయిన పరిశోధన కేంద్రాలూ, ఆ ఫలితాలను ప్రచురించే పత్రికలూ విరివిగా నెలకొల్పబడాలని వారి అభిలాష. ఆ అభిలాషకు కమనీయ రూపమే ఈ పత్రిక.

కానీ, ఇటువంటి పత్రికను నడపాలంటే - ఎంతో దీక్షా, సామర్థ్యమూ, పాండిత్యమూ, పరిశీలనా, సదవగాహనా, నిస్వార్థబుద్ధీ, అన్నిటికంటే ధనబలమూ

కావాలి. లేకపోతే పుబ్బలో పుట్టి మఖలో మరణిస్తాయి. కానీ ఈ పత్రికకు వాటన్నిటికీ మూలమయినదీ, వాటన్నిటికీ అతీతమైనదీ అమ్మ అనుగ్రహం ఉన్నది. ఆ అనుగ్రహం అత్యంత సమర్థమూ, అతిశక్తిమంతమూ కదా !

కనుకనే, ఈ పత్రిక అవిచ్ఛిన్నంగా ప్రచురిత మవుతూ అచిరకాలంలోనే అద్భుతమైన విజయాలను సాధించి ఇంకా అనేక సంస్థలకు మార్గదర్శకమై ఆదర్శం అవుతుందని ఆశిస్తున్నాము. ఈ బృహత్ కార్యానికి ధైర్యంగా నడుంకట్టిన మాతృశ్రీ విద్యాపరిషత్‌ను మనసా అభినందిస్తున్నాము.

(మే 1979)



## కష్టసుఖాలు

కష్టం సుఖం మనస్సును బట్టి ఉంటుంది. ఈ రెండూ ప్రతివాడికి తప్పవు. మనిషీ, మనిషినీడ ఎట్లాగో ఈ రెండూ అట్లాగే తిరుగుతాయి. కష్టం సుఖం పడేవి కాని పెట్టేవి కావు. ఒకరు సుఖపెడుతున్నా దాన్ని అర్థం చేసుకోకపోతే అదే కష్టం అనుకోవచ్చు. ఒకడికి భార్య, పిల్లలు, యిల్లు, వాకిలి, కోరినగుడ్డ, తిండి - అన్నీ వున్నప్పటికీ వాడికి యివన్నీ వద్దని పిస్తాయి. ఏ చెట్టు క్రిందనన్నా కూర్చుందామనుకుంటాడు. వాడు చెట్టు దొరక్కపోతే దుఃఖపడతాడు. ఒకడికి ఆ చెట్టుకూడా అక్కర్లేక ఎవ్వరూ లేని చోటు కావాలనుకుంటాడు. అది అందకపోతే వాడు ఏడుస్తాడు. ఒకడు చచ్చిపోవాలనుకుని బ్రతికి వున్నానే అని వాపోతాడు.

అది ఏదయినా సరే లేనిదాని కొరకు ఆశించి పొందలేకపోతే దుఃఖం. ఉన్నది చాలనుకునేది సుఖం.

\- అమ్మ

# 142
# మంగళగౌరి

శ్రావణమాసం అంటే మహిళల మాసం కొత్తగా పెండ్లి అయిన కన్యలు శ్రావణమాసం రాగానే మంగళవారాలు, శుక్రవారాల్లో రంగురంగుల క్రొత్త పట్టుచీరెలు కట్టుకుని, కొత్త ఆభరణాలు పెట్టుకుని గౌరీపూజలు, వరలక్ష్మి వ్రతాలు చేసుకుంటూ, తలనిండా పూలతో, చేతులకు తోరాలతో ఉత్సాహంగా సందడిగా తిరుగుతూ కనుల పండుగగా కనిపిస్తుంటారు.

కన్యలతోపాటు పెద్దవాళ్ళుకూడా వారి పసుపు కుంకుమలు వెయ్యేళ్ళపాటు నిలవమని మంగళగౌరీ దేవిని ప్రార్థిస్తూ నోములు నోచుకుంటారు.

ఇది హిందూ సంప్రదాయం. హిందూ స్త్రీలకు ఈ నోములూ వ్రతాలూ అతి ముఖ్యమయినవి. ఇవి కేవలం విశ్వాసానికి సంబంధించినవే నని కొందరు అంటున్నప్పటికీ - పలువురు హిందూ స్త్రీంలో ఇప్పటికీ ఈ నమ్మిక బలంగా ఉందనడంలొ సందేహం లేదు.

శ్రావణమాసం రాగానే ఈ అందాలు జిల్లెళ్ళమూడిలోనూ నయనానందరకంగా కనుపిస్తాయి ఏ సంప్రదాయాలనూ పాటించని అమ్మ అందరి సంప్రదాయాలనూ, అన్ని సంప్రదాయాలనూ హర్షించడం విశేషం.

అమ్మ ఏ నోములూ నోచలేదు. ఏ వ్రతాలూ పట్టలేదు, ఏ పూజలూ చేయ లేదు. "నేనంటూ ఏ సంద్రాయాన్నీ పాటించడం లేదు' అనీ, 'తెలిసి దీపారాధనకూడా నేను చేయలేదు' అనీ అమ్మ నిస్సంకోచంగా ప్రకటించిన విషయం అనేకుల దృష్టిని ఆకర్షించి భావ సంచలనం కలిగించింది. అయినా నోములు నోచుకుండేవారిని అమ్మ ప్రోత్సహిస్తుంది నోముల్లోని పరమార్థాన్ని వివరిస్తుంది. అన్ని నోములకూ లక్ష్యం ఒకటే నంటుంది. - 'అంతా అదే' నని సోదాహరణంగా మనకు బోధించటానికే అన్ని నోములూ అని అమ్మ ఉద్దేశం.

శ్రావణమాసంలో కేవలం జిల్లెళ్ళమూడిలో స్థానికంగా ఉండే స్త్రీలేకాక ఇతర ప్రదేశాల నుండి కూడా పలువురు స్త్రీలు వచ్చి నోములు నోచుకుంటారు.

ముందుగా అందరూ హైమాలయంలో పూజచేసుకుని, తర్వాత అమ్మసన్నిధికి వస్తారు. అమ్మకు అందరూ కలిసిపూజచేసుకుంటారు. అమ్మకు నివేదనలు చేసి హారతి యిస్తారు.

తరువాత నోముకు సంబంధించిన వాయనం వరుసగా ఒక్కొక్క ముత్తయిదువ ఇస్తుంది. వాయనం ఇచ్చిన పిమ్మట 'నా వాయనం అందుకున్న వనిత ఎవరు?' అని అడుగుతుంది. మంగళవారం అయితే "నేనే మంగళగౌరి" నని శుక్రవారం అయితే "నేనే వరలక్ష్మి" నని అమ్మ సమాధానం చెబుతుంది.

ఇది అత్యంత విశేషమైన విషయం.

సామాన్యంగా - మనం మన అనుభవంతో, నమ్మకంతో అమ్మను దైవంగా భావించి స్తుతిస్తే, అమ్మ ఆ స్తోత్రాలను ఖండిస్తుంది. "నేనూ మీవంటి దానినే. మీరు కానిది నేనేమీ కాను" అని అనేక పర్యాయాలు ప్రకటించింది.

మనం అమ్మను సరస్వతిగానో, లక్ష్మిగానో, పార్వతిగానో భావించి పూజలు చేస్తుంటే... అమ్మ చాలా ఉదాసీనంగా ప్రవర్తిస్తుంది. పూజాసమయాల్లో ఆ పూజలు తనకు సంబంధించినవన్నస్ఫురణే కనుపించదు. ఈ విషయాన్నే అమ్మ స్పష్టంగా వివరించింది. "ఈ పూజలు నా కని చేస్తున్నారా ? ఏ లక్ష్మి అనో, పార్వతి అనో చేస్తున్నారు గానీ" అని అంటుంది అమ్మ.

అనేకులు అమ్మను వివిధ దేవతాస్వరూపాల్లో దర్శించినప్పటికీ అమ్మ మాత్రం ఆ విషయాన్ని అంగీకరించదు. ఒకసారి ఒక భక్తుడు 'నీలో నా ఇష్టదైవాన్ని చూశానమ్మా' అంటే - "నాలో నీ ఇష్ట దైవాన్ని చూడడం కాదు, నాన్నా - నీ ఇష్టదైవమే నాలో కనిపించి ఉంటాడు" అని సవరించింది.

పరాకునగూడా అమ్మ తాను దైవాన్ననిగానీ అవతారవ్యక్తినని గానీ ప్రకటించుకొనదు; ఎవరైనా ఆ విధంగా ప్రస్తుతించినా అంగీకరించదు.

అటువంటిది - ఈ వ్రత సమయంలో మాత్రం ముత్తయిదువలతో "నేనే మంగళగౌరిని" అని ప్రకటిస్తుంది.

ఈ నెల 14వ తేదీన ఆడపిల్లలు నోము నోచుకుంటుండగా అమ్మ "నేనే మంగళగౌరిని" అని ప్రకటించింది.

వెంటనే నేను అన్నాను 'ఈ సందర్భంలోనైనా నిజం చెప్పావమ్మా'' అని ''ఈ మాట నేనే అనటం ఏముందిరా ? ఈ స్థానంలో కూర్చున్న ఏ ముత్తయిదువ అయినా ఈ మాటే అంటుంది. నేను అనడంలో ప్రత్యేకత ఏమీ లేదు'' అన్నది అమ్మ సమాధానంగా.

నిజమే. ఏ ముత్తయిదువ అయినా ఆ మాటనే అంటుంది. కానీ అందులో వాస్తవం ఏముంటుందీ ? నాటకంలో పాత్రలు తామే కృష్ణుడుగా వ్యవహరించ వచ్చునూ; తామే రాముడుగా ప్రవర్తించ వచ్చునూ. అంతమాత్రంచేత ఆ నటులు ఆ అవతారమూర్తులు అవుతారా? వాళ్ళ వాక్కుకు ఆ బలం వస్తుందా ? వాళ్ళమాటకు ఆ పవిత్రత కలుగుతుందా ?

కానీ అమ్మమాట ? అతి పవిత్రమయినది. అతి శక్తిమంతమయినది. సత్యమయినది. త్రికరణశుద్ధి కలిగిన అమ్మ నోటివెంట ఏ నాడూ వ్యర్థ వాక్కూ, అసత్యవచనమూ రాకపోవడం అందరి అనుభవమూ. అమ్మకూడా ఈ విషయాన్ని బాల్యంలోనే ధృవపరిచింది. తనది తోలునోరు కాదట. తన నోటివెంట తాలుమాట రాదట.

మరి ఇప్పుడు - ప్రముఖమయిన ఒక ప్రకటనచేస్తూ... అది అందరి ముత్తయిదులవలే తానూ పలికాను - అంటే అది సత్యం ఎట్లా అవుతుందీ ? అది మనను భ్రమపరచటానికి అమ్మ వేసే ఒక తెర మాత్రమే గానీ.

సాక్షాత్తూ పరమేశ్వరి మానవాకృతిలో మన మధ్య మసలుతూ తన అలౌకిక చర్యలతో, అసాధారణ వాక్కుతో తన దివ్యత్వాన్ని సూచన ప్రాయంగా తెలియ జేయడమే కాక అప్పుడప్పుడు వాచకంగా గూడా యధార్థ స్వరూపాన్ని మనకు తెలియజేస్తున్న పరమ కారుణ్యాన్ని ఏమని ప్రస్తుతించడం ?

ఈ అసాధారణ ప్రకటనను ఎందరు స్త్రీలు అర్థం చేసుకుని ఆ ప్రయోజనాన్ని పొందగలుగుతున్నారు ? ఆ కరుణను ఎందరు అవగాహన చేసుకొన గలుగు తున్నారు ?

ఈ అదృష్టం కేవలం స్త్రీలవరకే పరిమితమై లేదు. అమ్మది విచక్షణ లేని వీక్షణ గదా. ఈ కారుణ్యంలో భాగం పురుషులకూ అమ్మ పంచింది.

అనంతపద్మనాభ వ్రతంనాడు వాయనం అందుకుంటూ అమ్మ ''నేనే అనంత పద్మనాభస్వామిని'' అని ప్రకటిస్తుంది.

చర్యలతో, వాక్కుతో, పరోక్షంగా, ప్రత్యక్షంగా ప్రస్ఫుటమయ్యే అమ్మలోని అతిమానవశక్తినీ అలౌకిక స్ఫూర్తినీ మనం గమనిస్తున్నప్పటికీ - మరల అంతలోనే "అసలు అమ్మ ఎవరూ?" అని ఎప్పటికప్పుడు విచికిత్సలో పడుతుంటాము.

అదే అమ్మలోని విశేషం !

ఇట్లా ఒక ముఖ్యమయిన సత్య ప్రకటనను ఆటలతో పాటలతో కలిసి దానిపై మన మనస్సు కేంద్రీకృతం కాకుండా చేసి -యథార్థాన్ని మనకు బోధపడకుండా చేయడంలో అమ్మ పరదా ఏమిటో !

మీకు తెలియనిది తెలియజేయడానికే నా రాక - అని ప్రవచించిన అమ్మ ఇట్లా సత్యానికీ మనకూ మధ్య తెరదించడంలో అంతరార్థం ఏమిటో !

అయితే - మరుగే నా విధానం - అని పలికిన అమ్మను ఎట్లా అర్థం చేసుకొన గలం ? - అమ్మే తానై అర్థమయితే తప్ప !!

(ఆగష్టు 1979)



## అన్నీ అవసరమే

దేనికి పనికివచ్చేవాళ్ళు దానికి పనికి వస్తారు. ఎవరు ఎందుకు ఉపయోగపడాలో అందుకు ఉపయోగపడతారు. వీడు ఇందుకు పనికివస్తే, వాడు మరొక దానికి పనికి వస్తాడు. మన శరీంలో ఉన్న అవయువాలు ఒకటి చేస్తున్న పని మరొకటి చేస్తున్నదా ? కన్ను వింటున్నదా ? చెవి చూస్తున్నదా ? ముక్కు మాటాడుతున్నదా ? అలాగే ఇందులో అన్నీ మనకవసరమే. అనవసర భాగం ఏముందీ ?

- అమ్మ

# 143
# పుష్కర స్నానం

అమ్మసన్నిధి నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటుంది. అమ్మకు ఒకసారి 'మంచిరోజు చెప్పమ్మా' అని అడిగితే "నా దృష్టిలో అన్ని రోజులూ మంచి రోజులే నాన్నా" అని సమాధానం చెప్పింది. అమ్మకు సర్వదినాలూ పర్వదినాలే కాక అమ్మసమక్షంలో అనుక్షణమూ ఉత్సవ సంరంభోజ్వలంగానే దీపిస్తుంటుంది.

10వ తేదీన హఠాత్తుగా అమ్మ సన్నిధిలో ఒక పండుగ జరిగింది.

ఆనాడు చీరాల నుంచి డాక్టర్ సుబ్బారావుగారూ, వెంకయ్యగారూ, బుద్ధిమంతుడూ... కొందరు సోదరులు వచ్చారు.

ఆనాటితో గోదావరి పుష్కరకాలానికి పరిసమాప్తి. అందువల్ల చీరాల వాస్తవ్యులు కొందరు పుష్కరస్నానం చేయటానికి రాజమండ్రి వెళుదామన్న ఆలోచనతో డాక్టరుగారి దగ్గరకు వచ్చారట. 'పుష్కర స్నానం చేయటానికి రాజమండ్రిదాకా వెళ్ళాలా ? అమ్మ వద్దకు వెళితే సరిపోలేదూ ? అన్ని నదులూ అమ్మ పాదాల్లో లేవా ?" అని డాక్టరుగారు సంభావన చేసి వారినికూడా తీసుకుని జిల్లెళ్ళమూడి వచ్చారు.

రాగానే అమ్మతో వారి ఆకాంక్షను తెలియజేసి అమ్మను స్నానం చేయమని అర్థించారు. అమ్మ స్నానం చేసిన పవిత్ర జలంతో వాళ్ళు స్నానం చేయడం వారి అభిమతం. అట్లా చేస్తే పుష్కరస్నానం చేసిన పుణ్యం సంప్రాప్తమౌతుందని వారి విశ్వాసం.

వారి కోరికను మన్నించి అమ్మ స్నానానికి ఉపక్రమించింది. అపుడు సరిగ్గా అపరాహ్ణ మయింది. ఒక్కొక్కరే అమ్మ స్నానం చేసిన నీళ్ళు బొక్కెన్లలోకి పట్టుకుని స్నానం చేయడం ప్రారంభించారు.

అమితానందంగా చీరాల సోదరులు స్నానం చేస్తుంటే... ఈ వార్త క్షణాల్లో అందరింటిలోని అందరికీ వ్యాపించింది.

శాయమ్మగారు, క్రిష్ణవేణమ్మగారు, గరుడాద్రి, గోపాలరావు... ఒకరేమిటి ఆవరణలోని అందరూ వచ్చారు. మతాలు, సంప్రదాయాల సరిహద్దులూ మరిచిపోయిన విదేశీసోదరులూ వచ్చారు. ఓరియంటల్ కాలేజీ అధ్యాపక బృందమూ, విద్యార్థినీ విద్యార్థులూ వచ్చారు. హాస్పిటల్లోనివారు, హైమాలయంలోనివారు, అన్నపూర్ణాలయంలోనివారు, వ్యవసాయశాఖకు చెందినవారు... ఆ మహోత్సవంలో పాల్గొన్నారు.

ప్రాణికోటిలో ఉత్సాహం వెల్లివిరియడమేకదా ఉత్సవమంటే !

ఇంతమంది ఒక్కసారిగా వచ్చేసరికి అందరికీ బొక్కెన్లలో నీళ్ళు అందడం కష్టం అనుకున్నదేమో, అమ్మ వెంటనే ఒక చమత్కారం చేసింది. అమ్మ స్నానాలగదికి అనుకునే ఒక సిమెంటు తొట్టి ఉంది. దానినిండా ఎల్లప్పుడూ నీళ్ళు ఉంటాయి. ఆనాడూ ఉన్నాయి. అమ్మ వెళ్ళి ఆ తొట్లో దిగి నిలుచున్నది. అపుడు ఒక్కరొక్కరే ఆ తొట్టి దగ్గరకు వచ్చారు. ఒక గ్లాసులో నీళ్ళు తీసుకుని తన దగ్గరకు వచ్చిన ఒక్కొక్కరినీ స్నానం చేయించింది.

కొందరు అమ్మను ఆ తొట్టిలోనే పూలతో పూజించుకున్నారు. కొందరు అమ్మను పూలదండలతో అలంకరించారు. తొట్టి అంతా రంగు రంగులతో రమణీయాకృతి ధరించింది

ఆ పూలల్లో నీళ్ళల్లో క్షిరాబ్ధిలోని లక్ష్మీదేవివలె అమ్మ కనుపించి అందరికీ కనువిందు చేసింది. ఈ రమణీయ అపురూప దృశ్యం చూడటానికి భాస్కరుడు కన్ను లింతలు చేసుకున్నాడేమో, ఎండ వెండి తీగెలవలె మెరిసింది. నీళ్ళల్లో నిలుచున్న అమ్మ ముఖం నిండానూ శరీర మంతటానూ ఉన్న నీటి బిందువుల్లో తొట్టిలోని పూల రంగులూ, సూర్యరశ్మి కాంతులూ ప్రతిఫలించడంతో ఆ నీటి బిందువులు కెంపులవలే, నీలాలవలే, పచ్చలవలే, మరకతాలవలే వివిధ వర్ణాల్లో దేదీప్యమానమై భాసించాయి. చలిస్తున్న జ్వలిస్తున్న నవరత్న ఖచిత విగ్రహంవలే అమ్మ సముజ్జ్వలంగా ఉన్నది. అమ్మను చూసిన ఆనందంలో బిడ్డ లందరూ అమితోత్సాహంతో కేరింతలు కొట్టారు. బిడ్డల ఆనందం చూసిన అమ్మలో సంతోషం సముత్తుంగ తరంగిత మవగా - ఆ తరంగాల హోయలూ, లయలూ అందరినీ సమ్మగ్ధులనూ, ఆనంద సంభరితులనూ చేశాయి.

అదొక అపూర్వ సన్నివేశం !

ఆ మరునాడు అమ్మను అడిగాను, "అమ్మా - నువ్వు స్నానం చేసిన నీళ్ళతో స్నానం చేస్తే పుష్కరస్నానం చేసినట్లేనా ?" అని.

అమ్మ నవ్వి అన్నది "నాకు అదేమీ తెలీదురా. వాళ్ళు అడిగారూ, నేను యిచ్చానూ" అని.

"మరి, వాళ్ళ భావనను నువ్వు సమర్థించినట్లేగదూ ?"

"ఎవరి భావనను నేను సమర్థించడం లేదూ ?"

నిజమే. అమ్మ తానుగానే చెప్పుకున్నది తాను "సరే" మంత్రం అనుష్ఠిస్తున్నానని. "సర్వ సమ్మతమే" తన మతమని కూడా అమ్మ అభివ్యక్తం చేసింది. అంటే సర్వులనూ, సర్వ మతాలనూ, సర్వాన్నీ అంగీకరించడమే తన విధానమని అమ్మ ఉద్ఘాటన.

ఈ సందర్భంలో మనకు కొన్ని ప్రశ్నలు ఉద్భవిస్తాయి.

అసలు, నదుల్లో స్నానం చేసినందువల్ల మనకు పుణ్యం వస్తుందా ? పుష్కర సమయంలో చేస్తే మరింత పుణ్యమా ? పుష్కరమంటే ఏమిటి ? అమ్మ స్నానం చేసిన నీళ్ళతో మనం స్నానం చేస్తే పుష్కర స్నానం చేసిన పుణ్యఫలం దక్కుతుందా?

మానవుని మనుగడకు ఆధార భూతమయిన పంచభూతాల్లో ఒకటి మాత్రమే కాదు 'నీరు'. అది మనిషికి అత్యంత ఆప్తమయినదీ, అవసరమైనదీకూడ. వాయువు అనుక్షణం అత్యవసరమే అయినప్పటి, నీటి అవసరం అవగాహన అయినంతగా మరేదీ కాదు. అందుకే నేమో మనిషి నీటికి 'జీవనం' అని నామకరణం చేసుకున్నాడు. ఈనీరు మనకు నదులద్వారానే అందుతుంది. కనుకనే మానవజీవితంలో 'నది' కింత ప్రాధాన్యతా, ప్రాముఖ్యమూ.

మనదేశం వ్యావసాయిక దేశం. వ్యవసాయం నదులపైననే ఆధారపడి ఉన్నది. మనిషికి అవసరమైన ఆహారం వ్యవసాయం ద్వారా గానీ, ఇతర విధాలుగాగానీ నదులనుండే లభ్యమవుతున్నది. కనుకనే నదిని మనిషి 'మాతృదేవత'గా భావించి ఆరాధిస్తున్నాడు. నది యందు మనిషి పవిత్రభావాన్నీ పూజ్యభావాన్నీ ఏర్పరచు కున్నాడు. హిందూ మతంలో, సంప్రదాయంలో నది దేవతయై పావనియై ప్రసిద్ధి చెందింది. కనుకనే నదీ దర్శనానికీ, నదీ స్నానానికీ ఇంత ప్రాముఖ్యం.

బృహస్పతి ఒక్కొక్క రాశిలోకి వచ్చినపుడు ఒక్కొక్కనదికి పుష్కరకాలం.

ఇక, హిందూ పురాణాల ననుసరించి పుష్కరకాలంలో ఆయా నదుల్లో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులేకాక, ముక్కోటి దేవతలూ, మహర్షులూ, మహాత్ములూ అదృశ్యంగా వచ్చి స్నానం చేస్తారనీ, కనుక ఆ సమయంలో స్నానంచేస్తే, ఆ దివ్య

స్పర్శతో పునీతమైన జలం మరింత పుణ్యప్రదమై సర్వపాపాలనుండీ, సర్వ రోగాలనుండీ జనులను విముక్తులను చేస్తాయని ప్రజల విశ్వాసం.

నదుల్లో స్నానం చేస్తే, అదీ పుష్కర సమయంలో చేస్తే పుణ్యప్రదం అనేది భావనే. పుణ్యం అనే మాటే విశ్వాసంపై ఆధారపడి ఉన్నది.

జీవన ప్రదాత్రి కనుక నది ఆరాధ్యమూ, అతి పవిత్రమూ, మరి, సర్వజనయిత్రి అయిన అమ్మస్పర్శ అత్యంత పావన మెందుకు కాదూ ? అనేక సంఘటనలూ సందర్భాలూ ఆధారంగా అమ్మను సర్వ సృష్టి స్థితి లయకారిణి యనీ, సర్వదేవతా స్వరూపిణీ యనీ నమ్ముతున్నప్పుడు అమ్మ పవిత్ర స్పర్శతో ఏ నీటికయినా పుష్కర తీర్థ ప్రాశస్త్యం ఎందుకు రాదూ ? మహర్షులు అదృశ్యంగా అరుదెంచి ఆ యా నదుల్లో స్నానం చేయడమేమో కానీ, మహర్షులక్కూడా మాతృదేవి అయిన అమ్మ ప్రత్యక్షంగానే స్నానం చేసిన నీరు పుణ్యజలం కాక మరేమీ ?

అమ్మ స్పర్శతో ఏ నీరు అయినా పావన మవుతుంది - అనడానికి ఒకటే నిదర్శనం. 'చరణామృతం' అన్న పేరుతో అమ్మపాద తీర్థం ఎందరో తీసుకు వెళతారు. అది ఎంతకాలమయినా చెడిపోదు అనటానికి అనేక ఉదాహరణ లున్నాయి. ఆ తీర్థం సర్వ సమర్థ మనటానికీ, అత్యంత పునీత మనటానికీ మరెన్ని నిదర్శన లున్నాయో !

'నన్ను చూడడమే పుణ్యం' అని ప్రకటించిన అమ్మ తన స్పర్శతో పునీత మయిన జలంతో తానే స్వయంగా స్నానం చేయిస్తే... అపుడు కలిగే పుణ్యంలో, పునీతత్వంలో సందేహ మేముందీ ?

(సెప్టెంబరు 1979)



# 144
# "లలితా కోటినామ పారాయణ"

అమ్మను అందరి అమ్మగా గుర్తించి అమ్మ ఆదేశానుసారం అనవరతం లలితా సహస్రనామ స్తోత్రపారాయణంచేస్తూ తుదకు "వస్తున్నానమ్మా... అమ్మా" అంటూ అంతిమశ్వాస వదలి అమ్మలో ఐక్యంచెందిన శ్రీ హైమవతీదేవి అర్చామూర్తిగా ఆలయంలో వెలిసి సుమారు 12 సంవత్సరాలు నిండుతున్నాయి.

హైమ ప్రేమకు మారుపేరు; కరుణకు కాణాచి. ఆమె ఆకారం లలితం, ఆలాపం లలితం, అంతరంగం లలితం, ఆచరణ లలితం - హైమవతీ సంబంధి సర్వమూ లలితమే. ఆమె లలితాస్వరూపిణియైన అమ్మను స్తుతించి ఆయమ్మ అనుగ్రహంతో స్వయంగా లలితాకృతి ధరించి అశేష జనానికి ఆరాధ్యమూర్తియై వెలుగొందుతున్నది. "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అనే ఉపనిషద్వాక్యం ప్రకారం బ్రహ్మవేత్త బ్రహ్మమే అయినట్లు అనన్యభావంతో లలితను ఆరాధించినవారు లలితగానే పరిణతి చెందుతారు ;

"రాత్రౌ యశ్చక్రరాజస్థా మర్చయేత్ పరదేవతాం ।
స ఏవ లలితారూప స్తద్రూపా లలితా స్వయమ్ ॥
న తయో ర్విద్యతే భేదో భేదకృత్ పాపకృత భవేత్"

అని లలితా రహస్యనామ సాహస్రఫలనిరూపణంలో చెప్పబడింది - రాత్రియందు (ఇక్కడ "రాత్రి" పదం ద్వైత భావనకు సంకేతం) చక్ర రాజస్థితయైన పరదేవతను అర్చించిన వ్యక్తి లలితాస్వరూపుడవుతాడు లలితాదేవి తానూ తద్రూపిణిగా అవుతుంది. వారిద్దరికీ భేదం లేదు; భేదబుద్ధి తలపెట్టినవారు పాపంచేసిన వారవుతారు అని పయి శ్లోకాల తాత్పర్యం.

మానవిగా ఉద్భవించిన హైమవతి ప్రేమ, దయా, త్యాగాది దివ్యగుణ సంపత్తితో మాధవిగా మారి సుహితలంలో, కన్యాలోకానికి ఆదర్శమూర్తిగా విలసిల్లింది.

శ్రీ హైమవతీదేవి దివ్యతత్త్వాన్ని గుర్తించిన అదృష్టవంతులలో శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ ఒకరు. హైమ అర్చామూర్తిగా అవతరించి నప్పటి నుండీ ఆయన ఆ దేవిని జపతపాలతోను, అభిషేక పారాయణాదుల తోను అర్చిస్తూనే ఉన్నారు. ఈ పుష్కరకాంలో ఆయన సుమారుగా ఆ దేవి నామాలను ఏదోరూపంలో కోటి పర్యాయాలు జరిపించి ఉండవచ్చు. ద్వాదశ వత్సర విస్తృతమైన సమయాన్ని తపఃకాలంగా పెద్దలు భావిస్తారు. శ్రీ హైమవతీ దివ్యానుగ్రహానికి పాత్రులైన శ్రీ లక్ష్మి నారాయణ చేస్తున్న నిరంతరదీక్షాయుతమైన తపస్సు ఫలించిందేమో మరి ! తాను ఇన్నేళ్ళుగా చేసిన లలితాకోటి నామార్చన ఒక్కనాడే సంపూర్ణంగా జరగాలన్న సంకల్పం ఆయనకు కలిగింది. ఆ సంకల్ప బలమే వచ్చే నవంబరు నెల 10వ తేదీ హైమవతీ జయంత్యుత్సవ సందర్భాన జరుగనున్న లలితా కోటినామార్చనా కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. భారతేదేశంలో పుణ్యతీర్థాలని ప్రసిద్ధిచెందిన ద్వాదశ పుష్కర తరంగిణీమతల్లు నుండి తేబడిన పవిత్రజలాలతో తెల్లవారు జామున నిర్వహింపబడే మహారుద్రాభిషేకంతో నాటి కార్యక్రమం మొదలవుతుంది. తరువాత లలితా సహస్రనామ, త్రిశతీ, ఖడ్గమాలా, అష్టోత్తర శతనామ పారాయణాలతో కోటినామార్చన కొనసాగుతుంది.

భక్తి శ్రద్ధలు గల మాతృశ్రీ పాఠకుల యొక్కయు, కోటి నామార్చన మహాయజ్ఞ భాగస్వాముల యొక్కయు, ఉపయోగార్థమై ఈ సంచికలోనూ, విడిగా పుస్తకరూపం లోనూ పయి స్తోత్రాలు ముద్రింప బడినాయి. కేవలం ప్రస్తుత పారాయణార్థమై ప్రచురించబడిన ఈ సహస్రనామస్తోత్రాదులకు అనుబంధమైన పూర్వ పీఠికాదులు వీనిలో చేర్చబడలేదు.

ఏ విధంగా జూచినా ఈ కోటినామార్చనకు ఒక విశిష్టత ఉన్నది. హైమ అర్చామూర్తియై పుష్కరకాలమవుతున్నది; ఈ యజ్ఞాన్ని సంకల్పించిన శ్రీ లక్ష్మీ నారాయణ సాధనా కాలం పుష్కరవత్సర పరిమితం; రుద్రాభిషేకానికి వినియోగింపబడే పావన జలాలు పుష్కర వాహినీ సమానీతాలు - ఈ పుష్కరసంఖ్య హైమాలయం యొక్క పవిత్రతనూ, ప్రాశస్త్యాన్నీ తెలియజేస్తున్నది. హైమాలయం తపోధన నిలయం కావచ్చునని ఒక సందర్భంలో అమ్మచేసిన సూచన సార్థక మవుతున్నదనటానికి పయి ఘటనలు ప్రబల నిదర్శనాలుగా నిలుస్తాయి.

సర్వాత్మనా సౌకుమార్యం, సౌమనస్యం, పావనతా, విశ్వజనీనతా ఎన్నో సుగుణాలు తనలో జీర్ణింపజేసుకొని తన జీవితాన్ని లలితాంబికా చరణ కమలాంకితం గావించుకొని తాద్రూప్యాన్ని పొందిన శ్రీ హైమవతీదేవి ఆలయ ప్రాంగణంలో

జరుగనున్న ఈ లలితా కోటి నామార్చన బహుళ ప్రయోజన సంధాయకం కాగలదని మా విశ్వాసం.

శ్రీ లలితా నామావళి లలితపదభాసురమే కాక మహిత మధురార్థ గభీరము కూడ. ఇందలి విలక్షణార్థమును తెలిసికొనవలెనంటే భగవతీ ప్రదత్త ప్రజ్ఞా చక్షువు విచ్చుకోవాలి. అప్పుడు బుద్ధికౌశలాన్ని బట్టి ఆతల్లి తత్త్వం గోచరిస్తుంది. అందుకే ఆమె 'అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా' అని పేర్కొనబడింది. అంతేకాక లలితానామ సహస్రాన్ని 'రహస్య నామసాహస్రం' అన్న హయగ్రీవ వచనం ఈ సందర్భంలో గమనించతగ్గది. ఉదాహరణకు ---

'చతుర్బాహు సమన్వితా' అన్న నామాన్ని పరిశీలిద్దాం; దేవికి స్థూలమూ, సూక్ష్మమూ, పరమ్మూ అనబడే త్రివిధరూపాలున్నాయి. కరచరణాది సహితమయినది స్థూలము; మంత్రమయమయినది సూక్ష్మము, పావనామయమయినది పరము. స్థూలరూపంలో దేవియొక్క నాలుగు బాహువులూ ధర్మార్థకామమోక్షసాధనాలై భక్తులను అనుగ్రహిస్తాయి; అవి ఆమె మంత్రమయమయిన సూక్ష్మరూపంలో చతుర్వేదాలకు ప్రతీకలవుతాయి; అవే ఆతల్లి వాసనామయరూపంలో మనోబుద్ధి చిత్తాహంకారాలకు సంకేతాలుగా మిగులుతాయి. "లోలాక్షీకామరూపిణీ" అన్న నామానికి స్త్రీల కామమును దీర్చు మన్మధుని యొక్క స్వరూపము గలది అని అర్థం; 'కామాభిమాని యోగీశ్వరీ రూపిణి' యని మరొక అర్థం. అష్టమాతలలో ఒకతె యగు యోగీశ్వరి కామాధి దేవత. అంటే కామ, క్రోధాది భావనలు గూడ దేవీమయాలే ! ఆ శక్తి కానిది యేదీ లేదన్నమాట !!

ఈ విధ:గా వివరించుకుంటూ పోతే 'సదసచ్చాహమర్జున!' ఇత్యాది గీతావాక్యాలూ.

'ద్వంద్వాలూ ఈశ్వర స్వరూపాలే', 'సృష్టే భగవంతుడు' మొదలయిన అమ్మ వాక్యాలూ పయి నామాల్లో పరమరమణీయంగా గతార్థా లవుతాయి.

ఒక విధంగా చూస్తే సహజ లాలిత్యాన్ని సర్వాంగాలలో సంతరించుకొన్న లలనలందరూ లలితామూర్తులే. ప్రతి స్త్రీ పరదేశతా మూర్తియే; ప్రతిపురుషుడూ పరమేశ్వరుడే. ఈ భవ్య భావనను పొందగల్గితే అందరమూ శివాకృతులమే అవుతాం. పురుషుడు 'కామేశ్వరు' డయితే, స్త్రీ 'కామేశబద్ధమాంగల్య సూత్రశోభితకంధర' అవుతుంది. అతడు 'సదాశివు'డయితే, ఆమె 'సదాశివపతివ్రత' అవుతుంది. అతడు 'భక్తు' డయితే, ఆమె 'భక్త హార్దతమోభేద భానుమద్భాను సంతతి' అవుతుంది.

ఏవంవిధ లలితానామ నిరంతరానుశీలనం వలన మానువుల దివ్య విభూతులను పొంది లలితాత్మకులవుతారు.

ఈ రహస్యార్థాలు తెలిసినా తెలియకపోయినా ఆ మాత 'నామపారాయణప్రీత' కాబట్టి భక్తిప్రపత్తులతో తన నామాలను జపించిన బిడ్డలను 'భక్తివశ్య'యై, 'భయాపహ' యై పరిపాలిస్తుంది.

ఈ విషయాలను తెలిపి తరింతజేయటానికే అమ్మ ఈ లలితాకోటి నామార్చనా ప్రేరణగా పరిణమించి మనలను ఈ యజ్ఞార్థ కర్మలో సాధనాలుగా సమాయత్త పరుస్తున్నది. ఈ మహనీయ భాగధేయాన్ని ప్రసాదిస్తున్న అమ్మను కల్యాణగుణ లలితాకృతులనుగా మనలను మలచుకొమ్మని సాంజలి బంధంగా వేడుకొందాం.

(అక్టోబరు 1979)



## మరణానికి ముందు

మరణానికి ముందు శరీరం తేలిపోతున్నట్లుగా ఉంటుంది. శరీరమంతా వ్యాపించిన శక్తి కంపిస్తుంది. నీటిలో రాయి వేస్తే ఏవిధంగా ఉంటుందో ఆ విధంగా అలజడిగా ఉంటుంది. ఇది కంటికెక్కనిపించదుగానీ మనస్సుకు తోస్తుంది. మనసుకి అది అర్థం అవుతుంది. నిజానికి పడవలసినది ముందుగానే పడతాడు. ప్రాణం పోయేక్షణంలో బాధతో పోయేదేమీ లేదు. వ్యాధిని బట్టి బాధగాని, ప్రాణం పోవడం వల్ల బాధ గాదు. ప్రాణంపోయే స్థితిలో ఏ ఒక్కడు తెలియకుండా పోడు. మరణిస్తున్నప్పుడు పరిమితమైన నేను - అనంతంలో కలసిపోతున్న స్థితి వ్యక్తం చేయ వీలులేనిది.

- అమ్మ

# 145
# కోటినామ పూజిత

శోభ, విలాసము, గాంభీర్యము, మాధుర్యము, స్థయిర్యము, తేజస్సు, లాలిత్యము, ఔదార్యము..... ఇవి లలితాంబిక లక్షణాలుగా శాస్త్రం చెబుతున్నది. ఈ నాడు మనం అమ్మ స్వరూపాన్నీ, అమ్మ స్వభావాన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తే పై లక్షణాలన్నీ అమ్మలో పుంజీభ వించినట్లు అర్థమవుతుంది.

లలితాంబిక పాదములు, కరములు, అంగుళులు, నయనములు, నాసిక, ముఖము, లలాటము... ఒకటేమిటి సర్వావయములు సౌందర్యోపేతములు. కనుకనే లలితాంబిక మహాలావణ్య శేవధి.

ఇక-నేడు అమ్మను చూస్తే... సృష్టిలోని సౌందర్య మంతా ఒక మానవాకృతి ధరించి మన ముందున్నదా - అనిపిస్తుంది.

అమ్మ సౌమ్య, స్వభావమధుర.

అమ్మ విశ్వమాత, విశాలాక్షి, విరాగిణి.

అమ్మ అన్నద, అజ్ఞానధ్వాంతదీపిక, ఆబాలగోపవిదిత.

అమ్మను అవలోకిస్తూ ఏ నామం స్మరించినా - ఆ నామం అమ్మను గురించే చెప్పినట్లుగా అనిపిస్తుంది.

చిదంబరరావుతాతగారు, లక్ష్మణాచార్యులుగారు, పెమ్మరాజు సత్యనారాయణ గారు... ఎందరో అమ్మ చిన్నతనంలోనే అమ్మను రాజరాజేశ్వరీ అవతారంగా అవగాహన చేసుకుని ఆరాధించారు.

"తపో లబ్ధేన దివ్యేన జ్ఞానాగ్ని మయ చక్షుషా
పశ్యామిత్వాం మహాదేవీం మాయాం మానుషవిగ్రహాం
హృదిస్ఫురతి దృష్ట్వా త్వాం లలితా సౌమ్యరూపిణీ
అపి చండీ మహాఘోరా లోకసంహారకారిణీ"

అని శ్రీ ప్రసాదరాయ కులపతి స్తుతించాడు.

ఇమామ్ అనే ఒక ముస్లిం యువకుడు అమ్మ సంకీర్తన నామాన్ని రూపొందించాడు. అది దేవప్రేరణ అని అతని విశ్వాసం. అదే యిపుడు జిల్లెళ్ళమూడిలో అఖండంగా సంకీర్తన చేయబడుతున్నది

"జయహో మాతా శ్రీఅనసూయా రాజరాజేశ్వరి శ్రీపరాత్పరీ......."

మొదటినామం మాత. అది లలితాసహస్రనామాల్లో మొట్టమొదటిది. మిగతా నామాల్లో ఒకటి అమ్మ ప్రస్తుత వ్యవహార నామం మిగతా రెండు నామాలుకూడా లలితానామాల్లోవే కావడం అత్యంత విశేషం.

అమ్మను గాయత్రీదేవిగా దర్శించారు శ్రీ లక్ష్మీకాంతయోగి, రాజరాజేశ్వరియే - అని ఉద్ఘాటించారు శ్రీ కాశీకృష్ణాచార్యులు.

శ్రీ లక్ష్మణ యతీంద్రులు - ఆ వేదవేద్యుడే రాముడు; ఆ రాముడే లలిత; ఆ లలితయే ఈ మన అమ్మ. అమ్మ మరో రూపమే హైమ. మనందరనుకూడా లలితామూర్తులుగా మలుచుకోవాలన్న అమ్మ అభిలాషే ఈ పారాయణ కార్యక్రమానికి మూలం అని వివరించారు.

అమ్మ ఒకసారి చెప్పింది - ముందు మనం నామాన్ని పట్టుకుంటే తర్వాత నామమే మనను పట్టుకుంటుందిట "పూజగానీ, ప్రార్ధన గానీ మనం చేసేది ఏముందీ, వాడే మనచేత చేయించుకోవాలి" అని లోగడ అనేక పర్యాయాలు అమ్మ ఉద్బోధించింది. కనుకనే అమ్మ మన కోసం యింత పెద్ద పెట్టున నామపారాయణ కారక్రమం ఏర్పాటు చేసింది. అంటే ఆనాడు మాత్రమే కోటి నామాలు చేసే దానిని అంతతోనే విస్మరించాలని కాదు. ఆనాడు అనుభవించిన ఆ నామామృతరుచిని సుస్థిరం చేసుకోవాలని; అంటే నిరంతరం ప్రతిహృదయంలో లలిత నామ మధుర నాదం ప్రతిధ్వనిస్తూ ఉండాలని; అంటే నామరూపంతో ప్రతి హృదయంలో అమ్మ స్థిరనివాసిని కావాలని. మరి నామానికి నామికీ అభేదమే కదా; పర్యవసానంగా మనందరం లలితా మూర్తులుగా పరిణామం చెందాలని అమ్మ మధురోహ.

అమ్మకూడా అనేక సందర్భాల్లో తన అతిమానవ తత్వాన్నీ దైవత్వాన్నీ సూచన ప్రాయంగానే కాక ప్రస్ఫుటంగా కూడా ప్రకటించింది. తన సర్వమాతృత్వాన్ని అనవరతం పలురీతుల్లో ప్రవచిస్తూనే ఉన్నది.

"మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలు కూడా" అనీ చెబుతూ అమ్మ "కాలినొప్పి చేతికి తెలీదు; చెయ్యినొప్పి చెవికి తెలీదు. కానీ మీ అందరి నొప్పి నాకు తెలుస్తుంది" - అని వివరించింది.

"మీ రంతా నేనే; మీ దంతా నేనే" అని అమ్మ స్పష్టపరిచింది.

ఈ ప్రకటనలవల్ల అమ్మకు సృష్టితో అంటే మనతో గల తాదాత్మ్య స్థితీ, అవినాభావ సంబంధమూ అభివ్యక్తం అవుతున్నది.

ఈ ప్రకటనకూ, అమ్మ లలితా స్వరూపిణియే నన్న భావనకూ బలం చేకూర్చే సంఘటన ఒకటి జరిగింది నవంబరు 10వ తేదీన.

కోటినామపారాయణం గురించి - ఆ రాత్రి 7 గంటలకు కొందరు గణిత ప్రవీణులు కుస్తీపడుతున్నారు. కొందరు కోటి పూర్తి అయిందంటున్నారు. కొందరు కాలేదంటున్నారు.

అంతలో అమ్మ హైమాలయంకు వచ్చింది. ఈ సంగతి విని సాయంకాలం 6 గంటలకే పూర్తి అయిందని చెబుతూ శ్రీ లక్ష్మణ యతీంద్రులకు ఆ విధంగా ప్రకటన చేయమని చెప్పింది. వారు చేశారు.

కానీ, కొందరు సంశయాత్ములు ఆ మాటను విశ్వసించలేక లెక్కలతో సతమతమై తుదకు కోటిపై ఎనిమిదిలక్షలు పూర్తి అయిందని లెక్కలు తేల్చారు. అప్పటికి గం. 7.30 ని.లు అయింది. అంటే అమ్మ చెప్పినట్లు 6 గంటలకే కోటి పూర్తి అయిందన్నది సత్యం.

అందరు అంత కష్టపడి చేసిన లెక్క అమ్మ ఎట్లా చేసిందీ ?

ఇందరు చేసినా - అందరూ అయిఉన్నది తానే కనుక తెలిసి ఉండాలి. చేసినదెందరయినా అవి చేరినది తనకే కనుక తెలిసి ఉండాలి.

కోటినామపూజిత అమ్మ ఆనాడు కోటి వెలుగులతో దీపించింది.

(నవంబరు 1979)



# 146
# ఇదీ అమ్మ అంటే

గత మాసం 22వ తేదీన శ్రీ లక్ష్మణయతీంద్రులు జిల్లెళ్ళమూడి వచ్చారు. వారు సుప్రసిద్ధులయిన యతీంద్రులే కాదు; రససిద్ధులైన కవీంద్రులు కూడా. వారి కవితారచన ఆపాతమధురమూ, ఆలోచనామృతమూనై రసస్ఫోరకంగానూ రమణీయంగానూ ఉంటుంది. వారి కవిత్వంవలెనే కంఠంకూడా మనోజ్ఞమై గంభీరమై నినదిస్తుంది. అందువల్ల జిల్లెళ్ళమూడివాసులకే కాక అమ్మకు కూడా వారి కంఠం వినాలని ప్రగాఢమయిన ఆసక్తీ, వింటే పరమానందమూ.

ఆ సాయంకాలం అమ్మ సన్నిధిలో వారి కవితాగానం ఏర్పాటు చేయబడింది. వారు లోగడ ప్రచురించిన "క్వణత్ కింకిణి' అన్న కావ్యం నుండి కొన్ని రసవద్ఘట్టాలను గానం చేస్తున్నారు. యతీంద్రులవారు వారి ఆరాధ్యదైవం అయిన 'కన్నయ్య'ను గురించే పాడుతున్నప్పటికీ కన్నమ్మ పాదాలమ్రోల ఉన్నందున తత్ప్రభావితులై పరమానందభరితులై కన్నయ్య - కన్నమ్మలకు అభేదంగా ప్రవచనం చేస్తున్నారు.

కృష్ణుడు - గోపికల సంబంధం వర్ణిస్తూ ఒక పరమ రహస్యం బహిర్గతం చేశారు.

"కొందరు మేము ఎక్కడో ఉన్నాం; యిక్కడ అతుక్కున్నాం అనుకుంటున్నారు. భ్రాంతితో. అందరూ ఉన్నది ఈ పాదాల దగ్గరే. అందరం ఇక్కడే పుట్టాం. ఇక్కడ నుండి కొనలు సాగుతున్నాం అనుకుంటున్నాం. మనద్వారా ఈ శరీరంద్వారా కొనలు సాగుతున్నది అమ్మలోని చైతన్యమే."

శ్రీ యతీంద్రులవారు చమత్కరిస్తున్నట్లు కనిపించినప్పటికీ, ఆ ప్రసంగంలోనే ఒక విచిత్రసత్యాన్నీ ఆవిష్కరించారు.

"ఏడోమైలురాయి దాటి వచ్చినవాడికి స్వంతయిల్లు ఉండే యోగం లేదు. వాడి ఇల్లు అందరిల్లే అవుతుంది. తప్పదు అది".

శ్రీ యతీంద్రులవారు తన్మయులై పాడుతున్నారు; ప్రసంగిస్తున్నారు. శ్రోతలు పరవశులై ఆలకిస్తున్నారు; ఆనందిస్తున్నారు.

అంతలో అమ్మ యతీంద్రులవారి మెడలోనున్న పుష్పహారాన్ని తీసి క్రింద ఉంచింది. అది బరువుగా ఉన్నందువల్ల వారికి శ్రమ కలుగుతుందని అమ్మ ఆలోచన. వెంటనే చిరునవ్వుతో యతీంద్రుల వారు అన్నారు "అమ్మ అంటే అది. అమ్మ అంటే నిర్వచనం కోసం డిక్షనరీ చూడకండి. ఇక్కడ చూడండి... ఇదీ అమ్మ అంటే" అని.

సంఘటన చిన్నదా, పెద్దదా - అన్నది విచికిత్స కాదు. అమ్మ ప్రతి కదలికలో ప్రతి క్రియలో మాతృత్వం పరిమళిస్తూంటుంది.

అనుక్షణం వచ్చిన ప్రతివారు అన్నం తిన్నదీ, లేనిదే అమ్మ స్వయంగా విచారిస్తూ ఉంటుంది. కొందరు అన్నం తిని వస్తే వారికి అమ్మ యేదైనా తినిపిస్తూ ఉంటుంది. ఆ తినిపించేటపుడు, అమ్మ తీసుకునే జాగ్రత్తలూ, చూపించే శ్రద్ధా మనను ఆశ్చర్య చకితులను చేయడమే కాదు మన గుండెను కదుపుతాయి. అరటి పండు తినిపిస్తే - అది మెత్తగా ఉన్నదా, గట్టిగా ఉన్నదా, అని వత్తి చూసి మరీ తినిపిస్తుంది. బత్తాయితొనలైతే గింజలను తానే తొలగిస్తుంటుంది.

అన్నం పెట్టేటప్పుడు అయితే ఎవరికి ఎట్లా కావాలో విచారిస్తూ, కొందరికి కారం ఎక్కువగా, కొందరికి ఉప్పు తక్కువగా కలుపుతూ, కబుర్లు చెబుతూ కొసరి కొసరి పెడుతూంటుంది. ఆ మధుర సమయాల్లో ఎవరికి వారికి - వారి వయసుతో గుణాలతో నిమిత్తం లేకుండా - తాము పసివాళ్ళు అయినట్లూ తమ కన్నతల్లుల ఒడిలోనో, చంకలోనో ఉన్నట్లూ అనుభూతి కలుగుతుంది.

మరి, అమ్మ - ఎవరికనీ ? ఎందరికనీ !

(డిశంబరు 1979)



# 147
# కొత్త సంవత్సరం

ప్రతి సంవత్సరం జిల్లెళ్ళమూడిలో నూతన ఆంగ్ల సంవత్సర ఆగమనోత్సవం జరపడం అలవాటు. డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటలకు అలంకరింపబడ్డ వేదికపైకి అమ్మ వచ్చి నూతన సంవత్సరాన్ని ఆవిష్కరిస్తుంది. అమ్మ ఈ ఉత్సవాన్ని జరిపే సమయాన్ని అనుసరించి మనం గడియారాలు సరిదిద్దుకోవచ్చు. అమ్మ అంత ఖచ్చితంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది.

ఈ సంవత్సరం సోదరుడు చంద్రమోహన్ వేదికను రంగు రంగుల కాగితాలతో, బెలూన్లతో అత్యద్భుతంగా అలంకరించాడు. వేదిక, మందిరం కనులపండుగగా ఉన్నయ్. పలు ప్రాంతాల నుండి వచ్చిన యాత్రికులు అమ్మ ఆగమనానికి వేయికళ్ళతో ఎదురు చూస్తున్నారు.

పన్నెండు గంటలు కావస్తున్నది. అమ్మ గది నుండి నాకు రావలసిన పిలుపు రాలేదు. కారణం ఊహించుకుంటూ పూజకు కావలసిన పూలు, దండలు, బిస్కట్లు, రస్కులు.... అన్నీ సర్దుకుంటున్నాను.

పిలుపు రాని కారణం మనస్సుకు అందలేదు. పిలుపూ రాలేదు. అయినా సమయం దగ్గరకు వస్తున్నందున అమ్మ వచ్చేముందు మామూలుగా కొట్టే గంట కొట్టాను. అప్పటికీ పిలుపు రాలేదు.

నేను అమ్మ గదికి వెళ్ళాను. అమ్మ వేదికవద్దకు రావడానికి బయలుదేర బోతున్నది. గడియారం చూచాను. 12 గంటలకు కొన్ని సెకండ్లు మాత్రమే వ్యవధి ఉన్నది. ఆ అల్పవ్యవధిలో రెండు అంతస్తులు దిగి అమ్మ వేదికపైకి రాగలుగు తుందా? అమ్మ అసలే చాలా మెల్లగా నడుస్తుందాయె ! "అమ్మా - యీసారి కొత్త సంవత్సరం రాకకు ఆలస్యం చేశావమ్మా..." అన్నాను నవ్వుతూ. అమ్మ కూడా చిరునవ్వుతో నా మాటను అంగీకరించిదే కానీ కారణాన్ని వ్యక్తపరచలేదు.

నేను కూడా ఇంకా వివరంగా ఏమీ అడగలేదు. అమ్మ బయలుదేరి వేదికపైకి వచ్చి మామూలుగా కొత్త సంవత్సరాన్ని విడుదల చేసింది. కానీ ఒకటి, రెండు క్షణాలు ఆలస్యమయింది.

తర్వాత ఉత్సవం యథాప్రకారంగా జరిగిపోయింది.

నాకు మాత్రం ఆలోచనగానే ఉన్నది. - అమ్మ ఎందుకు ఆలస్యం చేసిందీ అని. పైగా, కారణం లేకుండా అమ్మ ఏ పనీ చేయదని కూడా పరమ విశ్వాసం. అమ్మకేమో ఏదీ వివరించి చెప్పడం సాధారణంగా అలవాటులేని విషయం. మఱుగే తన విధానమని అమ్మ పలుమార్లు స్పష్టపరిచిందికూడా. కనుక అమ్మను అడిగి ఆ రహస్యం మనం తెలుసుకోలేమన్నది నిర్వివాదమయిన విషయం

మరి హేతువు ఏమయి ఉంటుంది ? ఎట్లా తెలుసుకోవడం ?

మరునాడు ఆంధ్రప్రభలో చూచాను ఒక వార్త. నా ఆశ్చర్యానికి, ఆనందానికీ అంతులేదు. ఆ వార్త శీర్షిక - "క్షణం లేటుల క్రొత్త సంవత్సం" అని వివిధ నభోమూర్తుల ప్రభావంవలన భూభ్రమణం స్వల్పంగా మందగించిందనీ, కొత్త సంవత్సరం క్షణం లేటుగా వచ్చిందనీ జాతీయ భౌతిక పరిశోధనాగారం ఒక ప్రకటనలో పేర్కొన్నదట.

అమ్మను ఎందరో పుడమితల్లిగా పూజిస్తున్నారు. మరెందరో కాలస్వరూపిణిగా కీర్తిస్తున్నారు. ఈ సంఘటన ఆ భావాలకు మరింత బలాన్ని చేకూర్చింది.

నేను వార్త చూడగానే పత్రికతోసహా అమ్మవద్దకు వెళ్ళి చూపించాను. "అదంతా మీ నమ్మకంరా" అంటూ చిరునవ్వులు చిందించే అమ్మగురించి మనం ఏమని భావించాలి ?

(జనవరి 1980)



# 148
# అద్దరి చేరిన ఇద్దరు అన్నయ్యలు

నిత్యమూ అమ్మవద్దకు ఎందరో యాత్రికులు వస్తున్నారు. అమ్మ ఎంతగా అందరినీ తన బిడ్డలే అనుకుని ఆదరిస్తున్నప్పటికీ అందరూ బిడ్డలై ఆ అనురాగామృతాన్ని చవిచూడలేక పోతున్నారు. అమ్మను చూచినవారిలో ఎందరో యాత్రికులుగానే మిగిలిపోతున్నారు. కొందరు అమ్మలోని మాహిమాన్వితమయిన దైవత్వాన్ని అవగాహన చేసుకుని భక్తులై సాధకులై ఆరాధిస్తుంటే, కొందరు అత్యున్నత అతిలోక జ్ఞాన శిఖరాలను సందర్శించి శిష్యులై జిజ్ఞాసువులై ఉపచారం సల్పుతుంటే - కొందరు మాత్రమే అమ్మలోని అసామాన్య సర్వమాతృత్వాన్నీ వాత్సల్య జలధినీ అవలోకించగలిగి ఆ మధుర మమతామృతాన్ని అనుభవించ గలుగుతున్నారు. అలాంటి అదృష్టవంతులలోని వారు గుంటూరు వాస్తవ్యులు శ్రీ జొన్నాభట్ల వెంకట్రామయ్యగారూ, వేటపాలెం వాస్తవ్యులు శ్రీ రాజుపాలెం రామచంద్రరావుగారూ.

ఈ అసాధారణ మధురానుభవం పొందగలిగిన వాని జీవిత పథమే గొప్ప మలుపు తిరుగుతుంది. ఆ మలుపు సామాన్యంగా ఆ కుటుంబంలోని ఇతర సభ్యులకు సహించరానిదిగా ఉంటుంది. దానితో ఆ ఇల్లు కలతలకూ, కలహాలకూ నిలయమై పోవడమే కాక అతనికి కాలమే పరీక్షా పత్రమై అనుక్షణం ఒక ప్రశ్నయై అతని మనస్సును సంఘర్షణకూ సంక్షోభానికి గురిచేయడం సహజం.

కాని కొందరు అమ్మ అనుగ్రహం పరిపూర్ణంగా పొందిన వారుంటారు. వారికి యావత్ కుటుంబమూ సహకరిస్తుంది. కుటుంబ సభ్యులందరూ అమ్మకు సన్నిహితు లవుతారు. అందరూ ప్రేమామృత వర్షధారల్లో తడుస్తూ అమ్మవద్దకు వస్తూ పోతూ ఆనందంగా ఉంటారు.

అటువంటి ఆదర్శమయిన కుటుంబాల్లో రెండు కుటుంబాలు శ్రీ వెంకట్రామయ్య గారిదీ, శ్రీరామచంద్రరావుగారిదీ.

శ్రీ రామచంద్రరావుగారు 1957 నవంబరులో అమ్మను మొట్టమొదటిసారిగా దర్శించారు. వారు అంతకుముందే శ్రీ రమణమహర్షి, శ్రీ అరవిందయోగి, శ్రీ మెహర్‌బాబా, శ్రీ ఉపాసినీబాబా, శ్రీ లక్ష్మీ కాంతయోగి, శ్రీ మౌనస్వామి, శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి, మాలపిచ్చమ్మ - ఎందరో మహాత్ముల సందర్శనంతో ఉత్తేజితులై ఉన్నారు. ఆధ్యాత్మిక సాహిత్యాన్ని ఆపోశనం పట్టారు.

ఆ తరుణంలో అమ్మను చూచారు. అమ్మ బోధలు విన్నారు. వారు అంతకుముందే తయారుచేసికొని ఉంచుకున్న కొలబద్దలతోనూ, గీటురాళ్ళతోనూ అమ్మను పరిశీలించుకున్నారు; పరీక్షించుకున్నారు. వారికి అమ్మ అత్యున్నతంగానూ, సంపూర్ణంగానూ దర్శనం యిచ్చింది. అంతే - వారు అమ్మకు దాసోహం అన్నారు; పాదాక్రాంతులయ్యారు. అసంఖ్యాక పర్యాయాలు అమ్మను దర్శించారు. అమ్మ బోధలు అధ్యయనం చేశారు. వారి అనుభవాలూ, పారాలూ అన్నీ సూత్రప్రాయంగా అక్షరబద్ధంచేశారు. అవన్నీ గ్రంథస్థం చేయగలిగితే వేలపేజీల గ్రంథాలు అనేకం స్వరూపం ధరించి ప్రపంచానికి జ్ఞానభిక్ష పెట్టగలవు. వాటి నన్నిటినీ భద్రపరచవలసిన అవసరం ఎంతయినా ఉన్నది.

వారు తరచుగా పలికే "ఎంత పెద్ద గుమ్మడికాయ అయినా చిన్నకత్తి పీటకు లోకువే" అనే వాక్యం ఇంకా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నది.

వారు హఠాత్తుగా అనాయాసంగా జనవరి 30వ తేదీన వేటపాలెంలో కన్ను మూశారు.

శ్రీ వెంకట్రామయ్యగారు 1961 జనవరిలో సంక్రాంతి పర్వదినాన అమ్మను సందర్శించారు. ఆనాడే వారి జీవితంలో ఉత్తరాయణ పుణ్యకాలం పురుడు పోసుకుంది. మొదటి దర్శనంలోనే వారు సర్వథా అమ్మచే ప్రభావితులైనారు. వారు ప్రఖ్యాతమయిన పండిత వంశంలోనే ప్రభవించినప్పటికీ ఆ వాసనలేమీ వారిని అంటలేదు. కేవల లౌకిక జీవనాసక్తులై కాలం గడుపుతున్నారు... అయినా, వారిని అమ్మ అనుగ్రహించింది. వారి జీవితమే మారిపోయింది. అమ్మయందు అచంచలమైన నిర్ద్వంద్వమయిన విశ్వాసం ఏర్పడింది. "మోక్షసాధనే మానవుని లక్ష్యమయితే ఏ వేదాలూ, ఏ పురాణాలూ మథనం చేయవలసిన పని లేదు; ఏ పుణ్యతీర్థాల్లోనూ స్నానమాడ నవసరం లేదు. జిల్లెళ్ళమూడి అమ్మ పాదసేవ చేసి ఆమె అనుగ్రహాన్ని పొందగలిగితే చాలు. అదే నా జీవిత లక్ష్యం" అని మాతృశ్రీ 1978 మే సంచికలో వ్రాసుకున్నారు. వారి జీవితం ఆ లక్ష్యానికి అభిముఖమై గాడి తప్పకుండా నడిచి గమ్యం చేరింది.

వారి జీవితం పరిశీలిస్తే అమ్మ ప్రధాన బోధ అయిన "నీకున్నది నీవు తృప్తిగా అనుభవించు; ఇతరులకు ఆదరణగా పెట్టు" అన్న సూక్తికి వారు సజీవ నిదర్శనంగా భాసిస్తారు. ఆ సూక్తికి కొనమెరుపు అయిన "అంతా వాడే చేయిస్తున్నాడని నమ్ము -" అన్న వాక్యానికి వారి ప్రతి ఆలోచనా, ప్రతి మాటా, ప్రతిక్రియా ఉదాహరణమే.

ఇటీవల శ్రీ లక్ష్మణయతీంద్రులవారు ఒక ప్రసంగంలో "అమ్మ ఇల్లు అయిన అందరింటిలో సభ్యులయిన ప్రతివాడి ఇల్లూ 'అందరిల్లు' అయిపోతుంది. వాడికి స్వంత ఇల్లు అంటూ మిగలదు" అని చెప్పారు. ఆ వాక్యంలోని సత్యం వెంకట్రామయ్యగారింటికి వెళితే పరిపూర్ణంగా అర్థమవుతుంది.

వారు జనవరి 18వ తేదీన జిల్లెళ్ళమూడిలో 'I am very happy' అంటూ సమీపిస్తున్న చరమ ఘడియలను సుస్పష్టంగా అవలోకిస్తూ అనాయాసంగా ఆనందంగా అమ్మలో ఐక్యమయినారు.

ఆదర్శమూర్తులయిన ఇద్దరు సోదరులు హఠాత్తుగా మన నుండి దూరం అయినందుకు విచారిస్తూ ..... వారికి ఎలాగూ సుగతే కనుక - వారి కుటుంబాలకు అవసరమైన ఉపశమనాన్ని ప్రసాదించవలసి నదిగా అమ్మను ప్రార్థిస్తున్నాము.

(ఫిబ్రవరి 1980)



### తన యిష్టం

ప్రతి మానవుడికి తన యిష్టప్రకారం జరగాలి. అది చావుగావచ్చు. బ్రతుకు గావచ్చు. బాధగావచ్చు. అంతా తన యిష్ట ప్రకారమే జరగాలి అనుకోవడం కూడా ఒక జబ్బే.

\- అమ్మ

# 149
# అమ్మ కూడా మనలాంటిదేనా ?

"నేనూ మీ లాంటి దాన్ని. నాలో ప్రత్యేకత ఏమీ లేదు" అని అమ్మ చెబుతూ ఉండడం మనం పదే పదే వింటూనే ఉంటాము.

అమ్మ తత్వమూ, ప్రతిభా, ప్రజ్ఞా, సర్వశక్తి సామర్థ్యాలూ అనుభవపూర్వకంగా అవగతం చేసుకున్న వాళ్ళూ, అమ్మ యందు పరిపూర్ణమైన ప్రగాఢమయిన విశ్వాసం కలవాళ్ళూ అయితే అమ్మ మాటలకు తమలో తామే నవ్వుకుంటూ - అమ్మలోని నిరాడంబరతకు మరొక్క మారు సాగిలపడతారు. లేనివాళ్ళయితే "ఔను, అంతే. అమ్మ కూడా మనలాంటిదే. మనమే వాళ్ళ మాటలూ, వీళ్ళ మాటలూ నమ్మి, ఏవేవో ఊహించుకుని, అమ్మను కొండెక్కించి కోటి దండాలు పెడుతున్నాం..." అని అనుకుని తమ తార్కిక వైభవానికి తామే మురిసిపోతారు.

అయితే - మన నమ్మకాలనూ, నమ్మకాలపై ఆధారపడే మహిమలనూ, మహిమలను ఆలంబనంగా మనం రూపకల్పన చేసుకునే దైవత్వమూ ప్రక్కకు బెట్టి - నిత్య జీవితంలో, అనుక్షణం అమ్మ ఆలోచించే తీరులో, అమ్మ మాట్లాడే రీతిలో, అమ్మ ఇతరులతో వ్యవహరించే ప్రవర్తనలో... ఏమయినా విలక్షణత, విశిష్టత, విశేషం ఉన్నాయా అని మనం ఒకసారి పరిశీలిద్దాము. అమ్మ కూడా సామాన్యులవలెనే ఆలోచిస్తుందా ? అందరి పలుకులకూ అమ్మ మాటలకు, ఏమీ తేడా లేదా ? నగటు మనిషి వలెనే అమ్మ కూడా ప్రవర్తిస్తుందా ?

అమ్మ సాన్నిధ్యంలో ఉండి ఏమాత్రం పరిశీలనానక్తి ఉన్నా పై ప్రశ్నలకు మనకు సంతృప్తి కరమయిన సమాధానాలు దొరుకుతాయి.

ఏదయినా ఒక వ్యక్తిని గురించి ఆలోచించేటపుడు, ఒక సంఘటనను చూసేటపుడు - అంతకు ముందే మన మనస్సులో పేరుకు పోయిన పలు పొరలు పనిచేస్తాయి. అమ్మ ఆ వ్యక్తిని ఆ వ్యక్తిగానూ, ఆ సంఘటనను ఆ సంఘటనవరకే చూస్తుంది.

ఉదాహరణకు ఒక వ్యక్తి మన ఇంటికి వచ్చాడు - అనుకుందాము. అతణ్ణి ఆదరించే తీరులో - అతని చరిత్ర, అతని స్థితి, అతనికీ మనకూ గల సంబంధ బాంధవ్యాలు అనేకం ప్రాధాన్యం వహిస్తాయి. కొంతమందిని నుంచోపెట్టే మాట్లాడు తాము. కొందరిని కూర్చోమంటాము ఆ కూర్చోపెట్టడంలో కూడా అనేక స్థాయిలు. మనకంటే తక్కువగా; మనతో సమానంగా; మనకంటె ఎక్కువగా. కొందరితో వచ్చిన పనివరకే మాట్లాడుతాము. కొందరిని మంచి నీళ్ళు కావాలా ? అని ఆదరిస్తాము. కొందరికి కాఫీ, ఫలహారాలిచ్చి మన ఆప్యాయతను చూపిస్తాము. కొందరికి భోజనం పెట్టి మన ఆత్మీయతను ప్రదర్శిస్తాము. ఈ విధంగా మన ఆదరణ అనేక రూపాలు ధరిస్తుంది

కానీ - అమ్మ అందరినీ ఒక్క తీరుగానే ఆదరిస్తుంది. వాళ్ళ అవసరమే అమ్మకు కనిపిస్తుంది. కానీ వాళ్ళ స్థానాలూ, స్థాయిలూ దృగ్గోచరం కావు. ఒకసారి జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయంలో భోజనం చేసే అర్హతను గురించి చర్చ వస్తే చివరకు అమ్మ తీర్మానించింది. ఆకలి కలిగి ఉండడమే భోజనం చేయడానికి అర్హత - అని.

ఒక రోజున ఒక ముసలమ్మ వర్షంలో తడిసి అమ్మ వద్దకు వచ్చింది. కట్టుకున్న చీరె నీళ్ళు గారుతున్నది. ఆమె చలికి గజగజా వణుకుతున్నది. ఆమెను చూడగానే అమ్మ లోపలినుండి చీరె తీసుకు రమ్మని నన్ను ఆదేశించింది. నేను లోపలకు వెళ్ళి శ్రీమతి వసుంధరను అడిగాను. వసుంధర ఎందుకూ - అని అడిగింది. నేను చెప్పాను. వసుంధర బీరువా తీసి చూచి 'లేవు' అన్నది. నేను వెళ్ళి అమ్మకు చెప్పాను. అమ్మ ఆమె వంకా, నా వంకా చూచింది. అమ్మ అభిప్రాయం గ్రహించి 'లేదమ్మా' అన్నాను మళ్ళీ. అమ్మ చివాలున లేచి పాదరక్షలయినా తొడుక్కోకుండా లోపలికి వచ్చి తానే స్వయంగా బీరువా తీసింది. అందులో మడత పెట్టి బహు అందంగా ఉన్న ఖరీదయిన పట్టుచీరె తీసుకుని బయలు దేరింది - ఆ ముసలమ్మకు యివ్వడానికి. "అదొక్కటే ఉన్నదమ్మా. అది కూడా యిస్తే నువ్వు స్నానం చేస్తే కట్టుకోవడానికి చీరె ఉండదమ్మా" అన్నది వసుంధర. అమ్మ వసుంధరను అదోలా చూస్తూ "నాకు చీరె ఉండదని ఆలోచిస్తున్నావా ? నాకు అవసరమైతే అదే వస్తుంది. అదీగాక - మనకున్నవి మనం ఇస్తే గానీ మనకు కొత్తవి రావు" అన్నది అమ్మ మందహాసం చేస్తూ. నేనూ, వసుంధర మారుమాట లేక చూస్తూ ఉండిపోయాము. అమ్మ తన కర్తవ్యం నిరాఘాటంగా నెరవేర్చింది.

మనం మనిషి మంచివాడయితే ప్రేమిస్తాము; గౌరవిస్తాము. స్నేహం చేస్తాము; సన్నిహితుల మౌతాము. కాకపోతే ద్వేషిస్తాము; అసహ్యించుకుంటాము. దూరంగా వెళ్ళిపోతాము. అమ్మ అట్లాకాదు. అందరినీ ఒక్కలాగానే ప్రేమిస్తుంది. ఎవరి వ్యక్తిత్వాలూ అమ్మకు ఆకర్షణనూ కలిగించలేవు; అసహ్యతనూ కలిగించలేవు. "గొప్ప కార్యం చేసినా, కొద్ది కార్యం చేసినా ఒకటే. నడిపించేది ఒకటయినప్పుడు నీ గొప్పతనం లేదు. ఇది (యీ తప్పు) మీ దనిపించదు నాకు. మీకు ఆ స్వభావాన్నిచ్చి ఆ ప్రేరణ చేసిన శక్తి దనిపిస్తుంది" అంటుంది అమ్మ. అందువల్లనే అమ్మ తనకు గురించి తాను తెలుపుకుంటూ - "రాగద్వేషాలు రహితమైనదే అనసూయ" అని ప్రకటించింది.

మన ప్రేమ పరస్పరాశ్రయమై ఉంటుంది. ఎదుటివారు ప్రేమిస్తేనే మనం ప్రేమిస్తాము. మన ప్రేమ కారణంతో కూడి ఉంటుంది. అమ్మ ప్రేమకు కారణంతో సంబంధం లేదు. ఎదుటివారు తిరిగి ప్రేమిస్తున్నారా, లేదా అన్న ఆలోచనే లేదు. అందుకే అమ్మ "ప్రేమ నాకు సహజం" అనగల్గింది. తనను ప్రేమించేవాళ్ళనూ, విమర్శించే వాళ్ళనూ, ద్వేషించే వాళ్ళనూ సమానంగా ప్రేమించగలుగుతున్నది.

మన ప్రేమ పరిమితులకు లోబడి ఉంటుంది. మన కుటుంబమనో, మన బంధుమిత్రులనో, మన కులం అనో, మన మతం అనో, మన భాష అనో, మన దేశం అనో - అనేక పరిమితులూ, పరిధులూ మనకు. కాని అమ్మకు ఇవేమీ లేదు. శుక్ర శోణితాల కేది కులమో అదే నా కులం అని ప్రవచించింది. సర్వసమ్మత మైనదే నా మతం - అని ప్రకటించింది గుణభేదం లేదని సుస్పష్టంగా చెప్పింది. ఎవరిని చూచినా తనకు తన బిడ్డే అనిపిస్తుంది అంటూ వాత్సల్యపు సరిహద్దులను చెరిపేసింది. సృష్టి నాది అని వివరిస్తూ మమకారపు పరిధులను తుడిపేసింది.

ఒకసారి మా గ్రామంలో కారు క్రింద ఒక పిల్లవాడు పడ్డాడు. ఆ పడ్డది మా పిన్ని గారి అబ్బాయి అని అందరూ అరిచారు. ఆ కేకలు విని మా పిన్ని గుండెలు బాదుకుంటూ అక్కడకు పరుగెత్తింది. ఆ పిల్లవాడు నెత్తుటి మడుగులో స్పృహకోల్పోయి ఉన్నాడు. దృశ్యం హృదయ విదారకంగా ఉన్నది. కానీ ఆ పిల్లవాడు మా పిన్ని కొడుకు కాదు. ఆ విషయం మా పిన్ని గ్రహించింది. ఆ క్షణంలోనే ఆమె కన్నీళ్ళు ఆరిపోయాయి. ఆమె దుఃఖం ఆగిపోయింది. పైగా పకపకా నవ్వుతూ 'మా పిల్లవాడు కాదు' అని అరిచింది. మరి - అమ్మ ఎవరికి ఏ మాత్రం కష్టం కలిగినా వారితోపాటు తానూ విచారిస్తుంది. ఎవరికి ఏ మాత్రం ఆనందం కలిగినా తానూ పాలుపంచుకుంటుంది.

మనకు అందరి యందు అనుమానాలే. అందరిలో మనకు లోపాలూ, దోషాలే కనుపిస్తాయి. ముందు మనం ప్రతివాడినీ అనుమానించి తర్వాత కాదని ఋజువు చేసుకుంటాము. అమ్మ అందరిలోనూ మంచితనాన్నే చూస్తుంది. సర్వత్రా పూజ్య భావాన్నే చూస్తుంది. చివరకు ఒక్కమాటలో చెప్పింది "తల్లికి తప్పే కనిపించదు" అని.

మనమూ అనేక సిద్ధాంతాలు వల్లిస్తాము. వ్యాసాలు రాస్తాము. ఉపన్యాసాలు ఇస్తాము. ఇతరులకు ఉపదేశాలు చేస్తాము. కానీ మనం మాత్రం అట్లా ఆచరించము. మన మాటకూ చేతకూ ఎక్కడా సామ్యం ఉండదు. కానీ - అమ్మ విషయంలో వేరు. అమ్మ తానేది ఆచరిస్తుందో - అదే యితరులకు ఉపదేశిస్తుంది. తానేది అనుభవిస్తుందో అదే వివరిస్తుంది. అమ్మ వాక్కుకూ క్రియకూ అంతరం ఉండదు.

ఈ విధంగా మనం అవలోకించ గలిగినంతవరకూ, ఆలోచించ గలిగినంత వరకూ - అమ్మకూ మనకూ భౌతికంగా తప్ప మరి యేవిధమైన పోలికా కనిపించదు. అమ్మకూడా సాధారణ స్త్రీవలే చీర కట్టుకుని, సామాన్యమయిన కరచరణాదులతో కనుపిస్తూ "నేనూ మీవంటి దానినే" అంటూంటే ఆ మాట మనను మాయలో ముంచేస్తూ ఉంటుంది.

(మార్చి 1980)



## సర్వమూ పరమే

నా దృష్టిలో ఆగ్రహానుగ్రహాల్లేవు. అంతా అనుగ్రహమే. కష్టసుఖాలు శుభాశుభాలు అన్నీ అనుగ్రహంవల్లనే, ఇవ్వబడిన సర్వమూ పరమే. ఇక మ్రొక్కినవారు, మ్రొక్కనివారు - అని భేద మేమున్నది ?

- అమ్మ

# 150
# స్వధర్మం

ఎండవేడిమి తగ్గింది. తూర్పుగాలి ఆహ్లాదకరంగా ఉంది. అప్పటిదాకా తీవ్రమయిన ఎండలో తుకతుక ఉడికిన మేనులూ, మనసులూ చల్లబడ్డాయి.

అమ్మ అప్పుడే స్నానంచేసి వచ్చి సింహాసనంలో ఆసీన అయింది. పసుపు పచ్చరంగు బిన్నీ సిల్కుచీర, తల్లో కనకాంబరాలు. భ్రూకుటిలో కుంకుమబొట్టు. ముక్కున తెల్లరాయి బులాకీ. .... అదొక అతిలోకమయిన రామణీయకమూ. అనిర్వచనీయమయిన ఠీవీ. మనసులోని ప్రశాంతి కన్నుల్లో కాంతియై కనిపిస్తూ ఉంది.

1980 ఏప్రిల్ 23వ తేదీ సాయంకాలం 5-6 గంటల మధ్య.

ఒక సోదరుడు సభక్తికంగా సవినయంగా అమ్మ పాదాల వద్ద కూర్చున్నాడు. అదే వారు అమ్మను మొదటిసారిగా దర్శించడం. ఒక దివ్యానుభూతని కలిగించి జీవితంలో ఆ క్షణాలు వారికి చిరస్మరణీయమై నిలిచిపోవచ్చును.

వారు టెలికమ్యూనికేషన్సులో ఉద్యోగం చేస్తున్నారు. డివిజనల్ ఇంజనీరు. శ్రీ వల్లూరి వీరభద్రశర్మ. ఉద్యోగ స్వభావం వల్ల అనేక బాధ్యతల వత్తిడి. ఇంకా ఎక్కడెక్కడికో వెళ్ళాలి; ఏమేమో పరీక్షలు చేయాలి. కాలవేగంతో పోటీపడి పరుగులు తీసే ఉద్యోగం.

అందువల్లనే యేమో ఎక్కువ కాలం మౌనంలో గడపక అమ్మతో సంభాషణకు ఉపక్రమించారు. అదీగాక ఎంతకాలం నుండో ఆ ప్రశ్న వారిని వేధిస్తూ ఉండి ఉంటుంది. వీలయినంత త్వరలో ఆ భారాన్ని దించుకుందామన్న తపనకూడా అయి ఉంటుంది.

అమ్మ వాత్సల్య పూరితమయిన దృక్కులతో వారిని చూస్తూ ఉన్నది.

“అమ్మా - నేను ఉద్యోగం చేస్తున్నాను. నా ఉద్యోగానికి చాలా మందికి వలే కాల నియమం లేదు. అవసరమయితే తెల్లవారకముందే ఇల్లు విడిచి

వెళ్ళాలి. మళ్ళీ ఎప్పుడు వస్తానో తెలీదు. అందువల్ల నా విధిని నేను నిర్వహించ లేకపోతున్నాను. రోజూ చేయవలసిన దైవకార్యం సక్రమంగా నిర్వర్తించలేక పోతున్నాను. నిత్యమూ మడి కట్టుకుని నిష్ఠగా నియమంగా గాయత్రీ మంత్రమయినా చేయలేకపోతున్నాను. కానీ ప్రయాణం చేస్తూ నయినా, ఆఫీసులో కుర్చీలో కూర్చుని అయినా మనస్సులో స్మరిస్తాను. అలా చేయడం తప్పేమోనని ఒకవైపున బాధ. నా విధిని నేను సక్రమంగా చేయలేక పోతున్నానని మరొకవంక వేదన... ఏమి చేయమంటా వమ్మా ?"

అమ్మ ఏమి పరిశీలిస్తున్నదో, ఏమి అనుగ్రహిస్తున్నదో - వారిని తదేకంగా అవలోకిస్తూ ఉంది. ఏమీ మాట్లాడ లేదు.

వారు మళ్ళీ అడిగారు. "నేను చేస్తున్నది తప్పా అమ్మా ?"

దయా ప్రపూర్ణమయిన స్వరంతో అమ్మ అతి మృదువుగా అన్నది "కాదు, నాన్నా -"

వారి బాధ కేదో విముక్తి ప్రసాదింపబడుతున్నట్లు స్ఫురించింది. వెంటనే మళ్ళీ అడిగారు, "అయితే అలానే చేసుకోమంటావా, అమ్మా -"

"చేసుకో నాన్నా. నీకు ఎట్లా అవకాశం ఉంటే అట్లాగే చేసుకో. నిష్ఠలూ నియమాలూ మనం ఏర్పరుచుకున్నవే. మడి అంటే - హద్దు అనే గదా. అది శుచికోసం శుభ్రతకోసం ఏర్పడ్డది. శరీరం శుభ్రంగా ఉంటే మనస్సుకూడా నిర్మలంగా ఉంటుందని ఊహ. అది అందుకు సహాయం చేస్తుంది కూడా. నీకు అందుకు అవకాశం లేకనో, అవసరం లేకనో నీవు అట్లా చేయవనుకో. అదేమీ తప్పు కాదు. నీ ఆశయం ఏమిటీ అంటే... మడి కట్టుకో, కట్టుకోకపో మంత్రం జపించూ, ధ్యానం చెయ్యి, ఏ సాధన అయినా మనస్సుకు ఏకాగ్రత సంపాదించుకోవడం కోసం. ఆ ఏకాగ్రతతో యీ మనస్సూ, అంటే ఈ శరీరాన్ని ఆశ్రయించుకుని ఉన్న మనస్సూ, సర్వవ్యాప్తమై ఉన్న మహాచైతన్యమూ ఒక్కటే నని తెలుసుకోవడమే జ్ఞానం....".

అత్యంత శ్రద్ధతోనూ ఆనందంతోనూ వారు ఆలకిస్తున్నారు. మనస్సులోని ఆనందం స్పష్టంగా వారి ముఖంలో కనుపిస్తున్నది.

అమ్మ మళ్ళీ చెప్పడం మొదలు పెట్టింది.

"ఆ తెలుసుకోవడం వల్ల మనస్సు అనేక బంధాలనుండీ, బాధల నుండీ భయాలనుండీ విముక్తి పొందుతుంది. అవిచ్ఛిన్న మయిన అనిర్వచనీయ మయిన ఆనందం అనుభవిస్తుంది. ఏ సాధనవల్ల నయినా మనిషి కోరుకునేది తృప్తీ ఆనందమూయేగదా. అవి జ్ఞానంవల్ల కలుగుతాయి. జ్ఞానం మనస్సువల్ల

కలుగుతుంది. అందుకు ఏకాగ్రత కావాలి. అది ఎవరికి ఏవిధంగా లభ్యపడితే అట్లాగే చేయవచ్చును. ఇందులో మంచి చెడ్డలూ లేవు; తప్పొప్పులూ లేవు..."

ఇంతలో చేతికి అందించబడిన బిస్కట్లు వారి నోట్లో పెడుతూ అమ్మ చెప్పింది..... భౌతిక మానసిక అవసరాలను రెంటినీ ఒకేసారి తీరుస్తూ.

"కాలం మారిపోయింది నాన్నా, కాలాన్ని అనుసరించి మన ఆలోచనలూ పద్ధతులూ మారాలి. నువ్వు పుట్టిన కులాన్ని బట్టి జపతపాలు నీ స్వధర్మం అనుకుంటున్నావు. కులాలు వృత్తిని బట్టి ఏర్పడ్డవే. ఇప్పుడు నీ వృత్తి వేరు. దాన్ని బట్టే నీ ధర్మం. నీ ఉద్యోగంలో నీవు నీతీ నిజాయితీలతో ఉండడమే నీ ధర్మం. దాన్ని సక్రమంగా పాటిస్తే మరింకేమీ అవసరం లేదు. కానీ ఈ వృత్తి ధర్మాన్ని అతిక్రమించి మనస్సు ఇంకేమయినా కోరితే దానినీ నెరవేర్చవలసిందే. లేకపోతే మనస్సులో అసంతృప్తితో అశాంతి చెలరేగుతుంది. అశాంతి కల మనిషి అనేక బాధలకు గుర్రై అశక్తుడవుతాడు. అతను జీవితంలో ఏమీ సాధించలేడు".

అమ్మ చాలా ఓపిగ్గా వారికి పాఠం చెబుతున్నట్లు వివరిస్తున్నది.

"నీకు వీలయినట్లు చేసుకో నాన్నా. నీ కెట్లా తృప్తిగా ఉంటే అట్లా చేసుకో. సంకోచాలు ఏమీ వద్దు -"

అమ్మ నిర్ద్వంద్వంగా వారికి సలహా ఇచ్చింది. వారు అమితానందభరితులయ్యారు.

అమ్మ అనేక సందర్భాల్లో - యాంత్రికంగా అనుసరించే ఆచారాలను ఖండించింది. అమ్మ మనస్సుకు అత్యంత ప్రాముఖ్యాన్ని ఇస్తున్నది. సర్వవ్యాప్తమూ సర్వమూ అయిన చైతన్యం యావద్విశ్వాన్నీ నడుపుతున్నట్లు, ఆ చైతన్యం యొక్క భాగం అయిన మనస్సే మనిషిని నడుపు తున్నట్లు అమ్మ చెబుతున్నది.

అయితే యీ మనస్సు పరిస్థితులకూ పరిసరాలకూ కాలానికీ బద్ధంకాక స్వతంత్రమై స్వచ్ఛమై మహాచైతన్యంతో తనకు గల తాదాత్మ్యాన్ని గుర్తించి "ఇదంతా నాదే; ఇదంతా నేనే" అని భావించగలిగితే - ఈ మనస్సే దైవం అని అమ్మ ప్రవచిస్తున్నది.

ఆ ప్రవచనం అమ్మపట్ల అక్షరాలా సత్యం కనుకనే అమ్మ జగదారాధ్య అయి మనకు సాధికారంగా మార్గ ప్రబోధం చేస్తున్నది.

(ఏప్రిల్ 1980)



# 151
# సర్వ నివేదన

1980 మే 20వ తేదీ రాత్రి తొమ్మిది గంటలయింది. గగన తలంలో నీలనీరదాలు మందగమనం చేస్తున్నాయి. అక్కడక్కడ నక్షత్రాలు మెరుస్తున్నాయి. మంటలగాలులు విలయంగా వీస్తున్నాయి. అందరి శరీరాలూ మూడు రోజుల నుండీ కాస్తున్న ప్రపంచాగ్ని తీవ్రతకూ, వీస్తున్న వడగాలుల తాపానికీ తుకతుక ఉడికిపోతున్నాయి.

అమ్మ గదికి ఉత్తరంగా సంగీత కళాకారులూ రసజ్ఞులయిన కొద్దిమంది శ్రోతలూ ఆసీనులై ఉన్నారు. వాద్యాలు సిద్ధమై ఉన్నాయి. మైకు సెట్టు అమర్చబడి ఉంది. టేపు రికార్డరు ఆయత్తమై ఉంది.

1938 మే 5న అమ్మ వివాహమయింది. ఇపుడు జిల్లెళ్ళ మూడిలో ప్రముఖంగా జరిగే ఉత్సవాల్లో అమ్మ కల్యాణ దినోత్సవం ఒకటి.

ఈ సంవత్సరం ఆ ఉత్సవాల జాబితాలో మరో పండుగ చేర్చబడింది. అది పెండ్లి పదహారురోజుల పండుగ. ఈ ఉత్సవం జరుపు కొందామని సోదరుడు శ్రీ కాసు రాధాకృష్ణరెడ్డి సూచనచేస్తూ.. ఆనాడు తాను అమ్మ - నాన్నగార్లకు పూజచేసుకుని, 'స్వర నివేదన' చేసుకుంటానని తన అభీష్టాన్ని అభివ్యక్తం చేశాడు.

అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చకచకా సాగాయి. తత్ఫలితంగానే విజయవాడ నుంచి ప్రఖ్యాత మృదంగ కళాకారులు శ్రీ మహదేవు రాధాకృష్ణరాజు, సుప్రసిద్ధ వాయులీన విద్వాంసులు శ్రీ కోటిపల్లి ప్రకాశరావు, ఏలూరు నుంచి కంజరీవాద్య నిపుణులు శ్రీ మంతెన త్యాగరాజు వచ్చారు. బాపట్ల నుంచి సంగీత కళా కోవిదులు శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖరం వారి శిష్యురాలు కుమారి జొన్నలగడ్డ రత్నమాల తంబుర మీటడానికి వచ్చారు.

అమ్మా నాన్నగారూ వచ్చి మంచంపై ప్రక్క ప్రక్కన కూర్చున్నారు. ముందుగా రాధాకృష్ణరెడ్డి అమ్మకూ, నాన్నగారికీ నూతన వస్త్రాలు సమర్పించి వారి గళసీమల

మల్లికామాలలు వేసి అష్టోత్తర శతనామావళి చదువుతూ తమలపాకులతో పూలతో పూజ చేసుకున్నాడు. తర్వాత కళాకారులందరూ అమ్మను పూజించుకున్నారు.

అమ్మ అందరికీ నూతన వస్త్రాలు ప్రసాదించి ఆశీర్వదించింది.

రాగప్రస్తారం ప్రారంభమయింది. నాగరాగంతో కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు రాధాకృష్ణరెడ్డి. ప్రారంభమే అనితరసాధ్యంగా, మహోజ్వలంగా సాగింది. రాధాకృష్ణరెడ్డి గాత్రం అతి గంభీరంగానూ, అత్యంత మధురంగానూ నినదించింది. అప్పటిదాకా ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్న గుండెలు ఒక్కసారిగా రసప్లావితమైనట్లు పులకించాయి.

అన్ని సంగీత కచ్చేరీలవలె రాధాకృష్ణరెడ్డి కృతులు గానం చేయదలుచుకోలేదు. రాగం, తానం, పల్లవితో రసవర్షం కురిపించాలని అతని అభిలాష. అతడు నాదోపాసకుడు; సంగీత తపస్వి, అమ్మయందు అచంచల భక్తి విశ్వాసాలు గల విశుద్ధ యోగి. అనుక్షణం అమ్మ నామ సంకీర్తనలో తన్మయమైపోయే రాగజీవి, రససిద్ధుడు.

ఆరితేరిన కళాకారులు గాయకుని మానసికగతి ననుసరించి అత్యంతోత్సాహంతో రసోత్పత్తికి ప్రయత్నం చేస్తున్నారు.

శ్రోతలు రసార్ద్ర మానసులై మైమరిచిపోయారు.

గానలోల, సంగీతప్రియ, రాగమయి, నాదస్వరూపిణి, ఓంకార మూర్తి, వాగీశ్వరి అవతారం అయిన అమ్మ ప్రధాన శ్రోతయై రాధాకృష్ణ రెడ్డిపై వాత్సల్య పీయూషధారలు కురిపిస్తూ కూర్చున్నది.

ఆ అపురూప సన్నివేశం - గాంధర్వలోకమే భువికి దిగి వచ్చిందా అన్నట్లున్నది. ఆ సమయంలో 'రాధ'ను చూస్తే ఒక నారదుడు, ఒక తుంబురుడు, ఒక త్యాగయ్య, ఒక తాన్‌సేన్ - ఒకరేమిటీ ? .... అందరూ కలిసి ఒక ఆకృతి ధరించి అమ్మ సేవ చేసుకుంటున్నారా -- అనిపించేటట్లు కనిపించాడు. అమ్మ ప్రసాదించిన ఆకుపచ్చ అంచుగల ఖద్దరూ ధోవతీ, ఉత్తరీయం పైన కప్పుకోగా వాటిపై అమ్మ అతణ్ణి ఆశీర్వదిస్తూ అలంకరించిన మల్లెపూలదండ సువాసనలు విరజిమ్ముతూ ఉంటే - అతని నిండయిన విగ్రహమూ, ఆ ఠీవీ సంగీతమే ఒక సమ్రాట్టు రూపం ధరించి రసరాజ్య అవిష్కరణకు పూనుకున్నదా - అనిపించింది. అతడు గళమెత్తి గానం చేస్తుంటే వాద తరంగాలు ఉప్పొంగినట్లున్నాయి. రసవృష్టిలో ప్రకృతియే వివశత్వం

పొందింది. ఆ వాతావరణమంతా ఆనందమయమై దివ్యమై రాగమయమై రమణీయమై పోయింది. అందరి మనస్సులూ అనిర్వచనీయమైన ఆనందంతో మయూరాలై నర్తించాయి.

అతడు ఎవరికోసమో, ఎవరిని ఆనందపరచటం కోసమో పాడడం లేదు. తనకోసమే తాను పాడుకుంటున్నాడు. అతనికి అదొక సాధన. అదొక తపస్సు. అదొక ఆరాధన. అతని మనస్సు నుండి పై కుబికిన తీవ్రవేదన అతని ఆరాధ్య దేవతకు స్వర నివేదన

అతడు రాగాలాపన చేస్తుంటే - అతని రక్త మాంసాదులే రాగరూపం ధరించి అమ్మ అరుణ చరణ కమలాలకు అభిషేకం చేస్తున్నట్లూ పారాణి పెడుతున్నట్లూ ఉన్నది. అతని పంచప్రాణాలే సప్తస్వరాలై అమ్మను స్తుతిస్తున్నట్లు తోచింది.

అది స్వర నివేదన మాత్రమే కాదు. అతని సర్వ నివేదన; ఆత్మ సమర్పణ అతనిలోని అణువణువూ స్వరంగా మారి 'హరి హర హిరణ్య గర్భ సంసేవిత దివ్యచరణా'ల మ్రోల మోకరిల్లటానికి తహ తహ లాడుతున్నట్లు కనిపించింది. ఒక్కొక్షణంలో అతడు స్వరాలతోనే తాదాత్మ్యం చెందుతున్నాడో, సర్వేశ్వరిలోనే ఐక్యం పొందుతున్నాడో - తెలియడం లేదు.

నాట, శ్రీరంజని, అమృతవర్షిణి, మోహన, భూపాల, బిలహరి. . ఎన్నో రాగాలు రసవీచికలై సాగాయి. 'ఇతర దైవమును వేడను ఇది నిజము నిజము...' అని జలధరగంభీరమైన అతని గళం నుండి నాటరాగంలో వినిపిస్తుంటే అతని ప్రగాఢ విశ్వాసం ప్రస్ఫుటమవుతోంది.

శ్రీ రాధాకృష్ణ శర్మగారిచే రచింపబడ్డ అమ్మ అష్టోత్తర శత నామస్తోత్రం రాగమాలికలో అతి మనోజ్ఞంగా వినిపించింది.

తుది ఘట్టంలో అమ్మనామం గానం చేశాడు ఆ గానం చేసిన తీరూ, ఆ రాగమూ, ఆ తాళమూ అనుపమానంగా సాగి శ్రోతల మనస్సులను దైవోన్ముఖం చేశాయి. వాద్యాలు పూర్తిగా సహకరిస్తూ వల్లభుని అడుగుజాడలలో నడిచే కులకాంతలనూ, ఆచార్యుని అనుగమనించే సచ్ఛాత్రులనూ, నాయకుని అనుసరించే సైనికులనూ స్ఫురింపచేశాయి.



రసవృష్టి ప్రభావం వలన మంటలగాలులు మలయ పవనాలై అందరినీ మైమరపింప చేశాయి. శ్రోతలు లోకాన్నీ కాలాన్నీ విస్మరించారు.........................

రాత్రి 1 30 ని.లకు నాదోపసంహారంచేసి రాధ అమ్మ పదపీఠిపై నతమస్తకు డైనాడు. కళాకారులందరూ అమ్మకు పాదాభివందనం చేసుకొని - తామందరూకూడా మైమరిచి పోయినామని నివేదించుకున్నారు. స్వరగంగలో సుస్నాత అయిన ప్రకృతి ప్రశాంతమై శీతలమైంది.

సభానంతరం అమ్మ కళాకారు లందరికీ తీయని మామిడిపండు ముక్కలు తన చేతిమీదుగా పెట్టి వారిచే తినిపిస్తూ.... "రాధ 1963లోనే ఇక్కడకు వచ్చినా, ఇంతవరకు నాకు 'యిది' కావాలి. అని అడగలేదు. ఈసారి ఈ వాద్యాలు పిలిపించండి; ఈ పూజ చేసుకుంటానూ - అని అడిగాడు. వాడికేం కావాలో వాడికే తెలీదు" అని అమ్మ అంటుంటే అమ్మకంఠం రుద్ధమై కన్నులు చెమ్మగిల్లాయి.

ఏ కళగానీ - ఏ విద్యగానీ - అవి మానవుడ్ని ఆ కళలోనో, విద్యలోనో తాదాత్మ్యం చెందించి సర్వేశ్వర పాదాంకితం చేయగలిగిన నాడే - వాటికి పరిపక్వతా, పరిపూర్ణతా, పరమ ప్రయోజనమూ.

ఆనాడట్టి దివ్య సన్నివేశం అవిష్కృతమయింది.

రాగమయి అమ్మ; రాగసాధకుడు రాధ.

నాదస్వరూపపిణి అమ్మ; నాదోపాసకుడు రాధ.

రసోదధి అమ్మ; రసతరంగిణి రాధ

(మే 1980)



**అమ్మ**

తన యిష్టప్రకారమే ఇతరులను నడిపిస్తూ - ఇతరుల ఇష్టప్రకారమే తాను నడుస్తున్నట్లు అనిపింపజేసేది 'అమ్మ'.

\- అమ్మ

# 152
# వాత్సల్య రూపిణి

ఈ నెల 19వ తేదీ ఉదయం 6 గంటల సమయం. వాతావరణం అత్యంత ఆహ్లాదకరంగా ఉంది ఆకాశంలో అక్కడక్కడో మబ్బుతునక కనిపిస్తోంది.

అమ్మకు నమస్కారం చేసుకుందామని అమ్మ గదిలోకి వెళ్ళాను. అమ్మ మంచంపై పడుకుని ఉంది ప్రణమిల్లాను అమ్మ నుండి పలకరింపు లేదు. మామూలుగా ఆ తరుణంలో అమ్మ పలకరిస్తుంది. అందువల్ల ఆశ్చర్యంగా అమ్మవంక చూశాను. అంతకంటే విభ్రమచకితం చేస్తూ అమ్మ కళ్ళనిండా నీళ్ళు కారణం అర్థంకాలేదు. ఏమిటమ్మా ? - అన్నాను. మౌనమే సమాధానం. కారణాలు వెతుక్కోవడం ఆరంభించాను.

అంతలో సోదరుడు రిచర్డ్ షిప్‌మన్ గడపదాకా వచ్చి - లోపలికి చూసి వెనుదిరిగాడు. నేను ఏమయినా అంతరంగిక విషయాలు మాట్లాడుతున్నాని భ్రమించి అలా వెళుతున్నాడేమో - నని నేనే అతణ్ణి లోపలికి పిలిచాను.

అతను లోపలికి వచ్చి కూర్చున్నాడు.

అమ్మ ఒకసారి రిచర్డ్‌ను చూచి నన్ను ఉద్దేశించి 'రిచర్డ్ రేపే వెళ్ళిపోవాలట' అన్నది అమ్మ రిచర్డ్‌ను చూచిన చూపులో ఎంతో వాత్సల్యం ఉంది; ఎంతో కారుణ్యం ఉంది పైగా ఎంతో దీనత్వం ఉంది. ఆ దీనత్వమే మనల్ని మాయ చేస్తుంది. తానేమీ చేయలేని అశక్తతను ఆ చూపు తెలియజేస్తుంది. ఏమయినా చేయగల అమ్మ తనకేమీ చేతగాదని మనకు తెలియజేయాలనుకోవడం అమ్మలోని ఒక ప్రత్యేక లక్షణం. సాధారణంగా మనుషులు తమకు తెలిసిన దానికంటే ఎక్కువ తెలిసినట్లూ, తమకు చేతనయిన దానికంటే ఎక్కువ చేయగలిగినట్లూ నటిస్తూ ఇతరులను భ్రమలో ముంచెత్తటానికి శతథా ప్రయత్నిస్తుంటారు. అమ్మ విధానం సాధారణ మానవ నైజానికి పూర్తి వ్యతిరేకం !

"అతనికి వెళ్ళాలని ఉండి - అతను వెళితే మనకూ బాధ లేదు. అతను ఇక్కడనే ఉండాలని అనుకుంటున్నాడు. ప్రభుత్వమేమో బలవంతాన పంపిస్తున్నది'

అంటున్న అమ్మ కంఠం రుద్ధమై పోయింది. కళ్ళు టపటపా వర్షించాయి. అమ్మను చూసిన నా మనసూ ఆర్ద్రమైపోయింది.

'అమ్మ నిన్ను గురించి కన్నీళ్ళు కారుస్తున్నది' అన్నాను రిచర్డ్‌తో. ఆ మాట వినగానే అతని మనస్సు మరింత బాధపడ్డట్లు అతని ముఖం మరింత ఎఱ్ఱబడింది. అతను కొంచెంగా ముందుకు జరిగి "నిన్న అమ్మ నాకు హామీ నిచ్చింది. మళ్ళీ ఇక్కడకు తీసుకుని వస్తానుగా అని. అప్పటి నుండి నాకు ధైర్యంగానే ఉన్నది. నేనిప్పుడు అంతగా బాధపడడం లేదు-" అన్నాడు, నాకు చెబుతున్నట్లుగానే. కానీ అతడు అమ్మనే చూస్తున్నాడు. ఆ చూపులు ఎంతో ప్రేమా, మరెంతో కృతజ్ఞతా భావమూ మిళితం చేసుకుని అమ్మ చరణాలను పెనవేసుకుంటున్నట్లున్నాయి.

రిచర్డ్ షిఫ్‌మన్ అమెరికా దేశస్థుడు. షుమారు 27 సంవత్సరాల వయస్సు మాత్రం ఉంటుంది. బ్రహ్మచారి. అత్యంత శాంతస్వభావం కలవాడు. పరిమితభాషి, అతిమృదువుగా మాట్లాడుతాడు. ఏ వేళలోనూ ఏ విధంగానూ ఎవరికీ బాధాకరంగా ప్రవర్తించడు. అమ్మ యందు అచంచలమయిన భక్తి విశ్వాసాలు కలవాడు. అమ్మలో దైవాన్ని చూడగలిగినవాడు. తాత్విక చింతన కలవాడు. అమ్మ చరిత్రను, అమ్మ సిద్ధాంతాలను నిత్యమూ అధ్యయనం చేస్తాడు. సులభమయిన ఇంగ్లీషు భాషలో అమ్మను ఇంగ్లీషుభాష తెలిసిన వారికి తెలియజేయడానికి తీవ్రమయిన కృషి చేస్తున్నాడు.

రిచర్డ్ మొట్ట మొదటిసారిగా అమ్మను 1975లో నెల్లూరులో డాక్టర్ ఎస్. వి. సుబ్బారావుగారింటిలో చూచాడు. 1976లో జిల్లెళ్ళమూడి వచ్చి ఆరునెలలు ఉన్నాడు. అతనికి అమ్మ ఆరాధ్యమయింది అమ్మ నివసించే ఆవరణం పరమాప్తమయింది.

అతను అమెరికా వెళ్ళిన తర్వాతకూడా అతను తిరిగి జిల్లెళ్ళమూడి రావాలని తహతహలాడిపోయాడు. జిల్లెళ్ళమూడిలోని 'అందరిల్లు'ను తన స్వంత యిల్లుగానే మనఃపూర్తిగా భావించాడు. కనుకనే అందరింటి అన్ని అభివృద్ధి కార్యక్రమాల్లోనూ ఉత్సాహంగా పాల్గొంటాడు.

రోజూ అమ్మకు కావలసిన చందనం తానొక్కడే గంటలకొద్దీ కూర్చుని తయారు చేస్తాడు. అవకాశం లభ్యమయితే చాలు, అమ్మ సన్నిధిలో ఎన్ని గంటలయినా మౌనంగా కూర్చుంటాడు

ప్రతినెలా ప్రచురింపబడే ఇంగ్లీషు మాసపత్రికకు ప్రస్తుతం తానే సంపాదకుడు. అమ్మను గురించి ఒక గ్రంథం కూడా ప్రచురణకు సిద్ధంచేశాడు. దానిని

మనదేశంలోనే మన ప్రెస్సులోనే ముద్రించాలనుకున్నాడు కానీ ప్రభుత్వం ఇక్కడ నివసించడానికి అనుమతి ఇవ్వనికారణంగా అమెరికా వెళుతున్నాడు కనుక అక్కడ ప్రచురిస్తానని చెప్పాడు.

"అమ్మా - ఇదీ ఒక విధంగా మంచిదే. ఇంతవరకు నిన్ను గురించిన గ్రంథం ఒక్కటికూడా విదేశాల్లో ప్రచురితం కాలేదు. ఇతను అమెరికా వెళితే ఆ లోటూ తీరుతుంది'' అన్నాను.

"అతను ఇక్కడ ఉండేటట్లు చూడండీ. ఆ పుస్తకం ఇక్కడనే అచ్చువేయించ వచ్చును. అతను ఇక్కడ ఉండగలిగితే - ఆ పుస్తకం ముద్రణ కాకపోయినా సరే। ఎన్ని పుస్తకాలు ప్రచురించినా - అతనికి ఇక్కడ ఉన్నట్లుగా ఉండదుగా'' అన్నది అమ్మ. ఆ స్వరంలో ఎంతో మార్దవమూ సానుభూతీ స్ఫురించాయి.

పూర్వం ఒకసారి 68వ సంవత్సరాల మార్వా అనే అమెరికా సోదరి కొంతకాలం అమ్మసన్నిధిలో ఉండి అమెరికా వెళుతూ "అమ్మా - నేను వెళ్ళి ఉద్యోగం చేసి డబ్బు కూడపెడతాను. ఆ డబ్బుతో నీకు కారు కొని పంపేదా ? లేక నేను మళ్ళీ నీ వద్దకు వచ్చేదా ?'' అని అమ్మను అడిగింది. అమ్మ వెంటనే "నీవే రా'' అని సలహా చెప్పింది.

పుస్తకాలూ వద్దూ, ప్రచురణలూ వద్దూ - అతను ఉండగలిగితే చాలూ.... అంటున్న అమ్మను చూస్తే, మార్వా సంఘటన స్మృతిలో మెదలి 'అమ్మకు మనపై గల ప్రేమ' వ్యక్తమవుతూ అవ్యక్తానంద రసోదధిలో ముంచెత్తింది.

'అమ్మా అతడు ధైర్యంగా వెళతానంటుంటే నీ వెందుకమ్మా దిగులుపడతావు!' అని అడిగాను. "అదే అర్థం కావడంలేదురా. మీకున్న గుండెనిబ్బరం నాకు లేదు. వాడ్ని చూడకుండా నేనుండలేనని కాదు; నన్ను చూడకుండా వాడుండలేక బాధ పడతాడేమోనని'' అని వివరించింది అమ్మ. ఆ వివరణలో మమతామృత రహస్యం ఉంది

ఈ నెల 16వ తేదీన గుంటూరు నుండి ఒక సోదరి వచ్చింది. ఆమె అమ్మ వద్ద కూర్చుని తన క్లిష్టసమస్యను అమ్మకు నివేదించుకున్నది. తమకు ఒకతే కూతురు. మగపిల్లలు లేరు. ఆ అమ్మాయికి పెండ్లి చేశారు. అల్లుడు అమెరికాలో ఉన్నాడు. అమ్మాయికూడా అక్కడకు వెళ్ళింది. ఇద్దరూ ఉద్యోగం చేసుకుని బాగా సంపాదిస్తున్నారు. ఇద్దరూఅన్యోన్యంగా ప్రేమగానే ఉంటారు. అయితేనేం, ఆ అమ్మాయికి శాంతి లేదు. చిన్నప్పటి నుంచీ తల్లిదండ్రులవద్ద గారాబంగా పెరిగినందున - అమ్మాయికి తలిదండ్రులంటే అమితమయిన ప్రేమ. వాళ్ళను

వదిలి ఉండలేని స్థితి. ఆ పరిస్థితి భర్తకు ఇష్టం లేదు. ఆ మాట కూడా అతడు సహించలేడు. వాళ్ళను స్మరించకుండా అమ్మాయి ఉండలేదు. కూతురయినా, కొడుకయినా ఆ తల్లిదండ్రులకు తానొక్కతే కనుక దగ్గర పెట్టుకుని పోషించవలసిన బాధ్యత లేదా - అని అమ్మాయి ప్రశ్న. ఈ కారణంగా వాళ్ళిద్దరి మధ్య ఘర్షణ. దాన్ని తట్టుకోలేక అమ్మాయి ఆత్మహత్యా ప్రయత్నం. పరిస్థితులను విపులీకరిస్తూ "అమ్మా మేము ఎలాగయినా ఉంటాము. మా ఎడబాటులో అమ్మాయి ఉండలేక పోతున్నది. మమ్మల్ని మరచి పొమ్మంటున్నాం. కాని అమ్మాయి నిరంతరం మమ్మల్ని గురించే ఆలోచిస్తుంది."

మధ్యలోనే అమ్మ ప్రశ్నించింది "మీరు మరిచి పోగలరా?" అని.

ఆమె ఒక క్షణం మౌనంగా ఉన్నప్పటికీ మరుక్షణంలోనే 'మరిచిపోలే మమ్మా' - అన్నది.

"ఈ పరిస్థితిలో ఏమి చేయమంటావో చెప్పమ్మా" ఆమె యింతవరకూ కన్నీళ్ళతోనే ఉన్నది. ఇప్పుడా కన్నీరు వాగైంది.

"నేనూ అదే స్థితిలో ఉన్నాను. మీకేం సలహా ఇవ్వగలనమ్మా ?" అన్నది అమ్మ. ఆమెను దగ్గరకు తీసుకుని తల నిమురుతూ.

"నీవూ చెప్పకపోతే నేనేం చేయగలనమ్మా ? నీవే యీ దుఃఖానికి నివారణోపాయం చెబుతావని గంపెడు ఆశతో నమ్మకంతో వచ్చాను." ఆమె ప్రాధేయ పూర్వకంగా అడిగింది.

"మీ ఆశనూ, నమ్మకాన్నీ నేను కాదనడం లేదు. కానీ ఈ తల్లీ బిడ్డల బంధాన్ని ఎవరు తెంపగలరు ? ఎవరు తెంపుకోగలరూ ? ఒకళ్ళ నొకళ్ళు మరవాలంటే మాటలా ?" అమ్మ సూటిగా ప్రశ్నించింది.

మాతృప్రేమకూ, పుత్రవాత్సల్యానికీ ప్రతీకగా రూపు దాల్చిన అమ్మ మరో విధంగా ఎట్లా చెబుతుందీ ? ఏమి చెబుతుందీ ??

ఈ నెల 2వ తేదీన - అమ్మగదిలో ఉండే పిల్లినీ, పిల్లి పిల్లలనూ ఒక గోతంలో వేసుకుని - వాటిని మరో ఊరిలో వదిలిరావడానికి ప్రయత్నం జరిగింది అంతలో ఈ విషయం అమ్మకు తెలిసింది. అమ్మ ఆ ప్రయత్నం విరమించి వాటిని స్వేచ్ఛగా వదిలి వేయమని ఆదేశించింది.

అవి అమ్మగదిలో ఉండడంవరకు ఎవరికీ అభ్యంతరం లేదు. అవి అటూ ఇటూ దూకుతూ ఆడుకుంటాయి. అది అందరికీ ముచ్చటగానే ఉంటుంది.

కానీ మంచీచెడ్డలూ ఉచితానుచితాలూ తెలియని జంతువులు కనుక అవి అమ్మ మంచంమీద కెక్కుతాయి. అమ్మ సింహాసనం మీదకు ఎక్కుతాయి. అయినా ఎలాగో సహించ వచ్చును. కానీ అవి వాటిపైననే మలమూత్ర విసర్జన చేయడం మొదలు పెట్టాయి. అమ్మగుడ్డలతో ఆడుకుంటూ చింపేవి. చివరకు పిల్లలకు ఆహారంకోసం రోజూ రాత్రిళ్ళు ఆ పిల్లి ఎలుకలను చంపి అమ్మగదిలోకి తీసుకు వచ్చేది తెల్లవారేసరికి గది అంతా రక్తపు మరకలు; మాంసపు ముక్కలు.....

ఇక ఆ దృశ్యాలను చూడలేక, ఆ పరిస్థితిని సహించలేక మేము ఆ ఆలోచన చేశాము. అమ్మ అంగీకరించలేదు. సరికదా - "మీరు బజారుకు వెళ్ళారనుకోండి. అక్కడ మంచి పండ్లు కనుపిస్తాయి. వాటిని కొనుక్కువచ్చి మీ పిల్లలకు పెడదామనుకోరూ ? తోటలో మంచి కూర గాయలను చూస్తే కోసుకువచ్చి కూరచేసి మీ పిల్లలకు పెట్టాలని కోరుకోరూ ? అవీ అంతే దాన్ని గురించి ఇంత ఆలోచనా, అల్లరీ ఎందుకూ ?" అని అమ్మ చురుగ్గా మందలించింది.

రోజూ సరదాగా తన సాన్నిధ్యంలో ఆడుకునే ఆ పిల్లులుకూడా తనను వదిలి వెళ్ళిపోవడం అమ్మకు దుర్భర మనిపించింది. ఆ పిల్లుల యందుకూడా తనకు వాత్సల్యమే.

ఒకసారి తనకు నివేదన చేయబోయే అన్నాన్ని "పిల్లి ముట్టుకున్న దమ్మా' అంటే "పిల్ల ముట్టుకున్నది" అని సరిచేసిన అమ్మ సర్వమాతృత్వం సర్వజగతినీ సమ్ముగ్ధులను చేస్తుంది.

అమ్మ ప్రతిమాటలోనూ ప్రతి చేతలోనూ - అవి ఎంత చిన్నవయినా, పెద్దవయినా సర్వత్రానురాగ సుమధుర పరిమళాలు గుబాళిస్తుంటాయి. అయితే వాటిని ఆఘ్రాణించగల, అర్థం చేసుకొనగల, అనుభవించగల నేర్పు ఉండాలి మరి - ఆ నేర్పునూ అమ్మే అనుగ్రహించాలి.

అందుకనే ఎవరు ఏ ప్రయత్నం చేసినా, ఏ సాధన చేసినా ఆ అనుగ్రహం సంపాదించడం కోసమే ననిపిస్తుంది.

అమ్మ - ఆ సాధనకూడా అనుగ్రహం ఉంటేనే సాగుతుంది - అంటుంది.

(జూన్ 1980)



# 153
# ఆబ్దికాలు

ఈ నెల 16వ తేదీన మా తండ్రి ఆబ్దికం  మా అక్కయ్య, మా చెల్లెలు, మా తమ్ముడు, నేను అందరం కలిసి అమ్మపాదాలు కడిగి పూజ చేసుకుని అమ్మకు మహానివేదన చేసుకున్నాము.

మామూలుగా ఆబ్దికంరోజున నివేదనకు - అన్నం, మూడు కూరలు, మూడు పచ్చళ్ళు, పప్పు, పులుసు, పరమాన్నం, గారెలు, పెరుగు.... అనేకం తయారు చేయబడతాయి.

అన్నీ నివేదన చేశాము.

మామూలుగా రోజూ అమ్మ అన్నంగానీ, మరి యే ఇతర ఘనపదార్థంగానీ తీసుకొనరుగదా.  కానీ ఇటువంటి సందర్భంలో అమ్మ అన్ని పదార్థాలనూ రుచిచూస్తుంది.

ఒక్కొక్క పదార్థమూ కొద్దిగా నయినా - అమ్మ తీసుకున్నది.

మనం భక్తితో నివేదన చేసుకున్నది ఎంతో ప్రేమతో అమ్మ స్వీకరించిందీ - అన్న తృప్తితోపాటు, మూడుతరాల మా తండ్రులూ తాతలూ ఒక్కసారిగా మా ముందుకు వచ్చి సుఖాసీనులై మేము పెట్టిన భోజనం స్వీకరించి పరి తృప్తులయినంత మహాదానందం కలిగింది.

1963 నుంచి మేము యిట్లాగే అమ్మకు నివేదన చేసుకుని - ఎంతో తృప్తినీ, ఆనందాన్నీ పొందుతున్నాము.  అమ్మకు నివేదన చేస్తే పితృదేవతలకు నివేదన చేసినట్లేనని భావిస్తున్నామూ; విశ్వసిస్తున్నాము.  మరి, అమ్మ సర్వదేవతా స్వరూపిణి కదా !

జిల్లెళ్లమూడి తరుచుగా వచ్చే ఎందరో - ఈ విధమయిన విశ్వాసంతో తమ తల్లిదండ్రుల ఆబ్దికాలు అమ్మ సమక్షంలో పెట్టుకొనడం జరుగుతున్నది. ఆబ్దికాలు

పెట్టుకోవడం అంటే - శాస్త్రీయంగా, సంప్రదాయాను సారంగా మంత్రతంత్రాలతో పితృదేవతలను ఆవాహనచేసిగాని వారి ప్రతినిధులయిన భోక్తలకు భోజనం పెట్టడం జరగదు. అమ్మకు పూజ చేసుకొనడం, అమ్మకు నివేదన చేయడం - ఆ రోజున అన్నపూర్ణాలయంలో అందరికీ భోజనం పెట్టడం జరుగుతుంది.

అయితే ఇందులో మనకు ఒక వింతమయిన విషయం కనిపించి మనను కొంచెం తికమక పెడుతుంది.

మరణానంతర జీవితాన్ని అమ్మ అంగీకరించదు. పితృలోకాన్ని అంగీకరించదు. పితృదేవతలను అంగీకరించదు. జీవుడు ఒకడు ఉంటాడనీ, వాడు జనన మరణ వలయంలో పరిభ్రమిస్తుంటాడనీ అమ్మ సమ్మతించంలేదు. ఇక, వాడికి కొంత కాలం మాసం మాసమూ, తర్వాత సంవత్సరానికి ఒకసారీ వారసులు భోజనం పెట్టే అవసరం ఏమున్నదీ ?

హిందూ ధర్మశాస్త్రం పితృదేవతలకు తర్పణాలు విడవడం, భోజనాలు పెట్టడం విధిగా శాసిస్తున్నది ఈ విధిని విస్మరించడం మనకూ దోషమంటున్నాయి. పితృదేవత లకూ ముక్తి లేదంటున్నాయి. అందువల్లనే - పుత్రవిహీనులకు గతిర్నాస్తి - అని శాస్త్రాలు అభివర్ణిస్తున్నాయి. జీవుణ్ణి పున్నామనకరం నుండి రక్షించగలిగేది ఒక్క పుత్రుడు మాత్రమే నని ధర్మశాస్త్రాలు ఘంటాపథంగా చెబుతున్నాయి.

మరి - అమ్మ దేవుణ్ణి, దయ్యాల్ని, జన్మల్ని, కర్మల్ని, పాప పుణ్యాలను. .. వేటినీ నమ్మడంలేదు. సర్వసృష్టిలో మానవుడు ఒక భాగం మాత్రమేననీ - మానవునికి ఏ జన్మకు ఆ జన్మయే సర్వస్వతంత్రమనీ, ఆగామి సంచిత ప్రారబ్ద కర్మలు లేవనీ స్పష్టంగా ప్రకటిస్తున్నది.

కానీ - అమ్మ పితృదేవతల పేరుమీదుగా జరిగే అంత్యక్రియలనూ ఆబ్దికాలనూ అంగీకరిస్తున్నది.

ఒక సందర్భంలో ఒక సోదరుడు అమ్మను "మీరు పూజలు స్వీకరిస్తున్నారు; మరి, మీరు దైవమేనని అంగీకరిస్తున్నారా ?" అని ప్రశ్నించినపుడు "మీరయినా యీ పూజలు నాకని చేస్తున్నారా ? లక్ష్మి అనో, పార్వతి అనో, సరస్వతి అనో చేస్తున్నారు" అని సమాధానం చెప్పింది. అది నిజమే కావచ్చును; మనం ఆ దైవాలకో, దేవతలకో అనే పూజలు చేయవచ్చును. కానీ అమ్మ -- తాను నమ్మని దేవుళ్ళకూ దేవతలకూ ప్రతినిధిగా వ్యవహరిస్తున్నది గదా -- అని మనకు మళ్ళీ సందేహం కలగటం అత్యంత సహజం.

ఆలోచిస్తే - అందుకు రెండు కారణాలు స్ఫురిస్తున్నాయి.

ఒకటి -- ఎంతో భక్తినీ విశ్వాసాన్నీ మనసంతా నింపుకుని ఎంతో ప్రేమతో తన దగ్గరకు వచ్చిన బిడ్డలకు ఆశాభంగమూ, అసంతృప్తీ కలిగించడం అమ్మకు యిష్టం లేక కావచ్చును.

రెండవది -- మనిషి జీవితానికి సారధి అయిన మనస్సుకు అపారమయిన శక్తి సామర్థ్యాలున్నాయని అమ్మ చెబుతున్నది. మనిషికి ప్రధానమయినది మనస్సు మాత్రమేనని అమ్మ అభిప్రాయం. వేదాంతులు చెప్పే జీవాత్మను అమ్మ ఒప్పుకోవడము లేదు. ఈ సర్వసృష్టికీ ఆధారమైనదే శరీరంగానూ మనస్సుగానూ రెండుగానూ రూపొందిందీ అంటున్నది. ఈ రెంటికీ భిన్నమయిన ఆత్మ అనేది వేరేగా ఉండి ఈ రెంటినీ నడుపుతున్నది అనే సిద్ధాంతాన్ని అమ్మ నిరాకరిస్తున్నది.

ఈ మనస్సు ఎంత నిర్మలంగా ఉంటే అంత నిశితమౌతుంది. దానిని ఎంత కేంద్రీకృతం చేయగలిగితే అంత బలవంతమవుతుంది.

ఈ సాధనలూ పూజలూ అందుకు దోహదం చేస్తాయి. కనుక అమ్మ ఈ పూజలను నిరుత్సాహపరచడం లేదేమో ననిపిస్తున్నది. నిజానికి ఈ పూజల్లో అమ్మ పూజింపబడడంలో అమ్మకు భౌతికమయిన శ్రమ ఎంతైనా ఉన్నది. అయినప్పటికీ బిడ్డలపై అపారమయిన అనురాగంతో ఇందుకు ఒప్పుకుంటున్నదేమో ననికూడా అనిపిస్తున్నది.

అదీగాక - ఈ పూజల్లో అమ్మకు ఎక్కువకాలం వ్యయమవుతున్నది ఇది గమనించే ఒకసారి డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు - "అమ్మా - నీకు మా గురించే ఎక్కువకాలం ఖర్చు అవుతున్నదమ్మా -" అంటే "ఈ వ్యాపారంలో లాభనష్టాలు లేవు నాన్నా - " అన్నది అమ్మ. సంప్రదాయవాదులు భావిస్తున్నట్లు అమ్మకు లోపల, వెలుపల అన్న విభేదం లేదు. అమ్మ దృష్టిలో లోపల వెలుపలా అంతా ఒకటే.

అద్వైతమూర్తి అయిన అమ్మ అందువల్లనే ఈ పూజలనూ, ఆబ్దిక నివేదనలనూ అంగీకరిస్తున్నదేమో. ఏమయినా - మన ఊహల కంటే అమ్మ ముఖతః వింటే తృప్తిగా ఉంటుందని అమ్మనే అడిగాను.

"ఈ ఆబ్దికాలు చనిపోయినవారి కోసమని నేను అనుకోవడం లేదు. బ్రతికున్న వాళ్ళకోసమే. ఇది మీ శ్రద్ధనూ, కృతజ్ఞతా భావాన్నీ తెలియజేస్తుంది. మన

సంప్రదాయంలో ఎవరు సంపాదించింది వారే అనుభవించి నిశ్శేషం చేయక ముందుతరాలవారికి అంటూ నిల్వ చేస్తారు ఆ రకంగా మన పూర్వీకులు ఎంతో ప్రేమతో మనకు ఇచ్చిన ఆస్తి పాస్తులు మనం హాయిగా అనుభవిస్తున్నాం. అదీగాక -- మనకు అర్థంగాని విషయాల జోలికి మనం వెళ్ళకపోతే - మనకు ఈ శరీరాన్ని, రక్త మాంసాలను, గుణగణాలను ప్రసాదించింది మన పూర్వులే గదా. వారి వల్ల ఈ మాత్రమయినా కృతజ్ఞత తెలియజేయడం మన విధి'' అని అంటూ ''ఏమో ఇవన్నీ నాకెందుకూ ? మీరు తృప్తిగా భోజనం పెట్టారు. నేను తింటున్నాను. మీరు కూడా హాయిగా తినండీ.....'' అంటూ పళ్ళెంలో ఉన్న అన్ని పదార్థాలూ అమ్మ కలిపి ఒకే పదార్థంగా చేసింది. అది అమృతంవలే ఎంత రుచిగా ఉందో వర్ణించలేము.

ఒకసారి బాలాత్రిపురసుందరి అనే సోదరి ఇలాగే అన్ని పదార్థాలూ కలుపుకుని తిన్నదట -- ఆ పదార్థాలన్నీ అలాగే కలుపుకుంటే ఆ రుచి వస్తుందేమో ననుకుని. కానీ ఆ రుచి రాకపోగా ఆ సోదరికి వాంతులు అయి చాలా బాధ పెట్టాయి.

అంటే అమ్మ చేతిలో, ఆచేతి వెనుక ఉన్న అమ్మ హృదయంలో, ఆ హృదయం నిండిన వాత్సల్యంలో ఆ అమృతం ఉన్న దన్న మాట.

ఆ అమృతాన్ని తనివిదీరా, మనసారా అనుభవించక మనకు ఇన్ని ఆలోచనలూ అనుమానాలూ ఎందుకు ?

(జూలై 1980)



## అతీంద్రియం కాదు

'అది' ఇంద్రియ గోచరం కాదు అని అంటున్నారు. కాని - ఈ సృష్టి అంతా 'అదే' అని తెలుసుకున్నప్పుడు అది ఇంద్రియాతీతమే ఎట్లా అవుతుంది ? ఇంద్రియ గోచరమే.

- అమ్మ

# 154
# మాతృశ్రీ విద్యాలయం

అమ్మ మనిషిజీవితంలో సాధించవలసింది సాధించింది అధిరోహించ వలసిన శిఖరాగ్రం చేరింది. ఆశా అసంతృప్తుల కలయికే జీవితం - అని ప్రవచించిన అమ్మ ఆశా అసంతృప్తులకు అతీతురాలై నిత్య తృప్తితో నిరవధికానందంతో విలసిల్లుతోంది. మానవతా పరిధుల నధిగమించి మాధవి అయింది. నిజానికి యీ లోకంవైపు దృష్టి సారించ వలసిన అవసరం అమ్మకు లేదు.

అయినా అమ్మకు ఎల్లప్పుడూ ఈ ప్రపంచంవైపే దృష్టి, ఈ ప్రజల గురించే నిరంతరాలోచన. అందరికీ కడుపునిండా అన్నం పెట్టుకోవాలనీ, ఒంటినిండా బట్ట యిచ్చుకోవాలనీ, చదువుకొనే వసతులు విరివిగా కల్పించాలనీ, వైద్యం అందరికీ అందుబాటులోకి తీసుకురావాలనీ, వృద్ధులకు వికాలంగులకు ప్రత్యేకమయిన ఆదరణనూ, అనురాగాన్నీ అందించాలనీ, మానవ వికాసానికి దోహదం చేసే సంగీత నృత్యాది లలిత కళలను ఇతోధికంగా ప్రోత్సహించాలనీ.... లోకంలోని సర్వజనులూ సర్వవిధాలా సుఖశాంతులతో విలసిల్లాలనీ - అమ్మ అనుక్షణం ఆలోచిస్తూనే ఉంటుంది. అదే తనకు సాధన, ఆరాధన అంటుంది. అందులోనే తనకు తృప్తీ, ఆనందమూ ఉన్నాయట.

అమ్మ క్రియాశీలి, వట్టి ప్రసంగాలతో తృప్తి చెందదు తాను అనుకున్నదే అంటుందీ, అన్నది అక్షరాలా ఆచరిస్తుంది.

అమ్మ ఆశలకూ ఆశయాలకూ ప్రతిఫలాలే అన్నపూర్ణాలయం, ప్రాచ్యకళాశాల, సంస్కృత పాఠశాల, వైద్య కేంద్రమూ....

ప్రస్తుతం మరో కొత్త సంస్థకు అమ్మ శ్రీకారం చుట్టింది. అదే మాతృశ్రీ విద్యాలయం. ఈ విద్యాలయ సంస్థాపనలో - అమ్మకు విద్య యందు, పిల్లల యందుగల ఆసక్తి అభివ్యక్తం అవుతోంది.

అమ్మ ఏ పని చేసినా - అందులో ఏదో ఆదర్శమూ, ప్రబోధమూ తప్పక నిగూఢమై ఉంటాయి. అమ్మ 'నేను అమ్మను - మీరు బిడ్డలు' అని ప్రకటించడంలోనే

తల్లీ బిడ్డల బాంధవ్యానికి అమ్మ కొత్త రూపును దిద్దుతున్నదీ; కొత్త అర్థాలను అనుగ్రహిస్తున్నదీ.

అమ్మ అన్నపూర్ణాలయం సంస్థాపన చేసిందీ అంటే - అందులో ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని మనం పలుమార్లు చెప్పుకున్నాము.

అట్లాగే అమ్మ వివిధ విద్యాసంస్థలను రూపొందిస్తున్నది. ఇందుకు అనుబంధమై ఇంకా ఎన్నో విద్యాసంస్థఉల ఆవిర్భూతమై అభివృద్ధి పొందుతాయనీ, అవి విశిష్ట విద్యాలయాలై, విశ్వవిద్యాలయాలై, విశ్వజనీనమై విశ్వవిఖ్యాతి నార్జించి, విశ్వానికే మార్గదర్శకం కాగలవని విశ్వజనని అమ్మ విశ్వాసం

ఈ విద్యాలయం ద్వారా - విద్యావిధానానికే కొత్త రక్తం కొత్తజీవం ప్రసాదించి - మనిషి సుశిక్షితుడై, స్వయంపోషకుడై, సంపూర్ణ మానవుడుగా పరిణతి చెందడానికి అవసరమయిన విద్యనూ, విధానాన్నీ అమ్మ లోకానికి ప్రసాదించ దలుచుకున్నదేమో!

అమ్మ మనకు వాచా వివరించకపోయినప్పటికీ - ఈ ప్రజాహిత కార్యక్రమాల్లో అమ్మ ఒక అనుక్రమణికను అనుసరిస్తున్నట్లు - మనం కొద్దిగా పరిశీలించినట్లయితే - మనకు అర్థమవుతుంది.

ప్రప్రథమంగా అమ్మ అన్నపూర్ణాలయాన్ని ప్రారంభించింది. మనిషికి అన్ని అవసరాలకంటే అన్నమే ప్రధానం కదా !

తర్వాత వైద్యాలయాన్ని అమ్మ మనకు అనుగ్రహించింది. మరి, మనిషికి ఆరోగ్యం అత్యవసరం !

ప్రస్తుతం అమ్మ ప్రసన్నదృష్టి విద్యాలయాలపై ప్రసారితమైంది. ఈ నెల 15న అమ్మ మరో విద్యాసంస్థకు రూపకల్పన చేసింది. ఇది అధునాతన విద్యా సంబంధమైనది. ప్రాచీన సంస్కృతికి సంబంధించిన ప్రాచ్యకళాశాలను పూర్వం స్థాపిస్తే - ప్రస్తుతం అతినవీనమైన విద్యలకు ఈ ఆలయాన్ని అంకితం చేసింది. మరి - అమ్మ ఎంత సనాతనమయినదో, అంత అధునాతనమయినదికూడా. సమదృష్టితో అమ్మపాత క్రొత్తలకు పసిడి సేతువును నిర్మిస్తున్నది.

మరి ఈ వరసలో మనం ఆలోచిస్తే, మానసిక వికాసానికీ, ఆనందానికీ దోహదంచేసే లలితకళలకు సంబంధించిన ఆలయాలూ, ఆధ్యాత్మిక వికాసాన్నీ, ఆనందాన్నీ ప్రసాదించగల ఆలయాలూ ఎన్నో ఆకృతి ధరించాలి. అన్నిటినీ అమ్మ మనకు తప్పక ప్రసాదిస్తుంది. అమ్మ వాత్సల్యమూర్తి !

ఆనందస్వరూపిణి అయిన అమ్మ మనకోసం మన అవసరాల కోసం, మన సుఖశాంతులకోసం అనుక్షణం చేసే ఆలోచనలు, చెందే ఆందోళన, పడే బాధ

పరికిస్తే - మనం అమ్మకు ఎంత ఋణపడి పోతున్నామో - అనిపిస్తుంది. కాని అమ్మ - ఎంత చేసినా ఏమి చేసినా తల్లి తన తృప్తికోసమే చేసుకుంటుంది, అందులో దానమూ లేదూ, ఋణమూ లేదూ - అంటుంది.

మరి మనం ఏం చేయాలి ?

మనం అమ్మకు నిజమయిన బిడ్డలం అనిపించుకోవాలి అమ్మ ఆచరణాత్మకంగా ప్రబోధిస్తున్న గుణగణాలను మనమూ అలవర్చుకోవాలి

అసలు అదే - అమ్మ అవతార ప్రయోజనంకూడా నేమో.

అమ్మ ఆశీర్బలంతో ఈ విద్యాలయ ప్రాదుర్భావానికి నడుంకట్టిన సోదరీ సోదరులు శ్రీమతి ఉషారావునూ, శ్రీ బి.వి. వాసుదేవాచారినీ మనఃపూర్వకంగా అభినందిస్తున్నాము.

(ఆగష్టు 1980)



## అభిప్రాయ భేదం

ఒకరి మాట ఒకరికి నచ్చనప్పుడు అదే కోపం. అదే కక్ష. అదే దుఃఖం. పసిబిడ్డ ఏదో ఒక వస్తువు కోర్తాడు. తల్లివద్దంటుంది - అనగానే కోపం వస్తుంది. బిక్క మొగం వేసుకుంటాడు. క్రమంగా మారాం చేస్తాడు. అందులో నుండి ఏడుపులోకి దిగుతాడు. చివరకు హఠం పడతాడు. ఇదంతా తనకు కావలసినదాన్ని తాను తెచ్చుకోవడం కొరకై నడిచే మార్గం. ఇదే స్థానాలను బట్టి వేరువేరుగా నడుస్తుంది. ఇదే విరోధంగా మారుతుంది. ఇదే కోర్టు కెక్కిస్తుంది. ఇదే యుద్ధం చేయిస్తుంది. ఇదే ప్రాణాలు తీస్తుంది. ఇన్నింటికీ కారణం అభిప్రాయ భేదం.

- అమ్మ

# 155
# అమ్మ మనలను కరుణించింది

1980 నవంబరు 15వ తేదీ ఉదయం గం. 10.30 ని.లు భాస్కరుడు కనిపిస్తున్నాడు కానీ అతనిలో సహజమయిన వేడిమి ఎక్కడా లేదు సుధాంశుడువలే చల్లగా తెల్లగా వెలుగుతున్నాడు. ఆ వెలుగులో ఆనందపువెల్లువ ఉంది. మరి, ఆ ఆనందానికి కారణం ఏమిటో ?

గగనతలంలో మేఘ శకలాలు అటూ ఇటూ హడావుడిగా తిరుగాడుతున్నాయి. వాటి ఆర్భాటం చూస్తుంటే - ఎక్కడికో వెళ్ళిన తల్లికోసం తల్లడిల్లే పిల్లలు తల్లి కనబడగానే చేసే అల్లరివలె ఉంది

వేసవికాలంలోని ఎండల వేడిమికి యింకిపోయి వర్షాకాలంలో ఉప్పొంగి ప్రవహించే నదులవలే ఎదలన్నీ చెప్పలేనంత సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాయి.

ఏ ముఖంలో చూసినా తేజోరేఖలు దీప్తిమంతంగా వెలిగి పోతున్నాయి. ఆవరణంతా కోలాహలం; వాతావరణమంతా ఆనంద సురభిళాల గుబాళింపు.

అమ్మ నివాసం నుండి ఘంటా నినాదం వినిపించింది. జనం ఆ శబ్దం విని దాదాపు మూడునెలలు అయింది. ఆ ఘంటానినాద మంటే వాత్సల్యమూర్తి అయిన అమ్మ అనుంగు పిలుపు. అందుకే ఆ గంటలో కోటి అమృతవర్షాల ఆనందం; కోటిరాగాల ఆనందపు సందడి; సర్వ వేదాల మధుర గంభీరఘోష.....

ఆ నినదం వినేసరికి వంశీమోహనుని మురళీస్వరం విన్న గోపికలవలే, ఆలమందలవలే జనం గుంపులు గుంపులుగా అమ్మ నివసించే మేడపైకి వచ్చారు. ఆవరణలో జనమేకాక గ్రామస్తులందరూ కూడా బిలబిలా చేరారు.

అదో మహోత్సవం.

అమ్మ వచ్చి సింహాసనాసీన అయింది. దివ్యతేజో విలసిత అయి, దరహాస భాసురవదనయై, వాత్సల్య పూరిత నయనయై అమ్మ కనుపించే సరికి అసంఖ్యాక

జనం గుండెలు పాలసముద్రాలై ఉప్పొంగాయి. పట్టలేని ఆనందంతో అందరికళ్ళూ చెమర్చాయి.

అమ్మ ముఖంలో కళ్ళల్లో అనంతమయిన అలౌకిక దీప్తి భాసిస్తున్నప్పటికీ - శారీరకంగా కృశించి కనుపించేసరికి అందరికీ గుండెలు పిండినట్లయింది. సర్వ జగతి ఉత్పత్తికి ఆధార భూతమయిన అమ్మ కడుపుకూడా తగ్గిపోయి సర్వజనుల హృదయాలను కలత పెట్టింది.

అయినా అంతలోనే మళ్ళీ అందరికీ ఎదలో ఎంతో ఆనందం, ఎలాగో అమ్మ మననందరినీ కరుణించి మళ్ళీ తిరిగివచ్చిందీ; మళ్ళీ జిల్లెళ్ళమూడి గడ్డపై పావనపాదం ఉంచిందీ; మళ్ళీ అశేష ప్రజలపై వాత్సల్యామృతం కురిపిస్తుందీ - అని.

1923 మార్చి 28వ తేదీన అమ్మ సర్వజగతినీ అనుగ్రహించే నిమిత్తం అవనీతలంపై అవతరించినప్పటికీ - ఆనందం ఆనాడు కొద్ది మందికి మాత్రమే లభ్యమయింది. కానీ ఈసారి అమ్మ జిల్లెళ్ళమూడి గడ్డపై కాలుపెట్టిన సుముహూర్తాన్ని మరో అవతరణ ఘట్టంలాగానే అందరూ సంభావనచేసి సంబరపడిపోయారు. తమందరిపై అమ్మకు గల ప్రేమకు తార్కాణంగానే భావించి సగర్వంగా ఉప్పొంగి పోయారు.

అంత సంతోష సమయంలోనూ అందరికీ గతం స్మృతిలో మెదలక తప్పలేదు.

గడిచిన మూడు నెలలు ఎంత భయంకరమైనవి ? గతం కాలనాగువలె ఎన్ని బుసలుకొట్టింది ? బెబ్బులివలె ఎన్ని ఘీంకారాలు చేసింది ? ఎంత హుంకరించి కనులెఱ్ఱజేసి నిప్పులను కురిపించింది ?

ఆగష్టు 15వ తేదీన మాతృశ్రీ విద్యాలయానికి ప్రారంభోత్సవానికి వస్తూనే అమ్మ తన అనారోగ్యాన్నీ అశక్తతనూ సూచించింది. పూర్వం అనేకసార్లు అమ్మ అనారోగ్యానికి గురి అయినప్పటికీ అమ్మను అవి ఏమీ చేయలేక పోయినందున - ఎవ్వరమూ దానిని గురించి తీవ్రంగా ఆలోచించలేదు. ఆగష్టు 24న సోదరులు శ్రీ కృష్ణశర్మగారి అమ్మాయి వివాహం జరిపిస్తూ కూర్చొనలేక బాధను వ్యక్తం చేసింది.

అప్పుడు ఆలోచన సాగింది.

25వ తేదీన శ్రావణ పూర్ణిమ. ఆనాడు అమ్మ అందరికీ యజ్ఞోపవీతాలను ప్రసాదిస్తూ చెయ్యి చాచి ఎవరినుదుటనూ కుంకుమ నలంకరించ లేక పోయింది.

అమ్మ అనారోగ్యం గురించి ఆందోళన మొదలయింది. వెంటనే డాక్టర్ యస్.వి. సుబ్బారావుగారికి నెల్లూరు ఫోనుచేశాము. వారు వచ్చారు. అమ్మకు

'నిమోనియా' అని నిశ్చయించారు. చీరాల హోమియో డాక్టర్ నరసింహారావు చికిత్స చేస్తున్నారు. వ్యాధి తగ్గుతున్నట్లే కనుపించింది.

డాక్టర్ సుబ్బారావుగారు 28వ తేదీ ఉదయం నెల్లూరు వెళ్ళి పోయారు.

ఆనాడు మధ్యాహ్నం ఒంటి గంటయింది. అదెంత చెడ్డకాలమో ! అమ్మ శ్వాస ఆగిపోయింది. అందని లోతునీళ్ళల్లో పడిపోయి నప్పుడు మనిషి ఊపిరాడక ఎలా గిలగిలా కొట్టుకుంటాడో అమ్మ పరిస్థితి అలా అయింది.

మనందరి అదృష్టవశాత్తు డాక్టర్ ఇనజకుమారి అక్కడనే ఉన్నది. పరిస్థితిని అవగాహన చేసుకుంది. వెంటనే చికిత్సకు ఉపక్రమించింది. అందకు ముందే జిల్లెలమూడి నుండి విశాఖపట్నం బయలు దేరిన డాక్టర్ జస్వంతకుమార్‌కు బాపట్లలో ఈ విషయం తెలిసి హుటాహుటీన జిల్లెళ్ళమూడి బయలుదేరాడు అతణ్ణి సత్వరంగా జిల్లెళ్ళమూడి చేర్చేందుకు వాన్ పదినిమిషాల్లో నడిపిన సోదరుడు వెంకటేశ్వర్లు అభినందనీయుడు.

జస్వంత్‌వచ్చి చికిత్సలో ఇనజకుమారికి సహాయుడై నిలిచాడు. ఏకాకిగా పోరాడుతున్న సైనికుడికి సహాయం లభించినట్లు ఇనజకుమారి - ద్విగుణీకృత ధైర్యంతో చికిత్స కొనసాగించింది. వారిద్దరి సమయస్ఫూర్తి, దీక్ష, దక్షత, భక్తికి ఫలితంగా అమ్మకు - కాదు - యావజ్జగతికీ ఆ గండం గడిచింది.

అప్పటికి సాయంకాలం గం. 3.30 ని. లయింది. అమ్మ తీవ్రవేదనకు గురి అవుతూనే ఉన్నది కానీ వైద్యులు ప్రాణాపాయ పరిస్థితి తప్పినట్లు ప్రకటించారు.

ఈలోపల అమ్మకే కాదు అందరింటిలోని యావత్ జనానికీ శ్వాస బంధించి నట్లయింది. ఎవరికి ఏమి చేయడానికి తోచక ఆకాశంలోకి దృక్కులు నిగిడించారు. ఆకాశమూ, ప్రకృతీ విషాదంవల్లనో, భయవిహ్వలత వల్లనో సంక్షుభితమైపోయి పరిస్థితిని మరింత భయావహం చేశాయి. మధ్యాహ్న సమయంలోనే రాత్రికివలె చీకట్లు వ్యాపించాయి. విద్యుత్ సరఫరా ఆగిపోయింది.

అమ్మకు గండం గడిచింది అన్న ప్రకటన వినగానే అందరూ ఒక్కసారి తృప్తిగా గాలి పీల్చుకున్నారు. ఆ సమయానికి నెల్లూరు నుంచి డాక్టర్ సుబ్బారావుగారు మళ్ళీ తిరిగి వచ్చారు. వారు అప్పడే జిల్లెళ్ళమూడి నుంచి నెల్లూరు చేరి భోజనం చేస్తున్నారట. మళ్ళీ వెంటనే బయలుదేరి వచ్చారు.

నాడు ఒక భక్తుణ్ణి రక్షించడానికి భగవంతుడు గరుడ వాహనుడై సిరికిం జెప్పక బయలుదేరాడు. నేడు భగవంతుణ్ని రక్షించడానికి ఒక భక్తుడు శ్రీమతికిం జెప్పక కారులో వేవేగ బయలుదేరాడు.

ఆ క్షణం నుండీ సుబ్బారావుగారు అమ్మకు పరీక్షలు, చికిత్స ప్రారంభించారు. 1968 నుండి అమ్మకు తీవ్రమధుమేహం ఉన్నది 1975 నుండి గుండెజబ్బు మొదలైంది. ఇటీవల రక్తపోటుకూడా వస్తున్నది. ప్రస్తుతం నిమోనియావల్ల శ్వాసకోశంలో ఎడమవైపున ప్లూరసీ వచ్చింది 28వ తేదీ మధ్యాహ్నం అకస్మాత్తుగా రక్తపుపోటు అత్యధికమై, గుండె పనిచేయడంలో లోపం వచ్చినందువల్ల ప్రాణసంకటం ఏర్పడింది అది తప్పడమనేది నిజంగా చాలా అరుదు, అది మన అదృష్టం - అని డాక్టరుగారు వివరించారు.

డాక్టరుగారి చికిత్స ఫలితంగా వ్యాధి తిరుగుముఖం పట్టినట్లుగానే అనిపించింది; డాక్టరుగారు మళ్ళీ నెల్లూరు వెళ్ళారు. సెప్టెంబరు 8వ తేదీన ఎక్సురే తీయించి పరిశీలన నిమిత్తం నెల్లూరు పంపాము. డాక్టరుగారు అమ్మ శ్వాసకోశంలో ఒక గడ్డ ఉన్నట్లు కనుగొని వెంటనే మద్రాసుకానీ హైదరాబాద్‌కానీ తీసుకుని వెళ్ళమని ఫోనులో సలహా చెప్పారు.

ఇక జిల్లెళ్లమూడిలో అమ్మను ఉంచి చికిత్స చేసినా ఫలితం ఉండదని ఇనజకుమారికూడా భయపడ్డది.

వెంటనే ఆ రాత్రికి రాత్రే బయలుదేరి హైదరాబాద్ వెళ్ళాము. సోదరులు శ్రీ రాజగోపాలాచారి గారింటిలో బసచేసి అమ్మకు చికిత్స ప్రారంభంచేశాము. డాక్టర్లు ముందు అమ్మను ఏదో ఒక పెద్ద ఆసుపత్రిలో చేర్చడం అనివార్యమని అన్నా చివరకు అందరూ అమ్మను యింటివద్దనే ఉంచి చికిత్స చేయడానికి అంగీకరించారు. ఆపరేషన్ అవసరం లేకుండానే వ్యాధిని తగ్గిస్తానని డాక్టర్ రాజగోపాలన్ ప్రకటించారు

అమ్మకు అవసరమయిన పరీక్షలు చేయడంలోనూ చికిత్స చేయడంలోనూ హైదరాబాద్ వైద్యులందరూ ఎంతగానో సహకరించారు

అయితే - వ్యాధి నయమయ్యేలోగా అమ్మ శారీరకంగా తీవ్ర వేదనను అనుభవించవలసి వచ్చింది. అంత వేదనలోనూ అమ్మ తన యోగక్షేమాలు కనుక్కొనటానికి వచ్చే వారికీ వారి యోగక్షేమాలు ఆశించి వచ్చే వారికీ కూడా దర్శనాలు ప్రసాదిస్తూనే ఉన్నది. అమ్మ దగ్గితేకాని లోపలి కళ్ళె బయటపడనందువల్ల అమ్మను దగ్గమని డాక్టరు సలహాలిస్తుంటే - తగ్గించడానికి తీసుకువచ్చారా ? దగ్గించడానికి తీసుకు వచ్చారా - అని చమత్కరిస్తూ ఉండేది.

ఎట్టకేలకు డాక్టర్ల కృషి ఫలించి - అందరి అదృష్టం పండగా - నవంబరు 6వ తేదీన డాక్టర్ రాజగోపాలన్ అమ్మకు పూర్తి స్వస్థత కలిగినట్లు ప్రకటించారు.

8వ తేదీన డాక్టర్లకు కృతజ్ఞతలు తెలియజేయడానికి హైదరాబాద్‌లో ఒక విందు ఏర్పాటు చేయబడింది. ఆ సందర్భంలోనే అమ్మ డాక్టర్లకూ, వారి భార్యలకూ, అమ్మకు ఈ సందర్భంలో అన్ని విధాలా సేవచేసిన అందరికీ నూతన వస్త్రాలు ప్రసాదించి ఆశీర్వదించింది.

అమ్మకు కొంచెం ఆరోగ్యం చిక్కగానే అమ్మ హైదరాబాద్‌లోని అనేక సోదరుల గృహాలను తన పావనపాదస్పర్శతో పునీతంచేసి వారిని ఆశీర్వదించింది.

9వ తేదీన హైదరాబాద్‌లో మాతృశ్రీ నగర్‌లోని మాతృశ్రీ నిలయానికి ప్రారంభోత్సవం చేసి రామచంద్రపురంవెళ్ళి అక్కడ వాత్సల్య సుధలను కురిపించింది.

19వ తేదీన హైదరాబాద్ - మద్రాసు ఎక్స్‌ప్రెస్ ట్రయిన్‌లో బయలుదేరి అమ్మతోసహా అందరమూ బాపట్ల చేరుకున్నాము. ఆ ప్రయాణం మహాసరదాగా గడచింది. ఆగిన అన్ని రైల్వేస్టేషనుల్లోనూ ఎందరో జనం అమ్మను దర్శించి దండలతో అలంకరించి జయ జయ ధ్వానాలుచేసి ఎంతో ఆనందాన్ని ప్రకటించారు.

అమ్మ 14వ తేదీన బాపట్లలో శ్రీ కె.బి.జి. కృష్ణమూర్తిగారి గృహంలో బసచేసింది. 13వ తేదీ రాత్రి బాపట్ల రైల్వేస్టేషనులో అమ్మకు ఘనస్వాగతం ఇవ్వబడి పురవీధులలో పెద్ద ఊరేగింపు జరిగింది.

14వ తేదీన జిల్లెళ్ళమూడి గ్రామస్థులూ, అందరింటిలోని సభ్యులూ మాత్రమే కాక పరిసరగ్రామస్థులుకూడా వచ్చి అమ్మకు ఇచ్చిన స్వాగతం చరిత్రాత్మక మయినది. ఉత్సాహమూ ఆనందమూ కలిసిన వారి కేరింతలతో కేకలతో దిక్కులు ప్రతిధ్వనించాయి.

ఔను ! మరి, అమ్మ మళ్ళీ తిరిగివచ్చింది. వాత్సల్యాన్నీ, అనుగ్రహాన్నీ మోసుకుని మళ్ళీ వచ్చింది. అంత బాధపడీ మనకోసం మళ్ళీ వచ్చింది.

అమ్మను వదిలి బ్రతకలేని మన అశక్తతనూ, దీనత్వాన్నీ సహించలేని అమ్మ మళ్ళీ తిరిగి వచ్చింది. మనను 'తల్లిలేని బిడ్డల'ను చేయడం ఇష్టంలేని అమ్మ మళ్ళీ తిరిగి వచ్చింది.

అపార సహనమూర్తి అమ్మ ! అవ్యాజ కరుణామయి అమ్మ !!

అనంత మధుర వాత్సల్యజలధి అమ్మ !!!

(మే 1967)



# 156
# విచిత్రోదంతం

కాలం ఎంతగా మారింది అనుకున్నప్పటికీ, సమాజం ఎంత అభ్యున్నతిని సాధించింది అనుకున్నప్పటికీ - కొన్ని జీవితాలు, చరిత్రలు అవలోకిస్తుంటే - ఆలకిస్తుంటే హృదయ విదారకంగా ఉంటాయి. కష్టపడే వారితోపాటు మనమూ కన్నీళ్ళు కార్చడం తప్ప ఏమీ చేయలెము.

ఒక మానవుడు మరోమానవుడి జీవిత గతిని మలుపు తిప్పలేక పోవచ్చును. అదే - మానవుడు ఎదురుగా కనిపించిన మాధవునికి తన మొరవినిపిస్తే - అప్పుడు ఏం జరుగుతుంది ? మాధవుడు ఆ జీవితగతిని మళ్ళిస్తాడా ? విధిని మారుస్తాడా?

భక్తుల విన్నపాలు, విల్గాసాలు విని భగవంతుడు అనుగ్రహించిన సంఘటనలు పురాణాల్లో అనేకం కనుపిస్తాయి. భగవంతుడు ఘటనాఘటన సమర్థుడని ప్రసిద్ధి. మరి, అమ్మ సాక్షాత్తూ దైవమే నని పలువురి విశ్వాసమూ, అనుభవమూ, అమ్మ అనుగ్రహ స్వరూపిణి, కారుణ్యమూర్తి - అని అందరికీ విదితమయిన విషయమే.

అందుకనే ఆ రోజున 19.12.80న ఉదయం ఆ కుటుంబం అమ్మ పదసన్నిధిలో కూర్చుని తమ వింతగాథను విషాదమయ చరిత్రను అమ్మకు వినిపించారు.

వారిది నాగపూర్. ఆయన రైల్వేలో ఉద్యోగం చేస్తున్నారు. ఆయన భార్య, ఆయన కుమార్తె, రెండు సంవత్సరాలక్రితం ఆ అమ్మాయి వివాహం చేశారు. ఆ తండ్రి ఇరవైవేల రూపాయలు వరకట్నం ఇచ్చాడు. ఆ కుమార్తె తన వైవాహిక జీవితాన్ని గురించి అందరు కన్యలవలెనే రంగుల స్వప్నాలు కన్నది.

ఆ వరునిది విచిత్రాతి విచిత్రమయిన మనస్తత్వం. అతనికీ తల్లిదండ్రు లున్నారు. వారిది కోనసీమ నివాసం. అయినా ఆ తల్లి కొడుకువద్దనే ఎక్కువ కాలం ఉంటుంది. అతడు బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నాడు. అతని తమ్ముడూ

అతనివద్దనే ఉంటూ విద్యాభ్యాసం సాగిస్తున్నాడు. ఇవన్నీ సహజమయిన విషయాలే. అతని తల్లికి అతనంటే అపారమైన వాత్సల్యమూ, ముద్దూ అతనికి తల్లి అంటే అమితమయిన అనురాగమూ, భక్తీ. ఇవీ సహజ విరుద్ధాలు కావు.

మరి ?

పెండ్లి చేసుకుని భార్యను కాపురానికి తీసుకుని వచ్చికూడా ఆ ప్రబుద్ధునికి తల్లి తోడిదే లోకం. తల్లిని ఎడబాసి క్షణంకూడా ఉండడు; ఉండలేడు.పగలు షికార్లు అమ్మతోనే; రాత్రిళ్ళు సినిమాలు అమ్మతోనే పడుకునేది అమ్మపక్కలోనే. కబుర్లు అమ్మతోనే. గుఱ్ఱప్పందేలకు వెళతాడు, అమ్మతోనే. ఆ అమ్మాయిని ఎక్కడకు తీసుకుని వెళ్ళడం ఆ భర్తకూ అంగీకారం కాదు; ఆ అత్తగారికి ఆ భావనే రాదు. పోనీ, అంతవరకయినా ఎలాగో సహించవచ్చును. ఆ భర్త భార్యతో అంటాడటా - నీకంతగా బయటకు ఎక్కడికయినా వెళ్ళాలని ఉంటే మా తమ్ముడితో కలిసి వెళ్ళు - అని. వయసు వచ్చిన ఏ మరిదితో, ఏ వదిన వీధుల వెంట స్వేచ్ఛగా తిరిగినా లోకం ఒకపాటున వదిలి పెడుతుందా ? ఎన్ని అపవాదాల భాండాలు ఆ మగువనెత్తిన నిర్దాక్షిణ్యంగా పగులకొట్టదూ ? సౌఖ్యం లేకపోతే పోనీ, ఇక ఆ స్త్రీకి మనశ్శాంతి అంటూ ఉంటుందా ? అపవాదుల కార్చిచ్చులో బూడిదై మిగలదూ ?

పోనీ, అతడేమయినా అమాయకుడని అనుకుందామా, కాదు. అమిత మేధావి, చక్కని రూపసి. కమ్మగా పాడగలడు. చమత్కారంగా మాట్లాడగలడు. అందరితో ఎంతో సరదాగా నవ్వుతూ కలుపుగోరు తనంగా సంచరిస్తాడు. కానీ భార్య దగ్గరకు వస్తే మాత్రం ముని అయిపోతాడు; మాట పెగలదు; నవ్వు కనిపించదు; విసుగు, చికాకు, కోపం ముప్పిరిగొని అందమయిన అతని ముఖాన్ని వికృతపరుస్తాయి. ఆ అమ్మాయి తన భార్య అని తెలిసినట్లే ప్రవర్తించడు.

ఆ అమ్మాయి తనకు తగింది కాదు - అనుకుందామా, అదీ సరిగాదు. ఆ అమ్మాయీ గ్రాడ్యుయేట్. చక్కగా ఉంటుంది. తెలివి గలది. ఆమెలోని ఆశలనూ ఆశయాలనూ ప్రతిఫలిస్తూన్న తేజోవంతమయిన కళ్ళు. తన భర్త తనతో చనువుగా మాట్లాడాలనీ, సరదాగా మెలగాలనీ తనను భార్యగా గుర్తించాలనీ మనసులో నిరంతరం ఆరాటమూ, ప్రయత్నమూ. ఆ ప్రయత్నంలోనే ఎప్పుడయినా అతని దగ్గరకు వెళ్ళి చనువుగా మాట్లాడితే, ఆ విషయం గుర్తుచేస్తే, ప్రశ్నిస్తే - మూర్ఖంగా అంటాడటా కసురుకుంటాడటా - నీ సరదాలు తీరాలంటే నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకో. నేను నీకు తగను. నీకోరికలు నాతో తీరవు - అని.

హిందూ మహిళకి భర్త మాటకన్న ఆచరణీయం లేదన్నమాట వాస్తవమేకానీ ఏ సామాన్య స్త్రీ ఆ మాటలను విని భరించ గలుగుతుందీ ?

ఎప్పుడయినా ఆ భర్తకు మనస్సు కరిగి ఆమెతో అనురాగ పూర్వకంగా మాట్లాడితే, ప్రవర్తిస్తే....... ఆ తల్లి వెంటనే అతణ్ణి కోప్పడి కసరి అతనికి బుద్ధులు చెబుతూ వాళ్ళిద్దరిమధ్యా ఒక గోడను కట్టడమో, ఒక అఘాతాన్ని త్రవ్వడమో చేస్తుంది. ఆ తల్లి అనునిత్యమూ నల్ల మందుతోపాటు మరే మందులో కలిపి తమలపాకుల్లో కలిపి కొడుకుచేత తినిపిస్తుందట. అయినా - ఆ అమ్మాయి చేసుకున్న పూజల ఫలితమో, ఆ అమ్మాయి మంచితనాన్ని చూచిన ఏ దేవత కరుణకు నిదర్శనమో.... ఆ అమ్మాయి గర్భవతి అయింది. ఆ భర్త అమ్మాయిని పుట్టింటికి పంపేడు. అంతే, మళ్ళీ ఉత్తరం ముక్క కూడా అతని నుండి లేదు.

ఆ అమ్మాయి ప్రసవించింది. ఆడపిల్ల పుట్టింది. తాను తల్లి నయినందునకు ఎంతో సంతోషించాల్సిన ఆ అమ్మాయిలో ఆ చిహ్నాలయినా కనిపించవు. నిరాశావాది కాదు కాబట్టి ఇంకోరకంగా ఆలోచించకుండా, ఆవేశపడకుండా - తన బిడ్డకోసం, తమ బ్రతుకుతెరువుకోసం ఆపిన చదువును ప్రస్తుతం కొనసాగిస్తున్నది. యం.ఏ. చేస్తున్నది. ఉద్యోగం చేస్తూ తనకాళ్ళమీద తాను నిలబడాలని ఆ అమ్మాయి పట్టుదల.

బిడ్డ బ్రతుకు, ఆమె చితికిన మనస్సు చూచి సహించలేక తండ్రి అల్లుడికి ఉత్తరాలు వ్రాశాడటా... వచ్చి అమ్మాయిని తీసుకుని వెళ్ళమని. అల్లుడినుండి జవాబు వచ్చింది. తనకు తీరికలేదట. అయినా భార్యతో అవసరంలేదట. తమకు బరువుగా ఉంటే ఆ అమ్మాయిని తీసుకుని వెళ్ళి మామగారివద్ద దించాలట. తన తండ్రికి ఇంటివద్ద ఆడదిక్కు లేక ఇబ్బందిగా ఉన్నదట. మరి, తల్లి తనవద్ద ఉన్నదిగదా.

ఆ బిడ్డకు ఇంతవరకు నెలలు గడిచినా - బారసాల లేదు; నామకరణం జరగలేదు. "అమ్మాయిని ఎలాగయినా బొంబాయి పంపుదామనుకుంటే - ఈసారి నా శవమే మీరు చూస్తారు - అని అమ్మాయి అంటుంది. ఆ మాట వింటేనే గుండె పగిలిపోతుంది" అని అమ్మాయి తలిదండ్రులిద్దరూ రుద్ధకంఠంతో అమ్మకు విన్నవించారు.

ఈ విచిత్ర విషాదోదంతం అమ్మకు వినిపించి ఆ తల్లి దండ్రులు అమ్మను ప్రశ్నించారు. ఈ అమ్మాయి జీవితానికి మలుపున్నదా ? అల్లుడు మారుతాడా ? వాళ్ళ సంసారం కుదుటపడుతుందా ? - అని.

ఈ విషయమంతా విశాఖపట్నంలో ఒక సైకియాట్రిస్టుకు వినిపిస్తే - ఆ భర్తకు అదొక జబ్బు అన్నాడట. అందువల్ల - అది నిజమేనా, అందుకు చికిత్స చేయించమంటారా ? తగ్గుతుందా ? - అని కూడా అమ్మను అడిగారు.

ఆ చరిత్రనూ, ప్రశ్నలనూ విని అమ్మ ఎంతో కరుణతో, సానుభూతితో ఆ అమ్మాయికి సలహాయిచ్చింది.

"నన్ను అడిగితే ఏ పరిస్థితిల్లోనూ భర్త భార్యకు దేవుడే నంటాను. భార్య కూడా భర్తకు దేవతే. అయితే అతను అట్లా ప్రవర్తించడం లేదుగదా అంటే, ఇవ్వాళ కాకపోతే రేపయినా గుర్తించక తప్పదు. ఆ శుభఘడియ వచ్చేదాక మనం సహనంతో వేచి ఉండాలి. స్త్రీకి అదొక తపస్సు, అదొక యజ్ఞం. నీకంత ధైర్యమూ, దీక్షా, సహనమూ లేవంటావూ - తల్లిదండ్రులవద్దనే ఉంటూ పిల్లను పెంచుకో. పిల్లను పెంచి పెద్దచేయటంలో అదొక తృప్తి, ఆనందమూ. భర్తకు అది వ్యాధి అనుకుంటావూ, దగ్గరుండి చికిత్స చేయించుకో, గుణం అనుకుంటావూ నీ ప్రేమతో మార్చుకో, ద్వేషానికి ప్రేమకంటే మందు లేదు హింసను సహనంతోనే జయించాలి .. "

అమ్మ ప్రవచిస్తుండగా ఆ అమ్మాయి ప్రశ్నించింది. "నా జాతకంలో రెండోపెళ్ళి ఉన్నదట జరుగుతుందా అమ్మా?" అని "జాతకంలో సంగతి యేమో కానీ విధిలో ఉంటే ఎవరూ తప్పించు కోలేరు గదా -" అంది అమ్మ.

"అమ్మా - మమ్మల్ని వెళ్ళి అల్లుడి కాళ్ళు పట్టుకోమంటావా ?" అని అడిగాడు తండ్రి. "తప్పేముంది నాన్నా ? కాళ్ళు కడిగే కన్యాదానం చేశావు గదా. ఎవరికోసం చేస్తావు ? నీ కూతురికోసం, నీ ప్రేమకోసమే".

"అమ్మా - ఆ తల్లి అంత అమానుషంగా ప్రవర్తిస్తుందేమిటి ? తల్లి కొడుకు సుఖం కోరుకోవద్దూ ! కొడుక్కి కోడలు దగ్గరయితే తన స్థానం ఎక్కడ పోతుందోనని స్వార్థబుద్ధితో ఆలోచిస్తే ఎలా?" అని ఆ తల్లి అమ్మను అడిగింది.

"ఏ తల్లి అయినా లోకంలో తనబిడ్డ సౌఖ్యంకోసం తన సుఖాన్ని త్యాగం చేస్తుంది. కానీ, స్వార్థంతో బిడ్డసుఖాన్ని బలితీసుకోదమ్మా మరి, ఆ తల్లి మనస్సులో ఏమున్నదో, ఆమె అట్లా ఎందుకు ప్రవర్తిస్తున్నదో మనకు తెలియక పోవచ్చును కానీ తప్పక అందులో కొడుకు శ్రేయస్సే నిగూఢంగా ఉండి ఉంటుంది -" ఎవరిలోనూ తప్పును చూడని, మాతృత్వమే రూపుదాల్చిన అమ్మ ఇంకో విధంగా ఎందుకు చెబుతుందీ ?

"ఏమయినా, - ఆ బిడ్డ లిద్దరినీ కలుపు తల్లీ" అని తండ్రి రెండుచేతులెత్తి నమస్కరించి అమ్మను వేడుకున్నాడు.

మంగళాశీః పూర్వకంగా అమ్మ కుంకుమ పొట్లాలు ప్రసాదించింది. ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని ఆదరణగా వారిచే స్వయంగా ఇడ్లీ తినిపించింది.

అమ్మ జీవితం పరిశీలిస్తే ....... మహిళాలోకానికి ఒక దివ్య ప్రబోధం కనిపిస్తుంది. స్త్రీ - కూతురుగా, భార్యగా, తల్లిగా ఎట్లా నడుచుకోవాలీ - అన్న ప్రశ్నకు అమ్మ జీవితమే సరైన సమాధానం.

అమ్మ ఆదర్శమయిన పుత్రిక ! ఆదర్శమయిన భార్య !! జగత్తుకంతకూ ఆదర్శమయిన అపూర్వమయిన తల్లి !!!

అమ్మ మానవిగా మాటలతో సలహాలు చెబుతుందీ; క్రియలో మాధవిగా తీర్పు నిస్తుంది.

(డిశంబరు 1980)



## కల్యాణం

ఒక పెన్నిధి అండన చేరటం పెండ్లి. ఆ అండను పొందే పరిణామమే పరిణయం. సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని విడిచిపెట్టేదే వివాహం. కళంక రహితమయిన మనస్సును కళంక రహితంగా మరొక వ్యక్తికి అర్పణ చేయటమే కల్యాణం.

అమ్మ

# 157
# "రాఘవరావు మామయ్య"

రాఘవరావు మామయ్య 1980 డిసెంబరు 27వ తేదీ మధ్యాహ్నం హఠాత్తుగా హృద్రోగంతో జిల్లెళ్ళమూడిలో అంతిమశ్వాస వదిలాడు. ఏమాత్రం బాధపడకుండా అనాయాసంగా ప్రాణం విడిచాడు. అటువంటి మరణం ఏ కొద్ది మందికో గానీ లభించదు. ఎంతో పుణ్యం చేసుకుంటే గానీ భగవంతుడు అటువంటి వరం యివ్వడు. మనిషి మంచితనం మరణకాలంలోగానీ బయట పడదు - అని నానుడి. మంచి తనానికీ, దైవానుగ్రహానికీ అటువంటి మరణం నిదర్శనం.

జగజ్జననికే జననీ జనకులు కాగలిగిన పరమ అదృష్టవంతులు - గౌతమస గోత్రులు శ్రీ మన్నవ సీతాపతిగారు, శ్రీమతి రంగమ్మగారు. వారికి మొదటి బిడ్డ రాఘవరావు మామయ్య.

బాల్యం నుంచీ రాఘవరావు మామయ్యది విలక్షణ మయిన వ్యక్తిత్వమే. చాలా తెలివిగలవాడు. మంచి పట్టుదల గలవాడు. ఏపనిలో ప్రవేశించినా - దానిలో అనితర సాధ్యమయిన నైపుణ్యం చూపేవాడు.

మామయ్య బాగా పాడగలడు. గొప్ప నటుడు. రామదాసు పాత్రను అద్భుతంగా పోషించేవాడు. అందులో జైలుఘట్టం ఆయనకు అత్యంత ప్రీతికరమైనది. ఆ పాత్రలో ఆయన జీవించేవాడు. చింతామణి నాటకంలో చింతామణిగానూ, సుబ్బిసెట్టిగానూ నటించేవాడు. శ్రీ స్థానం నరసింహారావుగారి సరసన సుబ్బిసెట్టి పాత్రను మామయ్య పోటీపడి నటించి మేటి నటుడనిపించు కున్నాడు. బుఱ్ఱకథ నుత్తేజకరంగా చెప్పి ప్రజలను ఉఱ్ఱూతలూగించేవాడు. 'మంగళపాండ్య' అన్న రాజకీయపరమైన బుఱ్ఱకథను మామయ్య రచించాడు. ఆ కోవ కథల్లో అదే మొదటిది.

మామయ్య గజీతగాడు. మైళ్ళకొద్దీ దూరమూ, గంటల తరబడీ ఈదేవాడు. మామయ్య ఎంత చురుకైనవాడో చిన్నతనం నుంచీ అంత అల్లరివాడు. అమ్మమ్మ

చనిపోయేనాటికి మామయ్యకు పదేళ్ళు. అమ్మకు నాలుగేళ్ళు. అప్పటికే మామయ్య అల్లరి జనాన్ని చకితులను చేసేది; భయపెట్టేది.

తల్లిని పోగొట్టుకున్న పిల్లలను ఎక్కడ ఉంచాలీ - అన్న సమస్య వచ్చింది. అప్పుడు సీతాపతితాతగారు అన్నారు "పిల్లను ఎవరయినా చూస్తారు. చూడక పోయినా ఇది కావాలని, ఇది వద్దనేది లేనిది కనుక బాధ లేదు ఈ అల్లరివాడిని, రాఘవుడిని ఎవరు భరిస్తారు?" అని. అదే సమయంలో తెనాలి తాతగారు చంద్రమౌళి వెంకటసుబ్బారావుగారు "ఇంకా ఆలోచించే దేమున్నది ? పిల్లను తెనాలి తీసుకుని వెళతాను - వాడి సంగతి మీరు ఆలోచించండి. రాఘవుడిని భరించడం కష్టం. వీడిని తీసుకుని వెళ్ళితే సీతారాముడిని పాడు చేసినట్లవుతుంది" అని నిర్మొహ మాటంగా చెప్పారు.

మామయ్య మంచి మాటకారి. చమత్కారంగా మాట్లాడగలడు.

వ్యవసాయ మందు ప్రజ్ఞ కలవాడు తోటి రైతుల్లో సాటిలేని వాడనిపించు కున్నాడు. ఎవ్వరూ పండించలేనంత పంట పండించేవాడు.

పశువులను మేపడంలో కూడా మామయ్య అసాధారణ ప్రతిభ కలవాడు. పశువులను ఎంతో ప్రేమగా చూచే వాడు. అవి మామయ్య మాట్లాడితే అర్థం చేసుకొన గలిగేవి. ఒకసారి ఒక దూడ నెలలు నిండకుండానే పుట్టింది. అది చనిపోయిందనే అందరూ అనుకున్నాడు. తల్లిపాలు త్రాగే స్థితికూడా దానికి లేదు. అప్పుడు ఆ దూడకు పాలసీసాతో పసిపిల్లలకు వలే పాలుపట్టి పెద్ద చేశాడు.

మామయ్య తఖిలీ వడకడంలో కడు నేర్పరి, ముతగ్గా దారం తీయడంలో, నాజూగ్గా దారం తీయడంలో, తక్కువ సమయంలో ఎక్కువ దారం తీయడంలో... అన్నిటా అసమాన చతురుడు.

వంశపారంపర్యా వచ్చిన గ్రామకరిణీకం చేసి రెండు సంవత్సరాల క్రితమే ఖచ్చితంగా ఉద్యోగ విరమణ చేశాడు. ఉద్యోగంలో ఇంకొకరు పేరుపెట్టి వేలుపెట్టి చూపడానికి వీలులేకుండా ప్రవర్తించాడు. గ్రామంలో అందరికీ తనకు చేతనయినంత సహాయం చేసేడు. బీదలకు తన డబ్బు ఖర్చుపెట్టి ఉపకారం చేసేడు.

జాతీయోద్యమంలో పాల్గొని అరెస్టయి లాఠీదెబ్బలు తిన్నాడు.

మామయ్యకు బంధుప్రీతి ఎక్కువ. జాలిగుండె కలవాడు. ఎవరు కష్టంలో ఉన్నా చూడలేడు.

మామయ్యకు దైవంపైన నమ్మకం లేదు. చిన్నతనంలో అమ్మ "మనం తిరువళ్ళూరు వెళ్ళాలి - నీ మ్రొక్కుబడి తీర్చేందుకు ....." అని అంటే "నా కీ నమ్మకాలు లేవు" అని కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పాడు మామయ్య. "నీకు నమ్మకాలు లేకపోతే నీవు మ్రొక్కుకోకు. నాన్నా, అమ్మ వాళ్ళకోసం మ్రొక్కుకున్నారు. నీవు నీపిల్లల కోసం మ్రొక్కుకో కుండా ఉందువుగాని -" అని చెప్పి ఒప్పించింది అమ్మ.

అమ్మ దైవత్వం పైనకూడా మామయ్యకు చాలా కాలం వరకు విశ్వాసం లేదు. 1958లో అమ్మ మన్నవ వెళ్ళినప్పుడు - మామయ్య గారింటికి ఆహ్వానించారు. అమ్మ వెళ్ళింది. వాళ్ళు పూజచేసుకున్నారు ఆ సమయంలో పూజా కుంకుమ వారి నట్టింట పడింది. ఎంత తుడిచినా అది పోలేదు. అది మామయ్యకు కొంత ఆలోచన కలిగించింది.

వారికి - మొదటి సంతానం కలిగిన ఇరవై సంవత్సరాల పిమ్మట - ఒక ఆడపిల్ల పుట్టింది. తర్వాత ఆ కుంకుమ మాయమయింది. ఆ రెండు సంఘటనలు అమ్మ అనుగ్రహ ఫలితాలే నని వారి నమ్మిక.

తర్వాత తర్వాత 1970 పిమ్మట మామయ్యకు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి గారితో పరిచయం కలిగింది. వారితో సంభాషణలు చేసి, సంవాదాలు చేసిన ఫలితంగా మామయ్యలో విశ్వాసం పెరిగి పెరిగి మహావటవృక్షం అయింది. క్రమంగా అమ్మను గురించిన సాహిత్య మంతా సావధానంగా అధ్యయనం చేశాడు. అమ్మ ప్రభోధించిన అద్వైత సిద్ధాంతం ఆయనను బాగా ఆకర్షించింది.

ఈ లోకానికి జ్ఞానభిక్ష పెట్టడం కోసమే అమ్మ అవతరించింది - అని నమ్మి, అందరికీ ఆ విషయాన్నే చెప్పేవాడు.

తరుచుగా అమ్మను చూచేందుకు మన్నవ నుంచి జిల్లెళ్ళమూడి వచ్చి ఎక్కువ రోజులు అమ్మ వద్ద ఉంటూ అనేక వేదాంత విషయాలు జిజ్ఞాసతో అడిగి తెలుసుకునే వాడు. ఈ కాలంలోనే అమ్మను అంతకు ముందు 'అమ్మాయి' అని పిలిచేవాడు 'అమ్మ'గా మార్చుకున్నాడు.

అమ్మఫోటో ఒకటి మన్నవ తీసుకువెళ్ళి నిత్యము దానిని పూజించడం ప్రారంభించాడు. అంతకుముందు వారింట పూజా సంప్రదాయమే లేదు. ఎవరైనా దైవపూజ చేస్తున్నా. హారతి ఇస్తున్నా మామయ్య ఆగ్రహోదగ్రుడై పోయేవాడు.

అమ్మలోని 'అమ్మ'తో పరిచయమై సామీప్యం ఏర్పడిన కొలదీ మామయ్య జీవిత విధానంలోనూ, గుణగణాల్లోనూ గణనీయమయిన పరిణతి, పరిపక్వత కలిగాయి.

1980 జనవరి 1వ తేదీన అమ్మకు నమస్కరించి - అమ్మచేత "అంఆ" అని వ్రాయించు కున్నాడు. ఆనాటి నుంచీ దానినే మంత్రంగా జపించడం మొదలు పెట్టేడు. ఏపనిలోనయినా దీక్ష కలవాడు కాబట్టి ఇందులోనూ పట్టుదలే. క్రమేణా ఆయనకు ఏకాగ్రత సిద్ధించింది కానీ కోరుకున్నప్పుడు 'రూపదర్శనం' అయ్యేది కాదు. ఆ వరమూ కావాలని అమ్మను అర్థించాడు. తర్వాత ఆయనకు అదీ ప్రాప్తించింది.

గత అగష్టు మాసంలో మామయ్యకు గుండెజబ్బు వచ్చి గుంటూరు హాస్పిటల్లోనూ, మన్నవలోనూ ఉన్నప్పుడు మామయ్య 'అమ్మదర్శనం' పొందుతూ వచ్చాడు. అదే సమయంలో అమ్మకూ ఆరోగ్యం సరిగా లేక హైదరాబాద్‌లో ఉన్నది. మామయ్యకు అమ్మను చూడాలని బలమైనకోరిక ఉన్నా ఆరోగ్యం అనుమతించలేదు. కానీ అమ్మను చూడాలన్న ఆకాంక్ష మాత్రం తగ్గలేదు. రాత్రిం బవళ్ళు అమ్మను చూడాలని ఆరాటపడుతూ దుఃఖించేవాడు.

అమ్మ తిరిగి వచ్చింది. డిసెంబరు 2వ వారంలో మామయ్య జిల్లెళ్ళమూడి వచ్చాడు. రోజులో ఎక్కువ భాగం అమ్మ సన్నిధిలోనే గడిపేవాడు. అమ్మకూడా ఆయనయందు అత్యంతమైన ప్రేమను చూపేది.

డిసెంబరు 25వ తేదీన ఏకాంతంలో అమ్మ వద్ద కూర్చుని అనేక విషయాలు అమ్మతో మాట్లాడాడు. తాను అమ్మను గుర్తించానన్నాడు. ఇప్పుడెంతో హాయిగా ఉంటున్నదన్నాడు. గతం తల్చుకుంటే, మాత్రం బాధగా ఉంటుందంటే - అమ్మ "గతాన్ని తల్చుకొనడం ఎందుకూ ? ప్రస్తుతం హాయిగా ఉన్నదిగా, అట్లాగే ఉండూ -" అన్నది.

"నన్ను నీ బిడ్డగానే చూసుకో -" అని అమ్మని అర్థించాడు. అమ్మ "నేను ఎప్పుడూ అట్లాగే చూసుకుంటున్నాను. నీవు ప్రత్యేకంగా అడగనవసరంలే"దని చెప్పింది.

అమ్మమ్మ చనిపోయిన తర్వాత అమ్మ, మామయ్య బాపట్లలో చిదంబరరావు తాతగారింట్లో ఉంటున్నారు. వాళ్ళతోనే మరిడమ్మ తాతమ్మ ఉన్నది. ఒక రోజున "అన్నయ్య ఇంకా అన్నానికి రాలేదు. అందరం తిన్నాం. తల్లికి ఒక బిడ్డ రాకపోయినా

దిగులే" నన్నది అమ్మ. మరిడమ్మ గారికి ఆ మాటలు ఆశ్చర్యం కలిగించి "అదేమిటమ్మా - అన్నయ్యను పట్టుకుని బిడ్డ అంటావు. అయినా వాడు అన్నం తినకపోతే బాధపడే తల్లి కాస్తా పోయింది కదా!" అన్నది.

"వాడు అన్నం తినకపోతే బాధపడే తల్లి కాస్తా పోయింది కానీ ఎవరు అన్నం తినకపోయినా బాధపడే తల్లి ఉన్నది" అన్నది అమ్మ. మరిడమ్మగారికి అప్పటికీ అర్థంగాక "ఎవరు ఆమె?" అని ప్రశ్నించింది. "అడిగే ఆమెకు పెంచిన మమకారం ఉన్నది. ఈ మాట చెప్పే అమ్మ అమ్మగా అర్థంగాకుండా ఉన్నది" అని వివరించింది. అమ్మ.

అంటే మొదటినుంచీ అందరిపైలాగానే మామయ్యపైనా అమ్మకు పుత్రభావమే ఉంది.

"నాకు ఇక్కడనే స్థిరపడి పోవాలని ఉన్నది' అన్నాడు. అందుకు అమ్మ అంగీకరించింది.

డిసెంబరు 27వ తేదీన ఉదయం అమ్మ వద్దకు వచ్చి చాలాసేపు కూర్చున్నాడు మామయ్య. అమ్మ పసిపిల్లవానికి వలె ఆయన నోట్లో ఇడ్లీ పెట్టి తినిపించింది.

ఆ సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో విశ్వజననీ పరిషత్ ఆఫీసు ఎదురుగా ఉన్న బల్లపై కూర్చుని దినపత్రిక చదువుకుంటున్నాడు. అందులో విజయవాడలో జరుగుతున్న నాస్తిక మహాసభలను గురించి ప్రచురింపబడి ఉంది. ఆ వార్తల్లో 'లవణం' అన్న పేరు చూచి 'లవణం' అన్నది దేవుని పేరు కాదని ఆ పేరు పెట్టినట్లున్నది. లవణం అంటే మాత్రం దైవం కాదూ ? అంతా అదే అయినప్పుడు లవణం మాత్రం ఎందుకు కాదూ ? - అని ప్రశ్నించాడు.

ఈ వివరణ మామయ్యలోని జ్ఞాన పరాకాష్ఠ తెలియజేస్తున్నది.

మామయ్యకు 67 సంవత్సరాలు నిండాయి. పరిపూర్ణమయిన జీవితం అనుభవించాడు. భార్యా, ఒక కొడుకు, కూతురు ఉన్నారు. మామయ్యకు కోరిన వరాన్ని ప్రసాదించిన అమ్మ ఆ కుటుంబానికి దుఃఖ ఉపశమనాన్నీ, శాంతినీ అనుగ్రహిస్తుందని ఆశిస్తున్నాము.

(జనవరి 1981)



# 158
# "సామూహిక భోజనం"

అమ్మ వాత్సల్య ప్రపూర్ణ, అమ్మ హృదయం విశాలం. అమ్మ ఆలోచనలు సర్వజన హితాలు, ప్రయోగాత్మకాలు.

1958లోనే అమ్మ అన్నపూర్ణాలయం స్థాపించింది. ఆ అన్నపూర్ణాలయం అందరిల్లు అయి ప్రపంచ దృష్టినే ఆకర్షించింది. అన్నపూర్ణాలయంలో అమ్మను దర్శించేందుకు వచ్చిన ప్రతి ఒక్కరికీ ఉచిత భోజనమే. అక్కడ కుల, మత, వర్గ విచక్షణ ఏమీ లేదు. పెద్దవాడూ, పేద వాడూ అన్న భేదమే లేదు. రోజుకు ఇంతమందికే పెడతామన్న పరిమితులు లేవు. రోజూ ఈ సమయాల్లోనే పెడతామన్న నిబంధన ఏమీ లేదు. ఏ వేళ ఎంత మంది ఎవరు వచ్చినా అక్కడ ఆదరంగా అన్నం పెట్టబడుతోంది. అమ్మ చెప్పినట్లుగా జిల్లెళ్ళమూడికి ఎవరయినా ఆకలితో రావచ్చును గానీ జిల్లెళ్ళమూడి నుండి ఆకలితో బయటకు వెళ్ళరాదు.

ప్రస్తుతం అన్నపూర్ణాలయంలో నిత్యమూ యాత్రికులూ, విశ్వజననీపరిషత్‌లో స్వచ్ఛందంగా సేవచేసే వ్యక్తులూ, కుటుంబాలూ, ఓరియంటల్ కళాశాల, పాఠశాలల లోని విద్యార్థినీ విద్యార్థులు మాత్రమే భోజనం చేస్తున్నారు. వీరు కాక మరెన్నో కుటుంబాలు ఆ ఆవరణంలోనే నివసిస్తూ ప్రత్యేకంగా వంటచేసుకుంటున్నాయి.

అందరూ కలిసి ఒకే పంటలో ఒకే చోట భోజనంచేస్తే ఎట్లా ఉంటుందీ ? - అని అమ్మకు విలక్షణమయిన ఆలోచన కలిగింది.

అమ్మకు ఒక ఆలోచన వస్తే - వెంటనే దానిని అందరికీ చెప్పవలసిందే. అది ఆచరణలో పెట్టవలసింద్దే.

సంస్థలోని ముఖ్య కార్యకర్తలను పిలిచి వారికి వివరించింది. కొందరు బాగుంది - అన్నారు. కొందరు - ఇది సాగడం కష్టం - అన్నారు. అందరూ కలిసి ఆలోచించి నిర్ణయించమని ఆదేశించింది అమ్మ.

దాని ఫలితమే - 1981 జనవరి 16వ తేదీన అన్నపూర్ణాలయంలో అమ్మ సంకల్పించిన సాముహిక భోజనానికి ప్రారంభోత్సవం జరిగింది.

ఆ ఉత్సవానికి అమ్మ క్రిందికి దిగి అన్నపూర్ణాలయానికి విచ్చేసింది. ఆ సభలో డాక్టర్ రాధాకృష్ణశర్మగారు ప్రసంగిస్తూ - ఈ విధానం అపూర్వమయినదీ, ఆదర్శ మయినదీ - అని ఉద్ఘాటించారు. సమష్టి కుటుంబ వ్యవస్థ విచ్ఛిత్తి పొందుతున్న ఈ కాలంలో అమ్మ ఈ విధానాన్ని ప్రవేశపెట్టడం ఆదర్శప్రాయమయిన సమష్టి కుటుంబ వ్యవస్థకు అమ్మ పునరుజ్జీవనం ప్రసాదించడమే - నని ప్రకటించారు.

16వ తేదీన ప్రారంభమయిన సాముహిక భోజన పద్ధతి జయ ప్రదంగా జరుగుతూ అందరికీ ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కలిగిస్తున్నది.

ఇది సాధ్యమా ? - అని భయపడ్డవారందరికీ అమ్మ సంకల్పిస్తే 'అసాధ్యం' అనేది లేదని మరొకసారి ఋజువయింది అమ్మ సంకల్ప సిద్ధ, ఘటనాఘటన సమర్థ గదా !

అమ్మ ప్రవేశపెట్టిన విలక్షణ నూతన విధానంలో సామాజిక ఆదర్శమే కాక వ్యక్తిగత ఆధ్యాత్మిక సాధనకూడా ఇమిడి ఉంది.

మొదట్లో కష్టం అయినా వ్యక్తి భోజనపరమయిన ఇష్టానిష్టాలపై విజయం సాధించి క్రమంగా జిహ్వను జయిస్తాడు. అప్పుడు అన్నం జిహ్వాచాపల్యంకోసం కాక ఆకలికి మాత్రమేనని గ్రహిస్తాడు. క్రమంగా జితేంద్రియుడవుతాడు. జితేంద్రియుడయిన వ్యక్తి స్థిత ప్రజ్ఞుడవుతాడు. స్థితప్రజ్ఞయే వ్యక్తి ధ్యేయం కదా !

(ఫిబ్రవరి 1981)



### తలంబ్రాలు

తలంబ్రాలు అంటే తలంపులు. ఒకరి భావాలు మరొకరికి అరమరికలు లేకుండా చెప్పుకొనమని వధూవరులకు సూచన.

- అమ్మ

# 159
# ఈశ్వరత్వ విధాయిని

లోకంలో అప్పుడప్పుడు వింతలు జరుగుతుంటాయి. ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తుంటాయి. ప్రళయాలు ప్రభవిస్తుంటాయి.

ఔషధాలు వ్యాధిగ్రస్తం కావచ్చును. అమృతానికి ఆయువు క్షీణించవచ్చును సూర్యుడు చల్లబడవచ్చును. చంద్రుడు మంటలను విరజిమ్మవచ్చును.

వీటన్నిటికి కారణాలు ఉండవా? అంటే - ఉండి తీరతాయి. కానీ సామాన్య జనానికి పూర్వాపరాలు అవగాహన కాకపోవచ్చును. విధి నిర్ణయమయిన ప్రతిదాని లోనూ వ్యక్తా వ్యక్తమై అంతరార్థముంటుంది.

ఫిబ్రవరి 16వ తేదీన తెల్లవారుజామున సుమారు 3 గంటలకు అటువంటి విచిత్రమయిన దుర్ఘటన జిల్లెళ్ళమూడిలో జరిగింది.

సర్వసృష్టి స్థితి లయకారిణి, నిత్యసుమంగళి, నిత్యసువాసిని, పతివ్రతా శిరోమణి, పాతివ్రత్య స్వరూపిణి అయిన అమ్మకు పతిదేవులు, మనందరకు ప్రియతమమైన నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు అసువులు వీడారు.

మేము గమనించే లోపల, వైద్యులు చికిత్సా ప్రయత్నం చేసేలోపల సర్వం ముగిసింది. ఒక మెరుపు మెరిసినట్లు, ఒక పిడుగు పడ్డట్లు అంతా క్షణాల్లో జరిగిపోయింది. గుండెపోటు రావడమూ, ప్రాణాలను హరించడమూ రెండు క్రియలుగా జరగలేదు - దీపం మలగడమూ, చీకటి వ్యాపించడమూలాగా.

ఇది - నాన్నగారి నివాస భాగంలో జరిగింది. వెంటనే అమ్మ నివాస మందిరానికి పైకి పరుగెత్తాము. సర్వశుభంకరి అయిన అమ్మకు ఈ దుర్వార్త నందించడం ఎలా ? అందులో ఈటీవల అమ్మ ప్రమాదకరమైన అనారోగ్యానికి గురై ఇంకా పూర్తిగా స్వస్థత పొందలేదు. అమ్మగుండెకూడా చాలా బలహీనంగా ఉందని వైద్యులు చెబుతున్నారు - అయినా అమ్మకు చెప్పకుండా ఎంతకాలం దాచగలం ??

గుండెరాయి చేసుకుని, దుఃఖాన్ని దిగమ్రింగి - అమ్మ పాదాలు పట్టుకుని ఈ హాలాహలాన్ని అమ్మ చెవులో పోశాము. అమ్మ ఒక్క లిప్తపాటు నిర్విణ్ణయై, నిశ్చేష్టయైనట్లు కనిపించింది. కానీ వెంటనే నాన్నగారిని పైకి తీసుకుని రండి - అని ఆదేశించింది.

మేము గబగబా నాన్నగారిని పైకి తీసుకువచ్చి - అమ్మ మంచం పక్కనే మంచం వేసి ప్రక్క వేసి పడుకోబెట్టాము. అమ్మ తన మంచాన్ని నాన్నగారి మంచానికి అనుకునేటట్లు జరపమన్నది. జరిపాము.

మంచాలు రెండు తూర్పు - పడమరలుగా ఉన్నాయి. అమ్మ మంచం దక్షిణ దిక్కున, నాన్నగారి మంచం ఉత్తరపు దిక్కున ఉన్నాయి. అమ్మ తన మంచం పట్టెమీదకు జరిగి నాన్నగారి వైపు తిరిగి తన కుడిచేతిని నాన్నగారి గుండెలపై ఉంచింది. అప్పుడు గం. 3.15 ని. అయింది. అప్పటి నుండి అమ్మ మరునాడు ఉదయం 11 గంటల వరకు అలాగే పడుకున్నది. చూసినవాళ్ళకు నాన్నగారు నిద్రపోతున్నట్లున్నది. ముఖం తేజోవంతమై అతి ప్రశాంతంగా ఉంది

అమ్మా, నాన్నగారలా ఒకరి సరసన ఒకరు పడుకుని ఉంటే అదోచూడ ముచ్చటయిన దృశ్యం అయింది. కానీ - అంతలోనే జరిగిన దారుణ సంఘటన తలుచుకుంటే ప్రతి ఒక్కరికీ గుండెలు బ్రద్దలవుతాయేమో నన్నంత దుఃఖతీవ్రత కలుగుతోంది.

ప్రాణోత్క్రమణం జరిగిందని డాక్టర్ ఇనజకుమారి ప్రకటించి నప్పటికీ - మాకు డాక్టర్ మాటపై నమ్మకం లేకపోవడం, ఆమె తెలివి తేటలను శంకించడం కాదు కానీ, ఆ ప్రకటనను పూర్తిగా నమ్మటానికి మనస్సు అంగీకరించలేదు. అమ్మ శక్తి సామర్థాలపై పరిపూర్ణమయిన విశ్వాసం కలవాళ్లం కాబట్టి ఆ సంఘటన అలాగే సమాప్తం కాదని ఆశ. అమ్మ - తానెక్కిన కొమ్మను తానే నరుక్కుంటుందా - అని సందేహం. ఏదో క్షణంలో అమ్మ మహిమాతిశయ ప్రభావితులైన నాన్నగారిలో ప్రాణజ్యోతి తిరిగి ప్రభాసమానమవుతుందని నమ్మకం.

అమ్మను చూడడానికే మనసొప్పడం లేదు. ఇంత మందిని ఇన్ని కష్టాల నుండి గట్టెక్కించిన తల్లి కే ఇంత కష్టమా ? ఎందరి మంగళ సూత్రాలనో కాపాడిన సర్వమంగళకే అమంగళమా ? ఆపదుద్ధారిణి ఐదవ తనానికే ఆపదా ? ఎందరి కన్నీటినో తుడిచిన కన్నతల్లియే కన్నీటి కడలిలో మునిగిపోతున్నదా ? పరమేశ్వరి అయిన అమ్మ పసుపు కుంకుమలకే లోపమా ?

కాదు - ఇలా జరగడానికి వీల్లేదు. ఈ అగాధం నుండి అమ్మ తన్ను తానే ఉద్ధరించుకోవాలి. ఉద్ధరించుకుంటుంది. అలా అమ్మను ప్రార్థించాలి !

ఈ సందేహ విశ్వాసాల ఉత్తుంగ తరంగాలతో సంక్షుభితమయ్యే కాసారంవలే మనస్సులు కల్లోలితంగా ఉండగానే - తెల్లవారింది. అమ్మలో కదలిక లేదు. నాన్నగారిలో కదలిక లేదు. సర్వప్రకృతీ స్తంభించినట్లు అంతా నిశ్శబ్దంగానూ, నిర్జీవంగానూ ఉంది.

మా ఆశలు అడుగంటాయి డాక్టరుగారి ప్రకటన నిజమైంది. మేము ఏమి చేయాలి ?

ఎవరికీ బుద్ధి పనిచేయడం లేదు. ఎవరిని చూసిన కదలని బొమ్మలవలే కూలబడి పోయారు.

బంధువులకూ, భక్తులకూ, అనుబంధం ఉన్నవాళ్ళందరికీ టెలిఫోన్లపై ఈవార్తను అందజేయక తప్పింది కాదు.

మధ్య మధ్యలో అంతరంగంలో ఒకరయితే, బహిరంగంగా మరొకరూ - అమ్మను ప్రార్థిస్తూనే ఉన్నాము.

అమ్మలో ఉలుకూ పలుకూ లేదు. అలాగే పడుకున్నది. అంతా చైతన్యమే, జడమే లేదు । అనే అమ్మకు నాన్నగారిలో ప్రాణరాహిత్యమేమీ కనుపించ లేదేమో !

జడానికీ - చైతన్యానికీ భేదం చూసే మాలో క్షణక్షణానికీ అసహనం ప్రబలిపోతున్నది. దుఃఖం పెరిగిపోతున్నది.

అమ్మను చూస్తే ఒక క్షణంలో జాలి కలుగుతున్నది. మరో క్షణంలో కోపం వస్తున్నది.

ఏమిటీ అమ్మ తత్వం ? తన సంగతే తాను తెలుసుకోలేకుండా ఉన్నదా? మనపై రవ్వంత కరుణ కూడా లేదా ? లేక మన మొరవినిపించం లేదా ? మన దుఃఖాగ్ని అమ్మ హృదయాన్ని కరింగించలేక పోతున్నదా ?

ఉదయం 10 గంటలయ్యేసరికి - ఈ వార్త తెలిసిన జనం రావడం మొదలుపెట్టారు. 12 గంటలయ్యేసరికి చాలా మంది వచ్చారు. ఆవరణమంతా శోకమగ్నమై పోయింది. అయితే ఎక్కడా - ఏడుపులూ, పెడబొబ్బలూ వినపించలేదు. అంతా మౌన రోదనమే. ప్రతిగుండె దుఃఖాగ్ని గుండమై పోయింది.

ఆ రోజున అక్కడ అమ్మసన్నిధిలో రెండు ఉపనయనాలు, ఒక వివాహం జరగవలసి ఉంది. జిల్లెళ్ళమూడిలో ఏ శుభకార్యం అయినా అమ్మ చేతిమీదుగా - జరగవలసిందే కదా ! - మరి, ఆ సమయంలో నయినా అమ్మను అడిగితే లేచి వచ్చి ఆ శుభకార్యాన్ని తనచేతిమీదుగా జరిపించి వాళ్ళను హృదయపూర్వకంగానే ఆశీర్వదించేదేమో ? ఏమో, ఏముందీ - తప్పక ఆశీర్వదించేది. కానీ - ఎవరు సాహసించగలరు ?

వాళ్ళు వెనుదిరిగి వెళ్ళిపోయారు.

అయినా ఆవవరణంలో ఎందరో కొత్తజనం. కళాశాల విద్యార్థినీ విద్యార్థులు, పెద్దలు, పిన్నలు....

అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మ సన్నిధిలో జనానికి పస్తులా ?

అది అమ్మకు తెలిస్తే సహిస్తుందా ? అందువల్లనే అన్నపూర్ణాలయంలో యధావిధిగా గాడిపొయ్యి మండింది. దుఃఖాగ్నితో మరింతగా మండింది.

వంటలయినాయి, గంటలు మ్రోగాయి అయితే ఎవరికి అన్నం సహిస్తుంది? ఎవరు తింటారు ? వేదనాగ్నిని జయించిన జఠరాగ్ని ప్రజ్వరిల్లినవారు అన్నం తిని ఒక మంటఅయినా చల్లార్చుకొనగలిగారు.

ఒక్క రొక్కక్కరు గ్రామస్తులు వచ్చారు. వారి ప్రియతమ నాయకుని కడసారి చూడడానికి తహతహలాడి పోయారు.

అమ్మ, నాన్నగారి ప్రక్క నుండి లేస్తే - తలుపులు తీసి అందరికీ నాన్నగారిని చూసే అవకాశం ఏర్పాటు చేయాలని ఆలోచించాము. కానీ, అమ్మ నాన్నగారిని వదిలితేకదా ? అమ్మను ఆ తన్మయస్థితి నుండి ఎవరు విడదీస్తారు ? ఎవరు విడదీయగలరు ?

సాయంకాలం మూడు గంటలయింది. జనం దుఃఖానికి తట్టుకోలేకుండా ఉన్నారు. నాన్నగారిని చూడక నిలవలేకుండా ఉన్నారు. అప్పుడు అమ్మను అలాగే ఉంచి తలుపులు తీశాము

ఇద్దరూ అలాగే నిశ్చేతనంగా పడుకుని ఉన్నారు. ఎవరిలో ప్రాణముందో - ఎవరిలో లేదో గూడా తెలీడంలేదు. నాన్నగారి ముఖంలో నిర్జీవకళా లేదు, అమ్మ ముఖంలో దుఃఖోద్విగ్నతా లేదు. ఇద్దరి ముఖాలూ అలాగే ఉంచి తలుపులు తీశాము.

దేవాలయానికి వెళ్ళి నమస్కారం చేసుకుని వచ్చినట్లు ఒక్కొక్కరూ నమస్కారం చేసుకుని తిరిగి వచ్చారు. ఎంతగానో శోకం పెల్లుబికి హాహాకారాలతో ఆవరణం ప్రతిధ్వనిస్తుందేమోనని భయపడ్డాంగానీ అలా జరగలేదు. అందరిలోనూ విచిత్రంగా ఒక రకమయిన నిర్లిప్తత ఆవరించింది. నాన్నగారెక్కడకూ - పోలేదు, మనతోనే ఉన్నారు - అనే భావం కలిగి బలపడడం మొదలయింది.

నెల్లూరు డాక్టర్ శ్రీ సుబ్బారావుగారు, శ్రీమతి గజేంద్రమ్మ మొదలయిన కొంతమంది అమ్మ చెవిదగ్గరకు చేరి తమ ప్రార్థనలు తీవ్రంగా వినిపంచారు ఒక్కొక్కసారి నిషులురోక్తులతో పోట్లాడారుగూడా. ప్రాణం పోగొట్టుకున్న అనేకులను అమ్మ పునర్జీవులను చేసిన సంగతిని అమ్మకు గుర్తు చేశారు. ఇది ఉపేక్షకు సమయం కాదన్నారు. ఇప్పుడు ఉపయోగపడకపోతే అమ్మ శక్తిసామర్థ్యాలు వ్యర్థమే నన్నారు.

లోగడ హైమవిషయమంలోనూ ఇలాగే జరిగింది. అప్పుడు మాత్రం జరిగిన దానిని అమ్మ ఏమి మార్చింది ? ఏదయినా అమ్మకు తెలియకపోతేగదా - మనం చెప్పిచేయించ గలగడం? దీనిని మరొకరు చేస్తే గదా - అమ్మ దీనిని ప్రతిఘటించడం, ప్రతిక్రియ జరపడం ?

ఆ రాత్రి, మరునాడు తెల్లవారి హైదరాబాద్, మద్రాసు, విశాఖపట్నం, విజయవాడ, మచిలీపట్నం, నెల్లూరు.... పలు పట్నాల నుండి పల్లెల నుండి అనేకులు నాన్నగారి అంతిమ సందర్శనం కోసం వచ్చారు.

అమ్మ మాత్రం నాన్నగారిని వదిలి పెట్టలేదు. అమ్మ ఎప్పుడు వదిలిపెట్టింది కనుకా ! ఒకసారి అమ్మ అన్నది - వారు నన్ను వదిలి పెట్టినా, నేను వారిని వదలి పెట్టను - అని.

అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే - అమ్మే నాన్నగారిని ఏరి కోరి పెండ్లి చేసుకున్నది. నాన్నగారు అమ్మకు మేనత్త కొడుకే అయినా ఆ పెండ్లికి అనేక అవాంతరాలు వచ్చాయి. అమ్మ వాటన్నిటినీ అధిగమించి చివరకు 1936 మే 5వ తేదీన నాన్నగారిని పెండ్లి చేసుకున్నది.

పెండ్లి అయిన తర్వాత - అమ్మలో అతిమానవశక్తిని అంతకు పూర్వమే గమనించినవాళ్ళు అనేకులు అమ్మను ప్రశ్నించారు. 'అమ్మా - నీకీ పెండ్లి ఎందుకూ?' అని.

"ఎన్ని వచ్చినా వాటికీ మనసుకీ సంబంధం లేదని చెప్పడం కోసమే యీ పెళ్ళి" అనీ, "పెండ్లిలో పెద్దపులి ఉందని భయపడే వారి భయం పోగొట్టడం

కోసమే యీ పెండ్లి" అనీ అమ్మ వివరించింది. "చేసేదంతా దైవసేవ అని భావించ గలిగితే - సంసారం అధ్యాత్మిక సాధనకు భంగకరం కా" దని ఉద్ఘాటించింది. "పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించిందే పతివ్రత" "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి" "స్త్రీకి పతియే దైవం" అని ప్రవచించింది.

అమ్మ తన గళంలోని మంగళసూత్రాలను నాన్నగారి పవిత్ర పాదాలుగానే సంభావన చేసి నిత్యమూ అభిషేకిస్తుంది; ఆ మంగళసూత్రాలే తనకు అన్ని సూత్రాలనూ అవగతం చేశాయట. అనుదినము మంగళసూత్రాలను అభిషేకించిన తీర్థం స్వీకరిస్తుంది. ఆ తీర్థమే అందరికీ తీర్థం వేసే అర్హతను తనకు ప్రసాదించిందట.

నిత్య జీవితంలో కూడా అమ్మ నాన్నగారిని అంటిపెట్టుకునే ఉన్నది, వెన్నంటే ఉన్నది - అని చెప్పడానికి నిదర్శనాలు కోకొల్లలుగా ఉన్నాయి. అటువంటి ఘట్టాలనేకం నాన్నగారే స్వయంగా వెల్లడించారు నాన్నగారు ఏదయినా పనిమీద గ్రామాంతరం వెళ్ళినా. అమ్మ అభౌతికంగా అదృశ్యంగా నాన్నగారి వెంటనే ఉండేదట. కొన్ని సమయాల్లో అమ్మ కంఠం వినిపించడమూ, అమ్మ గోచరించడమూ జరిగేది.

1954లో నాన్నగారు విజయవాడలో ఒక చోట కూర్చుని లేచి వెళ్ళుతూ - కూర్చున్న చోట తన సంచి మరిచిపోయి వెళుతుంటే.... అమ్మగొంతు వినిపించిందట. సంచి మరచి వెళుతున్నారు, తీసుకోండి - అని, వెంటనే నాన్నగారు ఆ సంచీ తెచ్చుకున్నారు. ఆ సంచీలో అతి ముఖ్యమయిన కాగితాలు ఉన్నాయట.

1963లో నాన్నగారు మొక్కపాడులో చాలీచాలని సులక మంచంపై పడుకుంటే - జిల్లెళ్లమూడిలో ఉన్న అమ్మ శ్రీమతి వసుంధర వాళ్ళతో ఆ విషయం చెప్పి సరయిన ఏర్పాటు చేయమని ఆదేశించింది

1972లో నాన్నగారికి గుంటూరులో డాక్టర్ జె.వి. కృష్ణారావు గారి ఆసుపత్రిలో ఆపరేషన్ జరుగబోతుండగా నాన్నగారు అమ్మకు ఒక ఉత్తరంలో "ఆపరేషన్‌ను తిలకిస్తూ, ఆ సమయంలో నీవు జిల్లెళ్ళమూడిలో యుండిననూ, నా చెంతనే ఉండగలవనియె నమ్మిక" అని వ్రాసుకున్నారు. మరి, అంతకు ముందు ఎన్ని సంఘటనలు ఆధారంగా నాన్నగారికి ఆ నమ్మిక ఏర్పడిందో ! అమ్మ నాన్నగారిని అనేక ప్రమాదాల నుండీ, ప్రాణాపాయ స్థితులనుండీ కూడా కాపాడింది. ఒకసారి అలాగే ఒక బస్సు ప్రమాదం నుండి తప్పించింది. 1975లో నక్సలైట్లు జిల్లెళ్ళమూడి ఆశ్రమంపై దాడిచేసినప్పుడు - అంతకు కొద్ది నిమిషాల ముందే నాన్నగారిని ఆ స్థలం నుండి మరోచోటుకు పంపింది. లేనియెడల ఆనాడు నాన్నగారికి ప్రాణసంకటం యేర్పడి ఉండేది.

16వ తేదీ రాత్రి సోదరుడు రవి అమ్మ వద్దకు వెళ్ళి కర్తవ్యోప దేశం కోరాడు. అప్పుడు అమ్మ తన సంకల్పాన్ని వివరించింది. 1956లో శంకుస్థాపన జరిగి నిర్మాణం కొంత వరకు అయి ఆగిపోయిన దేవాలయంలో నాన్నగారిని భూస్థాపన చేస్తానన్నది. అందుకు అవసరమయిన ఏర్పాట్లను చేయమని ఆదేశించింది.

"నాన్నగారు ఎక్కడకు వెళ్ళలేదు, వెళ్ళరు. మనతోనే మన మధ్యనే ఉంటా' ' రని చెప్పింది. ఆ ప్రకటనతో చాలమందికి దుఃఖోపశమనం కలిగింది. అదీగాక అమ్మ - "సృష్టిలో సహజమయిన పరిణామం జరిగింది. ఎవరూ దుఃఖపడాల్సిన అవసరం లే"-దని ప్రకటించింది. దానితో అందరి కన్నీళ్ళు - ఎడారిలో వానవల్లే - ఇంకిపోయాయి.

లోగడ అనేకసార్లు అమ్మ "మరణమంటే పరిణామమే" అనీ, "దేవుడు పంపిన మనిషి దేవుడు పిలిస్తే - వెళితే - మధ్యలో ఏడుపు మనకెందుకూ?" అనీ ప్రవచించింది. కానీ - కేవలం తన గుండెపైననే పిడుగు పడ్డప్పుడుకూడా అమ్మ అలా నిర్వికారంగా అనుద్విగ్న మానసయై ఉంటుందని ఎవరూహించగలరు ?

లోగడనే అమ్మ మరో మాటను కూడా అన్నది. ఎవరికైనా జబ్బు చేసిననాడు తనకూ ఆందోళనగా ఉంటుందట. మనిషి చనిపోయిన తర్వాత తనకు అంతా నిండుగా, పండగ్గా ఉంటుందట.

నిజమే - ఇతరుల మరణం అయితే ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చును. కేవలం తన భర్త, తాను ప్రాణాధికంగా ప్రేమించిన, తాను దేవుడని ఆరాధించిన పతి, తన జీవిత భాగస్వామి, తన సహచరుడు, తన సర్వస్వం శాశ్వతంగా తనకు దూరమైనప్పుడు కూడా ఎవరు ప్రశాంత చిత్తులై ప్రవర్తించ గలరు ?

తాను, నాన్నగారు వేరుకాదన్న భావమే అందుకు కారణమేమో !

17వ తేదీ ఉదయం 11 గంటలకు అమ్మ నాన్నగారి వద్ద నుండి లేచింది. స్నానం చేసి వస్తా నన్నది. ఈలోగా నాన్నగారి భూస్థాపనకు అవసరమయిన ఏర్పాట్లను చేయమన్నది. క్రితం రాత్రే అవసరమయిన ఉప్పు, విభూతి తెప్పించాము. దేవాలయ గర్భంలో, అమ్మ సూచన ననుసరించి వామభాగంలో భూగృహాన్ని నిర్మించాము.

సరిగ్గా మధ్యాహ్నం 12 గంటలకు అమ్మ హైమాలయవేదికపైకి విచ్చేసింది. ఆ ప్రదేశమంతా షామియానాలతో, రంగు కాగితాలతో, మామిడి తోరణాలతో శోభాయమానంగా అలంకరించబడి ఉంది. మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. అమ్మ సర్వాభరణ సంశోభితయై దివ్య దీధితుల వెలార్చుతూ ఉన్నది. విశాఖపట్నం

సోదరులు అమ్మను పుష్ప మాలాలంకృతను చేసి లలితా సహస్రనామావళితో పూజించుకుని కొత్తగా ప్రచురించిన లలితాసహస్రనామ పుస్తకాలను సమర్పించారు.

తన పాదాలు పూజించే సమయంలో అమ్మ తన మంగళ సూత్రాలను ఎడంచేతిలో పెట్టుకుని కుడిచేత్తో పూజించింది. ఒక గ్లాసుతో నీళ్ళు తెప్పించి మంగళసూత్రాలను ఆనీటిలో కడిగి ఆ తీర్థాన్ని త్రాగింది.

అంతలో నాన్నగారి పార్థివ దేహాన్ని మంచంపైనే పడుకోబెట్టి తీసుకుని వచ్చారు. అమ్మ ఆదేశంతో నాన్నగారిని హైమాలయకుడ్యానికి ఆనించి తూర్పుదిశకు అభిముఖుల్నిచేసి ఆసీనుల్నిచేశాము. ఋత్విక్కులు అభిషేకరుద్రాలు పఠిస్తుండగా - గుమికూడిన జనం కన్నులింతలు చేసుకుని చూస్తుండగా - అమ్మ నాన్నగారి తలకు నూనె రాచి, సీకాయతో తల రుద్ది, క్షీరాభిషేకం చేసింది.తర్వాత ప్రజలందరూ క్షీరనీరాలతో నాన్నగారిని అభిషేకించారు. పిమ్మట అమ్మ నాన్నగారిని మళ్ళీ పంచామృతాలతో అభిషేకించింది. శుద్ధోదకంతో స్నానం చేయించింది. పరిమళ ద్రవ్యాలు అలిమింది. నూతన వస్త్రాలు కట్టింది. నాన్నగారి నుదుట శైవ, వైష్ణవ, శాక్తేయ సంప్రదాయాలు ప్రతిఫలించే విధంగా - విభూతితో కుంకుమతో అలంకరించింది. నూతన యజ్ఞోపవీతం వేసింది. తాను కట్టుకునే పీతాంబరం కప్పింది. మెడలో పూలమాలలు వేసి దోసిళ్ళతో రంగురంగుల రకరకాల పూలు నాన్నగారి తలపై కుమ్మరించింది. ఆ దృశ్యం చూస్తుంటే - అమ్మ పెండ్లి పీటలపై నుండి నాన్నగారికి తలంబ్రాలు పోస్తున్నట్లే ఉన్నది. మరి, ఆ ఉత్సాహమూ, సంరంభమూ అమ్మలో అలా కనిపించాయి.

అమ్మ నాన్నగారికి అభిషేకం చేస్తుండగా నాన్నగారి నాసికా రంధ్రా లనుండి ఎఱ్ఱని రక్తం స్రవించింది. ఆ రక్తస్రావం చూసిన మేము అమ్మ నాన్నగారికి పునఃప్రాణ ప్రతిష్ఠచేసినట్లే భావించాము

గమనార్హమయిన ఇంకొక విషయం జరిగింది. 16వ తేదీ నుండి 17వ తేదీ ఉదయం 11 గంటల వరకు అమ్మ స్పర్శ ఉన్నంత వరకు నాన్నగారి దేహం పరిశుభ్రంగా ఉంది అమ్మ స్నానానికి లోపలకు వెళ్ళిన క్షణం మొదలుకొని శిథిలం కావడం ఆరంభమైంది.

మధ్యాహ్నం గం. 3.00 ని.లకు అమ్మ నాన్నగారి దేహంతోపాటు గర్భాలయ ప్రవేశం చేసింది - ఋత్విక్కులు శ్రీసూక్త పురుష సూక్తులూ, పృథివీసూక్తమూ, లలితా సహస్రనామావళి పఠించారు.

నాన్నగారి దేహం రబ్బరు బొమ్మవలె వంగగా - పద్మాసనంలో నాన్నగారిని భూగృహంలో ఆసీనులను చేయడం జరిగింది. క్రమేణా లవణ భస్మరాసుల్లో

నాన్నగారిని అమ్మ ముంచేసింది. అప్పుడు తన కాలివేలి, చేతివేలి ఉంగరాలు, చేతి బంగారు గాజులు, చెవుల దిద్దులు, ముక్కు బులాకీ తీసి అందులో వేసింది. చివరకు తాను కట్టుకున్న చీరె, రవికెకూడా తీసి అందులో సమర్పించింది.

ఈ కార్యక్రమం జరిగే సరికి గం. 3.40 ని. లయింది.

పై విషయం మైకులో చెప్పబడగానే - శ్రోతలందరూ ఒక్కసారిగ భయాందోళిత మనస్కులైనారు - అమ్మను నిరలంకారగా దర్శించడం ఎలాగునా - అని కానీ మనందరి అదృష్టం కొద్దీ అమ్మ మళ్ళీ సర్వాభరణభూషిత అయి, పట్టుచీరె కట్టుకుని దరస్మిత వదనయై బయటకు వచ్చి అందరి హృదయాల్లోనూ శాంతి సుధలను వర్షించింది.

అదొక విచిత్రమైన ఆసక్తికరమైన విషయం. తన జన్మనక్షత్ర మయిన పునర్వసులో నాన్నగారు మానవదేహాన్ని వదిలి - అమ్మ జన్మనక్షత్రమైన ఆశ్లేషా నక్షత్రంలో అనసూయేశ్వరులై ఆవిర్భవించారు. ఆలయానికి అమ్మ అనసూయేశ్వ రాలయమని నామకరణం చేసింది.

ఆ మరునాటి నుండి 11 రోజులు ఆలయంలో ఉదయం 11 మంది ఋత్విక్కులతో మహాన్యాసపూర్వకంగా మహారుద్రాభిషేకమూ, సాయంకాలం లలితా లక్షనామపూజ చేయడంకోసం నిర్ణయమైంది.

18వ తేదీ ఉదయం ఆలయంలో నిత్యపూజను అమ్మ స్వయంగా ప్రారంభించింది. అక్కడ అఖండ దీపారాధన చేసింది. అభిషేకాన్ని ప్రారంభించింది. సాయంకాలంకూడా పూజలో స్వయంగా పాల్గొని నివేదన, నివాళి తానే ఇచ్చింది.

ఈ విధంగా అమ్మ పూజచేయడం ఇదే మొదటిసారి కావచ్చు.

28వ తేదీ వరకు ఆలయంలో నిత్యాభిషేకాలు, పూజలు సోదరులు సుబ్బారావు, రవి చేసుకున్నారు. శ్రీ అన్నవర్తి కృష్ణశర్మ ప్రధాన ఋత్విక్కుగా వ్యవహరించి అత్యంత సమర్థంగా క్రతువును నిర్వహించారు. వారికి స్థానిక కళాశాల అధ్యాపకులూ, విద్యార్థులూ పూర్తిగా సహకరించారు.

28వ తేదీన గ్రామంలో నాన్నగారి చిత్రపటానికి వైభవోపేతంగా ఊరేగింపు జరిగింది. ఉదయం 5 గంటలనుండి 9 గంటలవరకు మహారుద్రాభిషేకం జరిగింది. ఉదయం 9 గంటల నుండి సాయంత్రం 7 గంటలవరకు లలితా నామపారాయణ జరిగింది. అందులో మొత్తం 250 మంది పాల్గొన్నారు. మొత్తం 13 రోజుల్లోను నాన్నగారి వయస్సు 68 సంవత్సరాలు కాబట్టి 68 లక్షల నామపారాయణం జరగడం విశేషం.

ఆ సాయంకాలం సభ జరిగింది. అందులో ప్రధానవక్త శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు, వారు అమ్మ నాన్నగార్లు ఒక్క శక్తియే ననీ, ఆశక్తి లోకంలో నష్టమై భ్రష్టమైపోతున్న దాంపత్య ధర్మాన్ని పునరుద్ధరించడంకోసం, భార్యయెడల భర్త, భర్త యెడల భార్య ఎలా నడుచుకోవాలో లోకానికి పాఠం చెప్పడంకోసమే దిగి వచ్చిందనీ వివరించారు.

నిజమే - నాన్నగారంటే అమ్మకు సాక్షాత్తూ దైవమే. ఆ విషయాన్ని అనేక పర్యాయాలు ప్రకటించింది. జీవితంలో ఆచరణలో చూపెట్టింది. నాన్నగారికీ అమ్మంటే ఎనలేని గౌరవం. నాన్నగారి దృక్పథంలో అమ్మ దేవతయే. నాన్నగారు అమ్మను ధ్యేయంగా పెట్టుకుని జపమూ, ధ్యానమూ కూడా కొన్నాళ్లు చేసుకున్నారు.

అమ్మ అలౌకిక శక్తులను అనేకం నాన్నగారు స్వయంగా దర్శించారు. అమ్మ పొందిన యోగపరాకాష్ఠ స్థితులయిన భ్రూకుటీవిభేదనం, కపాలభేదనం నాన్నగారు చూశారు. ఒకనాడు అమ్మ నాన్న గారికి అన్నం వడ్డిస్తుండగా భ్రూకుటీ భేదనం జరిగి రక్తం స్రవించిందట ఆ రక్తం నాన్నగారి విస్తట్లో పడకుండా అమ్మ చెయ్యి పట్టింది. చేతిలో రక్తం భస్మంగా మారింది. ఆ భస్మాన్ని అమ్మ నాన్నగారికి పెట్టింది. నాన్నగారు దానిని తిన్నారు. ఈ విశేషం నాన్నగారు అనేక పర్యాయాలు అతి సంభ్రమాశ్చర్యాలతో చెప్పారు. అమ్మ అతిమానవ సహనశక్తి గురించి కూడా నాన్నగారు అనేక సంఘటనలు వివరించేవారు. అవసరమయితే అమ్మ ఎంత బాధనయినా - చొక్కాను చిలక కొయ్యకు తగిలించినట్లు - తీసివేసుకొనగలదని చెప్పేవారు. ఇతరుల ఎంత బాధనయినా అమ్మ కేవలం తన స్పర్శతో నివారించ గలదని నాన్నగారికి పూర్ణమయిన విశ్వాసం. అందుకే నాన్నగారికి ఎంత చిన్న జ్వరం వచ్చినా - తన చెయ్యి అమ్మకు అందించి నాడి చూడమనేవారు. అమ్మ ఆశీర్వచనంలోకూడా నాన్నగారికి అచంచలమయిన నమ్మిక. నాన్నగారు ఏపని చేస్తున్నా ముందు అమ్మకు చెప్పి అనుమతి పొందేవారు. ఎక్కడకు వెళుతున్నా ముందు అమ్మచేత బొట్టు పెట్టించుకునేవారు.

ఇటీవల నాన్నగారికి నిరంతరం అమ్మ ధ్యాసయే. అమ్మ ఆరోగ్యాన్ని గురించి ఆందోళనయే అమ్మ మాటల ప్రకారం - ధ్యాసంటే ధ్యానమూ, ఆందోళనంటే ఆరాధనేగా !

అమ్మా - నాన్నగార్లు పరస్పర అవగాహనతో, అనురాగంతో, ఆరాధనతో లోకంలో ఆదర్శదంపతులైనారు. భర్త అంటే శరీరంకాదు. భావన అన్నది అమ్మ. నాన్నగారి స్మరణ ఎప్పుడూ ఉన్నది అమ్మకు. ఒకసారి ఏదో ఆలోచిస్తున్న అమ్మతో - పరధ్యానగా ఉన్నావమ్మా - అంటే - పరధ్యాసకాదు, నాన్నా, పతిధ్యాస - అన్నది.

భర్తను గురించిన సజీవ భావన, నిరంతరస్మరణ ఉన్న స్త్రీ ఏనాటికీ భర్తృవిహీన కాదని అమ్మ అభిప్రాయం. అందుకనే అమ్మ సుమంగళీ చిహ్నాలను వేటినీ విసర్జించలేదు.

ఈ విధంగా అమ్మ మహిళాలోకంలో ఒక మహావిప్లవానికి ఒరవడి పెట్టిందేమో ననిపిస్తుంది.

ఒకప్పుడు స్త్రీకి సహగమనం సంప్రదాయం. ఎలాగో స్త్రీ ఆ అగ్ని గుండం నుండి బయటపడ్డది. స్త్రీకి మరణం కంటే కూడా బాధా కరమయినది - మంగళ చిహ్నాలను విసర్జించడం.

అమ్మ - స్త్రీకి ఆ అవస్థను తప్పించదలచు కున్నదేమో - ఉత్తమమయిన భార్యగా, తల్లిగా ఎలా నడచుకోవాలో స్త్రీలోకానికి ఆదర్శమయిన అమ్మ ఈ విధంగా కూడా స్త్రీకి మహోపకారం చేసింది. మహాత్ములు ఏమి చేసినా లోకసంగ్రహార్థమేగదా ! అందుకు వారు విమర్శలకు గురికావచ్చును, హింసలకు గురికావచ్చును.

హైమ విషయంలో "నేనే కన్నాను. నేనే పెంచాను, నేనే చంపాను, నేనే దైవత్వం యిచ్చాను" అని ప్రకటించిన అమ్మ వాక్యాలే నాన్నగారి విషయంలోనూ స్మరణకు వస్తున్నాయి.

నాన్నగారిని ఆధారం చేసుకునే అమ్మ పాతివ్రత్య శిఖరాగ్రం అధిరోహించి నప్పటికీ - అమ్మలో మాతృత్వమూ, దైవత్వమూ సాక్షాత్కరింపజేసుకునే నాన్నగారు అమరులై అర్చామూర్తులయినారు.

కన్నీటి ధారల నుండి దివ్య విద్యుత్‌ను సృష్టించి అఖండజ్యోతిని వెలిగించింది. శోక సముద్రం నుండి అమృత కలశాన్ని వెలికితీసింది. వైపరీత్యం నుండి అనంతవైభవానికి శ్రీకారం చుట్టింది. రాలిన పువ్వు నుండి ఒక దివ్యఫలాన్ని రూపొందించింది. ప్రళయం నుంచి నూతన సృష్టిని చేసింది. హాహాకారం నుండి ఓంకారాన్ని వినిపింప జేసింది అమ్మ.

అదే అమ్మ అఖిలలోకానికి అందజేసిన అసాధారణ ప్రసాదమూ, అనితరసాధ్యమయిన ప్రాసాదమూ అనసూయేశ్వరాలయం.

(మార్చి 1981)



# 160
# అమ్మవాక్కు

ఏప్రియల్ 15వ తేదీన అమ్మ జన్మదిన మహోత్సవం అత్యంత వైభవోపేతంగా జరిగింది ఆ మరునాటికి వచ్చిన జనం క్రమంగా సర్దుకున్నారు.

నేను అంతకుముందు కొన్ని నెలుగా అప్పికట్ల వెళ్ళలేక పోయాను. అక్కడ అత్యవసరంగా చేయాల్సిన లెక్కల పనులు కొన్ని నాకోసం ఎదురుచూస్తున్నాయి. మా అధికారులకు కూడా 16వ తేదీ నుండి లెక్కలు చేస్తానని వాగ్దానం చేశాను.

అమ్మ అనుమతి నడిగాను - అప్పికట్ల వెళ్ళి కొన్ని రోజులుండి మళ్ళీ వస్తానని. అమ్మ అంగీకరించింది. నాకు చాలా ఆనందం కలిగింది. ఇవ్వాళనే వెళతానమ్మా - అన్నాను. రేపు వెళ్ళు - అన్నది అమ్మ. ఇవ్వాళనే లెక్కలు మొదలు పెడదామనుకుంటున్నానమ్మా - అన్నాను. వారం రోజులుగా రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేకుండా ఉన్నావుగ,ఆ యీ రాత్రికి విశ్రాంతి తీసుకో. రేపటి నుంచి లెక్కలు చేసుకుందువుగానీ - అని అమ్మ సలహా నిచ్చించి.

అట్లా కాదమ్మా - ఈ రాత్రికే లెక్కలు మొదలు పెట్టాలి. నేను అట్లా అధికారులక్కూడా మాట యిచ్చాను - అన్నాను, నా దృఢనిశ్చయం తెలియజేస్తూ.

సరే, నీ యిష్టం - అన్నది అమ్మ.

నేను మా శ్రీమతిని తీసుకుని అప్పికట్ల బయలుదేరాను. అప్పుడు సాయంకాలం 6 గంటలయింది. అమ్మచేత బొట్టు పెట్టించుకుని ప్రసాదం తీసుకుందామని అమ్మవద్దకు వెళ్ళాము. భోజనం చేసి రాత్రి వానులో వెళ్ళకూడదూ? - అన్నది అమ్మ. ఎందుకమ్మా ? అప్పికట్ల ఎంత సేపట్లో వెళతామూ ? వంట ఎంతసేపట్లో అవుతుందీ ? త్వరగా వెళితే ఈ రాత్రికే ఎంతో లెక్కవని చేసుకోవచ్చునమ్మా - అన్నాను.

సరే, నీ యిష్టం - అన్నది అమ్మ.

అమ్మను ఒకరు - నీవు జీవితంలో అనుష్ఠించిన మంత్రం ఏమిటమ్మా ? - అని అడిగితే, సరే మంత్రం - అని అమ్మ నిర్ద్వంద్వంగా సమాధానం చెప్పింది. ఎందుకూ, ఎవరికీ ఎదురు చెప్పడం అమ్మకు అలవాటు లేదు. ఇంకొక సందర్భంలో అమ్మ చెప్పింది - ఎవరినీ ఎదురు తగిలి పట్టుకోకూడదు వారి వెంట మనమూ పరుగెత్తి, వాళ్ళు అలసటవచ్చి ఆగినప్పుడు పట్టుకోవాలి - అని. ఈ వాక్యంలో అమ్మకు గల లోకానుభవ పరిణతి ప్రస్ఫుటంగా వెల్లడవుతున్నది.

ఈ రాత్రికి మీరు వెళ్ళి అన్నం వండుకున్నా - మజ్జిగ కావాలి గదా. అక్కడ వాటికోసం ఏం వెదుక్కుంటారు ? ఇక్కడ నుండి తీసుకువెళ్ళండి - అని అమ్మ ఇంకొక సలహా యిచ్చింది.

అమ్మను మన తిండి తిప్పల యందు గల శ్రద్ధకు, జాగ్రత్తకు, ముందు చూపుకు ఉక్కిరి బిక్కిరి అవుతూ 'సరేనమ్మా' అన్నాను. ఈ సారి అమ్మ మంత్రం నేను ఉపయోగించు కున్నాను.

బస్సుకు బయలు దేరాము. బస్సులు అనుకున్నట్లుగా అంద లేదు. సకాలంలో అప్పికట్ల చేరలేక పోయాము. చేరే సరికి రాత్రి 9 గంటలు దాటింది. వాకిట్కోకి వెళ్లగానే గడియకు తగిలించి ఉన్న తాళం కనిపించి వెక్కిరించినట్లని పించింది.

మా ఇంటికి ఎవరు ఎప్పుడు తాళం పెట్టినా, తాళం చెవి మా ఇంటి ప్రక్కన గల మా బాబాయిగారింట్లో ఇవ్వడం అలవాటు. అందుచేత వాళ్ళయింటికి వెళ్ళాను. వాళ్ళ ఇంటి వాకిట్లోని తాళమూ నన్ను చూసి వికటాట్టహాసం చేసింది.

సాధారణంగా వాళ్ళ ఇంటికి తాళంపెట్టి అందరూ కలిసి ఎప్పుడూ ఎక్కడకూ వెళ్ళరు. కాని ఆరోజున అట్లా జరిగింది.

విచారిస్తే - వాళ్ళందరూ కలసి బాపట్లలో వాళ్ళ కుమారుని దగ్గరకు వెళ్ళారని తెలిసింది. ఎవరిని విచారించినా మా ఇంటి తాళం చెవులు ఎవ్వరికీ ఇవ్వలేదని రూఢి అయింది.

ఏం చేయలేక, ఎవరి ఇంటికీ వెళ్ళడానికి మనస్సు అంగీకరించక - జిల్లెళ్ళమూడి నుండి తెచ్చుకున్న మజ్జిగ త్రాగి, వాకిట్లోనే పడుకున్నాము. ఆ రాత్రే మా మోతాదును పిలిపించి -- బాపట్ల పంపాను, తాళంచెవి తీసుకురమ్మని, వాడు ఆ రాత్రి బస్సులు లేక తెల్లవారి వచ్చాడు.

అప్పుడు మేము గృహప్రవేశం చేశాము. ఆ తర్వాత తీరిగ్గా లెక్కల పుస్తకాలు తెరిచాను.

ఆ రాత్రి పడుకున్నాను. కానీ క్రితం సాయంకాలం అమ్మ యిచ్చిన అన్ని సలహాలు మనస్సులో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. వ్యర్థంకాని అమ్మ వాక్కులు మనస్సులో పునరావృతమవుతూనే ఉన్నాయి. ఎన్ని అనుభవాలు కలుగుతున్నా చెరగని అజ్ఞానానికి మనసు సిగ్గుతో కుంచించుకుపోతూనే ఉన్నది. ఎంత ఉతికినా తెల్లబడని ఎలుకతోలు వంటిది మనస్సు అనిపించింది. కుక్కతోక వంటిది అనిపించింది.

అసలు మొట్టమొదట అమ్మ ఇట్లా ఇచ్చిన ఒక అనుభవానికే మనస్సు ఆకర్షితమయింది.

అది 1969, శరన్నవరాత్రులు మొదలయినాయి. అప్పుడు మా పెద్దకుమారునికి 5 సంవత్సరాలు. నేను జిల్లెళ్ళమూడి వస్తుంటే వాడూ అప్పికట్ల నుండి నాతో జిల్లెళ్ళమూడి వచ్చాడు. దసరా ప్రారంభమయింది. వాడు వాళ్ళ అమ్మ కోసం, బామ్మకోసం దిగులువడి ఏడవడం సాగించాడు. వాడిని సముదాయించడం వాడితో నేను అక్కడ ఉండడం అసాధ్యం అనుకుని వాడిని అప్పికట్లలో దించి రాదలుచుకున్నాను.

అదే అమ్మకు విన్నవించాను. అమ్మ 'సరే' నంటూ దసరా వెళ్లగానే వస్తావా? - అని అడిగింది. అదేమిటమ్మా ? దసరా వెళ్ళడం అంటే యింకా తొమ్మిది రోజులున్నది. నేను ఈ రాత్రికి వెళ్ళి వీడిని అక్కడదించి, రేపు ఉదయమే తిరిగి ఇక్కడకు వస్తానమ్మా - అన్నాను.

రేపే వస్తావా ? - అని అమ్మ అడిగింది.

నాకు ప్రస్తుతం అక్కడ పనేమీ లేదమ్మా. రేపే వస్తాను. తెల్లవారేసరికి వస్తాను - అన్నాను.

నాలుగు మైళ్ళు వెళ్ళడం ఎంతలోకి ? తిరిగిరావడం ఎంతలో ? అని నా అభిప్రాయం. సరే - వెళ్ళిరా ..... అని అమ్మ పంపింది.

ఆ రాత్రి అప్పికట్ల నిర్విఘ్నంగా చేరాను.

ఆ రాత్రి అకస్మాత్తుగా కుంభవృష్టి కురిసింది. కాలువలు పొంగాయి. వాగులు పొంగాయి. చేలూ చెరువులూ ఏకమైనాయి. అప్పికట్లకూ జిల్లెళ్ళమూడికీ మధ్య నాలుగుమైళ్ళు కాదు; నాలుగు సముద్రాలైనాయి. ఎవరిని విచారించినా, జిల్లెళ్లమూడి చేరడం అసాధ్యం - అన్నారు. అమ్మకు ఇచ్చిన మాట ప్రకారం జిల్లెళ్ళమూడి చేరాలని శతవిధాల ప్రయత్నించాను. ఆహఁ నావల్ల కాలేదు.

ఆరోజుల్లా - అమ్మ మాటలోని సత్యానికీ, బలానికీ ఆనందించే కంటే - అమ్మకు ఇచ్చిన మాటను నిలుపుకోలేక పోయానే అని అమితంగా విచారించాను అప్పట్లో ఎవరికైనా ఏమైనా మాటను ఇస్తే తప్పటం అలవాటు లేనందున, ఆరోజంతా మనస్సు చాలా కలతజెందింది. అన్నం సహించలేదు. అందులో అమ్మకు ఇచ్చిన మాటను మొదటి సారిగా నెరవేర్చలేక పోయినందున మనస్సు కుళ్ళికుళ్ళి ఏడ్చింది. ఆ రాత్రి అసలు నిద్ర పట్టలేదు. చివరకు తెల్లవారుజామున - అది నిద్రో, మెలుకువో స్వప్నమో..... నిర్ణయించలేను. అమ్మ కనుపించింది. నన్ను చూసి నవ్వింది. అందులో పరిహాసమే ఉందో, జాలే ఉందో, ప్రేమే ఉందో ఇప్పటికీ నాకు తెలీదు.

అనుకున్నది జరగదు; మనకున్నది తప్పదు - అని అర్థమయింది మనం చేద్దామనుకున్నా ఏమీ చేయలేమని బోధపడింది. మన క్రియలకు కర్తలం మనం కాదని బుజువయింది మన క్రియలన్నిటికీ కర్త మరొకరు అనీ, అది అమ్మ అనీ ఒక నమ్మకం ఏర్పడింది.

తర్వాత అమ్మ అన్నట్లుగానే దసరా తర్వాతనే జిల్లెళ్ళమూడి వెళ్ళగలిగాను. పదిరోజుల వియోగం తర్వాత అమ్మను చూశానని ఆనందమో, పదిరోజుల ఎడబాటుకు కలిగిన దుఃఖమో, అమ్మకు ఇచ్చిన మాట ఓడిపోయిందని బాధో.... కారణం ఏమయినాగానీ అమ్మ ఒడిలో వాలిపోయి వెక్కి వెక్కి ఏడిచాను

అమ్మ నా కన్నీళ్ళు తుడుస్తూ, నా వీపు నిమురుతూ, నా జుట్టు సవరిస్తూ, నా చెక్కిళ్ళు పుణుకుతూ, నా గడ్డం పట్టుకుని నా ముఖం పైకెత్తి, నా కళ్ళలోకి చూస్తూ ..... "అనుకున్నది జరగదు; మనకున్నది తప్పదు, నాన్నా. మన క్రియలకు కర్తలం మనం కాదు అని తెలుసుకుంటే - జీవితంలో ఒడిదుకులు ఉండవు. సుఖ దుఃఖాల లుండవు. అంతా ఆనందమే. అంతా తృప్తే......" అన్నది.

నేను అప్పికట్లలో విన్నమాటలే తిరిగి అక్షరశః అమ్మ నోటి నుండి వినేసరికి నా మెదడులో ఏదో భూకంపంలాంటి కదలిక కలగడమే కాదు, ఒక నమ్మికకు బీజం పడ్డది.

అదే నాకు మంత్రోపదేశం అనుకున్నాను. కాని ఏం ఉపయోగం ? అది నిశ్చలంగా ఎక్కడ ఉంటున్నది? ఉండకపోవడానికి కారణంకూడా అమ్మే ననుకుంటూ ఉంటే అదొక తృప్తి.

ఈ 18 సంవత్సరాల్లో..... అమ్మ ఏదో అనడమూ, ఇది ఇట్లా ఎందుకు జరుగుతుందిలే -- అనుకోవడమూ, చివరకు అమ్మ అన్నట్లుగానే జరగడమూ, నేను ఆశ్చర్య పడిపోవడమూ, అలవాటయిపోయింది.

మళ్ళీ మళ్ళీ ఇదే చక్రభ్రమణం ! దీనికి అంతం ఎప్పుడో !

ఒకసారి కాదు వందల సార్లు అడిగాను --- అమ్మా నువ్వు అన్నట్లుగా జరుగుతుందా ? జరిగేదాన్ని నువ్వు అంటావా ? అని

వాటిలో భేదం నాకు తెలీడం లేదు -- అని తమాషాగా నవ్వుతుంది అమ్మ. ఆ నవ్వే కోటి అమృత వర్షాలై నన్ను నిలువెల్లా తడిపేస్తుంది ప్రతిసారీ.

అమ్మనోరు తోలునోరు కాదు కదా --- తాలుమాట రావడానికి. అమ్మనోరు రతనాలగని. అమ్మ నోరు తెరిస్తే చాలు - రతనాలు జలజలా రాలుతాయి. ఆ కాంతులకు పుడమియే పులకించి పోతుంది.

అమ్మ ఒక్కమాట అంటే చాలు, అది అయితీరుతుంది. పంచ భూతాలూ అందుకు సహాయ పడతాయి.

అందుకే అమ్మ నోటివెంట తమకు అనుకూలమైన ఒక్కమాట రాబట్టుకోడానికి అందరికీ అంత ఆరాటం !!

(ఏప్రిల్, మే 1981)



## బాధ్యత

బాద్యతే బాధ. బాధలేని బాధ్యతుల అందరికీ లభ్యపడవు.

నే చేస్తున్నాను, నాకు, నాది అనేది బాధ గల బాధ్యత. అంతకంటే రెట్టింపు పని చేస్తున్నా నేనే చేస్తున్నాననేది లేకుండా మనం నిమిత్తమాత్రం అనుకుండేది బాధలేని బాధ్యత.

- అమ్మ

# 161
# కళ్యాణ శోభలు

పంచాంగంలో సుముహూర్తాలు కనిపించాయంటే - జిల్లెళ్ళమూడిలో మంగళవాద్యాల మధురనాదాలూ, మామిడి ఆకుల సుగంధ వీచికలూ.

అమ్మకు 'పెండ్లి' అంటే ఎంతో యిష్టం. అమ్మ 1936లో తాను పెండ్లి చేసుకుంటున్నప్పుడూ అదే చెప్పింది, ఇప్పుడు అమ్మ చేతల్లోనూ అదే కనిపిస్తున్నది.

అమ్మకు గార్హస్థ్యమంటే అమితమైన ప్రేమ. అమ్మ దృష్టిలో అన్ని ఆశ్రమాలకూ ఒకేస్థానం. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాల్లో అధికమూ, అల్పమూ అని ఏమీలేదంటుంది అమ్మ.

పైగా ఆధ్యాత్మిక సాధన విషయంలో - గృహస్థుగా ఉండి సాధనచేయడం, కోటలో ఉండి యుద్ధం చేయడమనీ, సన్యాసిగా సాధన చేయడం కోట విడిచి యుద్ధం చేయడమనీ వర్ణించింది అమ్మ.

భిన్న రూపాల్లో కనిపిస్తున్న ఈ సృష్టిలోని ఏకత్వాన్ని దర్శించడానికి ప్రాథమిక సాధన - అప్పటిదాకా తనకు అపరిచితమైన, భిన్నమైన అభిరుచులతో, అభిమతాలతో, అలవాట్లతో ఉన్న మరొక వ్యక్తితో సర్దుకుపోవడమే నంటుంది అమ్మ. తానే అయిన సృష్టిని తెలుసుకుని తాదాత్మ్యం పొందడానికి మార్గదర్శకం - భార్యా భర్తలు ఒకరి నొకరు అవగాహన చేసుకొని ఒక్క మనస్సుగా, ఒక్క మాటగా సహజీవనం చేయడం - అని అమ్మ అభిప్రాయం.

సాధారణంగా సమాజంలో గృహస్థజీవనం అంటే ప్రాపంచిక వ్యవహారమనీ, అందువల్ల పారమార్థికాన్ని సాధించాలంటే గృహస్థ జీవనాన్ని విడనాడాలనీ మూఢమయిన ఒక నమ్మకం వ్రేళ్ళు పాతుకుని ఉంది. అమ్మ ఆ అభిప్రాయాన్ని సమూలంగా పెరికివేసింది.

ఈ ఆశ్రమాలు మనం మామూలుగా అనుకుంటున్నట్లు సోపాన క్రమం కాదు. దేనికి అదే స్వతంత్రమయినది అన్నీ సమానమయిన విలువ కలవే. ఎందులో ఉండి అయినా లక్ష్యం సాధించ వచ్చును. గార్హస్థ్యం అంటే సంసారం అని రూఢ్యర్థం. సంసారం అంటే భార్యా, పిల్లలూ లేక, భర్తా పిల్లలూ. కావాలనుకుంటే వీరి నుండి మనిషి పారి పోవచ్చును. కాని అమ్మ చెప్పిందీ - సంసారం అంటే సంకల్పమట సంకల్పం ఉన్నంత కాలం, మరి సంసారం ఉన్నట్లే. మరొక సందర్భంలో సముద్రానికి తరంగం ఎంత సహజమో, మనస్సుకు సంకల్పం అంత సహజమని అమ్మ వివరించింది. అయితే మనిషి సంకల్ప విముక్తుడు కాలేడా ? - అంటే కాగలడు ? కర్తృత్వపు ఊబిలో నుండి బయట పడగలిగినప్పుడు. తనకు వచ్చే సంకల్పం తనది కాదూ, అన్నిటికి ప్రేరణ నిచ్చి ఏ శక్తి ఈ సర్వసృష్టినీ నడుపుకు పోతున్నదో దానిదేనని తెలుసుకొని, పూర్తిగా నమ్మినప్పుడు.

సంసారమంటే సాగర మనుకునే వాళ్ళు - పెళ్ళిలో పెద్దపులి ఉందని భయపడతారు. అమ్మ ఆ భయాన్ని పోగొట్టి అభయమిస్తున్నది.

పెళ్ళిళ్ళను అమ్మ ప్రోత్సహిస్తుంది. గార్హస్థ్యాన్ని అమ్మ సమర్థిస్తుంది. అందుకనే అమ్మ సన్నిధిన అసంఖ్యాకంగా పెండ్లిండ్లు జరుగుతున్నాయి. అమ్మ సన్నిధిన పెండ్లి జరగడమంటే - ఏ దేవాలయంలోనో పెళ్ళి చేసుకున్నట్లు కాదు. ఈ విధానం ప్రత్యేకంగా ఉంటుంది.

దాంపత్యానికి ఆదర్శమూర్తులు ఆదిదంపతులని ఆరాధింపబడే పార్వతీ పరమేశ్వరుల రూపమే అమ్మ - అని విశ్వసించే అనేకులు తమ పెళ్ళిళ్ళు, తమ పిల్లల పెళ్ళిళ్ళు అమ్మచేత జరిపించుకోవాలని ఉత్సాహపడడం అత్యంత సహజమయిన విషయం.

అటువంటి ఆసక్తి కలవాళ్ళు అమ్మను అర్థిస్తారు - తన సన్నిధానంలో తన చేతి మీదుగా పెండ్లి జరిపించమని. అమ్మ సాధారణంగా అంగీకరిస్తుంది. అమ్మ అంగీకరిస్తే ఇక ఆ పెండ్లికి ఏర్పాట్లు చేయడం శ్రీ విశ్వజననీపరిషత్ బాధ్యత. ఆర్థిక వ్యవహారాలు..... అమ్మకూ ఆ వ్యక్తులకూ, సంస్థకూ ఆ వ్యక్తులకూ గల అనుబంధాన్ని బట్టి ఉంటాయి.

పెండ్లివారు, ఇక పెండ్లి నాటికి వచ్చినా ఏ ఇబ్బందీ ఉండదు. మామూలుగా ఎక్కడైనా ఆడపిల్ల పెండ్లి వారంటే ఒక నెల రోజులు ముందునుంచీ సతమతమై

పోతారు. ఇక్కడ ఆడపిల్లవారు, మగపిల్లవారు - అని భేద మేమీ లేదు. అందరూ హాయిగా పెండ్లి కొడుకుల వలె మెలుగుతారు అది అమ్మ అనుగ్రహ ఫలితం

పెండ్లి కొడుకునూ, పెండ్లి కూతురునూ చేయడం దగ్గర నుంచి ఎన్నో చిన్న చిన్న క్రతువులు కూడా అమ్మే స్వయంగా చేస్తుంది.

వధూవరులతోపాటు, వారి తల్లిదండ్రులు కూడా ఉంటే - వారికీ అమ్మ బొట్టుపెట్టి, తలకు నూనె రాచి కొత్త బట్టలు ఇచ్చి ఆశీర్వదిస్తుంది.

ఇక, వివాహవేదికపై అమ్మపాత్ర అత్యంత ప్రముఖమైంది అమ్మ మొదటి నుంచీ చివరి వరకూ వేదికపై సింహాసనాసీనయై ఉంటుంది. వధూవరులకు, తల్లిదండ్రులకు, ప్రేక్షకులైన బంధుమిత్రులకు అదొక పెద్ద ఆకర్షణ అమ్మ సర్వాభరణ భూషితయై నూతన వస్త్ర ధారిణియై, అనుగ్రహవర్షిణియై వధూవరులపై, ప్రేక్షకులపై ఆశీర్లహరులు ప్రవహింపచేస్తూ, కూర్చుంటే - ఎవరికయినా కనుల పండుగ్గానే ఉంటుంది. అందరూ అనిమిషులై అమ్మను చూస్తుంటారు.

బెల్లం, జీలకఱ్ఱ కలిపి వధూవరుల నెత్తిన ఒకరి కొకరు పెట్టు కొనడమే - సుముహూర్తం. అదే పెండ్లిలో ముఖ్యమైన క్రతువు. కానీ, అమ్మ సన్నిధిలో - అమ్మ కుర్చీ నుంచి లేచి వచ్చి ఆ బెల్లం జీలకఱ్ఱ కలిపిన పదార్థాన్ని తీసుకొని రెండు భాగాలుచేసి సర్వవాద్యాలూ మారుమ్రోగుతుండగా - తానే వధూవరుల శిరస్సులపై పెడుతుంది. తర్వాత వధూవరుల చేతులు తీసుకుని ఒకరి చేయిని మరొకరి శిరస్సుపై ఉంచుతుంది. సూత్రధారణ సమయంలో కూడా అన్ని వాద్యాలూ ఒక్క పెట్టున మారు మ్రోగుతుండగా - ఒక్కొక్క సూత్రాన్ని ప్రేక్షకులకు చూపి వధువు మెడలో తానే ముళ్ళు వేస్తుంది. వరుడు అమ్మ ప్రక్కన నిలుచుని ఉంటాడు. ఒక్కొక్క వరుడు ఆ మూడు ముళ్ళూ తానే వేయాలని ఉబలాటపడతాడు. అది తన అధికారంగా భ్రమపడతాడు. అటువంటప్పుడు అమ్మ తాను ప్రక్కన సహాయంగా నిలుచుని వరుని చేతనే ముళ్ళు వేయిస్తుంది. కాని సాధారణంగా అమ్మ చేతనే ముళ్ళు వేయిస్తారు. కారణం అమ్మ అమృత హస్తంతో ముడిపడితే అది తమ కెంతో రక్ష అని అందరి విశ్వాసం.

తర్వాత తలంబ్రాల సన్నివేశం ఎంతో రమణీయంగా ఉంటుంది. వధూవరులు ఒకరి కొకరు తలంబ్రాలు పోసుకుండే ముందు - అమ్మ ముందుగా ఆ యిద్దరి తలలపై మూడు దోసిళ్ళ తలంబ్రాలు పోస్తుంది. తర్వాత దోసిళ్ళకొద్దీ రంగురంగుల పూలు రకరకాల పూలు అత్యంత ఉత్సాహంగా, అత్యంత వేగంగా

కుమ్మరిస్తుంది తర్వాత తన మెడలో ఉన్న పూల దండలను తీసి వధూవరులను అలంకరిస్తుంది

ఆ సన్నివేశంలో అమ్మ ప్రేమ, ఉత్సాహం, ఆశీర్వచనం అన్నీ కనిపిస్తూ వధూవరులతోపాటు ప్రేక్షకులను కూడా ఎంతగానో ఉత్తేజరుస్తాయి

అమ్మ సన్నిధిన పెండ్లి అని పిలుపు అందితే ఆ అవకాశాన్ని ఎవరూ జారవిడుచుకోరు. అందరూ వస్తారు వధూవరులు, వారి తల్లిదండ్రులు, ప్రేక్షకులైన బంధుమిత్రులు అందరూ అమ్మ ఆశీర్వచనాన్నీ, వాత్సల్యాన్నీ పొంది సంతృప్తులై సంతోషితాంతరంగులవుతారు.

అన్ని విషయాల్లో లాగానే అమ్మ వధూవరులక్కూడా ఒక కొత్త నిర్వచనాన్ని అనుగ్రహిస్తూ ఒక కొత్త సందేశాన్ని అందిస్తున్నది. సంప్రదాయాలన్నీ 'భార్యకు భర్త దేవుడు' అని చెబుతుంటే అమ్మ 'భర్తకు భార్యకూడా దేవతయే'నని చేర్చింది. ఇది అపూర్వమైన ప్రవచనం ఆదర్శమయిన ప్రబోధం.

14వ తేదీన రమేష్ - హైమల వివాహం జరుగుతుండగా అమ్మ రమేష్‌చేత హైమపాదానికి మట్టెలు తొడిగించింది. అది చూసి అందరూ ఆశ్చర్యపడుతుంటే - ముందు భార్యా భర్తలలోనైనా న్యూనతాధిక్యాలు తొలగకపోతే - అంతటా అన్నిటి యందూ ఒకేదానిని చూడడం ఎట్లా సాధ్యమవుతుందీ ? అంటూ ప్రశ్నార్థకమైన ప్రబోధాన్ని అందించింది.

(జూన్ 1981)



## బాధా నివారణ

నీ బిడ్డకోసం నీ వెట్లా దుఃఖిస్తావో అందరికోసం అదే విధంగా నువ్వు దుఃఖించ గలిగిననాడు నీ దుఃఖం తొలుగుతుంది.

- అమ్మ

# 162
# కటాక్షం

ఆగష్టు 19వ తేదీ ఉదయం  అమ్మ మామూలుగా తన గదికి బయట దక్షిణపువైపున గోడకు అనించి వేసిన మంచంపై కూర్చుని ఉంది.  రోజూ అమ్మ సూర్యకిరణాలు తన సుందర పాదద్వయ.  పైబడి ఆ చరణాలను చుంబించి నమస్కరించుకున్న తర్వాతగానీ లోపలకు వెళ్ళదు.

రోజూ ఉదయాన్నే క్రమం తప్పకుండా వచ్చి అమ్మకు నమస్కరించి గానీ దినచర్య కుపక్రమించని వారున్నారు. అందులో శ్రీమతి గజేంద్రమ్మ ఒకతె  ఆనాడు ఆమె నమస్కరించుకోవడానికి వచ్చింది.  తలవంచి తలను పాదాలకు ఆనించి నమస్కరించుకుంది. కుడిచెయ్యికి కట్టు ఉంది. ఆమె కొద్దిరోజుల క్రితమే కాలుజారి పడ్డదీ; చెయ్యి విరిగింది.  అంతకు కొన్నాళ్ళక్రితం ఎడమ చెయ్యి విరిగితే కట్టు కట్టించుకుందీ, యిటీవలనే నయమయింది.  ఆ కట్టు విప్పించుకుంది.  అంతలోనే మళ్ళీ రెండో చెయ్యి విరిగింది.  అందువల్ల ఆమె చేతులతో పాదాలు తాకేందుకు వీలుగాక తలతోనే పాదాలను స్పృశించింది.

ఆమె దయనీయ పరిస్థితిని చూస్తే - నాకూ బాధనిపించింది.

"బొట్టు పెట్టమ్మా -" గజేంద్రమ్మక్కయ్య అమ్మను విసురుగా అడిగింది అట్లా మాట్లాడడమే ఆమెకు అలవాటు.

"ఇప్పుడు బొట్టెందుకూ?" అమ్మ ప్రశ్నించింది - మామూలుగా అమ్మసన్నిధిలో నివసించేవాళ్ళు ఎక్కడికయినా బయటి ఊరుకు వెళ్ళేటప్పుడు అమ్మకు చెప్పి బొట్టు పెట్టించుకుంటారు.

"ఊరికి పోతా నమ్మా" అంతే విసురుగా అన్నది అక్కయ్య.

"రెండు చేతులూ విరగొట్టుకొని వెళితే అక్కడ నీ కెవరు చేస్తారు? .... ఎవరి పనులతో వారికి సరిపోతుంది".

అమ్మ దగ్గర ఉండే ఇంకో అక్కయ్యను గజేంద్రమ్మక్కయ్య దగ్గర ఉండి సహాయపడుతుండమని అమ్మ నియమించింది. అదే విచిత్రం, ఒక కూతురు తల్లికీ, ఒక చెల్లెలు అక్కకూ కూడా చేయనంతగా జిల్లెళ్ళమూడిలో ఒకరికి ఒకరు తోడ్పడుతారు.

"ఏందమ్మా - అందరూ నవ్వుతున్నారు... చేయించుకున్నంత కాలమూ హాయిగా చేయించుకుని, మీ అమ్మగారు నీ రెండు చేతులూ విరగ్గొట్టించిందని.. ." ఆమె గొంతులో ఎంతో బాధ ధ్వనించింది.

"మీ అమ్మగారికి ఏం చేతవుతుందమ్మా ? అక్కడ కాళ్ళు విరగ్గొట్టుకుని, చేతులు విరగ్గొట్టుకునీ మా దగ్గరకు వస్తారు మీ అమ్మగారికి ఏమీ చేతకాదు. ఇట్లా ఏవేవో ఆసుపత్రిజనం అంటారమ్మా .. ' ఆమె ఇంకా పూడిపోయిన గొంతుతో చెబుతూనే ఉంది

"నిజమేగా గజేంద్రమ్మా నిజమే. మా అమ్మకు ఏమీ చేతకాదు - అని చెప్పక పోయావా ? నా కేమీ బాధ లేదు -"

"నీకేమీ బాధలేదు అదే మా బాధ. మాకెంత సిగ్గుగా ఉంటుందీ, వాళ్ళట్లా మాట్లాడుతుంటే ! గొంతు పిసుకుదామనిపిస్తుంది.. "

"వాళ్ళెవరో సరేనమ్మా, మా వాళ్ళుకూడా అడుగుతారమ్మా. మీ అమ్మగారికి నీమీద ఎంతో ప్రేమా, దయా అంటావుగా ! దయ ఉంటే ఇట్లాగేనా జరిగేది ? దయ అంటే ఇదేనా ? ... అని" అంటుండగానే ఆమె కళ్ళు నీటికుండలయినాయి; ఆమె గొంతు పెగల్లేదు

"నామీద దయవల్లనే ఇట్లా జరిగింది అని చెప్పు గజేంద్రమ్మా -" అమ్మ సన్నగా నవ్వుతూ చిన్నగా సలహా యిచ్చింది

"దయవల్ల ఇట్లా జరిగిందా ?!"

"ఔను. నీ చెయ్యి విరగడమూ నా దయవల్లనే విరిగింది అతుక్కోవడమూ దయవల్లనే. అన్నీ దయవల్లనే.... దయ లేదని అనుకోకు. దయ తప్పడమంటూ లేదు"

అమ్మ ఒక్కొక్క మాటటా వత్తి వత్తి స్ఫుటంగా పలుకుతుంటే... ఆ భావం అర్థంగాని గజేంద్రమ్మ అమ్మవంక కంఠప్పగించి చూసింది.

వెంటనే అమ్మ లోగడ చెప్పిన ఒక వివరణ గుర్తుకు వచ్చింది "వాడి కరుణ లేకపోతే మనం లేము మనం చేసే పనులన్నీ వాడి కరుణవల్లనే ! నా దృష్టిలో కష్టసుఖాలు రెండూ కరుణ వల్లనే. ప్రతి చిన్నపనీ, మనం చేతులతో చేస్తున్నా మనుకున్నా, మనస్సుతో చేస్తున్నామనుకున్నా... మనం ఎట్లా చేసినా వాడి కరుణవల్లనే. మనకు కనపడకుండా ఆయా తరుణాల్లో ఆయా పనులు చేయించడమే కరుణ."

ఇంకొకసారి అన్నది 'నా దృష్టిలో ఆగ్రహానుగ్రహాల్లేవు. అంతా అనుగ్రహమే. కష్టసుఖాలు శుభాశుభాలు అన్నీ అనుగ్రహం వల్లనే ఇవ్వబడిన సర్వమూ వరమే...'

మనం మామూలుగా మనకు అనుకూలంగా అయిన పనినే భగవంతుని దయగా గుర్తించగలము. మన ఇంట్లో ఒక శుభకార్యం జరిగితే, మన అబ్బాయి పరీక్ష ఫస్టుక్లాసులో పాస్ అయితే, మన అబ్బాయికి మంచి ఉద్యోగం దొరికితే, మన అమ్మాయికి మంచి సంబంధం కుదిరి పెండ్లి అయితే, మన పొలం బాగా పండితే, వ్యాపారంలో మనకు బాగా లాభాలు వస్తే, అనుకోకుండా ఏ విధంగానయినా మనకు డబ్బు కలిసొస్తే, ప్రమాదకరమైన వ్యాధి అకస్మాత్తుగా నయమయితే... దేవుడి దయ మనమీద ఉన్నదని భావించగలం; ఆనందించగలం; దేవుడికి రెండు చేతులూ యెత్తి మ్రొక్కగలం.

పాసు అవుతాడనుకున్న -- మన అబ్బాయి పరీక్ష తప్పితే, ఉద్యోగం లేకుండా దేశదిమ్మరిగా తిరుగుతుంటే, మన అమ్మాయికి పెండ్లికాక దారి తప్పితే, మన పొలాలు వరదపాలైతే, మనం వ్యాపారంలో పూర్తిగా నష్టపడితే, తిరిగే తిరిగే మనిషి కుటుంబానికి అక్కరకు వచ్చినవాడు హఠాత్తుగా చనిపోతే - దేవుడి దయ అనుకుంటామా ?

ఒక కొత్త ఇల్లు కట్టుకుంటే - దేవుడిదయ మనయందు ఉన్నదనుకుంటాము కానీ, కట్టుకున్న కొత్త ఇల్లు అకారణంగా కూలి పడితే, మన ఇల్లు అగ్ని కాహుతి అయితే - దేవుడి దయకు మనం పాత్రులమయినా మని సంతోషించగలమా?

కానీ అమ్మ మాత్రం అన్నీ కరుణవల్లనే అంటుంది. అయిన పనీ, కాని పనీ అన్నీ ఒకే అనుగ్రహ ఫలితాలే నంటుంది.

ఒకరితో "నొప్పి కూడా వాడిచ్చినదే" ననీ, మరొకరితో "బాధ కూడా వాడి ప్రసాదమే" ననీ, మరొకరితో "దుఃఖం వాడి అనుగ్రహం కాకపోలే" దనీ అమ్మ అనేక విధాల వివరించింది. మరొకసారి "ఒడిదుడుకులు కూడా నా ఆశీర్వచనమే

నాన్నా --'' అన్నది. మరొకసారి ''దరిద్రం కూడా నే నిచ్చినదే'' నని పలికింది. ఒకరితో ''దారి తప్పడం కూడా అనుగ్రహమే నన్నది''. ఒక సోదరి ''ఆ వాతావరణంలో ఎట్లా ఉంటానో''నని భయపడుతూ ఉంటే ''ఆ వాతావరణం కూడా అమ్మ కల్పించింది -- అని అనుకుంటూ ఉండు'' -- అన్నది.

ఒక సందర్భంలో ''పడడానికీ, పడకుండా ఉండడానికీ, పడ్డా దెబ్బలు తగలకుండా ఉండడానికీ - అన్నిటికీ ఒకే కారణం'' అని ఉద్ఘాటించింది అమ్మ.

ఒక సోదరుడు అమ్మను ''నమ్మకం దేనివల్ల కుదురుతుంది ?'' అని అడిగాడు ''నమ్మకం కలగకపోవడానికి కారణ మేమిటో, కలగడానికీ కారణమదే'' నని అమ్మ చెప్పింది.

''నమ్మకం గ్రేస్ కాదా ?'' అతని ప్రశ్న.

''నమ్మకమే కాదు; లేకపోవడంకూడా'' అన్నది అమ్మ.

అమ్మ అభిప్రాయం ప్రకారం - భగవంతుడి కటాక్షం ఎప్పుడూ ఉన్నది. మనం అనుకున్నది అనుకున్నట్లు జరిగినప్పుడు మాత్రమే దానిని గుర్తించగలం. కటాక్ష మనేమిటీ - భగవంతుడిని అయినా అంతే. మనం అనుకున్న రూపంలో కనిపిస్తేనే గుర్తించగలం. లేప్పుడు మన ముందు నిలబడ్డా భగవంతుడు అని అనుకోలేము.

కరుణ అంటే మనం అనుకున్నది కాదు, మనకు అవసరమయినది. ఇదంతా 'వాడి కరుణే' నన్న గుర్తింపు మనకు కలగడమే అసలు కరుణ.

అమ్మ ప్రబోధించే పరిపూర్ణ అద్వైత సిద్ధాంతంలో అమ్మ కటాక్షానికి ఇచ్చిన అపూర్వ నిర్వచనం ఒక ముఖ్యాంగమై, ముఖ్యాంశమై విలసిల్లుతోంది.

(జులై, ఆగష్టు 1981)



# 163
# పంచడమే తెలుసు

ఈ నెల 21వ తేదీ సాయంకాలం గం 3.30 అయింది. భోజనశాల సువాసనతో నిండిపోయింది. పదిమంది అక్కయ్యలు 15 కుంపట్లు పెట్టుకుని మొక్కజొన్న కండెలు కాలుస్తున్నారు. దాదాపు 500 కండెలు కాల్చారు

నడవడానికి ఏమాత్రం ఓపిక లేని అమ్మపై అంతస్తునుంచి మెల్లగా క్రిందకు దిగి వచ్చింది. అమ్మ - అలా దిగలేక దిగుతూ మెల్లగా వస్తుంటే మనకు బాధే కానీ - దివి నుండి భువికి దిగివచ్చిన అమ్మకు ఈ మేడ ఒక లెక్కా ?

వచ్చి కుర్చీలో కూర్చున్నది. కళాశాలనూ, పాఠశాలనూ ముందుగానే వదిలేశారు. అన్నపూర్ణాలయంలో గంట గబగబా మ్రోగింది. అమ్మ - సన్నిధిలో కూర్చోవడంతో ఆగంట రోజూకంటే మరింత ఉత్సాహంగా మ్రోగింది. ఆ ధ్వనిలో వాత్సల్యంతో నిండిన అమ్మ పిలుపు ప్రతిధ్వనించింది.

పిల్లలు, పెద్దలు, ఆడ, మగ, ఆశ్రమంలో వాళ్ళు, ఊళ్ళో వాళ్ళు .. ఎంతమందో బిలబిలా వచ్చారు అందరికీ అమ్మ స్వయంగా మొక్కజొన్న కండెలు పంచింది. ఒక్కొక్క కండెను తీసుకుని, గిల్లి, బాగా కాలిందా లేదా అని ఎంతో శ్రద్ధగా చూసింది. కాలని వాటిని తీసి ప్రక్కగా పెట్టింది. అంతమంది ఎదురుగా వరుసలో నిలుచుని కృతజ్ఞత భక్తీ పొంగులువారే కనులతో చూస్తున్నా.... అమ్మ మాత్రం రానివాళ్ళను పేరు పేరునా అడుగుతూ వాళ్ళకు ఇవ్వమని ఆదేశిస్తూ కండెలు అందిస్తున్నది.

"నువ్వూ తినమ్మా ఒకటి" అన్నాను, ఎంతో రుచిగా ఉన్న ఆ కండెలను తింటూ మురిసిపోతూ.

"మీరు తింటే నేను తిన్నట్లేరా" అన్నది అమ్మ. అమ్మకళ్ళలో తాను తింటున్నంత తృప్తీ ప్రతిఫలించి తళుక్కుమన్నాయి కళ్ళు.

పంచడం మొదలు పెట్టే ముందు అమ్మ అడిగింది "సరిపోతాయా ?" అని "మిగులుతాయి" అమ్మా అన్నాను, మనసులోనే లెక్కలు వేసుకుని.

గంపలో కండెలు అయిపోయాయి ఇంకా ఒక రిద్దరు అమ్మను సమీపిస్తున్నారు.

"మిగులుతాయన్నావు కదరా ..." అన్నది అమ్మ అమ్మ కళ్ళలో అసంతృప్తి తొంగి చూస్తున్నది.

"మిగిలేవేనమ్మా ఊళ్ళో వాళ్ళ పిల్లలూ పెద్దలూ చాలా మంది వచ్చారు వాళ్ళందరికీ కూడా ఇచ్చావు కదా మేము మన ఆవరణంలోని వాళ్ళను మాత్రమే లెక్క వేసుకున్నాము" అన్నాను, నా లెక్కలు తప్పు కాదన్నట్లు.

"నేను అట్లా పెట్టలేనురా అట్లా వేరు చేయడం నాకు చేతకాదు" అన్నది అమ్మ. తప్పుచేసిన మనిషి పశ్చాత్తాప పడుతున్నట్లు అమ్మలో అప్పుడు వెల్లివిరిసిన అమాయకతను చూసి తీరాలి !

లోగడ జరిగిన ఒక సంఘటన స్మృతిలో మెదిలింది ఒకనాడు కొందరు సోదరులు అమ్మ సమక్షంలో క్రికెట్ ఆడారు. వాళ్ళ కోసం చపాతీలు చేయబడ్డాయి. వాటిని అమ్మవద్ద పెట్టారు, వాళ్ళకు పెట్టడానికి. అదే వాళ్ళతోపాటు, చూసే వాళ్ళందరికీ అమ్మ వాటిని పంచింది. ప్రేక్షకులు "మా కెందుకమ్మా ? అడి అడి అలసి ఉన్నారు వాళ్ళకే పెట్టమ్మా -" అన్నారు. "నేను అట్లా పెట్ట లేనురా" అన్నది అమ్మ, సర్వజనని.

"పెట్టకుండా ఉంటే అందరికీ మాను కోవాలి పెడితే అందరికీ పెట్టాలి. మొదలు పెట్టాను కనుక అందరికీ సమానంగా పెట్టాలి"

"ఎంత మంది బిడ్డలున్నా తల్లికి ఏ బిడ్డకు ఆ బిడ్డే ఎక్కువని పిస్తుంది. పెట్టుపోతల్లో వాళ్ళ ఆరోగ్య పరిస్థితిని బట్టి తేడా ఉండొచ్చును గానీ ప్రేమమాత్రం సమానంగానే ఉంటుంది"

"పంచడంలో హెచ్చు తగ్గులుండవచ్చును కానీ పెట్టడం సమానమే"

"ఇక్కడి వాళ్ళే కాదు, దూరంగా ఉన్న వాళ్ళుకూడా నాకు బిడ్డలే. నేను అందరినీ చూసు కొనవలసిందే పొలం వెళ్ళిన వాడికి సమయానికి అన్నం అందించాలా ? పంపకపోతే ఎలా ?"

తన ప్రేమలోని సమానత్వాన్ని అమ్మ ఎన్నిసార్లో ఎన్నిరకాలు గానో అభివ్యక్తం చేసింది.

అమ్మకు తన సర్వమాతృత్వం యెడల ఎంత నిరంతర స్ఫురణో... అంత ఆశ, తన బిడ్డలకు ఎల్లప్పుడూ అనుకున్నంతగా పెట్టుకోలేక పోతినే అని అహరహం ఆవేదన.

గడిచిన వినాయక చవితినాడు "ఆవరణంలో అందరికీ ఉదయాన్నే ఇడ్లిచేసి పెట్టండి" అన్నది "చాలా కష్టమమ్మా - అయిదు వందలమందికి ఇడ్లీ చేయాలంటే ఒక్కొక్కళ్ళకి కనీసం నాలుగయినా పెట్టాలికదా" అన్నాము. "నాలుగే పెడతారో, అయిదే పెడతారో. అందరికీ కడుపునిండా పెట్టండి" అని ఆజ్ఞాపించింది అమ్మ... అట్లాగే జరిగింది.

'తినకపోతే మీరు చిక్కిపోతారు. మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను' అంటుంది అమ్మ. ఆ వాక్యం చమత్కారంగా వినిపిస్తుందిగానీ, పరిశీలిస్తే అందులో దాగిన సత్యం ప్రస్ఫుటమై మనను విభ్రాంతుల్ని చేస్తుంది.

"పనులుచేసే పిల్లలకు పకోడీలు చేసి పెడుతున్నారట. రేపు ఇడ్లీచేసి పెట్టండి. జబ్బు చేయదు. తోడుపెట్టి ఒక్కపూట తియ్యటి పెరుగు వేయండి -' ఒకసారి అన్నపూర్ణాలయంవారిని ఆదేశించింది.

ఎక్కడి కక్కడే అమ్మకు ఎంతో శ్రద్ధ. ఎవరు ఎంత తినగలరో, ఎవరికి ఏది యిష్టమో, ఎవరి శరీరానికి ఏది పడుతుందో, పడదో.... అన్నీ అమ్మకు స్పష్టంగా తెలుసును.

"వాళ్ళు కారం అసలు తినలేరు. కారం బాగా తక్కువగా వేయమనండి".

"వాడు కాఫీలో పంచదార వేసుకోడు"

"వాడు తినగలడు, ఇంకాస్త పెట్టండి -"

"నెయ్యి అందరికీ చెరుపు చెయ్యదు నీకు పర్వాలేదు. వేసుకో-"

ఇట్లా అమ్మ ఒక్కొక్కరి విషయం వివరిస్తూ వద్ద చేస్తున్నా చేయిస్తున్నా.... అమ్మకు మనపై గల అపారమయిన వాత్సల్యానికీ; శ్రద్ధకూ మనం వివశులమై పోతాము.

ఆ భావమే మనం ప్రకటిస్తే -

ఇది మమతల గర్భగుడి నేను విరాగిని కాదుగా నాన్నా. కాబట్టి అందరినీ శ్రద్ధగా చూసుకోవాలనే ఉంటుంది."

"సతులకై కొన్నాళ్ళు, సుతులకై కొన్నాళ్ళు..... అన్నాడు త్యాగరాజు. నేనిప్పుడు అదేస్థితిలో ఉన్నాను. ఈ సంతానం కొరకేగా నాకిదంతా."

- అంటూ సన్నగా నవ్వుతుంది అమ్మ, తనకది ఎంతో సహజం అయినట్లు మనకేమో అదికూడా విశేషమే ఆలికి అన్నం పెట్టడమే ఊరికి ఉపకారం అన్న తత్వం మనది ! మన బిడ్డల్ని కూడా అవ్యాజంగా ప్రేమించలేం మనం !

అమ్మ వద్దకు ఎవరు వచ్చినా వాళ్ళకు ఏదో ఒకటి పెట్టుకోవాలనిపిస్తుంది అమ్మ ఎక్కడకు వెళ్ళినా అక్కడకు ఏదయినా తీసుకుని వెళ్ళి అక్కడ పంచడం అలవాటు.

అమ్మ పర్యటన చేసే కాలంలో కూడా ఎక్కడకు వెళ్ళినా ఏదో ప్రసాదం తీసుకుని వెళ్ళి అక్కడ అందరకూ పంచడం అమ్మకు ఆనందం అదీ తాను స్వయంగా తన చేతితో పంచితేనే తనకు తృప్తి.

"నేను బయలుదేరడానికి చాలా ఉండాలి. ఒక గుడిసెకి వెళితే వాడికి పెట్టడానికి తీసుకుని వెళ్ళాలి అమ్మకు ఏమీ పెట్టకపోతినే - అని వాడు అనుకొని బాధపడకుండ వాడిచేత పెట్టించుకోవడానికి నేనే తీసుకుని వెళ్ళాలి" అని చెప్పింది అమ్మ ఒక సందర్భంలో.

ఒకనాడు అమ్మ కారులో ప్రయాణం చేస్తున్నది. ఎదురొచ్చిన రెండెడ్ల బండిలో ఒకతను లేచిచూస్తే "అన్నం తిన్నావా నాన్న?" అని పలకరించి "మనం కాస్త అన్నం మూటకట్టుకుని వచ్చినా బాగుండేది" అనుకున్నది అమ్మ

1958లో మన్నవ వెళుతూన్నంతసేపూ వెంట తీసుకు వెళ్ళిన పటిక బెల్లమూ, దారిలో కొన్న పదకొండు అరటిగెలలూ దారి పొడుగునా పంచుతూనే వెళ్ళింది.

"తిన గలిగినవాడు దొరకడం అదృష్టం. నువ్వు పెడతానంటే మాత్రం తినేవాడు దొరకవద్దా ? ఎంత పెట్టినా తింటుంటే బాగుంటుంది" అని చెబుతూ -

"వాళ్ళ కిష్టమని పెడతానా ? నాకు పెట్టాలనిపిస్తే పెడతాను" అంటుంది అమ్మ నిష్కర్షగా.

"మీరడిగితే పెట్టను, అడిగిందల్లా పెట్టను. మీకు అనవసరమయింది పెడతాను. నేను అనుకున్నప్పుడు పెడతాను" అంటుంది అమ్మ పెంకెగా, మొండిగా.

ఒకసారి ఒక సోదరి అడిగింది "నేనొకటి అడుగుతాను దాచకుండా చెబుతావా, అమ్మా ? అని

"దాచడమా ? అది నాకెప్పుడూ లేదు. పంచడమే తెలుసు" అన్నది త్యాగమయి, రాగస్వరూపిణి అయిన అమృతమూర్తి అమ్మ. పంచడం పూర్తిచేస్తూ సోదరులు రెడ్డిగారిని పిలిచి అమ్మ కండెను ఇస్తే - "కండెలు కాలిస్తే కంటే ఉడకబెడితే బాగుంటాయమ్మా" అన్నారు.

"అయితే ఈసారి ఉడకబెట్టిద్దాం" అంటూ అందుకు ఆజ్ఞాపించింది.

(సెప్టెంబరు 1981)



# 164
# కొత్త మలుపు

"ఆశ్రయం ఇచ్చే దెల్లా ఆశ్రమమే అయినప్పటికీ, ఇది ఆశ్రమం కాదు - ఇల్లు, అందరిల్లు" అన్నది అమ్మ. అందరమ్మ.

జిల్లెళ్ళమూడిలోని అందరింటెని గురించి మాట్లాడుతూ "ఇక్కడ ఒక పద్ధతి అంటూ లేదు. ఎవరి ఇష్టం వాళ్ళదే" నన్నది అమ్మ లోగడ.

నిజంగానే, అమ్మ చుట్టూ ఏర్పడ్డ సంస్థలో ఏ విధి నిషేధాలూ లేవు. అందరికీ కావలసినంత స్వేచ్ఛ. ఎవరి జీవిత మార్గం వాళ్ళదే. ఎవరి సాధన వాళ్ళదే ఏదో ఒక సాధన చేసుకునే వాళ్ళూ ఉన్నారు. ఏ సాధనా లేకుండా ఉన్న వాళ్ళూ ఉన్నారు. ఏ సాధన చేయడానికయినా, అది సాధ్యం కావాలి కదా అన్నది అమ్మ. మరి అది సాధ్యం కావాలంటే దైవానుగ్రహం లేక దైవనిర్ణయం ఉండాలి. దైవ నిర్ణయంలో ఉంటే ఎలాగూ జరుగుతుంది; దైవానుగ్రహమే ఉంటే ఇక, సాధన లెందుకూ? - అన్న విచిత్ర వాదనతో కొందరు ఆ ఆలోచన జోలికి పోవడమే మానివేశారు. "అందరికీ సుగతే" నన్న అమ్మ వాక్యాన్ని ఆధారం చేసుకొని కొందరు - సాధన చేసిన వాళ్ళకీ, సాధన చేయని వాళ్ళకీ ఒకే ఫలితమై యిప్పుడు, మనమిక శ్రమ చేయడమెందుకూ, మనస్సునూ, శరీరాన్నీ కష్ట పెట్టుకోవడ మెందుకూ - అన్న వక్రభాష్యంతో సాధన అన్న పదాన్నీ వాళ్ళ నిఘంటువునుండి తొలగించు కున్నారు. "మీచేత పూజ చేయించుకోవాల్సింది కూడా నేనేగా" "ఆ కొండకు వెళ్లడం, మ్రొక్కు కోవడంకూడా నిర్ణయంలోవేగా" అన్న అమ్మ మాటలను పట్టుకుని 'మనదేమీ లేదు అంతా ఆ తల్లే చూసుకుంటుం'దన్న దంతవేదాంతంతో పలాయన వాదులై పోయారు.

ఏమయితే నేమీ, ఎలాగయితే నేమీ కొందరు సోమరులై పోయారు. కొందరు సుఖజీవనానికి బానిసలై పోయారు. కొందరు మనస్సుకుగానీ, దేహానికిగానీ పని కల్పించడానికే భయావహులైనారు.

ఈ పరిస్థితులను గమనించిన కొందరి నుండి సంస్థ గురించి తీవ్రమైన విమర్శలు వినిపించడం మొదలయింది.

కొందరు వ్యక్తుల అలసత్వంవల్ల, అకర్మణ్యతవల్ల, అమ్మ అభిప్రాయాన్ని, అభిమతాన్ని, సిద్ధాంతాన్ని సరిగ్గా అవగాహన చేసుకోనందువల్ల సంస్థ సమస్తం అప్రతిష్ఠకు, అవహేళనకు, అపనిందకు గురి కావలసిరావడం శోచనీయమయిన విషయం.

సంస్థ నిర్వాహకులయొక్క అసమర్థతకు అదొక ప్రబల తార్కాలమై నిలిచి, సంస్థకు ఒక జటిల సమస్యగా ఎదురయింది.

కనుకనే ఈ నెల 9, 10 తేదీల్లో జిల్లెళ్ళమూడిలో జరిగిన శ్రీ విశ్వజననీ పరిషత్ సమావేశంలో ఈ సమస్య ప్రముఖస్థానం ఆక్రమించుకోవడం తప్పనిసరి అయింది. సంస్థలో పాతుకుపోయిన సోమరితనాన్ని పారద్రోలటానికీ, క్రమశిక్షణను ప్రవేశ పెట్టడానికీ సభ్యులందరిచే తీవ్రమయిన ఆలోచన చేయబడి, కొన్ని నిర్ణయాలు చేయబడ్డాయి.

10వ తేదీ మధ్యాహ్నం సంస్థలోని స్థిరనివాసులను సమావేశపరిచి, చేసిన కొత్త నిర్ణయాల గురించి ఉద్బోధచేయడం జరిగింది.

ఇదివరకు కూడా, అంత తీవ్రంగా కాకపోయినా, ఈ సాధనల విషయమై, క్రమశిక్షణ విషయమై అసలు ఆలోచన జరక్కుండా లేదు. కాని అప్పట్లో వాత్సల్యమూర్తి, కరుణామయి అయిన అమ్మకు ఏ బిడ్డా ఏవిధంగానూ కష్టపడడం యిష్టంలేనట్లు కనుపించింది. అమ్మ చెంత నున్న బిడ్డలకు 'సాధన ఏమిటీ ?' అని అమ్మను అడిగినప్పుడు - 'నా దగ్గర ఉండడమే మీకు సాధన'' అనీ, 'మేము ఏ తరగతిలో ఉన్నాము ?' అని ప్రశ్నిస్తే - ''ముందు బళ్ళోకి రావడం నేర్చుకొనండి, తరగతుల సంగతి తర్వాత ఆలోచిద్దాము'' అనీ సమాధానాలు చెబుతూ, బడికి సక్రమంగారాని పిల్లలకు బంతులు బిస్కెట్లు, చాక్లెట్లు యిచ్చి బడి అలవాటు చేసినట్లు - అమ్మ ఇంతవరకూ అన్నమనీ, ప్రసాదమనీ నిరంతరం మన కడుపును నింపి తృప్తిపరచడం కోసమే ప్రయత్నించింది.

అనుచితంగా ప్రవర్తించిన ఎవరి నయినా అమ్మదృష్టిలోకి తీసుకుని వెళితే - ''తల్లికి తప్పే కనుపించదు'' అని అంటూ వాళ్ళను దగ్గరకు తీసుకుని అన్నపు ముద్దలు కలిపి పెడుతూ వాళ్ళపై అవ్యాజమయిన అనంతమయిన ప్రేమను

కుమ్మరించేది. దానితో వాళ్ళకు క్రమ శిక్షణ, సాధనవంటి పదాలు వింటే హాస్యాస్పదంగానూ, నిర్వాహకులంటే అలక్ష్యంగానూ - తయారయింది.

అందువల్ల ఈసారి సంస్థలో క్రమశిక్షను ప్రవేశ పెట్టేందుకు కార్యవర్గం అమ్మ అనుమతిని అర్థించింది. అందుకు అమ్మ అంగీకరించడమే కాక బలంగా ప్రోత్సహించింది. క్రమశిక్షణ అవసరం అన్నది. సాధనలు చేయ మన్నది సాధనలు, నియమనిష్ఠలవల్ల వ్యక్తి వికాసం పొందుతాడన్నది - ప్రతివ్యక్తీ తాముంటున్న, తనకు ఆశ్రయం యిచ్చిన సంస్థ అభివృద్ధికోసం, పటిష్ఠతకోసంకూడా కృషి చేయాలి - అని నిర్ద్వంద్వంగా ఉద్ఘాటించింది.

ఇది కొందరిని విభ్రాంత చేతస్కులను చేసింది. సంస్థలో తీసుకు రాదలచిన ఈ కొత్తమలుపు అమ్మ అభిప్రాయాల్లోనే మార్పును సూచిస్తున్నదా - అమ్మ తాత్విక సిద్ధాంతాల్లోనే పరిణామానికీ తార్కాణమా - అని కొందరికి ప్రశ్నలు ఎదురయ్యాయి

అందువల్ల ఈ విషయమై కొంత పరిశీలన అని వార్యమే.

"పరుగెత్తేవాడికి ఎదురుపడి హఠాత్తుగా ఎప్పుడూ ఆపకూడదు. వాడితోపాటు కొంత దూరం మనమూ పరుగెత్తి, వాడు అలిసిపోయి ఆగినప్పుడే మనవేపు త్రిప్పుకోవాలి" అని అమ్మ సూత్రం.

"నేను మీ ఇష్టప్రకారం నడుస్తున్నట్లు కనిపిస్తాను. కానీ నా ఇష్టప్రకారమే మిమ్మల్ని నడుపు కుంటాను" అన్నది అమ్మ తత్వం.

సాధారణంగా సామాన్య మానవుడు భోగలాలసుడూ, తప్పులు చేసే స్వభావంకలవాడూ అయినందువల్ల బిడ్డల యందు అమితానురాగం కల అమ్మ ఇంత వరకు మన ఇష్టమే తన ఇష్టంగా ప్రవర్తించింది మన వెంటనే తానూ పరుగెత్తింది.

మరి ఇప్పుడు అలా కాదేమో. మనను తన దారిలోకి మళ్ళించు కొనవలసిన సమయం వచ్చిందేమో.

ఏ తల్లి అయినా - తన పాప బాల్యంలో ఉన్నప్పుడు ఎక్కడయినా స్వేచ్ఛగా వదిలేస్తుంది ఆ బిడ్డ ఆడవాళ్ళతోనూ మగవాళ్ళతోనూ నిర్లజ్జగా తిరుగుతుంది. దిగంబరియై ఆడుకుంటుంది. పిచ్చిపిచ్చి పాటలు పాడుకుంటుంది. అర్థంలేని మాటలు మాట్లాడుతుంది. ఆ పాపలోని అసభ్యతను లోకమూ పట్టించుకోదూ, తలిదండ్రులూ కట్టడి చేయరు. కానీ ఆ పాపకు యుక్త వయస్సు వచ్చిందనుకొనండి. ఇక, ఆ పాపపై వెయ్యి కళ్ళుంటాయి. ఏ మాత్రం అనౌచిత్యం కనుపించినా

లోకమూ సహించదూ. తలిదండ్రులూ భరించరు. వెంటనే ఆ బిడ్డపై తల్లి కూడా కఠిన నియమాలను అమలుపరుస్తుంది. మరి, ఇప్పుడు మన సంస్థకూ యుక్తవయస్సు వచ్చిందేమో !

ఆరోగ్యవంతుడయిన బిడ్డ ఉన్నాడనుకొనండి. వాడు ఏమి తిన్నా. ఎక్కడ తిరిగినా తల్లి పట్టించుకోదు వాడే ఒక వేళ రోగగ్రస్తుడయితే. వాడిపై ఎన్నో ఆంక్షలూ, ఆదేశాలూ తప్పవు మరి, మనం ఇప్పుడు వ్యాధిపీడితులమైనా మేమో!

జాగ్రత్తగా ఆలోచిస్తే ఆరోగ్యవంతుడికి కూడా క్రమశిక్షణ, సదాచారం ఎంతో అవసరం. మనం ప్రకృతిని పరికిస్తే బాగా తెలుస్తుంది. ప్రకృతి అంతా ఎంతో క్రమబద్ధంగా నడుస్తుంది. సూర్యచంద్రులు, గ్రహాలు .... అన్నీ నియమబద్ధంగా చరిస్తాయి. ఏ ఒక్క దానిలోని గమనమైనా ఏ కించిత్ తప్పినా ప్రళయాలు ప్రభవిస్తాయి.

మనకు కనిపించదూ, మనం అర్థం చేసుకోలేము కానీ మన శరీరంలోని అంతరంగాలు ఎంత క్రమంగా నడుస్తున్నాయి ! ఊపిరి తిత్తులు, గుండె, రక్తనాళాలు, పెద్ద ప్రేగులు, చిన్న ప్రేగులు, మూత్రపిండాలు .. ఎంత క్రమశిక్షణతో వ్యవహరిస్తాయి! ఏది క్రమం తప్పినా మనిషి మనుగడకే ముప్పుగదా ! సామాన్య మానవుడి దృష్టిలోకి రాకుండానే ఇవన్నీ జరిగి పోతున్నాయి. తెలిసి చేయాల్సిన వాటి విషయమై మనిషి బద్ధకానికీ అశ్రద్ధకూ లొంగిపోయి పతనమై పోతున్నాడు. అయితే, ఈ పతనం అన్ని సందర్భాల్లోనూ సుస్పష్టం కాదు కనుక క్రమశిక్షణారాహిత్యంవల్ల తాను ఎంత నష్టపోతున్నదీ మనిషి అవగాహన చేసుకోలేకపోతున్నాడు

పూర్వం ఈ క్షేత్రాన్ని, అమ్మ 'యిల్లు' అని మాత్రమే అన్నప్పటికీ యికనుండి 'ఆశ్రమం', అనే వ్యవహరిస్తే సముచితంగా ఉంటుందేమో ! మరి, విధి నిషేధాలు అమలు చేస్తున్నాం కదా !

ఏమయినా ప్రస్తుతం ఆవరణంలో నవచైతన్యం వెల్లి విరుస్తున్నది. కొత్తరక్తం ఎక్కించినట్లు కనిపిస్తున్నది. ప్రతి కుటుంబంలోనూ కనీసం ఒక్కరయినా సుప్రభాత సంధ్యావందనాల్లో పాల్గొనాలన్న నియమంతో ఆ రెండు కార్యక్రమాల్లోనూ అధిక సంఖ్యలో సభ్యులు పాల్గొంటున్నందువల్ల ఆ ఉభయ కార్యక్రమాలకూ ఎంతో నిండుదనమూ, అందమూ, ఆకర్షణా వచ్చాయి. ఆ కార్యక్రమాల్లో పాల్గొంటున్న ఎందరో తాము అనిర్వచనీయ మయిన ఆనందాన్ని తృప్తినీ పొందుతున్నామని చెప్పడం హర్షించదగ్గ అంశం.

శారీరక, మానసిక క్రమశిక్షణవల్ల, సదాచారంవల్ల, సత్‌శీలంవల్ల, ఆధ్యాత్మిక సాధనవల్ల వ్యక్తికి బహుముఖ ప్రయోజనం ఉందనడం నిర్వివాదం అందువల్ల అది మనిషికి, అంతరంగం నుండి స్వచ్ఛందంగా ప్రాప్తించకపోతే - బాహ్యనియమాల వల్ల నయినా అనుసరింప చేయడం అవసరమే. అవసరమయిన రసాయనాల ఉత్పత్తి శరీరంలో జరగనందువల్లనే కదా మనం ఔషధాలరూపంలో శరీరంలోకి పంపించడం ! అలా పంపించనియెడల ఆరోగ్యలోపం, ఆయుక్షీణం తప్పవు.

"దేశమంటే మట్టి కాదోయ్, మనుషులోయ్" అని మహాకవి గురజాడ అన్నట్లు సంస్థ అంటే వనాలూ, భవనాలూ కాదుగా; వ్యక్తుల కలయిక వ్యక్తుల యొక్క ప్రకాశమే సంస్థయొక్క ప్రతిష్ఠ. సంస్థ ఆశ్రయమే వ్యక్తికి బలం సంస్థలోని ఒక గొప్ప వ్యక్తివల్ల సంస్థకు పేరొస్తుంది. ప్రతిష్ఠ వస్తుంది. గొప్ప సంస్థలో నుంచి ఎవరయినా బయటకు వెళ్ళితే వారు లోకం నుండి ఎంతో మర్యాద, మన్నన పొందగలుగుతారు. కనుకనే సంస్థ, వ్యక్తి పరస్పరం ఆశ్రయించుకుని ఉన్నాయి

ఒక మనిషి ఆరోగ్యవంతుడంటే, అవయవాలన్నీ ఆరోగ్యంగా ఉండడమే. ఒక మనిషి బలంగా ఉండడమంటే అవయవాలన్నీ బలంగా ఉండడమే. సంస్థకూ, వ్యక్తులకూ సంబంధం, మనిషికీ అవయవాలకూ ఉన్న బంధమే.

అందువల్ల ప్రతివ్యక్తీ తాను అభివృద్ధి పొందుతూ సంస్థ అభ్యున్నతికి దోహదం కలుగజేయాలి ఇక్కడ నివసించే వ్యక్తి, అమ్మ సన్నిధిచే ప్రభావితుడైన వ్యక్తి, ఆశ్రమ నియమావళిచే సుశిక్షితుడయిన వ్యక్తి ఎలా ఉండాలి ? వెయ్యి మందిలో, లక్షమందిలో ఈ వ్యక్తి ఏమి మాట్లాడినా, ఏమి చేసినా అందులో పరమ విశిష్టత ప్రతిధ్వనించాలి, ప్రతిఫలించాలి. ఈ ఆశ్రమ పాఠశాలల్లో, కళాశాలల్లో విద్యాభ్యాసంచేసి బయటకు వెళ్ళిన విద్యార్థిని ఎవరు పరిశీలించినా - ఇతనేదో గొప్ప ఆధ్యాత్మిక కేంద్రంలో సుశిక్షితుడయినవాడు - అని సులభంగా అభివ్యక్తమై పోవాలి. ఈ ఆశ్రమవాసంవల్ల ఆ విద్యార్థి ప్రయోజనాన్ని పొంది అతడు ఆకాశంలోకి ఎదిగిపోవాలి. లేకపోతే లోకంలో సామాన్యంగా పెరిగిన వ్యక్తికీ, ఒక ఆధ్యాత్మిక కేంద్రంలో ఒక అవతార వ్యక్తి సన్నిధిలో పెరిగిన వ్యక్తికీ అంతరం ఏమిటీ ?

ఒక ఆధ్యాత్మిక కేంద్రంలో శిక్షితుడయిన వ్యక్తి - కొలిమిలోని బొగ్గువలె కణకణలాడుతూ ఉండాలి; వెలిగే దీపంవలె దీపించి పోవాలి. అందుకు శిక్షణ, సాధన, సదాచారం, జపతపాలు, నియమ నిష్ఠలు, ధ్యానం, అర్చన, నామసంకీర్తన, ప్రార్థన... ఎన్నో కావాలి.

ఏ వ్యక్తి అయినా తానొక్కడే ఏకాంతంగా సాధన చేసుకొని తరించడం ఉత్తమమే కానీ అదెంతో కష్టసాధ్యమైన విషయం. సమిష్టిగా చేయడంలో కొంత సౌలభ్యం ఉంది. ఏ సాధనకయినా మార్గ ప్రబోధమూ, శిక్షణా అవసరం. అందుకే ఆధ్యాత్మిక కేంద్రాలు ఏర్పడుతాయి.

అమ్మ ఒక ఆధ్యాత్మిక శక్తి, అమ్మే ఒక సందర్భంలో తన్ను గురించి చెప్పుకున్నది."రూపం పరిమితం; శక్తి అనంతం' అని. మరి, ఆ అనంతశక్తిని విశ్వసించి, ఆశ్రయించి ఆరాధించడానికి దరిచేరిన మనం ఆ సత్యాన్ని విస్మరించి జడులమైపోతే ఎలా ? కల్పవృక్షం క్రిందకు చేరి - ఆ కొమ్మలనూ, ఆ చెట్టునూ విరిచి పొయ్యిలో పెట్టుకునే వెఱ్ఱివాళ్ళమైపోమూ ? వెలుగును చూడలేక కళ్ళుమూసుకునే దివాంధము లకూ మనకూ భేద మేముంటుంది ?

తాపసులకే కాదు, తామసులక్కూడా తాను మందారాన్నే - అని అమ్మ అన్నది గదా అని మనం తామసులమయ్యే ఉందామా ? కాదు, మన అభీష్టాలతో సంబంధం లేకుండా అమ్మ మనల్ని తాపసులనుగా చేయడానికే ప్రయత్నిస్తున్నది. ఆ విధంగా అమ్మ శాసిస్తున్నది.

అమ్మ, మరి, సర్వానుల్లంఘ్యశాసన కదా !

(మే 1979)



**ఒరపిడి**

ఒరపిడి ఉండాల్సిందే. కాని అన్నిచోట్లా ఒకే రకంగా వర్తించదు. బంగారానికి ఒరపిడి పెడితే మెరుగు వస్తుంది. అదే మల్లెపూవుకి పెడితే నలిగిపోతుంది.

- అమ్మ

# 165
# కారుణ్యకేతనం

ఈ సంవత్సరం దేవీనవరాత్రి ఉత్సవాలు హైమాలయంలో అత్యద్భుతంగానూ అత్యంత వైభవోపేతంగానూ జరిగాయి.

సాధారణంగా దసరా ఉత్సవాలకు, దేశంలో అన్ని విద్యా సంస్థలకు వలెనే, జిల్లెళ్ళమూడిలోని ప్రాచ్యపాఠశాల, కళాశాలలకూ సెలవులు ఇవ్వబడుతాయి. సెలవుల్లో సామాన్యంగా అధ్యాపకబృందం వారి స్వంత పనులపై ఎక్కడికైనా వెళతారు. ఈ ఏడు అట్లా కాకుండా అందరూ జిల్లెళ్ళమూడిలోనే ఉండి - హైమాలయంలో తొమ్మిది రోజులూదీక్షగా పూజ చేసుకునేటట్లు జరిగింది.

ఆ కారణంగా హైమాలయంలో పూజకు ప్రత్యేకత, నిండుదనం రావడమే కాక - ఆ పూజలకు ఎంతో అందమూ, ఆకర్షణా వచ్చాయి.

తొమ్మిది రోజులు మూడు పూటల చేసిన అర్చనవల్ల హైమ విగ్రహం పూలతో నడుంవరకు మునిగి హైమసౌందర్యం వెయ్యింతలై విలసిల్లుతుంది.

మహర్నవమితో పూజ పూర్తి అవుతుంది. విజయదశమి రోజున ఆ పూలరాసి నిర్మాల్యమై పోతుంది. అందాకా ఎంతో పవిత్రంగా చూడబడిన కుసుమ సమూహం నదిలో నిమజ్జనం చేయబడుతుంది.

అందువల్ల ఆ తొమ్మిది రోజులూ దీక్షగా అర్చన చేసుకున్న వాళ్ళు - నవమి నాడు హైమాలయానికి వచ్చి ఆ వైభవాన్ని చూడవలసిందిగా అమ్మను అభ్యర్థించారు. అమ్మ అంగీకారం తెలిపింది.

నవమినాడు ఉదయాన్నే అమ్మ స్నానంచేసి బయలుదేరింది. అమ్మ ప్రయాణానికి కారు సిద్ధం చేయబడింది. మంగళవాద్యకారులు మార్గదర్శకులవలె ముందు నిలబడి అందిస్తున్న శ్రావ్యమూ శివంకరమూ అయిన గానలహరిలో వాతావరణం పులకరిస్తోంది. పరిసరాల్లోని చెట్లూ చేమలూ కూడా ఆకులన్నీ కళ్ళుగా అమ్మకోసం నిరీక్షిస్తున్నాయి.

హైమాలయంలో, అనసూయేశ్వరాలయంలో పూజచేసుకుంటున్న వాళ్ళు దండలూ, కొబ్బరికాయలూ, హారతికర్పూరాలూ పట్టుకుని అమ్మకోసం ఉత్సాహులై ఉన్నారు.

అమ్మ మేడ దిగింది. కారు ఎక్కి కూర్చుంది. కారుముందు కొబ్బరికాయ పగిలింది. హారతి వెలిగింది. కారు సాగింది.

కారు పది గజాలు ముందుకు సాగిందో, లేదో - కారును ఆసుపత్రికి పోనివ్వమన్నది అమ్మ. సన్నాయి వాళ్ళను ఆగిపొమ్మన్నది. కారువెంట వచ్చే ప్రజలందరినీ ఆలయానికి వెళ్ళమని ఆదేశించింది.

ఆ సమయంలో రాకపోతే - జరిగిన పూజల అనంత వైభవాన్నీ, జగన్మోహన సౌందర్యాన్నీ చూసే అవకాశం లేదు అమ్మకు. అదీగాక దేవీనవరాత్రి ఉత్సవాలలో 'నవమి'కి అనన్యమైన ప్రాధాన్యం ఉంది. అమ్మ అక్కడకు వచ్చి కేవలం పూజలను చూడడమే కాదు, పూజలను అందుకోవాల్సీ ఉంది. ఆ అకాంక్షతో, ఆశతో అక్కడ ఎందరో అమ్మకోసం ఎదురు చూస్తున్నారు.

కారు మాతృశ్రీ మెడికల్ సెంటర్ ముందు ఆగింది. అమ్మ, మామూలుగా మంచం దిగి నాలుగు అడుగులు సరిగా వేయలేని అమ్మ, కారు దిగి చకచకా లోపలికి నడిచింది. వెళ్ళి ఒక మంచంవద్ద ఆగింది.

ఆ మంచంపై పడుకున్న రోగి అమ్మను చూసి లేచి కూర్చొనడానికి ఆదుర్దా పడుతుంటే - అమ్మ అతని దగ్గరకు వెళ్ళి కూర్చుంది.

అమ్మ అతణ్ణి నఖశిఖ పర్యంతం పరిశీలించింది. ఎక్కడా అతనిలో జీవం కనపడడం లేదు. చాలా శుష్కించి ఉన్నాడు. ఎముకల పోగుమాత్రం మిగిలింది. కళ్ళు గుంటలు పడిపోయి పచ్చగా ఉన్నాయి. శరీర మంతా పసుపు పచ్చగా మారిపోయింది. నాడి చూసింది ప్రబంధనాయిక నడుంవలే ఉన్నదా లేదా అన్నట్లు ఉంది. పొట్టపై చెయ్యి వేసింది లివర్ బాగా పెరిగి గుండె దాకా వ్యాపించింది. అందువల్ల ఆయన మాట్లాడుదామని ప్రయత్నిస్తే - మాటకంటె ఆయాసం ఎక్కువగా కనిపిస్తున్నది.

ఆయన - జిల్లెళ్ళమూడిలో అమ్మ దగ్గర ఉండే శ్రీ గరుడాద్రి సుబ్రహ్మణ్యం గారి అన్నయ్య, శ్రీ వెంకటసుబ్బయ్య. ఆయన మహబూబ్‌నగర్ దగ్గర పెద్ద మరూరులో ఉపాధ్యాయ వృత్తి చేసుకుంటున్నాడు. ఇటీవలెనే భార్యావియోగం

జరిగింది. బహు సంతానం ఉన్నది అందులో యేడేళ్ళవాడు కొడుకు. ఒక్కడే, వాళ్ళ నాన్నని వదిలి పెద్ద ఉండలేదు. వాడు ఆ మంచందగ్గరే తారాడుతున్నాడు.

అమ్మ వాడిని దగ్గరకు పిలిచింది. ఒక పండు వాడి చేతికి ఇచ్చింది. వాడిని ఒళ్ళోకి లాక్కుంది. వాడు అయోమయంగా అమ్మ వంకా, వాళ్ళ నాన్న వంకా మార్చి మార్చి చూస్తున్నాడు. అమ్మ కళ్ళు జలజలా వర్షించాయి. వాడి మూర్ధం అమ్మ పావనా శ్రుసిక్తం అయింది అమ్మను చూసి అంతదాకా ఎంతో ధైర్యంగా స్థైర్యంగా ఉన్న వెంకట సుబ్బయ్య కళ్ళూ శ్రావణ మేఘాలై కన్నీటిని కురిశాయి. ఇక ఆ ప్రక్కనే ఉన్న వెంకటసుబ్బయ్య చెల్లెలు, ఎందరో - వచ్చే దుఃఖపు పోటును ఆపుకోలేక కుస్తీ పడుతూ, చివరకు పరాజితు లవుతున్నారు.

ఆయనకు ఆరు నెలలకు పైగా పచ్చకామెర్లు. అంతకుముందు ఎంత కాలం నుంచో మలేరియా. అందుకు ఎంతమంది దగ్గరో ఎన్ని చికిత్సలో పొందాడు. ఏమీ లాభం లేకపోయింది.

ప్రస్తుతం కామెర్ల జబ్బు అతణ్ణి పీల్చి వేసింది. వంట్లో రక్త మాంసాలు మిగలలేదు. లివర్ పూర్తిగా చెడిపోయింది. ఆహారం నరాలద్వారా తప్ప లోపలకు వెళ్ళడం లేదు. అతనిలో ప్రాణహాని లక్షణాలు రాశీభతమైనాయి. అతని బ్రతుకుపై ఆశ వదులుకోబడింది.

అమ్మ హాస్పిటల్ నుండే నెల్లూరు డాక్టరుగారు శ్రీ సుబ్బారావు గారికి ఫోను చేయ మన్నది. ఫోనులో ఇనజకుమారి జబ్బును గురించి వివరిస్తుంటే - అమ్మ ఫోను తీసుకుని - వెంటనే రా నాన్నా. నాకోసం వచ్చినట్లు రా నాన్నా - అని చెప్పింది. అమ్మ గొంతులో ధ్వనించిన అప్యాయత, అనురాగం, వాత్సల్యం, కారుణ్యం - చాలవూ అతడికి అమృతం పోయడానికి, అతడికి జీవితాన్ని ప్రసాదించడానికి !

అమ్మ తిరిగి రోగివద్దకు వచ్చి - నెల్లూరు నుంచి డాక్టరుగారు వస్తున్నారు. ఇక నీకేమీ ఫరవాలేదు. ధైర్యంగా ఉండు - అంటుంటే "నీ దయ చాలు. నీవుండగా భయమెందుకూ?" అని గొంతు పెగుల్చుకుని అతను పలుకుతుంటే అమ్మ కళ్ళు తుడుచుకుంటూ బయటకు వచ్చింది.

ఆ రాత్రికే నెల్లూరు నుంచి డాక్టరుగారు వచ్చారు. మందులు యిచ్చారు. అంతకు ముందు ఏ హాస్పిటల్లోనూ, ఏ డాక్టరూ నిర్ణయించ లేని అతి క్లిష్టమై గుప్తమై ఉన్న అతని పొట్టకు సంబంధించిన క్షయ వ్యాధి కనుగొనబడింది. అతను వ్యాధి విముక్తుడైనాడు.

శ్రీ వెంకటసుబ్బయ్య పునర్జీవితు డైనాడు.

అమ్మ జీవితం పరిశీలిస్తే.... మరణశయ్యపై ఉన్నవాళ్ళనూ, మరణించిన వాళ్ళనూ కనికరించడం అన్నది సామాన్య విషయమే.

కాని ఇందులో ఇంకొక గమనించదగ్గ అంశం ఉన్నది. నవమినాడు పూజ లందుకొనటానికి బయలుదేరిన అమ్మ ఆసుపత్రికి వచ్చిన విధానం చూస్తే గజేంద్రుణ్ణి కాపాడిన కారుణ్యమూర్తి మనసులో మెదలడమే కాక అమ్మలోని అయాచిత అవ్యాజ వాత్సల్య సృష్టి మనల్ని అమ్మ శ్రీ చరణాలకు బంధితుల్ని చేస్తుంది.

ప్రస్తుం శ్రీ వెంకటసుబ్బయ్య ఆవరణలో అటూ యిటూ తిరుగుతుంటే - అమ్మ సామర్థ్యపతాకం, కారుణ్యకేతనం గాలికి రెపరెప కొట్టుకుంటూ లోకానికి అందాలు, ఆనందాలు పంచుతున్నట్లుంటుంది.

(నవంబరు 1981)



### ప్రేమతోనే

అందరూ నీ బిడ్డలే అయినప్పుడు కొందరికి బాధలూ, మరి కొందరికి సుఖాలు ఇస్తున్నా వెందుకు - అని అడుగుతారు. వారికి నా సమాధానం అవసరం, విలువయినది. పూలు మాలగా కావాలనుకుంటున్నాను. కనుక దారంతో బిగించక తప్పదు. మాలను ధరించాలనుకుంటున్నాను. కనుక బిగిస్తాను.

- అమ్మ

# 166
# ఉపకరణాలం

జనవరి 29వ తేదీన అమ్మ దగ్గర కూర్చున్నాం.

అమ్మతో సంభాషణ ఎట్లా ప్రారంభించాలా ? - అని ఆలోచిస్తున్నాం.

మామూలుగా సంస్థలో ఏ విశేష కార్యక్రమం జరుపుతున్నా ఉత్సవాలు జరుగుతున్నా.... అమ్మే స్వయంగా సలహాల నిస్తుంది. ఒకవేళ ఏకారణంచేత నయినా అమ్మ పిలిచి చెప్పకపోతే - మేమే వెళ్ళి అడుగుతామూ, అమ్మ చెబుతుందీ. ఒక్కోసారి అప్పటికీ అమ్మ అభిప్రాయం వ్యక్తం చేయని యెడల - మేము అమ్మ సన్నిధిలో కూర్చుని చర్చించుకుంటూ ఉంటే, అమ్మ మా మాటల్లో ద్యోతితమయ్యే అమాయకత్వానికి జాలిపడి తానూ సంభాషణలో పాల్గొని మా సమస్యలకు పరిష్కారం చూపుతుంది.

ఈ రోజున కూడా అట్లాగే చేరాము.

ఫిబ్రవరిలో అనసూయేశ్వరాలయంలో ఉత్సవాలు కదా ! అనసూయేశ్వర ఆలయ ప్రాదుర్భావమే కొత్త విషయం. ఇది శాస్త్రనిబద్ధమయిన విధానం కాదు. ఇది అమ్మ అపూర్వ సృష్టి. అందులో ఇటువంటి ఉత్సవాలుకూడా ఇదే మొదటిసారి. ఇక - మనమేమి ఆలోచించగలం ? ఏం నిర్ణయించగలం ?

అందుకే అమ్మ దరిజేరాము.

ఈ విషయంలో కూడా నేనే చెప్పాలా ? - మీ రందరూ కలిసి ఆలోచించుకుని నిర్ణయించుకొనండి - అన్నది అమ్మ.

నిజమే. ఇది అమ్మ ఆలోచించ తగిన విషయం కాదు. మనమూ అమ్మను అడగదగిన సంగతి కాదు. కాని, మనం ఏం చేయగలం ? ఏ విషయాన్నయినా ఆలోచించాలంటే - ఆ విషయమంత గొప్పతనం మనలోకూడా ఉండాలిగదా !

జిల్లెళ్ళమూడిలో ఏ విషయమయినా హిమాలయోన్నత మయినదీ; సాగర గంభీరమైనదే. మరి, ఆ విషయాలపై నిర్ణయాలు చేయడానికి ఎవరికయినా ఆ అర్హతా, అధికారమూ, యోగ్యతా, సామర్థ్యమూ, పరిజ్ఞానమూ, ప్రతిభా ఉండొద్దూ? ఉండడం అంటే - అమ్మ ప్రసాదించడమే కదా ! అందుకనే అమ్మ ఒకసారి అన్నది - స్థితులు పొందేవి కావు, ఇవ్వబడేవి మాత్రమే - నని. నిజమే, ఈ సూక్తి ఒక్క అధ్యాత్మిక స్థితుల విషయంలోనే కాదు, మన జీవితాల్లో సర్వత్రా అనుభూతమయ్యే పరమ సత్యం. మనకు ఏం అనుగ్రహించిందో అమ్మకు తెలియని వియం కాదు కాబట్టి మనలను ఇబ్బంది పెట్టడం, ఇరుకున పెట్టడం అమ్మకు యిష్టం ఉండదు. అమ్మ సంతాన ప్రియ కదా ! అందువల్లనే - ప్రశ్నలకు సమాధానాలు లభించకనూ, సమస్యలకు పరిష్కారాలు దొరక్కనూ మనం ఉక్కిరి బిక్కిరి అవుతుంటే దయానిధి అమ్మ చూస్తూ ఊరకుండ గలదా ?

మన విషయాల్లోనే కాదు, అమ్మ విషయాల్లోనూ అమ్మే మనకు మార్గదర్శకత్వం వహించవలసిన పరిస్థితి గమనార్హం. అమ్మ జీవితంలో అత్యంత విషాదకర సన్ని వేశాల్లో కూడా - అమ్మే సలహా ఇవ్వవలసి రావడం, మనం అడగడం నిజంగా దురదృష్టకరమైన విషయమే. కాని అనివార్యమే అవుతున్నది.

అమ్మకు ఆరోగ్యం భంగమయితే - ఏ వైద్యునికి చూపించాలో అమ్మే సలహా ఇవ్వాలి. ఏ ఔషధం యివ్వాలో ఆ వైద్యునికి అమ్మే సూచించాలి. హైమ మానవతా పరిధుల నధిగమించి పాంచ భౌతిక శరీరాన్ని పరిత్యజించిన వేళ ఆ గర్భశోకాగ్నిలో తప్తమవుతూ కూడా మనకు కర్తవ్యాన్ని అమ్మే ఉపదేశించింది. అమ్మకు జీవితసహచరులై, జీవిత భాగస్వామియై, అత్యంత ప్రేమాస్పదులై, ఆరాధ్యమూర్తి అయిన నాన్నగారు మానవతాసీమలను దాటి మహాప్రస్థానం చేసినప్పుడు - కటిక చీకటిలో కకావికలమైన మన దారిలో అమ్మే కాంతిరేఖలను ప్రసారితం చేసింది.

అమ్మ స్వర్ణోత్సవసమయంలో అపూర్వమైన ఆ శతాధిక సహస్ర ప్రజ ఏక పంక్తి భోజన రమణీయ దృశ్యాన్ని ఎవరు ఊహించగలరు ? ఎవరు సంభావన చేయగలరు? ఆద్యంతమూ ఆ అపురూప మహోత్సవానికి రూపురేఖలు దిద్దిన దెవరు ? ఆ కార్యక్రమ నిర్వహణలో మన చేయి పట్టి నడిపిన దెవరు ? మన నావకు చుక్కాని పట్టిన దెవరు ? అడుగడుగున భయపడే మన వీపును తట్టిన దెవరు ?

సంతోషంలో, సంతాపంలో - అన్ని వేళలా అమ్మే మనకు గురువు, ఉపదేష్ట, మార్గదర్శి. జగత్ గమనానికీ, సర్వజీవుల కార్యకలాపాలకూ ఆధారభూత మయిన ప్రేరణ అమ్మ వీక్షణే కదా !

ఈ సత్యం అమ్మకూ మనకూ కూడా అనుక్షణమూ అనుభూత మవుతూ ఉన్నా - ఎప్పటి కప్పుడు కొత్తగానే ఉంటుంది. అందువల్లనే ఆ సన్నివేశాలు కష్టసుఖాలకు అతీతమై పరమ సుందరమై భాసిస్తాయి.

అసలు అమ్మే ఒకసారి అన్నది...... మీరు అనుకునే దయినా, అనే దయినా, ఆచరించేదయినా నేను అనుకుంటేనే - అని. ఎంత నిజం అది ! అమ్మ అప్పుడప్పుడు తెరలు తొలగించుకుని మనకు నిజస్వరూప ప్రదర్శనం చేసే పవిత్ర సమయాల్లో ఆ మాటలను పలికిన క్షణాలు మానవ జాతికే చిరస్మరణీయమైనవి ! అమ్మ యదార్థ స్థితిపై కాంతి వెల్లువలు ప్రవహించిన శుభసమయం అది !

అయినప్పటికి ఇది మనకు ఇంద్రియ గోచరం కాక మన విశ్వాసంపై ఆధారపడ్డ విషయం.

ఈ ఆధ్యాత్మిక సత్యం జిల్లెళ్ళమూడిలో మనకు ప్రత్యక్షంగా నిత్యానుభవ మవుతుంది. మనం ఎప్పుడూ అమ్మ ఒడిలో కళ్ళు తెరవని పసికందులమే. అమ్మ దృష్టిలో మనం ఎల్లప్పుడూ ఉపకరణాలమే అమ్మ ఏమి చెబితే అది చేయవలసిన వారమే. మన జీవితాలు అమ్మ చేతిలో ఆటబొమ్మలు.

(డిశంబరు 81; జనవరి 1982)



## హైమ ప్రతిష్ఠాపన

నేను కన్నాను, నేను పెంచాను, నేను చంపుకున్నాను. ఇందులో ఎవ్వరికీ భాగం లేదు.

అయినా ఏముంది ఇందులో ? దానికి పాలు ఎట్లా ఇచ్చానో, అన్నం ఎట్లా పెట్టానో - ఇదీ అట్లాగే చేశాను.

- అమ్మ

# 167
# దేవ దేవుడు

---

"కాలవ నిండా నీళ్ళున్నప్పటికీ, దాహం తీర్చుకోవాలంటే రేవు కావాలి" - అన్నది అమ్మ. అదొక గొప్ప వాక్యం, పరమసత్యం. అట్లాగే సర్వత్రా భగవంతుడు వ్యాపకమై ఉన్నాడు - అనుకున్నా, సర్వమూ భగవంతుడే అనుకున్నా - సామాన్యుడు భగవంతుడిని గుర్తించడానికి ఒక ఆలంబన అవసరం. జ్ఞాని దృష్టిలో సర్వమూ దైవమే. అందువల్లనే అమ్మ అన్నది, "ఎంత వెదికినా నాకు అది కానిది కనుపించడం లేదు" అని. ఈ వాక్యం కేవలం అమ్మ స్థితిని మాత్రమే తెలియజేయడం లేదు; ఒక జ్ఞానియొక్క దృష్టిని, ఒక పరమ సత్యాన్నీ ఒక పారమార్థిక పరాకాష్ఠ స్థితిని సూచిస్తున్నది.

అమ్మకు - నాన్నగారు పెండ్లి అయిన క్షణం నుండే దేవుడు. అమ్మ నాన్నా గారిని గురించి ఎప్పుడు ఎవరికి చెప్పినా తన దైవమనే చెప్పింది. అట్లాగే ఆచరించింది. అట్లాగే ఆరాధించింది. అమ్మ తన బిడ్డలనూ దైవమనే భావించింది. తన భర్తనూ దైవమనే పూజించింది. ప్రకృతి సర్వాన్నీ దైవంగానే సంభావన చేసింది. బిడ్డలనూ, లోకాన్నీ అనురాగ పూర్వకంగా, వాత్సల్యపూరితంగా అనుగ్రహిస్తే, భర్తను సమ్మాన పూర్వకంగా, సమాదరంగా సభక్తి కంగా ఆరాధించింది.

అమ్మను మనం దైవంగా గుర్తించాము, దైవంగా కొలుస్తున్నాము. మన దృష్టి అమ్మ దృష్టి కాదు. మనం కనుపించిన సర్వాన్నీ దైవంగా చూడడంలేదు. మనకు మంచీ, చెడూ వేరు. వెలుగూ చీకటి వేరు, సుఖమూ దుఃఖమూవేరు. మురికి కాల్వనూ, గంగానదినీ సమంగా చూడలేము. మానవుడినీ మాధవుడినీ ఒకే పీఠంపై నిలవలేము.

మనం మిగతా జగత్తునూ, అమ్మనూ చూసే కోణాలు వేరు. అమ్మ మన దృష్టిలో విశిష్టస్థానం ఆక్రమించుకున్నది. అమ్మ తన మాటలవల్ల క్రియలవల్ల మన గుండెల్లో గుడి కట్టుకున్నది. మన హృదయాల్లో అమ్మకుగల ఆసనం

అత్యున్నత మయినది, అత్యుత్తమ మయినది, అద్వితీయమయినది, అనుపమ మయినది. అందుకే అమ్మను మనం ప్రేమిస్తాము, గౌరవిస్తాము, పూజిస్తాము. అందుకే దేవుడి ఉనికిని అంగీకరించిన వాళ్ళుకూడా అమ్మను దేవుడుగా సమ్మతిస్తారు. దేవుడు అంటే మానవాతీత మయిన శక్తి కనుక.

అటువంటి అమ్మకు నాన్నగారు దేవుడు. అంటే మనకు దేవదేవుడు.

మనకు ఏమి కావాలో మనకంటే అమ్మకు బాగా తెలుసు, "మీరు అడిగిందెల్లా ఇవ్వను, మీకు ఏం కావాలో తెలుసుకుని అది మాత్రమే ఇస్తాను"అని అమ్మ అనేక పర్యాయాలు ఉద్ఘాటించింది.

అందుకనే అమ్మ మన భావాల్నీ, అవసరాన్నీ ఆలోచించి అనసూయేశ్వర ఆలయాన్ని సంకల్పం చేసింది. అదొక మహత్తర సంకల్పం ! మానవమాత్రులు ఊహించడానికి కూడా శక్యం కానిది.

అందరికీ ప్రీతి పాత్రమయినది అమ్మ. నాన్న గారిలోని మానవాతీత గుణసంపద, దైవికశక్తి అవగతమూ, అనుభూతము కొందరికి మాత్రమే కానీ సర్వ విభేద రహితంగా అమ్మ అనుగ్రహం అనవరతమూ ప్రసారితం అవుతుంది కాబట్టి అమ్మ సర్వలోకాన్నీ కరుణించే నిమిత్తమే అనుసూయేశ్వరాలయానికి రూపకల్పన చేసింది.

ఈ అనసూయేశ్వరాలయ రూపకల్పనలో ఎన్నో అపూర్వ విషయాలు ఇమిడి ఉన్నాయి. అమ్మ - నాన్నగార్లంటే శ్రీ లక్ష్మణ యతీంద్రులు ప్రవచించినట్లు ఒకే ప్రమిదలోని రెండు జ్యోతులు. ఒకే వస్తువు యొక్క ఇరు పార్శ్వాలు.

ఈ అఖండజ్యోతిని జిల్లెళ్ళమూడిలో ఒక దేవాలయంలో సుప్రతిష్ఠితంచేసి సర్వలోకాలకూ ఆ వెలుగునూ, వెన్నెలనూ పంచాలనేదే అమ్మ ఆకాంక్ష.

అమ్మ ఏ కార్యక్రమం చేపట్టినా - అది ప్రణాళికా బద్ధమయ్యే ఉంటుంది. మనకు అర్థం కాక అదేదో హఠాత్తుగా జరిగినట్లూ, అనుకోకుండా జరిగినట్లూ విభ్రాంతుల మవుతుంటాయి.

శ్రీ లక్ష్మణ యతీంద్రులు సెలవచ్చినట్లు 1981 ఫిబ్రవరి 16వ తేదీన ఒక జ్యోతి మరో జ్యోతిలో సంలీనమయింది. అంతకుపూర్వంకూడా అమ్మ అర్థనాగేశ్వరుడే; నాన్నగారిలో అమ్మ అంతర్లీనమై లేక పోలేదు. చూడగలిగిన కళ్ళకు ఈ మనోహర రూపాలు సుస్పష్టమే.

1981 ఫిబ్రవరి 18వ తేదీ ఉదయం అమ్మ ఆ గర్భగుడిలో అఖండజ్యోతిని వెలిగించి అర్చనకు శ్రీకారం చుట్టింది. ఆనాటి నుండి అక్కడ ఉదయం మహాన్యాస పూర్వకంగా ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతుంది. సాయంకాలం అమ్మ నామాలతో అర్చన జరుగుతుంది. అందుకే అది అనసూయేశ్వరాలయం అయింది.

అమ్మ ఆ దేవాలయానికి వస్తే - గర్భగుడికి ప్రదక్షిణ చేస్తుంది. అభిషేకం చేస్తుంది. అర్చన చేస్తుంది. నివేదన చేస్తుంది, హారతి యిస్తుంది. సర్వోపచారాలూ చేస్తుంది.

మన మందరమూ అక్కడ అమ్మ ఉన్నదనే భావంతో అర్చన చేస్తాము. అమ్మ నామాలే చదివి పూజలు చేస్తాము. అమ్మ అక్కడకు వచ్చినప్పుడు తానే స్వయంగా పూజలు, నివేదనలు అందుకొనడానికి ఏమీ సంకోచించదు.

మనం గతంలోకి వెళ్ళి జ్ఞాపకపు పొరల్లోకి చూస్తే - ఎన్నో సంవత్సరాలు ప్రతి మే 5వ తేదీన అమ్మ ఆ గర్భాలయంలో అనుగ్రహ ముద్రలో మనకు దర్శనం ప్రసాదించింది.

మనం నిత్యం చూస్తుంటాము - నాన్నగారి భావనతో ఎందరో అమ్మకు ధోవతులు సమర్పిస్తారు అమ్మ వాటిని నిర్లిప్తంగా స్వీకరిస్తుంది.

ఒక విచిత్ర భావన మన మనస్సులో పరిమళించి మనను ఆనంద పరవశులను చేస్తుంది. అమ్మతో కలిసి నాన్నగారు మన మధ్యనే ఉన్నారు; నాన్నగారితో కలిసి అమ్మ దేవాలయంలో ఉన్నది. అందుకే అనసూయేశ్వరాలయం ఒక అత్యద్భుత సృష్టి. అమ్మ మానవ లోకానికి కరుణతో ప్రసాదించిన మహావరం.

ఈ అనసూయేశ్వరాలయ ఉత్సవాలు మనమందరం ఈ నెల 6వ తేదీ నుండి 16వ తేదీవరకు జరుపుకుని అమ్మ - నాన్నగార్ల ఆసీస్సు లందుకున్నాము.

(ఫిబ్రవరి 1982)



పిల్లలకోసం

పిల్లలకోసం తల్లి అడుక్కున్నా - తప్పు లేదు. - అమ్మ

# 168
# షష్ట్యబ్ద పూర్తి

కాలం ఎంత వేగంగా పరుగెత్తుతున్నదో ! మహీతలంపై అమ్మ ఆవిర్భవించి అప్పుడే 59 సంవత్సరాలు నిండాయి. అరవైయవ సంవత్సరం అడుగుపెట్టింది.

పురిటికేక వేసినప్పటి నుండే కాక జన్మకుపూర్వమే అనేకులకు అమ్మ అవతారమూర్తి అన్న విషయం సుస్పష్టంగా తెలిసింది. అవతరణ తర్వాత ఏదో రూపంలో అందరికీ కాకపోయినప్పటికీ కొందరికయినా అమ్మలోని మహిమాన్విత లక్షణాలు అనుభూతమవుతూనే ఉన్నాయి.

అయినప్పటికీ - మన దురదృష్టమో, అమ్మకు అనిష్టమో..... ఒకరి అనుభవం మరొకరికి పారం కాలేకపోతున్నది. అమ్మ దర్శనంవల్ల, అమ్మ సాన్నిధ్యంవల్ల, అమ్మ ప్రబోధం వల్ల కలుగవలసినంత ప్రయోజనం ప్రజానీకానికి కలగడం లేదన్నది నిర్వివాదాంశం.

అయితే.... అమ్మ చరిత్రను పరిశీలిస్తే అమ్మ, అవతార ప్రయోజనం లీలగా నయినా మనకు గోచరిస్తుంది.

"కనుపించే దంతా దైవస్వరూపమే" అని ప్రకటించింది అమ్మ. "అంతా చైతన్యమే; జడ మేమీ లేదు నా దృష్టిలో" అనీ ప్రవచించింది. "ఎంత వెదికినా నాకు 'అది' కానిది కనుపించడం లేదు" అని ఉద్ఘాటించింది - "ఆత్మసాక్షాత్కారం అంటే అంతా ఆత్మగా సాక్షాత్కరించడమే"నని వివరించింది.

మరి, దైవం కనుపించినప్పుడు ఆరాధించాలికదా ! లోకాన్ని ఆరాధించడ మంటే ఆపదలో నున్న వాళ్ళను ఆదుకోవడం, అవసరమయిన సహాయం అందించడం, కష్టంలో నున్న వాళ్ళ కన్నీళ్ళు తుడవడమే.... ఆరాధన అని విపులీకరించింది అమ్మ. దీన జనులు అంటే దైవస్వరూపులే నన్నది. వారికి సహాయం చేయడమూ అంటే దైవాన్ని సేవించడమేనట. అందుకోసమే అన్నపూర్ణాలయం. అందుకోసమే విద్యాలయాలు, అందుకోసమే ఆదరణాలయాలు.

లోకానికి అమ్మ ప్రసాదించిన అనేక ప్రముఖ వాక్యాల్లో మరొకటి - ప్రాపంచిక మనీ పారమార్థిక మనీ రెండు లేవట. ఆణిముత్యం వంటి మరొక వాక్యం శరీరంకూడా ఆత్మ కాకపోలేదు - అని.

సాధారణంగా పురాణాల నుండీ, శాస్త్రాల నుండీ మనం తెలుసుకునేది - ప్రపంచం అశాశ్వతమైనదనీ, ఈ ప్రపంచానికి భిన్నమై పరమార్థం మరేదో ఉన్నదనీ - దానిని పొందడమే జీవిత లక్ష్యమనీ. ఈ శరీరం ప్రాపంచికమైనది కనుక దీని అవసరాలు తుచ్ఛమైనవి. శరీరం కంటే భిన్నమయిన ఆత్మ మాత్రమే పారమార్థిక మైనది. అందువల్ల ఆత్మకు సంబంధించిన కార్యకలాపాలు మాత్రమే ముముక్షువుకు అవశ్య కర్తవ్యం.

అమ్మ ప్రబోధం ఇందుకు పూర్తిభిన్నంగా ఉన్నది. శరీరాన్ని విడిచిన ఆత్మను అమ్మ అంగీకరించడంలేదు. శరీరాన్ని పోషించడం, దాన్ని ఆరోగ్యంగా ఉంచడం, శరీరంవల్ల శ్రద్ధ వహించడం అమ్మ దృష్టిలో దోషాలు కావు.

అందువల్లనే - అమ్మ తన సాన్నిధ్యంలో ఒక అపూర్వమయిన సమ్మేళనాన్నీ, సమన్వయాన్నీ సాధించింది.

శరీర పోషణ కోసం అన్నపూర్ణాలయం స్థాపించి ఆకలి మంటలను చల్లారుస్తున్నది. ఆకలిగొన్న వాడికల్లా అన్నం పెడుతున్నది. వైద్యాలయం స్థాపించి శారీరక బాధలను తొలగిస్తున్నది.

విద్యాలయాలు నిర్వహిస్తూ - మానసిక అభ్యున్నతినీ, ఆనందాన్నీ ప్రసాదిస్తున్నది.

దేవాలయాలు నిర్మించి ఆధ్యాత్మిక సాధనకూ, ఆత్మాభ్యుదయానికీ పూల బాటలు వేసింది.

అపూర్వమయిన అమ్మ ప్రబోధాలనూ, ఆచరణలనూ నిశితంగా పర్యాలోకన చేస్తే... ఈ త్రివేణీ సంగమం అమ్మ సన్నిధిలో మనకు దృగ్గోచరమవుతుంది.

కనుపించే దంతా దైవస్వరూపమే - నని నిర్వచించిన అమ్మ దానిని ఆరాధించడ మెలాగో ఆచరణ పూర్వకంగా ప్రబోధిస్తున్నది.

అమ్మను ఏదయినా సందేశ మివ్వమని ఒకసారి అడిగినప్పుడు అమ్మ అన్నది "సందేశమని నేను ప్రత్యేకంగా చెప్పేదేమీ లేదు. నా జీవితం నుండి మీ రేమయినా నేర్చుకో గలిగితే నేర్చుకో వచ్చును" అని.

ఆదర్శమయిన అమ్మ జీవితం నుండి లోకానికి అందే సందేశ మిదే నని మనం భావించ వచ్చును. ఈ మార్గాన్నే మనమూ నడవాలనేది అమ్మ అభిలాషగా మనం అర్థం చేసుకొనవచ్చును.

ఇక పోతే - ఈ విధంగా లోకాన్ని ఆరాధించడంలో అమ్మకు ఆనందంకూడా ఉందని మనం ఊహించినప్పటికీ తప్పు లేదు. అమ్మకు ఆనందం చేకూర్చాలని

మన ఆకాంక్ష అయితే - ఆ పవిత్ర కార్యక్రమాల్లో మనమూ మనస్ఫూర్తిగా పాల్గొనడమే మన కర్తవ్యం.

ఈ సంవత్సరం, మరి, అమ్మకు అరవయ్యవ సంవత్సరం కదా ! దేహధారులకు ఎవరికయినా వారి జీవిత కాలంలో అరవయ్యవ సంవత్సరం ప్రత్యేకంగా గుర్తించ తగినదే.

షష్ట్యబ్దపూర్తి చేసుకున్న ఏ తల్లిదండ్రులనయినా బిడ్డలు వేడుకలతో ముంచెత్తి వాళ్ళను తృప్తి పరచి తాము ఆనందించడం లోక సంప్రదాయం.

మరి షష్ట్యబ్దాలు పూర్తి చేసుకున్న అమ్మకు ఈ సంవత్సరం మనం చేయగలిగిన దేమిటి ?

అమ్మ ప్రబోధిస్తున్న అధునాతన సిద్ధాంతాలను లోకవ్యాప్తం చేయాలి. అమ్మ అందిస్తున్న నవజీవనం అందరికీ ఆదర్శం కావాలి.

శ్రీరాముడు మహావారధి నిర్మాణం చేస్తుంటే ఉడతలు సహాయం చేసినట్లుగా అమ్మ బృహత్ కార్యక్రమంలో మనమూ పాల్గొనాలి. జిల్లెళ్ళమూడిలో అమ్మ స్థాపించి నిర్వహిస్తున్న అన్నపూర్ణాలయం, ఆదరణాలయం, విద్యాలయం, వైద్యాలయం, హైమాలయం, అనసూయేశ్వరాలయం బహుముఖంగా అభివృద్ధి పొందడానికి మనమందరం చిత్తశుద్ధితో కృషి చేయాలి.

అమ్మ ప్రబోధాన్ని అనుసరించి సర్వ ప్రజాహిత కారకాలయిన ఈ ఆలయ సమూహం లోకవ్యాప్తంగా అసంఖ్యాకంగా వెలవాలి ! ఉన్నవారూ లేనివారూ అని తేడాలు లేకుండా అమ్మవలె అవి ప్రజలందరికీ అందుబాటులో ఉండాలి.

ఈ ఉద్యమం ప్రపంచ పరివ్యాప్తమయ్యేంత వరకు ఈ ఆలయ గోపురాలు గగనతల పరిచుంబితోన్నతమై దశదిశలకూ కాంతులు విరజిమ్ముతూ జిల్లెళ్ళమూడిలో వెలుగొందాలి.

అమ్మ చేపట్టిన ఈ మహత్ కార్యక్రమాన్ని విజయవంతం చేయడమే అమ్మకు షష్ట్యబ్దపూర్తి ఉత్సవం చేయంగా మనం భావించాలి మనవంతు బాధ్యతను మనం మనస్ఫూర్తిగా చేయడమే అమ్మకు సమర్పించ గలిగిన నిజమయిన కానుక. అందుకు మన మందరం ఉత్తేజితులమై దీక్షితులమై కార్యోన్ముఖుల మవుదాము.

అందుకు కావలసిన బలాన్నీ, ఫలాన్నీ ప్రసాదించమని సంకల్పసిద్ధ, సర్వేశ్వరి అయిన అమ్మను పదే పదే వేడుకుందాము !

(మార్చి, ఏప్రిల్ 1982)



# 169
# అమ్మ షష్ట్యబ్దపూర్తి - 2

మనం అందరం మనుషులమే అయినప్పటికీ మనిషికీ మనిషికీ ఎంత విభేదం ? ఆలోచనలు ఎన్ని రీతులు ! వాక్కులో ఎంత మార్పు!! ప్రవర్తనల్లో హస్తిమ శకాంతరాలు !!!

ఒకడు ఎంత సేపూ తనను గురించే ఆలోచించుకుంటాడు, తన కుటుంబం గురించే తపన పడుతుంటాడు. తనవాళ్ళ యోగక్షేమాలే పరమ లక్ష్యం.

మరొకడు నిరంతరం తనతోపాటు తన చుట్టూ మసలే అన్ని ప్రాణుల గురించి ఆలోచిస్తుంటాడు. వాళ్ళ మంచి చెడ్డల గురించి, వాళ్ళ లాభనష్టాల గురించి యోచిస్తూ వాళ్ళ కష్ట సుఖాల్లో తాము పాలుపంచుకుంటాడు.

ఒకడు అవసరమయినదానికీ, కానిదానికీ కూడా అబద్ధమాడుతూనే ఉంటాడు. ఏం మాట్లాడినా ఎదుటివాడి మనస్సును నొప్పించడమే ధ్యేయమన్నట్లుంటాడు. వాళ్ళ నాలుకలపై అక్షరాలు, పదాలు లజ్జతో, అవమానంతో, బాధతో విలవిల లాడుతాయి.

మరొకడు తన ప్రాణంమీదికి వచ్చినా అసత్యం పలకడు. ఏం మాట్లాడినా ఎంతో మృదువుగా ఉంటుంది. అతని రసనాగ్రంపై అక్షరాలు ఆనందంగా నాట్యం చేస్తాయి. అతని అధరాలపై మాటలు అందాలు దిద్దుకుంటాయి. అతను ఏం పలికితే అది యదార్థ మవుతుంది.

ఒకడు తనకోసమే బ్రతుకుతాడు. ఏం చేసినా తన సుఖమూ, తన లాభమే ప్రయోజనంగా ఉంటుంది. వాళ్ళు తన చుట్టూ చిన్న గిరిగీచుకుని అందులోనే మ్రగ్గిపోతారు, కూపస్థమండూకాలవలె. స్వార్థం కోసం ఇతరులను బలిచేయటానికి వాళ్ళు కొంచెమయినా సంకోచించరు.

మరొకడు ఇతరులకోసమే బ్రతుకుతాడు. లోక కల్యాణమే వారి ధ్యేయం వారి గురించి ఆలోచించడం వారికి చేతగాదు. ఇతరుల సుఖం కోసం, క్షేమంకోసం

వాళ్ళు ఎంతయినా నష్టపడతారు; కష్టపడతారు. కొవ్వత్తులవలె వాళ్ళు కాలిపోతూ ఇతరుకు వెలుగును వెదజల్లుతారు.

...... మొదటి వర్గానికి లోకంలోజనసామాన్యం ఉదాహరణ అయితే - రెండవ వర్గానికి ప్రతీకలైన అసాధారణ మహనీయ వ్యక్తులకోసం ఒళ్ళంతా కళ్ళుచేసుకుని వెదికినా ప్రయత్నం సఫలం కావడం అరుదు. కానీ - మన అదృష్టం కొద్దీ - మనం కళ్ళు తెరిచి చూడకలగాలి గానీ - మన కంటినిండా అమ్మ కనిపిస్తుంది. మనిషిలోని మంచి గుణాలన్నీ రాశీభూతమై కనిపించి మనను అలరిస్తాయి. మానవాతీతమయిన అసాధారణ ఉత్తమ లక్షణాలెన్నో అనుభూతమై మనను ఆనందాశ్చర్యాల్లో ముంచెత్తుతాయి.

విశ్వంలో 'జడచైతన్యాలకు భేదం చూకుండా' అందరినీ, అన్నిటినీ సమంగా కన్నబిడ్డలవలె చూస్తున్న అపూర్వ ప్రేమ జలధీ, వాత్సల్యామృత వర్షిణీ అమ్మ. 'మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను' అని పలికిన అసాధారణవ్యక్తి అమ్మ. 'ఇంట్లోవాళ్ళనీ, ఇతరులనీ భేదం కనిపించని' మహోన్నత వ్యక్తిత్వ అమ్మ. 'ఉన్నదంతా అదే'గా చూస్తున్న జ్ఞానపరాకాష్ఠ అమ్మ స్థితి.

అమ్మ రూపం, అమ్మవాక్కు, అమ్మ ఆలోచనలు, అమ్మ క్రియలు.... అమ్మ జీవితమే లోకానికి ఆదర్శం. ఈ విధంగా మనుషులు ఉండాలి, అనుకోవడానికి అమ్మ మేలుబంతి. ఈ విధంగా మనుషులు ఉండవచ్చును - అని చెప్పడానికి అమ్మ సజీవోదాహరణం.

ఉత్తమ పురుషలక్షణాలకు ఆకరమయిన అమ్మ 'పురుషోత్తముడు'గా సర్వజనారాధ్య అయింది.

మనం నిత్యం అమ్మను స్మరించడం, అమ్మను దర్శించడం, అమ్మను పూజించడం, అమ్మను గురించి అధ్యయనం చేయడం, ఆలోచించడం.... అమ్మలో అత్యంత ప్రకాశమానమై అనంత మయిన కాంతులు వెదజల్లే గుణాలు లక్షణాలు మనలోకి ఆహ్వానించుకొని అనుపమాన మయిన ఆనందాన్ని అనుభవించడం కోసమే.

అమ్మ లక్ష్యంకూడా - మనలో ఆ గుణాలను ప్రేరేపించి మనను ఆనంద మయులనుగా చేయడమే. ఒక దీపం మరొక దీపాన్ని వెలిగిస్తే - ఆ దీపం మరో వెయ్యి దీపాలకు మూలం అయినట్లు - మనలో 'అమ్మ లక్షణ బీజాల'ను చల్లడమూ, మనలో 'అమ్మ'లకు జీవం పోయడమే అమ్మ జీవిత లక్ష్యంగా మనం భావించవచ్చును.

మనం లోగడ అమ్మ స్వర్ణోత్సవం జరుపుకున్నా, ప్రస్తుతం షష్ట్యబ్దపూర్తి ఉత్సవం జరుపుకొన బోతున్నా - అమ్మ జీవితాన్నీ, జీవిత సందేశాన్నీ లోకవ్యాప్తం చేయడంకోసమే. ప్రతి గుండెలోనూ అమ్మను సుప్రతిష్ఠితం చేయడంకోసమే. ప్రతి మానస సరోవరంలోనూ అమ్మ సందేశ కమలాలను వికసింపచేయడం కోసమూ, ఆ సుగంధాలతో లోకాన్ని నింపివేయడం కోసమే.

ఇందుకు ప్రతి ఒక్కరూ కృషిచేయాలి. అందరూ కలిసి పనిచేయాలి.

సముద్రం ఎప్పుడూ ఉంటుంది. నిత్యమూ అందులో స్నానం చేయడం ఆరోగ్యకరమూ, పుణ్యప్రదమే. కానీ అట్లా చేయలేము. కనుకనే పర్వదినాలని శాస్త్రాలు ప్రత్యేకించాయి. ఆ రోజుల్లోనయనా తప్పక మనం స్నానం చేయాలని శాస్త్రాల ఉద్ఘోష.

అట్లాగే, మహాత్ముల జన్మదినాలు, కల్యాణదినాలు, స్వర్ణోత్సవాలు, వజ్రోత్సవాలు.......

(జూన్ 1982)



## సరెండర్

మీరు నాకు సరెండర్ కావటం కాదు.

నేనే మీకు సరెండర్ అయినాను.

ఎప్పుడూ బిడ్డ తల్లికి సరెండర్ కాలేదు.

తల్లే బిడ్డకు సరెండర్ అవుతుంది.

అదే తల్లి లక్షణం. అదే తల్లికి యిష్టం.

- అమ్మ

# 170
# ఆధ్యాత్మిక జీవనం

ఆ రోజు గురుపూర్ణిమ - విజయవాడ నుండి ఒక కుటుంబం అమ్మను చూడటానికి మొట్టమొదటి సారిగా వచ్చింది. ఆ కుటుంబం పెద్ద శ్రీ సూరంపూడి సర్వేశ్వరరావుగారు, స్కూల్సుయిన్‌స్పెక్టరుగా చేసి రిటైరయ్యారు వారి కుమార్తెలు ఇద్దరు, అవివాహితలు; వారి కుమారుడూ, కోడలూ వచ్చారు.

కుమార్తెలు ఇద్దరూ అమ్మకు నమస్కారం చేసుకుని వివాహ ప్రాప్తి కలగజేయమని అమ్మను అర్థిస్తూ..... ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రసాదించమని వేడుకున్నారు.

తండ్రీ అమ్మకు పాదాభివందనం చేసి - పరిపూర్ణజ్ఞానాన్నీ, ముక్తినీ, అనాయాసమరణాన్నీ అనుగ్రహించమని ప్రార్థించాడు.

కుమారుడుకూడా అమ్మకు ప్రణమిల్లి - ఆధ్యాత్మిక జీవితం ప్రసాదించమ్మా అని కోరుకున్నాడు.

నాకు ఆశ్చర్యం కలిగింది - ఆ కుటుంబంలోని సభ్యులందరి ఏకగ్రీవ మయిన అభిలాషను వినగానే.

అతను మోకాళ్ళపై కూర్చుని తదేకంగా అమ్మను అవలోకిస్తున్నాడు - అమ్మ ఏమి చెబుతుందా - అని.

అమ్మ మౌనంగానే ఉన్నది. ఆ చూపులో గానీ, ముఖంలో గానీ ఏభావమూ ప్రస్ఫుటం కావటం లేదు. అమ్మకు సహజమయిన ప్రశాంతత, నిర్లిప్తత అమ్మ వదనమండలంలో తేజరిల్లు తున్నాయి.

"హాయిగా బ్రతికే వాళ్ళు - కోరి కోరి ఎందుకు కష్టాలు తెచ్చుకుంటారు ? ఆధ్యాత్మిక జీవితం కోరుకోవడం అంటే - పూలబాటనుండి ముళ్ళ డొంకలోకి మళ్ళడమే" అన్నారు అక్కడి సోదరుల్లో ఒకరు.

"సిద్ధపడే అడుగుతున్నాను" అన్నాడు అతడు నిశ్చలంగా.

అతడి స్థిరచిత్తమూ, ధైర్యమూ ప్రశంసాపాత్రమైనవి.

ఇంకా అమ్మ మౌనం వీడలేదు. గది అంతా కూడా చాలా నిశ్శబ్దంగా ఉన్నది

"అమ్మా - వారడుగుతున్నారు. ..." అన్నాను, వారు అమ్మ నుండి ఏమయినా వినాలని కుతూహలంగా ఉన్నారని భావిస్తూ.

అమ్మ పెదవులు కదిలాయి.

గది అంతా సావధానమయింది గది అంతా చెవులైనాయి.

అమ్మ పెదవి విప్పితేచాలు - అత్యద్భుత ప్రతిభా సంపన్నుడయిన మహా వైణికుడు విశిష్టమయిన వల్లకీ వల్లరిపై సుందరమయిన అంగుళితో సుతారంగా మీటినట్లు... ఒక అలౌకిక నాదం ప్రభవిస్తుంది. ఆ నాదం నుండి దివ్యరాగం సముద్భూతమై పరిసరాలన్నిటా పరివ్యాప్తమై అణువణువునూ పులకింపజేస్తుంది. గుండె గుండెలోనూ గులాబులు విరిసినట్లు ఒక అలౌకిక పరిమళం ప్రసృత మవుతుంది.

అదంతా ఒక దివ్య ప్రక్రియ.

ఆ వాగమృత తరంగిణిలో ఒక బిందు వయినా అస్వాదించ గలిగినవారు అదృష్టవంతులు, ధన్యులు !

"అధ్యాత్మిక జీవనం అని ప్రత్యేకంగా ఉందని నేను అనుకోవడం లేదు"

అమ్మ అక్షరమక్షరాన్నీ రాగమయంగా రమణీయంగా ప్రవచించింది.

అపారమయిన అమ్మ అనుభవం ప్రసవించిన అపూర్వమందారం ఆ వాక్యం! అమ్మ - అనంతజ్ఞానతైలంతో వెలిగించిన దివ్యజ్యోతి ఆ వాక్యం !

అందరూ ఆసక్తిగా వింటున్నారు. అమ్మ పునరుద్ఘాటించింది. "నా దృష్టిలో ఆధ్యాత్మిక జీవితమంటూ ప్రత్యేకంగా లేదు నాన్నా. నీవు చేసే ప్రతిపనీ దైవకార్యమే ఈ జగత్తే దైవస్వరూపం అయితే నీవు చూసేది ఏది దైవం కాదూ ? నీవు చేసేది ఏది ఆధ్యాత్మికం కాదూ ?"

ఆధ్యాత్మిక జీవితంకోసం ప్రత్యేకంగా చేయవలసిన ప్రయత్నమంటూ లేదని అమ్మ నిర్ద్వంద్వంగా ప్రవచించింది.

అయితే - ఈ భావం అమ్మ ఈనాడే క్రొత్తగా చెప్పలేదు. అనేక పర్యాయాలు అనేక రీతుల్లో అభివ్యక్తం చేసింది.

సామాన్యుల్లో లౌకికానికీ ఆధ్యాత్మికానికి మధ్య అడ్డుగోడ ఉన్నది. అమ్మ ఆ గోడను పునాదులతో సహా పడగొడుతున్నది.

మనం నివసించే ఈ లోకం కాక - మరణానంతరం మనం వెళ్ళి మన పాపపుణ్యాలకు ఫలితాలను అనుభవించే వేరే లోకాలు ఉన్నవనే భ్రాంతీ, ఈ సృష్టి స్థితిలయ కారకుడైన భగవంతుడు వేరే ఉన్నాడనే భ్రమా మన ఊహాలకూ ఆలోచనలకూ ఆధారం.

అమ్మ ఈ భ్రమనూ భ్రాంతినీ ఆమూలాగ్రం అన్ని విధాల తొలగిస్తున్నది. అమ్మ తన అనుభవం నుండి పలికిన అనేక నిర్వచనాలూ ప్రవచనాలూ ఈ పరమ సత్యాన్ని బలపరుస్తున్నాయి.

"మీరు జగత్తు దైవం కంటే వేరు అంటారు. నేను ఈ జగత్తే దైవం అంటాను. మలయమారుతాలు, కోయిల కూతలు, విరబూసిన పూలసరోవరాలే కాదు - పెంట, పేడ, చీము, నెత్తురు - అన్నీ కలిసిన ప్రకృతినే పరమేశ్వరుడు అనుకుంటున్నాను."

'నాలుగు చేతులూ, కాళ్ళతో వేరుగా ఎక్కడో లేదు. అన్నీ అయి ఉన్నాడు. గులాబీపువ్వుగా, తమలపాకుగా, మంచంగా, కిటికీగా - అన్నీ తానే అయి ఉన్నాడు.'

"దేవుణ్ణి చూడాలనే ఆసక్తి నాకు లేదు. ఈ కనపడుతున్న దానికన్నా భిన్నంగా ఏదీ నాకు కనపడటం లేదు."

"వాడెక్కడో ఉన్నాడనీ, ఇక్కడలేడనీ, మీరు కాదనీ, చూడాలనీ ప్రయత్నమూ లేదు. మీ కంటే భిన్నంగా (దైవం) ఉన్నాడనుకోవడం లేదు."

"ఒకే శక్తి అన్ని గుణాలతో అన్ని రూపాలతో ఉంది. ఈ కనిపించే సర్వమూ దైవమే. ప్రత్యేకించి ఒక రూపంతో లేడు, చూడడానికి. గంగానదీ అదే, మురికి కాలవా అదే".

"కనపడే దంతా అదే అయితే కళ్ళు మూత లెందుకు ?"

"కనపడుతున్నది కాదనుకుని ఎందులోనో ఏదో ఉందనుకోను. ధర్మం, అర్థం, కామం - ఈ మూడూ కాదనుకుని చేస్తున్నది లేదు. ఇంతకంటే వేరే ఏముంది?"

సంసారం, భర్త, భార్య, సంతానం, మమకారాలు అన్నీ లౌకికమయిన అనుబంధాలనీ, ఆధ్యాత్మికానికి బంధాలనీ మనం అనుకుంటుంటే - అమ్మ ఇవేవీ ఆధ్యాత్మికానికి ప్రతిబంధాలనుకోకపోగా సాధనకు అవకాశాలే నంటున్నది.

అమ్మ అనురాగానికీ, మమకారానికీ సరిహద్దులూ, పరిమితులూ చెరిపేసి 'సర్వత్రానురాగం' 'అపరిమిత మమకారం' మాధవత్వానికి మారుపేర్లు అనేసరికి - పెద్దపులులే లేడికూనలై మనం భయపడదగినవి కాక పెంచుకోవలసినవిగా మారిపోయాయి.

అందుకనే అమ్మ "పెండ్లిలో పెద్దపులి ఉన్నదనుకునే వారి భయం పోగొట్టటానికే నే నీ పెండ్లి చేసుకుంటున్నాను" అన్నది.

పిల్లలకు అన్నం పెట్టుకోవడం మన దృష్టిలో లౌకికం, మరి - తన పిల్లలమయిన మనకు అన్నం పెట్టుకొనడమే ఆధ్యాత్మిక సాధన అయింది అమ్మకు.

మనం - బడికి వెళితే లౌకికమనీ, గుడికి వెళితే ఆధ్యాత్మికమనీ భావిస్తాము. అమ్మ దృష్టిలో బడికీ, గుడికీ తేడా లేదు.

మనం బజారు నుండి పూలు కొనితెచ్చి - భార్య జడలో తురిమితే లౌకికమూ, దైవాన్ని అర్పిస్తే ఆధ్యాత్మికమూ. అమ్మ దృష్టిలో భర్తకు భార్య దేవతయే కాబట్టి భార్యను అలంకరించడమూ దైవారాధనే.

ఒక సందర్భంలో శ్రీమతి కడప రామసుబ్బమ్మగారితో ప్రసంగిస్తూ - "ప్రజాసేవ కూడా మోక్షమార్గమే" నన్నది. అమ్మ దృష్టిలో పురుష ప్రయత్నం కూడా దైవ సంకల్పమే.

"ధ్యాసే ధ్యానం" "దిగులే జిజ్ఞాస" "నిరంతరస్మృతే ఆరాధన" "ఆవేదనే ఆరాధాన" "తపనే తపస్సు".

ఈ జంటపదాల్లో మొదటి వర్గ మంతా మన దృష్టిలో లౌకికాలు. అమ్మ దృష్టిలో మన మనుకునే ఆధ్యాత్మికాలు.

"వినపడే ప్రతిశబ్దమూ ఓంకారమే. కూరలు తరిగేటప్పుడు కత్తిపీటనుంచి వచ్చే శబ్దంకూడా ఓంకారమే. రాయిపై రాయితో కొట్టినా ప్రణవనాదమే. నాకు పిల్లల ఏడుపులోనూ వేదమే వినిపిస్తుంది. శబ్దమే ఆత్మశబ్దం. కుక్క అరుపు కూడా అదే".

"ప్రణవమే కాదు, అన్ని అక్షరాలూ దైవ స్వరూపమే" నన్నది అమ్మ.

"పొయ్యి, రోలు-రోకలి, చీపురు, కత్తిపీట నా వేదాలు చేటపంచమవేదం"

మనం పరమలౌకికాలు అనుకునే వస్తువులు ఎట్లా ఆధ్యాత్మిక సాధనలు అయిపోయాయో ! పరుసవేది స్పర్శతో ప్రతిదీ సువర్ణమే అయినట్లు అమ్మదృష్టి సోకి ప్రతిదీ దైవమే అవుతున్నది !

"శరీరం కూడా ఆత్మ కాకపోలేదు" - అన్న వాక్యం వేదాంత చింతనలోనే విప్లవం సృష్టించింది. మనం శరీరం హీనమయినదని అనుకుంటూ, అంతకంటే విశిష్టమయినది మనస్సూ, అంతకంటే ఉన్నత మయినది జీవుడూ, పరమోత్కృష్ట మయినది ఆత్మ అనుకుంటున్నాము. కాని శరీరానికీ, ఆత్మకూ గల అంతరాలను అమ్మ తుడిచేసి రెండూ వేరు కావు అన్నది.

మన దృష్టిలో బాధ లౌకికమయినది. ఆనందం ఆధ్యాత్మిక మయినది. అమ్మ "బాధగూడా భగవంతుడే" నన్నది. మనం మంచి తనం లౌకికమనీ, మనకు అర్థంకాని అతీతశక్తి దైవమనీ అనుకుంటుందే - అమ్మ "మంచితనాన్ని మించిన దైవత్వం ఏముందీ?" అంటున్నది.

అదే విధంగా మనం 'అలౌకికాలు' అని ఆకాశంలో నిలబెట్టిన వాటిని అమ్మ అవలీలగా అవనిపైకి దించి మనకు అందుబాటులోకి తీసుకురావడం మరో విశేషం.

"పాపం పుణ్యం లేవు - ఇష్టం అయిష్టంతప్ప" శ్రీపాదవారు అన్నట్లు మన దృష్టిలో పాపపుణ్యాలు యమదూతలు. అమ్మ వాటిని పరమ లౌకికాలయిన యిష్టాయిష్టాలుగా మార్చింది.

మనం "ఇడా, పింగళ -" అని ఏమేమో అనుకుంటుంటే - "ఇడా, పింగళ అంటే ఏం లేదు నాన్నా - కుడి, ఎడమ మాత్రమే" నంటుంది.

మనం 'శివలింగం'ను పూజిస్తుంటే - "అవసరమయితే నేను శివలింగంతో కుంకుడుకాయలు కొడతాను. ఏముంది అక్కడ ? అదీ రాయేగా -" అంటుంది సులభంగా.

'మంత్రం' అనేది మన దృష్టిలో విశిష్టమయిన ఆధ్యాత్మికమయితే - "మంత్ర మంటే ఏముందీ, అక్షర సముదాయమేగా" అంటున్నది. ఆచారం విషయం వస్తే - అమ్మ దృష్టిలో ఆచారం ఆరోగ్యం కోసమే మడి అంటే మనం ఏర్పరుచుకున్న హద్దులే.

పరమార్థం గురించి మాట్లాడుతుంటే - "అంతా స్వార్థమేగా. పరమార్థం ఏముందీ?" అంటుంది.

'నాది సర్వ సాధారణ స్థితి' అని చెబుతూ 'సర్వం సాధారణమయిన స్థితి' అని వివరించింది. మనకు విశేషమై కనిపించే వన్నీ అమ్మకు సామాన్యమయినవే. అందుకే అమ్మ మాన్యయే కాదు, సర్వసామాన్య ! అనన్య సామాన్య !

లౌకికాలలో. ఆధ్యాత్మికాలలో 'సమదర్శనం' చేస్తున్నది అమ్మ.

మన దృష్టిలో అంధకారం లౌకికం; అసత్తు లౌకికం; అజ్ఞానం లౌకికం. అమ్మదృష్టిలో తేజఃతిమిరాలు, సదసత్తులు, జ్ఞానాజ్ఞానాలు.... సర్వ ద్వంద్వాలూ ఆత్మస్వరూపాలే. "అంతా ఆత్మగా కనుపించడమే ఆత్మసాక్షాత్కారం" అని నిర్వచిస్తూ "ఎంత వెదికినా నాకు అది కానిది కనిపించడం లేదు" అని ప్రకటించిన అమ్మ ఆత్మజ్ఞాని, అద్వైతమూర్తి. అందుకనే మనందరకూ 'ఆరాధ్య' అయింది.

(జూలై 1982)



### గుణగణాలు

శుక్ల శోణితాల కేది కులమో అదే నా కులం.
గుణ భేదమే లేని నాకు కుల భేదమేమిటి ?

గుణ భేదమే నాకుంటే మీలో ఏ ఒక్కరూ నాదగ్గరకు రాగలిగే వారు కారు.

నేను మీ గుణగణాలు చూసి ప్రేమించటం లేదు. నాకోసం నేను ప్రేమిస్తున్నాను.

- అమ్మ

# 171
# నూతన శబ్ద ప్రయోగాలు

ఈ నెల (ఆగష్టు) 27వ తేదీ ఉదయం విశాఖపట్నం సోదరులు శ్రీ కేశవశర్మ, శ్రీ నరసింహారావుగారలు అమ్మవద్ద ఆసీనులై ఉన్నారు. విశాఖపట్నం మాతృశ్రీ అధ్యయన పరిషత్ పనిమీద హైదరాబాద్ వెళుతూ అమ్మ ఆశీస్సులను అర్థిస్తున్నారు. ఆ సందర్భంలో కోదండరామయ్యగారి ప్రస్తావన వచ్చింది. ప్రక్కనున్న వారు గుర్తులు చెప్పి ఆ 'కోదండం' యేనా ? - అని అడిగారు. మరొకరు 'ఆయనే కోదండం' అన్నారు అమ్మ వెంటనే "ఆయనకోదండం అనండి, మీ పనులు అవుతాయి'' అన్నది. 'కోదండం' అన్న పదాన్ని అమ్మ విరిచిన తీరు చూసి మేము గలగలా నవ్వుకున్నాము.

పదాలతో ఆడుకోవడ మనేది అమ్మకు అతి బాల్యం నుండీ సరదా. అందులో అమ్మ అత్యంత ప్రవీణ. పదప్రయోగంలో అమ్మ చూపే నేర్పు అందరినీ ఎప్పుడూ విస్మితులను చేస్తూ ఉంటుంది.

జగన్మాత - అంటే మనం సాధారణంగా ఏమి అర్థం చెప్పుకుంటాము ? జగత్తుకు లేక జగత్తుయొక్క మాత అని చెబుతాము కానీ అమ్మ ఆ అర్థాన్ని ఖండిస్తూ "జగత్తు అనే మాత; జగత్తే మాత" అని ప్రవచిస్తున్నది. సమాసం యొక్క రూపాన్నే మార్చేస్తున్నది అమ్మ.తత్పురుష సమాసం అమ్మస్పర్శలో 'రూపకం' గా పరిణామంపొంది తళుక్కు మంటున్నది.

'బ్రహ్మజ్ఞానం' విషయంలో మనం - బ్రహ్మను గురించిన జ్ఞానం, లేక బ్రహ్మయొక్క జ్ఞానం - అని వివరిస్తాము. కానీ అమ్మ 'జ్ఞానమనే బ్రహ్మ' అని అర్థం చెబుతూ మనం రెండర్థాల్లో చెప్పుకునే బ్రహ్మకూ, జ్ఞానానికీ మధ్య గల అంతరాన్ని అంతంజేసి - జ్ఞానమే బ్రహ్మ అని నిర్వచించి మనను చకితులను చేసివేసింది.

అట్లాగే 'దైవశక్తి' విషయంలోనూ. 'దైవశక్తి ఏమున్నదీ ? శక్తియే దైవం'' అన్నది.

అట్లాగే 'దైవ సంకల్పం' విషయంలోనూ, "దైవ సంకల్పం ఏమున్నదీ ? సంకల్పమే దైవం అన్నది.

అట్లాగే 'భగవద్భక్తి' విషయంలోనూ, "భగవద్భక్తి ఏముందీ ? భక్తే భగవంతుడు' అన్నది.

అట్లాగే 'తల్లిరక్షణ' అని మనం అంటే "రక్షణే తల్లి" అని అమ్మ అంటుంది.

మనం 'కఠోర సత్యం' అంటే - అమ్మ "సత్యమే కఠోం" మంటుంది. మనం 'మధుర స్మృతి' అంటే - అమ్మ స్మృతే మధురం" అంటుంది. మనం 'ఆదర్శ ప్రేమ' అంటే అమ్మ "ప్రేమే ఆదర్శం" అంటుంది.

'పంచామృతాలు' అంటే - అయిదు అమృతాలు అని అర్థం చెబుతాము. అమ్మ "పంచబద్ధ అమృతాలు" అని విడగొట్టింది. ఒకే అమృతం పంచబద్ధదిట. పాలుగా, పెరుగుగా, మీగడగా, వెన్నగా, నెయ్యిగా.

అట్లాగే 'పంచ భూతాలు'. ఒకే భూతమే పృధివిగా, వాయువుగా, నీరుగా, నిప్పుగా, ఆకాశంగా పంచబద్ధదట.

'మిథ్య' అంటే లేనిది అని కాదుట; మారుతూ ఉండేదట. 'దుష్టసంహారం' అంటే - దుష్టులను అంతమొందించడం కాదుట; దుష్టత్వాన్ని సంహరించడమట.

'రూపరహితుడు' అంటే -రూపంలేనివాడు కాదట. అన్ని రూపాలూ తానైన వాడట. నామరహితుడు అంటే - అన్ని నామాలూ తన వైనవాడట. గుణరహితుడు అంటే - అన్ని గుణాలూ కలిగినవాడట. అమ్మ పదాల అర్థాలనే మార్చివేసింది.

కరుణ అంటే - ఆయా సమయాల్లో ఆయాపనులు చేయించడమేనట. మనం మనకు అనుకూలంగా అయిన పనులనే కరుణ అనుకుంటాము. అమ్మ "అయిన పనీ అనుగ్రహమే; అవని పనీ అనుగ్రహమే" అంటున్నది. విరాగం అంటే మన భావనలో అన్నిటినీ వదులుకోవడం. మరి, అమ్మ - "సర్వత్రానురాగమే విరాగం" అనే సరికి చీకటి గుహలో పండువెన్నెల విరిసినట్లయింది.

రాగం అంటే - 'కావాలి' ద్వేషం అంటే - 'వద్దు' అన్న భావాలకు ప్రతిరూపాలని భావిస్తాము. కానీ అమ్మ - "రాగమూ, ద్వేషమూకూడా 'కావాలి' అన్న దాని మీదనే ఆధారపడి ఉన్నాయి" అంటుంది.

"సంకల్పరాహిత్యం' విషయంలోనూ అమ్మ కొత్త అర్థాన్ని ప్రసాదించింది. "తనకు వచ్చే సంకల్పాలన్నీ వాడిచ్చినవే - అని గ్రహించడమే సంకల్ప రాహిత్య" మట ఈ వివరణ సాధకుల మార్గంలో గొప్ప పరిణామానికి దోహదం కలుగజేస్తున్నది గగన కుసుమం అయిన సంకల్పరాహిత్యంకోసం ప్రయత్నించీ ప్రయత్నించీ ఆ స్థితి లభించక విసిగిపోయే సాధకుడికి ఈ వివరణ అమృతోపమానమయింది.

'మృత్యుంజయు'డన్న పదానికీ అమ్మ యిట్లాగే చక్కని వ్యాఖ్యానం చేసిందీ. అసలే మృత్యువు లేనివాడు కాదట. మృత్యువును గురించిన భయం లేనివాడే మృత్యుంజయుడట.

ఒక్కొక్కసారి మనం వాడిన పదాన్నే తీసుకుని ఒక్క అక్షరం మార్పుతోనో, తారుమారుతోనో అమ్మ కొత్త అర్థాలను అందిస్తుంది.

మనం 'కైవల్యం' అంటే - అమ్మ 'వైకల్యం లేనిదే' అంటుంది. 'స్వర్గం' అంటే - 'వర్గం లేనిదే'నట, 'హింస' అంటే - 'సహించలేనిదే'నట 'కష్టం' అంటే 'యిష్టం లేనిదే' నట.

కొన్ని నిర్వచనాలు వింతగా వినిపిస్తాయి 'కలవరింత' అంటే - "ఒకడి కలవరం మరొకడికి వింత" అట. 'ఆవలింత' అంటే - "ఆవలి వింతకు పోయే సూచన" అంటుంది అమ్మ "అపదుద్ధారిణి' అంటే "ఆపదల నుండి ఉద్ధరించడం కాదు, ఆపదలను ఉద్ధరించడం" అని చమత్కరించింది.

అమ్మ ఇచ్చిన కొన్ని నిర్వచనాలు మనను ఆశ్చర్యచకితులను చేయడమే కాదు, అవి అపూర్వమయినవీ, అనన్యసాధమైనవీ కూడా.

'మంచితనం' అంటే - సర్వత్రా మంచినే చూడడమట. 'పవిత్రులు' అంటే - అందరినీ పవిత్రులుగానే భావించేవారట. 'పతివ్రత' అంటే పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలనూ జయించినదట. 'సాధ్వి' అంటే సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదట.

"దయలేనివాళ్ళే దయ్యా" లనడంలో మనను శబ్దచమత్కారమే ఆకట్టు కుంటుంది కానీ అమ్మ ఆ నిర్వచనంద్వారా మనలోని మూఢమయిన నమ్మకానికి గొడ్డలిపెట్టు పెడుతూ, మనలో ఒక కొత్త ఆలోచనా ధోరణికి పునాదులు వేయడం మనం గ్రహించాలి. అట్లాగే - "మన భ్రమే బ్రహ్మరాక్షసి" అంటుంది మరొకసారి.

"గురువు అంటే తెలియ చెప్పేవా"డట. "దైవం అంటే తెలియజేసేవా"డట తెలియ చెప్పడానికీ తెలియజేయడానికీ ఎంత సూక్ష్మమైన అంతరం ! అట్లాగే - జీవుడికీ, దేవుడికీ భేదం భావమేనట. అంతా ఒకటిగానే తోచేవాడు దేవుడు, అనేకంగా తోచేవాడు జీవుడూనట.

"గురువు అంటే గుర్తు చూపించిన వాడే"

"సత్రం అంటే సర్వులకూ స్వతంత్రమయినది"

"సంస్థ అంటే సమస్తమూ చేరింది"

"ఘనుడు - అంటే, పొడవూ వెడల్పులే కాక గుండెలోతు కలవాడు"

మనం కొన్ని పదాలను పర్యాయపదాలుగానే ప్రయోగిస్తాము. అమ్మ వాటిని వేరుచేసి వేరు వేరు అర్థాలు చెప్పింది.

కోపం - తాత్కాలికమైన వైరభావమట

క్రోధం - శాశ్వతమయిన కక్ష సాధింపట.

భ్రమ - లేనిదానిని ఉన్నదని ఊహించడమట.

భ్రాంతి - ఉన్నదానిని లేదని భావించడమట.

ఆరోగ్యం - శారీరక మయినదట.

కులాసా - మనసుకు సంబంధించినదట.

అందుకనే అమ్మ ఎవరడిగినా - "ఆరోగ్యం లేదూ, కులాసా లేకుండానూ లేదు" అని సమాధానం చెబుతూ ఉంటుంది.

"అమ్మా - భగవంతుడి మీద నిరంతర ధ్యాస ఉంటుంది కానీ ధ్యానం చేయలేక పోతున్నాను" అని బాధపడే సాదకుడితో వెంటనే అమ్మ "ధ్యాసే ధ్యానం నాన్నా -" అంటుంది. అట్లాగే "ఆవేదనే ఆరాధన"ట. "దిగులే జిజ్ఞాస"ట. "తపనే తప" మట. "తృప్తే ముక్తి".

అమ్మ ఒక్కొక్కప్పుడు మనం అన్న మాటలోనే ఒక అక్షరం మార్చేస్తుంది. దానితో మనలో ఒక దీపం వెలిగి నట్లయి - మనకో సత్యసందర్శనం అవుతుంది.

ఒకరు అమ్మకు కొబ్బరికాయ కొడితే - అది కుళ్ళిపోయింది. అతడు బాధ పడుతూ వచ్చాడు. అమ్మ అతడి వాలకం చూసి "ఏమయిందీ ?" అని అడిగింది.

'కుళ్ళిపోయింది' అన్నాడతడు విచారంగా "కుళ్ళిపోయింది కాదు, నాన్నా - కుళ్ళు పోయింది" అన్నది అమ్మ. వెంటనే ఆ వాక్యంతో అతని బాధను తుడిచివేయడమే కాక అతనికో కొత్త భావాన్ని అందించింది అమ్మ.

ఒకసారి నాన్న గారింట్లో ఆబ్దికం జరుగుతున్నది. ఆ వంటను పిల్లి ముట్టుకున్నది. ఎవరో ఆదుర్దాగా అమ్మ వద్దకు వచ్చి 'పిల్లి ముట్టుకున్నది, ంట మళ్ళీ చేయాలి' అన్నారు. "పిల్ల ముట్టుకున్న దమ్మా" అని వారనుకునే తప్పును అమ్మ ఒప్పుగా మార్చేసింది. ఇందులో ఒక్క అక్షరం మార్పు మాత్రమే మనకు వినిపిస్తుంది గానీ జాగ్రత్తగా ఆలోచిస్తే అందులో అమ్మ యొక్క విశాల హృదయం, సర్వమాతృత్వం మనకు విరాడ్రూపంతో సాక్షాత్కరిస్తాయి.

అట్లాంటి వాక్యమే "ఎప్పుడో కనిపెంచాను; ఇప్పుడు కనుపించాను" అనేది.

ఒకరు 'రిక్తహస్తాలతో వచ్చానమ్మా -' అంటే (అను) "రక్తహస్తాలతో వచ్చావు నాన్నా -" అని సముదాయించింది.

ఒకరు 'పరధ్యాసగా ఉన్నావమ్మా' - అంటే "పరధ్యాస కాదు నాన్నా, పతిధ్యా' ' అన్నది అమ్మ.

వాళ్ళ అబ్బాయి కేశ ఖండనం కోసం వచ్చిన కేశవుడిని అడిగింది అమ్మ "కేశఖండనమా ? క్లేశఖండనమా ?" అని

నాన్నగారు 'అక్కడ (ఆ శరీరంలో) బల మేముదీ ? భావ బలమే గానీ' అంటే అమ్మ వెంటనే "భావ బలం కాదు; బావ బలం" అన్నది. బావ అంటే నాన్నగారు, అమ్మ మేనత్తకొడుకు.

అమ్మ హాస్యప్రియ. అమ్మ చేసే పదచమత్కారాలు మనకు గిలిగింతలు పెడతాయి.

'అమ్మా - నీ రహస్యం తెలిసింది - చెప్పనా ?' అన్నారు ఒకరు. "రహస్యం అయితే ఎట్లా చెబుతావు ?" అన్నది అమ్మ.

'అమ్మా - నీతో ఏకాంతంగా మాట్లాడాలి' అన్నారు మరొకరు. "ఏకాంతం అంటే సంభాషణకు అవకాశ మెక్కడా ?" అని ప్రశ్నించింది.

'అమ్మా - సందేహం తీరడంలేదు' అన్నారు యింకొకరు. "దేహం ఉన్నన్నాళ్ళూ సందేహమూ ఉంటుంది నాన్నా -" అన్నది.

'చిక్కుతీసేదా, అమ్మా ?'' అని ఒక అక్కయ్య అప్పుడే తలంటిపోసుకున్న అమ్మను అడిగింది. 'నా చిక్కు ఎవ్వరూ తియ్యలేరు. అందరూ చిక్కుల్లో పడేసేవారే' అన్నది అమ్మ నవ్వుతూ. 'చిక్కు' అని ఆ అక్కయ్య ఆశించిన అర్థం వేరు. అమ్మ చెప్పిన అర్థం వేరు.

'చెప్పమ్మా' - అని అడిగాడు ఒక అన్నయ్య. "నేను చెప్పమ్మను కాను. ఒక్క చెప్పులకే అమ్మను కాను. మీ కందరికీ అమ్మనే'' 'చెప్పు' అని అడిగిన ఒకరితో "తొడుక్కుండే దెవరూ?'' అన్నది.

"పీటమీద కూర్చున్న వాళ్ళందరూ పీఠాధిపతులే ?'' నట.

అమ్మ ఒకసారి నాతో అన్నది "నీవు మీ ఊరికి కరణమేమోగానీ నాకు మాత్రం ఉపకరణానివే'' కరణానికి అనుసంధించిన ఉపకరణం అంటే అసిస్టెంట్ కరణం అనీ, అమ్మకు ఉపకరణం అంటే పనిముట్టు అనీ, 'ఉపకరణం' అన్న వద ప్రయోగంలోని శబ్దచమత్కృతికన్నా - అమ్మకు నాయందలి ఆత్మీయతకు నేనెంతగా మురిసిపోయానో !

'మెప్పించుకుండే భక్తి, రప్పించుకుండే శక్తీ - నాకు రెండూ లేవు' అన్న ఒక అన్నయ్యతో "తప్పించుకుండే యుక్తి'' అన్నది అమ్మ.

ఒకరు 'ఇంటరెస్టు లేదమ్మా -' అంటే - అమ్మ "ఇంట (ఇంటి యందు) రెస్టు లేదా ?'' అని ప్రశ్నించి అతణ్ణి ఆశ్చర్య పరిచింది.

అమ్మ చిన్న తనంలోనే ఒకరు ఒక సందర్భంలో 'లోపలగానా' అని ప్రశ్నించగా "లోపల గానా; బయట బజానా'' అని అమ్మ పలికితే విన్న వాళ్ళందరూ నివ్వెర పోయారు. ఆ వ్యక్తుల్లో చిదంబరరావుతాతగారు కూడా ఉన్నారు. ఒకే పదం భాష మారేసరికి మరొక అర్థాన్నిస్తుంది. గదా ! చిన్నతనంలోనే భాషను అట్లా వాడుకోడంలో అమ్మకు ఉన్న అధికారం తెలుస్తుంది.

ఒక అత్తగారు అమ్మతో 'మా కోడలు మీకు ప్రెజెంట్ చేయాలనుకున్న దమ్మా -' అంటే - అమ్మ అడిగింది 'మరి నేను ఆబ్సెంట్ అయ్యానని మానుకున్నదా?' అని. ఆ అత్తగారు ప్రెజెంట్‌ను నామవాచకంగా ఉపయోగిస్తే - అమ్మ దానిని క్రియగా తీసుకుని దానికి వ్యతిరేక పరమైన ఆబ్సెంటును ఉపయోగించింది

'జైలు కావాలా ?' అని చిన్నతనంలో అమ్మను అడిగిన పోలీసుతో 'జైలు కొడతావా ? అప్పుడే వద్దులే'' అన్నది అమ్మ. అతడు జైలును కారాగారం అన్న

అర్థంలో ప్రయోగిస్తే అమ్మ "జయ జయ ధ్వానాలు" అన్న అర్థంతో వాడింది. ఆ శబ్ద చమత్కారానికి మాత్రమే ఆనాడు ఆ పోలీసు విభ్రాంత చేతస్కుడైనాడు కానీ - అమ్మ మాటలోని భావిసూచకార్థాన్ని గ్రహించలేదు

మరి, అమ్మది తోలునోరు కాదు కదా, తాలుమాట రావడానికి. ఈ మాట కూడా అమ్మే స్వయంగా ప్రకటించింది అసలు ఆ మాటలు మనకు అందుతాయా - తోలునోరు, తాలుమాట అని

'సమస్యల తోరణం' అన్న పదాన్ని 'సమస్యలతో -రణం' అని అమ్మ విరిచినప్పుడు గానీ మనకు స్ఫురించదు.

'నాన్న' అన్న పదాన్ని 'నా - అన్న'గా విరిచి వినిపిస్తే ఎంత తమాషాగా ఉన్నదీ - అని మనం అనుకుందాము.

'అవినాభావ సంబంధం' అన్న పదాన్ని 'అవి, నా, బావ సంబంధం' గా అమ్మ విరిచింది.

"చేతలు చేతుల్లో లేవు" "తిధులు విధిని మార్చలేవు" "అనుకున్నది జరగదు; మన కున్నది తప్పదు" "సంకల్పమే సంసారం" ...... అన్న వాక్యాల్లో ఎంతెంత అర్థాన్ని అమ్మ ఎంత సూక్ష్మంగా ఎంత తక్కువ మాటల్లో చెబుతుందో మనకు అర్థమవుతుంది.

అట్లాగే "అంతా అయిందీ, అర్థం కానిదీ అద్వైతం".

అదే విధంగా కొన్ని స్థితి భేదాలను కూడా అమ్మ బహుసూక్ష్మంగా వివరించింది.

"లక్ష్మణుడు రామునిదగ్గర ఉన్నాడు. భరతుడు రాముని తన దగ్గర ఉంచుకున్నాడు". "రుక్మిణి - నేను కృష్ణుని భార్యను అన్నది. సత్యభామ - కృష్ణుడు నా భర్త అన్నది"

అట్లాగే - "సిద్ధులందరూ ప్రసిద్ధులూ కాదు. ప్రసిద్ధులందరూ సిద్ధులూ కాదు." "వక్తలందరూ ప్రవక్తలూ కారు. ప్రవక్తలందరూ వక్తలూ కాదు".

అమ్మ కొన్ని చోట్ల పద స్వరూపాన్నే మార్చివేసినప్పుడు అమ్మ ఘటనాఘటన సామర్థ్యం అభివ్యక్తమవుతుంది.

"కృష్ణుడు కాదు గృష్ణుడు" అంటూ "గృష్ణుడు అంటే గుణముల కాధారమయినవాడు" అని వివరించి మనను చకితులను చేసింది.

"రామం అంటే విరామం లేనిదే"

"రాధ అంటే ఆ'రాధ'న భావమే"

అట్లాగే ప్రసిద్ధమయిన - 'ధన మూల మిదం జగత్' అన్న సూక్తిని "తన మూల మిదం జగత్" అన్నది ఒక్క అక్షరం మార్పుతో సామాన్యమయిన ఒక లౌకిక సూక్తిని ఒక ఆధ్యాత్మిక సత్యాన్ని ఆవిష్కరించే మహావాక్యంగా మార్చి వేసింది అమ్మ

"జగన్మిథ్య బ్రహ్మసత్యం' అన్న వాక్యాన్ని తారుమారుచేసి "బ్రహ్మ మిధ్య జగత్సత్యం" అని ప్రకటించింది.

ఒకసారి ఒక పిచ్చుక నోట గడ్డి కరచుకుని వెళుతూ ఒక పరకను అమ్మపై వదిలింది. అపుడు అమ్మ అన్నది "పిచ్చుకపై బ్రహ్మాస్త్రం కాదు; అమ్మ (బ్రహ్మ)పై పిచ్చుకాస్త్రం" అని.

"మానవుని నడక నవగ్రహాలమీద ఆధారపడిలేదు. రాగద్వేషాలనే రెండే గ్రహాలమీద. ఆ రెంటికి ఆధారం నేనే" అని ఒకసారీ, "మానవ జీవితం నవగ్రహాలపై కాదు, ఒకే గ్రహంపై ఆధారపడి ఉంది. అదే దైవానుగ్రహం" అంటుంది ఆగ్రహం తెలీని అనుగ్రహ స్వరూపిణి.

కొన్ని భావాలను బలంగా చెప్పదలుచుకున్నప్పుడు అమ్మ వాక్య విన్యాసాన్ని మనం గమనించాలి.

మీరూ, నేనూ ఒకటే - నన్న భావం అమ్మ చెప్పాలి. అందుకు "మీరు కానిది నేనేమీ కాను నాయనా" అంటుంది.

శ్రీ వాసుదాసుగారితో మాట్లాడుతూ అమ్మ 9 సం॥ వయస్సు లోనే "ఏమీ కావాలనేది అక్కరలేకుండా కావాలి" అన్నది. ఏమీ వద్దు - అంటే సరిపోతుంది గదా ! అట్లాగే - అంతా అదేగా కనుపిస్తున్నది - అనడానికిగాను "అది కానిది కనుపించడం లేదు" అంటుంది.

"గణనకు అందనిది గండ"మట.

"సవరణ అవసరం లేనిది వివరణ" మట.

"తనను తాను విమర్శించుకోవడం - వివేక"మట.

"ఇతరులను విమర్శించడం అవివేక"మట.

"తనకొరకు చేసేది రాగ"మట.

"ఇతరులకొరకు చేసేది త్యాగ"మట.

"నిగ్రహం కొరకే విగ్రహారాధన" మట.

"నిగ్రహం ఉంటే ఏగ్రహాలూ ఏమీ చేయలే" వట.

"ఇతరులతో తగాదా ఆడడం పోరాడట" మట.

"తనలో తాను, తనతో తాను పోరాడడమే ఆరాట"మట.

--- ఇలా రెండు రెండు పదాలు అమ్మ రసనాగ్రం నుండి బంతులవలే వెలువడి ఆడుకుంటాయి. ఈ వాక్యాల్లో ఎంతో కవితా సౌందర్యమూ, అర్థగాంభీర్యమూ ఉంటాయి.

"అప్పులు, తప్పులు చేయనివారు లోకంలో ఎవరుంటారూ ?" అన్నది అమ్మ. అప్పులు, తప్పులు - అనడంలో మాటసొబగే కాదు, ఎంత లౌకిక నికిత పరిశీలన ఇమిడి ఉన్నది ? మానవతావాదం ప్రఫుల్లమవ లేదూ? అమ్మకు మానవునిపై గల అపారమయిన సానుభూతిని ప్రస్ఫుటం చేయ్యడం లేదూ ? అప్పులు తప్పులు చేయడం నేరంగా భావించేవారికి - అవి మానవసహజాలే నని తీర్పు జెప్పడం అమ్మకు మనిషిపైగల కారుణ్యానికి చిహ్నం కాదూ ?

అటువంటిదే మరో వాక్యం. 'తప్పు అని తెలిసీ మనిషి తప్పులు ఎందుకు చేస్తాడూ ?' అని అడిగితే అమ్మ అన్నదీ.... "తప్పించుకో లేకనే" అని మనిషి గుండెకు గురిచూసి వస్తున్న బాణాన్ని అమ్మ 'విధి' వైపుకు మళ్ళించలేదూ ?

"సహనమనే దేవతను ఆరాధించాలంటే బాధలనే పూజా ద్రవ్యాలు కావాలి" ఈ వాక్యం రూపకాలంకారానికే అపూర్వమైన ఉదాహరణం.

అమ్మ తనను గురించి చెప్పుకున్న కొన్ని వాక్యాలుకూడా కేవలం అమ్మను గురించి తెలియజేయడమే కాక అందులో ఎంతో అందం కూడా కనుపిస్తుంది.

"నాకు శిష్యులెవరూ లేరు. అందరూ శిశువులే".

"నాకు భక్తులెవరూ లేదు. అందరూ బిడ్డలే"

"తల్లికి తప్పదు కాదు -- తల్లికి తప్పే కనిపించదు".

"తల్లి అంటే తరింప చేసేది"

"తల్లి అంటే తొల్లి". ఈ వాక్యంలో కేవలం తల్లి, తొల్లి - అనే పదాల్లో సారూప్యమూ, ఆ రెండు పదాల కలయికవల్ల ఉద్భూతమయ్యే సౌందర్యమే కాక - ఎంత అర్థం గర్భితమై ఉందీ !

అట్లాగే "నేను నేనైన నేను".

అమ్మ పదాల అర్థాలతో ఆడుకోవడమే కాక పదాలను వ్రాసే పద్ధతి (వర్ణక్రమం) నిగూడా మార్చిన ఘట్టాలున్నాయి.

'అమ్మ' అనే మాటను 'అంమ' అనీ 'అంఅ' అనీ వ్రాస్తూ 'అంఅ' అంటే - అంతులేనిదీ, అడ్డులేనిదీ, అన్నిటికి ఆధారమైనదీ - అని అపూర్వమయిన నిర్వచనం ఇచ్చింది.

అమ్మ ఒక సందర్భంలో తనను గురించి తెలియ జెప్పకుంటూ - "నాది సర్వసామాన్య స్థితి" అన్నది. అంటే మనం అనుకుంటాము..... అమ్మది అతి సామాన్యమయిన స్థితి అని. కానీ దాని అర్థం అది కాదుట, అమ్మె మరొక సందర్భంలో వివరించింది - 'సర్వమూ సామాన్య మయిన స్థితి' అది. అర్థంలో ఎంత మార్పు ! హస్తి మశకాంతరం !! సర్వమూ సామాన్యమైన స్థితి సిద్ధత్వమే కదా!

'అందరిల్లు' అనే పదం అమ్మ హృదయ క్షీరాబ్దినుండి ఆవిర్భూతమయిన కల్పవృక్షం ! అందరు, యిల్లు - అనే రెండు పదాలు మనందరికీ చిరపరిచితాలే అయినప్పటికీ - ఆ రెంటి కలయికతో సామ్యవాదానికి మకుటాయమానమూ, అమ్మ విశ్వజనీన తత్వానికి ప్రతిబింబమూ అయిన ఆ అపూర్వపదం పదకోశానికే మహోజ్జ్వల మణిదీప మయింది.

అమ్మ పదాలెంత కోమలమూ, సుందరములో - అమ్మ ప్రయోగించే పదాలూ, వాక్యాలూ ఆపాతమధురములూ, ఆలోచనామృతములూ. మనం అమ్మను - ప్రాథమిక పాఠశాలకు గూడా వెళ్ళని ఒక సామాన్య స్త్రీగా భావించినపుడు మనకీ ప్రయోగాలన్నీ ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి కానీ ---

శారదా స్వరూపిణి అయిన అమ్మకు భాషపై అధికారం ఉండడంలో ఆశ్చర్యమేమి ఉన్నదీ ?

(ఆగష్టు 1982)



# 172
# అమ్మ కళ్ళు

సహస్రనామాల్లో అభివర్ణితమయిన లలితా పరాభట్టారికవలె అమ్మ లావణ్య శేవధి. అమ్మ అంగాంగమూ దివ్యతేజో విలసితమూ, అపురూప సౌందర్యోపేతమూ. అమ్మ శరీరపేటికాంతర్గతమయిన దివ్యజ్వాల శరీరంలోని అణువణువునుండీ బహిర్గతం కావడానికి ప్రయత్నిస్తున్నట్లుగా అన్ని అవయవాలూ అరుణారుణమై ఉద్దీప్తమై ఉజ్జ్వలమై ప్రభాపూరమై ప్రకాశిస్తూ ఉంటాయి.

ఆ విధంగా అలౌకికమయిన, అనుపమానమయిన దివ్యతేజాన్ని ప్రసారం చేస్తూ కార్తిక దీపాల్లాగ అందరికీ అన్ని వేళలా కమనీయంగా కనుపించి కనువించు చేస్తుంది అమ్మ కందోయి.

సామాన్యంగా అమ్మ కళ్ళు అతి ప్రశాంతంగా ఉంటాయి. వర్షానంతరం గగనతలంవలె అతి నిర్మలంగా భాసిస్తాయి. పసిపాప కన్నులవలె ఏ భావ ప్రకటనా లేక అత్యంత నిర్లిప్తంగా కనుపిస్తాయి. రాగాలకూ, అనురాగాలకూ, అనుబంధాలకూ అందని అతిలోక భావ అగాధాలేవో కనుపించి - నిస్తరంగ నిశ్చల గంభీర నీరధి తీరాన నిలబడిన అనుభూతిని మనకు కలిగిస్తాయి.

అమ్మ చూపులు అతినిశితంగా ఉంటాయి. ఆసక్తితో, కుతూహలంతో అమ్మ చూపులవెంట మనం పయనిస్తే - దిగంతాలకు దూసుకుపోయే ఆ చూపులవెంట ప్రయాణం చేయలేక ఎడారిలో సుళ్ళుతిరిగే పవనవీచికలవలె మన చూపులు నడుం విరిగి కుప్పకూలి పోతాయి.

అమ్మ కళ్ళు తెరిచి చూస్తుంటే - నభోమండలంలో ఒకే పర్యాయం సూర్య సుధాకరులు వెలుగుతున్నట్లుంటుంది. అమ్మ కళ్ళు మూసుకుంటే దేవాలయ కవాటాలు బంధించినట్లుంటుంది.

అమ్మకళ్ళనుండి అనుగ్రహజలపాతాలు ధరాతలంపైకి దూకుతూ అందరినీ

ఆహ్లాదపరుస్తుంటాయి. అమ్మకళ్ళ నుండి వాత్సల్యామృతగీతాలు వినిపిస్తూ అందరినీ లాలిస్తూ ఉంటాయి.

అమ్మకళ్ళు - అప్పుడే ఎంతో కష్టంతో ప్రసవించి, తన బిడ్డను చూసుకోవాలనే ఆకాంక్షతో కన్నులు తెరవడానికి ప్రయతిస్తూ, బలహీనతతో అలసటతో కనురెప్పలు ఎత్తలేక అరమోడ్పు కళ్ళతో పసిబిడ్డను చూసుకుంటూ పరవశించిపోయే కోటి మాతృమూర్తులు మనకు సాక్షాత్కరిస్తారు

పొదుగును కుమ్ముతూ పాలుత్రాగుతూ తన్మయం చెందే దూడల మేనులు రసనాగ్రంతో శుభ్రం చేస్తూ పులకించిపోయే గోమాతలు కోటి అమ్మ కళ్ళల్లో మనకు ప్రత్యక్షమవుతాయి.

దృష్టిమాత్రం చేతనే పిల్లలను పోషించే మీనసహస్రం అమ్మనయన సరోవరంలో చలిస్తూ, జ్వలిస్తూ మనకు దర్శన మిస్తాయి.

అమ్మకళ్ళు నవ్వుతాయి.
అమ్మకళ్ళు మాట్లాడతాయి.
అమ్మకళ్ళు కథలు చెపుతాయి.
అమ్మకళ్ళు కావ్యాలు వినిపిస్తాయి.
అమ్మకళ్ళు ఆదేశిస్తాయి.
అమ్మకళ్ళు ఆశీర్వదిస్తాయి.
అమ్మకళ్ళు దయాసముద్రాలు..
అమ్మకళ్ళు ప్రేమప్రవాహాలు.
అమ్మకళ్ళు అగ్ని ప్రభంజనాలు.
అమ్మకళ్ళు హేమంతాలు, శశిరాలు...
అమ్మకళ్ళల్లో విరిసిన నందివర్ధనాలు, మల్లెలు, విరజాజులు, పారిజాతాలు.
కనకాంబరాలు, గులాబులు, మంకెనలు, మందారాలు.

అమ్మకళ్ళల్లో రవ్వలహారాలు, రత్నరాసులు, వజ్రాలు, వైడూర్యాలు తళతళలాడుతాయి.

కెంపులు గుంపులు గుంపులు నిగనిగలాడుతంటాయి.
కొన్ని వేళల నీలాలు, అతినీలలోహితాలు.
అమ్మకళ్ళల్లో కోటి రాకాపూర్ణిమల ధవళ ధవళ కాంతులు.
కోటి అమావాస్యల కాటుక చీకటి చిక్కని తెరలు.

అమ్మకళ్ళల్లో పాలవెల్లులు, పాలపుంతలు.
అమ్మకళ్ళల్లో పూలజల్లులు, పులకరింతలు.
అమ్మకళ్ళల్లో వసంత శోభలు, కల్యాణ రోచిస్సులు.
అమ్మకళ్ళల్లో దిగంత దీప్తులు, కమనీయోషస్సులు.
అమ్మచూపులో రామబాణం ఉంది.
అమ్మచూపులో గోవిందుని వేణుగానం వినిపిస్తుంది.
అమ్మచూపులో బ్రహ్మాస్త్రం ఉంది, వాత్సల్యాస్త్రం ఉంది.

వారుణాస్త్రాలున్నాయి, అగ్నేయాస్త్రాలున్నాయి.

ఆ చూపులు లోకాన్నంతనూ జయించిన ధీమాతో వెలిగి పోతుంటాయి.

జగత్తుకంతకూ అభయప్రదానం చేస్తున్నట్లు అలరారు తుంటాయి.

అమ్మచూపు విశిష్టమయినది. ఆ విషయం అమ్మకూడా అంగీకరించింది.

"మీరు ఇక్కడికి వచ్చి నన్ను చూస్తారు. నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తేనే ఉన్నాను".

"అందరూ ఎప్పుడూ చూడరు నన్ను".

"నే నందరినీ ఎప్పుడూ చూస్తాను".

"నన్ను చూడడానికి మీరు రావాలి.

మిమ్మల్ని నేను చూసుకోగలను".

'అదేమిటో నాకు ఎవరూ చూడనట్లుండరు. అంతా చూసినట్లే ఉంటారు.'

"నేను మిమ్మల్ని ఎప్పుడూ చూస్తాను. కానీ నేను చూస్తున్నా ననేది మీకు ఎప్పుడు అర్థం అవుతుందంటే - మీరు చూస్తున్నప్పుడు నేను చూసినట్టు కనిపించినప్పుడే."

మనం ఎక్కడున్నా ఏం చేస్తున్నా అమ్మకళ్ళుమనను చూస్తూనే ఉంటాయని అమ్మ అనేక పర్యాయాలు స్పష్టపరిచింది.

అమ్మచూపులు అప్రతిహతాలు, అజేయాలు, అకుంఠితాలు.

అమ్మ గదిలో కూర్చుని "ఎవరో వచ్చినట్లుంది. చూడు -" అన్నది. బయటికి వెళ్ళి చూస్తే ఒక అన్నయ్య వచ్చి ఉన్నాడు.

మరొకసారి "సుబ్రహ్మణ్యం వచ్చాడురా, చూడు -" అన్నది అమ్మ. రాధన్నయ్య వెలుపలికి వెళ్ళి చూసి 'ఎవరూ లేరమ్మా' అన్నాడు. అమ్మ మళ్ళీ అన్నది "కాదురా వచ్చాడురా" అని. కాసేపటికల్లా ఆ అన్నయ్య రానేవచ్చాడు.

అంటే - దారిలో ఉన్న అన్నయ్య అమ్మకళ్ళల్లోకి ముందుగానే వచ్చాడు.

ఒకసారి హైదరాబాదు నుండి ఒక కుర్రవాడు వచ్చాడు. వాడితో అమ్మ మాట్లాడింది.

అమ్మ : నువ్వు మీ పెదనాన్న వాళ్ల జేబుల్లో డబ్బులు తియ్యలేదూ ?

అబ్బాయి : తీశానమ్మా.

అమ్మ : మాంసం తిన్నావా, లేదా ?

అబ్బాయి : తిన్నానమ్మా.

అమ్మ : సారాయి త్రాగావా ?

అబ్బాయి : త్రాగానమ్మా.

అమ్మచూపుకు సరిహద్దు లేమున్నాయీ ?

ఆ చూపులు సర్వలోకావలోకన సమర్థములు !

ఒకసారి ఫోనుకాల్ వచ్చింది. 'భృంగుబండ నారాయణ రావులే, ఇటివ్వు' - అన్నది అమ్మ. నిజమే.

ఒకసారి శేషగిరిరావు అన్నయ్య అమ్మను అడిగాడు 'నీ నామస్మరణ చేస్తూ మద్రాసు మౌంటురోడ్డులో నడిచిపోతున్న నా మీద నీ ప్రభావం ఎలా ఉంటుందీ?' అని.

"ఏముంది నాన్నా - నాముందు రోడ్డు మీద వెళుతున్నట్లు కనుపిస్తూ ఉంటావు" అన్నది అమ్మ.

ఒక సోదరుడు అమ్మను అడిగాడు 'మేము మాట్లాడుతున్నది నీ కెట్లా వినబడిందమ్మా ?' అని.

"మీరు మాట్లాడుకున్నది మీకు వినపడడం లేదూ ? అట్లాగే అంతా వినపడుతుంది. అన్నీ కనపడుతాయి."

ఆ చూపు లెంత విశాలములు ! ఆ చూపులకు అడ్డు ఏమున్నది ?

ఒక సందర్భంలో అమ్మ ఈ భావాన్ని అత్యంత బలంగా ప్రకటించింది.

"నేను ఈ మంచంమీద కూర్చున్నాననీ, నాకేమీ తెలీదనీ అనుకుంటున్నారు. కాని నాకు గోడచాటు లేదు. ఈ ఆవరణంలో ఎవరేం చేస్తున్నారో, ఎక్కడ ఏం జరుగుతున్నదో నాకు తెలుసు. అంత కళ్ళు మూసుకుని కూర్చోనుండలేదు....."

అమ్మకు అయిదవ సంవత్సరంలో అమ్మమ్మ మరణించింది. చిన్నపిల్ల - అని అమ్మను శ్మశానానికి తీసుకుని పోలేదు. అయినా అమ్మ ఇంటివద్దనే వుండి - శ్మశానంలోని దృశ్యమంతా కళ్ళకు కట్టినట్లు వివరంగా, విపులంగా వర్ణించింది.

అమ్మ చిన్నతనంలోనే ఒక దీపావళి పండగనాడు అమ్మ తలంటి పోసుకుంటూ ఉండగా కళ్ళల్లో నురుగుపడింది. ఆ సమయంలో అమ్మ కళ్ళు ఎక్కడెక్కడో జరుగుతున్న అనేక ప్రమాదకరఘట్టాలు చూసి తెలియజేస్తే - చిదంబరరావుతాతగారు ఆశ్చర్యచకితులైనారు.

1967 డిసెంబరు 31వ తేదీన కోనా వెంకాయమ్మగారి అంత్యక్రియలకు అమ్మ ఏర్పాట్లు చెబుతున్నది. ఆమె ఇంకా సజీవంగానే ఉన్నది. నేను విస్మితుడినై అమ్మను అడిగాను 'ఆవిడ బతికే ఉంది కదమ్మా ?' అని. "ఇంకెంతసేపూ ? తేదీ మారడమేగా -" అన్నది అమ్మ. అంతా జరిగింది.

అమ్మ ఒకసారి గోవిందరాజుల దత్తుగారితో అన్నది "నిన్ను నేను లోగడనే చూశాను. మంగళగిరిలో, బాలాంబగారి సత్రంలో నువ్వు అన్నం వడ్డిస్తుండగా -" అని. ఆ సంఘటన నిజమే. తర్వాత దత్తుగారు జ్ఞాపకం చేసుకోగా - అది 1918లో సంఘటన. మరి, అమ్మ జననం 1923లో, ఇదెలా సాధ్యం ?

అమ్మకు కాలభేదం లేదు !

అందుకే అమ్మ అన్నది "నాకు అంతా వర్తమానమే" అని.

ఇదే విషయాన్ని మరో రీతిలో కూడా అమ్మ వివరించింది. "నాకు అవి గుర్తుంటాయంటే - అవి ఎప్పుడో జరిగినట్లు ఉండవు. అన్నీ ఇప్పుడే జరుగుతున్నట్లు కనిపిస్తుంటుంది. నేను చెప్పడంలో విశేషం లేదు".

అమ్మ కన్ను చాలా నిశితమయినది. ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో సూక్ష్మంగానూ పరిశీలనగానూ చూస్తుంది.

ఒకనాడు తన సమీపంలో నేలమీద పారవేయబడిన పురికొసను చేతులు చాచి అందుకొని - సోదరి వసుంధరకు ఇస్తూ "తోరణాలు కట్టటానికి ఉపయోగిస్తుంది. ఏమిటో, నాకన్నీ ఇటువంటివే కనబడుతాయి" అన్నది అమ్మ.

అమ్మను చూడడానికి వచ్చిన ఒక సోదరునితో అమ్మ అన్నది "పందిరికి ఎదురుగా ఉన్న ఇంటిప్రక్క పాక ఉన్నది - అక్కడ ఉన్న అరుగుమీద కూర్చున్నారు. పూరింటికి ఇవతలి ప్రక్కన నువ్వూ ఇంకా ఇద్దరు ముగ్గురూ కలిసి కూర్చున్నారు."

మనకు అన్నీ సమానంగానే కనబడే ఉంగరాల రాళ్ళ ప్రస్తావన వచ్చినపుడు అమ్మ అన్నది "పైకి రాళ్ళన్నీ ఒకటిగానే కనుపిస్తాయి కానీ కట్టుబడిలో, రాయి కోతలో పరీక్షగా చూస్తే మార్పు కనబడుతుంది".

అమ్మను చూసేందుకు ఎంత మంది వచ్చి, ఎదురుగా కూర్చున్నా - అమ్మ ప్రతి ఒక్కరినీ చూస్తుంది. ఆ అవలోకనలో ఎంతో పరిశీలన ఉంటుంది. ఆ చూపులో పలకరింపు ఉంటుంది. ఆ చూపులో పరామర్శ ఉంటుంది. ఆ చూపులో అనురాగ ముంటుంది. ఆ చూపులో అనుగ్రహ ముంటుంది.

దీన జనుల కష్టగాథలు వినేటప్పుడు అమ్మ కళ్లు కలతపడుతాయి. వారి కళ్ళల్లోని ఆవేదనకు అమ్మకళ్లూ ఆర్ద్రమై రెప్పలు రెప రెప లాడుతాయి, వానలో తడిసిన పావురాయి రెక్కలవలె. ఆ సమయంలో అమ్మ విశాల నయనాల్లో తారాడే వినీల మేఘశకలాలు మనకు స్పష్టంగా కనుపిస్తాయి.

అమ్మ 'అనాథజనతా బాష్పఝురాకులవిలోచన'.

అరుదుగానే అయినా, ఒక్కోసారి అమ్మ కళ్ళల్లో రక్తారుణిమదృగ్గోచర మవుతుంది. అమ్మ కళ్ళల్లో సాయం సంధ్యలూ, ప్రభాతారుణ కాంతులూ కనుపించడమూ కద్దు.

1965వ సం॥ దేవీనవరాత్రి ఉత్సవాల్లో అమ్మ ముఖానికి గంధం పూసుకుని కూర్చున్నది. లలితాంబగారు దగ్గర ఉన్నారు.

అమ్మ అడిగింది "భయంగా ఉన్నదా ?" అని.

లలితాంబగారు 'భయంగా లే'దని చెబుతూ 'అసలు రూపం చూపిస్తే భయంకానీ' అన్నది.

"అసలురూపం ఏం చూడగలరు ? దుర్గాష్టమినాడు మామూలుగా వస్తేనే భయపడ్డారు" అన్నది అమ్మ.

అప్పుడు లలితాంబగారు అన్నది 'నవమినాడు కిరీటం పెట్టుకుని నల్లచీరె కట్టుకుని, జుట్టు విరబోసుకుని వస్తుంటే ఒళ్లు ఝల్లుమన్నది'.

"అవన్నీ అక్కరలేదు. గట్టిగా చూస్తే చాలు -" అన్నది అమ్మ.

1968వ సంవత్సరం శరన్నవరాత్రి ఉత్సవాల్లో ఫొటో తీయడానికి కెమేరా సిద్ధంచేసుకన్న డాక్టర్ అడపా రామకృష్ణారావుగారు ఫొటోలు తీయలేదు. కారణం అడిగితే వారన్నారు "ఇంకా నయం. తీయడానికి ప్రయత్నిస్తే - ఆ చూపులకు కెమేరా బద్ధలయి ఉండేది".

అమ్మ అగ్నినేత్ర.

అమ్మచూపు అపూర్వమయినది.

అమ్మచూపు అనన్యమయినది.

అమ్మచూపు అనితర సాధ్యమయినది.

అమ్మచూపు అతి పవిత్రమయినది.

అమ్మచూపు అతిలోకమయినది.

ఆ చూపును గురించి అమ్మ అనేక తీరుల్లో అత్యంత రమణీయంగా ప్రవచించింది.

"నేను మీ అందరినీ కనడానికి వచ్చాను".

"బిడ్డల్ని కనడమే నా సాధన".

"ఎక్కడ ఎవరిని చూసినా నా బిడ్డే అనిపిస్తుంది"

"ఇది మమతల గర్భగుడి. విరాగిని కానుగా నాన్నా. కాబట్టి అందరినీ చూసుకోవాలనే ఉంటుంది".

"నాకు బిడ్డగా కాక మరోరకంగా ఎవరూ కనబడరు".

"మన బిడ్డయందు ఏమి చూస్తున్నామో, అందరియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం".

"నాకు ఎవరిని చూసినా నా బిడ్డే అనిపిస్తుంది".

అమ్మ దృష్టి మనపై ప్రసారితమై ఎంత సుందరంగా, సంపూర్ణంగా ప్రతిఫలిస్తుందో !

"నా దృష్టిలో మీ రందరూ పవిత్రులు".

"నా దృష్టిలో మీరు పరిపూర్ణ జ్ఞానస్వరూపులు".

"నా దృష్టిలో మీరుకూడా భగవంతుడే"

"నా దృష్టిలో అందరూ మంచివాళ్లే"

"అందరిలోని మంచియే నాకు కనబడుతూ ఉంటుంది"

"నా దృష్టిలో అన్నీ మంచిరోజులే"

"నేను మీలో మాధవత్వం చూస్తాను"

ఒకరు అమ్మతో "మీ దృష్టిలో మనుషులూ ఇతర జంతువులూ ఒకటిగానే ఉన్నాయి" అంటే అమ్మ అన్నది "అవి ఇతరంగా కనుపించడంలేదు. అంతా నేనుగానే కనుపిస్తున్నది"

"అంతా ఆత్మగా కనుపించడమే ఆత్మసాక్షాత్కారం" అని కూడా అమ్మ ప్రవచించింది.

ఒకనాడు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అమ్మను అడిగారు "అమ్మా అమ్మకు తానే అయి ఉండడానికంటే లోకంవైపు చూడడానికే ఎక్కువ కాలం ఖర్చు అవుతున్నది".

"ఈ వ్యాపారంలో లాభనష్టాలు లే"వన్నది అమ్మ.

"నష్టమని కాదమ్మా. యోగులు నిర్వికల్ప సమాధిలో ఉంటారంటారు. మేము కొబ్బరికాయలు కొట్టీ, హారతి యిచ్చీ మిమ్మల్ని మా వేపు త్రిప్పుకుని మీకు సమాధిభంగం చేస్తున్నాం కదా -"

"నేను మీలో నన్ను చూసుకోనప్పుడుగదా చిక్కు ?"

అమ్మ దృష్టి అతిలోకమూ, అతిమానుషమూ దివ్యమూ అయినది. ఆ దృష్టిలో అంతా తానే. అంతా ఆత్మే. అంతా దైవమే.

"అంతా దివ్యంగా కనబడడమే దివ్యదృష్టి" అని అపూర్వ నిర్వచనాన్ని లోకానికి ప్రసాదించింది అమ్మ.

అమ్మ పాదాల్లో కళ్ళున్నాయి.
అమ్మ వీపుకు కళ్ళున్నాయి.
అమ్మ తలచుట్టూ కళ్ళున్నాయి.
అమ్మ సహస్రాక్షి.

అమ్మ నిద్రపోతూ ఉంటుంది. ఎవరో ఒకరు వచ్చి అమ్మ పాదాలకు నమస్కారం చేసుకుని వెళతారు. అమ్మ మేలుకున్న తర్వాత ఫలానావారు వచ్చి నమస్కారం చేసుకొని వెళ్ళారుగదా - అంటుంది. అట్లాగే అమ్మ గోడవైపు తిరిగి పడుకుని ఉంటుంది. వచ్చి కూర్చున్న వాళ్ళను పేరుపెట్టి పిలుస్తుంది అమ్మ.

అన్ని చూడగలిగిన అమ్మకళ్ళు చూడలేనిది ఒకటున్నది - 'బిడ్డల దుఃఖం'

అమ్మకు కనుపించనివి - కులభేదం, గుణభేదం, లింగభేదం ? వయోభేదం, జడచైతన్యం భేదం, నీవూ నే - నను భేదం.

శివలింగానికి, గుండ్రాయికీ తేడా కనుపించదు - కుంకుడు కాయలు కొట్టేటప్పుడు.

మంచివాళ్ళనీ చెడ్డవాళ్ళనీ తేడా కనుపించదు - కడుపునిండా పెట్టుకునేటప్పుడు.

రుచుల్లో తేడా కనుపించదు - ఏమయినా తినేటప్పుడు.
సుఖదుఃఖాల్లో తేడా కనుపించదు - అనుభవించేటప్పుడు.
అమ్మకంటికి తగలనివి - మన తప్పులు.
"తల్లికి తప్పే కనుపించదు" అని ఘంటాపథంగా చెప్పింది.
"మీ మచ్చలు చూడడం అంటే అదే నాకు పెద్ద మచ్చ".

'మానవులు దుష్కర్మ చేస్తున్నప్పుడు - సర్వానికీ కర్తలయిన తల్లిని - మీరు ఈ బిడ్డల మనస్సులు మార్చి సన్మార్గంలో పెట్టవచ్చు కదా' అన్న సోదరునితో అమ్మ అన్నది "నాకు దుష్కర్మ కనబడితేగా !'

అమ్మకు కనిపించనివాళ్ళు - శిష్యులు, భక్తులు.

అమ్మది సమదృష్టి. విచక్షణ లేని వీక్షణ. 'విచక్షణలేని వీక్షణే - అనుగ్రహం' అన్నది అమ్మ.

"భోజనం చేశావా ?" అని అమ్మ అడిగింది.

"లేదమ్మా".

"చేసి, రా నాన్నా -" అంటూ అమ్మ అన్నది.

"చెయ్యనివాడే నాకంటబడతాడు".

రోజు అమ్మను చూడడానికి వచ్చిన వాళ్ళందరికీ అమ్మ కడుపు నిండా అన్నం పెడుతున్నా - అక్కడ కూర్చున్న వాళ్ళల్లో ఏ ఇద్దరినో, ముగ్గురినో అమ్మ అడుగుతుంది. వాళ్ళే అన్నం తినకుండా ఉంటారు. ఇక, వాళ్ళను అమ్మ అన్నానికి తరుముతుంది.

ఆ కళ్ళు ఆకళ్ళు పసికట్టడానికి కడు సమర్థములు.

ఆ కళ్ళల్లో మన ఆకలి కార్చిచ్చును చల్లార్చే ఆషాఢ వయోధరాలు ఎన్నో !

అమ్మకళ్ళల్లో హిమాలయాలు.

అమ్మకళ్ళల్లో మహిమాలయాలు.

అమ్మకళ్ళల్లో మంత్రాలయాలు.

అమ్మకళ్ళల్లో మలయాచలాలు.

అమ్మకళ్ళల్లో కావేరులు, గోదావరులు, గంగానిర్ఝరులు.

అమ్మకళ్ళల్లో నందనవనాలు, బృందావనాలు.

అమ్మకళ్ళల్లో కామధేనువులు, కల్పవృక్షములు.

అమ్మకళ్ళల్లో లేనిదేమున్నది ?

అమ్మకళ్ళల్లో సమస్త లోకాలూ ఉన్నాయి.

అమ్మ విశాలాక్షి, కామాక్షి.

ప్రసన్నాక్షి, లోలాక్షి; నిటలాక్షి.

వామనయన,

సూర్య చంద్రాగ్ని నయన.

'కేవలాసాంగ వీక్షశ్రీ జగదేకైక శాసన'

'వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభ లోచన'

'వందారు జనసందోహనేత్ర కౌరవకౌముది'.

పుత్ర పుత్రికా నయన కుముదాహ్లాద కౌముది.

(సెప్టెంబరు, అకోటబరు 1982)



# 173
# వజ్రోత్సవం

మనం జగచ్చరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే - ఒక సత్యం సువ్యక్తమౌతుంది ఆధ్యాత్మిక రంగంలోగానీ, భౌతికరంగంలో కానీ... ఆయా దేశకాల పరిస్థితులను అనుసరించియే మహాత్ములు, మహానుభావులు ఉద్భవిస్తారు. ఆ నాటి సమాజానికి ఏది అవసరమో వారు అది అందిస్తారు. ప్రజలకు ఏది సుఖాన్నీ, శుభాన్నీ, మేలునూ, అభివృద్ధినీ కలిగిస్తుందో దానిని సమకూరుస్తారు.

అందువల్ల వాళ్ళు ప్రజలహృదయాల్లో చిరస్థాయి అయిన ముద్రవేస్తారు. ఆ యా ప్రదేశాల్లో ప్రజల విశ్వాసాలను అనుసరించి కొందరు దైవాంశ సంభూతులనీ, కారణజన్ములు అవతారమూర్తులనీ పిలువబడుతూ ఆరాధ్య మూర్తులవుతారు.

శ్రీ రామచంద్రుడు అట్టి వాడే.

శ్రీ కృష్ణపరమాత్మ అట్టివాడే.

శంకరాచార్యుడు అట్టివాడే.

రామకృష్ణ పరమహంస అట్టివాడే.

రమణ మహర్షి అట్టివాడే.

ఎందరో

అందరూ తమ చుట్టూ పేరుకుపోయిన మురికిని పరిశుభ్రం చేయడానికి, తమ చుట్టూ కరుడుగట్టిన చీకటిని తరిమివేయడానికి ప్రయత్నించిన వారే.

చరిత్రను ఇంకా నిశితంగా అవలోకిస్తే - ఏ అవతారవ్యక్తి మహిమ వల్లగానీ, ఏ సిద్ధపురుషుని ప్రభావం వల్లగానీ లోకం పరిపూర్ణంగా పరివర్తన చెందినట్లు కనుపించదు. ఎప్పటికప్పుడు ఎక్కడి కక్కడ చేయవలసింది ఇంకా ప్రశ్నార్థకంతో సవాలు చేస్తూనే ఉంటుంది.

భౌతికరంగంలోని శాస్త్ర విషయంలోనూ - ఇది తుది సిద్ధాంతం. ఇది పరాకాష్ఠ స్థితి అని ఎట్లా లేదో..... ఆధ్యాత్మికరంగం లోనూ ఇది తుది స్థితీ, ఇది పరిపూర్ణసత్యమూ అని ఉన్నట్లు కనుపించదు.

ఎప్పటికప్పుడు అప్పటి పరిస్థితులకు అనుగుణంగా ఆ స్థితికి పైగా ఎదిగి మహితాత్ములు లోకంలో ఒక సంచలనం కలిగిస్తారు. మళ్ళీ పరిస్థితులను అనుసరించి ఇంకొకరు ఆవిర్భవిస్తారు ---- పంకం నుండి పద్మం ప్రభవించనట్లు.

దీనికి అంతులేదు. ఇది సృష్టి ఉన్నంత వరకు అనంతంగా సాగుతూనే ఉంటుంది.

ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగానే అమ్మ ఆవిర్భావం జరిగింది - అని మనం భావించ వచ్చును.

సమాజంలో శాంతి పరిఢవిల్లడానికి అత్యంత అవసరమయిన పరస్పర సదవగాహన, ప్రేమ, కరుణ, సహనం శాంతి సన్నగిల్లాయి. కొడిగట్టిన ఈ దీపాలను పునఃప్రజ్వలింపజేయడమే అమ్మ కర్తవ్యంగా అమ్మ చరిత్రను చూస్తే - మనకు అవగతమవుతుంది.

ప్రస్తుత లోకంలో మతపరమయిన అనేక మూఢ విశ్వాసాలు వేళ్లూని బలంగా ఉన్నాయి. వాటి నిర్మూలన కూడా అమ్మ కార్యక్రమంలో ఒక భాగంగానే కనుపిస్తుంది.

అయితే, అమ్మ మితవాది. అమ్మ విధానంలో ఎక్కడా అలజడి అశాంతీ కనుపించవు. ఎండవేడిమి ఉండదు. వెన్నెల వెలుగులే ఉంటాయి.

పరుగెత్తేవాడికి ఎదురుపడి అవకూడదు. వాడితోపాటు మనమూ పరుగెత్తి, వాడు ఆగినప్పుడు పట్టుకోవాలి - అన్న అమ్మ వాక్యం అమ్మ విధానాన్ని వివరిస్తుంది.

దుష్టసంహారం అంటే - దుష్టుణ్ని సంహరించడం కాదు; వాడిలోని దుష్టత్వాన్ని తొలగించడమే - అని ఒక పర్యాయం చెబుతూ ..... కూర వండుదామని వంకాయ తరుగుతాం, అందులో కొంతభాగం పుచ్చుకనుపిస్తుంది. మనం మొత్తం కాయను పారేస్తామా ? ఆ పుచ్చు భాగాన్ని తీసివేసి మిగతా ఉపయోగించు కోవడం లేదూ ? -- అని ప్రశ్నించింది.

ఈ వాక్యం కూడా లోకానికి అమ్మ చేసిన ఉపదేశమే.

అమ్మ హృదయానికి దర్పణం పట్టేవాక్యాలు....

తల్లికి తప్పే కనుపించదు.

తప్పొప్పుల పట్టిక నావద్ద లేదు.

మీ గుణదోషాలనే పట్టించుకుంటే - మీలో ఏ ఒక్కరూ ఏడో మైలు దాటి రాలేరు.

నాకు గుణభేదం లేదు.

నాదృష్టిలో అందరూ మంచివాళ్ళే.

నాదృష్టిలో అందరూ పవిత్రులే.

మీ మచ్చలు వెతకడం అంటే, అదే నాకు పెద్దమచ్చ.

అప్పులు చేయడం తప్పులు చేయడం మానవసహజం.

మీ పాప పుణ్యాలకు బాధ్యులు మీరు - అని అనుకోవడం లేదు. అంతా నడిపే శక్తి ఏదో దానిప్రేరణదే.

ఇవన్నీ అప్పుడప్పుడు అమ్మ మనకు అందించిన వివరణలు. అందువల్లనే అమ్మ మనను నిర్నిబంధంగా ప్రేమించగలుగుతున్నది.

ఈ ప్రేమించే విధానంలోనే అమ్మ మనకు అపూర్వమయిన ప్రేమ సందేశాన్ని అందిస్తున్నది.

ప్రస్తుత లోకానికి అంటే ప్రపంచం మొత్తానికే అమ్మ నేర్పుతున్నపాఠం ఇదే నేమో.

అమ్మ మనను అవ్యాజంగా, అనంతంగా ప్రేమిస్తూ, ప్రేమించడం అంటే ఏమిటో, ప్రేమించడం ఎట్లాగో నేర్పుతున్నది.

ఒక పాశ్చాత్య స్త్రీ, పాలో అనే ఒక ఇటలీ దేశస్థునికి ఇచ్చిన సలహా గమనార్హం.

"ప్రపంచంలో ప్రేమ ఎక్కడయినా, కనుపించిందీ అంటే దాని మూలం ఇండియాలో, జిల్లెళ్ళమూడిలో ఉన్నది. ప్రేమ యొక్క విరాట్ స్వరూపం నీవు దర్శించ దలుచుకుంటే జిల్లెళ్ళమూడి వెళ్ళు -"

అమ్మ అనుదినం ఎన్ని సందేశాలు, ఉపదేశాలు ప్రసాదిస్తున్నా ప్రసారిస్తున్నా ఒకరి నొకరు ఎట్లా ప్రేమించుకోవాలో నేర్పడమే అమ్మ జీవిత లక్ష్యంగా కనుపిస్తుంది.

అమ్మ అందిస్తున్న జ్ఞానం ద్వారాగూడా.

లోకానికి అమ్మ 'ప్రేమ'నే నేర్పుతున్నది.

లోకంలో 'అంతా దైవమే' నని చెప్పడం ద్వారా అంతనూ ఆరాధించమనీ, ప్రేమించమనే సందేశమూ, ఆదేశమే ఇమిడి ఉన్నది.

అనంతమయిన, అవ్యాజమయిన, అమలిన మయిన ఈ ప్రేమతత్వం వల్లనే అమ్మ అవతారమూర్తిగా ప్రసిద్ధి చెందింది.

శక్తి లేక తత్వం శరీరధారణచేసి నప్పుడే - అవతారం అంటాము. ఈ శరీరానికి అవధులు, పరిధులు ఉంటాయి.

మూర్తిదాల్చిన అమ్మయే నేడు మన కందరికీ ఆరాధ్యమయింది. ఈ అవనీస్థలిని, పునీతంచేస్తున్న అమ్మ శ్రీ చరణాలకు - అరవై సంవత్సరాలు.

ఈ వాతావరణాన్ని ప్రేమానురాగ పరిమళ పరీవృతం చేస్తున్న అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అరవై సంవత్సరాలు.

లోకాన్ని దివ్యకాంతుల కుంభవృష్టిలో స్నానం చేయించి పునీతం చేస్తున్న అమ్మ నయన ద్వయానికి అరవై సంవత్సరాలు.

అసంఖ్యాకుల నుదుట తిలకం దిద్దీ, నోళ్ళకూ గోరుముద్దలు అందించీ ఆశీర్వచనాన్ని ప్రసారంచేసే అమ్మ కరయుగతికి అరవై సంవత్సరాలు.

ఇది కన్నపొట్టేగాని, తిన్నపొట్ట గాదని అమ్మ ప్రవచించిన అమ్మ, చిరుబొజ్జకు అరవై సంవత్సరాలు.

అపూర్వమయిన నిర్వచనాలతో, ప్రవచనాలతో భాషకే ఒక సౌందర్యాన్నీ పరిపుష్టినీ ప్రసాదించిన అమ్మ వాక్కుకు అరవై సంవత్సరాలు.

ఈ కారుణ్యాన్ని వాత్సల్యాన్ని అమ్మ మనపై, ఈలోకంపై అనంతంగా అవిచ్ఛిన్నంగా ప్రసారం చేయాలని అమ్మను మనం ఈ శుభసమయాన ప్రార్థిద్దాము.

ఈ మన ప్రార్థనలకు నేడు వజ్రోత్సవం !

(ఏప్రిల్ 1983)



# 174
# ప్రభావితులు

మహర్షులు, మహానుభావులు, మహాత్ములు పలికే ప్రత్యక్షరమూ యజ్ఞగుండం నుండి వెలువడే విస్ఫులింగమే. అది ఎంత పవిత్ర మయిందో, అంత భాస్వంతము!

అమ్మ మాట్లాడుతుంటే - వీణలు మీటినట్లే గాదు, అమృతపు వానలు కురిసినట్లూ ఉంటుంది. చెట్టుపై కోయిల కూసినట్లే కాదు, కోవెలలోని దేవుడు మౌనం వదలి మాట్లాడుతున్నట్లూ ఉంటుంది.

అమ్మ మాటల కెంతో పదునూ, బలమూ, బరువూ, కాంతీ, అందమూ ఉన్నాయి. అమ్మ పలికే ప్రతి వాక్యమూ మహావాక్యమే.

కొందరు విమర్శకులు అడుగుతారు. - "అమ్మ మాటలు అమ్మ అనుభవ సారాన్ని తెలియజేస్తాయి, బాగానే ఉన్నది. అమ్మ మాటల ప్రభావం యితరులపై ఎంత ఉన్నది ? అమ్మ సందేశాన్ని పట్టుకుని ఎవరు బాగుపడ్డారు !" అని.

బాగుపడడం అంటే ఏమిటో, చెడిపోవడం అంటే ఏమిటో మనం గీత గీచి విభజన చేయలేము కానీ - అమ్మ మాటల ప్రభావం అనేకులపై అత్యధికంగా ఉందని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చును.

అమ్మ అనుభవప్రసారంతో వెలిగించే అక్షరదీప కాంతులతో తమ బతుకు బాటలను వెలిగించుకొనే వారెందరో ఉన్నారు.

శ్రీ కృష్ణపరమాత్మ కర్తవ్య విమూఢుడయిన అర్జునుడికి ఉపదేశం చేసి కర్తవ్యోన్ముఖుడిని చేసినట్లుగానే అమ్మ చెప్పే సూత్రాలూ, సూక్తులూ ఎందరికో కరదీపిక లవుతున్నాయి.

అమ్మ కొందరికి ప్రత్యక్షంగా చెప్పవచ్చును. కొందరికి పరోక్షంగా చెప్ప వచ్చును. ఎట్లా చెప్పినా - ఆ ప్రభావం మాత్రం ప్రస్ఫుటంగానే ఉంటున్నది.

అమ్మ చెప్పిన ప్రసిద్ధ వాక్యాల్లో - "చేతలు చేతుల్లో లేవు" అనే వాక్యం ఒకటి

"మనిషికి కర్తృత్వం లేదు"

"కాళ్ళు నడుస్తున్నయ్ కనుక మనమే నడుస్తున్నాము -- అనుకుంటున్నాము. నడిపించే శక్తి కనుపించడం లేదు కనుక ఆ శక్తి అర్థంకావడం లేదు".

"ప్రేరణే దైవం".

"ప్రేరణ అర్థంకాదు. ప్రయత్నం కనుపిస్తుంది".

"ఏదయినా ఆచరించడం మన చేతుల్లో ఉన్నదా ? ఎప్పుడు ఏది తోస్తే అది చెయ్యటమే."

"తోచిందేదో చెయ్యి. తోపింపజేసేది వాడేగా".

"చెయ్యకుండా ఉండాలన్నా ఉండగలవా ? అట్లా ఉండ గలిగినా, నీ చేతుల్లో కొంత ఉన్నట్లే".

"కొండకు వెళ్ళడం, నమస్కారం చెయ్యటం - ఆ శాసనంలోవే".

"నువ్వు మొక్కుకోవడంకూడా వాడి ప్రేరణే".

"పూజ చేయటం కాదు, చేయించుకోవడమే".

ఇట్లా అనేక సందర్భాల్లో అనేక రీతుల్లో ఆ పరమ సత్యాన్ని అమ్మ ప్రవచించింది. అమ్మ అనుభవం ప్రకారం మనిషికి స్వాతంత్ర్యం లేదు. మనిషికి వచ్చే ఆలోచనలకు గానీ క్రియలకుగానీ అతడు బాధ్యుడు కాదు. వాటికి మూలం అతనిలో కలిగే ప్రేరణ.

అమ్మ ఆ 'ప్రేరణ'నే దైవం అంటున్నది. అందుకనే అమ్మ దృష్టిలో గొప్పవాళ్ళూ లేరు; తక్కువవాళ్ళూ లేరు. ఒకడు గొప్పపని చేసినా, మరొకడు తక్కువ పని చేసినా, ఆ రెంటికీ ఆ ఇద్దరూ కర్తలు కారనీ, ఆ ఇద్దరికీ ప్రేరణ ఇచ్చేది ఒకే శక్తి - అనీ అమ్మ చెబుతున్నది. అందువల్లనే కొందరిని ఎక్కువగానూ, కొందరిని హీనంగానూ మనం చూడరాదు - అని అమ్మ బోధిస్తున్నది.

సజ్జనులు, దుర్జనుల - విషయంలోనూ అమ్మ ఇదేవిధంగా ప్రబోధిస్తున్నది.

ఈ సమదృష్టి కేవలం ఇతరులను విభజన చేసే విషయంలోనే కాక తన పట్ల హింసాత్మకంగా ప్రవర్తించిన వారియెడల కూడా అమ్మ ఆ సమభావాన్నీ, శాంతాన్నీ, సహనాన్నీ ప్రదర్శించినపుడే అమ్మ వ్యక్తిత్వం కోటిదీపాల వెలుగై మనకు సాక్షాత్కరించి మనను సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తి మనకు అమ్మయెడల అపూర్వమైన అనన్యమయిన భక్తి ప్రపత్తులను కలిగిస్తున్నాయి.

అసామాన్యమూ, అత్యద్భుతమూ అయిన ఈ తత్వం అమ్మకు అతిబాల్యం నుండీ వచ్చింది. ఈ తత్వమే అమ్మ కిరీటంలో కలికితురాయిగా భాసిస్తున్నది.

ఒకసారి శాయమ్మగారి పొరపాటువల్ల అమ్మ క్రిందపడ్డది. అమ్మ ఎంతగా కోప్పడుతుందో - అని శాయమ్మగారూ, మేమూ భయవిచలితుల మయినాము.

కానీ అమ్మ అన్నది "ఆమె ఏం చేస్తుంది ? నాకు పడవలసిన యోగం ఉన్నదీ, అట్లా జరిగిందీ. ఆమెవల్ల కాకపోయినా ఇంకొకరి వల్ల నయినా, ఇంకొక రకంగా నయినా నాకు ఆ అనుభవం తప్పదు."

శాయమ్మగారు 'బతుకు జీవుడా' - అనుకున్నది.

మేము నివ్వెరపోయాము.

ఎవరు ఎంతగా అమ్మను బాధించినప్పటికీ - "నాకు ఆ అనుభవం ఉన్నది. అందువల్లనే అట్లా జరిగింది". - అని అమ్మ అనడమే మనకు తెలుసును. కానీ అందుకు కారణమయిన వ్యక్తుల్ని అమ్మ నిందించడం మనం ఎన్నడూ చూడలేదు.

అమ్మ మనకు నిత్యమూ బోధించే పాఠాల్లో ఇదే ప్రధాన మయిందిగా కనుపిస్తున్నది. అందువల్లనే అమ్మ ప్రేమస్వరూపిణి అయింది. అమ్మకు ఎవరినీ నిరసించవలసిన అవసరమూ, నిందించవలసిన అగత్యమూ కనుపించడం లేదు.

కనుకనే - అమ్మదృష్టిలో అందరూ పవిత్రులే. అందరూ మంచివాళ్ళే. అందరూ మహానుభావులే. అందరూ ప్రేమాస్పదులే !

అమ్మవద్దకు వచ్చే అనేకులపై, అమ్మ అనుగ్రహం పొందిన అనేకులపై ఈ ప్రవచన ప్రభావం ప్రబలంగానే ఉన్నట్లు కనుపిస్తున్నది.

అటువంటి వ్యక్తుల్లో ఒకరు ఈనెల 10వ తేదీన అమ్మవద్దకు వచ్చి అతని విచిత్ర విషాదమయ చరిత్రను అమ్మకు విన్నవించు కుంటుంటే ---

అమ్మా, అతడూ సూర్యచంద్రులవలే భాసించారు. అమ్మ ప్రభావం అతనిపై ఎంత బలంగా ప్రసారమయిందో అర్థమయినకొద్దీ ఆశ్చర్యమూ కలిగిందీ, ఆనందమూ కలిగిందీ, దుఃఖమూ కలిగిందీ.

అతడు 40 సం॥ వయస్కుడు. అతని భార్య 30 సం॥ యువతి. ఇద్దరు పిల్లలు. అతడు చాలా సహృదయుడు. సంపన్న కుటుంబీకుడు. మంచి ఉద్యోగంలో ఉన్నాడు. అతని భార్యకూడా లావణ్యవతి. విద్యాధికురాలు.

కాని, విచిత్రం ! కాలదోషం అనే మనం భావించాలి - ఆమె అవివాహితు డయిన మరో యువకుడ్ని ప్రేమించింది.

రహస్యంగా అతనితో సంసారం చేస్తున్నది. అతణ్ణి వివాహం చేసుకొనడానికి కూడా నిర్ణయించుకున్నది. అతడూ అంగీకరించాడు.

ఇటువంటి విషయం ఎంతకాలం దాగుతుందీ ?

ఎంతో కాలం గడపకుండానే భర్తకు తెలిసింది. ఏ భర్త దీనిని సహించగలడు? మగవానికి ఇంతకంటే పరాభవం ఏముందీ ?

కానీ అతడు అమ్మ ప్రేమ సుధల్లో తడిసిపోయినాడు. ఆ పవిత్ర తత్వాన్ని జీర్ణంచేసుకున్న మహానుభావుడు. అందుకు ఆమె ఏమాత్రమూ బాధ్యురాలు కాదన్న పరమ సత్యాన్ని అవగతం చేసుకున్న సాధుపురుషుడు. అందువల్లనే పరశువులాంటి ఆ నిజం అతని మనస్సును స్పృశించలేక పోయింది.

నిర్మలమయిన అతని మనస్సు నిర్లిప్తంగానే ఉండి పోలేదు; అతను ప్రాణం కన్నా అధికంగా ప్రేమించిన ఆ యువతి సౌఖ్యాన్నే మరింతగా కాంక్షించింది. ఆమె యింకొకరిని వివాహ మాడడానికి మనః పూర్తిగా అతడు అంగీకరించాడు. అందుకు అనుగుణంగా కోర్టుద్వారా ఆమెకు విడాకులు ఇచ్చాడు.

తీరా ఇంతా అయిన తర్వాత ఆ అవివాహితుని తల్లిదండ్రులు ఈ వివాహానికి సుతరామూ ఒప్పుకోలేదు. ఏ హిందూ తల్లిదండ్రులు తమ కుమారుడు ఒక వివాహిత స్త్రీని పెండ్లి చేసుకోవడానికి ఒప్పుకుంటారు ? ఇద్దరు పిల్లలతో ఒక స్త్రీ తమ ఇంటికి కోడలుగా రావడానికి ఎవరు ముచ్చట పడగలరు ?

ఇప్పుడు ఆ స్త్రీ ఉభయ భ్రష్టత్వం పొందింది.

దుర్భరమూ, దుస్సహమూ అయిన ఆ సంకట పరిస్థితిని ఎదుర్కొనే మనోధైర్యం లేక ఆత్మహత్యా ప్రయత్నంలో మొదటి భర్త చేతనే రక్షింప బడ్డది.

పెండ్లి కాకుండానే ప్రేమికునివల్ల ధరించిన గర్భ విచ్ఛిత్తి కొరకు ఆసుపత్రి పాలైతే - విడాకులు ఇచ్చిన భర్తే సకలోపచారాలు చేశాడట !

ఆ విషయం వివరిస్తుంటే ఆశ్చర్యంగా తన వంక చూస్తున్న అమ్మతో అతడు అన్నాడు, "ఔనమ్మా. ఆమె నా భార్య మాత్రమే కాదు. నా బిడ్డకూడా నమ్మా. చిన్నతనంలోనే నేను పెండ్లి చేసుకున్నాను. ఎంతో గారాబంగా పెంచాను. ఎంతో శ్రద్ధతో చదివించాను. పోస్టుగ్రాడ్యుయేట్‌ను చేశాను. నన్ను కాదన్నదని - ఆమె జీవన్మరణ సమస్యలో ఉంటే ఉపేక్షించగలనా ? నా చేతనయిన సహాయం చేశాను' ' అని.

అతని దుఃఖమయ చరిత్రనంతా ఒక కథగా, తనకేమీ సంబంధం లేనట్లు నిర్లిప్తంగా చెబుతున్న అతణ్ణి క్రీగంట చూస్తూ ఆమె అమ్మతో అన్నది "ఆయన దేవుడమ్మా" - అని. అట్లా అంటుంటే కన్నీటితో ఆమె కంటి రెప్పలే కాదు, ఆమె చెంపలూ తడిసాయి.

"అమ్మా - నాకు భార్యగా ఉండలేకపోయినా, ఆ బిడ్డలకు తల్లిగా నా ఇంట్లోనే ఉండమని చెప్పమ్మా - ఏ ఆధారం లేకుండా మన సమాజంలో స్త్రీ బ్రతకలేదు గదమ్మా !" అని అతడు ప్రార్థిస్తూ ఉంటే -

"బాగా ఆలోచించుకో" మన్నట్లు అమ్మ ఆమె వంక దృష్టిని సారించింది.

"ఇంత మంచివాణ్ణి నేను మోసం చేయలేను. అతనే పెండ్లి చేసుకోకపోతే, మరణమే నాకు శరణ్యమమ్మా -" అన్నది ఆమె. ఆమె గొంతులో స్థిరత్వం తొణికిసలాడింది.

"ఈమెను నువ్వే కాపాడాలి అమ్మా. ఈమె మరణిస్తే నేను భరించలేను. ఇంతకాలం కలిసి జీవించాము. ఏదో శక్తి మమ్మల్ని విడదీసింది. ఇందులో ఆమె తప్పేమీ లేదు. ఈమెకు ప్రాణభిక్ష పెట్టమ్మా - నేను అతణ్ణి బతిమిలాడీ పెండ్లికి వప్పిస్తాను. ఎక్కడో ఒకచోట ఈమెను సుఖంగా ఉండనీయమ్మా."

అతను అమ్మ పాదాలు పట్టి ప్రార్థించాడు.

ఇద్దరూ కలిసి అమ్మకు పూజచేసుకున్నారు.

అమ్మ ఇద్దరికీ కొత్త గుడ్డలు పెట్టింది. వారిద్దరి గళసీమల్లో మల్లెపూల దండలు వేసింది. వారిద్దరి శిరస్సులపై ఆశీఃపూర్వకంగా మల్లెపూలు చల్లింది.

అమ్మ దివ్యకరకమల మధుర సంస్పర్శనంలో పులకించిన ఆ మల్లెపూలు వారిని ఏమని ఆశీర్వదించాయో !

వారిద్దరూ నూతన వధూవరుల్లా వెలిగిపోయారు.

వారిరువురికీ అమ్మ ఇచ్చిన ప్రసాదాలు ఒకే సంచీలో దాచుకుని అమ్మవద్ద సెలవు తీసుకున్నారు.

ఆమె నిర్ణయం మార్చుకుంటుందా ? -- ఏమో చెప్పలేము.

అమ్మ అనుగ్రహవర్షంలో తడిసిన అతను జ్ఞాని; సహన సముద్రం; శాంతి సాగరం; ప్రేమజలధి.

(మే 1983)



# 175
# భయాపహా

జులై 19వ తేదీ సాయంకాలం... అమ్మ తన గదిలో మంచంపై కూర్చుని ఉన్నది.

ఎదురుగా మామిళ్ళపల్లి రాజారావుగారి కుటుంబ ఉంది. వారి కొడుకులు ముగ్గురూ, కూతుళ్ళు ఇద్దరూ ఉన్నారు. వారి ముఖాల్లో ఎంతో విషాదం గూడుకట్టుకొని ఉంది. అమ్మకూడా చాలా గంభీరంగా ఉంది.

ఆ కుటుంబమంతా కలిసి అమ్మకు పూజ చేసుకున్నారు. వారందరికీ అమ్మ నూతన వస్త్రాలను ఇచ్చి ఆశీర్వదించింది. అవికట్టుకు వచ్చి అందరూ అమ్మకు నమస్కరించుకున్నారు.

అందరి కళ్ళల్లోనూ కృతజ్ఞతా, భక్తీ అశ్రురూపంలో పొంగి ప్రవహిస్తే - అమ్మ నయనయుగళిలో వాత్సల్యమూ, కారుణ్యమూ కాంతిలహరులై ఆ గది నంతనూ ముంచెత్తాయి.

బాపట్లలో మాతృశ్రీ ప్రింటర్సులో శ్రీ మామిళ్ళపల్లి రాజారావుగారు పనిచేస్తున్నారు. వారు 80 సం॥లు పైబడిన వృద్ధులు. కొద్ది కాలంగా అస్వస్థులుగా ఉన్నారు. వారు జులై 7వ తేదీన ప్రాణం వదిలారు.

మన సమాజ పరిస్థితిలోని వింతైన విషయం ఏమిటీ అంటే - జీవనం ఎంత వ్యయ ప్రయాసలతో కూడుకుని ఉన్నదో, మరణమూ అంతే. కుటుంబంలో ఒకరు మరణించారూ అంటే - అతని స్థితీ, గతీ ఏమో ? కానీ, ఒక్కొక్క కుటుంబంలో బ్రతికిన వారికి కూడా అది ప్రాణాంతకంగానే ఉంటుంది. అందని లోతు నీళ్ళల్లో మునిగినట్లుగా దిక్కుతోచక ఊపిరాడక ఉక్కిరి బిక్కిరిగా ఉంటుంది.

రాజారావుగారి కుటుంబంకూడా అదే విధంగా ఉంది.

మృతజీవికి దహన సంస్కారాలు జరపాలి. అందుకు అంగబలం. అర్థబలం కావాలి. తర్వాత ఎంతో క్రతువు. అందుకు ఎంతో తతంగం. ఈ మధ్యలో

నిరాధారమయిన ఈ కుటుంబాన్ని ఆదరించే వాళ్ళూ, ఆదుకునే వాళ్ళూ కావాలి. పోయినవాళ్ళో, ఉన్న వాళ్ళో సంపన్నులు అయితే అందరూ బంధువులే ! అదే లేమిలో ఉన్న కుటుంబమయితే ఆ ఛాయలకే ఎవ్వరూ వెళ్ళరు. ఎవరిమీద ఏం భారం పడుతుందో నని అందరికీ భయమే !

ఇది ఒక రకమయిన భయం, ఆర్థిక పరమయినది. మరొక భయం మానసికమయినది. ప్రకృతి సహజమైన అత్యంత సాధారణమయిన మృత్యువు వారి దృష్టిలో ఎంతో అమంగళ మయినది. మృతజీవిని చూసినా, తాకినా, ఆ అంత్యక్రియలతో తమకు ఎటువంటి సంబంధం ఉన్నా - అది తమకూ అశుభకరమేనని వారి విశ్వాసం. అందువల్లనే అంత్యక్రియలకు ఎవరూ తమ ఇంటి నుంచి అగ్గిపెట్టికూడా ఇవ్వరు.

వేదనా భరితమయిన అటువంటి క్లిష్టపరిస్థితిలో అమ్మ నుంచి కబురు వచ్చింది. రాజారావుగారి దహనక్రియలు జిల్లెళ్ళమూడిలో జరిపించమనీ, వారి మృతకాయన్నీ, కుటుంబాన్నీ వెంటనే జిల్లెళ్ళమూడి తీసుకుని రమ్మనీ.

ఏర్పాట్లన్నీ చకచకా సాగాయి. అందరూ జిల్లెళ్ళమూడి చేరారు. అమ్మ ఆజ్ఞతో అన్ని క్రియలూ యధావిధిగా జరిగాయి.

విచిత్రమేమిటీ అంటే - జిల్లెళ్ళమూడి గ్రామం పొలిమేరలకు అవతల శుభాశుభాలకు మధ్యన ఇనుపగోడ కానీ అమ్మ సాన్నిధ్యంలో కల్యాణానికీ మరణానికీ అంతగా అగాధమూ కనిపించదు, విభేదమూ కనిపించదు. రెండూ వైభవోపేతంగానే జరిగిపోతాయి. ఆ సాన్నిధ్యంలో మృతుని కుటుంబంలోని వాళ్ళు కూడా ఆ మరణానికీ తమకూ ఎటువంటి సంబంధం లేనట్లూ, ఆ మరణంవల్ల తమకెట్టి నష్టం జరగనట్లూ, నిర్లిప్తంగానే ఉండడం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

ఆ సాన్నిధ్యంలో ఒక వివాహం జరుగుతుంటే ఆ ఆవరణలోని అందరూ అది తమ ఇంట్లో జరిగే శుభకార్యంగానే భావిస్తారు. ఆవరణమంతా ఎంతో సందడిగా ఆనందంగా హడావుడిగా కనుపిస్తుంది.

ఒకరి ఆనందాన్ని అందరితో కలిసి పంచుకున్నందువల్ల అది వెయ్యింత లవుతుంది ! దుఃఖాన్ని పదిమందితో కలిసి అనుభవిస్తే - అది పలుచబడిపోయి నిర్వీర్య మవుతుంది !

మనిషికీ మనిషికీ మధ్యన ఉండే ఈ అంతస్సూత్రమూ, అనుబంధమూ లోకంలో మామూలుగా నిస్తేజమై నిద్రాణమై ఉంటుంటే - అమ్మ సాన్నిధ్యంలో అవి నిత్య జాగరితమై, చైతన్యవంతమై - ఉత్తేజితమై కనుపిస్తాయి.

ఆదర్శమయిన సమాజానికి ఆరోగ్యకరమైన లక్షణం అది ! నిశ్శబ్దంగా నిరాడంబరంగా అంతర్గతంగా అమ్మ జరిపే కార్యక్రమంలో అదొక ముఖ్యాంశం.

మామూలుగా మనిషి భయగ్రస్తుడు. ఈ భయానికి కారణాలు అనేకం.

అందులో ముఖ్యమయినది రేపటిని గురించిన భయం.

ఈనాడు లోకంలో 'రేపటిని గురించిన భయం లేనివాడు లేడు' అంటే అతిశయోక్తి కాదు. ఎంత చెట్టుకి అంత గాలి - అని ఎంత వాడికి 'అంత' భయం. గొప్పవాడికి గొప్ప భయం. కొద్ది వాడికి కొద్ది భయం.రేపటికి కూర దొరు కుతుందా, కూలి దొరుకుతుందా - అని ఒకడు భయపడ వచ్చునూ, రేపటికి బ్యాంకులో కట్టవలసిన లక్షరూపాయలు దొరక్కపోతే ఎట్లా - అని ఇంకొకడు భయపడవచ్చునూ. భయానికి గల మూలంలో భేదాలే గానీ భయం మాత్రం సామాన్యమే.

ఈ రేపటిని గురించిన భయంతోనే చాలామంది 'ఇవ్వాళ'ను సద్వినియోగం చేసుకోలేక వృధా చేసుకుంటారు.

అమ్మసాన్నిధ్యంలో మనకు 'రేపటిని గురించిన ఈ భయం' తాలూకు నీడకూడా కనుపించదు.

ఆశ్రమంలో అందరి జీవన బాధ్యత ఆశ్రమందే కనుక అందరూ నిర్విచారంగా, నిర్భయంగా హాయిగా ఉంటారు. ఎవరి ముఖంలోనూ మనకు రేపటిని గురించిన కించిత్ ఆందోళనగానీ భయంగానీ కనుపించవు. 'అన్నీ అమ్మే చూసుకుంటుంది' 'అన్నిటికీ అమ్మే ఉన్నది' అన్న అభయమే అందరిలోనూ కనుపిస్తుంది.

ఒక రోజున నంబులు అనే సోదరుని శ్రీ భద్రాద్రిరామశాస్త్రి గారు "ఒరే - మన బాధ్యతలన్నీ అమ్మ మీద వదిలి వేయకూడదు. మన తిండీ తిప్పల విషయం మనమే ఆలోచించుకోవాలి. నీవిట్లా నీ బరువూ బాధ్యతలను అమ్మపై వదిలి వేయడం నా కేమీ బాగాలేదు. నీ పద్ధతి మంచిది కాదు" అని మందలిస్తుంటే - అమ్మ ఆ సంభాషణలో కల్పించుకొని "అతని పద్ధతే మంచిది నాన్నా" అని తీర్పు చెప్పింది.

అమ్మ ఆశ్రమవాసులకు "ఎక్కడ నుండి డబ్బు వస్తుంది? ఆశ్రమం ఎట్లా నిర్వహింపబడుతుంది ? - అన్నది మీ కనవసరం. దేనివాడు దాని కున్నాడు" - అని హామీ నిచ్చింది.

"నాకు మీరేమీ బరువు కాదు. మీరు ఉండడం నాకు బరువు అనిపించి నపుడు ఈ ఆవరణే ఉండదు" అన్న అమ్మ ప్రకటనతో ఆశ్రమ వాసులందరికీ కొండంత ధైర్యం.

రేపటి గురించి తర్వాత మనిషికి - మరణభయమూ, మరణానంతరం పొందే గతిని గురించిన భయమూ.

మరణానంతరం ఏమవుతుందీ - అని ఎవరికీ భయం లేకుండా "అందరికీ సుగతే" నని అపూర్వమయిన ఒక హామీని యిచ్చి "మరణానంతరం మిగిలే దంటూ ఏమీ లే"దని అమ్మ నిర్ద్వంద్వంగా ప్రకటించి అందరికీ అభయ ప్రదానం చేసింది.

అమ్మ సాన్నిధ్యంలో జీవన సంభరణానికి 'వీడు సంపాదించే వాడు', 'వీడు సంపాదించని వాడు' - అని ఎట్లా భేదం లేదో - మరణాల సందర్భంలో కూడా 'వీడు ఉన్నవాడు' 'వీడు లేనివాడు' అని భేదం లేదు.

ఆ ఆవరణలో ప్రాణం వదిలిన ప్రతివాడికీ 'జరగవలసినవి' అన్నీ యథావిధిగా జరిగిపోతాయి.

గత సంవత్సరం జూన్ నెలలో కళాశాల అధ్యాపకులు శ్రీ ఈమని సత్యనారాయణమూర్తిగారు ఢిల్లీలో ఉన్నారు. జిల్లెళ్ళమూడిలో వారి తండ్రి మరణించారు. దగ్గరలో ఉన్న చిన్నకొడుకు పిలిపించ బడ్డాడు. అతనికి అప్పటి దాకా ఉపనయనం లేనందున తండ్రికి దహన సంస్కారం చేసే అర్హత లేదు. అమ్మ అతడికి ఆ సమయంలో ఉపనయనంచేసే ఆ అర్హతను ప్రసాదించి ఆ కార్యక్రమం నిర్విఘ్నంగా జరిపించింది. తర్వాత వారం రోజులకు జ్యేష్ఠకుమారుడు అయిన సత్యనారాయణమూర్తిగారు వచ్చి తండ్రి మరణానికి దుఃఖం కంటే కార్యక్రమం అంతా నిర్విఘ్నంగా జరిగి పోయినందుకు ఆనంద పడ్డాడు.

పోతుకూచి సాగర్‌గారి కుమారుడు రవి చనిపోతే - వారికి ఏమీ కాని రావూరి నరసింహమూర్తిగారిచేత అమ్మ దహనం చేయించింది.

సంతానంలేని భృగుబండ నారాయణరావుగారికీ, పుత్రసంతానం లేని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారికీ నాచేత అంత్యక్రియలు జరిపించింది అమ్మ.

అందువల్లనే ఆ ఆవరణంలో ఎవరికీ చావును గురించిన భయమే ఉండదు.

సామాన్య మానవుణ్ణి పట్టి పీడించే భయం నుంచి విముక్తుణ్ణి చేస్తున్నది అమ్మ జిల్లెళ్ళమూడి నివాసిని.

భయవిముక్తు డయిన మనిషి మనస్సు శరత్పూర్ణిమనాటి ఆకాశమే గదా!

(జూన్ 1983)



# 176
# అడక్కుండా పెట్టేదే - అమ్మ

ఆగష్టు 30వ తేదీ ఉదయం గం. 7.15 సమయం. అమ్మ గదిలో అమ్మ, నేను ఉన్నాము.

అమ్మ చాలా అనారోగ్యంగానూ బలహీనంగానూ ఉంది.

డాక్టర్ ఇనజకుమారి వచ్చింది.

వజ్రోత్సవం అయిన దగ్గర నుండీ అమ్మకు విరోచనాలు, వళ్ళంతా కురుపులు.... హైబ్లడ్ ప్రెజర్, ఉధృతంగా ఉన్న బ్లడ్ షుగర్.

కొత్తగా చెవిలో కురుపు అది విపరీతమయిన బాధ పెడుతున్నది - అని అమ్మే చెబుతున్నది.

ఎన్ని మందు లిచ్చినా, ఎందరు మందు లిచ్చినా ప్రయోజనం ఏమీ కనుపించడం లేదు. డాక్టర్ సత్యనారాయణమూర్తి కూడా హోమియో చికిత్స చేస్తున్నారు. ఏం ఉపయోగం ? బ్లడ్‌షుగర్ కంట్రోలు కాలేదు. అది కారణంగా అనేకమయిన ఇతర బాధలు. ఒకటి విడిస్తే మరొకటి !

అన్నీ అమ్మ సహనానికి పరీక్షలే. ఏ క్షణానా అమ్మలో విసుగ్గానీ విరక్తికానీ కనుపించదు. ఎంత బాధనయినా నవ్వుతూ అనుభవించడమే అమ్మకు తెలుసును. అదే మనకు మరింత బాధను కలిగిస్తుంది. పైగా - అమ్మకు ఆ బాధలతో సరదా కాలక్షేపం.

అసలు, ఏ బాధాలేని రోజు - నేను అమ్మ దగ్గరకు జేరి 21 సంవత్సరాలయింది ఈ దీర్ఘకాలంలో నాకు కనుపించలేదు. ఉంటే, ఆనాడు అమ్మ ఎట్లా ఉంటుందో ! ఏమీ తోచక బాధపడుతుందేమో !

అమ్మకు నయం చేయడం చేతకాని డాక్టరు ఇనజకుమారి అన్నది, "అమ్మా - యీ నీ వ్యాధులు మాకు అర్థం కావడంలేదు. నీ విట్లా ఎన్నాళ్ళు బాధపడతావు? ఎక్కడకయినా పెద్ద డాక్టర్ల వద్దకు బొంబాయి గానీ, ఢిల్లీగానీ వెడదాం...." అని.

ఆ సలహాను అమ్మ చెవినిబెట్టలేదు. నేను కూడా కల్పించుకుని "అమ్మా - డాక్టరుగారు చెప్పిన మాట బాగున్నది" అన్నాను. "ఎవరి నయినా పెద్దడాక్టర్లను చూస్తే - త్వరగా నయమవుతుందేమో" నన్నాను.

"అసలే డబ్బు లేక సంస్థ బాధపడుతున్నది. ఈ పరిస్థితిలో నా కోసం వేలు ఖర్చు పెట్టడం ఎందుకూ ? ప్రస్తుతం అన్నపూర్ణాలయంలో కూరకూడ చేయడం లేదు. ఈ పైకం పెట్టి కూరలు కొని చేయించండీ. పిల్లలందరూ హాయిగా భోజనం చేస్తారు. నాకు ఈ బాధలు ఎట్లాగూ అలవాటు అయినవే కదా. వీటికోసం మీకెందుకూ బాధ?" అని అమ్మ మా ఆలోచనను ఖండించింది.

అమ్మకు తనకోసంగా, తన ఆరోగ్యంకోసంగా తన సుఖం కోసంగా ఒక్క రూపాయి కూడా వ్యయం కావడం ఇష్టం లేదు. ప్రతి పైసాకూడా పిల్లలకోసమే ఖర్చుకావాలని అమ్మ అభిలాష. తన తపన అంతా పిల్లల తృప్తికోసమే.

పైగా "మీరు తింటే నేను తిన్నట్లే" నంటుంది. "మీకు పెట్టుకోక పోతే నేను చిక్కిపోతాను" అంటుంది. మనం ఎంతగా తలలు బ్రద్దలు కొట్టుకొన్నా - ఆ వాక్యాల్లోని అంతరార్థం మనకు అవగతం కాదు.

ఒకనాడు అమ్మకు కడుపులో మంట వచ్చింది. వసుంధరక్కయ్య మజ్జిగ ఇచ్చింది. మంట తగ్గింది. మళ్ళీ ఒకనాడు అమ్మకు మంట వచ్చింది. ఆనాడు వసుంధరక్కయ్య మజ్జిగ ఇవ్వబోయింది. కానీ అమ్మ మజ్జిగ తాగలేదు. "కాసేపు ఓర్చుకుంటే ఈ మంట తానంతట అదే తగ్గుతుంది. ఆ మజ్జిగ దాచండి. ఏ రాత్రివేళ ఎవరు వస్తారో. ఈ మజ్జిగ వాళ్ళకు ఉపయోగపడుతుంది" అని సలహా చెప్పింది.

ఆ రాత్రి నిజంగానే, ఎవరో యాత్రికులు రావడమూ, ఆ దాచిన మజ్జిగ వారికి ఉపయోగపడడమూ - జరగడం అమ్మ దూరదృష్టికో, దివ్యదృష్టికో నిదర్శనం కావచ్చును. కానీ మనం ఇప్పుడు ఆ మాహాత్మ్యాల్ని గురించి ప్రస్తావించుకొనడం లేదు. ఉన్న పిల్లల కోసం కాదు. రాబోయే పిల్లల కోసం, వారి ఆకలినీ, అవసరాన్నీ, ముందుగానే ఊహించి - తన మంటనూ, ఆకలినీ పక్కకు నెట్టివేస్తుంది. అమ్మ. ఇది ఏ తల్లి అయినా తన రక్త మాంసాలు పంచుకుని పుట్టిన బిడ్డకోసమే

చేయగలుగుతుంది. మరి, అమ్మ ఎవరికోసం అయినా చాలా సహజంగా చేస్తుంది. అందువల్లనే అమ్మ విశ్వజనని, విశ్వవందిత అయింది !!

మనం ఎన్ని రకాలుగా ఆలోచించినా, అమ్మకు మాత్రం ఒకే ఆలోచన. అది మన ఆకలిగురించీ, ఆహారం గురించీ, మనం ముక్తీ, మోక్షం..... అని ఎన్ని మాటలు అంటున్నా - అమ్మ "మీ భోజనమే నాకు ముఖ్యం" అంటుంది.

మనకు పెట్టుకోవడంలో అమ్మకు ఎంతో సంతృప్తీ, సంతోషమూ.

"నిర్మొహమాటంగా, నిస్సంకోచంగా కడుపునిండా తినగలవాడు దొరకడం ఎంత అదృష్టం!" అంటుంది అమ్మ.

"మనం పెట్టినా తినేవాడు దొరకాలిగదా" అని కూడా అంటుంది.

ఆగష్టు 27వ తేదీన అలహాబాదు నుండి శ్రీ వల్లూరి పార్థసారధిగారూ, గుంటూరు నుండి వల్లూరి రామమూర్తిగారూ వచ్చారు. అమ్మ సన్నిధిలో కూర్చుని ఆ సాన్నిధ్య ప్రభావాన్ని అనుభవిస్తున్నారు. అమ్మ కాఫీ తెప్పించి ఇచ్చింది.

వారు ఆ కాఫీ త్రాగుతూ "మా అదృష్టం" అని ఒకరూ, "మా భాగ్యం" అని మరొకరూ ఆనందపడుతూంటే - అమ్మ అన్నది "ఆ అదృష్టం, భాగ్యం మీవి కావు నాన్నా - నావి" అని.

అమ్మ పసిడినోట వెలువడిన ఆ మాటకు వాళ్ళు అబ్బురపడి పోయారు. అర్థంకాకపోయినా ఆనందపడిపోయారు. మనం అన్నం తినడమూ, మనం కాఫీ త్రాగడమూ మన అదృష్టమూ, అమ్మ అమృత హస్తం మీదుగా అందుకొనగలగడం మన భాగ్యం అవుతాయి కానీ ఇందులో అమ్మకు అదృష్టంగానీ - భాగ్యంగానీ ఏముందీ ?

1977 నవంబరు 5వ తేదీన విశాఖపట్నం నుంచి శ్రీరామకృష్ణ సెట్టిగారు వచ్చారు. వారికి అమ్మ ఎంతో ఆప్యాయంగా అన్నం పెట్టిందీ, కొత్త గుడ్డలు పెట్టిందీ.

ఆయన "అమ్మా - చిన్న తనం నుంచీ నాకు అన్నీ ప్రసాదించావు. నాకు ఏ వెలితీ లేదు. నాకీ కొత్త గుడ్డలు ఎందుకమ్మా" అని అడిగారు.

వెంటనే అమ్మ అన్నది "నీకు వెలితి ఉందని కాదు నాన్నా. నాకే వెలితి ఉంది. దాన్ని పూడ్చుకోడానికే ఇవన్నీ....."

ఆ సమాధానానికి ఆయన అప్రతిభుడై పోయారు.

మనం అమ్మను ఏదైవం పేరుతో పిలుస్తున్నా, కొలుస్తున్నా - అమ్మ మాత్రం "నేను అమ్మను, మీరు బిడ్డలు" అంటుంది.

"నేను ఏ అవతారాన్ని కాదు; అమ్మను మాత్రమే. అందువల్లనే ఈ దుష్టశిక్షణ, శిష్టరక్షణ..... నాకు తెలియవు. తల్లిధర్మం మాత్రమే తెలునును," అని నిర్మొహమాటంగా స్పష్టపరుస్తుంది.

ఇదీ అమ్మ తత్వం. ఎంతసేపూ మన ఆకలిని తీరుస్తూ, మన బాధలను తొలిగిస్తూ, మనకోసం నిరంతరం ఆలోచిస్తూ, ఆవేదన చెందుతూ "నేనేం చేసినా నాకోసమే, నా తృప్తికోసమే" నంటుంది. అందువల్లనే మనం చెప్పకుండానే మన ఆకలిని కనుగొంటుందీ - మనం అడక్కుండానే మనకు అన్నం పెడుతుందీ. మన అవసరం, మన మేలూ మనకంటే అమ్మకే బాగా తెలుసును.

కనుకనే "అడగందే అమ్మయినా పెట్టదు" అన్న సామెతను మార్చివేసి "అడక్కుండా పెట్టేదే అమ్మ" అని కొత్త నిర్వచనాన్ని లోకానికి అనుగ్రహించింది.

అడక్కుండా పెట్టే అమ్మకు ఉపకరణమే అన్నపూర్ణాలయం.

ఇంతవరకు షుమారు ఒక కోటి మందికి పైగా అన్నం పెట్టిన అన్నపూర్ణ ఆలయం ఈ సంవత్సరం ఆగష్టు 15వ తేదీన అత్యంత వైభవోపేతంగా రజతోత్సవం జరుపుకొని అమ్మ దివ్యత్వమూ, మానవతా సమ్మిళితమైన ద్వివర్ణ పతాకాన్ని విహాయసవీధుల్లో ఎగురవేసింది.

(జులై, ఆగష్టు 1983)



## తాదాత్మ్యం

తినకపోతే మీరు చిక్కి పోతారు. మీకు పెట్టుకొనక పోతే నేను చిక్కి పోతాను. మీరు తింటే నేను తిన్నట్లే.

- అమ్మ

# 177
# మదర్ ఆఫ్ ఆల్

అక్టోబరు 9వ తేదీ జిల్లెళ్లమూడి చరిత్రలో ఒక మైలురాయి.

ఆ రోజున ఒక అమెరికన్ సోదరుడు అమ్మ గురించి వ్రాసిన ఒక ఆంగ్లగ్రంథం అమ్మకు సమర్పింపబడి అమ్మచేత ఆవిష్కృత మయింది.

అమెరికన్ సోదరుని పేరు మిస్టర్ రిచర్డ్ షిఫ్‌మన్. అమెరికాలో న్యూయార్క్ లాంటి ప్రసిద్ధమయిన పట్నంలో అత్యంత సంపన్నమూ, అత్యంత నాగరికమూ అయిన కుటుంబంలో పుట్టాడు. యం.ఏ. పట్టభద్రుడయినాడు.

అతనిలో అసాధారణమయిన ఆధ్యాత్మకచింతన బయలు దేరింది. భారతదేశం వచ్చాడు. అనేక ఆశ్రమాలు, పీఠాలు, మఠాలు సందర్శించాడు. అనేక ఆధ్యాత్మిక వేత్తలను కలుసుకున్నాడు.

అతనికి సంతృప్తి కలుగలేదు. అతని ఆధ్యాత్మిక పిపాస చల్లారలేదు. అతని అన్వేషణకు ఫలితం దక్కలేదు. అతని మార్గానికి గమ్యం చిక్కలేదు.

ఒక భారతీయ స్నేహితుడు చెప్పగా విచిత్రమయిన పరిస్థితుల్లో ప్రతికూలమయిన మనస్సుతో 1975లో మొట్ట మొదటిసారిగా రిచర్డ్ 'అమ్మసందర్శనం' చేసుకున్నాడు.

మొదటి దర్శనంలోనే అమ్మలోని అసాధారణతనూ, అలౌకికతనూ గమనించగలిగాడు. అవ్యాజమూ, అమలినమూ అయిన అమ్మ ప్రేమను పొందాడు. ఆ ప్రాపంచికమూ, అతిపవిత్రమూ, బలీయమూ అయిన ఆ ప్రేమే పాశమై అతడిని అమ్మపాదరాజీవాలకు బద్ధుడ్ని చేసింది.

అప్పటినుంచీ జిల్లెళ్ళమూడి వస్తూ పోతూ ఉన్నాడు. అందరికీ అమ్మ అయిన అమ్మ తనకూ కన్నతల్లిగానూ, అమ్మ నివాసం అయిన అందరిల్లే తన స్వగృహంగానూ అతనికి విశ్వాసం కలిగింది.

వీలయినంత ఎక్కువ కాలం జిల్లెళ్ళమూడిలో అమ్మపదసన్నిధిన ఉంటూ - ఆ సన్నిధిన ఉండగలగడమే ఉత్తమసాధనగా ఆలోచించాడు.

అమ్మలో అపూర్వమయిన భావసంపదనూ, ఆదర్శమయినటువంటి జీవనరీతినీ రిచర్డ్ గ్రమించాడు. అమ్మను ఒక అత్యద్భుతవ్యక్తిగా గుర్తించాడు. అమ్మను గురించి విశాల విశ్వానికి తెలియజేస్తే కోట్లాది ప్రజలకు మహోపకారం చేసినట్లవుతుందని భావించాడు.

అమ్మను గురించి సమగ్రమయిన ఒక గ్రంథం వ్రాయాలనుకున్నాడు. అది ఇంగ్లీషులో ఉంటే ప్రపంచ ప్రజలందరికీ ఉపయోగపడుతుందని భావించాడు.

అందుకు అవసరమయిన సామగ్రినంతనూ-ఎంతో కష్టపడి సంపాదించాడు.

5, 6 సంవత్సరాలు కృషిచేసి ఎట్టకేలకు ఒక ఉత్గ్రంథాన్ని ప్రచురించ గలిగాడు.

అక్టోబరు 9వ తేదీన ఆ గ్రంథ ఆవిష్కరణ జరిగింది.

అమ్మను గురించి పూర్వం కొన్ని గ్రంథాలు ప్రచురితమయి నప్పటికీ - అవి పరిమాణంలో చిన్నవి. అసమగ్రమయినవి. ఈ గ్రంథం పరిమాణంలో పెద్దదే కాక, ఒక అమెరికన్ యువకునిచే వ్రాయబడ్డందువల్ల కూడా దాని వాసి పెరిగింది. అతడు అతి నాగరికమయిన పాశ్చాత్య దృక్పథంతో అమ్మను చూసి ప్రస్తుత కాలానికి అమ్మతత్వమూ, అమ్మ బోధలూ ఎంత ఉపయోగమైనవో, ఎలా సరి అయినవో వివరించాడు.

గ్రంథం అమ్మకు సమర్పించేటప్పుడు రిచర్డ్ను చూడాలి ! అతని ముఖం శతపత్రమై వికసించింది. ఉదయారుణ బింబమై భాసించింది. అతని కన్నులు కోటి దీపకాంతులు వెదజల్లాయి.

మరి, అతని తపస్సు ఫలించిన దివ్య ఘడియలవి ! అతని జీవితానికి సాఫల్యతనూ, సార్థకతనూ ప్రసాదించిన సన్నివేశం అది ! 4, 5 సంవత్సరాలుగా ఎదురు చూసిన ముహూర్తం ఆ క్షణంలో సాక్షాత్కరించింది !

అదే క్షణంలో అమ్మ కన్నుల్లో కూడా ఆనంద జ్యోతులు వెలిగాయి. ఆ ఆనందానికి హేతువు గ్రంథావిష్కరణం కంటే అభీష్టసిద్ధిని పొందిన రిచర్డ్ సంతోషం అయ్యుంటుంది !

ఆవిష్కరణ సభలో పలువురు ప్రసిద్ధులు పాల్గొన్నారు. ఆ సభకు ఆంధ్రప్రభ వారపత్రిక, దినపత్రిక సంపాదకులు శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావు అధ్యక్షత

వహించారు. చీరాల వి.ఆర్.ఎస్. మరియు వై.ఆర్.ఎన్. కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ పి. జగదీశ్వరరావు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ న్యూస్ ఎడిటర్ శ్రీ సంపత్, ఆంధ్రపత్రిక దినపత్రిక సంపాదకులు శ్రీ వీరాజీ, ఏలూరు సెయింట్ థెరిస్సా కాలేజీ ఇంగ్లీషు శాఖాధ్యక్షులు ప్రసిద్ధ రచయిత శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి గ్రంధాన్ని గురించీ, రచయితను గురించీ ప్రసంగించి ప్రశంసించారు. ఆంగ్లసోదరుడు మిష్టర్ జేమ్సు కాంపియన్ సభాప్రారంభం లోనే గ్రంథాన్ని గురించి పరిచయం చేస్తూ, రిచర్డు ఉత్తమ గుణసంపదను ప్రస్తుతించాడు.

అమ్మ వజ్రోత్సవ సందర్భంగా - శ్రీ విశ్వజననీ పరిషత్ ఒక నిర్ణయం తీసుకున్నది. అమ్మను ఒక అపురూపమయిన, ఆదర్శమయిన వ్యక్తిగా, ఒక మహాశక్తిగా గుర్తించి ఆ సన్నిధిన చేతులు కట్టుకుని, చేతులు ముడుచుకుని కూర్చుంటే ప్రయోజనం ఏమున్నది ? ఆ ప్రయోజనాన్ని విశ్వపరివ్యాప్తం చేయాలి కదా ! అందుకే అన్ని భారతీయ భాషల్లోనూ, అంతర్జాతీయ భాష అయిన ఇంగ్లీషులోనూ అమ్మను గురించి తెలియజేసే గ్రంధ ప్రచురణ చేయాలని పరిషత్ అభిప్రాయ పడ్డది.

అందుకు అనుగుణంగానే ఈ గ్రంధ ప్రచురణ జరిగింది. ఇది పరిషత్‌కు అమ్మ అనుగ్రహించిన ఆశీర్వచన ఫలితమే. ఇందుకు ఉపకరణంగా అమ్మ ఎంచుకున్న సోదరుడు రిచర్డు అదృష్టవంతుడు. అందువల్లనే శ్రీ విశ్వజననీ పరిషత్ పక్షాన రిచర్డు షిఫ్‌మన్‌ను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాము.

తెలుగురాని వాళ్ళకు ఈ గ్రంధం ఎంతో ఉపయోగపడుతుంది అని భావిస్తున్నాం. అసంఖ్యాక ఆధ్యాత్మిక జిజ్ఞాసులు, దేశవిదేశ విభేదరహితంగా రిచర్డుకు కృతజ్ఞతలు చెప్పవలసి ఉంటుంది.

'గుర్తు చెప్పివాడే గురువు' - అన్న అమ్మ సూక్తి ప్రకారం అమ్మ గుర్తును జగత్తుకు అందజేయుగల ఈ గ్రంధం "జగద్గురువు"గా ప్రసిద్ధం కాగలదని ఆశిస్తున్నాము.

ఇంకా ఇతర బాషల్లోకూడా అమ్మను గురించి అనేకానేక ప్రచురణలు అతి త్వరితంగా వెలువడి జగత్తుకు ఒక కొత్త ఒరవడిని దిద్దగలవని మనసార అభిలషిస్తున్నాము.

(సెప్టెంబరు 1983)



# 178
# మాతృయాగం

సోదరులు శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు, శ్రీ తంగిరాల కేశవ శర్మ ప్రభృతులు కలిసి జిల్లెళ్ళమూడిలో అమ్మసన్నిధిలో 'గాయత్రీ యాగం' నిర్వహించాలని ప్రకటించిన నిర్ణయాన్ని పురస్కరించుకుని 24.11.83న అమ్మతో ప్రసంగిస్తూ.....

"అమ్మా - ఆనాడు అరవిందుడు సావిత్రీయాగం చేశాడూ, ఈనాడు రంగారావుగారు గాయత్రీ యాగం చేస్తానంటున్నారు" అన్నాను.

అమ్మ వెంటనే అన్నది చిరునవ్వుతో,

"ఎవరే యాగం చేసినా - నాది మాత్రం జనయిత్రీయాగమే".

ఇటీవలనే ఒక సంభాషణలో అమ్మ తన కార్యక్రమానికి ముద్దుగా పేరు పెట్టుకున్నది...... "మాతృయాగం" అని !

ఆ యాగాన్ని వివరిస్తూ అమ్మే చెప్పింది - చేతనైనంతలో వీలయినంత ఎక్కువ మందికి అన్న వస్త్రాలను పంచడమే నట !

ఈ నవంబరు 26వ తేదీన హైమవతీ జయంతి. ఆ సందర్భంగా అనేకులు సోదరీ సోదరులు మండలదీక్షతో విశేష అభిషేకాలు, అర్చనలు జరుపుతున్నారు. ఈ నలబై రోజుల్లో ఈ సందర్భం పేరుచెబుతూ ఎన్ని వందల మందికి అమ్మ కొత్త గుడ్డలు ప్రసాదించిందో !

మామూలుగా అమ్మ ఎవరికి గుడ్డలు పెట్టినా, "యిప్పుడు మా కెందుకమ్మా?' అని అడుగుతారు. ఏదో కారణంతో ఎక్కువమందికి గుడ్డలు పెట్టడం అంటే అమ్మకు ఎంతో సరదా, సంతృప్తి.

చిన్నతనం నుంచీ అమ్మకు అన్నవస్త్రాలను పంచే అలవాటు బలంగానే ఉన్నప్పటికీ ----

అన్నం పెట్టడమనే కార్యక్రమానికి 1958 ఆగష్టులో ఒక ఉద్యమరూపం అనుగ్రహింపబడినట్లే - గుడ్డలు పెట్టే కార్యక్రమం 1968 ఏప్రియల్‌లో బృహత్తర రూపం ధరించింది.

హైమ 1968 ఏప్రియల్ 5వ తేదీన దైవత్వం పొందింది ఆ రోజుల్లోనే అమ్మ గుడ్డలు పెట్టే మహత్ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది.

"ఈ విచారసమయంలో ఇవన్నీ ఎందుకమ్మా" అని అడిగిన వారిని "అందుకే నాన్నా ఇవి. అయినా ఇపుడేమయిందీ ? హైమ ఎక్కడకు వెళ్ళిందీ ?" అని అమ్మ తిరిగి ప్రశ్నించేది.

దుఃఖంలో వచ్చినవాళ్ళకూ అమ్మ గుడ్డలు పెడుతుంది. కొత్తగా పెండ్లి చేసుకుని వచ్చిన వధూవరులకూ పెడుతుంది. పండితులకూ పెడుతుంది. పామరులకూ పెడుతుంది. పెద్దవాళ్ళకూ పెడుతుంది. పేదలకూ పెడుతుంది. పండు ముదుసళ్ళకూ పెడుతుంది. పసిపాపలకూ పెడుతుంది.

భోజనం విషయంలో "మీరు తింటే నేను తిన్నట్లే" అని ప్రవచించినట్లే గుడ్డల విషయంలోనూ "నేను కట్టుకునేకంటే ఈ చీరె నీవు కట్టుకుంటేనే ముద్దుగా ఉంటుందమ్మా" - అంటుంది అమ్మ

ఇట్లా అనంతంగా అన్నమూ, గుడ్డలూ పెడుతూ ఒకంహస్యాన్ని అమ్మ ఒకసారి వివరించింది. "మీకు నేను పెట్టడం - మీ చేత ఇతరులకు పెట్టించడం కోసమూ, ఇతరులకు పెట్టడం మీకు నేర్పడం కోసమూ" అని.

అమ్మ ఆకాంక్ష నెరవేరితే ఈలోకంలో అన్న వస్త్రాలకు లోటే ముంటుందీ? అన్నవస్త్రాలకు లోపమేలేని ఆ లోకం నాకమే కదా ?

అమ్మ సిద్ధసంకల్ప !

మాతృయజ్ఞప్రియ ! యజ్ఞకర్త్రి ! యజమాన స్వరూపిణి !!!

(అక్టోబరు, నవంబరు 1983)



# 179
# దేవుడు - అవతారాలు

పురాణ సాహిత్యం దేవుణ్ణి నాలుగు చేతులు, కాళ్ళు, కిరీటాదులతో, అణిమాది అష్టసిద్ధులతో, సృష్టిస్థితిలయాది లోక పరిపాలనాధికారాలతో షడ్గుణ సంపన్నుడుగా, సర్వకళ్యాణ గుణాభిరాముడుగా అభివర్ణించి నప్పటికీ - హిందూ మతానికి జీవనాడి అయిన ఉపనిషత్తుల్లో మాత్రం దైవం పరబ్రహ్మమూ, పరమాత్మ అన్న పేర్లతో ఉద్ఘాటింపబడింది.

పరబ్రహ్మమన్నా, పరమాత్మ అన్నా అంతా అయినది. సర్వత్రా ఉన్న శక్తి. సర్వరూపాలూ, సర్వనామాలూ, సర్వగుణాలూ, సర్వ సంకల్పాలూ, సర్వక్రియలూ.

ప్రజ్ఞానం భగవంతుడు. అజ్ఞానమూ భగవంతుడు.
ఆనందం భగవంతుడు. బాధా భగవంతుడు.
అన్నం భగవంతుడు, సున్నమూ భగవంతుడు.
సత్యం భగవంతుడు అసత్యమూ భగవంతుడు.
సౌందర్యం భగవంతుడు. వికారమూ భగవంతుడు
సంపద భగవంతుడు. దారిద్ర్యమూ భగవంతుడు.
ఆపద భగవంతుడు. రక్షణ భగవంతుడు.
శివం భగవంతుడు. శవమూ భగవంతుడు.
జ్యోతి భగవంతుడు. చీకటీ భగవంతుడు.

“ఇప్పుడు ఒక నాటకం ఉందనుకోండి. ఆ నాటకం వ్రాసిన వాడూ పాత్రను ధరించాల్సి వస్తుంది. అందులో దుఃఖపాత్ర వస్తే - అదీ, ఏ పాత్ర వస్తే - అదీ, వెయ్యాల్సిందే. తానే వ్రాశానని తెలుసు. అన్ని పాత్రలూ తనకు తెలుసు. వ్రాసేటప్పుడు కర్టెన్ తానై, ప్రేక్షకులు తానై, నాటకమంతా తానై, చేయించేది తానై, చేసేది తానై, అన్నీ తానే అయి వ్రాస్తాడు - కానీ, ఏ పాత్రను వేయాల్సి వచ్చినప్పుడు ఆ పాత్ర వేస్తాడు” అని వివరించింది అమ్మ.

"నిర్ణయానికి నిర్ణయించినవాడు కూడా బద్ధుడే" నన్నది అమ్మ

ఒకసారి రుక్మిణక్కయ్య బాధపడే అమ్మను చూసి 'నీ కీ బాధ లేమిటమ్మా?' అని ప్రశ్నిస్తే -

"మరి, నాకూ భర్తా, సంసారమూ, సంతానమూ. ఏమి లేవూ ? నాకూ మీవలనే అన్ని ఉన్నాయి" అని సమాధానం చెప్పింది అమ్మ.

అవును. అమ్మకూ అన్నీ ఉన్నాయి. కానీ ఏవీ అమ్మకు అంటవు. అమ్మ తామరాకుపై నీటిబొట్టు. సంసారంలో అమ్మ ఉన్నా, అమ్మలో సంసారమూ ఉండదూ, సంఘర్షణా ఉండదు

అందుకే అమ్మ అన్నది.

"అనుభవాలు అందరికీ ఉంటాయి. ఏడుస్తూ అనుభవించే వాడు నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు సలహాకు వస్తాడు" అని.

కనుకనే మనం అమ్మచుట్టూ తిరుగుతున్నాము.

ఒక సందర్భంలో మానవునికీ మాధవునికీ తేడాను అమ్మ సుతారంగా వివరించింది.

"భగవంతుడిని గుర్తించింది మానవులు, పుస్తకాల్ని రాసింది మానవులేగా మానవుడు లేకపోతే దేవుడే లేడు. మానవతత్వాన్ని గుర్తించిన మానవుడు మాధవుడే. గుర్తు తేడా తప్ప మాధవత్వం మానవత్వంలో ఉన్నట్లేగా. ఒక వస్తువు దగ్గరపెట్టుకుని మర్చిపోయి వెతికినట్లు, మానవుడికీ - మాధవుడికీ తేడా".

మరొక సందర్భంలో జీవుడికీ దేవుడికీ భేద మేమిటని ప్రశ్నించిన సోదరునికి "భావమే"నని అమ్మ జవాబిచ్చింది.

"మాధవుణ్ణి గుర్తించి అన్ని వస్తువుల్లోనూ మాధవుని చూచిన మానవుడే మాధవుడు" అని కూడా అమ్మ నిర్వచించింది.

"నేను మీలో దైవత్వాన్ని చూస్తాను. మీరు నాలో మానవత్వం చూస్తారు" అన్నది అమ్మ.

జ్ఞాని మానవుడిలో దైవాన్ని చూస్తాడు. అజ్ఞాని దైవంలో మానవుణ్ణి చూస్తాడు.

అమ్మకూ, మనకూ దృక్పథంలో ఈ భేదం సహజమే.

అమ్మ మరొక చక్కని నిర్వచనాన్ని ప్రసాదించింది "ఇతరులలో దైవత్వాన్ని చూస్తున్నంతసేపూ మనలో దైవత్వం మేలుకుంటుం"దట.

"అంతా తానే అనేటువంటి భావం కలగటమే దైవత్వ" మట

"భిన్నత్వంలేని మనస్తత్వమే దైవత్వ"మట

ఎల్లప్పుడూ అన్నిటిలో, అందరిలో దైవత్వాన్ని సందర్శించే అమ్మ, సుఖదుఃఖాల్లో స్థిరచిత్త, స్థితప్రజ్ఞ అయిన అమ్మ - పరమజ్ఞాని, అవతారమూర్తి.

మరి, అమ్మ అవతార ప్రయోజనం ?

శిష్ట రక్షణా, దుష్ట శిక్షణా? అమ్మదృష్టిలో అందరూ శిష్టులే. తల్లికి తప్పే కనుపించదు - అన్నది.

ధర్మ సంస్థాపనమా ? జరిగేదే ధర్మ - మని అమ్మ ప్రవచనం

ఒకరు "నిన్ను కొలుచుకుంటున్నా నమ్మా" అంటే ---

"నేను దేవుణ్ణా ? అమ్మను" అన్నది.

అమ్మ ఏ అవతారం అని కొందరు వాదు లాడుకుంటు --

"నేను ఏ అవతారాన్ని కాను. అమ్మను" అన్నది.

అమ్మతత్వాన్ని అందించడానికే అమ్మ వచ్చిందా ? అనురాగ క్షీరాబ్ధిలో మనను ముంచెత్తడానికే తాను అవతరించిందా ? వాతల్యామృతవర్షంలో మనను పునీతులను చేయడమే అమ్మ కార్యక్రమమా ?

"ఒక కారణంతో వచ్చేది కారణావతారం. కారణం లేకుండా అన్నీ తానే అయి, తనవే అయి వచ్చింది సంపూర్ణ అవతారం".

"ఇదంతా నేనే. మీ రంతా నేనే మీదంతా నేనే" అన్నది అమ్మ.

"ఈ సృష్టి అనాది, నాది" అన్నది అమ్మ.

(డిశంబరు 1983)



# 180
# గాయత్రీ ఉపాసన

"అమ్మా - గాయత్రీ ! ఇక్కడ ఉన్నావా ?" 1958వ సంవత్సరంలో శ్రీ లక్ష్మీకాంతయోగివర్యులు అమ్మను దర్శించగానే అడిగారు.

యోగివర్యులు సుప్రసిద్ధులు. గుంటూరుకు సమీపంలో ఉన్న కొత్త రెడ్డిపాలెంలోని ఆనందాశ్రమ వ్యవస్థాపకులు. వారు గాయత్రీ ఉపాసకులు, గాయత్రీ సాక్షాత్కారం పొందిన సిద్ధవ్యక్తి.

వారు అమ్మను సందర్శించి - అమ్మ సాక్షాత్తు గాయత్రీదేవియే - నని ప్రకటించారు.

గాయత్రీ స్వరూపిణి అయిన అమ్మ సమక్షంలో మనం గాయత్రీయాగం చేసుకుందామని భావించాము ఏదో ఒక లిప్తపాటు, లేదా కొన్ని క్షణాలు మాత్రమే ఒక ఊహలోనో స్వప్నంలోనో, చూడ గలగడమే మహాదృష్టంగా సంభావిస్తూ - రక్తమాంసాలతో, కరచరణాదులతో నిత్యం అమ్మను సందర్శించగలుగుతున్న మనం ఎంత ధన్యులమో, ఎంత అదృష్టవంతులమో !

సామాన్యంగా ఎంతో సాధనచేసి అనుగ్రహం పొంది సాధకులు దైవ సాక్షాత్కారం పొందుతారు. అందుకు వ్యతిరేకంగా మనం అమ్మను చూస్తూ అమ్మ అనుగ్రహాన్నీ అనురాగాన్నీ పొందుతూ ఉపాసనచేసుకుంటున్నాము. ఇది మనకు అసాధారణ విచిత్ర విషయం అయినప్పటికీ - అమ్మ అనంత అవ్యాజ వాత్సల్యానికి సహజమయిన విధానమే.

గాయత్రీ మంత్రంకంటే ఉత్తమ మంత్రమూ, తల్లిని మించిన దేవతలే - దని మనుస్మృతి చెబుతున్నది

గాయత్రీమంత్రం వేదాలు శాసనరూపంగా ద్విజులకు విధించిన సంధ్యోపాసనలో ఒక భాగం. ఈ ఉపాసనమే 'సంధ్యావందనం'గా సుప్రసిద్ధం. ఈ సంధ్యోపాసనమే పరదేవతోపాసన, పరబ్రహ్మోపాసన.

సంధ్యాదేవత కటాక్షవీక్షణ ప్రసారఫలితమే ఆత్మతత్వ జ్ఞానోపలబ్ధి, అదే బ్రహ్మజ్ఞానోదయం, అదే జీవబ్రహ్మ ఐక్యానుసంధానం, అదే పునరావృత్తి రహితస్థితి. అదే కైవల్యం అదే నిశ్శ్రేయసం అదే అద్వైత సిద్ధి. అదే మోక్షం అదే ప్రతిజీవికి చరమగమ్యం. అదే పరమధ్యేయం.

సంధ్యోపాసనకు గాయత్ర్యుపాసన అనుబద్ధం. సంధ్యాదేవత మహారాజ్ఞి అయితే, గాయత్రీదేవి మంత్రిణి

ఆదిత్యమండలాంతర్యామియగు బ్రహ్మచైతన్యమే 'సంధ్యా దేవత'

"అసావాదిత్యో బ్రహ్మ. సాహమస్మి" అన్న సంధ్యోపాన ద్విజులకేమిటీ ప్రతిజీవికీ ఆవశ్యకర్తవ్యమే.

ఉభయ సంధ్యలూ మానవుని మనుగడకు మహోపకారకాలు. తొలిసంజ సుప్తలోకానికి మేలుకొలుపును వినిపిస్తుంది. మలిసంజ అలసిన జగతికి జోలపాడి ఆదరిస్తుంది. ఉభయ సంధ్యలకూ ఆధారభూతమయిన ప్రభాకరుడు మాత్రమే విశాల విశ్వంలో స్వయంప్రకాశమానుడు. సూర్యతేజం వల్లనే విశ్వం యొక్క సృష్టి స్థితిలయాలు జరుగుతున్నాయన్న సత్యం సర్వజన సమ్మతం. ఆదిత్యరూప మయిన చిచ్ఛక్తిని ఆధ్యాత్మిక వాదులు ప్రస్తుతిస్తారు; ప్రార్థిస్తారు. అధిభౌతిక వాదులు పరిశీలిస్తారు, పరిశోధిస్తారు, ప్రశంసిస్తారు. ఎవరూ కాదనలేరు.

చిచ్ఛక్తి యొక్క ఉపాసనమే సంధ్యోపాసన కాగా - ఈ విశాలవిశ్వం యొక్క విరాడుపాసనయే గాయత్రీ ఉపాసన.

నామ రూపాత్మకమగు జగత్తంతా మహావిరాట్ స్వరూపిణి యగు గాయత్రీదేవి యొక్క స్థూలశరీరంగా అభివర్ణితమయింది. గాయత్రీదేవియొక్క రూపం వ్యావహారిక వాస్తవికం గాయత్రి విరాట్ అభిమానిని పృథివ్యాది పంచమహా భూతాలు, పంచమహాభూతాల వలన బుట్టిన పాంచభౌతిక వస్తువులన్నీ - గాయత్రీదేవి స్థూల శరీరమే.

గాయత్రీదేవికి -అగ్ని ముఖం, బ్రహ్మ శిరస్సు, విష్ణువు హృదయం, రుద్రుడు శిఖ, పృథివి యోని. సూర్యచంద్రులు ఆమె నేత్రాలు. నక్షత్రాలు ఆభరణాలు.

పంచప్రాణాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనోబుద్ధులు - 17తో కూడుకున్నది లింగశరీరం. లింగశరీర సమిష్టికి (మొత్తమునకు) 'హిరణ్య గర్భుడు' అని పేరు. ఆ హిరణ్య గర్భుడు గాయత్రికి ప్రాణం, అనగా లింగశరీరం.

శరీరానికి సంబంధించిన ఇంద్రియశక్తి, సహనశక్తి, శారీరక శక్తి - అన్నీ గాయత్రియే

సర్వప్రాణుల యొక్క ఆయుస్సుకూడా గాయత్రియే.

గాయత్రీదేవ్యుపాసనకే గాయత్రి మంత్రం. ఇది త్రిపద ఋక్, యజుస్సామ వేదాల నుండి ఒక్కొక్క పాదం సంగ్రహించబడింది.

ఓం భూర్భువస్సువరోం
తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్ ॥

ఈ మంత్రోపాసనవల్ల వేదపారాయణ చేసిన ఫలం వస్తుందని ఆర్యోక్తి. గాయత్రి మహావిరాట్ స్వరూపిణి గావున - ఆమెను శారీరక శక్తి స్వరూపిణిగ ధ్యానించే వాళ్ళకు అపరిమిత బలం వస్తుంది. ఆయుఃస్వరూపిణిగ ధ్యానించే వాళ్ళకు దీర్ఘాయువు కలుగుతుంది.

గాయత్రి మూడువేళల ఉపాస్యం కనుక ఉదయం గాయత్రిగానూ, మధ్యాహ్నం సావిత్రిగానూ, సాయంకాలం సరస్వతిగానూ పిలువబడుతుంది.

అమ్మ 'గాయత్రి' అని నామకరణం లేకుండా దైవమూ, శక్తీ అంటూ గాయత్రీవర్ణన అంతా చేసింది. కనుపించేదంతా 'అదే'నని పలుసార్లు పలు సందర్భాల్లో సుస్పష్టంగా ప్రకటించింది.

గాయత్రీ స్వరూపాలయిన మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతులను నిర్వచిస్తూ - లక్ష్మి అంటే వస్తువు; కాళీ అంటే వస్తువులోని శక్తి; సరస్వతి అంటే ఆ వస్తువును గురించిన పరిజ్ఞానం - అని వివరించింది.

''గాయత్రి అంటే పంచభూతాల సమ్మేళనమే''నని ప్రవచించింది. శాస్త్రాలు ఉపాసన అంటే అభిధ్యానమే నన్నాయి. అమ్మ 'ధ్యాసే ధ్యానం' అన్నది.

గాయత్రీ ఉపాసకుడికి - ఈ లోకమంతా గాయత్రీస్వరూపమే - నన్న భావం దృఢంకావాలి. ఆ భావం నరనరానా జీర్ణించాలి. తర్వాత నేనూ ఆ గాయత్రినే -అన్న భావం కలగాలి. స్థిరపడాలి. అనుక్షణం ఆ భావం జాగృతమై ఉండాలి.

ఈ అద్వైత సిద్ధిని పొందడమే గాయత్రీమంత్రోపాసన ధ్యేయం.

ఇంతవరకే మనకు మన పూర్వఋషులు ప్రబోధించారు.

కాని ఉపాసనకు అమ్మ వేరే అర్థం చెబుతున్నది. ఈ లోకమంతా తనకు ఆరాధ్యమూ, ఉపాస్యమూ అయిన గాయత్రీదేవత స్వరూపంగా అర్థంచేసుకుని లోకమంతనూ ప్రేమించమని ప్రబోధిస్తున్నది.

ప్రేమించడ మంటే ?

లోకంలో అన్ని విధాల అడుగుమెట్ల పైనున్న వారినీ, ఆర్తులనూ, ఆపదల్లో నున్న వారినీ ఆదుకుని, వారికి చేయూత నిచ్చి ప్రేమతో ఆదరించడమే - విశ్వాన్ని ఆరాధించడమని వివరించింది అమ్మ

అదే గాయత్ర్యుపాసన, అదే పరబ్రహ్మోపాసన.

జగమంతలో తనను సందర్శిస్తూ, తనలో జగత్తునంతనూ దర్శించడమే గాయత్రీ మంత్రోపాసన.

అందరినీ సమానంగా ప్రేమించడమే - అంటే 'సర్వత్రానురాగమే' గాయత్రీ మంత్రానుష్ఠానం.

ఇదే అమ్మ నిరంతరానుష్ఠానం. ఇదే అమ్మ మనకు వినిపిస్తున్న నిరంతర ప్రబోధం. ఇదే అమ్మ నిత్య సందేశం. గాయత్రీ ఉపాసనకు అందరూ అర్హులే - నని అమ్మ అపూర్వ ప్రవచనం !

(జనవరి, ఫిబ్రవరి 1984)



## సానుభూతి

కష్టంలో ఉన్న జనాన్ని చూచి కరుణతో స్పందించ గల మనస్తత్వమే నిజమయిన మానవత్వం. అదే దైవత్వం.

- అమ్మ

# 181
# కళ్యాణమండపం

"నేను మీ ఇష్ట ప్రకారం నడుస్తున్నట్లు కనుపిస్తాను. కానీ నా ఇష్టప్రకారమే మిమ్మల్ని నడుపుకుంటాను".

ఈ భావాన్ని అమ్మ ఎన్నిమార్లు ఎన్ని విధాలుగా మనకు చెప్పిందో !

సంస్థ ఆర్థిక పరిస్థితినీ, సంస్థ నడుస్తున్న తీరునూ అవలోకించి అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే - ఎన్నో ప్రశ్నార్థకాలూ, ఆశ్చర్యార్థకాలూ మనకు ఎదురై మనను ఆశ్చర్యంలో ముంచెత్తుతాయి

రూపాయి నిలువ ఉండదూ, నిత్యకార్యక్రమానికి ఏ మాత్రమే భంగం ఉండదు. జిల్లెళ్ళమూడిలో జరిగే ఉత్సవాల మహావైభవం చూస్తే ఎవరికయినా విస్మయం కలగకమానదు.

అమ్మ ఒకసారి అన్నది - ఈ సంస్థను నడపడం కోటీశ్వరుడికి కూడా సాధ్యం కాదు, అని. కాని ఏసమయానికి ఎంత మొత్తం అవసరమో ఆ సమయానికి అంతా వస్తుంది. ఎటునుంచి వస్తుందో, ఎవరి ద్వారా వస్తుందో ముందుగా మనం ఊహించలేము.

వస్తువుగా నయినా వస్తుంది. ధనరూపేణా నయినా వస్తుంది వస్తువు ధనం కాకపోతేనేగా - నని అమ్మ అంటుంది. విరాళంగా నయినా వస్తుంది. ఋణంగా నయినా వస్తుంది. అప్పు ఆస్థి కాదా, నాన్నా ? - అని అడుగుతుంది అమ్మ.

సంస్థలో అవసరాలు తీరకపోవు. అదనంగా ఒక్కపైసా ఉండదు. ఇది అమ్మ నిర్వహణలోని సామర్థ్యమూ చాతుర్యమూ

అందుకు అమ్మకు ఉపయుక్తమయిన వాళ్ళు ధన్యులు. వారి జీవితాలు పునీతం వారి చరిత్రలు సార్థకం

1983 నవంబరు 28వ తేదీన మన రాష్ట్ర ప్రభుత్వ ఆర్థికా మాత్యులు శ్రీ నాదెండ్ల భాస్కరరావుగారూ, సత్తెనపల్లి శాసన సభ్యురాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారూ జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మను దర్శించారు. సంస్థను చూశారు. అక్కడ నిత్యం జరిగే కార్యక్రమాలు తెలుసుకున్నారు. అమ్మ ఆధ్వర్యంలో అక్కడ జరిగే ప్రజాహిత కార్యక్రమాలు వాళ్ళను ఎంతగానో ఆకర్షించాయి.

శ్రీమతి రాజకుమారి తిరుమల - తిరుపతి దేవస్థానం బోర్డు సభ్యురాలు. దేవస్థానం తరఫున జిల్లెళ్లమూడిలో ఒక కల్యాణ మండపం నిర్మిస్తే బాగుంటుందని భావించింది.

అదే అమ్మకు నివేదించింది. అమ్మ అంగీకరించింది

ఆ క్షణంనుండీ కావలసిన పనులు చక చకా సాగాయి. ఫలితంగా - ఫిబ్రవరి 2వ తేదీన దేవస్థానం మేనేజ్మెంటు వారు తీర్మానం నెంబరు 594 ద్వారా జిల్లెళ్ళమూడిలో కళ్యాణమండప నిర్మాణానికి నిశ్చయించారు.

ఇందుకు సోదరి శ్రీమతి నన్నపనేని రాజకుమారి తీవ్రకృషి ముఖ్యకారణం. అందుకు ఆమెకు శ్రీ విశ్వజననీ పరిషత్ పక్షాన మనసారా కృతజ్ఞతలు తెలియజేస్తూ అమ్మ అనుగ్రహం ఆమెకు పరిపూర్ణంగా కలగాలని అమ్మను ప్రార్థిస్తున్నాము.

జిల్లెళ్లమూడి చిన్న గ్రామమయినప్పటికీ. క్షేత్ర ప్రసిద్ధినీ, ప్రజల అవసరాన్నీ గమనించి కల్యాణమండపం కట్టడానికి రూ. 7,50,000/-లను మంజూరు చేసిన తిరుమల - తిరుపతి దేవస్థానం పరిపాలక సంస్థవారి ఔదార్యాన్ని కృతజ్ఞతతో సంస్మరిస్తున్నాము.

ఈ కల్యాణమండపం ఎందరో వధూవరుల వివాహమండపమే కాక - లోక కల్యాణమండపం, అతిలోక కల్యాణమండపం కాగలదని ఆశిస్తున్నాము, విశ్వసిస్తున్నాము.

(మార్చి 1984)



# 182
# అమ్మనామ జపదీక్ష

ఏప్రిల్ 8వ తేదీ నుండి 12వ తేదీ వరకు జిల్లెళ్ళమూడిలో మనం 'గాయత్రీ యాగం' అత్యంత వైభవోపేతంగా ఆనందంగా జరుపుకున్నాం జిల్లెళ్ళమూడిలో ఈ రీతిన యజ్ఞం చేయడం మొట్టమొదటి సారే అయినప్పటికీ అనన్యసాధ్యంగా, అత్యద్భుతంగా, అఖిలజన ఆహ్లాదకరంగా జరిగింది. ఈ యజ్ఞానికి పూర్వాంగంగా, సుమారు 400 మంది దీక్షితులు ఒక కోటి ఇరవైరెండు లక్షల గాయత్రీ జపం చేశారు అమ్మ రూపాన్ని మనస్సులో ముద్రించుకుని గాయత్రీ జపాన్ని నోటితో చేస్తూ గాయత్రీ దేవియే అమ్మ అని మనసారా విశ్వసించి ఎందరో అద్భుతమయిన దర్శనాలనూ, నిదర్శనాలనూ, ఫలితాలనూ పొందారు.

అమ్మవద్దకు వచ్చేవారిలో అధికభాగం, అమ్మను సర్వదేవతా స్వరూపిణిగ, అందులోనూ ముఖ్యంగా రాజరాజేశ్వరీదేవిగా భావించి ఆరాధిస్తున్నారు. అందువల్లనే జిల్లెళ్ళమూడిలో ప్రత్యణువులోనూ అమ్మనామం ప్రతిధ్వనిస్తున్నది.

"జయహో మాతాశ్రీ అనసూయా

రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి ....." అన్న మధురనామం ప్రతి నోటివెంట వెలువడుతూ ఆ వాతావరణాన్నీ ఆవరణాన్నీ పవిత్రం చేస్తూ పులకింప చేస్తున్నది. ప్రతి గుండెలోనూ ఆ నామం పునశ్చరణమవుతూ శరీరంలోని అణువణువునూ చైతన్య తరంగితం చేస్తున్నది.

ఆ నామం ఎంతో శక్తిమంతమయింది. ఆపదల్లో ఉన్న ఎందరికో ఎన్నో విధాల సహాయపడింది. ఆర్తుల నెందరినో ఆదుకుని కాపాడింది ఎందరికో శుభాలనూ, సుఖాలనూ ప్రసాదించింది.

ఆ నామం కారుణ్యామృతవర్షిణి ! ఆపదుద్ధారిణి !

ఆ నామం గూఢగుల్ఫ ! ధ్యానించిన వారిని రక్షిస్తుంది.

ఆ నామం గాయత్రి ! పాడిన వారిని కాపాడుతుంది.
ఆ నామం మంత్రం ! మననం చేసిన వారిని అనుగ్రహిస్తుంది
ఆ నామం సర్వవ్యాధి ప్రశమని ! అకాలమృత్యు నివారిణీ !
ఆ నామం పాపారణ్య దవానల ! దౌర్భాగ్యతూలవాతూల !
ఆ నామం భాగ్యాబ్ధి చంద్రిక ! అజ్ఞాన ధ్వాంత దీపిక !

అందుకే అందరూ ఆ నామాన్ని ఆశ్రయిస్తున్నారు. అమ్మ కూడా "నామికంటే నామమే బలమయింది. దాని నాశ్రయించడమే మంచిది" అంటున్నది. ఎప్పుడయినా, ఎవరి విషయంలో నయినా రూపనామాలలో, రూపం దేశకాల బద్ధమయ్యుంటుంది. నామం దేశకాలాపరిచ్ఛిన్నమైనది. రూపదర్శనంలో శీఘ్రగతిన మనస్సుకు ఏకాగ్రత కుదరవచ్చును; నామసంస్మరణ, లేక నామసంకీర్తనంలో ఏకాగ్రత కలగడంలో కొంచెం విలంబన ఉండవచ్చును గానీ మొదటి ఏకాగ్రతలో ఒడిదుడుకులుకూడా సహజం. నామంవల్ల కలిగే ఏకాగ్రత సుస్థిరంగానూ నిశ్చలంగానూ ఉంటుంది. రూపనామాల్లో రూపాన్ని అర్చామూర్తిగా ఎన్నుకుంటే - అది విగ్రహం కానీ, రక్తమాంసాదులతోడి సజీవ దేహం కానీ - మనకు భిన్నమయిన మరొక మూర్తికావాలి. అది అన్ని వేళలా అందుబాటులో ఉండకపోవచ్చును నామానికయితే ఆ ఇబ్బంది లేదు.

అందువల్లనే ఈ కాలానికి, ఈ జనానికి నామమే సులభతరణోపాయమని శాస్త్రాలు చెబుతున్నాయి.

ఇటీవల మన సోదరీ సోదరులు గాయత్రీ జపం చేసిన అనుభవంతో, ఉత్సాహంతో, గాయత్రీయాగం పరిసమాప్తి కాగానే "ఏం చేయాలి ?" అని ఆలోచించి ఒక నిర్ణయం తీసుకొనడం జరిగింది.

ఇది అమ్మకు 62వ సంవత్సరం కనుక వచ్చే అమ్మ జన్మదినోత్సవం లోపల అమ్మనామం 62 కోట్లు చేయాలని. ఈ బృహత్ ఆకాంక్షను అమ్మకు నివేదిస్తే అమ్మ సమ్మతించి ఆశీర్వదించింది. అప్పటికప్పుడే, 14వ తేదీన వందమందికిపైగా జప దీక్షను పొందారు

| జయహోమాతా శ్రీ అనసూయా<br>రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి |
| --- |

మరి 68 కోట్లు చేయాలంటే షుమారు ఒక వెయ్యిమంది అయినా దీక్షితులు కావాలి. వారు రోజుకు కనీసం ఉదయం ఒక వెయ్యి సాయంకాలం ఒక వెయ్యి జపమయినా చేయాలి ఆ మాత్రమయినా చెయ్యకపోతే ప్రయోజనం ఉండదేమో ననిపిస్తుంది. ప్రాథమికదశలో మనం మనస్ఫూర్తిగా ఆ కాలాన్ని అందుకు వినియోగించగలిగితే - తర్వాత తర్వాత మన ప్రయత్నం ఏమీ అవసరం ఉండదు. ఆ నామమే మనను పట్టుకుంటుంది. ఏ వేళలోనూ, ఏ స్థితిలోనూ ఏ అవస్థలోనూ మనను వదలి పెట్టదు మనకు మన ఉచ్ఛ్వాసనిశ్వాసాలు ఎంతసహజం అవుతాయో, ఈ నామమూ అంతే అవుతుంది. మన శరీరంలో భాగమవుతుంది. మన మనస్సులో భావమవుతుంది మన జీవితానికే జీవమవుతుంది మనకు మిత్రుడవుతుంది; సహచరుడవుతుంది. మనకు ఆచార్యుడవుతుంది; ఉపదేశికుడవుతుంది. మనకు దైవమే అవుతుంది, కైవల్యదాత్రి అవుతుంది.

నామాన్ని సంస్మరించడం ఒక మార్గం.

నామాన్ని సంకీర్తన చేయడం ఇంకొక మార్గం

నామాన్ని ఉపాసించడం మరొక మార్గం. ఉపాసించడమంటే అభిధ్యానం చేయడం. ఆ నామాన్ని జపించడం. తాను అది కావడం కోసం తపించడం ! జపించేటప్పుడు ఆ నామంయొక్క అర్థాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ఆ అర్థాన్ని మనసంతా నింపుకోవాలి.

మనం అమ్మ నుండి జపానికి అనుమతి పొందిన నామం 1958లో 'శ్యాం' (ఇమాం) అనే ఒక ముస్లిం సోదరుడు రూపొందించడం అద్భుతమైన విశేషం. అమ్మ జననానికి పూర్వం మన్నవలో కుర్తాళస్వాములవారు 'రాజరాజేశ్వరి' యంత్రాన్ని ప్రతిష్టించారు. అమ్మకు అత్యధికులు శక్త్యవతారంగానే ఉపాసిస్తారు. అందువల్లనే అత్యంత పవిత్రమూ, అనంతశక్తి సమన్వితమూ, అపాత మధురమూ అయిన మంత్రతో ఉన్న నాలుగు నామాల్లో మూడు లలితాదేవి నామాలు. ఒకటి ఈనాడు ధరించిన శరీరనామం.

మొత్తం - ఇరవై ఒక్క అక్షరమే ఉండడంలో కూడా అమ్మదృష్టి కనుపిస్తున్నది. గాయత్రీ మంత్రంలో లాగా పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ భూతాలు, పంచ తన్మాత్రలు మొత్తం యిరవై అయితే - యిక గాయత్రీమంత్రార్థంలో చెప్పిన మనో బుద్ధి చిత్త అహంకారాలు నాలుగింటిని అమ్మ 'మనస్సు' అనే ఒకటినే చేసిందేమో ననిపిస్తుంది. అందుకే ఈ మంత్రంలో మొత్తం ఇరవై ఒక్క

అక్షరసముదాయమే భాసిస్తున్నది. ఈ మంత్రం గురించి ఆ ముస్లిం సోదరుడు ప్రవచించాడు "ఇందులో నా ప్రయోజనం ఏమీ లేదు ఇది నాకు అమ్మ వినిపించిన మంత్రం" అని.

ఆ మంత్రంలో కూర్చబడిన నామాల్లో కడా మనకు అత్యద్భుతమయిన ఒక అనుక్రమణిక, ఒక రామణీయకత ద్యోతికతమవుతాయి.

మొదటి నామం - మాత. మాత అంటే ఏజీవికైనా శరీరాన్ని ఇచ్చేది. దానికి ఆహారపానీయాలు అందించేది. అంటే శారీరక పోషణ చేసేది. ఎవరికైనా 'శరీరమాద్యం ఖలుధర్మసాధనం'. కనుక అందుకు ఆధారభూతమైన మాతకు ప్రప్రథమస్థానం లభించింది.

రెండవ నామం - అనసూయ. ఈ పేరుకు అర్థాన్ని అమ్మేవివరించింది. రాగద్వేషాసూయలను పారద్రోలేదే అనసూయ అట. మనషికి పరమ శత్రువు అశాంతి. అశాంతికి బీజాలు రాగద్వేషాసూయలు. వీటిని రూపుమాపితేనేగానీ మనస్సు పవిత్రం కాదు, వికాసం పొందదు. అపుడుగానీ మనిషికి నిజమైన పురోగతి లేదు. అందుకే అమ్మ అది తన తత్వంగా అభివర్ణించుకొన్నది.

మరి, అమ్మ - నిరాగా, రాగమథనా, నిర్మదా, మదనాశినీ, నిర్మోహా, మోహనాశినీ, నిర్మమా, మమతాహంత్రీ, నిష్క్రోధా, క్రోధనాశినీ, నిర్లోభా, లోభనాశినీ... కదా !

మూడవ నామం - రాజరాజేశ్వరి. అంటే ఈ సర్వ ప్రపంచానికీ అధికారిణి. అమ్మ శ్రీ మహారాజ్ఞి, శ్రీమత్ సింహాసనేశ్వరి, భువనేశ్వరి, సర్వలోకేశి, సర్వలోక వశంకరి, చతురంగబలేశ్వరి, మహాసామ్రాజ్యశాలిని, ఉద్దామ వైభవ. రాజపీఠ నివేశిత నిజాశ్రిత, సామ్రాజ్యదాయిని కదా ! మనిషి కోరుకునే సర్వాధికారాలకూ, సర్వ సౌఖ్యాలకూ అధికారిణి అమ్మేనని ఈ నామంలో జ్ఞాపకం చేసుకుంటాము.

ఇక చివరి నామం - పరాత్పరి. అంటే అన్నిటికంటే పరమమైనది. ఉత్కృష్టమైనది. ఇంతకంటే ఉత్తమ మయినది లేదు. ఇది సర్వవ్యాపక శక్తిని సూచిస్తుంది

ఈ విధంగా సోపానక్రమంలో నాలుగు నామాలు చెప్పి - ఆ అమ్మకు జయమగుగాక ! - అంటున్నాము. అందులో ప్రార్థన ఉన్నది. ఆకాంక్ష ఉన్నది ఆశీస్సున్నది.

ఆశీస్సు పలకడంలో ఉపాస్యదేవతకూ ఉపాసకునికీ అభేదస్థితి సూచితమవుతున్నది. మరి నరనారాయణులూ, జనజనార్ధనులూ, మానవ మాధవులూ ఒకరే కదా ! తల్లీ బిడ్డలకు మాత్రం అంతర మేమున్నది ? 'ఆత్మావై పుత్రనామాసి' కదా !

ఆ అమ్మకు జయమగుగాక ! ఆ తల్లికి మంగళం అగుగాక ! ఆ దేవికి సర్వశుభాలు చేకూరుగాక !

అమ్మ నామపారాయణప్రీత ! నామపారాయణాభీష్టఫలద ! ఒక్కసారి పిలిస్తేనే రాకుండా ఉండలేని జాలిగుండె కలది అమ్మ 'అడక్కుండా అమ్మయినా పెట్టదు'' అన్న నానుడిని "అడక్కుండా పెట్టేదీ అమ్మ'' అని మార్చి వేసిన వాత్సల్యామృతవర్షిణి అమ్మ - మనం నామపారాయణచేస్తే మన - వద్దకు రాకుండా ఉంటుందా ? ఉండగలుగుతుందా ? "ఏ చీర అయినా నేను కట్టుకునే కంటే మీరు కట్టుకుంటేనే బాగుంటుంది'' అనే అమ్మ, "మీరు తింటే నేను తిన్నట్లే'' ననే అమ్మ తన సంపదను తన గుణాలను మనకు పంచియివ్వదూ ?

అందుకే అవి కావాలంటే మనం అమ్మ నామపారాయణ చేయాలి. అందరం చేస్తే.....? అహర్నిశం చేస్తే ? అమ్మ అహర్నిశం అంతటా సుప్రసన్నయై సాక్షాత్కరించదూ ? అమ్మ ఉన్నచోట లేనిదే ముంటుందీ ? అపుడు, ఈ లోకమే బృందావనమై పోదూ ? అంతటా పరమశాంతీ, ఆనందమూ వెల్లివిరియవూ ?

నామపారాయణమే అమ్మకు ఘన స్వాగతం ! అమ్మకు ఆహ్వాన గీతం !!

(ఏప్రిల్ 1984)



## అదే యిది

దైవం సృష్టి చేయటం కాదు, దైవమే సృష్టిగా మారాడు. అదే యిన్ని రూపాలుగా వచ్చింది. ఇదంతా 'అదే'. ఇహ పరాలు రెండు కావు. లౌకికమనీ పారమార్థిక మనీ రెండు లేవు.

- అమ్మ

# 183
# అందరూ దైవస్వరూపాలే !

ప్రతి మే 5వ తేదీన మనం జిల్లెళ్ళమూడిలో అమ్మ కళ్యాణ దినోత్సవం జరుపుకుంటాము. అమ్మ కల్యాణం అంటే లోక కల్యాణమే గదా ! అందుకే ఆ రోజున మనం అమ్మకు విశేషపూజలు జరుపుకున్నా - అమ్మ మన యోగక్షేమాల కోసం ఏదో ఒక కార్యక్రమం సంకల్పిస్తుంటుంది. అది సంవత్సరానికో రూపంలో అద్భుతావహంగానే ఉంటుంది.

ఈ సంవత్సరమూ అమ్మ మన ఊహకు కూడా అందని విధంగా కార్యక్రమాన్ని రూపొందించింది.

మే 5వ తేదీన సాయంకాలం 6 గంటలకల్లా పూజామందిరం నేత్రపర్వంగా అలంకరించబడ్డది. జిల్లెళ్ళమూడి గ్రామంలోని స్త్రీలు పురుషులు, బాలబాలికలు.. అందరూ కలిసి షుమారు వెయ్యిమంది వచ్చి పూజామందిరంలోనూ, వెలుపలనూ తిరుగుతూంటే వాళ్ళ ముఖాల్లో కళ్ళల్లో వెలిగే ఆనంద జ్యోతులతో, ముసిరే చీకట్లు పోరాడలేక ఎక్కడకో మూలమూలలకు వెళ్ళి దాక్కుంటున్నాయి.

అమ్మ వచ్చి వేదికపై సుఖాసీన అయింది.

వసుంధరక్కయ్య, డాక్టర్ ఇనజకుమారి, శ్రీమతులు లతిక, బ్రహ్మాండం శేషు, కోనరాజ్యం, కుమారి రమాదేవి, వనజప్రభృతి ఆవరణంలోని స్త్రీలు, అందునా అమ్మకు అంతరంగికమైన నారీజనం గ్రామంలోని ఆడవాళ్ళను సాదరంగా లోపలకు ఆహ్వానించి వాళ్ళ పాదాలకు పసుపు రాసి, ముఖాన కుంకుమ బొట్టుపెట్టి, మెడలకు గంధం అలిది, చేతులకు గాజులు వేసి, జడల్లో మల్లెపూల చెండ్లు తురిమి అందరినీ అలంకరించారు.

గ్రామస్థుల్లో అన్ని కులాల వాళ్ళూ, అన్ని అంతస్తుల వాళ్ళూ ఉన్నారు. హరిజనులున్నారు యాదవులున్నారు. బోయలున్నారు. ముస్లిములున్నారు. కూలిచేసుకుంటేగానీ రోజు గడవనివాళ్ళున్నారు. వాళ్ళందరూ వసుంధరక్కయ్య వాళ్ళ పాదాలు పట్టుకుని పసుపు రాస్తుంటే మొదట అంగీకరించలేదు, కానీ అది అమ్మ ఆదేశం అని చెప్పి వదలకు పోయేసరికి గ్రామస్థులకూ అంగీకరించక తప్పలేదు.

ఆ కార్యక్రమం పూర్తి కాగానే మైకులో ఒక్కొక్క కుటుంబ పెద్దపేరు చదువుతుంటే - ఆ కుటుంబంలోని అందరు సభ్యులేకాక ఆ ఇంటికి వచ్చిన బంధువులుకూడా వేదికపైకి అమ్మ వద్దకు వచ్చారు. మగవాళ్ళకు - పెద్దలయితే ధోవతి, ఉత్తరీయం, ఆడవాళ్ళకు చీర, రవికల గుడ్డ, మగపిల్లలకు నిక్కరు, చొక్కా, ఆడపిల్లలకు లంగా, జాకెట్ గుడ్డలు అమ్మ చేతిమీదుగా స్వయంగా ఇచ్చింది. చంకలో పసిపిల్లను మరిచిపోతే - ఆ పిల్లకు ఒక జాకెట్ గుడ్డ ఇవ్వండి - గౌను కుట్టిస్తారు - అంటూ పేరు పేరునా కొత్త గుడ్డలు పెట్టింది.

అంతకు క్రితం రోజున ఎంతో అనారోగ్యంతో ఉన్న అమ్మ - ఈ ఉత్సవం ఎట్లా ముగుస్తుందా - అని నిర్వాహకులకు ఆందోళన కలిగించింది. కానీ ఆ గుడ్డలు పంచడానికి మొత్తం మూడు గంటలు పైగా పట్టినా అమ్మలో ఏ మాత్రం అలసట కనిపించకపోగా అమ్మలోని పెల్లుబికిన ఉత్సాహాన్నీ, చలాకీ తనాన్ని చూసి మేము ఆశ్చర్యపోయాము.

అందరికీ గుడ్డలు పంచడం అయిన తర్వాత అమ్మ అందరినీ కొత్తగుడ్డలు కట్టుకు రమ్మన్నది. అందరూ కట్టుకు వచ్చారు. అందరూ కొత్తగుడ్డలు కట్టుకుని పసుపు కాళ్ళతో, మెడల్లో గంధాలతో తిరుగుతుంటే ఆ పందిళ్ళు పెళ్ళి పందిళ్ళవలె కళకళలాడి పోయాయి.

అపుడు అందరికీ విందు జరిగింది.

వాళ్ళవద్దనే అమ్మ కుర్చీలో కూర్చున్నది. ఆ బంతిలో విస్తళ్ళలో అన్నం వడ్డించమనండి - అని సలహాలు చెబుతూ, లడ్లు అందరికీ అందినయ్యో, లేదో కనుక్కోనండి - అని అందరి యెడల శ్రద్ధను కనబరుస్తూ, మామిడిపండ్లు ముక్కలు ఎక్కువగా వెయ్యండి. కొందరు కొనుక్కుని తినలేరు.... అని చెబుతూంటే - అమ్మ మాతృవాత్సల్యం కార్తీక పూర్ణిమనాటి వెన్నెలవలె అందరినీ ఆహ్లాద పరిచింది.

గ్రామస్థులందరూ తృప్తిగా భోజనం చేయగానే అందరికీ అమ్మ దగ్గరుండి తాంబూలాలు ఇప్పించింది

అందరిముఖాల్లో వెలిగిన సంతృప్తినీ, ఆ ఆనందదీప్తినీ చూడవలసిదే !

మరునాడు సాయంకాలం గ్రామంలోని పశువులన్నిటినీ అమ్మ నివాసానికి పడమరగా ఉన్న ఖాళీస్థలంలో మందవేసి - సంగం జాగర్లమూడి నుండి ప్రత్యేకంగా తీసుకువచ్చిన దాణా వాటన్నిటికీ మేపడం జరిగింది. గ్రామంలోని గేదెలు, దున్నలు, ఆవులు, మేకలు, గొఱ్ఱెలు అన్నీ వెయ్యికి పైగా అక్కడకు చేరాయి. అదృశ్యం ఎంతో మనోహరంగా ఉంది.

అమ్మ ఆ పశువుల వద్దకు వచ్చి, పశువుల స్వంతదారులందరినీ పశువులు ఎట్లా ఉన్నదీ, వాటి ఆరోగ్యం ఎట్లా ఉన్నదీ, అవి ఎట్లా మేస్తున్నదీ విచారించింది.

ఆ పశువులవద్ద సన్నాయిమేళం పెట్టించమని అమ్మ సలహా ఇచ్చింది. వాటి కెందుకమ్మా సన్నాయిమేళం ? - అని అడిగితే "మనకంటే సంగీతం అవే ఎక్కువగా విని ఆనందిస్తాయి. శిశుర్వేత్తి, పశుర్వేత్తి..... అని వినలేదా ? అని అమ్మ జ్ఞాపకంచేస్తే మేము సిగ్గు పడ్డాము.

విందు మనుషులకేనా ? అందరికీ జరగాలి... అని అమ్మ అన్నప్పుడు అమ్మ సర్వమాతృత్వం మనకు ఇంకొకసారి ప్రస్ఫుటమైంది. అమ్మ యెడల మన భక్తిభావం మరింత పెరిగింది.

గ్రామస్థులందరికీ విందుచేయాలి - అని అమ్మ చెబుతూనే "అదేదో మీరు గొప్పవాళ్ళై వారికి పెట్టడంలేదు. మీరు ఎప్పుడు ఎవరికి అన్నం పెట్టినా - అది భగవంతుడికి మీరు చేసే నివేదనగానే భావించాలి. వచ్చిన వాడు మీ దయా దాక్షిణ్యాలపై ఆధారపడ్డవాడు దీనుడు కాదు, మిమ్మల్ని ఉద్ధరించడానికి వచ్చిన దైవస్వరూపుడు. అతణ్ణి మనసారా ఆరాధించాలి" అని వివరిస్తూ - ఆ ప్రక్రియలన్నిటినీ ఆదేశించింది. ఆవరణలో మరీ పెద్దవాళ్ళుగా అనుకునేవాళ్ళనే ప్రత్యేకంగా వాళ్ళపాదాలకు పసుపు రాయమన్నది. ముఖాన బొట్టు పెట్టడం పిల్లలు చేసినా ఫర్వాలేదని చెప్పింది.

ఆ వివరణలో, మనకు ఇచ్చే ప్రబోధంలో శిక్షణలో అమ్మకు ఎంత జాగ్రత్త - అనిపించింది.

అందరిలోనూ దైవాన్ని చూడాలి - అనేది అమ్మ ప్రవచనం. ఆనాడు ఆ ప్రవచనం ఆచరణంలో సాక్షాత్కరించింది. క్రియాత్మకంగా అమ్మ మనకు ఒక గొప్ప పాఠం చెప్పింది.

అమ్మ ఎప్పుడూ గొప్ప గొప్ప పాఠాలు చెబుతూనే ఉంటుంది. మనకే అవి జీర్ణం కావు; రక్త గతం కావు, నీటి మీది వ్రాతల్లాగానే అవుతున్నాయి.

"నేను ఎప్పుడూ మీలో దైవత్వం చూస్తాను. మీరు నాలో మానవత్వం చూస్తారు' - అన్న అమ్మ ప్రవచనం అక్షరశః సత్యం.

మన దృష్టిని మార్చడానికే అమ్మ నిరంతర ప్రయత్నం :

ఎదుటి వాడిలో దైవత్వం చూస్తున్నంత సేపూ మనలో దైవత్వం మేలు కుంటుందట.

ప్రసుప్తమయిన మనలోని దైవత్వాన్ని జాగృతం చేయడమే అమ్మ కార్యక్రమం!

మనలో దైవత్వాన్ని అవలోకించడం అమ్మ లక్షణం ! మన దైవత్వాన్నీ, అందరిలోని దైవత్వాన్నీ మనకు తెలియజేయడమే అమ్మ లక్ష్యం !!

(మే, జూన్ 1984)



# 184
# అమ్మ సాన్నిధ్యం

ఎందరో నిత్యమూ అమ్మను దర్శించేందుకు ఎంతెంత దూర తీరాలనుండో వస్తూ ఉంటారు. వచ్చే వాళ్ళల్లో అనేకులకు అనేక సందేహాలూ, భయాలూ, మనస్సునిండా అశాంతీ అందుకనే అమ్మ అన్నది "ఏ కష్టంలేనివాడు ఎవరూ ఈ మేడమెట్లు ఎక్కడూ" అని

కానీ యదార్థమూ, విచిత్రమూ ఏమిటీ అంటే - ఎన్నో సందేహాలతో సతమవుతూ వచ్చినవాడు, అమ్మను ఏవేవో ప్రశ్నలను అడుగుదామని మేడమెట్లు ఎక్కుతూకూడా రిహార్సల్సు వేసుకున్నవాడు అమ్మ వద్దకు వచ్చి అమ్మ సన్నిధిలో కూర్చోగానే వాడి సందేహాలూ, ప్రశ్నలూ మటుమాయమైపోతాయి - సూర్యరశ్మికి మంచు కరిగినట్లూ, సూర్యోదయంతో చీకట్లు పారిపోయినట్లూ.

భయాలూ అంతే.

పెనుతుఫానులో కల్లోలితమయిన సముద్రంలో కకావికలయిన మనస్సు స్థిమితపడుతుంది. ఉత్తుంగ ఆలోచనా తరంగాలు ఉపశమిస్తాయి.

ఇంకా కొందరు వస్తుంటారు. వారు బయట ప్రపంచంలో అమ్మను గురించి ఏవేవో విని ఉంటారు. వారికి అమ్మ స్థితిని గురించి అన్నీ అనుమానాలే. దానిలో వారి మనస్సునిండా అమ్మను గురించిన విమర్శాత్మక భావాలే. అందువల్ల అమ్మ అంటే ద్వేషం ఏర్పరుచుకుంటారు. అసభ్యకరమైన దూషణలు చేస్తూ ఉంటారు. ఆ భావాల బరువు మోయలేక, ఆ వత్తిడి తట్టుకోలేక అమ్మవద్దకు వెళ్ళి అమ్మను 'దులిపెయ్యాలి' అనే దృఢనిశ్చయంతో వస్తారు. వాళ్ళు అమ్మను చూసి, అమ్మతో సంభాషణ చేస్తారు. వారి భావాలే తారుమారవుతాయి. వారి అభిప్రాయాలే మారిపోతాయి. విచిత్రంగా వారు అమ్మకు పాదాక్రాంతులవుతారు; అమ్మకు అభిమానులు అవుతారు; అమ్మకు భక్తులవుతారు.

అందుకే అమ్మ అన్నది "విన్న వాడు విమర్శిస్తాడూ; కన్నవాడు వివరిస్తాడూ" అని. ఇంకొకమారు అన్నది "వింటే విమర్శ కానీ, కంటే విమర్శ లేదూ" అని.

అమ్మదర్శనంలో ఒక మహత్తు ఉన్నది. అమ్మ దర్శనంలోనే మనకు కనిపించని, మనకు అర్థంకాని ఒక చికిత్సా ప్రక్రియ ఉన్నది, దివ్యౌషదమున్నది. ఆ సాన్నిధ్యంలోనే, అమ్మను పరివేష్టించిన ఆ వాతావరణంలోనే, అమ్మ ఉనికివల్ల అతి పవిత్రమయిన ఆ ఆవరణంలోనే వియద్గంగా తరంగాలు అదృశ్యమై ప్రవహిస్తుంటాయి ఆ అవనీభాగం అమృతలహరులతో అనుక్షణం అభిషిక్తమవుతూ ఉంటుంది. అమ్మ ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో పునీతమూ, పులకితమూ అయిన ఆ వాయుతరంగాల్లోనే అంతర్లీనంగా దివ్యవిద్యుత్ ప్రసారాలుంటాయి. అమ్మ కన్నుల కాంతులతో ప్రకాశమానమూ, ప్రభావితమూ అయిన ఆ పరిసరాల్లో అణువణువు లోనూ నిక్షిప్తమై అద్భుత సంజీవనులుంటాయి, నిగూఢమై పరుసవేదులుంటాయి.

అమ్మ నివసించే గదిలో తథాస్తుదేవతలు ఉంటారు. తపస్సు చేసుకుంటూ ఉంటారు. మనం ఆ సన్నిధిలో కూర్చుని ఏమి కోరినా వారు "తథాస్తు" అంటారు. అందువల్లనే అమ్మ 'కామితార్థ ప్రదాయిని'గా ప్రసిద్ధమయింది !

ఆ సన్నిధిలో కోటి సుధాంశులున్నారు. వెన్నెల మడుగులున్నాయి. అందుకనే అంత చల్లదనం !!

అమ్మసన్నిధిలో కొద్ది క్షణాలు కూర్చునేటప్పటికే - మనలో అప్పటిదాకా ఎగిరెగిరిపడ్డ అహంకారమూ, అహంభావమూ కుప్పకూలి పోతాయి. ఎదురుగా కళ్ళెదుట సముద్రంకన్న లోతుగా, ఆకాశంకన్న విశాలంగా, హిమాలయంకన్న ఉన్నతంగా - భౌతికమైన కనులకు కనిపించే పరిమితమయిన రూపాన్ని ఆశ్రయించు కుని ప్రజ్వలించే అనంతమయినశక్తీ, ఆత్మా స్ఫురించి దానిని అర్థంచేసు కోవడానికి చేసే ప్రయత్నంలో అల్పమయిన మన మనస్సు మూగవోతుంది. మన ఆత్మ సంకుచిత మవుతుంది మన అహం నీరు కారిపోతుంది. మన గుణాలు అణగారి పోతాయి. మన అల్పత్వం మనకు సుబోధకమౌతుంది.

ఆ సన్నిధిలో వికారాలకు చోటు లేదు. మనస్సు నిర్మలమవుతుంది. సుప్రసన్నమవుతుంది. అతి ప్రశాంతమవుతుంది.

ఆ సన్నిధిలో మహతీ సుస్వరాలున్నాయి. ఆ స్వరాల్లో మనిషికి కావలసిన సర్వ వరాలున్నాయి.

ఇక అమ్మతో సంభాషణ అంటే - అది సహస్ర గ్రంథ పఠనం కన్న అధిక ఫలప్రదమయింది మనిషి ఒక జీవిత కాలమంతా ప్రయాసపడి ప్రయత్నించినా సంపాదించలేని జ్ఞాన విజ్ఞానాలు అమ్మతో 'పిచ్చాపాటీ' మాట్లాడడంవల్ల సులభసాధ్యాలవుతాయి. అనంత జ్ఞాన సముపార్జనతో కలిగే అనుభవమూ, అనుభూతీ కేవలం అమ్మ అనుగ్రహ వీక్షణవల్లా, సంకల్ప మాత్రం వల్లనే కలుగుతున్నాయి.

అందువల్లనే - ఆ రుచీ, ఆనందమూ; ఫలమూ, ప్రభావమూ అనుభూత మయిన వారు - అమ్మదర్శనాన్నీ అమ్మ సాన్నిధ్యాన్నీ అంతగా ఆకాంక్షిస్తున్నారు. పలుసార్లు అమ్మ దర్శనానితోకూడా సంతృప్తి పడలేనివారు ఆ సాన్నిధ్యంలో నివాసాన్నే కోరుకుంటున్నారు. ఆ అభిలాషలోనే అనేక వ్యక్తులూ, అనేక కుటుంబాలూ అక్కడ స్థిరపడ్డాయి.

ఇంకా ఎందరో స్థిరనివాసం ఏర్పరుచుకోవాలని కుతూహల పడుతున్నారు, తహతహలాడుతున్నారు.

అనంతమయిన కాలంలో చాలా చాలా అరుదుగా ఎప్పుడోగానీ, సర్వవ్యాప్త మయిన అనంతశక్తి ఒక నామాన్నీ ఒక రూపాన్నీ ఆధారం చేసుకుని మానవాళిని అనుగ్రహించదు. మరి, అరుదైన ఆ సంఘటనే సంభవమయితే అది ఎంత విశేషం ! ఆ కాలంలోనివారు ఎంత అదృష్టవంతులు ! ఇక ఆ సాన్నిధ్యంలో నివసించగలిగేవాళ్ళు ఎంత ధన్యులు !!

(జులై 1984)



## బ్రహ్మానందం

ఏది వచ్చినా సమంగా చూడగల గాఢమైన మార్పులేని భావవే బ్రహ్మానందం. రెండూ అదే అనుకొనే భావం స్థిరమైనప్పుడు కలిగేది ఏదో - అదే బ్రహ్మానందం.

- అమ్మ

# 185
# అన్నపూర్ణాలయం

ఆగష్టు 10వ తేదీన విజయనగరం నుంచి వచ్చిన ఒక కుటుంబం వారి పిల్లవానికి అమ్మచేత అక్షరాభ్యాసం చేయించుకుంటున్నారు. పలకా బలపాలతో పాటు అమ్మకు నివేదన చేయటానికి చాక్‌లెట్లు కూడా తీసుకు వచ్చారు.

అక్షరాభ్యాసం అయింది. 'ఓం' అక్షరం తాను వ్రాసి, పిల్లవాని చేత దిద్దించి, తాను పలికి పిల్లవానిచేత పలికించింది అమ్మ.

మన దృష్టిలో ఆ కార్యక్రమం అంతతో పరిసమాప్తమయింది. కాని అమ్మదృష్టిలో అసలు కార్యక్రమం ముందే ఉన్నది. పిల్లవాని చేతిలోని పలకా బలపమూ తీసుకుని పిల్లవాని తల్లికి అందించింది అమ్మ. ట్రేలో పోసి ఉన్న చాక్‌లెట్లలో ఒకటి తీసుకుని పిల్లవాని నోటికి ప్రేమగా అందించింది. వాడు దానిని సంతోషంగా చప్పరిస్తూ ఉండగా అమ్మ వాడి దోసిలినిండా చాక్‌లెట్లు పోసి - అందరికీ పంచమన్నది.

పిల్లవాడు వాటిని అందరికీ పంచుతుండగా అమ్మ ఆనందంగా చూస్తూ "ఇదే అసలు అక్షరాభ్యాసం. జీవితంలో నేర్చుకోవలసిన ప్రథమ పాఠం, ప్రధాన పాఠం ఇదే" నని అంటూ "తనకున్న దానిని అందరకు అట్లా హాయిగా పంచుతుంటే ఎంత ఆనందంగా ఉంటుందీ ?" అని ప్రశ్నించింది.

ఇదే అమ్మ మనకు అనుక్షణమూ అందిస్తున్న సందేశ సారం. ఈ త్యాగమే అమ్మ జీవితంలో వేయిరేకులుగా విరిసి అమ్మ జీవితాన్నే దివ్యపరిమళ భరితం చేసింది !

ఈ విశిష్ట భావాన్నే త్యాగమూర్తి అయిన అమ్మ ఒక సందర్భంలో అతి తీవ్రమయిన భాషలో మనకు అందించింది. "పంచనికాడికి ఉండడం దేనికీ ?" అని ప్రశ్నించింది. మనకు భగవంతుడు ఏమి ఇచ్చినా దానిని నలుగురితో కలిసి పంచుకొనడానికే గానీ తాను ఒక్కడే అనుభవించడానికి కాదని అమ్మ అభిప్రాయం.

ప్రకృతి ప్రసాదించిన యావత్ సంపదనూ మానవకోటి సమంగా పంచుకో గలిగితే ప్రపంచంలో దారిద్ర్యం అనేదే ఉండదని అమ్మ భావన. అది అందరికీ సమంగా అందడమే లోక కల్యాణమని అమ్మ నిర్వచనం. కొద్ది మందిలో వెఱ్ఱితలలువేసే స్వార్థమే లోకంలోని అశాంతికీ, అకృత్యాలకూ ఆధారం అని అమ్మ ప్రవచనం.

ఈ స్వార్థమే మానవుణ్ని మానవత్వాన్నుండి దిగజారుస్తున్నదనీ, త్యాగమే మానవుణ్ణి దివ్యత్వానికి అధిరోహింపజేస్తుందనీ అమ్మ బోధ.

కనుకనే మనలోని స్వార్థాన్ని తుడిచేసి త్యాగభావాన్ని మనలో ఉద్దీపింప జేయడానికి అమ్మ అహర్నిశమూ అనేక విధాల ప్రయత్నిస్తున్నది.

"నీకున్నది తృప్తిగా నీ వనుభవించి, ఇతరులకు ఆదరణగా పెట్టు -" అన్న సందేశాన్ని అమ్మ మనకు ఎన్ని రీతుల్లో అందించిందో !

ఒక సందర్భంలో సోదరి వసుంధరతో చెప్పిన రహస్యం నిజానికి లోకానికే సందేశం. తాను స్నానంచేసిన తరువాత కట్టు కోవడానికని దాచిన ఒకే చీరెను తడిసిన చేరెతో నిలుచున్న ఒకావిడకు ఇవ్వడానికి తీసుకుని వెళుతూ అమ్మ అన్నది "మన దగ్గర ఉన్నది ఇతరులకు ఇస్తేగానీ మనకు క్రొత్తవి రావు" అని. మనం అనుకుంటాము - క్రొత్తనీళ్ళు వచ్చి, పాతనీళ్ళను పంపించాయని. అమ్మ సిద్ధాంతంలో ముందు పాతనీళ్ళు పోవాలి. తర్వాతనే క్రొత్తనీరు.

తాను స్నానం చేస్తే చీరె మార్చుకోవడం వర్తమాన సమస్య కాదు. తడిసిన చీరెలో ఉన్నావిడ పొడిచీరె కట్టుకోవడం తక్షణ అవసరం. కాబట్టి ఉన్న ఒక చీరెను ఆమెకు ఇవ్వడమే సముచిత నిర్ణయం అమ్మ దృష్టిలో.

ఇవ్వాళ ఆకలి మంటల్లో దహించుకుని పోతున్న పక్కవాడిని నిర్దయగా విధికి వదిలేసి రేపటికి తనకోసం దాచుకోవడమే ప్రపంచంలోని ఘర్షణలన్నిటికీ మూలంకదా ! మనిషిలో దినదినాభివృద్ధి పొందుతున్న ఈ పైశాచిక గుణాన్ని మార్చడానికే అమ్మ ప్రయత్నిస్తున్నదని అమ్మ బోధల వల్ల మనకు సువిదిత మవుతుంది.

అందుకే అమ్మ అనేక పర్యాయాలు తనను గురించి వివరిస్తున్నట్లుగానే కనిపిస్తూ - మనకు బోధించింది. "పంచడమేగానీ దాచుకోవడం నాకు తెలీదు" అని.

ఇటీవల ఒక రోజున అమ్మను అడిగాను । "అమ్మా - నీవు ఈ భూమి మీదకు వచ్చి అప్పుడే అరవై ఒక్క సంవత్సరాలు నిండాయి. నీకు 'అన్నపూర్ణాలయం' విషయం ఆలోచించడంలోనే కాలమంతా సరిపోతున్నది. అన్నం తినమని మాకు చెప్పడమే నీ కర్తవ్యం అయింది. ఈ అన్నపూర్ణాలయ నిర్వహణతో నీ అసలు కార్యక్రమం మరుగున పడిపోయిందమ్మా" అని.

"అసలు కార్యక్రమం అంటే ?" అని అమ్మ ప్రశ్నించింది

"తెలియంది తెలియజెప్పడానికే నా ఈ రాక - అని నీవు చిన్నతనంలోనే వివరించావు గదమ్మా ! నీవు జ్ఞానస్వరూపిణివి. అజ్ఞాన ప్రదాత్రివి. మరి, మాకు తెలీని విషయాలెన్నో నిగూఢంగా ఉన్నాయి. వాటిని మాకు చెప్పవద్దా అమ్మా ! మాకు భౌతికమయిన ఆకలిని తీరుస్తున్నావు, బాగానే ఉంది. మానసికమయిన జిజ్ఞాసనుకూడా తృప్తి పరచాలి గదా అమ్మా -"

అంటూ నా అభ్యర్ధనను పొడిగించాను "నీవు జగజ్జనివి మాత్రమే కాదమ్మా! జగద్గురువు కూడా. మరి, ఆ పాత్రకు కూడా న్యాయం చేకూర్చాలి."

నేను చాలా బాగా మాట్లాడాను అనుకున్నాను.

వెంటనే అమ్మ అన్నది - ఒక్క క్షణం వృథాపోనీకుండా.

"ఇది అది కాకపోతేగదా, నాన్న !"

వెంటనే ఆ సమాధానంలోని పరమార్థం నా అల్పమేధకు అర్థం కాలేదు. అయోమయంగా అమ్మవంక చూశాను.

"మీకు పెట్టడం - అది గుడ్డ అయినా, అన్నమయినా - పెట్టడం మీకు నేర్పడానికే. జ్ఞానం అంటే మాటలుకావుగా," అంటూ "నేను చేయకుండా మీకు చెప్పకూడదుగా. అందుకే ఈ అన్నపూర్ణాలయం....." అన్నది అమ్మ చిరునవ్వుతో.

అన్నపూర్ణాలయాన్ని ఆధారం చేసుకుని మానవతపై అమ్మ ఎంత మమతను కురిపిస్తున్నదీ ? ఎన్ని మహిమలను ప్రకటిస్తున్నదీ ??

గుణభేదమే లేని నాకు కులభేద మేమిటీ ? - అని ప్రశ్నించి సర్వాతీతమయిన తన పరమాద్వైత పరమోత్కృష్ట పరమోన్నత స్థితిని ప్రవచించిన అమ్మకు ప్రతిరూపమే అన్నపూర్ణాలయం !

వర్గాలకూ, వర్ణాలకూ, కులాలకూ, మతాలకూ అతీతంగా అందరూ ఒకే పంక్తిన అన్నపూర్ణాయంలో ఆసీనులై భోజనంచేసే దృశ్యం సుందరమే కాదు, సర్వ జగతికీ ఆదర్శం కూడా !

అన్నపూర్ణాలయంలో ఎవరికి అన్నం పెట్టాలి ? - అన్న విచికిత్స జరిగినపుడు.

"వాడు సన్మార్గుడా, దుర్మార్గుడా - అని ఆలోచించవద్దు; వాడు ధనికుడా, బీదవాడా - అని ఆలోచించవద్దు; వాడి కులమూ, మతమూ గురించి ఆలోచించవద్దు; వాడి ఆకలిని చూసి మాత్రమే అన్నం పెట్టండి" అని అమ్మ ఇచ్చిన ఆదేశం మానవతకే పతాకస్థాయి.

మరి, ఈ అగష్టు 15కు అమ్మ అన్నపూర్ణాలయం అనే ఈ బోధనాలయం స్థాపించి 26 సంవత్సరాలు నిండాయి. ఎంత మందికి అమ్మ చెబుతున్న పాఠం అర్థమయిందో మనమే ఆత్మ పరీక్ష చేసుకోవాలి.

పాఠం బోధించడమే కాదు, పాఠం అర్థం చెయ్యవలసిన బాధ్యతకూడా అమ్మదే

తెలియ జెప్పేవాడు గురువు !

తెలియ జేసేవాడు దైవం !!

(అగష్టు 1984)



## ప్రయత్నం

నాకు తెలిసింది ఒక్కటే. ఏది ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది. మన ప్రయత్న మేమీ లేదు. మానవ ప్రయత్నానికి ప్రేరణ కల్పించే శక్తి మరొకటి ఉందనీ అది ఎట్లా చేయిస్తే అట్లా నడుస్తున్నామనీ అనిపిస్తుంది.

\- అమ్మ

# 186
# తీర్థ ప్రసాదాలు

సెప్టెంబరు 21వ తేదీ ఉదయం. గోవాడ నుంచి వచ్చిన అనసూయమ్మ గారనే అక్కయ్య అమ్మకి బొబ్బట్లు నివేదన చేసింది. అమ్మ ఆ బొబ్బట్లను అక్కడ కూర్చున్న అందరికీ పంచమన్నది. ఆమె అందరికీ పెడుతూ నాకూ పెట్టింది. నేను వెంటనే అందుకోలేదు - నాకు డయాబిటిస్ ఉన్నందువల్ల తీపిపదార్థమైన బొబ్బట్లు వ్యాధిని పెంచుతాయని భయంతో అదే చెప్పాను. ఆ అక్కయ్య వెంటనే అన్నది "అమ్మ ప్రసాదం కదా. ఫర్వాలేదు. ఏమీ చెయ్యదు - తీసుకో" అని. నేను అమ్మవంక చూశాను. అమ్మ చిన్నగా నవ్వుతూ, "ఏమీ చెయ్యకపోతే, ఇంకా తినడమెందుకూ?" అన్నది. ఆప్రశ్నలో అది 'మేలు' చేస్తుందనే హామీ వినిపించి వెంటనే తీసుకుని తినేశాను.

మధుమేహం వాళ్ళకు అమ్మ తీపి పదార్థాలు పెట్టడం చూశాను. కడుపులో పుండ్లు ఉన్న వాళ్ళకూ, గ్యాస్ట్రిక్ వ్యాధి ఉన్నవాళ్ళకూ అమ్మ ఆవకాయలాంటి అధిక కారం వున్న పచ్చడి అన్నం పెట్టడం చూశాను. వాటిపై అమ్మకున్న అధికార ప్రభావం వలన అవి వాటి సహజగుణాలను కోల్పోయి అమ్మ అనుగ్రహానికి ప్రతీక లవుతాయి. 'ప్రసాదం'ను నిర్వచిస్తూ అమ్మ చెప్పింది "అనుగ్రహం ప్రసారమయిన పదార్థమే ప్రసాదం" అని. మరి, అమ్మ ప్రసాదం అపకారం ఎందుకు చేస్తుంది ? అమ్మ ప్రసాదం సర్వ వ్యాధి ప్రశమన సామర్థ్యం కలదీ, సర్వ శుభప్రదమూ కదా !

మనం ఏదయినా పదార్థాన్ని దేవునికి నివేదన చేసినతరువాత - తిరిగి అది మనకు ఇవ్వబడినప్పుడు దానిని 'ప్రసాదం' అంటాము.

మనం అమ్మదర్శనంకోసం వెళ్ళినపుడు, కొబ్బరికాయో, ఏవయినా పండ్లో తీసుకుని వెళ్ళి అమ్మకు సమర్పిస్తాము. అమ్మ వాటిని చేత్తో తాకవచ్చునూ, కంటితో చూడవచ్చునూ, చాలా అరుదుగా అందులో నుండి ఏ కొద్ది భాగాన్నో గోటితో గిల్లుకుని నోట్లో వేసుకొనవచ్చును. తిరిగి ఆ పండ్లనో ఆ పదార్థాన్నో

మనకు ఇచ్చి వేస్తుందీ. అమ్మ సంకల్పబలంవల్లనో, అనుగ్రహ విశేషం వల్లనో అది ప్రసాదమై అధికశక్తిమంత మవుతుంది. ఆ ప్రసాదం యొక్క లీలలు అత్యద్భుతాలు ! ఆ ప్రసాదం ఎందరి చీకటి బ్రతుకుల్లోనో శరత్ చంద్రికలను ప్రసరింపజేసింది. ఎందరి బ్రతకుటెడారులనో సస్యశ్యామలం చేసింది.

ఈ ప్రసాదపు కథలు గాధలు ఎన్నో ఎన్నెన్నో అనేకులు చెబుతుంటే మనం ఆశ్చర్యపోతుంటాము.

లీలావినోదిని అయిన అమ్మ మాత్రం అందుకు భిన్నంగా మాట్లాడుతుంది. అపుడపుడు సత్యానికి జలతారు తెరవేయడం అమ్మకు సరదా. తన శక్తిని మరుగుపరచడం, మనను మాయచేయడం అమ్మకు ఆట !

జూన్ 6వ తేదీన చీరాల నుండి ఒక అక్కయ్య వచ్చింది. అమ్మ దర్శనం చేసుకుని "మావారు ఆరోగ్యంగా ఉండేటట్లు దీవించమ్మా - రాత్రిళ్ళు రొప్పు, ఆయాసం వస్తున్నాయి" అన్నది. అమ్మ అరటిపండు ఇచ్చింది. ఆమె అమ్మను "ఇది ఆయనకు ప్రసాదంగా పెట్టనా ?" అని అడిగింది. అమ్మ వెంటనే అన్నది "డాక్టరును అడిగి పెట్టండి. ప్రసాదం అయినా గుణాన్ని మార్చలేదు కదా" అని.

ఒక్కొక్క పదార్థానికి ఒక్కొక్క పేరూ, ఒక్కొక్క ప్రత్యేక గుణమూ ఉండడం నిజమే కానీ - పదార్థం పరిణామం చెందిన తర్వాత అన్నిటికీ ఒకే గుణం, సద్గుణం. అన్నిటికీ ఒకే నామం; ప్రసాదం. అవి గ్రహీతకు శ్రేయస్సునూ, ఆరోగ్యాన్నీ, అభివృద్ధినీ మాత్రమే కలిగిస్తాయి.

నిత్యమూ జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయంలో చేసిన వంట అమ్మకు నివేదన చేయబడుతుంది. అందువల్లనే అన్నపూర్ణాలయంలోని అన్నం ప్రకృష్టమై ప్రసాదమై అంత మధురమూ, మహిమాన్వితమూ అయింది !

అమ్మను చూడడానికి వచ్చే వాళ్ళందరినీ "అన్నం తిన్నావా ?" అని అమ్మ అడుగుతుంది. కానీ కొందరు ఎక్కడనో అన్నం తినివస్తారు. "అది భోజనం నాన్నా, ఇది ప్రసాదం. కొద్దిగానయినా తిను -" అని బతిమిలాడి తినిపిస్తుంది. ఆ ప్రసాదం అందరూ భుజించి ఆ లాభం అందరూ పొందాలని అమ్మ అభిలాష.

అమ్మకు అడిగితే మాత్రం "ఎవరూ ఆకలితో బాధ పడరాదనే నా కోరిక. మనిషికి ఆకలిబాధను మించిన మరో బాధ లేదనే నా అభిప్రాయం" అంటుంది అమ్మ.

అన్నపూర్ణాలయంలో భోజనం చేసిన అనేకులు తాము పొందిన ఆరోగ్యాన్నీ, ఐశ్వర్యాన్నీ వివరి..ని తమ విశ్వాసాన్ని ప్రకటిస్తే - "దీనికీ దానికీ ఏమీ సంబంధం లేదు నాన్నా. ఆ తరుణం వచ్చింది, ఆ మేలు జరిగింది" అని అమ్మ మనల్ని నిరుత్తరులను చేస్తుంది.

అనేక జటిల సమస్యలతో అమ్మ దర్శనానికి వచ్చిన అనేకులు ఒక్కొక్కరు అమ్మను సమీపించి తమ తమ సమస్యలను అమ్మకు విన్నవించుకుంటారు. విన్నపాలు విన్న అమ్మ ఒక్కొక్కరికీ ప్రసాదం ఇస్తుంది.

అర్థంగాని మనిషి అమ్మ ఏమయినా చెబుతుందేమో నని అమ్మ వంక ఆశగా చూస్తుంటాడు.

"ప్రసాదం ఇచ్చానుగా నాన్నా -" అంటుంది అమ్మ.

అప్పటికీ అర్థంకాక "ఏమయినా చెప్పమ్మా -" అని అడుగుతాడు.

"చెప్పటం చేతకాదు నాన్నా. ప్రసాదం ఇచ్చానుగా" అంటుంది అమ్మ, 'ప్రసాదం' అన్న పదాన్ని నొక్కుతూ.

తర్వాతగానీ అతనికి అర్థంకాదు, ఆ ప్రసాదంలో ఎంత శక్తి నిక్షిప్తమై ఉన్నదో!

ఆ ప్రసాదంలోనే - సందేహానికి సమాధానమూ, సమస్యకు పరిష్కారమూ, వ్యాధికి ఔషధమూ, బాధకు నివారణమూ..... సర్వ శుభాలూ మూటకట్టబడి ఉన్నాయి

ఆ ప్రసాదంగా 'కుంకుమ'ను అమ్మ ఎన్నుకోవడం కుంకుమ అదృష్టం అమ్మ ప్రక్కనే ఎప్పుడూ ఒక స్టీలు బకెట్ల నిండా కుంకుమ పొట్లాలు ఉంటాయి. అమ్మకు పూజచేసిన కుంకుమను అమ్మనామం (జయహో మాతా శ్రీ అనసూయా రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి) చేస్తూ కొందరక్కయ్యలు పొట్లాలు కడతారు.

అమ్మను చూడటానికి వచ్చిన వాళ్ళందరికీ ఆ కుంకుమ పొట్లాలనే ఇస్తుంది అమ్మ. ఆ పొట్లాల్లో ఉన్నది కుంకుమ అని అందరికీ తెలుసును కానీ - అమ్మ తన అనుగ్రహాన్నీ, ఆశీర్వచనాన్నీ, ప్రేమనూ అట్లా పొట్లాంకట్టి అందిస్తున్నదని కొంత మంది అదృష్టవంతులకు మాత్రమే తెలుసును !

ఒక రోజున అమ్మను అడిగాను "అమ్మా - నీవు ఒకరిని ఉద్దేశించి ప్రసాదంగా ఒక పండును నాకు ఇచ్చావు. నేను తీసుకుని వెళుతుండగా దారిలో దానిని

పోగొట్టుకున్నాను అది మరొకరికి దొరికింది. అతడు దాన్ని తిన్నాడు. ఆ ప్రసాదఫలితం ఎవరికి దక్కుతుంది ?'' అని వెంటనే అమ్మ అన్నది ''ఇద్దరికీ -'' అని. ''అంటే సంకల్ప మాత్రం చేతనే మొదటి వానికీ, అనుభవించినందున రెండవ వానికీనా?'' అని మళ్ళీ అడిగాను. వాచా సమాధానం చెప్పక పోయినప్పటికీ అంగీకార సూచకంగా అమ్మ దరహాసోజ్జ్వలన్ముఖి అయింది.

అమ్మ ఎవరి కయినా గుడ్డలు పెట్టే సమయంలో కొందరు ''ఇవి మా కెందుకమ్మా ?'' అంటారు. ''ప్రసాదం నాన్నా. మీకు గుడ్డలు లేవని కాదు'' అనటం మనం తరుచు వింటాము

అమ్మ చిన్నతనంలో పావులూరు ఆంజేయస్వామి దేవాలయంలో మట్టిని నివేదనచేసి ప్రసాదంగా పంచితే - ఆ ప్రసాదం అనేక సువాసనలు వెదజల్లడం ఆనాడు చాలా మందిని చకితులను చేసింది

1956 - 60వ సంవత్సరాల మధ్యకాలంలో అమ్మ ఎందరికో ప్రసాదంగా మట్టిని ఇచ్చింది. అది ఎంతో సుగంధ భరితమై మహిమోపేతమై ఉండేదని అనేకులు చెబుతారు.

అకాలమృత్యుహరణం, సర్వవ్యాధి నివారణం... అంటూ అమ్మ తీర్థం వేయకపోయినప్పటికీ అనేకులు అమ్మ పావన పాదతీర్థం 'చరణామృతం' అన్న పేరుతో ఇళ్ళకు తీసుకుని వెళుతుంటారు. ఈ తీర్థం ఎంతకాలం అయినా అట్లాగే ఉంటుంది. ఏ దుర్వాసనా రాదు. రోజూ దానిని సేవిస్తారు. అది శరీర ఆరోగ్యాన్నీ, మానసిక శాంతినీ ప్రసాదించడం అనేకుల అనుభవం.

ఎవరయినా అమ్మపాదతీర్థం కోరినప్పుడు అక్కడ ఉండే ఎవరమయినా బిందెతో నీళ్లు తీసుకుని అమ్మవద్దకు వెళతాము. ''ఎవరికీ !'' అని అమ్మ అడుగుతుంది ఫలానావారికి అని చెబితే సందర్భాను సారంగా ఆ బిందెలోని నీళ్ళలో అమ్మ పాదమో, హస్తమో ముంచుతుంది ఆ దివ్య స్పర్శతో ఆ జలం అతి పవిత్రమూ అత్యంత శక్తిమంతమూ అవడం అనేకుల విశ్వాసమే కాదు, ఎందరికో అనుభవం కూడా.

నాన్నగారి పాదచిహ్నాలయిన మంగళసూత్రాలను అభిషేకం చేసి ఆ పవిత్రజలాన్ని అమ్మ పానంచేస్తూ ఒకనాడు అన్నది ''ఈ తీర్థాన్ని నేను తాగుతున్నందువల్లనే మీకు తీర్థంవేసే అర్హత నాకు వచ్చింది'' అని.

అనుగ్రహ స్వరూపిణి అమ్మ - మనస్సు ద్వారాగానీ, ఏ ఇంద్రియంద్వారాగానీ ఎట్లా స్పృశించినా - అది పదార్థంగానీ, ద్రవంగానీ - అది పునీతమవుతుంది. అమృతమవుతుంది. సంజీవని అవుతుంది.

అట్లాగే ---

అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల జిల్లెళ్ళమూడి వాతావరణమే పావనమై ప్రసాదమవుతున్నది. అందువల్ల జిల్లెళ్లమూడిలో ఏమూల ఏమాత్రం గాలిపీల్చినా మన శరీరం, మన రక్తం, మరి మన గుండె, మన ఆలోచనలు..... సర్వం పునీత మవుతున్నాయి

(సెప్టెంబరు 1984)



## మీ కోసమే

నాకు పని అంటూ ఉంటే - అది మీకు కనబడడమే.

నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా - మీకోసమే.

మీకు అనేకం ఆలోచనలు గానీ నాకు ఒక్కటే ఆలోచన. అది మీ గురించే.

నాకు ఎవరిని ధ్యానించాలో తెలియడమూ లేదు.

మీరు వద్దనీ అనిపించడం లేదు.

నా ఉద్దేశంలో మీరు కూడా భగవంతుడే.

మీరు మరిచిపోయినా - నేను మరిచిపోను.

- అమ్మ

# 187
# రామనామ సప్తాహం

అవధూతేంద్ర భక్త మండలికి చెందిన సోదరీ సోదరులు అమ్మ సన్నిధిలో జరిపిన రామనామ సప్తాహం జిల్లెళ్ళమూడి దివ్యచరిత్రలో అపూర్వమయిన మధురాతి మధురమయిన ఒక ఘట్టం.

22.10.84 ఉదయం గం. 9.15 ని.లకు అమ్మసన్నిధిలో ప్రారంభమయిన సప్తాహదీక్ష 29 10.84 ఉదయం గం. 10.15 ని.లకు అమ్మ సమక్షంలోనే పరిసమాప్త మయింది.

"హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥"

అన్న కలిసంతరణ మహామంత్రంతో పరమ ప్రశాంతమూ, అత్యంత పవిత్రమూ అయిన జిల్లెళ్ళమూడి వాతావరణం భిన్న భిన్న రాగ ప్రస్తారాలతో, లయవిన్యాసాలతో ప్రతిధ్వనించడమే కాక మరింత పునీతమై క్రొత్త అందాలు సంతరించుకుంది.

ఈ మండలి నాయకుడు శ్రీరామ్ శ్రీ అవధూతేంద్ర ప్రియశిష్యుడు, శ్రీ అవధూతేంద్ర రామనామాన్ని గ్రామగ్రామాన పట్టణపట్టణాన విరివిగా ప్రచారం చేసిన, నామామృతాన్ని సర్వజనులకూ పంచిపెట్టిన మహానుభావుడు; నాదోపాసకుడు; నామయోగి. అమ్మ అద్వైతతత్వాన్ని అవగాహన చేసుకొని ఆరాధించిన పరమభక్తుడు; అమ్మకు ప్రియ పుత్రుడు.

ఆ అవధూతేంద్ర అనుచరులెందరో అనేక గ్రామాలనుండి విచ్చేసి రామనామం మధురమధురంగా గానం చేస్తుంటే - ఆ స్వామియే పునరుజ్జీవితుడై ఇన్ని కంఠాలతో సంకీర్తన చేస్తున్నాడా - అన్న.అభిప్రాయం కలిగింది.

ఆ దివ్యనామ జాహ్నవిలో జిల్లెళ్ళమూడివాసుల హృదయాలు తనివితీరా మునకలువేసి - ఆ దివ్యనామరసపానంతో పులకించి పవరశించి పోయాయి.

రామనామ దివ్య సుగంధంతో జిల్లెళ్ళమూడి పుడమి పరిమళించింది. నామామృత ప్రభావితమయిన జలం భక్తుల ఆనంద భాష్పకణాలై తరించింది. రామనామ పరమాద్భుత దివ్య తేజస్సుతో జిల్లెళ్ళమూడిలో రాత్రింబగళ్ళు క్రొత్తకాంతులతో వెలుగొందాయి. జిల్లెళ్ళమూడి పవనతరంగాలు సర్వశ్రవణేంద్రియాలనూ నామామృతాభిషిక్తం చేశాయి. గగనం రామనామ ధ్వని ముద్రితమై ప్రతిధ్వనించింది. ఆ వారం రోజులూ జిల్లెళ్ళమూడిలోని చెట్లు రామనామం పలికాయి. ఆకులు రామనామం కీర్తించాయి. పిట్టలు రామనామం గానం చేసాయి. భవనాలు రామనామం స్తుతించాయి. తారకలు రామనామం కురిశాయి..... అంతా రామమయం అయిపోయింది.

శ్రీ అవధూతేంద్ర శిష్యుడు శ్రీరామదాస్ కడపజిల్లా చెన్నూరు నుంచి వచ్చి నామామృత వర్షమే కురిపించాడు. ఆర్తితో అతను గళమెత్తి గానం చేస్తుంటే శ్రోతలు తన్మయత్వం చెందారు. శ్రీ స్వామి శిష్యురాలు హైమవతి ఆగమనం సప్తాహానికి మరింత బలాన్ని చేకూర్చింది.

సప్తాహ నామ వేదికను హైమాలయ ప్రాంగణంలో ఏర్పరచుకున్నప్పటికి - నిత్యమూ ఉదయం అమ్మసన్నిధిలో 2, 3 గంటలు సంకీర్తన చేశారు. అనారోగ్యంగా ఉన్నప్పటికీ, ఆ బాధనంతనూ చిలుకకొయ్యకు తగిలించి వచ్చి అమ్మ సింహాసనవాసీన అయింది. ఆద్యంతమూ కూర్చుని సంకీర్తనా పరులనూ, సంకీర్తనా ప్రియులనూ ఆశీర్వదించింది. అమ్మ భక్తివశ్య, గానలోల కదా !

సంకీర్తన సమయంలో వాళ్లు చేసే నృత్యానికి శ్రోతల హృదయాలుకూడా మయూరాలై లాస్యం చేశాయి. మరి, వాళ్ళు గానంచేసే నామమే మూర్తీభవించి తమను అవలోకిస్తూ ఆలకిస్తూ ఆశీర్వదిస్తూ ఉన్నదన్న దృఢమైన భావనతో, పరమ విశ్వాసంతో ఉన్న వాళ్ళ హృదయాలే ఆనందార్ణవాలై ఉప్పొంగాయో, బిడ్డల చూసిన హృదయమే వెయ్యి చంద్రులను చూసిన సముద్రంవలె ఉప్పొంగిపోయిందో. .. విశ్లేషించలేము.

ఈ సప్తాహానికి మరో అలంకారం పూజ్యశ్రీ శ్రీ శ్రీ లక్ష్మణ యతీంద్రుల దివ్యోపన్యాసాలు. వారు సాయంకాల సమయాల్లో అద్భుతమయిన ప్రసంగాలు చేశారు. వారు శాస్త్రగతమయిన అనేక విషయాలను శ్రోతలకు కరతలామలకం చేశారు. వారి పాండిత్యమూ, వారి ప్రతిభా, వారి కంఠ గాంభీర్యమూ, పద్యంకానీ,

శ్లోకం కానీ వారు చదివే రీతిలోని రామణీయకమూ శ్రోతలనే కాక చదువులతల్లి అయిన అమ్మనే ఆహ్లాదపరిచాయి.

ఇక, సప్తాహకార్యక్రమానికి మకుటాయమానమైనది 'రామలీల' మహోత్సవం. ఇది నాటకీయమే కానీ ఒక వినూత్న ప్రక్రియ. 'శ్రీరామ్' దర్శకత్వంలో అద్భుతంగా రాజిల్లింది.

రామాయణం మొత్తాన్ని ఏడు రోజుల్లో ప్రేక్షకులకు రసవత్తరంగా అందించారు. నటుల్లో అధికులు అక్షరజ్ఞానంలేని గ్రామప్రజలు - వారు వేదికపై పెదవి కదల్పరు. పాత్రోచితమయిన మూకాభినయం చేస్తుంటారు. క్రింద కూర్చుని శ్రీరామ్ వ్యాఖ్యానం చేస్తూ అన్ని పాత్రల సంభాషణలు అతనొక్కడే పాత్రోచితంగానూ, రసోచితంగానూ చెప్పేవాడు. అతను కంఠంలో ఎంత వైవిధ్యం పలికించేవాడంటే - ఆయా పాత్రే స్వయంగా సంభాషణలు చెబుతున్నాయో - అనిపించేది. అది సామాన్యమయిన సామర్థ్య మేమీ కాదు. అయినా శ్రీ రామ్ ఆ కళలో అత్యంత ప్రావీణ్యం సాధించి శ్రోతల నిరవధిక ప్రశంసలకు పాత్రుడైనాడు. ఆవరణంలోకి సభ్యులను, గ్రామస్తులను, పరిసరగ్రామ ప్రజలను .... అందరినీ ఎంతగానో రంజింపజేసి ముగ్ధులను చేశాడు.

ఆ ప్రదర్శనలను అమ్మ కూడా చూసింది. అమ్మ ఎంత ఆనందించిందో ! నిఖిల రసామృతమూర్తి, రసప్రపూర్ణ, రససాగర, రసాధిదేవత, రసస్వరూపిణి అయిన అమ్మ మనస్సునే రంజింపచేయడమంటే - అది ఎంత కళాసాదనో, ఎం తరససిద్ధో, ఏ తపఃఫలమో ! శ్రీరామ్ సాధన,

కళ, తపస్సు, పాండిత్యం, సామర్థ్యం.... సర్వమూ సార్థకమయ్యాయి. అతని జీవితమే ధన్యమయింది.

అమ్మ పొందిన ఆనందానికి సంకేతంగా అక్టోబరు 27వ తేదీ సాయంకాలం అమ్మ అనుగ్రహ సుధ కుంభవృష్టిగా శ్రీరామ్‌పై వర్షించిన ఘట్టం పరమ సుందరమయినదీ కాదు చిరస్మరణీయమైనది. అతణ్ణి శాలువతో కాదు అనురాగంతో అమ్మ కప్పింది. చామంతులరేకులతో గులాబీరేకులతో కూడిన పూలవాన అతణ్ణి ముంచెత్తిన దృశ్య కమనీయత వర్ణనాతీతమయింది. ఆ వర్ణ సమ్మేళనలోని సౌందర్యానికి అమ్మ కన్నుల్లోని తారకల కాంతి, ముఖమంతా వెల్లివిరిసిన ఆనందదీప్తి మరింత శోభను చేకూర్చాయి.

ఆ సందర్భంగా పూజ్యశ్రీ లక్ష్మణ యతీంద్రులు ప్రసంగిస్తూ -

"ఆనాడు వాల్మీకి ఒక్కడు పాత్రలన్నీ తానై రామాయణం రచించాడు. ఈనాడు శ్రీరామ్ పాత్రలన్నీ తానై అభినయిస్తున్నాడు. మరి, ఇతణ్ణి అభినవ వాల్మీకి అందామా ? అభినయ వాల్మీకి అందామా ? - అని అడుగుతూ అమ్మ మన శ్రీరామ్‌ను "అభినయ వాల్మీకి" అని అభివర్ణించింది" అని సభాముఖంగా హర్షధ్వానాలమధ్య ప్రకటించారు.

29వ తేదీ ఉదయం సప్తాహకార్యక్రమానికి మంగళహారతి పాడేవేళ అమ్మ శ్రీరామ్‌కు తాను కట్టుకునే పీతాంబరం రంగు కంచిపట్టుచీరెను ప్రసాదించింది. ఖద్దరు ధోవతి, ఉత్తరీయాన్ని అనుగ్రహించింది.

మండలి సభ్యులందరికీ నూతన వస్త్రాలు ప్రసాదించి ఆశీర్వదించింది. మండలికంతకూ ఈ కార్యక్రమ స్మృతి చిహ్నంగా అమ్మ ఫొటో నొక దానిని, అమ్మను గురించిన సాహిత్యాన్ని బహూకరించింది.

ఈ నామసప్తాహ ప్రభావం వలన ఆ మంత్రాక్షరాల్లో ఎంత మహిమ ఉన్నదో, ఎంత మాధుర్యమున్నదో, ఎంత బలమున్నదో, ఎంత రుచి ఉన్నదో, ఎంత సౌందర్య మున్నదో, ఎంత కాంతి ఉన్నదో ...... అందరికీ అవగత మయింది.

ఈ సప్తాహంలో 'జయహోమాతా...' నామంచేస్తే ఇంకా బాగుండేదమ్మా" - అన్న సోదరునితో - 'జయహోమాతా.... అంటేనే అమ్మ నామమా ! హరేరామ - అంటే అమ్మనామం కాదూ... అన్ని నామాలూ ఒకటే" నన్నది అద్వైతమూర్తి అమ్మ.

(అక్టోబరు 1984 )



## తేడాలుండవు

ఎంత మంది బిడ్డలున్నా తల్లికి ఏ బిడ్డకు ఆ బిడ్డే ఎక్కువనిపిస్తుంది. పెట్టుపోతల్లో, వాళ్ళ ఆరోగ్య పరిస్థితినిబట్టి తేడా ఉండొచ్చును కానీ ప్రేమమాత్రం సమానంగానే ఉంటుంది. అందులో తేడాలుండవు.

- అమ్మ

# 188
# రోగ పర్వత దంభోళి

డిసెంబరు 8వ తేదీ రాత్రి సోదరులు శ్రీకాశీరావుగారి అమ్మాయి అపర్ణ వివాహం అమ్మసన్నిధిలో అత్యంత వైభవోపేతంగా జరిగింది. 20 రోజులుపైగా రోగగ్రస్తయై ఎంతో బాధను అనుభవించిన అమ్మ తన సాన్నిధ్య సౌభాగ్యాన్ని ప్రసాదించి వధూవరులను ఆశీర్వదించిన మనోజ్ఞమయిన దృశ్యం అందరికీ ఆనందాన్నీ కలుగజేసింది.

అమ్మ చరిత్ర తెలిసినవారికీ, కాలప్రవాహంలో అమ్మతోపాటు అదే పడవలో ప్రయాణంచేసేవారికీ ఇటువంటి ఘట్టాలు అత్యంత సహజంగానే అనిపించినప్పటికీ - ఎప్పటి కప్పుడు అమ్మ వ్యాధి సర్పదష్ట అయినప్పుడెల్లా గుండె లవిసిపోయేటట్లు అందరికీ భయాందోళనలే. ఈ భయాందోళనలకూ, అమ్మను గురించిన విశ్వాసానికీ సంబంధం లేదు. ఈ భావాలు సామాన్యంగా పరస్పర విరుద్ధమయినవి అయినా, మన హృదయ మందిరాల్లో అటువంటి క్లిష్టసమయాల్లో మాత్రం ఒక దాని కొకటి ఏమాత్రం అపకారం చేసుకోకుండా సహజీవనం చేస్తాయి.

ఇది ఆనాటి చిదంబరరావు తాతగారి నుండి ఈనాటి చిన్న చిన్న పిల్లలవరకు కనుపిస్తూనే ఉన్నది.

అమ్మ సృష్టి స్థితి లయకారిని అనీ, శ్రీరాజరాజేశ్వరి అవతారమనీ, సర్వవ్యాధిప్రశమని అనీ, రోగపర్వత దంభోళి అనీ... మనకు తెలుసును. అయితేనేం? అమ్మకు జబ్బుచేస్తే మనకు కలవరం. అమ్మ బాధపడుతుంటే చూడలేము.

అగ్నికి చెదలు పట్టినట్లు, సూర్యుడి చుట్టూ చీకట్లు కమ్మినట్లు - మృత్యుంజయా, భిషగ్వరేశ్వరీ, సర్వజీవ జీవన సంజీవనీ, అమృతసాగరా అయిన అమ్మకు దుస్సహ వ్యాధులూ, దుర్భర బాధలూ; మనకు తీవ్ర మనస్తాపమూ, ఆందోళనా.

"దండాలంటే చాలు, మన గండాలు గట్టెక్కించు" సర్వేశ్వరికి జీవితంలో అనుక్షణమూ ఒక గండమే, జీవిత తరంగిణిలో అడుగడుగునా సుడిగుండమే.

అయితేనేం, అమ్మ దృష్టిలో వ్యాధులూ సంతానమే, బాధలూ దైవస్వరూపాలే. ఒక సందర్భంలో అమ్మ అన్నది "గడ్డకూడా బిడ్డే" నని.

ఎప్పుడూ ఏదో వ్యాధితో బాధపడే అమ్మతో ఒకనాడు సుబ్బయ్యన్నయ్య అన్నాడు "నువ్వు ఎప్పుడు ఆరోగ్యంగా ఉన్నావు తల్లీ ? ఇవ్వాళ జ్వరమూ, రేపు ఇంకొకటీ. ఎప్పుడూ జబ్బులుండాల్సిందే కదా !" అని.

"అవును సుబ్బయ్యా - మీరుకూడా ఎప్పుడూ నాదగ్గరొక్కరే ఉంటున్నారా ? ఒక్కొక్కడు కొంతకాలం ఉంటున్నారు. అట్లాగే అవీనీ -" అన్నది అమ్మ అతి నిర్లిప్తంగా.

"ఎంత అన్యాయంగా అన్నావమ్మా ! మేమూ, జబ్బులూ ఒకటే అనేగా ?" [illegible] అన్నయ్య ఆశ్చర్యపోయాడు.

"అవునురా మీరు లేనప్పుడు అవీ ఉండవు" అని అమ్మ అన్నయ్య ఆశ్చర్యం నుండి ఒక సత్యాన్ని వెలువరించింది.

అమ్మకు ఈ వ్యాధులేమిటీ, ఈ బాధలేమిటీ అని అర్థంగాక అయోమయంలో పడిపోయే మనకు అమ్మ వెలువరించిన ఈ సత్యం మనకు కొంత సహాయకారి అవుతుంది. మన ఆలోచనాపథంలో వెలుగును ప్రసారిస్తుంది.

అనేకులు అవతారపురుషులు, సిద్ధవ్యక్తులువలె అమ్మకూడ తన బిడ్డలనండీ, భక్తులనండీ - తనను ఆశ్రయించిన కొందరి వ్యాధులనూ బాధలనూ తాను స్వీకరించి వారికి వ్యాధి నివారణనూ, బాధోపశమనాన్నీ ప్రసాదిస్తున్నట్లు మనలో అనేకులకు అనుభవం ద్వారా అవగతమే.

మరోవ్యక్తిపై ఏ మనిషి కయినా ఎంత ప్రబలమయిన అనురాగం ఉన్నప్పటికీ, మనిషియొక్క సానుభూతి వాక్కు వరకే పరిమితం. 'నీ కష్టాన్ని నేనూ పంచుకుంటున్నాను" అని మనిషి అనగలడు గానీ వాస్తవంగా ఏమీ పంచుకోలేడు.

ఒక్క సిద్ధపురుషులు మాత్రమే అందుకు సమర్థులు. మహాత్ముల చరిత్రలు మనకు ఇందుకు సాక్ష్యమిస్తాయి. వారు నిజంగానే క్రియాత్మకంగా మన బాధలను పంచుకోగలరూ, ఒక్కొక్కప్పుడు పూర్తిగానూ స్వీకరించగలరూ - వారి అనుగ్రహం అఘటనా ఘటన సమర్థమయింది.

అమ్మ జీవితంలో ఇటువంటి సంఘటనలు అనేకం మనం చూడవచ్చును.

సోదరుడు శ్రీరామరాజు కృష్ణమూర్తి జీవితంలో బాగా నైరాశ్యంచెంది ఆత్మహత్య చేసుకోవాలని ఉద్దేశించి :- గుంటూరులో వాళ్ళ ఇంట్లో ఎలక్ట్రిక్కు కరెంటు పట్టుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో జిల్లెళ్ళమూడిలో ఉన్న అమ్మ తన చేతిని బలంగా విదిలించింది. ఆ చేతి విదిలింపు అపుడు అమ్మ సన్నిధిలో ఉన్న కొమ్మూరి డాక్టర్‌గారికి తగిలింది. శ్రీరామరాజు కృష్ణమూర్తి మరణం నుంచి తప్పుకున్నాడు.

తర్వాత కూడా కృష్ణమూర్తి రెండు మూడు పర్యాయాలు ఆత్మహత్యాప్రయత్నం చేసే విఫలుడయినాడు. ఒక రోజున జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మతో అన్నాడు "నువ్వేమీ సహాయం చేయవు - కనీసం, చద్దామన్నా చావనీయవు" అని.

ఒక రోజున ఆవరణలో మల్లిఖార్జునుడిని ఎద్దు తొక్కింది. ఆ సమయంలో అమ్మ గుండెనొప్పితో గిలగిలలాడింది. మల్లిఖార్జునుడికేమీ బాధ కలగలేదు. ఎద్దు తొక్కినప్పుడు అతను 'అమ్మా.... అమ్మా" అని ప్రార్థించాడట.

ఇటువంటి సంఘటనల నెన్నింటినో ప్రత్యక్షంగా చూసిన శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య బాధతో విలవిలలాడుతూ మందు బిళ్ళలు వేసుకొనడానికి సందేహిస్తున్న అమ్మను ఒకనాడు అడిగాడు "నేను మందుబిళ్ళలు వేసుకుంటే నీకు నొప్పి తగ్గుతుందా ?" అని.

'నీవు బిళ్ళలు చేసుకుంటే నాకు తగ్గదు. నేను వేసుకుంటే నీకు తగ్గుతుంది' అని అమ్మ ఆనాడు నిర్ద్వంద్వంగా ప్రకటించింది.

ఒకనాడు చీరాలలో ఒక సోదరుణ్ణి కలిశాను. అతని సంభాషణలో అతనికి అమ్మపైగల అపారమయిన భక్తినీ, అచంచలమయిన విశ్వాసాన్నీ గమనించి నేను ఆశ్చర్యపోతుండగా ఒక విషయం చెప్పి అతడు నన్ను ఏడిపించాడు.

అతడు అతని గదిలో గల అమ్మఫొటోకు రోజూ దణ్ణం పెడతాడట. కానీ అతని కేమాత్రం జ్వరం తగిలినా, మరెందువలన ఏ కించత్ బాధ కలిగినా - అతను ఆ గదిలోకే వెళ్ళడట, వెళ్ళినా ఆ బొమ్మవంక చూడడట, చూసినా దణ్ణంపెట్టడట. ఎందువల్లనంటే అట్లా అమ్మవంక చూసేటపుడుగానీ, దణ్ణం పెట్టుకునేటప్పుడుగానీ తన మనసులోకి "అమ్మా ! బాధపడుతున్నాను" అన్న భావం వస్తే - బిడ్డలపై వాత్సల్యం గల అమ్మ తన బాధను తీసుకుని బాధపడుతుందన్న ఆలోచనతోనట.

ఆ విషయం చెబుతూ మన "అహారవిహారాల్లో దోషాలవల్ల, మన పూర్వజన్మదుష్కృత ఫలితాలవల్ల మనకు వ్యాధులు సంక్రమిస్తాయి. అటువంటప్పుడు ఆ బాధను మనమే అనుభవించడం న్యాయం. ఆ అనుభవాల్లోని ఆనందం మనకూనూ, ఆ అనుభవ దుష్ఫలితం అమ్మకూనా ? ఇదేమి న్యాయం ? మనం చేసుకున్నదానికి అమ్మ ఎందుకు బాధపడాలి ? ఆమె కేమీ ఆహారసుఖమూ లేదు, విహార సుఖమూ లేదు. సుఖాలు మనం అనుభవిస్తున్నాము. బాధలు అమ్మ అనుభవిస్తున్నది. అందుకే అమ్మను చూస్తే నాకెంత భక్తో, అంత జాలి. ఇందరి బాధలనూ తాను ఎప్పుడూ అనుభవిస్తూ ఉంటుంది పిచ్చితల్లి ! ఈ విషయం తెలిసీ 'అమ్మా ! నా వ్యాధిని తొలగించు, నా బాధను తగ్గించు -' అని అమ్మను వేడుకొనడం దుర్మార్గం కాదూ ?" అని అతడు నన్ను ప్రశ్నించాడు. అతని కళ్ళు చెమర్చడం చూసిన నాకూ దుఃఖం ఆగింది కాదు.

నిజమే, ఒక క్రియకు కలిగే ఫలితం ఎవరో ఒకరు అనుభవించ వలసిందే. బిడ్డలపై ప్రేమతో అమ్మ ఆ ఫలితాలను తాను స్వీకరించి, లాంఛన ప్రాయంగా నయినా దానిని తాను అనుభవించి దాని నుంచి తన సామర్థ్యంవల్ల తానూ విముక్తిని పొందుతున్నదీ, బిడ్డలకూ విముక్తిని అనుగ్రహిస్తున్నది.

(నవంబరు, డిశంబరు 1984)



## దైవం అంటే....

దైవం అంటే భావమా, రూపమా ? తెలియనప్పుడు జీవుడు. తెలిస్తే దేవుడు. భావం మారటమే. భావం కలిగితే - దానికి దృఢత్వం కలిగితే... ఔనా కాదా అని సందేహం లేని స్థితి కలిగినప్పుడు... అప్పుడు దైవం కంటే వేరు లేదనీ, ఇదే సత్యమనీ తోస్తుంది.

- అమ్మ

# 189
# "సంకల్పమే సంసారం"

1985 జనవరి 22వ తేదీ ఉదయం సోదరుడు రవి ఇంటికి అమ్మ వచ్చింది. ఒక కుమారుని ఇంటికి తల్లి రావడంలో విశేషం ఏమీ లేకపోయినా, మన అందరిఅమ్మ రవి ఇంటికి రావడం విశేషమే. అమ్మ ఎవరింట తన శ్రీచరణం మోపినా, అది అక్షరాలా వారి అదృష్టమే. జన్మలనేవే ఉంటే అది ఎన్ని జన్మల సుకృతానికో ఫలమై ఉంటుంది. అమ్మరాక అమృత వర్షమే !

జగత్తంతా అమ్మ సంతానమే అయినా, సాక్షాత్తూ అమ్మ గర్భ సంజాతులు, అమ్మ దివ్య రక్త మాంసాలను పంచుకుని పుట్టిన బిడ్డలు ముగ్గురు. అందులో ఇద్దరు మగబిడ్డలు, ఒకరు ఆడబిడ్డ. ఆమే హైమవతి.

హైమవతిని అమ్మ జగత్తుకు అంకితం చేసింది. ఆమె నేడు లోకారాధ్యదేవత అయింది. ఆమె సుప్రతిష్ఠిత అయిన క్షేత్రమే హైమాలయమై వెలుగొందుతోంది.

అమ్మకుమారుడు సుబ్బారావు జిల్లెళ్లమూడి గ్రామ సర్పంచ్. జిల్లెళ్ళమూడిలోనే సకుటుంబంగా నివసిస్తున్నాడు. రవి స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియాలో ఆఫీసరు. ప్రస్తుతం జిల్లెళ్లమూడి శాఖలోనే పనిచేస్తున్నాడు ఇద్దరు అన్నదమ్ములూ వారి వారి కుటుంబాలతో వేరువేరుగా నివసిస్తున్నారు. జిల్లెళ్లమూడిలో అమ్మ ఆధ్వర్యంలో నడిచే సంస్థకు సంబంధం లేకుండా వారి వంట వారు చేసుకుంటూ ఉంటారు. నాన్నగారు అంటూ ఉండేవారు "సంస్థ నుండి మనం పైసాకూడా తీసుకోకూడదు. మనకు చేతనైనంతలో సంస్థకు సహాయపడాలి" అని. ఇప్పుడూ అదే విధానం.

కొడుకులూ, కోడళ్లూ రోజూ అందరిలాగానే అమ్మ వద్దకు వస్తారు. నమస్కారం చేసుకుంటారు. వాళ్ళకు అవకాశం ఉన్నంతలో అమ్మసేవ చేసుకుంటారు అందులోనే వాళ్ల కెంతో ఆనందమూ, తృప్తీ.

కుటుంబ పరిస్థితులవల్లగానీ, అమ్మకు విశాల విశ్వంతో గల సన్నిహిత సంబంధం వలన గానీ, అమ్మకు గల బహుముఖ బాధ్యతల వలన గానీ - అమ్మకు కన్నబిడ్డలతోటి అనుబంధం పెద్దగా లేదనే చెప్పాలి. అంతరంగికంగా

ప్రేమానురాగాలు ఎంత ప్రబలంగా ఉన్నప్పటికీ - భౌతికంగా బిడ్డలకు అమ్మ సాన్నిహిత్యం లుప్తమయింది.

సుబ్బారావుకు ఇద్దరు ఆడపిల్లలు. రవికి ముగ్గురు పిల్లలు. ఇద్దరు మొగపిల్లలు; ఒక ఆడపిల్ల. ఈ పిల్ల లందరూ ఎల్లప్పుడూ "బామ్మా, బామ్మా....." అంటూ అమ్మచుట్టూ తిరుగుతారు. వాళ్ళ బామ్మతో వాళ్ళకు ఎంతో చనువు. అమ్మ మంచం ఎక్కితొక్కుతారు. అమ్మపక్కలో పడుకుంటారు. అమ్మతో ఆడుకుంటారు. తమాషా - అమ్మంటే ఎంత చనువో, అమ్మపై అంత భక్తి కూడా. అంత చిన్న వయస్సులో వాళ్లు అమ్మపట్ల చూపే భక్తి చూస్తే ఎవరికయినా ఆశ్చర్యం కలుగుతుంది.

అమ్మకు కూడా వాళ్లంటే ఎంత వాత్సల్యమో ! వాళ్లతో అమ్మకూ మంచి కాలక్షేపం. వాళ్లతో ఆడుకోవడం అమ్మకు ఆనంద సంధాయకం.

ఇటీవల హఠాత్తుగా అమ్మ - కొన్నాళ్లు రవి ఇంట్లో ఉంటానని తన ఇష్టాన్ని అభివ్యక్తం చేసింది. మరి, వాళ్లు ఉండే చిన్న ఇంటి భాగంలో అమ్మ ఉండడం అంటే చాలా కష్టమయిన పనే. అందుకని శ్రీ విశ్వజననీ పరిషత్ వెంటనే ఆలోచించి రవి ఇంటిపైన మొదటి అంతస్థును నిర్మించటానికి సంకల్పించి అతి శీఘ్రంగా అత్యల్పకాలంలో భవన నిర్మాణం చేయగలిగింది.

22వ తేదీన అమ్మ ఆ ఇంటికి వచ్చింది. అమ్మ రావడమంటే ఆ ఇంటికి ఒక వెలుగు రావడం, ఒక మహాభాగ్యం రావడమే కదా ! అమ్మ ఆగమనం గృహస్థ తపస్సిద్ధికి నిదర్శనం.

ఆ మహాభాగ్యానికి, పరదేవతకు స్వాగతం చెప్పడం అంటే సాధారణ విషయమా ? అందుకే ఎంతో భక్తి శ్రద్ధలతో రవి దంపతులు ఎన్నో ప్రత్యేకమైన అందమైన ఏర్పాట్లు చేశారు.

ఆ ఉత్సవానికి ఎందరో విచ్చేశారు. వారిలో స్వామి అమృతానంద ఒకరు. వారి వెంట వారి కుమారుడు, శిష్యుడు అయిన హనుమంతరావు ఉన్నారు. వారు అమ్మతో మాట్లాడుతూ "నేను నా భార్యను, పిల్లలను వదిలి స్వామివారితోనే ఉంటున్నాను" అన్నారు. అమ్మ వెంటనే "ఎందుకూ?.... వాళ్లను వదిలేయ గలిగావు కానీ స్వామిని ఎత్తుకున్నావుగదా ! నీకేం బరువు తగ్గింది ?" అని ప్రశ్నించింది.

ఔను, స్వామి బాధ్యతతోపాటు, ఆశ్రమ బాధ్యత. పరిమితమయిన కుటుంబ బాధ్యతను వదిలి అపరిమితమయిన ఆశ్రమ బాధ్యతను స్వీకరించడం - తుంగను దింపి మొద్దును తలకు ఎత్తుకోవడమే కదా !

తెనాలి వాస్తవ్యులు, ప్రఖ్యాత పండితులు అయిన శ్రీ మూలల్పూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో మాట్లాడుతూ అమ్మ ప్రవచించింది 'సంకల్పమే సంసారం' అని. మన అభిప్రాయం సంసారం అంటే భార్యా భర్తలూ, సంతానమూ అని. కాని ఇది ఉపరితల స్పర్శ. అమ్మ తన అసాధారణ స్వభావాన్ననుసరించి విషయం లోతుల్లోకి వెళ్లి అద్భుతమయిన సత్యాన్ని ప్రకటించింది. మనకు కలిగే ఆలోచనలు, భావాలు..... ఇవే బాధ్యతలను మన నెత్తి కెత్తేవి. ఈ బాధ్యతలే నిజమయిన సంసారం.

మరి, ఈ సంసార సాగరాన్ని తరించడం ఎట్లా ? సంకల్పాల నుండి విముక్తుడు కావాలి. అది సాధ్యమా ? సముద్రంలో అలలు ఎట్లా అణగవో, మనిషిలో ఆలోచనా తరంగాలూ అంతే. ఆలోచనలు మారుతూ ఉండడమే కానీ ఆలోచనలకు మరణం లేదు.

అయితే సంసార తరణం, సంకల్ప రాహిత్యం ఎప్పుడూ ? అమ్మ మార్గప్రబోధం చేసింది. సంకల్పాలు లేని స్థితి ఎప్పుడూ సాధ్యం కాదు. తనకు వచ్చే సంకల్పాలకు తాను కర్తను కాననీ, సంకల్పాలన్నీ దైవసంకల్పాలనీ తెలుసుకొనడమే సంకల్పరాహిత్యమట సంకల్పాన్నే అమ్మ దైవమనికూడా నిర్వచించింది. ఒక ప్రసంగంలో ఒకరు 'దైవ సంకల్పం' అంటే, "దైవ సంకల్పం కాదు, సంకల్పమే దైవం" అని అమ్మ సవరించింది.

మనకు అనేక సంకల్పాలు వస్తూ ఉంటాయి. అందులో కొన్ని సఫల మవుతాయి. కొన్ని విఫలమవుతాయి. సఫలమయితే ఆనందిస్తాము. విఫలమయితే దుఃఖిస్తాము. ఈ సుఖదుఃఖాలు ఆలోచనలు మనవి అనుకున్నప్పుడు, ఆలోచనలు దైవానివి అనుకున్నప్పుడు జయాపజయాలు కూడా దైవానివే. మనం నిమిత్త మాత్రులం అవుతాము. అపుడు సుఖదుఃఖాలకు తావు లేదు. ఆ నిర్లిప్తస్థితియే స్థితప్రజ్ఞత్వం. అదే ఆ మానవజీవితపరమావధి. అమ్మ ప్రవచనమూ, ప్రబోధమూ మనను జీవిత గమ్యానికి చేరుస్తున్నవి.

మరొక సందర్భంలో అమ్మ చేసిన ప్రకటన మన దృక్పథంలోనే పరిణామం తెస్తున్నది. కంటకావృతమని మనం భావించే జీవన మార్గాన్ని అమ్మ పూలబాటగా చేస్తున్నది. మనం చేసే ప్రతిపనీ దైవసేవ అనుకొనగలిగితే ఆధ్యాత్మిక సాధనకు సంసారం ఏనాడూ ప్రతిబంధకం కానేరదట.

ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సాధకుడు సంసారానికి ముఖద్వారం అయిన వివాహం అంటేనే భయపడి పోతున్నాడు. 'అమ్మా - నీకీ పెండ్లి ఎందుకూ?' అని అమ్మతత్వాన్ని అవగాహన చేసుకున్న ఒక భక్తుడు ప్రశ్నిస్తే - "పెండ్లిలో పెద్దపులి ఉందని భయపడే వాళ్ళ భయం పోగొట్టడానికే నేనీ పెండ్లి

చేసుకుంటున్నాను" అని అమ్మ ఇచ్చిన సమాధానం ఎందరికో కనువిప్పు కలిగించ గలదు. అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే - గృహస్థాశ్రమానికీ, కుటుంబజీవితానికీ అమ్మ ఎంత గొప్ప విలువను ఇస్తుందో మనకు అవగతమవుతుంది. ఎందరో అమ్మను సన్యాసినిగా, కాషాయవస్త్రధారిణిగా ఊహించుకుంటారు. వారికి అమ్మ గృహిణిగా, కుటుంబినిగా మామూలుగా చీరె కట్టుకుని, తల దువ్వుకుని, చేతులకు గాజులు వేసుకుని, నుదుటను బొట్టు పెట్టుకుని పెద్ద ముత్తయిదువగా దర్శనమిచ్చి ఆశ్చర్య పరుస్తుంది.

'సారంలేని సంసారం' అని అందరూ విరక్తిని ప్రకటిస్తుంటే - సంసారాన్ని 'అమృత కాసారం' అని అమ్మ ప్రస్తుతిస్తున్నది

•సంసార భయాన్ని గురించి వివరిస్తూ అమ్మ దానిని 'రజ్జుసర్ప భ్రాంతి' అని వర్ణించింది.

గృహస్థాశ్రమాన్ని గురించి కూడా అమ్మకు ఎంతో ఉన్నతమయిన అభిప్రాయం. తురీయాశ్రమం అని సన్యాసాన్ని శాస్త్రాలు అభివర్ణిస్తుంటే - అన్ని ఆశ్రమాలకూ ఒకటే విలువ - అని అమ్మ ఎలుగెత్తి చాటుతున్నది

గృహస్థాశ్రమానికి అర్హత నిచ్చే పెండ్లి అన్నా అమ్మకు ఎంతో ఇష్టం. అందుకే అమ్మ తన అమృతహస్తంతో ఎన్నో వివాహాలు ఆనందంగా జరిపించింది.

ఒక యువకుడు బ్రహ్మచర్యం నుండే సరాసరి సన్యాసం తీసుకోవాలని ఆలోచిస్తుండగా అతని బంధువులు అతణ్ణి అమ్మ వద్దకు తీసుకొని వచ్చారు. "సంసారంలో ఉండి ఆధ్యాత్మిక సాధన చేయడం కోటలో ఉండి యుద్ధం చేయడం. సన్యాసంలో ఉండి ఆధ్యాత్మిక సాధన చేయడం కోట విడిచి యుద్ధం చేయడం" అని అమ్మ హితోపదేశం చేసింది.

ఆధ్యాత్మిక సాదన చేసుకునే స్త్రీ తన భర్తనూ, బిడ్డలనూ బంధాలుగా అభిప్రాయ పడుతుంటే - అమ్మ, భర్తనూ, బిడ్డలనూకూడా దైవస్వరూపాలుగానే అభివర్ణిస్తూ వాళ్ళను సాధనా మార్గంలో ధ్యేయమూర్తులుగా చూపిస్తున్నది.

పరమార్థాన్ని సాధించడానికి విరక్తినే ఏకైక మార్గంగా మనం భావిస్తుంటే - పరిమిత మయిన అనురక్తిని సర్వత్రానురాగంగా పరివ్యాప్తం చేసుకొనమని ఉపదేశిస్తూ దానినే నిజమయిన విరక్తిగా వైరాగ్యంగా అమ్మ అభివర్ణిస్తున్నది.

అందువల్లనే అమ్మ 'విశ్వకుటుంబిని'గా జగదారాధ్య అయింది.

(జనవరి 1985)



# 190
# చౌరాస్తా

అదొక అద్భుత సన్నివేశం.

అదొక అపూర్వ సమ్మేళనం.

ఆనాడు ఫిబ్రవరి 17వ తేదీ మహాశివరాత్రి పర్వదినం.

అమ్మ సమదర్శనంలో సర్వదినాలూ 'పర్వదినాలే' అయి నప్పటికీ మహాశివరాత్రి మానవాళికి మహాపర్వదినమే.

ఆనాడు మధ్యాహ్నం రెండు గంటల సమయంలో అమ్మ అనసూయేశ్వర ఆలయానికి విచ్చేసింది.

మహారుద్రయాగం ప్రారంభమయింది. యాగశాల అనసూయేశ్వరాలయానికి ప్రాగ్భాగాన అమర్చబడింది.

శ్రీ వల్లమూడి వేంకటేశ్వరరావుగారి నేతృత్వంలో యాగం నిర్వహింపబడుతోంది. హోమగుండంలో అగ్నిజ్వాలలు మహోజ్జ్వలంగా ఉన్నాయి. విస్ఫులింగాలు పందిరిని తాకాలని ఉత్సాహపడుతున్నాయి.

నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇసవే నమః

నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముతతే నమస్స్వాహా....

సోదరులు భానుమూర్తి, కుమారశర్మ, లక్ష్మీనరసింహం ప్రభృతులు దీక్షితులై ఉచ్చైస్స్వరంతో స్వాహామంత్రాలు పఠిస్తూ - అగ్ని దేవునికి ఆజ్యం సమర్పిస్తున్నారు. హోమజ్వాల ప్రసారం చేసే ప్రకాశంలో ఋత్విక్కులు దేవతామూర్తులవలె భాసిస్తున్నారు.

ప్రక్కనే అనసూయేశ్వరాలయంలో శివలక్షనామార్చన.

ఓం అద్యంతలయ కర్త్రే నమః

ఓం నృత్య ప్రియాయ నమః......

భక్తానుగ్రహస్వరూపుడయిన పరమేశ్వరుని మధురనామ సహస్రంతో ఆ ఆలయమే కాదు, ఆవరణమంతా ప్రతిధ్వనిస్తున్నది.

ఎందరో సోదర సోదరీమణులు బహు ప్రాంతాల నుంచి వచ్చి లక్షనామార్చనలో పాల్గొంటూ బిల్వదళాలతో, అనేక జాతుల సుమాలతో పత్రాలతో మహాదేవుని మనసారా పూజించుకుంటున్నారు.

పూల లాస్యాలతోనూ, గళ విన్యాసాలతోనూ కనువిందుగా, వీనుల విందుగా భాసిల్లడమేకాక ఆ వాతావరణం మనసులలోని సర్వమాలిన్యాలనూ తుడిచివేసి ఆనందంతో నింపివేసి పులకలెత్తిస్తున్నది. అంతకుముందే అనసూయేశ్వరాలయంలో 121 ఆవృతాలతో అతిరుద్రాభిషేకం పూర్తి అయింది.

మరొక ప్రక్క, హైమాలయం ముందు క్రొత్తగా నిర్మిత మయిన ముఖమండపంలో రామనామ సంకీర్తన మహోజ్జ్వలంగా మనోహరంగా సాగుతోంది. శ్రీ అవధూతేంద్ర భక్తమండలివారు శ్రీ శ్రీరామ్ సారథ్యంలో అఖండనామ సంకీర్తన నిర్వహిస్తున్నారు.

హైమాలయం, అనసూయేశ్వరాలయం లోపలా వెలుపలా కూడా ఎందరో సోదరీ సోదరులు తపోనిమగ్నులై ఉన్నారు.

ఒకే కాలంలో ఒకే ప్రదేశంలో ఈ భిన్న రీతుల సాధనా మార్గాలను చూస్తుంటే విష్ణుపురాణంలోని వివరణం గుర్తుకు వచ్చింది.

కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో యజ్ఞయాగాలు, ద్వాపర యుగంలో అర్చనాదులు, కలియుగంలో సంకీర్తన. మానవునికి తరణోపాయాలుగా అభివర్ణితమైనాయి.

'సర్వసమ్మత' అయిన అమ్మ నాలుగు మార్గాలను ఒక చోట చేర్చి ఎవరికి ఏ మార్గం కావాలో కోరుకోమన్నట్లున్నది ఆ దృశ్యం.

(ఫిబ్రవరి 1985)



# 191
# "పుత్రవత్ సర్వభూతాని"

మద్రాసు నుంచి తమిళంలో వెలువడే మాసపత్రిక 'జ్ఞానభూమి' సంపాదకులు శ్రీ మలర్‌మన్నన్ జిల్లెళ్ళమూడి వచ్చారు. తమిళ పాఠకులకు అమ్మను పరిచయం చేయాలని వారి ఉద్దేశం. అమ్మను సందర్శించారు. అమ్మను గురించీ, అమ్మతత్వం గురించీ గ్రంథాధ్యయనం చేశారు. అంతతో వారు సంతృప్తి పడలేదు. అమ్మతో ముఖా ముఖీ సంభాషణచేసి మరింత విషయ సంగ్రహం చేయాలని అభిలషించారు.

అమ్మ అనుమతించింది.

వారెన్నో ప్రశ్నలు, సందేహాలు అభివ్యక్తం చేశారు. అన్నిటికీ అమ్మ ఓర్పుతో సమాధానాలూ, వివరణలూ అనుగ్రహించింది.

ఆ సంభాషణలో అమ్మ తానేమీ చదువుకోలేదనీ, తెలిసి కావాలని సాధనకూడా ఏమీ చేయలేదనీ వివరించింది. అప్పుడు వారు అడిగారు 'అమ్మా - లోకంలో అందరినీ బిడ్డలుగా చూసే ఈ విధానం పూర్వం ఎక్కడనూ కనపడదు. ఏ గ్రంథాల లోనూ ఉన్నట్లు లేదు. మీరేమీ సాధన చేయలేదంటున్నారు. మరి, మీకు ఈ భావం ఎట్లా వచ్చింది ? ఎక్కడ నుండి వచ్చింది ?' అని.

అందుకు అమ్మ మౌనమే సమాధానం.

మన్నన్ మళ్ళీ మళ్ళీ అడిగారు.

"ఏమో నాన్నా - నాకేమీ తెలీదు. ఏ శాస్త్రం చదివీ ఆ భావం నేను పొందలేదు. ఏ సాధనచేసీ ఆ భావం నేను సంపాదించలేదు."

'ఇంత గొప్ప భావం, ఇంత అద్భుతమయిన ఆలోచన మీకు మాత్రమే ఎట్లా కలిగింది ? మీకు ఈ భావం ఎప్పటి నుంచీ ఉందమ్మా ?'

"చిన్నప్పటి నుంచీ సహజంగానే ఉంది. చిన్నప్పటి నుంచీ నాకు ఎవరినీ చూసినా నా బిడ్డ అనే అనిపిస్తుంది. ఎక్కడో పుట్టారు, ఎవరో కన్నారు, ఇక్కడకు

వచ్చారు. అనిపించదు. మిమ్మల్నందరినీ నేను కన్నాను. మీ మీ తల్లులకు పెంపుడిచ్చాను - అనిపిస్తుంది".

అమ్మ వెలువరించే భావరసగంగలో మన్నన్ తల మునకలైనారు. తన్మయులైనారు. వారి ఆశ్చర్యానికీ ఆనందానికి అవధుల్లేవు.

ఆ సంభాషణ నాలకిస్తున్న నాకు అమ్మ బాల్యంలోని ఒక సంఘటన స్మృతిపథంలో మెదిలింది.

అమ్మ చినతాతగారయిన శ్రీ చంద్రమౌళి చిదంబరరావుగారు అమ్మను తన నిజస్థితిని వివరించమని అర్థిస్తూ "తెలుసుకుని విశ్వాసంతో నా వికారం పోగొట్టుకుంటా నమ్మా" అన్నారు. అపుడు అమ్మ "వికారంవల్లనే ఆకారం వచ్చింది తాతగారూ ! అందువల్ల ఆకారం ఉన్నంతరవకూ వికారం ఉంటూనే ఉంటుంది" అనగానే తారగారు "అమ్మా - ఈ అపూర్వమయిన భావాలు నీకెక్కడ నుంచి వచ్చాయి ? ఏ సాధన, ఏ తపస్సు చేసి ఈ జ్ఞానాన్ని సంపాదించావు ? పూర్వం ఏ ఋషులూ, ఏ తపస్వులూకూడా ఈ మాట చెప్పలేదు" అని ప్రస్తుతించారు.

నిజమే - మన భారతీయ ఋషులు ఎంతెంతో సాధనచేసి, తీవ్రమయిన తపస్సు చేసి, అపారమయిన ఆధ్యాత్మిక శక్తిని సంపాదించి, అద్భుతమయిన అపూర్వమయిన దర్శనాలనూ శ్రుతులనూ పొంది ఆ పరమ సత్యాన్నే లోకానికి ఉద్బోధించారు.

అవే వేదాలయినాయి. వేదాంగాలయినాయి. వేదాంతాలయినాయి.

ఈ వేదవేదాంగాలే మానవునికి కావలసిన సర్వ విజ్ఞానాన్నీ కూలంకషంగా అందించాయి. సృష్టిని గురించీ, సృష్టికర్త గురించీ తెలిపాయి. జీవుడ్ని గురించి ప్రవచించాయి. మానవ జీవన విధానాన్ని గురించి ప్రబోధించాయి. మానవ జీవిత లక్ష్యాన్ని నిర్దేశించాయి.

భారతీయ ఋషుల ఆలోచనాలతాంతం, తపఃఫలం అయిన హైందవ వేదాంతసారం - 'జీవబ్రహ్మైక్యానుసంధానమే' మానవ జీవిత పరమ గమ్యంగా అభివర్ణించింది, ఉద్ఘాటించింది.

ఆ పరమ స్థితికి, చరమ గమ్యానికి ఉన్నతోన్నత సాధనా మార్గమే 'ఆత్మవత్ సర్వభూతాని'. సర్వభూతాలను తనవలెనే చూడమని మన వేదాంతం ప్రబోధిస్తున్నది. సర్వభూతాలూ ఒక దానికంటే మరొకటి ఏమాత్రం భిన్నం కావని మన వేదాంతం

ఉద్ఘోషిస్తున్నది. భాగవతంలో పోతన లలిత మర్యాదుడయిన ప్రహ్లాదుని గురించి అభివర్ణిస్తూ - "తన యందు, అఖిల భూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాడు" అన్నాడు. అదే ఉత్తమపురుషుని ఉత్కృష్ట లక్షణమని పోతన భావన.

ఈ సత్యాన్ని అమ్మ కాదనడంలేదు.

కాని - ఈ ప్రవచన కంటే అమ్మ నిరంతరం తన మాట ద్వారా, చేతద్వారా మనకు అందిస్తున్న, అనుభూతం చేస్తున్న మరో మహత్తర ప్రబోధం ఉన్నది. అదే సర్వమాతృభావన. యావత్ విశ్వం యెడల చరాచర భేద రహితంగా "నేను అమ్మను; మీరు బిడ్డలు" అనే పరమోత్కృష్ట మధురాతి మధుర మహా భావన !

ఇంతవరకు లోకంలో ఎందరో మహానుభావులు, ఋషిపుంగవులు, యోగీశ్వరులు....

"అహం బ్రహ్మాస్మి" - అని సంభావన చేయగలిగారు.

"తత్త్వమసి" - అని ఉపదేశం చేయగలిగారు.

"అయమాత్మా బ్రహ్మ" - అని ప్రబోధం చేయగలిగారు.

"ప్రజ్ఞానం బ్రహ్మ" - అని సత్యావిష్కరణ చేయగలిగారు.

"సర్వం ఖల్విదంబ్రహ్మ" - అని బ్రహ్మదర్శనం చేయగలిగారు.

ఆ యోగులు, ఆ ఋషులు ఆత్మసాక్షాత్కారం పొందిన తర్వాత, బ్రహ్మానుభవం పొందిన తర్వాత, లోపలా వెలుపలా భాసించేదంతా ఒక్కటేనని తెలుసుకున్న తర్వాత, ఈ కనుపించే అనైక్యతిలోని ఐక్యతను గ్రహించిన తర్వాత - అంతర్ముఖులై ఆనందామృతపానమత్తచిత్తులై జీవితం ముగించారు. తాము తరించారు.

బహిర్ముఖులైన వారు - సర్వజీవులను తమవలెనే చూడమని, ప్రేమించ - మని ప్రబోధించారు.

కాని - నేడు అమ్మ ఇస్తున్న సందేశం, చేస్తున్న ప్రబోధం..... సర్వజీవులనూ మన బిడ్డలుగా చూడ-మనీ, మన బిడ్డలను మనం ఎట్లా ప్రేమిస్తామో అందరినీ అట్లా ప్రేమించమనీ.

అందరినీ తనవలెనే ప్రేమించడం గొప్ప విషయమే. కాని మానవుడికి, మానవుడి కేమిటీ పశు పక్ష్యాధులకూ, సమస్త ప్రాణికోటికీ - తనకంటే, తనను

కన్నవాళ్ళ మీదకంటే తాను కన్న వాళ్ళ మీదనే మక్కువ ఎక్కువ. ఒక ముద్ద అన్నం ఉంటే - దానిని బిడ్డకు పెట్టి తల్లి తాను పస్తు ఉంటుంది. చూలింతగానూ, బాలింతగానూ బిడ్డకోసం తల్లిచేసే పథ్యమూ, పడే కష్టమూ, తపన, తాపత్రయమూ త్యాగము చూస్తుంటే - తల్లికి బిడ్డ యందలి మమకారం - అర్థమవుతుంది.

మనిషికి తనకంటే ఈ లోకంలో అధికమైనదీ, ప్రియతరమైనదీ, మధుర తరమైనదీ మరొకటి లేదని అనుకునే విషయం యదార్థం కాదు. తనకంటే మనిషికి ప్రియమయినది తన సంతానమేనని అమ్మ ఉద్ఘాటిస్తున్నది.

అందువల్లనే సర్వసృష్టినీ "తన బిడ్డగా" చూసుకొనమని అంటే ప్రేమించ-మని అమ్మ నిరంతర ప్రబోధం.

"మన బిడ్డ యందు ఏమి చూస్తున్నామో - అందరియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం" అని అమ్మ ప్రవచనం.

మన బిడ్డ యందు మనం ఏమి చూస్తాము ? "ఆత్మావై పుత్రనామాసి" అని ఋషి వాక్కు. కాని అమ్మ అంతకంటే ఎక్కువే ఏదో చూస్తా మంటున్నది. ఒక్క క్షణం మనం అమ్మ సన్నిధిలో ఆసీనులం కాగలిగితే - పొంగులువారుతూ అదేదో - పరవళ్ళు తొక్కుతూ, మనసు పులకింపజేస్తూ, పరవశింపజేస్తూ మనకు సాక్షాత్కరిస్తుంది

(ఏప్రిల్ 1985)



### ఆనందం

అన్నం తినటం, ఆకలి తీరటం, నిద్రపోవటం... ఇవన్నీ సహజం. నిత్యకృత్యం కూడా. వీటన్నిటి కంటే అతీతంగా అనిపించేది ముఖం - ఆనందం.

- అమ్మ

# 192
# అనుభవసారము

ఈ సంవత్సరం మే 5వ తేదీన అమ్మ కల్యాణ దినోత్సవాల్లో ప్రముఖమయిన సంఘటనలు రెండు జరిగాయి. ఒకటి మద్రాసు సోదరులచే జిల్లెళ్లమూడిలో యాత్రికుల సౌకర్యార్థం నిర్మించబడిన భవనానికి అమ్మ ప్రారంభోత్సవం చేయడం, దానికి "పంచమి" అని అమ్మ నామకరణం చేయడం. రెండు - ఆనాడు సాయంకాలం సోదరుడు శ్రీమన్నవ బుచ్చిరాజుశర్మచేత వ్రాయబడిన పాటల సంపుటి "అనుభవసారం" గ్రంథావిష్కరణం.

శ్రీ బుచ్చిరాజుశర్మ 1954వ సంవత్సరంలోనే అమ్మవద్దకు చేరాడు. ఆ రోజుల్లో చాల కొద్దిమంది మాత్రమే అమ్మవద్దకు వెళ్ళి వస్తూండేవారు. ఆ అదృష్టవంతుల్లో రాజు ఒకరు. అప్పట్లో అమ్మే తనను చూడడానికి వచ్చేవారికి అన్నం వండి వడ్డించేది. ఎన్నో పారమార్థిక సాధన రహస్యాలను, ఆధ్యాత్మిక సత్యాలను అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు వెల్లడిస్తుండేది. ఎన్నో అతీంద్రియ శక్తులూ, దివ్యమహిమలూ అమ్మ సన్నిధిలో తరుచుగా జరుగుతుండేవి. తన జీవిత చరిత్రకు సంబంధించిన ఎన్నో నిగూఢ విషయాలను అమ్మ కథలు కథలుగా వివరిస్తుండేది. తన ఆధ్యాత్మిక అనుభవసారాన్ని కూడా ఆనాటి భక్తులకు అమ్మ అలతి అలతి పదాలతో అభివ్యక్తం చేస్తుండేది.

అట్లా అమ్మ చేతిమీదుగా అన్నం తిని, అమ్మ నోటివెంట అనవరతం రాలిపడే రత్నాలను ఏరుకుని మూటకట్టుకున్న మహాభాగ్యవంతుడు, అదృష్టవంతుడు శ్రీరాజు.

స్థూలంగా పరిశీలిస్తే - అమ్మ జీవిత చరిత్రను మూడు భాగాలుగా విభజింప వచ్చును. మొదటి భాగం అమ్మ జననం నుండీ వివాహం వరకు (1923-1936). రెండవ భాగం వివాహం నుండీ అంటే 1936 నుండీ 1956 వరకు. మూడవ భాగం 1956 నుండి ప్రస్తుతం వరకు జరుగుతన్న చరిత్ర. మొదటి భాగం అందరికీ తెలిసిదే. మూడవ భాగమూ తెలుసుకో దలుచుకున్న వారికి అనరోదా [illegible]

ఇకపోతే రెండవ భాగమే అతి నిగూఢంగా ఉండిపోయింది. ఆరెండవ భాగమే అమ్మ వైవాహిక జీవితానికి సంబంధించినది. ఆ రెండు దశాబ్దాల కాలం అమ్మకు మాత్రమే తెలుసును. ఆ కాలమంతా అమ్మ గర్భగుడిలో ఉండిపోయింది. ఆ తలుపులు మూసి ఉన్నాయి. తాళంచెవి అమ్మవద్ద మాత్రమే ఉన్నది. ఆ తలుపులు అమ్మే తెరవాలి. ఆ చీకటికోణాల్లో అమ్మే వెలుగును ప్రసారం చేయాలి.

1954 నుండి కొన్ని దివ్య ముహూర్తాల్లో గర్భగుడి తలుపులు అమ్మ తెరిచేది. కొద్ది మంది పుణ్యాత్ములు అమ్మదర్శనం చేసుకోగలిగారు. అమ్మ చరిత్రను తెలుసుకో గలిగారు. అమ్మ మహిమలను గమనించగలిగారు. అమ్మ జీవితంలోని ఆకాశచుంబిత పరమోన్నత దివ్యశిఖరాలను అవలోకించగలిగారు. ఆ పుణ్యజీవుల్లో శ్రీ రాజు ఒకరు.

ఏ సాధన చేయకపోయినప్పటికీ అమ్మ ఆధ్యాత్మికమయిన పరమానుభవాన్ని పొందింది. క్లిష్టతమమయినటువంటి యోగంలో పరాకాష్ఠ స్థితిని అమ్మ సాధించింది. అనంతమయిన జ్ఞానంయొక్క సారాన్ని అమ్మ గ్రహించింది. జీవితంలోని బాధనూ, దుఃఖాన్నీ, సుఖాన్నీ, ఆనందాన్నీ అనుభవించింది. లౌకిక అలౌకిక అనుభవసారాన్ని అమృతంవలె అమ్మ పుక్కిటిబంటిగా పానం చేసింది.

తన అపార అనుభవ సాగరంలోంచి అమృతాన్ని తీర్థంవలె ఉద్ధరిణలతో కొద్దిమందికి పంచింది.

శ్రీరాజు అమ్మ తన జీవితంలో సాధించిన ఆధ్యాత్మిక విజయాలకు ఆకర్షితుడయ్యాడు. అమ్మ తన జీవితంలో అనుభవించిన కష్టపరంపరకూ విచలితుడయ్యాడు. అమ్మ చూపిన అతిమానవ సహనానికి విస్మితుడయ్యాడు. తాను కళ్ళతో చూసిన, చెవులతో విన్న విషయాలలో ఆవేశభరతుడై "పాడనా నాహృదయ వీణపై......." అని ఆలపించాడు. "వెలలేని నీ గాధ వినిపించెద, లోకాన నీ జ్యోతి వెలిగించెద...." అని ఎలుగెత్తి చాటాడు. "పాడుచు పాడుచు నీకథ చాటుచు పయనించెదనో యమ్మా, ప్రాణము వదిలెదనోయమ్మా......" అంటూ శపథం చేశాడు.

"ఎంత మంచిదానవో యమ్మా

నీ దెంత మంచి విధానమో యమ్మా......" అని శ్రీరాజు 1956 ఫిబ్రవరి 15వ తేదీన మొట్ట మొదటి పాట వ్రాశాడు. మొదటి పాటలోనే "స్వభావ మధుర"

అయిన అమ్మలోని మానవాతీత కమనీయ తత్త్వానికి అక్షరాకృతిని కల్పించి స్వరబద్ధం చేసి లోకానికి అందించాడు. లోకం విచిత్రంగా విని, కళ్ళు ఇంతలు చేసుకొని అమ్మవంక తలయెత్తి చూసింది. అమ్మలోని అతిమానవత్వమూ, అతిలోక శక్తీ మెరుపుల్లా మెరిశాయి. జనం కళ్ళు మిరుమిట్లు గొలిపాయి.

తర్వాత హృదయం స్పదించినప్పుడల్లా వ్రాసిన ఒక్కోపాట అమ్మ చరిత్రలోని సంఘటనకో, అమ్మతత్త్వానికో, మహిమకో సంబంధించి ఉంది. అమ్మజీవితంలోని రెండవ అధ్యాయానికి సంబంధించిన అనేక అజ్ఞాత సంఘటనలు ఈ పాటల్లో మనకు సాంకేతికంగా దర్శనం ఇస్తాయి. అమ్మతత్త్వం, ముఖ్యంగా అమ్మ అనిర్వచనీయ మయిన సహనం అనేక గీతాల్లో సుస్పష్టంగా మనకు అవగాహనమై మన మనస్సులనూ కల్లోలపరుస్తుంది. మరి, రచయిత ఎంత విలవిలలాడిపోయి ఉంటాడో !

అమ్మ ఒడిలో పెరుగుతూ, అమ్మ బడిలో పాఠాలు చదువుకుంటూ శ్రీరాజు 'అమ్మతోడిదే లోకం'గా భావించేడు. అమ్మతో తాదాత్మ్యాన్ని పొందాడు. 'కన్నులు మూసిన కన్నులు తెరచిన కనబడు చుండున దెవరమ్మా ?' అంటాడు. 'గడియ గడియకు కనిపించును విడువలేను నీ పదాలు' అంటాడు. 'నీ మాట నామాట ఒకటేనులే' అని ఒక చోట 'నీ మనసు నా మనసు ఒకటేనులే' అని ఇంకొక చోట అంటాడు. 'నీ అడుగుజాడలే నా ఆదర్శమ్మా, నీ మనుగడే భువిని నా జీవితమ్మా, గాఢాంధకారంబు బాపావులే, వెలుగు చూపావులే' అని తన స్థితిని చెప్పుకున్నాడు. అమ్మ అతనికి జ్ఞానాన్ని ప్రసాదించింది. ఆ జ్ఞాన నేత్రంతో అమ్మ అనుభవసారాన్ని గ్రహించడమే కాకుండా ఆ అనుభవసారాన్ని తనదిగా కూడా చేసుకున్నాడు.

అమ్మా ---  
నీవే, నీవే నమ్మా  
సంతోషంబులో, సంతాపంబులో  
సంగీతంబులో, నాదు గీతంబులో.....

నాదు శ్వాసంబులో, నాదు ధ్యానంబులో..... అంటూ అంతటా అమ్మనే చూస్తూ, వింటూ తన్మయమై పోయాడు రచయిత. ఆ తన్మయతే పాటలకు మాధుర్యాన్నీ, రామణీయకాన్నీ సంతరించిపెట్టాయి.

అమ్మ అనుభవసారాన్ని శ్రీరాజు సంగ్రహంగా తెలిపాడు. ఈ సర్వం బ్రహ్మయనే, ఈ ఆత్మే బ్రహ్మయనే, ప్రజ్ఞానం బ్రహ్మయనే ఆ బ్రహ్మపు నీవయనే...

ఆత్మావలోకన అమ్మకు కలిగిందంటాడు మరొకచోట మరీ క్లుప్తంగా సూటిగా చెప్పాడు. 'ఈ సర్వం ఒకటిగా అనిపించు నీకు, ఈ సర్వం నీవుగా అనిపించు మాకు' - అని.

ఇలా అమ్మ అనుభవసారాన్నీ, తన అనుభవసారాన్నీ కలిపి రంగరించి మధురమయిన పాటలుగా తయారుచేసి లోకానికి అందించిన శ్రీ రాజు జీవితం ధన్యమయింది. శ్రీ వేంకటేశ్వరుని స్తుతించిన అన్నమయ్య, శ్రీరాముని గానం చేసిన త్యాగయ్య, మధుర మీనాక్షి దేవిని స్తోత్రం చేసిన ముత్తుస్వామి దీక్షితులు, కంచి కామాక్షిదేవిని స్తవం చేసిన శ్యామశాస్త్రి, మువ్వగోపాలుని పాటలలో మురిపించిన క్షేత్రయ్య, భద్రాద్రిరాముని సేవించిన రామదాసు... . వీరంతా వివిధ ఆకృతుల్లో వెలసిన పరమేశ్వరుణ్ణి కృతుల్లో ఆరాధించి ధన్యులయ్యారు. శ్రీరాజు ఆ కోవకు చెందిన వాగ్గేయకారుడు. వాళ్ళందరూ పరోక్షాను భూతి కలిగినవారు శ్రీరాజు ప్రత్యక్షానుభూతి కలిగిన భాగ్యశాలి. అమ్మ గురించి సృష్టింపబడ్డ సాహిత్యానికి ఆద్యుడు. అతడు మనందరికీ అగ్రజుడు, ఆదర్శము. 'అనుభవసారం" గాయకులకు సంగీతార్ణవమే కాదు; సామాన్యులకూ నిత్య పఠనీయం.

(మే 1985)



## ఎక్స్పీరియన్స్

నాదృష్టిలో ఎక్స్పీరియన్సుల్లేవు ఎవరికీ, సర్వకాల సర్వావస్థలయందూ అంతా ఒకటేననే భావమే ఎక్స్పీరియన్సంటే. ఏ అమ్మ అయితే ఉన్నదో అదే అన్నీ అనే భావమే. అమ్మ ఇచ్చింది, అమ్మ చంపింది, అమ్మ పెళ్ళి చేసింది - అని తోచిననాడే ఎక్స్పీరియన్సు కాని లేనినాడు లేదు.

- అమ్మ

# 193
# అవతార పరిసమాప్తి

దివ్యశక్తి ఎప్పుడు ఏరూపంలో అవనీస్థలిపై అవతరించినప్పటికీ - ఆ కాలంలో లోకమే ఒక అలౌకిక అనుపమ కాంతితో వెలిగిపోతుంది లోకంలో ఈ కాంతి ప్రసారం బహు అరుదుగా మాత్రమే జరుగుతుంది. ఆ దివ్యకాంతివల్ల మానవాళి మహోపకారం పొందుతుంది

తనను గురించి మాత్రమే ఆలోచించుకుంటే మానవుడు.
అందరిని గురించీ ఆలోచిస్తే దైవం !
- అని అపూర్వంగా నిర్వచించింది అమ్మ

ఇంతవరకు భూమిమీదకు ఎందరో అవతారమూర్తులు అరుదెంచారు కానీ అందరూ "శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ" అని విభజన రేఖలు గీచుకున్న వారే. అందరి యోగక్షేమాల గురించి ఆలోచించిన వ్యక్తులు చరిత్రలో మనకు ఇంతవరకు కనుపించలేదు

అమ్మ మాత్రమే అందరి యోగక్షేమాలనూ విచారించింది. 'సర్వేజనాసుఖినో భవంతు' అనీ 'లోకా స్సమస్తా సుఖినో భవంతు' అనీ అమ్మ మాత్రమే త్రికరణ శుద్ధిగా ఆకాంక్షించింది.

ఎవరిని చూసినా నాకు నా బిడ్డే అనిపిస్తుంది --- అన్న ప్రకటన ద్వారా జగజ్జననిగా...

ఇదంతా అదే --- అన్న ప్రబోధం ద్వారా జగద్గురువుగా....

ఇదంతా నేనే, మీదంతా నేనే, మీరంతా నేనే, ఈ సృష్టి నాది... అన్న ప్రవచనాల ద్వారా జగదీశ్వరిగా .

ఎంత వెదికినా అది కానిది కనిపించడం లేదు - అన్న స్థితి వలన పరమజ్ఞానిగా...

భిన్నమస్తక స్థితి వలన యోగీశ్వరేశ్వరిగా...

అమ్మ బహుముఖాల - లోకానికి అభివ్యక్తమై, వివిధ దేవతా మూర్తుల్లో సాధకులకు దర్శనం ఇచ్చి, అర్తులకు వరప్రదాయినిగా, వాంఛితార్థ ప్రదాయినిగా ఆపద్బాంధవియై ---

విశిష్ట అవతార మూర్తిగా విశ్వవందిత అయింది.

1923, మార్చి 28వ తేదీన జననమంది 62 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా, అనుపమానంగా లోకంపై వాత్సల్యాన్నీ, ప్రేమనూ, ఆదరణనూ, కారుణ్యాన్నీ, జ్ఞానాన్నీ కుంభవృష్టిగా కురిపించింది. దైవత్వంతోపాటు మాతృత్వాన్నీ మేళవించి ఒక అపురూపమయిన వ్యక్తిత్వానికి రూపకల్పన చేసి లోకానికి ఇంతకు ముందు ఎరుగని క్రొత్త అనుభవాన్ని ప్రసాదించి లాలనతో పాలనతో పరవశింపజేసింది.

కాలాన్ని శాసించిన అమ్మ, కాలస్వరూపిణి అయిన అమ్మ కూడా కాలనియమానికి బద్ధురాలు కాక తప్పలేదు. పరిమితులకు లోబడిన, పరిణామశీలి అయిన పార్థివ శరీరానికి అద్యంతాలు అత్యంత సహజం. రూపం పరిమితం, శక్తిఅనంతం - అని చాటిన అమ్మ పరిమితులనూ, పరిధులనూ అధిగమించి అనంత శక్తి స్వరూపిణి అయింది.

ఈ పరిణామం 1985 జూన్ 12వ తేదీన జరిగింది.

1923-85 మధ్యకాలం జగతికి స్వర్ణయుగం. ప్రేమ రక్త మాంసాదులు ధరించి మానవాళిని మురిపించిన కాలం. కారుణ్యానికి కరచరణాదులు కలిగి లోకాన్ని కనికరించిన తరుణం. జ్ఞానం వాగ్రూపం ధరించి లోకాన్ని ప్రతిధ్వనింపజేసిన సమయం.

★ ★ ★

మే నెల ఆరంభం నుంచే అమ్మకు అనారోగ్యం మొదలయింది. మూత్రకోశం కొద్దిగా దెబ్బతిన్నది. గుండె జబ్బు, మధుమేహం, రక్తపోటు తీవ్రంగా బాధించ సాగాయి. రక్తమంతా ఈశ్వరత్వమే - అని ప్రవచించిన ఈశ్వరిలో రక్తక్షీణత కలిగింది. సర్వ నాడీమండలం క్రమంగా బలహీనం కావడం ఎక్కువయింది. ఫలితంగా శరీరంలో నీరు చేరడం మొదలై శరీరం నీటికుండ అయింది.

డాక్టర్ విద్యాసాగర్, డాక్టర్ ఇనజకుమారి చికిత్స చేశారు. చాలా బలమైన ఔషధాలను వాడారు. సర్వ వ్యాధులూకూడా ప్రబలం గానే ఎదురు తిరిగాయి.

అమ్మ అజేయమైన శక్తి ముందు అందరూ ఓడి పోవలసిందే - అని మనం తరుచుగా అనే మాటను ఆధారం చేసుకుని 'మెడికల్ సైన్సు కూడా ఓడిపోతున్నది' అని డాక్టర్లను పరిహసించింది. ఈ ఘర్షణలో అమ్మ శరీరం అమితమైన బాధకు గురి అయింది. సహన స్వరూపిణి అమ్మ "బాధ భరించలేదు. శరీరం తట్టుకోలేక పోతున్నది" అని వివరిస్తూ "శిధిలమయ్యే ఈ శరీరానికి ఎన్నాళ్ళని పోటీలు పెట్టమంటారు' అని ప్రశ్నిస్తూ, "సహనం చచ్చి పోయిన పిదప బ్రతక్కూడదు" అని చమత్కరిస్తూ, "నేను వచ్చిన పని అయిపోయింది. ఇక నన్ను పోనీండి. నవ్వుతూ నన్ను పంపించండి" అని తరుచుగా అడిగింది.

వైద్యుల శ్రమ ఫలించింది. మే నెల చివరకు అమ్మకు నీరు బాగా తగ్గింది. కాని, ఏం లాభం ? పర్యవసానంగా శరీరంలోని లవణాలు, నీరు..... ఒకదేమిటి ? సర్వ ప్రాణావసర పదార్థాలు లోపించాయి. రక్త పోటు బాగా పడిపోయింది. జూన్ 2వ తేదీన ప్రాణాపాయ పరిస్థితి ఏర్పడింది. డాక్టర్లు మళ్ళీ తీవ్రస్థాయిలో చికిత్స చేశారు. నరాల ద్వారా లవణాలు, నీరు ఇచ్చారు. ఆ స్థితిలోనే అమ్మ ఆవరణలోని అనేకులకు అంతిమ సందేశం ఇచ్చింది. ఒక్కొక్కరిని పిలిపించి మాట్లాడింది.

చూడ వచ్చిన వారందరికీ అమ్మ నమస్కరించింది. ఆ నమస్కారాలకు ఒక్కొక్కరు గతుక్కు మంటుంటే "మీరందరూ మహానుభావులు, దైవస్వరూపులు. అందుకే అందరికీ వందనాలు" అన్నది.

అమ్మకు సెలైన్ ఇవ్వడానికి ప్రయత్నాలు జరుగుతుంటే వాళ్ళను వారిస్తూ అమ్మ అన్నది "ప్రయాణానికి సిద్ధంగా ఉన్న నాకెందుకూ ఈ సెలైన్ ? అన్నపూర్ణాలయానికి ఇవ్వండి -" అని. అన్నపూర్ణాలయం గంట వినిపించ లేదని తహతహలాడింది. తాను ఉన్నా, లేకపోయినా అన్నపూర్ణాలయం గంట నిత్యం వినిపించాలన్నది. అన్నపూర్ణాలయం గంట ఆగిపోతే తన గుండె ఆగిపోతుంది - అన్నది. ఆ ఘంటానాదంలోనే సర్వ వేదసారం ఉన్నది - అన్నది.

"అందరినీ ఒకసారి చూడాలి, పిలిపించరా" - అని అడిగింది.

ఆవరణలోని అనేకులు వచ్చి అమ్మ పరిస్థితి చూసీ, అమ్మ మాటలు వినీ భోరు భోరున దుఃఖించారు. అమ్మ కూడా కన్నీరు కార్చింది. కలగబోయే వియోగ బాధకు బిడ్డలు ఎట్లా తట్టుకుంటారూ - అన్న ఆలోచనే అమ్మ కన్నీటికి కారణం కావచ్చును.

కానీ ఆ ప్రమాదం తప్పింది. రాజమండ్రి నుంచి డాక్టర్ జస్వంత్, నెల్లూరు నుంచి డాక్టర్ యస్వీ. సుబ్బారావు గారు వచ్చారు. అమ్మను పరీక్షించి ప్రమాదం తప్పినట్లు ప్రకటించారు అందరూ ఎంతగానో ఆనందపడ్డారు.

అంతకు పూర్వమే వైద్యుల సలహా ననుసరించి అమ్మదర్శన కాలాన్ని తగ్గించడం జరిగింది. కానీ జూన్ 3వ తేదీ ఉదయం అమ్మ స్నానం చేసి, చీరె కట్టుకుని, నుదుట ఇంత బొట్టు పెట్టుకుని మంచం పై కూర్చుని దర్శనం ప్రసాదించింది. ఆనాటి అమ్మ ముఖంలోని వర్చస్సును చూసి మాతోపాటు డాక్టర్లూ దిగ్భ్రాంతి చెందారు.

రోజులు గడిచాయి

11వ తేదీ రాత్రి అమ్మ నన్ను పిలిపించి అనేక విషయాలు మాట్లాడింది. తాను వచ్చిన పని అయిపోయిందన్నది ఇంక బ్రతకడం అనవసరం అన్నది నాకు దుఃఖం ఆగింది కాదు. సంస్థను యధాతధంగా కొనసాగించమని - ఆదేశించింది. ఎప్పటికివలెనే తాను అన్నీ చూసుకుంటా - నని వాగ్దానం చేసింది.

12వ తేదీ ఉదయానికి అన్ని వ్యాధులూ నయమయ్యాయి. అమ్మ చికిత్సలో పాల్గొనడానికి బృందావనం నుంచి వచ్చిన డాక్టర్ జానకీదేవి అమ్మకు పూర్ణమయిన ఆరోగ్యం కలిగినట్లు ప్రకటించింది. ఇక నుండి అమ్మ త్వరగా కోలుకొనగలదని ఆశాభావాన్ని వ్యక్తం చేసింది.

ఆ మధ్యాహ్నం అమ్మ కొందరికి దర్శనం అనుగ్రహించింది స్వయంగా తన చేతి మీదుగా ప్రసాదాలు ఇచ్చింది.

సాయంకాలం స్నానం చేసింది. కుర్చీలో కూర్చొని నామసంకీర్తన విన్నది ఆ రాత్రికి 8 గంటల తర్వాత తాడేపల్లిగూడెం నుంచి వచ్చిన యాత్రిక దంపతులకు దర్శనం ఇచ్చి ఆశీర్వదించింది. నాకు పని అంటూ వుంటే మీకు కనబడడమే - అని ప్రకటించిన అమ్మ తుది శ్వాస వరకు తన బిడ్డలకు ప్రేమగా దర్శనం ప్రసాదించింది. నన్ను చూడడమే పుణ్యం అన్న అమ్మ ఎంత మందిని పుణ్యాత్ములను చేసిందో !

హఠాత్తుగా అమ్మ శ్వాసలో మార్పు వచ్చింది. ప్రాణ వాయువు చాలక బాధపడింది బాపట్లలో ఉన్న డాక్టర్ల కోసం, పరికరాల కోసం కబుర్లు వెళ్ళాయి.

డాక్టర్ ఇనజ కుమారి వచ్చింది ప్రాణవాయువు, పరికరాలు వచ్చాయి. అవసరమయిన ఏర్పాట్లు జరిగాయి. అమ్మ తల నా చేతుల్లోనే ఉన్నది. డాక్టర్లు, కొడుకులు కోడళ్ళు, వసుంధర . అంతా అక్కడనే ఉన్నారు, చూస్తూనే ఉన్నారు. అమ్మ అనాయాసంగా, అతి ప్రశాంతంగా ప్రాణాలు వదిలింది. మీ ఇష్టప్రకారం నడుస్తున్నట్లు కనిపిస్తాను కానీ నా ఇష్ట ప్రకారమే మిమ్మల్ని నడుపుకుంటాను - అని ప్రవచించిన అమ్మ తన నిర్ణయాన్ని అమలుపరిచింది. నేనేం చేసినా, మీ కోసమే నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా మీ కోసమే - అని వివరించిన అమ్మ అసువులు విడనాడడం కూడా మన మేలుకోసమేనేమో ! మరి, అమ్మ అవతరించింది మన కోసం, జీవించింది మన కోసమే అయినప్పుడు, ఈ ఉపసంహారం మాత్రం మన కోసం ఎందుకు కాదు? మీ అవసరాలు మీకు తెలీవు. మీ అవసరాలు నాకు తెలుసు - అని అమ్మ ఘంటాపథంగా చెప్పింది కదా ?

రాత్రి 10.35కు అమ్మ చెప్పినట్లు వైద్య విజ్ఞానం అమ్మ పాదాల ముందు అవనతమై పోయింది అమ్మ తుదిశ్వాస వదిలింది. అందుక్కారణం వైద్యులకు అంతుబట్టలేదు ఇక నుండి తన యావత్ సంతానాన్నీ అధివ్యాధుల నుండి కాపాడ వలసిన శరీరం వ్యాధి గ్రస్తమై ఉండటం సముచితం కాదనేమో సర్వవ్యాధుల నుండీ తన దేహాన్ని వినిర్ముక్తమై, వినిర్మలమూ, విరుద్ధమూ చేసింది.

దివ్య ప్రక్రియ అంతరార్థమూ, దివ్య ప్రణాళిక పరమార్థమూ ఏమయి నప్పటికీ... దివ్యశక్తిని మనం అర్థం చేసుకునేందుకూ, ప్రేమను మనం పొందేందుకూ దేనిని అమ్మ ఉపకరణం చేసుకుందో ఆ పార్థివ శరీరమే, ఆ పాంచభౌతిక దేహమే ఇక మనకు కనుపించదనేసరికి అందరూ నిర్వీర్యులూ, నిస్తేజులూ అయినారు కాలవనిండుగా నీరున్నా, దాహం తీర్చుకోవడానికి రేవు కావాలి కదా ? దైవశక్తి సర్వవ్యాప్తమై ఉన్నా, మన కళ్ళకు కనిపించింది ఆ మృణ్మయ శరీరమే కదా ! మనం పూజించుకుంది ఆ శరీరాన్నే కదా ! మనకు ఏ ఆపద వచ్చినా, ఏ అవసరం కలిగినా మనం పరుగు లెత్తింది ఆ పాదాల వద్దకే గదా ! ఆ మూర్తే మనకు జ్ఞానజ్యోతి ! ఆర్తే మనకు ప్రేమరీతి !

ఆవరణంలోని అందరూ, గ్రామస్థులందరూ అమ్మ నివాసానికి వచ్చారు వాతావరణమంతా ఉత్తుంగ తరంగిక దుఃఖసాగరమైంది.

కొందరు ముఖ్యులకూ, పత్రికలవాళ్ళకూ రేడియోవారికి వార్తలు వెళ్ళాయి. అంతకు ముందు ఆరు నెలలుగా పనిచేయని ఫోను ఆ క్షణాల్లో విచిత్రంగా పనిచేసి అమ్మకు విధేయతను ప్రకటించింది.

ఆ శరీరాన్ని ఏం చేయాల్సిందీకూడ అమ్మ ముందుగానే చెప్పింది. ఆ ఆదేశానుసారమే అనసూయేశ్వరాలయంలో లోగడ నాన్నగారిని ప్రతిష్ఠించినట్లుగానే ఆ గర్భాలయంలో అమ్మకోసం నిర్ణీతమయిన స్థలంలో అమ్మను ప్రతిష్ఠించడానికి నిర్ణయమయింది.

అమ్మ గం. 10.35 కు ప్రాణం వదిలితే, ఆ క్షణం నుంచీ క్షణ క్షణం ముఖంలో దీప్తి అధికమవుతూ గం. 11.30 ని. అయ్యేసరికి అమ్మముఖం పున్నమినాటి చంద్రబింబంలాగా ప్రకాశించింది. ఆ వెలుగు చివరి వరకూ చూచేవాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూనే ఉన్నది.

13వ తేదీ తెల్లవారే సరికి ఈ విషాదవార్త దేశమంతా తెలిసింది. అన్ని పత్రికలూ మొదటి పేజీలో ప్రచురించాయి. రేడియో ప్రాంతీయ వార్తల్లోనూ, జాతీయ వార్తల్లోనూ ప్రకటించింది. అందువల్ల భక్తులు వేల సంఖ్యలో చివరి దర్శనం చేసుకోగలిగారు.

ఆ రోజంతా అమ్మ సన్నిధిలో లలితాసహస్రనామ పారాయణ జరిగింది. అమ్మ నామసంకీర్తన జరిగింది. సుప్రభాత సంధ్యా వందనాలు మామూలుగానే జరిగాయి. అన్నపూర్ణాలయం గంట అమ్మకు వీనుల విందు చేసింది.

14వ తేదీ ఉదయం మహా యాత్ర ప్రారంభమైంది. ఆ గదిలోనే అమ్మకు స్నానం చేయించి, బిన్నీ సిల్కు చీరె, సర్వాభరణాలు అలంకరించారు. గది బయటకు తీసుకువచ్చి మంచంపై పడుకోబెడితే - ప్రాణం లేనట్లు ఏమాత్రం లేదు. అతి ప్రశాంతంగానూ, అధిక తేజోవంతంగానూ ఉంది ముఖం. సుమారు గం. 7.00లకు అమ్మను మంచంపై బయటకు తీసుకువచ్చి అలంకరించబడ్డ బండిపై ఉంచారు. గ్రామస్థుల కోరికపై గ్రామంలో హాహాకారాలతో, జయ జయ ధ్వానాలతో, మంగళ వాద్యాలతో ఊరేగింపు జరిగింది.

హైమాలయంలో ప్రత్యేకంగా నిర్మించిన ఉన్నతమైన వేదికపై అమ్మ మామూలుగా పూజావేళల్లో కూర్చునే సింహాసనంలో అమ్మను ఆసీనను చేశారు. వెయ్యి లీటర్ల పాలతో అమ్మకు అభిషేకమూ, పుట్టిపూలతో పూజా జరిగాయి. ఈ అభిషేక అర్చనల్లో అందరూ పాల్గొన్నారు. ఆ పూజలో పాల్గొన్న వారెవరూ అది ఒక విగతజీవికి చేసే పూజగా భావించలేదు. ఏ జన్మదినోత్సవంలోనో, కల్యాణ దినోత్సవం లోనో అమ్మకు చేసే పూజగానే ఉత్సాహంగా జరిగిపోయింది.

మధ్యాహ్నం గం. 1.30 ని.లకు అమ్మ అనసూయేశ్వరాలయ ప్రవేశం చేసింది. గం. 1.58 ని.లకు గర్భాలయంలో ప్రతిష్ఠ జరిగింది. భూగృహంలో సర్వాభరణభూషిత అయిన అమ్మతోపాటు, అమ్మ స్వయంగా వాడుకునే వస్తువులూ, అమ్మ జీవిత చరిత్ర (మాతృశ్రీ జీవిత మహోదదిలో తరంగాలు), లలితా సహస్రనామానికి భారతీవ్యాఖ్య, త్రయీవిద్య గ్రంధాలూ నిక్షిప్తం చేయబడ్డాయి. ఆ భూగృహాన్ని, ఆ చింతామణి గృహాన్ని లవణం, విభూతి, కుంకుమలతో నింపేసరికి సాయంకాలం గం. 3.00 అయింది. ఆసనం వేయించడంలో, ప్రతిష్ఠించడంలో శరీరం రబ్బరు బొమ్మవలె సహకరించింది.

ఆ మర్నాటి నుండి 11 రోజులు అనసూయేశ్వరాలయంలో అభిషేకాలూ, పారాయణలూ, లక్షనామార్చనలూ అధికంగా జరిగాయి. పూర్ణాహుతినాడు సాయంకాలం అమ్మ నివాసాన్ని 'వాత్సల్యాలయం'గా నామకరణం చేసి అమ్మ ఫొటోలు, వస్తువులు అందరూ దర్శించేందుకు వీలుగా మార్చబడగా, శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు దానిని ప్రారంభించారు.

ఆ సభలో - అమ్మ ఆదేశానుసారం, అమ్మ అభీష్టాను సారం అమ్మ ప్రారంభించిన అమ్మ సంస్థలు యధాతధంగా కొనసాగుతాయని శ్రీ విశ్వజననీ పరిషత్ ప్రకటించింది. తాను ఇకముందు కనపడనని ఎవరూ బాధపడవద్దని అభయమిస్తూ, ఎప్పటిలాగే బిడ్డల నందరినీ తాను కనిపెట్టి ఉంటానని అమ్మ ఇచ్చిన హామీ కూడా సభా ముఖంగా అందరికీ అందించబడింది. దానితో - అప్పటి దాకా నీటిలో మునిగిన వారు ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయినట్లు గుండె బరువెక్కి ఉన్నజనం నీటి నుండి తలలు బయటకు వచ్చినట్లు కొద్దిగా గాలి పీల్చుకున్నారు. గుండెబరువు దిగినట్లయింది. కారుచీకటిలో ఆశాజ్యోతి వెలిగింది,

★ ★ ★

అమ్మ - అమ్మంటే ఏమిటో ఎంతో వివరంగా చెప్పింది. అమ్మ అంటే అంతులేనిదీ, అడ్డులేనిదీ, అన్నిటికీ ఆధారమైనదట. అమ్మ అంటే ఈ నాలుగు గోడల మధ్య మంచంపై కూర్చున్న ఈ నాలుగడుగుల పది అంగుళాల వ్యక్తి కాదు. ఈ సర్వానికీ ఆదీ అంత్యమూ ఏదో, దేనికి ఆదీ అంతమూ లేదో అదే అమ్మ -అని కూడా ప్రవచించింది. రూపం పరిమితం, శక్తి అనంతం - అన్నది. నేను నేనైన నేను - అన్నది. అన్ని నేనులూ నేనే - అన్నది. ఇదంతా నేనే - అన్నది. మీరంతా నేనే - అన్నది.

ఇంత వివరంగా చెప్పిన అమ్మకు - ఇక అంతం ఏమిటి ? రూపానికి పరిమితి ఉన్నది. కనుక కళ్ళు తెరచిన మాత్రాననే ఎవరికైన కనుపించే ఆ మహాలావణ్య శేవధి, ఆ నిరుపమ సౌందర్య జలధి, ఆ కనువిందైన కమనీయ రూపం కనుమరుగు కావచ్చునూ, కరువు కావచ్చునూ, అమ్మ అశరీరి, అస్వాయువూ కావచ్చునూ. కానీ మహిమాన్విత మయిన ఆ దివ్యత్వం, మధురాతి మధురమయిన ఆ మాతృత్వం, అఘటనా ఘటన సమర్థమూ, అనంతమూ అయిన ఆ శక్తి ఎక్కడకు పోతుంది? ఎక్కడకూ పోదు. అంతటా ఉంటుంది. ఎల్లప్పుడూ ఉంటుంది. పరిమిత శరీరం విడిచే సరికి ఇప్పుడు అమ్మ సహస్ర పాదాలతో, సహస్ర కరాలతో, సహస్ర శీర్షాలతో విరాడ్రూప. విశ్వసాక్షి. విశ్వరూపిణి. విశృంఖల. మహోజ్జ్వల.. చతుష్షష్టి కళారూప. సర్వాత్మ స్వరూపిణి. అమ్మ పంచభూతాలూ ఉన్నంత కాలం ఉంటుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఉన్నంతకాలం ఉంటుంది. భూమిపై మనిషి ఉన్నంత కాలం ఉంటుంది. మనిషి మనిషిలో ప్రాణ రూపిణియై, ప్రేమ స్వరూపిణియై అలరారుతుంది అమ్మ అవినాశ. అమ్మ అనంత, అమ్మ అక్షర అమ్మ అజరామర.

మనం లోపలికి అవలోకిస్తే అమ్మ, బయటకు ఆలోకిస్తే అమ్మ. మరి, అన్ని నేనులూ నేనే నన్నది కదా ! ఇకనుండి మనలో ఉండే మనను నడిపిస్తుంది, మనను కనికరిస్తుంది, మనను కాపాడుతుంది అమ్మ.

అయినా - నాన్నగారి పక్కనే నాస్థానం. ఎప్పటికైనా నా నివాసం అనసూయేశ్వరాలయమే - నని సుస్పష్టంగా ఎన్ని పర్యాయాలో అమ్మ చెప్పింది

కనుకనే ఈ అనంత శక్తి సాగరానికి రేవూ, మానవాళికి శాశ్వత తీర్థయాత్రాస్థలం జిల్లెళ్ళమూడి అయింది. సర్వ ప్రజానీకానికీ అభయప్రదాయినియై, ఆశాజ్యోతియై అనంతదీప్తితో వెలుగొందుతున్నది అనసూయేశ్వరాలయం.

**అమ్మా - మహాపూజ్యా, మహేశ్వరీ, మహారతీ !**<br>
**అందుకో అందుకో ఆదరంతో మా హారతీ !**



# 194
# అమృత సందేశం

మిమ్మల్ని వదిలి నేను మాత్రం ఎక్కడకు పోతానురా ?

నేను మీతోనే ఉంటాను, మీకు కనపడకపోవచ్చును గానీ.

ఎప్పుడులాగే మిమ్మల్ని నేను చూసుకోనూ ? బిడ్డల యోగక్షేమాలు చూసుకోవడం తల్లి ధర్మం.

అన్నపూర్ణాలయం, విద్యాలయాలు, వైద్యాలయాలు, దేవాలయాలు.. అన్నిటినీ యధావిధిగా కొనసాగించండి

ఎట్లా నడపడం ? - అని భయపడవద్దు. ఇప్పుడు మాత్రం ఇదంతా (ఈ సంస్థను నడపడం) మీరు చేస్తున్నారా ? మీద్వారా జరుగుతున్నది, మీరు నిమిత్త మాత్రులు. ఇప్పుడు ఏ శక్తి జరుపుతున్నదో ఇకముందు కూడా అదే శక్తి జరుపుకుంటుంది.

ఈ సంస్థ ముందుముందు మహోజ్జ్వలంగా ఉంటుంది.

సాధకులకు, యోగులకు, తపస్వులకు ఈ నేల నిలయమవుతుంది. యాత్రికులకు జిల్లెళ్ళమూడి మహాక్షేత్రం అవుతుంది

నేను కనపడను - అని దుఃఖపడకండి.

అవసరమయినప్పుడల్లా కనిపిస్తాను.

(11-6-85 రాత్రి రామకృష్ణతో చెప్పిన మాటలు)

# 195
# అమ్మ ప్రతిరూపాలు

ఎంత విచిత్రమయిన పరిస్థితి ! ఆలోచిస్తే - ఎంత ఆశ్చర్యకరంగా ఉంటుందో!

అమ్మ అఘటనఘటనాసమర్థ, సర్వశక్తి సముపేత - అని అనేక సందర్భాల్లో మనకు విదితమయింది. అయినప్పుడెల్లా మన విశ్వాసాన్ని పెంచింది. మనకు ఆనందాతిశయాన్ని కలిగించింది. కానీ ఈ సన్నివేశం వేరు. మనలో నిరవధిక మయిన, నిరుపమానమయిన విషాదహోమానికి అంకురారోపణ చేసింది.

జిల్లెళ్ళమూడిలో అమ్మ కేంద్రంగా ఒక సంస్థ ఏర్పడింది. అమ్మకోసంగానే అక్కడ ఎందరో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. అమ్మ కోసం అంటే అమ్మ సేవచేసి తరించాలనీ, అమ్మను అనుక్షణం చూసి ఆనందించాలనే ఆశతో, ఆశయంతో ఎందరో అక్కడికి చేరారు. క్రమేణా ఆ ఆశా, ఆశయాలు వారి ఉచ్ఛ్వాస నిశ్వాసాలే అయినాయి. వారికి అమ్మ తోడిదే లోకం, అమ్మే వారి పంచప్రాణాలు, అమ్మే వారి ఆహార పానీయాలు, అమ్మే వారి సర్వేంద్రియాల చైతన్యం, అమ్మే వారి సర్వ నాడీ మండల ఉద్దీపకశక్తి, అమ్మే వారి జీవిత సర్వస్వం.....గా పరిణామం చెందింది. ఆ సంస్థలో, ఆ పవిత్రక్షేత్రంలో స్థిరనివాసులు కాకపోయినా..... ఇలాంటి వ్యక్తులూ భక్తులూ ఎందరో ఏర్పడ్డారు.

ఈ నిర్మాణంకూడా అమ్మదే, సందేహంలేదు. మరి, ఈ జగన్నిర్మాత, సర్వ నరనారీజన జీవన నిర్ణేత అమ్మే కదా !

ఎప్పుడయినా ఏ దుర్ముహూర్తంలో నయినా ఎవరికయినా "అమ్మే లేకపోతే ........" అన్న ఆలోచన వస్తేనే నిలువల్లా కంపించి పోయేవారు. ఆ ఆలోచనను కొనసాగించడానికే విముఖులై పోయేవారు. అమ్మలేకపోతే జిల్లెళ్ళమూడి ఉంటుందా? అమ్మ లేకపోతే మనం బ్రతగ్గలమా ? ...... అనుకునే వారు. అమ్మతోనో, అమ్మ కంటే ముందుగానో తామూ ఈ లోకంనుండి నిర్గమించాలని మనసారా కోరుకున్నారు. అమ్మ లేని బ్రతుక్కంటే మరణమే మేలు - అని భావించారు.

కానీ - ఇప్పుడు అమ్మ ఏదీ ? ఆ మనోహరరూపం కంటికి కనిపించడం లేదు. ఆ పావన శ్రీచరణాలు చేతికి అందడం లేదు. అమ్మ మన సర్వేంద్రియాలకూ అతీతమై పోయింది.

కానీ అమ్మ లేదందామా ?

"నే నెక్కడకూ పోవడం లేదు. ఇక్కడనే ఉంటాను. మీతోనే ఉంటాను. మీలోనే ఉంటాను...."

"మిమ్మల్ని విడిచి నేనూ, నన్ను విడిచి మీరూ -- లేరు ......"

- అన్న అమ్మ ప్రకటనలు ఎందుకు వ్యర్థం అవుతాయి ?

అందుకు అనుగుణంగానే నేడు ఎందరికో ఎన్నో అనుభవాలు... అమ్మ మన వెన్నంటి ఉండి మనను నడిపిస్తున్నట్లు ఎన్నో నిదర్శనాలు.

అమ్మ ఆదేశానుసారం ప్రస్తుతం సంస్థలోని అన్ని విభాగాలు యధాతథంగా నడుస్తున్నాయి. యాత్రికులు వస్తున్నారు. పూజలు చేసుకుంటున్నారు. అన్న ప్రాశనలు, అక్షరాభ్యాసాలు, పెండ్లి కూతుళ్ళను చేయించుకోవడాలు, నామకరణాలు.... అనేక కార్యక్రమాలు జరుగుతున్నాయి.

అయినా - ఆవరణంలో ఏదో వెలితి, గుండెలను పిండే వెలితి. వెల్లువలుగా కన్నీళ్ళు. దహించివేసే వేదన.

ఒక వంక కార్యక్రమాల సందడి. మరొక వంక తెలియని నిస్పృహ. గుండెలోతుల్లో అలలుగా అలజడీ. ఇదే విచిత్ర పరిస్థితి !

అమ్మ అందరికీ తలా ఒక బాధ్యత అప్పగించింది. ఈ బాధ్యత వ్యష్టి, సమష్టి కూడా.

ఈ బాధ్యతలే ఇప్పుడు మనకు ఊపిరి అయినాయి. ఈ బాధ్యతలే మన మనుగడకు ఆధారం అయినాయి. ఆ బాధ్యతలే మనకు అమ్మప్రతిరూపాలు అయినాయి.

అనసూయేశ్వరాలయం, హైమాలయం, అన్నపూర్ణాలయం, విద్యాలయాలు, వైద్యాలయాలు, ప్రచురణాలయం, ముద్రణాలయం.... ఎన్నిటినో అమ్మ ప్రసాదించింది. ఒక సందర్భంలో అమ్మ చేసిన "దేవాలయం వేరూ, దేవుడు వేరూ కాదు" అన్న ప్రవచనం ఈనాడు మనకు శిరోధార్యమై మార్గప్రబోధం చేస్తున్నది.

అన్ని ఆలయాలూ అమ్మరూపాలే  అవే నేడు మనకు ఆరాధ్యమూర్తులు.

అమ్మగుడిలో జేగంట మ్రోగినంత కాలం అమ్మ మనతోనే ఉంటుంది

అమ్మబడి గంట వినిపించినంత కాలం అమ్మ మనతోనే ఉంటుంది.

అన్నపూర్ణాలయం గంట నినదించినంత కాలం అమ్మ మనతోనే ఉంటుంది.

అమ్మ మనకోసం స్థాపించిన సంస్థలన్నీ అనంతంగా ఉత్సాహంగా సమర్థంగా పనిచేయాలి, లోకానికి ఆదర్శమై నిలవాలి .. అన్నదే అమ్మ అభిలాష.

అమ్మ నుండి జీవితాన్ని పొంది, అమ్మకరుణవలన జీవితాన్ని సాగిస్తున్న మనందరికీ అమ్మ అభిలాషను తీర్చడం పవిత్ర కర్తవ్యం. అందుకు ఎన్నో నిధులూ, ఎందరో ప్రతినిధులూ కావాలి.

"తల్లికి బిడ్డ సొమ్ము బిడ్డకు డబ్బు సొమ్ము" అన్నది అమ్మ.

అమ్మ బిడ్డ లందరూ ఈ తరుణంలో ముందుకు రావాలి. అమ్మ ఆశయాన్ని నెరవేర్చడానికి దీక్షవహించాలి. తమ జీవితాలనే అమ్మసేవకు అంకితం చేయాలి.

అమ్మ అపురూపంగా ప్రసవించి, అల్లారుముద్దుగా పెంచి, ఎంతో ఆశతో, ఆత్మీయతతో మన చేతుల్లో పెట్టిన ఈ సంస్థలను మనం కూడా అంత ప్రేమతోనూ పెంచుకోవాలి, పోషించుకోవాలి.

అందరమూ అమ్మ వారసులమే !

నిజానికి ఈ సంస్థలే మనకు అమ్మ రూపాలు కానీ ఈ సంస్థలను పోషించేటపుడు ఈ సంస్థలకు మనమే అమ్మలం కావాలి !

(జులై, ఆగష్టు 1985)



# 196
# మహా ప్రళయ సాక్షిణి

1985 మే 22వ తేదీన జిల్లెళ్ళమూడిలో జరిగిన సంస్కృత ప్రశిక్షణ శిబిరానికి సంబంధించిన సమారోహోత్సవం జరిగింది. ఆనాడు ఒక శిక్షితుడు అమ్మ ఫొటో తెచ్చి అమ్మ చేత సంతకం పెట్టించి ఇవ్వమని అడిగాడు.

ఆ ఫొటో అమ్మకు అందిస్తూ - "అమ్మా - ఈ ఫొటోను ప్రాణ ప్రతిష్ట చేయమ్మా -" అన్నాను - అలంకారిక్షంగా మాట్లాడాను - అని నాలో నేనే సంతోషిస్తూ.

అమ్మ క్షణం ఆలోచించకుండా అడిగింది "అయితే ఇప్పుడు ఇందులో ప్రాణం లేదంటావుట్రా ?" అని.

"నా దృష్టిలోజడమే లేదు. అంతా చైతన్యమే" అన్న అమ్మ అమృత వాక్యం జ్ఞాపకం వచ్చి సిగ్గుపడ్డాను.

మరి, మనం అందరం ఎవరి ఇండ్లలో వాళ్ళం అమ్మ ఫొటోలకు పూజలు చేస్తున్నా, నివేదనలు చేస్తున్నా అమ్మ ఫొటోలో సజీవంగా ఉండి పూజలూ నివేదనలూ అందుకుంటున్నదనే విశ్వాసంతోనే కదా !

ఎందరికో - ఫొటోల ద్వారా ఎన్నో అద్భుత అనుభవాలు ! నవ్వుతూ అమ్మ; విచారంగా అమ్మ; కోప్పడుతూ అమ్మ..... ఎన్నో రూపాల్లో ఎందరికో అమ్మ ఫొటోల ద్వారా దర్శనం ప్రసాదించడం అందరికీ తెలిసిన విషయమే.

క్షణాల్లో ఇవన్నీ మనస్సులో మెదిలి - "పొరబాటు అయిందమ్మా. క్షమించు, ఈ ఫొటోపై సంతకం చేసి ఇవ్వమ్మా -" అని అడిగాను.

నవ్వుతూ అమ్మ సంతకం చేసింది.

నెల అయినా తిరగకుండానే ఇంత మహా ప్రళయం ముంచుకు వస్తుందని ఆనాడు ఊహించ లేదు. ఇక నుండి ఫొటోలు, విగ్రహాలూ మాత్రమే మన

పూజలకు ఆధారం కాగలవని ఆనాడే ఉపదేశించింది, కాలస్వరూపిణి అయిన అమ్మ.

ప్రస్తుతం - అమ్మ నివాస మందిరంలో రోజూ అమ్మ మామూలుగా కూర్చుని అందరికీ దర్శనం ప్రసాదించే గదిలో పూర్వంలాగానే మంచం; అమ్మ పడుకున్న అదే మంచం; దానిపై మామూలగానే పక్క, తలగడలు. ఆ మంచం వెనుకనే, దక్షిణపు గోడకు ఆనుకుని ఉత్తరాభిముఖియై అమ్మ ఫొటో. నిజానికి అది ఫొటో అనిపించదు. రక్త మాంసాలతో అమ్మ సింహాసనాసీన అయినట్లే ఉంటుంది ఆ కళ్ళు మనవంక చూస్తుంటాయి. నవ్వుతుంటాయి. మనను పలకరిస్తుంటాయి. మనపై వాత్సల్యామృతం కురిపిస్తుంటాయి

మనకు అమ్మను చూస్తున్నట్లే ఉంటుంది. అమ్మ సన్నిధి మనకు అనుభూత మవుతుంది. ఆ సమక్షంలో కూర్చుంటే మనం లోకాన్నే మరచిపోతాము. మనసు ప్రశాంత నిలయం అవుతుంది. అంతరంగం ఆనందసాగరం అవుతుంది. నాడీమండలం సుధాసారాభివర్షంలో తడిసి తన్మయం అవుతుంది. ఒక అలౌకిక అనుభూతి కలుగుతుంది.

ఆ చిన్న గదిలో మరీ చిన్న మంచంపై కూర్చుని అమ్మ ఎంత కథ నడిపిందో! ఎంతమందిపై ఎంత వాత్సల్యామృతాన్ని వర్షించిందో ! ఎన్ని సందేహాలను తీర్చిందో! ఎన్ని సమస్యలను పరిష్కరించిందో ! ఎంతమందికి అన్నం కలిపి గోరుముద్దలు చేసి తినిపించిందో ! ఎంతమందికి కొత్త గుడ్డలు పెట్టి ఆశీర్వదించిందో ! ఎంతమందికి విసుగు లేకుండా బొట్లుపెట్టి తాను మురిసిపోయిందో ! ఎంత జ్ఞానాన్నీ, విజ్ఞానాన్నీ రెండు చేతులా వెదజల్లిందో !

అమ్మ నిర్వహించిన సర్వ అద్భుత కార్యక్రమాలకూ ఆ గదియే సాక్షి. ఆ గది గోడల గుండెల్లో ఎన్ని లోకోత్తర సన్నివేశాలు, సంఘటనలు, ఎన్ని రసబంధుర సంభాషణలు, సంవాదాలు నిక్షిప్తమై ఉన్నాయో ! ఆ గదికే నోరుంటే, మాట్లాడగలిగితే - ఎన్ని మహాద్భుత గ్రంథాలను లోకానికి అందించగలిగేదో !

అంతే కాదు - అమ్మ పాంచ భౌతికమైన శరీరాన్ని వదిలి వేసే ముందు ఎంత బాధ పడిందో, అందుకు గూడా ఆ గదే సాక్షి అసంఖ్యాకమైన తన బిడ్డలతో గల మమకార బంధాలను ఛేదించుకొనటానికి అమ్మ ఎంత వ్యథ ననుభవించిందో ! అమ్మ అవతరణ లోకానికి నవ వసంతాగమనం అయినట్లే అమ్మ మహాభినిష్క్రమణం లోకానికి మహాప్రళయమే కదా ! ఆ దారుణ విషాద

సంఘటన ప్రతి మనస్సుకూ దుర్భరమూ, దుస్సహమూ అయినదే ! మహాశివుడు హలాహలాన్ని తన కంఠంలో దాచుకున్నట్లు - ఆ గది గోడలు ఆ బాధామయ దృశ్యాలనూ, ఆ మహాప్రళయ సన్నివేశాన్ని గర్భస్థం చేసుకుని ఏమీ తెలియని అమాయకులవలె కనుపిస్తాయి.

సర్వసాక్షి అయిన ఆ గదే నేడు వాత్సల్యాలయంగా రూపుదాల్చింది.

ఆ గదిలోకి వెళ్ళగానే మొదటగా అమ్మతో గడిపిన ఎన్నో మధుర స్మృతులు కందిరీగల్లాగా మనసును చుట్టుముడుతాయి. ఎవరో గొంతు పిసుకుతున్నట్లు, గుండెలను బలంగా అదుముతున్నట్లు విపరీతమయిన బాధ కలుగుతుంది. కన్నులు అశ్రుపూర్ణమవుతాయి.

ఆ వ్యథతోనే కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుని కూర్చుంటే --- అమ్మ తన మృదువయిన హస్తాన్ని మన తలమీదనో, వీపు పైననో వేసి లాలనగా నిమిరి నట్లవుతుంది. కొనగోట కన్నీటిని తుడిచిన అనుభవం కలుగుతుంది.

కనులు తెరచి చూస్తే - క్రీగంట చూస్తూ అమ్మ ? లీలా వినోదినీ, విలాసినీ అయిన అమ్మ మనను చూసి ముసిముసి నవ్వులు నవ్వుతూ ---

"నే నెక్కడకు వెళ్ళానూ ? ఇక్కడనే ఉన్నానుగా ! ఎందుకా దుఃఖం ?" అని ప్రశ్నిస్తుంది.

మనసు కేదో హాయి ! ఎంతో తృప్తి !

హృదయంలో ఉత్తుంగ తరంగితాలై శాంత్యానందాలు !

(నవంబరు 1985)



## సంకల్ప రాహిత్యం

మనకు వచ్చే సంకల్పాలు మనవి కావు. అనుకోవడమే సంకల్ప రాహిత్యం. - అమ్మ

# 197
# "అమ్మకు పర్యాయపదమే ప్రేమ"

గుంటూరులో ఆగష్టు 31 మరియు సెప్టెంబరు 1వ తేదీల్లో జరిగిన అమ్మ ప్రేమార్చన ఉత్సవాల ప్రారంభ సభలో అధ్యక్షతస్థానం నుంచి శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు ఉత్సవాల నామకరణాన్ని విశ్లేషిస్తూ ---- 'అమ్మ అర్చన' అన్నా 'ప్రేమార్చన' అన్నా ఒకటే. అమ్మ వేరు, ప్రేమ వేరు కాదు. అమ్మకు పర్యాయపదమే ప్రేమ.... అన్నారు.

విజయవాడలో అక్టోబరు 17వ తేదీన జరిగిన ఉత్సవాల్లో సభకు అధ్యక్షత వహించి ప్రసంగిస్తూ.... శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రుల వారు....... జిల్లెళ్ళమూడి అమ్మ అన అవసరం లేదు. అమ్మ అంటేనే జిల్లెళ్ళమూడి అమ్మ. మహర్షి అంటే రమణ మహర్షియే; పరమహంస అంటే రామకృష్ణపరమహంసయే; అట్లాగే అమ్మ అంటే జిల్లెళ్ళమూడి అమ్మయే. కనుక మనం జిల్లెళ్ళమూడి అమ్మ అని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు - అని వివరించారు.

1985 జూన్ నెల తర్వాత వీలయినన్ని ఎక్కువ పట్టణాల్లో 'అమ్మ ప్రేమార్చన ఉత్సవాల'ను జరపాలని నిర్ణయం జరిగింది, అందుకు అనుగుణంగానే విశాఖపట్నంలో, గుంటూరులో, విజయవాడలో, ఏలూరులో వైభవోపేతంగా జరిగాయి. ఇంకా అనేక పట్టణాల్లో జరపటానికి సోదరులు అమిత ఉత్సాహాన్ని చూపిస్తున్నారు.

ఈ ఉత్సవాల ఉద్దేశం ...... అంతకు ముందే అమ్మను చూసిన వారు, అమ్మను అర్చించుకోవడానికి అలవాటు పడ్డవారూ అందరూ ఒకచోట కలిసి సమష్టిగా అమ్మను అర్చించుకోవడం, అమ్మను చూడని వారికి అమ్మను చిత్రపటాల ద్వారా, వీడియోల ద్వారా, సినిమా ద్వారా అమ్మను చూపించడమే ---- ప్రసంగాల ద్వారా, గ్రంథాల ద్వారా అమ్మ చరిత్రనూ, అమ్మ సందేశాన్నీ జన బాహుళ్యానికి అందించడమూ.

1923వ సంవత్సరములో అనంతమైన శక్తి ఈ అవనీస్థలిపై అమ్మగా అవతరించింది. 1985లో పాంచభౌతిక శరీరాన్ని పరిత్యజించింది. అనంతమైన శక్తి పరిమితమైన రూపధారణ చేయడాన్నే మనం అవతారం అంటున్నాము. యుగ యుగాలుగా జగత్తులో అవతార మూర్తులు ఉద్భవిస్తూనే ఉన్నారు. ప్రతి అవతారానికి ఒక్కొక్కప్రత్యేక ప్రయోజనం ఉంటూనే ఉన్నది. ఏ అవతారానికైనా సాధారణ ప్రయోజనం దారితప్పిన ఆనాటి వ్యవస్థను సన్మార్గంలోకి తీసుకురావడమే, ఈ ఉద్యమం ఒకసారి హింసాయుతంగా కావచ్చును. మరొక పర్యాయం అహింసా మార్గాన కావచ్చును. ఒకసారి దండనతో కావచ్చును... మరొకసారి లాలనతో కావచ్చును.

లక్ష్యం మాత్రం సమాజంలో ధర్మాన్నీ, శాంతినీ స్థాపించడం.

అమ్మ 'ప్రేమ మార్గా'న్ని ఎంచుకున్నది. ఆ ప్రేమకు ఉపాంగాలు కరుణ, సానుభూతి, త్యాగము, సహనము.

ఈ కల్యాణగుణాలు ఆధారంగా జగద్ధితమూ, జగదాదర్శమూ జగదారాధ్యమూ అయిన చరిత్రను సృష్టించింది అమ్మ - తన అవతార కాలమయిన 62 సంవత్సరాల్లో.

మానవుడు ఎట్లా ఉండాలో, మానవుడు ఎట్లా జీవిస్తే తనకు శాంతి, ఆనందం కలుగుతాయో, ఎట్లా ప్రవర్తిస్తే తనవలన లోకానికి శాంత్యానందాలు సమకూరుతాయో అమ్మ అమలినమయిన ఆచరణ పూర్వకంగా లోకానికి ప్రబోధించింది. సాటి మానవుడిపట్ల ప్రేమ పూర్వకంగా ప్రవర్తించడానికి అవసరమయిన మౌలికజ్ఞానాన్ని అమ్మ సుస్పష్టంగా ప్రబోధించింది. తన అపారమయిన ప్రేమద్వారా పరిపూర్ణమయిన జ్ఞానం ద్వారా --- నరుడు నారాయణుడుగా పరిణతి చెందడానికి సులభమయిన, సుగమమయిన మార్గాన్ని మానవాళికి అందించింది.

అమ్మ మనపై వర్షించిన ప్రేమనూ, మనకు అందించిన జ్ఞానాన్నీ మనం జ్ఞాపకం చేసుకొని, అస్ఫూర్తితో ఉత్తేజితులమై నవజీవనం గడపటానికి దీక్షితులం కావడంకోసమే అమ్మ ప్రేమార్చన ఉత్సవాలు.

(డిశంబరు 1985)



# 198
# అమ్మ జీవితమే సందేశం

అమ్మను చూసిన వాళ్ళూ, అమ్మ ఆశీస్సులు పొందినవాళ్ళూ, అమ్మ మహిమచే ప్రభావితులైన వాళ్ళూ, అమ్మ అపార జీవితానుభవానికి ఆశ్చర్య పోయిన వాళ్లూ....

అనేకులు వివిధ సందర్భాలలో

"అమ్మా ! మాకేమయినా సందేశం ఇవ్వమ్మా" అని అమ్మను అడిగారు.

"నాన్నా - నాకేం తెలుసు ? నేనూ మీ వంటి దానినే, అంటూ ---

"చూస్తున్నారుగా నన్ను. నా జీవితంలో మీకేదయినా మంచిదనీ, నలుగురూ అనుసరించదగినది ఏదయినా ఉన్నదీ అనీ అనిపిస్తే - దానిని సందేశంగా తీసుకొనండీ -" అన్న సమాధానమే అందరికీ చెప్పింది అమ్మ.

నిజమే ! అమ్మ జీవితమే మహోత్తమ సందేశం. అమ్మ నోట వెలువడిన ప్రతిమాట ఒక ఉపదేశమే. అమ్మ ప్రతిచర్య జగతికి ఆదర్శమే.

అమ్మ శరీరధారణ చేసినది మొదలూ శరీర పరిత్యాగం చేసేంతవరకూ అమ్మ యావజ్జీవితమూ లోక సంగ్రహార్థమే. అందువల్లనే ఒక సందర్భంలో అమ్మ అన్నది 'నేనేం చేసినా మీకోసమే. చివరకు నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా..' అని.

"తెలియంది తెలియ జేయడానికే నా రాక, అని అమ్మ సుస్పష్టంగా చెప్పింది.

ప్రేమయొక్క విరాడ్రూపమే అమ్మ.
ప్రేమ యొక్క మానవాకృతియే అమ్మ.
అమ్మ ప్రేమకు కారణం కనిపించదు.
అమ్మ ప్రేమలో ప్రతిఫలాపేక్ష లేదు.
అమ్మ ప్రేమలో తరతమ భేదాలు లేవు.
అమ్మ ప్రేమకు విచక్షణ లేదు.
అమ్మకు ఊపిరి ప్రేమ.
అమ్మకు ఆహారం ప్రేమ.
అమ్మకు నీరు ప్రేమ.

అమ్మకు ప్రేమ సహజం. ప్రేమించకుండా ఉండలేదు. అమ్మలో అణువణువూ ప్రేమ విలసితమే. రోమరోమమూ ప్రేమ పులకితమే.

అమ్మ హృదయం ప్రేమామృతభాండం.

అమ్మ సర్వావయవాలు ప్రేమామృత సంభృతాలు.

అందువల్లనే ఒక పాశ్చాత్యయువతి అభివర్ణించింది --- "ప్రపంచములో ఎక్కడ ఏమాత్రం ప్రేమ కనుపించినా, దానిమూలం భారతదేశంలో, అదీ జిల్లెళ్ళమూడిలో ఉన్నదని తెలుసుకో. ప్రేమ యొక్క విరాడ్రూపాన్ని దర్శించాలంటే జిల్లెళ్ళమూడి వెళ్ళు --" అని.

ఆ ప్రేమైకమూర్తి సహస్రబాహువులతో ప్రేమను వెదజల్లడానికి ఆవిర్భవించి అరవైమూడు వసంతాలు మన మధ్య గడిపింది.

మన ప్రియబాంధవియై, నెచ్చెలియై, గురువై, దైవమై --- మనకు బోధించవలసిన పాఠాన్ని అతి సమర్థంగా బహుముఖాల అందించింది

అమ్మ అవతార లక్ష్యమే అది.

మరి, ఆ అవతార ప్రయోజనం ఎంతవరకు సఫలీకృతమైనట్లు - అంటే మనమూ, మన ప్రవర్తనమే సమాధానం.

ఏ యుగంలోనూ, ఏ అవతారమూర్తి కాలంలోనూ లోకమంతా ఒక్కసారి పరివర్తన పొందదూ, పరిణతి చెందదూ. అవతారమూర్తులు వారికాలంలో సద్బీజాలు నాటుతారు. అవి క్రమంగా మొలకెత్తడమూ, కునుమించడమూ, ఫలించడమూ జరుగుతుంది.

అమ్మ అవతార ప్రయోజనం నెరవేర్చడంలో అమ్మ సమకాలీనులమూ, అమ్మ బిడ్డలమూ, అమ్మ ప్రేమామృతపాన తృప్తులమూ అయిన మనపై ఎంతో బాధ్యత ఉన్నది.

సంకుచితం అయిన మన ప్రేమ పరిధిని ఎంత వరకు విస్తృత పరచుకొన గలిగితే, ఎంత మందిని మనం ఎంతమందిని మనం నిస్వార్థంగా, నిర్వ్యాజంగా, నివర్గంగా ప్రేమించగలిగితే మనం అంతగా ఎదిగినట్లు !

మన అభివృద్ధియే అమ్మ అవతార ప్రయోజనం

లోకాన్ని జయించడానికి ప్రేమయే బ్రహ్మాస్త్రం, అదే అమ్మ అస్త్రం.

(ఏప్రిల్ 1986)



# 199
# అమ్మ కళ్యాణ స్వర్ణోత్సవం

అమ్మ వివాహం 1936 మే 5 తేదీన జరిగింది. ఈ 1986కు ఏభై సంవత్సరాలు నిండాయి. అంటే ఈ మే 5వ తేదీన అమ్మ కల్యాణ స్వర్ణోత్సవం ఎంతో వైభవోపేతంగా జరిగి ఉండాల్సింది. కానీ మన దురదృష్టం కొద్దీ మనం ఆ మహోత్సవాన్ని జరుపు కోలేక పోయాము.

కానీ ఈ సంవత్సరం ఒక క్రొత్త సంప్రదాయానికి శ్రీకారం చుట్టాము. అదే శుభదినాన అమ్మా - నాన్నగార్ల కల్యాణోత్సవం వేదొక్తంగా జరుపుకుని ఆనందించాము.

ఈ ప్రప్రథమ కల్యాణోత్సవంలో అమ్మా నాన్న గార్ల పక్షాన బాధ్యత వహించిన సోదరులు శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ, శ్రీ యల్లా ప్రగడ మధుసూదనరావు దంపతులు అభినందనీయులు.

అమ్మ కల్యాణం అంటే అఖిల జగతికి కల్యాణమేనని మనందరి ప్రగాఢ విశ్వాసం. అమ్మ కూడా ఈ విషయాన్ని పలురీతుల్లో క్రియాత్మకంగానూ, వాచా కూడా ధృవపరిచింది. సంస్థలోని అనేకమైన ముఖ్య కార్యక్రమాల ప్రారంభాలకు మే 5వ తేదీనే అమ్మ ఎంచుకున్నది.

ప్రపంచానికే ఆశాజ్యోతి అయిన శ్రీ అనసూయేశ్వరాలయానికి 1956 మే 5వ తేదీననే శంకుస్థాపన చేసింది.

ఈ శుభదినానే ఎందరికో వివాహాలు చేసింది. ఎందరికో నామకరణాలు, అన్నప్రాశనలు, అక్షరాభ్యాసాలు, ఉపనయనాలు, మంత్రోపదేశాలు అనేకం చేసింది.

1936లో శంకుస్థాపన చేసినది మొదలు ప్రతి సంవత్సరం అదే రోజున అమ్మ ఆ దేవాలయం నుండి లోకానికి సర్వ శుభాలనూ అనుగ్రహించేది. అందుకు సంకేతంగా ఆ దేవాలయ పైభాగం మీద అసంఖ్యాకంగా గుమ్మడికాయలూ, కొబ్బరికాయలూ పగలకొట్టడమే కాక - సిరిసంపదలకూ, సుఖశాంతులకూ

చిహ్నాలయిన పసుపుకుంకుమలను రెండు చేతులా వెదజల్లేది. విరిజల్లులు కురిపించేది. ఆ దేవాలయంపై ప్రతి సంవత్సరం ఆ దివ్యక్షణాల్లో అమ్మ ఆనందలాస్యం చేస్తూ హరివిల్లువలె దృశ్యమానమయ్యేది.

అమ్మకు ఆ రోజంటే ఎంతో ఇష్టం. అందువల్లనే ఆ రోజున తన కల్యాణ ముహూర్తం నిర్ణయించడమే కాక లోక కల్యాణానికి కూడా అనేక ప్రణాళికలను రచించి అమ్మ లోకకల్యాణకారిణి, కల్యాణదాయినీ అయింది.

1984 మే 5వ తేదీన జిల్లెళ్ళమూడి గ్రామస్తులందరినీ, పశుగణాన్నీ "నారాయణ స్వరూపం"గా పూజించి ఆచరణాత్మకమైన దివ్య సందేశాన్ని లోకానికి అందించింది.

అమ్మ చివరగా పాల్గొన్న ఉత్సవం కూడా మే 5వ తేదీననే. 1986 మే 5వ తేదీన అమ్మ మద్రాసు బిడ్డలచే నిర్మించబడ్డ భవనానికి ప్రారంభోత్సవం జరిపి 'పంచమి' అని నామకరణం జరిపింది. అదే రోజున 'రాజా' చే రచింపబడిన 'అనుభవసారం' గ్రంధావిష్కరణ చేసింది.

ఆ రోజంటే అమ్మకు ఎంత ప్రీతి లేకపోతే --- అమ్మ తానత్యంతంగా ప్రేమించిన 'వసుంధర'ను 1966మే 5న వివాహం చేసుకొని అఖిల లోకాన్ని విభ్రాంతి చకితం చేసింది ! తన గర్భవాసాన పుట్టిన కుమారు లిద్దరికీ 1969, 1973 మే 5వ తేదీలనే వివాహాలు చేసింది.

అమ్మ తన కల్యాణం సందర్భంగా లోకానికి అనేక అపూర్వ నిర్వచనాలను అనుగ్రహించింది.

కల్యాణ - మంటే కళంకరహితమైన మనస్సును కళంక రహితంగా అర్పించడమట.

వివాహమంటే సర్వాన్నీ అనుభవిస్తూ సర్వాన్నీ పరిత్యజించడమట.

అమ్మా - నీ వీ పెండ్లి ఎందుకు చేసుకుంటున్నావు - అని అడిగితే.... పెండ్లిలో పెద్దపులి ఉన్నదని భయపడేవారి భయం పోగొట్టడానికి - అని అమ్మ సమాధానం చెప్పింది.




పెండ్లి ద్వారా సంప్రాప్తమయ్యే సంసారం ఆధ్యాత్మిక సాధనకు ప్రతి బంధకం అని ప్రవచించే వారికి -మనం చేసే ప్రతి పనీ దైవసేవ అనుకో గలిగితే, సంసారం ఆధ్యాత్మిక సాధనకు ప్రతిబంధకం కానేరదని పరమ రహస్యాన్ని విప్పి చెప్పింది.

సంసారంలో శరీరానికి ఎన్ని కష్టాలు వచ్చినా, శరీరానికి, మనస్సుకూ సంబంధం లేదని ఋజువు చెయ్యడం కోసమే ---- తాను పెండ్లి చేసుకున్నట్లు అమ్మ ఉద్ఘాటించింది. అమ్మ యొక్క అనంతర జీవితమంతా పరిశీలిస్తే - ఆ వాక్య నిరూపణకోసం అమ్మ చేసిన మహా ప్రయోగంగానే అమ్మ జీవితం మనకు సాక్షాత్కరించి - మనకొక గొప్ప పాఠాన్ని బోధిస్తుంది.

ఈ సందర్భంగానే అమ్మ ప్రవచించిన - సహనమనే దేవతను ఆరాధించాలంటే బాధలనే పూజా ద్రవ్యాలు కావాలి - అన్న వాక్యం ఆధ్యాత్మిక సాధకులకు కరదీపిక.

అమ్మ జీవిత చరిత్రలో మే 5వ తేదీకి ఎనలేని ప్రాముఖ్యం ఉన్నది. కనుకనే ఆ దినం అఖిల జగతికి పర్వదినం

అందువల్లనే ప్రతి సంవత్సరమూ ఆ దినాన "అమ్మ కల్యాణం" జరపాలని నిశ్చయించుకున్నాము. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ నవమినాడు దేశమంతటా "శ్రీ సీతారామ కల్యాణం" జరిగినట్లే - మనం కూడా ప్రతి మే 5వ తేదీన అమ్మ కల్యాణం జరుపుకుందాము.

అవతారమూర్తులు కాలాతీతవ్యక్తులు కదా ! వారికి నిత్య కల్యాణమూ, పచ్చతోరణమే. కనుక కాల నిర్దేశం, నిర్బంధం ఏమున్నది ? ఏ రోజున అయినా మనం అమ్మ కల్యాణాన్ని చేసుకో వచ్చును.

ఈ సంవత్సరం అమ్మ నాన్నగార్ల చిత్రపటాలకు కల్యాణం జరపడం సంభవించింది. వచ్చే సంవత్సరం మంచి విగ్రహాలకు కల్యాణం జరపాలని ఆలోచన.

కల్యాణీ, జగతీకందా, కరుణారస సాగరా --- అయిన అమ్మ ప్రతి సంవత్సరం తన "కల్యాణ మహోత్సవం" మనచేత జరిపించుకుంటూ మనకు సర్వశుభాలూ, సర్వ సంపదలూ ప్రసాదించాలని అమ్మను వేడుకుందాము.

(ఆగష్టు 1986)



# 200
# పంచకృత్య పరాయణ

అమ్మ ఈ సృష్టిని రెండు విధాలుగా దర్శించింది. సృష్టి సర్వాన్నీ దైవంగా భావించడం ఒక రీతి అయితే - తన కన్న బిడ్డగా చూడడం మరొక మార్గం.

తల్లి దండ్రులకు కన్నబిడ్డ దైవ స్వరూపమే నన్న అమ్మ అపూర్వ నిర్వచనం ఆ భావనలోని సహజ వైరుధ్యాన్ని సమయింపజేసి రమణీయమయిన సామరస్యాన్ని సాధించింది.

దైవంగా చూచినపుడు పంచసంఖ్యోపచారాలతో సృష్టిని అమ్మ ఆరాధించింది. బిడ్డగా చూసినపుడు పంచకృత్యాలతో సమాదరించింది.

ఈ పంచకృత్యాలలో ప్రథమమూ, ప్రధానమూ అయినది - అన్నం పెట్టడం.

బిడ్డలకు అన్నం పెట్టడమంటే అమ్మకు ఎంత ఇష్టమో, ఎంత ఆనందమో చెప్పలేము. అమ్మను చూసేందుకు ఎవరు ఎప్పుడు వచ్చినా - అందరూ ముందుగా అన్నం తినవలసిందే. పూజ చేసుకుని తర్వాత అన్నం తింటామన్నా - అమ్మ అంగీకరించదు. ముందు అన్నం తినండి, తర్వాతనే పూజలు అంటుంది.

ముందు భోజనం చేసే రమ్మంటారు. దాని ఉద్దేశమేమిటి ? అని ఒకరు అడిగితే - "తల్లికి బిడ్డ ఆకలి ముఖ్యం కదా" అన్నది. "మీరు దేన్ని గురించి ఆలోచిస్తారు ?" అని అడిగిన వారికి "భోజనం గురించి" అని అమ్మ సమాధానం. భోజనం అంటే అమ్మ భోజనం కాదు, బిడ్డల భోజనం "మీకు వచ్చే ఆలోచనలు ఎట్లాంటివి ?" అని అడిగిన సోదరునికి "మీకు పెట్టుకోవాలనిపించేటివి" అన్నది అమ్మ.

"నా కెందుకో అన్ని బాధలకంటే ఆకలి బాధ ఎక్కువని పిస్తుంది" అన్న అమ్మ వాక్యంలో మన ఆకలిబాధకు అమ్మ హృదయం ఎంత పరిస్పందించిందో మనకు అభివ్యక్త మవుతుంది.

వచ్చే వారందరికీ ఆదరణ అనే అనుపానం వేసి పెట్టాలి. గుండిగ దిగితే గుండిగ ఎక్కాలి. ఎప్పుడు వచ్చిన వాడికేనా తీరిక లేదనకుండా అన్నం పెట్టాలి."

"తినగలిగిన వాడుదొరకడం అదృష్టం. నువ్వు పెడతానంటే మాత్రం తినేవాడు దొరకొద్దూ ? ఎంత పెట్టినా తింటుంటే బాగుంటుంది "అంటుంటే పాలకడలి వంటి అమ్మ గుండె ఉప్పొంగి పోతుంది.

"రాధ అహర్నిశలు నామం చేసినా కష్టం లేదు. కానీ ఆహారం తీసుకోడు. అదే నా బాధ". అన్న భాష్పరుద్ధ కంఠస్వరంతో కూడిన అమ్మ ప్రకటన - ఒక్కడు అన్నం తినక పోయినా అమ్మ పడే ఆవేదనను ఎలుగెత్తి చాటుతుంది.

మరొక పర్యాయం --- అమ్మస్నానానికి నీళ్ళు లేవు. అప్పటి కింకా నీళ్ళ పంపులు రాలేదు... సోదరులు మధు, శ్రీరామమూర్తి, సత్యం వాళ్ళు భోజనానికి వెళ్ళబోతూ ఆగి నీళ్ళు తేవడానికి చెరువుకు వెళ్ళబోయారు. అమ్మ ముందు అన్నాలు తిని రండి. మీరు తినకుండా తెచ్చినా నేను పోసుకోను" అని చెప్పింది.

తన అవసరం కంటే బిడ్డల భోజనమే అమ్మకు ముఖ్యం.

ఒకనాడు అమ్మకు కడుపులో మంట వచ్చింది. సోదరి వసుంధర మజ్జిగ ఇచ్చింది. మంట తగ్గింది. మరొకనాడు రాత్రి మళ్ళీ అమ్మకు కడుపులో మంట వచ్చింది. వసుంధర మజ్జిగ ఇస్తానన్నది. "వద్దు. అదే తగ్గుతుందిలే. ఏవేళ ఎవరు వస్తారో. వాళ్ళకుఆ మజ్జిగ ఉంచు" అన్నది అమ్మ.

తన బాధ కంటే బిడ్డల బాధే తల్లికి ఎక్కువ కదా !

రోజూ కాకపోయినా అప్పుడప్పుడు అమ్మ అన్నం కలిపి ముద్దలు పెడుతుంది. సోదరుడు అప్పారావు ఆ ముద్దలు తిని చాలా కాలమయింది. అని మనస్సులో అనుకున్నాడు. ఆనాడు అమ్మ ముద్దలు కలిపి పెట్టింది. అతడు అపరిమితమయిన ఆనందంతో తింటూ "ఎంత హాయిగా ఉన్నదమ్మా-" అన్నాడు. "తింటున్న నీ కంటే పెడుతున్న నాకు ఎంత తృప్తిగా ఉన్నదో -" మురిసిపోయింది అమ్మ.

బిడ్డలకు పెట్టు కోవడంలోని సంతృప్తి సంతోషమూ అమ్మ అనుభవించి నంతగా మరొకరు అనుభవించలేరేమో !

మన అందరి మధ్యా భోజనానికి అన్నట్లుగా కూర్చున్నపుడు అమ్మ - కావాలని అడిగి వేయించుకునే పద్ధతి - అంతా తాను తినేటట్లే వుంటుంది. కానీ అవన్నీ వేసి కలిపి మనకు పెడతారు. చాలా రుచిగా ఉంటుంది.

పెట్టడం తప్ప తినడం చేతకాదు - అమ్మకు.

ఎప్పుడోగానీ, మామూలుగా అమ్మ అన్నం తినదు. అదేమిటమ్మా ? అంటే "మీరు తింటే నేను తిన్నట్లే నాన్నా -" అంటుంది.

కానీ "మీకున్నది తృప్తిగా తిని ఇతరులకు ఆదరంగా పెట్టుకొండి -" అన్నది అమ్మ మనకు సాదరంగా ఇచ్చిన ఆదేశం.

"ఎవరయినా ఆకలితో జిల్లెళ్ళమూడి రావచ్చును గానీ ఆకలితో జిల్లెళ్ళమూడి నుండి వెళ్ళ గూడ"దని అమ్మ ప్రతిజ్ఞ

ఎవరయినా ఒక లక్ష రూపాయలు పెట్టి ఒక భవనం నిర్మిద్దామంటే - "హాయిగా ఆ డబ్బుతో ఎంత మందికి అన్నం పెట్టవచ్చునో....." అని అమ్మ ఆలోచిస్తుంది.

1973లో అమ్మ స్వర్ణోత్వం సందర్భంతో అమ్మకు ఏమి చేసి ఆనంద పరచాలి? అని అందరూ తీవ్రమయిన సమాలోచన చేసే సమయంలో "లక్షమందికీ ఒకే పంక్తిని భోజనం పెట్టండి" అన్న కోరికను వెలిబుచ్చి అమ్మ అందరినీ ఆశ్చర్య చకితులను చేసింది

ఇంతగా ఎందరికో అన్నం పెట్టే అమ్మ "నాకూ ఆశా అసంతృప్తీ" అంటుంది. ఇంకా బాగా పెట్టుకోవాలని ఆశట. పెట్టుకోలేక పోతున్నాననే అసంతృప్తియట !

అన్నం పెట్టుకోవడం కోసమే అన్నపూర్ణాలయం ఏర్పరిచింది అమ్మ.

అమ్మకు రెండవ సరదా - గుడ్డ లివ్వడం.

అన్నం పెట్టినట్లు అందరికీ కాక పోయినా - అమ్మ ఎందరికో గుడ్డలు పెట్టింది. కొత్తగా వచ్చారని కొందరికి పెట్టేది. చాలా కాలానికి వచ్చారని కొందరికి పెట్టేది. పండగలని కొందరికి పెట్టేది. పెండ్లి చేసుకుని వచ్చారని కొందరికి పెట్టేది. దుఃఖంలో ఉన్నారని కొందరికి పెట్టేది. ఏదో కారణంతో ఎక్కువ మందికి గుడ్డలు పెట్టడం అమ్మ కిష్టం.

కొందరు అమ్మకు చీరె పెట్టేవాళ్ళు. అమ్మ ఆ చీరెను కప్పుకుని తిరిగి వాళ్ళకే ఇచ్చేది. వాళ్ళు దిగాలుపడి చూస్తుంటే - "ఈ చీరె నేను కట్టుకునే కంటే నీవు కట్టుకుంటేనే బాగుంటుందమ్మా -" అనేది.

హైమ చనిపోయినపుడు అమ్మ అందరికీ గుడ్డలు పెడుతుంటే "ఈ దుఃఖంలో గుడ్డలు పెడుతున్నారు" అని సీతారామయ్యగారు ఆశ్చర్యపడుతుంటే "ఈ సమయంలోనే పెట్టాలి" అని వివరించింది.

ఒకసారి శాయమ్మగారి కుమార్తె నల్లమ్మా, అల్లుడూ అమ్మ వద్దకు వచ్చారు. అమ్మ వాళ్ళకు గుడ్డలు పెట్టి శాయమ్మగారితో "నీవు పెట్టలేదని బాధపడకు. నీ బదులే నేను పెట్టాను" అని చెప్పింది.

ఎందుకు పెట్టడం ? ఎవరికి పెట్టడం ? అని కాదు. పెట్టడం ముఖ్యం.

కాసు వెంగళరెడ్డిగారు, వారి కుటుంబమూ సెలవు తీసుకుంటున్నపుడు - తీర్థ ప్రసాదాలతో పాటు వాళ్ళకు అమ్మ బట్టలు పెట్టారు. వారు వెళ్ళబోతుంటే వారి కారు డ్రైవరును పిలిచి అతనికి తీర్థ ప్రసాదాలు ఇచ్చి బట్టలు పెట్టారు.

ధనవంతుడూ, దరిద్రుడనీ, ఉద్యోగీ నౌకరు అనీ, గొప్ప వాళ్ళు తక్కువ వాళ్ళనీ - అమ్మకు భేదదృష్టి లేదు. అమ్మకు అందరూ సమానులే; భాసమానులే.

అమ్మకు మూడవ పని - ఆరోగ్యాన్ని ప్రసాదించడం.

శరీరం అన్న తర్వాత అనారోగ్యం ఉండక తప్పదు. జబ్బున్న వాళ్ళందరికీ డబ్బుండక పోవచ్చును అందువల్ల అందరికీ ఉచిత వైద్య సహకారం అందించాలని అమ్మ అభిలాష. అందరి ఆరోగ్యంపై అమ్మకు ఎంతో శ్రద్ధ.

ఒకనాడు సోదరి సావిత్రి రేగుపండ్లు అమ్మకు నివేదన చేసింది. ఆ రోజుల్లో ఆవరణంలోని అందరూ జలుబులతో, జ్వరాలతో బాధపడుతున్నారు. అందువల్ల - మామూలుగా ఆ పళ్ళను అక్కడ ఉన్న అందరికి పంచకుండా అమ్మ ఆ పళ్ళన్నిటినీ తానొక్కతే తింటూ "ఇవి మీకు పెడితే, మీరు తింటారు. మీ అందరికీ జలుబులూ, జ్వరాలూ వస్తాయి. కనుక నేనే తింటున్నాను" అని చెప్పింది.

ఎందరివో తీవ్రమయిన వ్యాధులను అమ్మ తన శరీరంపైకి స్వీకరించి ఆ బాధను తాను అనుభవించిన సంఘటనలు, తాను చికిత్సపొంది వారికి నయంచేసిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

నయం కావు - అనుకున్న ఎన్ని వ్యాధులను అమ్మ నయం జేసిందో ! సర్వవ్యాధి ప్రశమని, రోగపర్వత దంభోళి అమ్మ !

అందరికీ ఆరోగ్యాన్నీ ప్రసాదించేందుకు - వైద్యాలయం స్థాపించింది అమ్మ.

అమ్మకు మరో ఇష్టమైన కార్యం జ్ఞానప్రదానం. తెలియంది తెలియజేయడానికే నా రాక - అని ప్రవచించిన గురుమండల స్వరూపిణి అమ్మ. అమ్మ జ్ఞానజలధి. జ్ఞానశేవధి. జ్ఞాన విగ్రహ. పంచనికాడికి ఉండడం దేనికీ ? - అని ప్రశ్నించిన అమ్మ -అడిగినవారికి, అడగనివారికి కూడా జ్ఞానాన్నీ విజ్ఞానాన్నీ వెదజల్లింది.

జ్ఞానప్రదాయిని అమ్మ. అందుకే అక్కడి విద్యాలయాలు.

అయిదవ కార్యక్రమం - దర్శనం ప్రసాదించడం.

"నాకు పని అంటూ ఉంటే - అది మీకు కనిపించడమే" నని నిర్ద్వంద్వంగ ప్రకటించింది అమ్మ.

అమ్మ సుభగ - సులభ.

(సెప్టెంబరు 1986)



# 201
# అమ్మ సన్నిధిలో

మానవుడు ఆధ్యాత్మిక జిజ్ఞాసతో కొన్ని సాధన మార్గాలను ఎన్నుకొని ప్రయాణం సాగిస్తూ ఉంటాడు. ఆధ్యాత్మిక గురువు చెంత చేరుతాడు. "గుర్తు చెప్పేవాడు గురువు" అని అమ్మ నిర్వచనం. అయితే, "ఆధ్యాత్మిక సాధన ఏమిటి ?" అని మనం ప్రశ్నిస్తే, "సాధ్యమయినదే సాధన" అంటూ సులువైన మార్గాన్ని సూచించింది అమ్మ.

మానవుడు తన కర్తవ్యాన్ని నిష్ఠగా పాటించడమే అమ్మ సృష్టిలో 'సాధన'. "కర్తవ్యమే భగవంతుడు" అని చెప్పింది అమ్మ. లోకవ్యవహారంలో మానవుల కర్తవ్య నిర్వహణ సక్రమంగా జరగడానికి అడ్డుపడేది స్వపరబేధ భావం. సమదృష్టి విశ్వశాంతికి మూలం. సమదృష్టిని అలవరచుకుంటే కర్తవ్య నిర్వహణలో ఏమరుపాటు కలుగదు. జీవితం సాఫీగా సాగిపోతుంది. ఇంతకంటె కావలసింది ఏముంది ? అందుకే, 'యోగమంటే ఏమిట'న్న ప్రశ్నకు సమాధానంగా - "కూతుర్నీ కోడల్నీ సమానంగా చూడటమే" అంటూ ఆచరణాత్మకంగా ఆదేశించింది అమ్మ.

సమదర్శనం సాధించే ప్రయత్నంలో ఎన్నో విఘ్నాలు ఏర్పడుతాయి. రాగద్వేషాలు మనిషిని దారుణంగా ఏడిపిస్తాయి. పతనావస్థకు దిగజారుస్తాయి. తన జీవిత గమనానికి నవ గ్రహాలు కారణ మనుకుంటాడు పాపం ! మానవుడు. "మానవుని నడక నవగ్రహాల మీద ఆధారపడిలేదు. రాగద్వేషాలనే రెండే గ్రహాల మీద" అని అమ్మ వివరించింది.

దైవమంటే ఒక పేరుతో, ఒక చోట ఉన్నవాడూ మాత్రమే కాదని, అంతటా నిండిన చైతన్యమే దైవమని అమ్మ ప్రబోధించింది "డివైన్ పవర్ కాదు - పవరే డివైన్" అని స్పష్టం చేసింది అమ్మ. తన ఆరాధ్యమూర్తి అంతటా నిండి ఉన్నాడన్న నమ్మకం ఆధ్యాత్మిక సాధనలో ముందుకు సాగడానికి చక్కగా సహకరిస్తుంది. అలాంటి నమ్మకం కలగడానికి అమ్మ ఇచ్చిన వివరణలు ఎంతగానో ఉపకరిస్తాయి. "ప్రకృతే పరమేశ్వరుడు", జగత్తేమాత" మొదలైన అమ్మవాక్యాలు ఈ తత్వాన్ని పట్టిచూపుతాయి, విశ్వమంతటా నిండిన రూపమే విశ్వరూపం. "కృష్ణుడు కూడా విశ్వరూపం అంటూ ఈ సృష్టినేగా చూపించాడు ?" అని అమ్మ ప్రశ్నించింది. ఈ

నమ్మకం కలగడానికి, నిగ్రహంతో సాధన సాగించడానికి ఆరాధన దోహదం చేస్తుందని అమ్మ అంటుంది. విగ్రహారాధన నిగ్రహం కోసమే అని అమ్మ వివరణ. మన నమ్మకాన్ని బట్టే ఆ విగ్రహం దైవమవుతోంది. అందుకే, "విశ్వాసమే భగవంతుడు" అని వివరించింది అమ్మ.

నిత్యజీవితంలోని కర్తవ్యం కంటె వేరుగా ఆధ్యాత్మిక సాధన ఉందని భ్రాంతి పడేవాడు,

నిత్య జీవితంలోని కార్యకలాపాలు ఆధ్యాత్మిక ప్రగతికి అడ్డు గోడలని ఆలోచించేవాడు - ఎన్నటికీ బ్రహ్మస్థితిని పొందలేడు.

కర్తవ్యం ద్వారా ఆధ్యాత్మిక సాధన సాగించటానికి బదులు కర్తవ్యాన్ని విస్మరించిగాని, కర్తవ్యం అల్పమని భావించి అలక్ష్యం చేసిగాని, - మరేవో సాధన మార్గాలున్నాయని ఆరాటపడుతూ, అశాంతితో వేగిపోయే వారిని చూసి జాలిపడింది అమ్మ. "రాతిలో చైతన్యం చూడగల మనం. మనిషిలో చూడలేక పోతున్నాం" అంటూ సున్నితంగా మందలించి, మార్గ నిర్దేశం చేసింది అమ్మ.

"వైద్యుడికి రోగీ నారాయణుడే", "గురువుకు శిష్యుడు కూడా దైవమే", "తల్లి దండ్రులకు బిడ్డలు కూడా దైవస్వరూపులే" అంటుంది. అమ్మ. ఈ వివరణలను పరిశీలిస్తే, 'కర్తవ్యమే దైవమ'ని గుర్తించడం, కర్తవ్యాన్ని దైవంగా భావించి, సేవించడం మనకు తెలియజెప్పడానికే అమ్మ అవతరించిందని అర్థమవుతుంది. మన ఆధ్యాత్మిక సాధనను క్రమబద్ధం చేసే జ్ఞానజ్యోతిగా భాసిస్తుంది అమ్మ. గుర్తు చెప్పే గురుమూర్తిగా సాక్షాత్కరిస్తుంది.

మనలో కొందరు సంసారాన్ని ఆధ్యాత్మిక సాధనకు ప్రతి బంధకంగా భావిస్తారు. కాని, అమ్మ సంసారాన్ని సంతోషంగా స్వీకరించింది. ఈ సంసారం పెద్ద జంజాటమని మనం భావిస్తున్నాం. భ్రమిస్తున్నాం. భ్రమవల్ల భయపడుతున్నాం. అయినా, వదులుకోలేక ఆరాటపడుతున్నాం. నిర్వహించే సామర్థ్యం చాలక, బంధాల మధ్య సతమతమవుతున్నాం. "పెళ్ళిలో పెద్దపులి ఉందనుకునే వారి కోసమే తనకీ పెళ్ళి' ' అని చెప్పింది అమ్మ. సంసార బాధ్యతలను చక్కగా నిర్వర్తించి, గృహిణి ధర్మాన్ని ఉదాత్తమైన ఆదర్శంగా లోకానికి చాటింది పరిమితమైన మమకార పరిధిని దాటి, అవధిలేని అనురాగజలధిగా తన హృదయాన్ని రూపొందించుకొన్ననాడు మానవుడు మాధవుడు కాగలడని ఉదాహరణపూర్వకంగా ఉపదేశించింది అమ్మ. "సర్వత్ర అనురాగమే విరాగమ"ని సరికొత్త నిర్వచనం చెప్పింది. సంసారం పట్ల తనకున్న ఆలోచనాధోరణే బంధానికి కారణమని, భావబంధమే తప్పు, భవబంధం లేనే లేదన్న సత్యాన్ని ఆవిష్కరించింది. చేసే ప్రతిపనీ భగవత్సేవ అనుకోగలిగితే, సంసారం ఆధ్యాత్మిక సాధనకు ప్రతిబంధకం కాద"ని ఘంటాపథంగా చెప్పింది.

"సంకల్పమే సంసారమ"ని వివరించింది అమ్మ. సంకల్ప వికల్పాత్మకమైన ఈ మనస్సు వికలం కాకుండా, సర్వత్రానురాగంతో స్థిరంగా కర్తవ్యంపట్ల నిలిస్తే 'భవము' బంధం కానేకాదు. అలాంటి స్థితే జీవన్ముక్తి. అందుకే "వైకల్యం లేకపోవడమే కైవల్యం" అంటూ - సులభమూ ఆదర్శప్రాయమూ ఆచరణసాధ్యమూ విశ్వశ్రేయోదాయకమూ అయిన తరణోపాయాన్ని మనకు చూపుతోంది అమ్మ.

అమ్మ చూపించే కొత్తదారిలో జీవితం సాగించాలంటే ఇతరులపై రాళ్ళురువ్వడం కాక, తన్నుతాను చక్కదిద్దుకోవాలి. అప్పుడే జ్ఞానం కరతలామలకం అవుతుంది. "తన్ను తాను విమర్శించుకోవటం వివేకం. ఇతరుల్ని విమర్శించడం అవివేకం" అంటుంది అమ్మ. ఇలా ఆత్మ విమర్శ సాగినప్పుడు అంతా దైవమే చేయిస్తున్నాడని నమ్మకం కలుగుతుంది. అది సుఖానికి ఏకైక మార్గమని కదా ! అమ్మ చెప్పింది. ఈ స్థితిలో ఉన్న మానవుడికి సంసార బాధలూ ఉండవు. మృత్యుభయమూ ఉండదు. "మృత్యుభయం లేకపోవటమే మృత్యుంజయత్వం" అన్న అమ్మమాట ప్రకారం ఇదే అమరత్వ సిద్ధి. ఇలాంటి స్థితిని సమన్వయాత్మకమైన సందేశంగా మలచి మనకు అందించడానికే అవతరించింది అమ్మ.

లౌకికత ఆధ్యాత్మికతలు వేర్వేరని భావించే మనకు కనువిప్పు కలిగిస్తోంది అమ్మ. లౌకిక జీవితానికి, ఆధ్యాత్మిక సాధనకు వారధి నిర్మించిన సమన్వయసారథి అమ్మ. ఆధ్యాత్మికలోకంలో కొత్తవాకిళ్ళు తెరిచి, అందరికీ ప్రవేశం కల్పించింది అమ్మ.

"నా జీవితమే సందేశం" అని ప్రకటించిన అమ్మను మనం ఆరాధిస్తున్నాం. తల్లిగా, గురువుగా, దైవంగా నమ్ముతున్నాం. అయితే, అమ్మ అంటుంది -- "రాతితో కడితేనే దేవాలయం కాదుగా...." అని. మరి, మన కర్తవ్యం ఏమిటి ? - "నీ హృదయంలో నామంతో గుడి కట్టు నాన్నా ?" అని ఆప్యాయంగా సూచించింది అమ్మ. మన అమ్మ పేరు 'అనసూయ'. "రాగద్వేషాసూయలను పారద్రోలేది అనసూయత్వం - అదే ఈ అనసూయతత్త్వం" అని వివరించింది అమ్మ. నామంతో గుండెలో గుడి కట్టుకోవడమంటే ఏమిటో ఈ వివరణ వల్ల మనం గుర్తించవచ్చు.

దేవాలయంలో అమ్మ ప్రతిమకు మనం చేసే అర్చన మన గుండెను గుడిగా మార్చగలిగితే.

మన హృదయపీఠం అమ్మకు పూజావేదిక కాగలిగితే,

ఆరాధనతోపాటు ఆ తల్లి బిడ్డలుగా అమ్మను కొంతవరకైనా మనం అనుసరించ గలిగితే.

అమ్మ సన్నిధిలో ఉన్నందుకు మన జీవితాలు సార్థకమవుతాయి.

(రచన : మల్లాప్రగడ) (డిశంబరు 86, జనవరి 1987)



# 202
# అమ్మా ! సుముఖీభవ ! సుప్రసన్నా భవ!

అమ్మ ప్రసన్నంగా ఉన్నది. అమ్మ ప్రశాంతంగా ఉన్నది. మృదువుగా ఉన్నది. చూచిన ప్రతివారికి అమ్మ సాన్నిధ్యస్ఫురణ కల్గింది తిరిగి వచ్చేప్పుడు అమ్మను వదిలి వెళ్ళుతున్న భావన కల్గింది. ఇంకా తుదిమెఱుగులు పూర్తి కాకుండానే అమ్మ విగ్రహం చూచిన సోదరీ సోదరులకు అమ్మ విగ్రహం చక్కగా వచ్చిందన్న తృప్తి, ఆనందం కలిగాయి.

1.2.87 అమ్మ విగ్రహ ప్రతిష్టాపన సంఘ సభ్యులు శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ, శ్రీ తంగిరాల కేశవశర్మతో పాటు మరొక 9 మంది కూడా మహాబలిపురం పోయి విగ్రహ నిర్మాణపు ప్రస్తుత స్థితి ఎంత వరకూ వచ్చింది చూచివచ్చారు. విగ్రహ నిర్మాణం పూర్తయేంతవరకు శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ అవసరమయినన్ని సార్లు మహాబలిపురం వెళ్ళి సర్వాంగ సుందరమైన అమ్మ విగ్రహ నిర్మాణానికి తోడ్పడాలని భావింపబడింది. 15.8.97 ఆదివారం జరిగిన శ్రీ విశ్వజననీ పరిషత్ కార్యవర్గ సమావే·లో ఆమోదించిన తీర్మానాలను అనుసరించి పై నిర్ణయాలు తీసుకోవడం జరిగింది. అదే సమావేశంలో - అమ్మ విగ్రహప్రతిష్ఠ ఇంతకు ముందు నిర్ణయించినట్లు అమ్మ జన్మ దినోత్సవం నాడు కాక అమ్మ కళ్యాణ దినోత్సవంనాడు 5.5.87న జరపాలని ఏకగ్రీవంగా నిర్ణయించబడింది. తదను గుణంగా అమ్మ విగ్రహ ప్రతిష్ఠా నిర్వహణ సమితి ఏర్పాటు చేయబడింది.

ఈ సందర్భంగా విగ్రహప్రతిష్ఠ ప్రత్యేక సంచిక ప్రచురించాలని నిర్ణయించడమైనది. దీనికి సంబంధించిన అన్ని బాధ్యతలు చూడటానికి శ్రీ పి యస్.ఆర్. ఆంజనేయప్రసాద్‌ను నియమించడం జరిగింది.

కార్యవర్గ సమావేశం ఇప్పటికవరకు విగ్రహ నిర్మాణానికి, ఉత్సవ విగ్రహాలకు, ఇతర పతకములకు అయిన ఖర్చును సమీక్షించి ఆమోదించింది. 5.5.87న వైభవోపేతంగా అమ్మ దివ్యసుందర విగ్రహప్రతిష్ఠకు సర్వబాధ్యతలు అమ్మ విగ్రహ ప్రతిష్ఠాన సంఘానికి అప్పగిస్తూ ఏకగ్రీవంగా తీర్మానం ఆమోదించటం జరిగింది.

శిల్పి కొరకు అన్వేషించినట్లే ప్రతిష్ఠాచార్యుల కొరకు అన్వేషించడం జరిగింది. అమ్మ అనుగ్రహవశంగా మన అదృష్టవశంగా అమ్మ విగ్రహప్రతిష్ఠకు సమర్థులైన ఆచార్యులు లభించారు. యజుస్సామ అధర్వణవేదాలలో నిష్ణాతులు సాంగ త్రివేదాచార్య బిరుదాంకితులు వేదార్థం చెప్పగల్గిన మహాపండితులు, కపిలేశ్వరపురం వేదకళాశాల ప్రాచార్యులైన శ్రీ తంగిరాల బాలగంగాధరశర్మగారు ప్రతిష్ఠా కార్యక్రమం నిర్వహించటానికి అంగీకరించారు. వారు 13.2.87 మాఘ పూర్ణిమనాడు జిల్లెళ్ళమూడి విచ్చేసి అనసూయేశ్వరాలయ సందర్శనం చేసి గర్భాలయంలో విగ్రహ పీఠనిర్మాణానికి యాగశాల స్నపనమంటప నిర్మాణానికి తగిన సూచనలు ఇచ్చి ప్రతిష్ఠకు కావలసిన వస్తు సంభారాలు వివరించారు.

విగ్రహానికి పూజలు అభిషేకములు, ప్రతిష్ఠాపనంతరమే గాని ముందుకాదని, ప్రతిష్ఠాంగభూతమైన జపతపాలు పారాయణలు అనసూయేశ్వారార్పణం చేయడం ప్రతిష్ఠానంతరమేనని స్పష్టంచేశారు. 5.3.87 తేదీన గుంటూరులో అమ్మ విగ్రహ ప్రతిష్ఠాన సంఘ సభ్యులు సమావేశమై మహాబలిపురంలో నీలమేఘ స్థపతిచేత రూపుదిద్దుకొంటున్న అమ్మ విగ్రహాన్ని అమ్మ కళ్యాణ దినోత్సవం నాడు అనగా 5.5.87న ప్రతిష్ఠించాలని తీర్మానం చేశారు.

మహాలావణ్య శేవధిఅయిన అమ్మ దివ్య సుందర విగ్రహం తుది మెఱుగులు పూర్తికాగానే సకల లాంఛనాలతో మహావైభవోపేతంగా జిల్లెళ్ళమూడి వస్తుంది. అ మ్మరాకకై అమ్మ విగ్రహప్రతిష్ఠకై మండల దీక్షా కార్యక్రమం 22.3.87న ప్రారంభం కానున్నది. దీక్షా కార్యక్రమంలో పాల్గొన గల్గినా లేక పోయినా జిల్లెళ్ళమూడిలో ఉన్నా, లేక ఎవరి ఇళ్ళలోవారు ఉన్నా అందరిదీ ఒకే భావన అందరిదీ ఒకే ప్రార్థన.

అమ్మా ! స్థిరాభవ ! వరదాభవ !

సుముఖాభవ ! సుప్రసన్నా భవ !

(ఫిబ్రవరి, మార్చి 1987)



# 203
# మూల విగ్రహ రూపిణి

అమ్మకు చాలా చిన్నతనంలోని విషయం. అప్పుడు అమ్మకు అయిదు సంవత్సరాలుంటయ్యేమో ! అమ్మ ఆ రోజుల్లో ఎక్కువగా బాపట్లలో చిదంబరరావు తాతగారి ఇంట్లో ఉండేది. బాపట్లలో ఉన్నప్పుడు రోజూ భావనారాయణస్వామి దేవాలయానికి వెళ్ళడం అలవాటు.

ఒకనాడు అట్లా వెళ్ళింది అమ్మ. అమ్మ ఆలోచనల పుట్ట, మరి, మహామేధావి కదా ! 'మతివైభవ నిర్జిత దేవగురు'.

అంతలో అక్కడకు బాపట్ల సుబ్బారావుగారు వచ్చారు. అమ్మ ఆయన్ను దగ్గరకు పిలిచి ----

"దేవుడు ఎక్కడ పుట్టాడు ?" అని అడిగింది.

"గుళ్ళో ఉన్న విగ్రహాలా ?" - అని సుబ్బారావుగారికి సందేహం కలిగింది.

అమ్మ వెంటనే ప్రశ్నించింది --

'విగ్రహాలంటే దేవుడు కాదా ?"

"కాకేం ? కాకేం ? దేవుడే - అని సుబ్బారావుగారు నసిగారు.

"మరి, నేను 'దేవుడు' అంటే గుళ్ళో ఉన్న విగ్రహాలా అంటారేం ?"

"చిన్న పిల్లవు. నీ కెందుకూ ఈ దేవుడూ, దెయ్యాలూ ? వెళ్ళు, వెళ్ళు ఇంటికి -"

సుబ్బారావుగారు ఆ తర్కాన్ని పొడిగించలేకపోయారు.

తర్వాత, ఆ రాత్రిఅంతా అమ్మ ఒక్కతే గర్భగుడిలో కూర్చుని - దేవుడంటే ఏమిటి - అన్న విచికిత్స చేసింది.

మరొకనాడు రాత్రి అమ్మ మన్నవలో రాజ్యలక్ష్మీ అమ్మవారి గుడిలో పడుకుంది. ఆనాడు అర్చకుడు గుడి తలుపులు వెయ్యకనే వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి కూడా అమ్మ లోగడ బాపట్లలో భావనారాయణస్వామి వారి కోవెలలో వలె దేవుడు - విగ్రహాలు గురించి నిశితంగా ఆలోచన చేసింది.

చివరకు ----

దేవాలయం, గర్భగుడిలోని విగ్రహం, ఆలయప్రాకారం, శిఖరం.... రాతిరాతి లోనూ అమ్మవారు కనిపించింది. అమ్మ ప్రాంగణ మంతా కలయ దిరిగింది. నేలపై నడుస్తున్నట్లు లేదు. పాదాలకు అమ్మవారే తగిలింది. ప్రతి యిసుక రేణువులోనూ అమ్మవారే దృశ్యమానమయింది.

పక్కకు చూసింది అమ్మ. అక్కడ ఒక వృక్షం. ఆ వృక్ష భాగాలన్నిటిలోనూ అమ్మవారే. కాండమూ, కొమ్మలూ, ఆకులూ, పూవులూ, కాయలూ.... అన్నిటిలోనూ అమ్మవారే

ఆకాశంవంక అవలోకించింది. నక్షత్రాలకు బదులుగా అమ్మ వారి రూపాలే అనంతంగా కనిపించాయి.

ఎటు చూసినా - పైనా, కిందా, పక్కలా..... అంతటా అమ్మ వారే.

అమ్మ వ్యక్తా వ్యక్త స్వరూపిణి. సగం అవ్యక్తమై, సగం వ్యక్తమై స్వరూపం స్వీకరిస్తోంది.

నేను "ఏకాకిని, నిర్ద్వైత, ద్వైత వర్జిత"ను అని ప్రకటించడంకోసమే శ్రీమత్ సింహాసనేశ్వరియై ఆవిర్భవిస్తోంది శ్రీమాత.

అమ్మ యుగంధర. యుగమంటే జంట. శివశక్తుల యుగల రూపిణి అమ్మ. ఇక నుండి అమ్మ ఒకేమూర్తిలోనే లాలనా, పాలనా --- రెండూ.

అమ్మ వయోవస్థా వివర్జిత. అమ్మకు వయస్సువల్ల వచ్చే పరిణామాలు లేవు. అమ్మకు వృద్ధాప్యంలేదు. అమ్మ నిత్యయౌవన. జాగ్రత్, స్వప్న, సుషుప్తి - అవస్థలు లేవు. బిడ్డల పరిరక్షణలో అంతా జాగ్రదవస్థయే.

అమ్మ క్షయ వృద్ధి వినిర్ముక్త కృష్ణపక్ష చంద్రునివలె క్షయమూ లేదు. శుక్ల పక్ష చంద్రుని వలె అభివృద్ధీ లేదు. ఒడిదుడుకులు లేనిది అమ్మ.

అమ్మ శ్యామాభా. నల్లని రంగులో మెరిసిపోతుంది.

'అమ్మా - నీ కింత నలుపురంగు వచ్చిందే మమ్మా ? అని అడిగాడు, ఒక సోదరుడు, అమ్మ ఒకప్పుడు హేమవర్ణంతో వెలుగొందేది. తర్వాత అమ్మ శరీరచ్ఛాయలో పరిణామం వచ్చింది.

ఆ ప్రశ్నకు అమ్మ అన్నది "మిమ్మల్ని గురించి ఆలోచిస్తుంటేనే ఈ నలుపు వచ్చింది నాన్నా --" అని.

నలుపు, చీకటి -- అజ్ఞానానికి, పాపానికి, దుఃఖానికి సంకేతాలు. అవి మానవుడిని పట్టి పీడిస్తున్న అసురీగుణాలు. బిడ్డల క్షేమం కోరే తల్లి మనలోని ఆమూటిని తాను సంతోషంగా స్వీకరించి నల్లగా నిగనిగలాడుతూ 'మహాలావణ్య శేవధి' అయింది.

శివుడు కాలకంఠుడు మాత్రమే అయితే అమ్మ "శ్యామాభా" అయింది. 'శివవర' అయింది.

అమ్మ నఖదీధితి సంఛన్న సమజ్జన తమోగుణ. అమ్మ వందారు జనవత్సల భక్తి మత్కల్పలతిక. భక్త సౌభాగ్యదాయిని. భక్తనిధి. భక్తి ప్రియ. భక్తివశ్య. భక్తిగమ్య. సమస్త భక్తి సుఖద.

(ఏప్రిల్ 1987)



## అమ్మ సందేశం

సందేహం నివృత్తి చేసేదీ, తృప్తినీ, శాంతినీ, హాయినీ ఇచ్చేదే సందేశం. నీకు ఇచ్చింది తృప్తిగా అనుభవించడం, నీకున్నది నలుగురికీ ఆదరణగా పెట్టడం, అంతా వాడే చేస్తున్నాడని నమ్మడం.... ఇదే నా సందేశం.

# 204
# యుగంధర

ఒకనాడు బ్రహ్మేంద్రాది దేవతలు కైలాసానికి వచ్చి పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ....

"నీవు మృత్యుంజయుడవు. త్రిశూల పాణివై, త్రినేత్ర 'వై మృత్యువును కాలదన్ని విరూపాక్షజ్వాలల్లో మన్మథుణ్ణే దగ్ధం చేశావు...." అని ప్రస్తుతిస్తుంటే సరసన ఉన్న భవాని విలాసంగా నవ్వింది. శంకరునికి ఆ హేలలోని అంతరార్థం అవగాహన కాక --- ఎందుకూ నవ్వుతున్నావని పార్వతి వంక చూశాడు.

"మీరు ఏ ఘనకార్యం చేశారని మిమ్మల్ని ఈ దేవతానీకం మృత్యుంజయుడని అభివర్ణిస్తున్నారో నాకర్థం కావడం లేదు. వారి పొగడ్తే నా నవ్వుకు కారణం" అని వివరించింది కామేశ్వరి.

"మార్కండేయుని కాపాడే సమయంలో మృత్యువును కాలితో తన్నాను కదా ' అన్నాడు శివుడు.

"ఏ పాదంతో ?" నని ప్రశ్నించింది దేవి.

"ఎడమ పాదంతో"నని ఈశ్వరుని సమాధానం.

"ఆ చరణం నాది కదా స్వామీ" అన్నది చిరునవ్వుతో పార్వతి.

అంటే -- పరమేశ్వరి వామపాద తాడనంతో మృత్యువును జయించింది.

ఈ సంఘటన, ఈ చతుర సంభాషణ -- మనకు శివశక్తుల సమైక్యరూప వైభవాన్ని బోధిస్తున్నాయి.

సృష్టికి పూర్వం ఆత్మ ఒక్కటే ఉండేదని -- బృహదారణ్యకోపనిషత్ చెబుతున్నది. ఆ ఒకే ఆత్మ రెండవదాన్ని కోరగా --- కోరినంతనే రెండు రూపాలయిందట. ఆ రూపద్వయమే శివశక్తులు. ఈశ్వర స్వరూపమయిన ప్రజ్ఞానం ఒడిలో దేవి నివసిస్తోంది. ఆమె కాలి కదలికలో, కను సైగలో ఈ సర్వ జగత్తు సృష్టింప బడుతోంది. శంభుని ఒడి అంబకు గుడి

"యథా శివః తథా దేవీ
యథా దేవీ తథా శివః"

---- అన్న పురాణోక్తివల్ల శివ-శక్తుల అభేదతత్వం మనకు అవగతమవుతోంది.

అగ్ని - వేడిమి, సూర్యుడు - తేజము, చంద్రుడు - వెన్నెల వలె శివ శక్తులు అవిభాజ్యాలు. ఈశ్వరితో కూడినపుడే శివుడు శక్తి మంతుడవుతున్నాడని పురాణ గాథలు వివరిస్తున్నాయి. సదాశివుడు హాలాహలాన్ని మ్రింగినపుడు కాలునికి లోబడకపోవడానికి కారణం...... పరమేశ్వరి తాటంక ప్రభావమే కదా ! దేవి ఉనికియే కామేశ్వరునికి ప్రాణనాడి.

శివుడు పరాశక్తికి అధీనుడు - ఆమెతో కలిసి నివశిస్తూ, ఆటలాడుతూ ఆమె గృహమధ్యంలో ఉన్నాడని పురానాణాలు ప్రవచిస్తున్నాయి. మానవులకు భక్తిముక్తులను ప్రసాదించి రక్షించడానికి శివుడు పరాశక్తి అయిన పరమేశ్వరితో కూడి ఉంటాడని వేదాలు తెలియ జేస్తున్నాయి.

పార్వతి తపస్సుకు సంతృప్తి చెంది సర్వేశ్వరుడు ప్రత్యక్షమై "తవాస్మిదానః" నేను నీ దానుణ్ణి - అని అన్నట్లు పురాణగాధ చెబుతోంది.

1981 ఫిబ్రవరి 16వ తేదీన నాన్నగారు పార్థివదేహాన్ని పరిత్యజించారు. ఆ విషయం అమ్మకు నివేదించగా -- ఆ శరీరాన్ని తన వద్దకు తీసుకువచ్చి - తన మంచం పక్కన మంచంవేసి ఆ మంచంపై పడుకో బెట్టమని ఆదేశించింది. అట్లా చేయగా - నాన్నగారి హృదయ స్థానంపై తన దక్షిణ హస్తాన్ని ఉంచి ఒక దినమల్లా అమ్మ పడుకున్నది.

తర్వాత ఏమి చేయాల్సిందీ, అంటే నాన్నగారి దేహానికి చేయాల్సిన సంస్కారాన్ని గురించి అడిగాము.

1956వ సంవత్సరంలో శంకుస్థాపన చేయబడి నిర్మాణం చాలా వరకు పూర్తి అయి గర్భాలయం ఖాళీగా ఉన్న దేవాలయాన్ని ప్రస్తావించింది అమ్మ.

ఆ గర్భాలయాన్ని రెండు భాగాలు చేయండి. ఎడమ భాగంలో నాన్నగారి దేహాన్ని భద్రపరచండి. కుడి భాగం ఖాళీగా ఉంచండి. అది నా భాగం" అని స్పష్టంగా వివరించింది.

సర్వానుల్లంఘ్య శాసన కదా అమ్మ ! అట్లాగే జరిగింది.

ఇపుడు ఒకే గృహంలో అమ్మ - నాన్న గార్ల దేహాలు ఒకదాని సరసన మరొకటి అలరారుతున్నాయి.

ఒకనాడు నాన్నగారు ప్రసంగవశాన "మీ అమ్మగారికి భావ బలం ఎక్కువ" అన్నారు. అమ్మ వెంటనే అన్నది "అది భావ బలం కాదు, బావబలం" అని నాన్నగారు అమ్మకు మేనత్త కుమారుడు అంటే బావ. మరొకనాడు "అమ్మా ! పరధ్యాసలో ఉన్నావు" అని ఒక సోదరుడు అంటే "పరధ్యాస కాదు నాన్నా -- పతిధ్యాస" అని సరి చేసింది అమ్మ. మరి, అమ్మ యోగానంద కదా ! శివశక్తి సమైక్యాత్మక మయిన యోగమే అమ్మకు ఆనందం. ధ్యాసే ధ్యానం - అని అమ్మ నిర్వచనం.

పాతివ్రత్యాన్ని నిర్వచిస్తూ అమ్మ చెప్పింది..... పతిని ఆధారంగా చేసుకుని పంచభూతాలను జయించినదే పతివ్రత --- అని --- పాతివ్రత్యానికి పరాకాష్ఠ స్థితి భర్త కూడా భార్యను అమ్మా -- అని పిలవడమే --నని అమ్మ మనోహరంగా అభివర్ణించింది.

అమ్మ పంచభూతేశ్వరి -- నాన్నగారి యందు కూడా వాత్సల్యా మృతాన్ని అభివర్షించిన సర్వజనయిత్రి స్వాధీన వల్లభ దేవాలయపైభాగాన నాన్నగారు అమ్మచరణాబ్జాలపై సభక్తికంగా పువ్వులుంచిన అపూర్వ మధుర సన్నివేశం ఎంతమందినో పులకాంకితులను చేసింది. "ఏమయినా మీ అమ్మగారు చెప్పవలసిందేరా" -- అంటూ నాన్నగారు అమ్మయందు చూపే విశ్వాసమూ, వినమ్రభావమూ మరుపుకురానివి అమ్మ శివప్రియే కాదు, శివారాధ్య కూడా.

అమ్మ నాన్నగారి ప్రాణనాడియో, నాన్నగారే అమ్మ ప్రాణ నాడియో - విడమరిచి చెప్పడం సులభం కాదు. అమ్మ శివశక్త్యైక్య రూపిణి.

అమ్మ "మూర్త", "అమూర్త".

అమ్మ అనంత వాత్సల్యం శరీర పరిత్యాగంతో సమాప్తం కాక పోవడం విశేషం కాదు. అమ్మ వాత్సల్య వల్లరి, కారుణ్య సంజీవనితో పునరుజ్జీవితమై ననలు సాగింది. ఆ దివ్యలతాంతమే నేటి అమ్మ విగ్రహం. "అమూర్త" భాగం భూగర్భంలోనే భద్రంగా విరాజిల్లుతుండగా "మూర్త" భాగం మేదినిపై విలసిల్ల గలదు.

ఏమిటిది ? ఇంతమంది అమ్మవార్లా ? లేక అన్నింటిలోనూ ఒకే అమ్మవారా? ఒకే అమ్మవారే ఇన్ని ఆకృతులు ధరించిందా ? ఒకే అమ్మవారే అనంతకోటి రూపాలతో

విశ్వమంతా తానే అయిభాసిస్తున్నదా ? విశ్వరూప సందర్శనమంటే - విశ్వంలోని ప్రతి అణువులోనూ, ప్రతి వస్తువునూ ఒకటిగా చూడడమేనా ?

అమ్మ ఆలోచనల లత పుష్పించిన దివ్యకుసుమం -- "అంతా అదే" నన్న భావం.

★ ★ ★

అప్పటి నుంచీ అమ్మ భావన, అమ్మ బోధ.. కనిపించేదీ, కనుపించనిదీ ఉన్నదంతా దైవమే -- నని. అమ్మ దృష్టిలో సత్తు అసత్తు - అన్న విభేదం లేదు. జడమూ, చేతనమూ - అన్న అంతరమే లేదు. 'ఎంత వెదకినా 'అది' 'దైవం' కానిది కనిపించడం లే' -దని నిర్ద్వంద్వంగా ప్రకటించింది. అందువల్లనే ఆధ్యాత్మిక చింతనలోనే మకుటాయమానమయిన "శరీరం కూడా ఆత్మ కాకపోలేదు" అన్న ప్రవచనం చేసి అమ్మ అద్వైత శిఖరాగ్రంపై సింహాసనాసీన అయింది.

అమ్మ ఏం చేసినా అతిసహజంగానూ, అత్యంత సుందరంగానూ అలరారుతుంది. గొప్ప గొప్ప విషయాలు నిర్వహించేటప్పుడుగానీ, అతిలోక సత్యాలను ప్రవచించేటప్పుడుగానీ అమ్మ అతి సాధారణంగా నిత్య కార్యక్రమంలో భాగంగా నిర్వర్తించడమే అమ్మలోని విలక్షణత, విశిష్టత. వాచ్యంగానూ, వ్యంగ్యంగానూ, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, క్రియద్వారానూ, వాక్కు ద్వారానూ - అమ్మ తన యదార్థస్థితిని మనకు అవగతం చేసింది.

అమ్మ మూల విగ్రహ రూపిణి.

మామూలుగా అమ్మ రవికలు హరిదాసుగారు కుడతారు. ఒకనాడు హరిదాసుగారికి తన రవికను కుట్టడానికి ఇస్తూ ----

"ఇవ్వాళ రవిక బిగుతయింది నిన్న వదులుగ ఉన్నది. మరి, ఎట్లా కుడతావో ? నా రవిక కుట్టడంలో నీ నేర్పంతా బయట పడాలి" -- అన్నది అమ్మ.

"నీ ఆది తెలియదు" అన్నారు హరిదాసుగారు, సామాన్య అర్థంలోనే.

"నాది అనాది కనుక నా ఆది అందదు" అని ప్రకటించింది. అమ్మ విశేషార్థంలో, సామాన్య స్వరంలో.

మరొక సందర్భంలో ----

"ఎందుకూ ఆదివారమనా ?

ఆ వారాలు నన్నేమి చేస్తాయి ?

- నేను అనాది వారాన్ని అయితే -" అని స్పష్టపరిచింది.

ఒకరు "నీవు బ్రహ్మపదార్థానివా ? బ్రహ్మతత్త్వానివా ? బ్రహ్మవా ?" అని సూటిగా ప్రశ్నిస్తే ----

"నేను మూటికీ మూలమై మూడు అయినాను" అని అమ్మ అంతకంటే సూటిగా సమాధానం చెప్పింది.

ఒక ప్రసంగంలో -

"అమ్మ అంటే ఏం ? బ్రహ్మ అంటే ఏం ?" - అని ప్రశ్నిస్తూ అమ్మ తన బ్రహ్మస్థితిని ఎరుక పరచింది.

ఒకరు "మనం యమదూతలం కాదు. అమ్మ దూతలం" అంటే --

"యమదూతలు అమ్మ దూతలు కాకపోతేగా ?" అమ్మ చమత్కారంలోనే తన సర్వమతత్త్వాన్ని మనకు అభివ్యక్తం చేసింది.

"నాలుగు గోడల మధ్య మంచం మీద కనబడుతున్న అమ్మ పరిమితం. బయట అనంతం."

"అందరూ ఎప్పుడూ చూడరు నన్ను.
నేనందరినీ ఎప్పుడూ చూస్తాను".

"అందరూ నా ఒడిలోనే తిరుగుతున్నారు.
ఒడి విడిచి ఎవరూ లేదు"

"సృష్టి అనాది, నాది."

"మీరు అనుకునేదయినా, అనేదయినా, ఆచరించేదయినా --- నేను అనుకుంటేనే ---" అని అమ్మ తన బాల్యంలోనే ఖాసిం సాహెబ్‌కు చెప్పి లోకానికి వెల్లడించింది "ప్రేరణే దైవం" "సంకల్పమే దైవం"అనికూడా నిర్వచించింది.

ఒకనాడు నేటి మన ఆరాధ్యమూర్తి అయిన హైమ, వసుంధర, యోగయ్యలు కలిసి అమ్మ వద్దకు వచ్చారు. అంతకుముందు వారు చేసిన సంభాషణను అమ్మ పునరుక్తం చేసింది.

"నీకెవరు చెప్పారమ్మా ?"

"యోగయ్య".

"మేము ముగ్గురమూ కలిసే వచ్చేము కదమ్మా. నీకెప్పుడు చెప్పాడు?" - "మీ ముగ్గురితోపాటు నాలుగోదాన్ని నేను లేనూ ?" అమ్మ తన సర్వవ్యాపకత్వాన్ని నవ్వుతూ నవ్వుతూ అలవోకగా చెప్పింది.

మరొకనాడు ఒక సోదరుడు "మీ అమృతహస్తంతో నన్ను తాకండమ్మా --" అని అర్థించాడు.

"ఎప్పుడూ తాకే ఉన్నానుగా, నాన్నా --"

అతనికి అవగాహన కాక అడిగాడు --

"ఎప్పుడూ తాకడమంటే నమ్మా ?"

"నేను అనేది అందరిలో ఉన్నది కదా. అందుకే ఎప్పుడూ తాకే ఉన్నాను -- అన్నాను" అని అమ్మ తన సర్వాంతర్యామిత్వాన్ని మనకు తెలియజెప్పింది.

"నేను నేనైన నేను ---" అని అమ్మ చేసిన విశిష్ట ప్రకటనను "అన్ని నేనులు నేనైన నేను" అని వివరించింది

"నేను తల్లిని. మీరు బిడ్డలు" అన్న మధురాతి మధురమైన, అమ్మ జీవన విధానానికే మూలసూత్రమయిన ప్రవచనానికి అనుబంధంగా --

"తల్లి అంటే తొల్లి".

"తల్లి అంటే తరింపజేసేది"

"జనని అంటే మూలస్థానం"

"నేను సర్వసిద్ధాంత సార్వభౌమను".

"అన్నీ నేనే"

"నేను సర్వానికి మూలాన్ని"

"మీరంతా నేనే. మీదంతా నేనే. ఇదంతా నేనే" ..... అని అమ్మ అప్పుడప్పుడు చేసిన అనేకానేకమయిన ప్రకటనలు అమ్మ జగన్మాతృత్వానికీ, జగన్నాయకత్వానికీ దర్పణాలు

మూల విగ్రహ స్వరూపిణి, ఆదిశక్తి అయిన పరమేశ్వరి లీలగా, విలాసంగా మనమధ్య మానియై మెలగాలన్న వాత్సల్య భావంతో ధరాతలానికి విచ్చేసి -

మనతోపాటు జీవించి మనను ప్రేమించి మనచేత ప్రేమింపబడి, పూజింపబడి, మనకెన్నో సత్యాలను వివరించి, మరెన్నో పాఠాలను ప్రబోధించి, దైవాన్ని గురించి విశదపరిచి, దైవాన్ని రక్తమాంసాలతో చూపించి, విశ్వదర్శనం అనుగ్రహించి -- నిర్ణయానికి నిర్ణయించినవాడు కూడా బద్ధుడు కావలసిందే -- నన్న సూత్రానికి అనుగుణంగా కాలస్వరూపిణి, కాలాధీశురాలు అయినప్పటికీ కాలధర్మానికి కట్టుబడి శరీర పరిత్యాగం చేసింది.

మరి -- యీ ఎడబాటు, ఈ తెరచాటువల్ల మనకు కలిగిన దుస్సహ వేదనను తాను సహించలేకనో..... మరి తనకే భరించలేని బాధ కలిగిందో -- ఆ మూలవిగ్రహరూపిణి అనసూయేశ్వరాలయంలో 'మూల విరాట్టు'గా సుప్రతిష్ఠితగా నభిలషించడం మన అదృష్టం, పరమ భాగ్యం. అమ్మకు మనపైగల అనురాగానికీ, అనుగ్రహానికీ చిహ్నం.

"నేను అనుకున్నది చేయాలంటే ---

నాకు శరీరమే అవసరం లేదు" అని ఉద్ఘాటించిన అమ్మకు, మనను అనుగ్రహించేందుకు (శరీరమే కాదు) విగ్రహమూ అవసరం లేదు. "మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలు కూడా" అని భావించిన అమ్మకు విశ్వమే విగ్రహమూ, మనమందరమూ అవయవాలమూ. అమ్మ ఏమి నిర్వహించ వలెనన్నా మనమందరమూ ఉపకరణాలమే !

కానీ అమ్మ 'కాంతార్ధ విగ్రహ' కదా ! "నేనేం చేసినా మీ కోసమే నేను స్నానం చేసినా, చీర కట్టుకున్నా మీ కోసమే" -- నని వక్కాణించిన అమ్మ ఆనాడు రక్త మాంసాలతో శరీరధారణ చేసినా, ఈనాడు విగ్రహరూపం స్వీకరించినా -- కాంతల (జీవుల) తృప్తికోసం, ఆనందంకోసమే.

అమ్మ శాశ్వత నివాసానికి ఎంచుకున్న అనసూయేశ్వరాలయం బహుధా విశేషము విశిష్టము అయింది. 1956వ సంవత్సరంలో శంకుస్థాపన చేసినదాది అమ్మ ఆ ఆలయానికి అనిర్వచనీయమయిన పవిత్రతనూ, బలాన్నీ ప్రసాదించింది. ప్రతి సంవత్సరమూ, తన కల్యాణోత్సవమయిన మే 5వ తేదీనాడు ఆలయ ఉపరి భాగానా, అంతరాలయానా అసంఖ్యాకమయిన కొబ్బరికాయలూ, గుమ్మడి కాయలూ పగలకొట్టేది. మంగళ ప్రదాలయిన పసుపు కుంకుమలనూ, పూలనూ సమర్పించేది. దేవాలయమూ, దేవుడూ వేరుకాదని చెప్పిన అమ్మ - విగ్రహ ప్రతిష్ఠచేయని ఆ దేవాలయాన్ని అపూర్వరీతిలో స్వయంగా పూజించి ఆ పూజాఫలాన్ని ఆలయానికి

సమర్పించింది. గర్భగుడిలో స్థాణువువలె నిలబడి మన పూజలనూ, నీరాజనాలనూ అందుకునేది. అది -- ఈనాటి ఈ దివ్యపరిణామానికి సంకేతమేమో !

ఈ విధంగా ఆ దేవాలయాన్ని మూడు దశాబ్దాలుగా పునీతం చేసి - చివరకు తన జీవిత భాగస్వామితో కలిసి తమ ఇరువురి శరీరాలను అక్కడనే నిక్షిప్తం చేసి, ఆ పునీతస్థలాననే విగ్రహ ప్రతిష్ఠను ఆదేశించిన అమ్మ సంకల్పసిద్ధీ, కారుణ్య పారమ్యమూ, నిస్సీమ మహిమా అత్యద్భుతం. ఈ విశేష సంఘటనల సమ్మేళనం జగచ్చరిత్రలోనే అపూర్వం !

ఆయా వ్యక్తులకూ, అవతారమూర్తులకూ వారి జీవితా సంతరం భక్తులు ఆలయాలు కట్టించడమూ ఆరాధనలు జరపడమూ ఉన్నది. సిద్ధవ్యక్తులు పరమపదించిన తదుపరి వారిని భూస్థాపితం చేయడమూ, తర్వాత అక్కడ సమాధినో, ఆలయాన్నో నిర్మించడమూ అర్చనలు కొనసాగించడమూ ఉన్నది. కానీ ప్రస్తుతం జిల్లెళ్ళమూడిలోని అనసూయేశ్వరాలయం అనన్యసామాన్యం, లోకాతీతమయిన అద్భుత ఘటన. ఎవరు తమ శరీరాలను నిక్షిప్తం చేయడంకోసం ముందుగానే సర్వలక్షణ లక్షితమయిన దేవాలయాన్ని నిర్మిస్తారు ? ముందుగానే శిఖర నిర్మాణాది సర్వాలంకారాలు సమకూరుస్తారు ?

1973వ సంవత్సరంలో అమ్మ నెల్లూరు పర్యటనలో రంగనాయకస్వామి దేవాలయానికి వెళ్ళింది. ఆ విగ్రహాన్ని అమ్మ శిలగా భావించలేదు. జడమనుకోలేదు. సచేతనంగా సంభావించింది. ఒక తల్లి -- కొంచెం కాలవిలంబన అనంతరం బిడ్డను దరిజేరినప్పుడు ఏ అనుభూతి పొందుతుందో, అమ్మలో ఆ క్షణాన ఆ అనుభూతి యొక్క మెరుపు కనిపించింది.

అనేక పర్యాయాలు అమ్మ హైమాలయాన్ని దర్శించినపుడు కూడా అమ్మలో ఆ అనుభూతియే కనిపించేది. హైమను విగ్రహంవలె కాక సజీవంగానే భావించేది. మనం ఈ భావానికి వారసులం కావాలనేదే -- అమ్మ మనకు ప్రబోధించిన పాఠం.

1958వ సంవత్సరంలో దేవీనవరాత్రి ఉత్సవాల్లో అమ్మ మన్నవలో రాజ్యలక్ష్మి అమ్మవారి దేవాలయాన్ని దర్శించింది. అమ్మ లోపలకు ప్రవేశించగానే విగ్రహం చేతిలో ఉన్న పువ్వు జారి అమ్మ సమీపంలో పడింది. విగ్రహంకూడా స్పందన పొందుతుంది అని మనకు చెప్పడం కోసమే అమ్మ సృష్టించిన ఆ సంఘటనలోని ఆంతర్యమేమో - అనిపిస్తుంది విగ్రహం మన మొరలనూ, విన్నపాలనూ ఆలించి పాలించగలమని కూడా మనకా సంఘటనవల్ల అర్థమవుతుంది.

సర్వ వ్యాప్తమయిన అమ్మ పరమాద్భుత దివ్యశక్తికి కేంద్ర స్థానం అనసూయేశ్వరాలయం ! "కాలవనిండుగా నీళ్ళున్నా తాగటానికి రేవు ఎట్లా అవసరమో -- అట్లాగే సర్వత్రా ఉన్న దేవుడిని తెలుసుకోడానికి దేవాలయం అవసరమయింది" -- అని అమ్మ అనుగ్రహించిన వివరణ మనకు చిరస్మరణీయం.

'నిగ్రహంకొరకే విగ్రహారాధన" -- అన్న అమ్మవాక్యం సర్వజగతికీ మార్గదర్శకం.

"మనస్సు లయమందే చోటే దేవాలయం" అని అమ్మ పలికిన వివరణ అనసూయేశ్వరాలయంలో సర్వ జనులకు అర్హతా నర్హతల విభేదం లేకుండా పంచిపెట్టబడే మహాప్రసాదం. అంటే అన్ని దేవాలయాల విషయమై ఎట్లా ఉన్నా -- అనసూయేశ్వరాలయంలో ఎవరయినా అడుగుపెడితే చాలు - వారందరికీ మనోవైకల్యాలు తొలగి మనస్సు ప్రశాంతి పొందతుంది. మరి - అక్కడ అడుగు పెట్టడమే అర్హతయేమో !

"అందరికీ సుగతే."

"నన్ను చూడడమే పుణ్యం" -- అని ఉదారంగా ప్రకటించిన అనుగ్రహ స్వరూపిణి అమ్మ కదా అక్కడ అధిష్ఠాన దేవత !

అనసూయేశ్వరాలయంలో మరో విశేషం ఉన్నది. ఆ గర్భాలయ భూగర్భాన అమ్మా నాన్నగార్ల ఇరువురి దివ్యమూర్తుల పూర్ణశరీరాలను భద్రపరిచారు. ఆ రెండు శరీరాలనూ అనుసంధిస్తూ ఒకే ఒక అమ్మ విగ్రహం... ధన ఋణ శక్తులు రెండూ కలిసి ఒకే విద్యుద్దీపాన్ని వెలిగించినట్లు మనకు కనిపించేది అమ్మవిగ్రహం ఒక్కటే అయినప్పటికీ -- అందులో అర్ధనారీశ్వర తత్త్వం విలసిల్లుతోంది. మరి, అక్కడ ప్రజ్వరిల్లనున్న అఖండ దివ్యజ్యోతి ఎన్ని లోకాలను ఎన్ని యుగాల పర్యంతం దివ్యదీధితి వెల్లువలలో ముంచెత్తనున్నదో !

మరో విశేషం -- కారుణ్యమూర్తి బుద్ధ భగవానుని అస్థికాంశలో, నఖభాగాలో, దంతాలో... ప్రతిష్టితమై బౌద్ధారామాలకు ఎనలేని శక్తిని ప్రసాదించాయి. అదే ప్రజల అభీష్టప్రదాయిని అయింది. మరి, అనసూయేశ్వరాలయంలో - యోగాగ్ని పునీతమై, దివ్యలక్షణ విరాజితమై దివ్యగంధాఢ్యమై మూడు దశాబ్దాలు అవిరామంగా, అవిశ్రాంతంగా, అహర్నిశం అసంఖ్యాక భక్తుల పూజలు అందుకుని పూజాఫల మేరువుగా రూపొందిన సంపూర్ణశరీరం అక్కడ భక్తులనూ బిడ్డలనూ అనుగ్రహించే నిమిత్తం ఉవ్విళ్ళూరుతూ ఉన్నది. మరి, అది ఎంత బలమైన స్థానం ! అక్కడ సర్వజన వాంఛితాలు సిద్ధించడంలో ఆశ్చర్య మేమున్నది ?

అమ్మ ఈ అవనీతలాన ఆవిర్భవించిన పుణ్యదినం 1923 మార్చి 28వ తేదీ వలెనే - అనసూయేశ్వరాలయంలో అమ్మ విగ్రహ రూపంలో 'సుప్రతిష్ఠ'గా ఆవిర్భవించే సర్వ శుభంకరమైన రోజు కూడా చరిత్రలో సువర్ణాక్షర లిఖితం కాదగినది.

అమ్మ మూల విగ్రహ రూపిణి.
లీలా విగ్రహ ధారిణి
కాంతార్ధ విగ్రహ.
దివ్య విగ్రహ.
జ్ఞాన విగ్రహ.
ప్రేమ విగ్రహ.
ధర్మ విగ్రహ.
కారుణ్య విగ్రహ.
వాత్సల్య విగ్రహ.
కేవలానుగ్రహ.

(మే 1987)



## మంగళసూత్రమే మహా సూత్రం

సూత్రం అంటే ఒక రకంగా ఇముడ్చుకునేది అని అర్థం. దారం బంగారంతో చేసిన తాళిబొట్లలో ఇమిడి వుంటుంది. దారంలో తాళిబొట్లు ఇమిడి వుంటాయి. ఒకదానిలో ఒకటి ఇమిడి వున్నది ఇముడ్చుకునే శక్తి రెంటికీ వున్నది అదియే అర్ధనారీశ్వరత్వం. అర్ధనారీశ్వరుడంటే ఒక దానిలో ఒకటి ఇమడడమే. అట్లా ఇమిడిపోయిన శక్తిని ఆరాధించాలంటే ప్రత్యక్షంగా మెడలో గట్టిన సూత్రాన్నే ఆరాధించాలి. దారము, బొట్లు రెండూ కలిస్తేనే సూత్రం. దారం లేకపోయినా సూత్రం కాదు. బొట్లు లేకపోయినా సూత్రం కాదు. ఆ రెండు బొట్లూ భర్త పాదాలు. ఆ పాదాలను ప్రేమ అనే పాశంతో మూడు ముళ్ళు వేసుకుని పట్టుకుని వుంటుంది. ఆ మూడు ముళ్లే త్రిపుటి. ప్రేమ అంటే భక్తి. భర్త మీది ప్రేమ భక్తి. బిడ్డలమీది ప్రేమ వాత్సల్యం. ప్రేమ ఒకటే కాని స్థానాలను బట్టి పేర్లు మారుతూ వుంటాయి. ఆ రెండు పాదాలే వివాహితలకు శరణ్యం అన్ని సూత్రాలు తెలియపరిచే సూత్రమే మంగళ సూత్రం. ఆ మంగళసూద్రమే స్త్రీకి మహాసూత్రం.

\- అమ్మ

# 205
# సృష్టిలో మార్పుండదు ; దృష్టినే మనం మార్చుకోవాలి

సర్వజీవకారుణ్యం, సర్వత్రానురాగం, సర్వసామర్థ్యం, సర్వజ్ఞత్వం, లోకాతీత సౌందర్యం, నిరవధిక ఐశ్వర్యం, రాకాశశి ప్రభారాశి.... సప్తవర్ణాలై వికసించిన హరివిల్లు మానవాకృతి ధరిస్తే - ఆ ముగ్ధ మనోహర స్నిగ్ధ సుందర విశ్వ సమ్మోహన ప్రేమైకమూర్తి 'అమ్మ'

అమ్మ కన్నెత్తి చూస్తే - ఆశీస్సుమవర్షం
అమ్మ పెదవి కదిపితే - వాత్సల్యామృతధార
అమ్మ స్పర్శలో - సంజీవనులు
అమ్మ పాదాల్లో - పరుసవేదులు
అమ్మ హస్తాల్లో - అభయముద్ర
అమ్మ హృదయం - క్షీరాబ్ధి
అమ్మ సన్నిధి - కల్పతరువు
అమ్మ తనువు - ఉదయించేకిరణం
అమ్మ మూర్తి - అపురూప కళాఖండం, నడయాడే దేవతా విగ్రహం.

అమ్మకు సమకాలికులము కాగలగటం ఎంత అదృష్టం ! అమ్మతో సహజీవనం చేయగలగడం ఎంతటి భాగ్యం ! నిరంతరం అమ్మను దర్శిస్తూ, స్పృశిస్తూ, అమ్మతో సంభాషిస్తూ, అమ్మకు సహచరులమై రసఝురులమై మనగలగడం, స్వర్గలోక నివాసమే.

అమ్మ పరిపూర్ణ కటాక్షంవల్ల అపూర్వమైన ఈ పెన్నిధులన్నీ అయాచితంగా నాకు లభించి, నన్ను కుబేరుణ్ణి చేశాయి. ఆనందాబ్ధిలో సుమనౌకనై రెండు పుష్కరాలు విహరించాను. భ్రమరాన్నై ఆ చరణ కమలాల్లోని మధుర మకరందాన్ని పుక్కిటిబంటిగా సేవించాను. ఆకల్పతరుచ్ఛాయల్లో కాలం కర్పూరమై వెలిగింది.

ఆ పాదపూజ, ఆ పాదసేవ, నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసలైనాయి.

విధి కర్కశ హృదయ. నిర్దయరాలు. నా ఆనందపారవశ్యాన్ని చూసి ఓర్వలేకపోయింది. పగతో బుసకొట్టింది. కసితో కాటేసింది.

అమ్మ అదృశ్యమైంది. పైరుపచ్చలతో కళకళలాడే నాహృదయం తుఫాను దెబ్బకు కకావికలైంది. శిలామాతానికి గురిఅయిన గువ్వలవలే నానాళ్ళు కుప్ప కూలాయి. నాబ్రతుకులో శిశిరం ప్రవేశించి ఆకులు దూసింది. ఎండనుండి, వాన నుండి - కంటిని రెప్పవలే -- నన్ను కాపాడే నా గొడుగు విరిగిపోయింది. ఎంతటి కష్టాల కడలినైనా తృటిలో దాటించే నాపడవ పగిలిపోయింది. నాకన్నీళ్ళ కోనేటిలో నాదురదృష్టం శతపత్రమై వెలసి నన్ను వెక్కిరించింది.

బ్రతుకులో చేవలేక, ఆత్మహత్యతో చావలేక, ఎక్కడికిపోనూ దోవలేక -- అది బ్రతుకో, చావో అర్థం కాక, పగలూ రాత్రీ కాని అసురసంధ్యలో అలమటిస్తూ, దిక్కుతోచక, నిలబడ్డ నిరీహ, నిర్జీవ క్షణాలలో... ఆరని దుఃఖం నన్ను అతలా కుతలం చేసింది. నా బ్రతుకును తడిపి ముద్దచేసింది. కాలం రంపమై నా గుండెను కోసింది. భూకంపమై నా బ్రతుకు పునాదులు కదిపింది. ముళ్ళకంపయై నా ఎదను రక్తసిక్తం చేసింది.

నా దుఃఖాగ్ని నుండే ఒక వింతైన విచికిత్సా కమలం ---
అమ్మంటే -- శరీరమా ? శరీరాంతర్గతమైన శక్తా ?

సరిగ్గా ఇటువంటి ఆలోచనే అమ్మకు -- అమ్మమ్మ మరణించినపుడు కలిగింది. అమ్మమ్మ కళేబరము శ్మశానానికి తరలించే ముందు. అమ్మ ఎదలో చింతన తరంగితమైంది. కనిపించే శరీరమే అమ్మ అయితే, అది ఇప్పుడూ ఉన్నదీ, దుఃఖించడం అనసవరం. కనిపించని శక్తే అమ్మ అయితే అది లోగడా కనిపించలేదు. ఇప్పుడు కొత్తగా నష్టమయినది ఏమిటి ? ఎందుకు దుఃఖించాలి ? అని ప్రశ్నరూపంలో జవాబు ఇచ్చింది లోకానికి.

అమ్మ సశరీరయై ఉన్నపుడు, అమ్మను పూజించడమంటే అమ్మ శరీరాన్ని పూజించడమే. అమ్మ పాదాలను పూజిస్తే -- అమ్మను పూజించినట్లే. అమ్మ మెడలో దండవేస్తే - అమ్మకు దండ వేసినట్లే. అమ్మ చేతికి పండు ఇస్తే - అమ్మకు పండు ఇచ్చినట్లే. కనిపించే దేహమే కనిపించని శక్తికి ప్రతినిధి. అమ్మ శక్తి స్వరూపిణీ, ప్రజ్ఞాపారమితా, అయినప్పటికీ అమ్మ శరీరాన్నే మనం అమ్మగా దర్శించాం, అమ్మగా పూజించాం, అమ్మగా సేవించాం.

అనేక పర్యాయాలు అమ్మ అన్నపూర్ణాలయాన్ని తన గుండెగా, అభివర్ణించడం మనకు తెలుసు. అమ్మ కరుణామయ హృదయం నుండి ఉద్భవించిన "అమ్మ సంస్థ" తనకు ప్రతిరూపమేనని అమ్మ ప్రవచించడం మనకు తెలుసు. బిడ్డలమైన మనలను ప్రేమించడానికి, ఆదరించడానికి, అనుగ్రహించడానికి, ఉద్ధరించడానికి, అమ్మ ఈ సంస్థనే తన అవయవాలుగా, ఉపకరణాలుగా ఉపయోగించుకున్న సత్యం మనకు సువిదితమే.

అమ్మ - శరీరాన్ని పరిత్యజించే ముందు - ఈ శరీరాన్ని నేను వదిలేసినా, నా కార్యక్రమము ఆగిపోదు. మీ, నా సంబంధాలు మామూలుగానే ఉంటాయి..... అని సుస్పష్టంగా నిర్ద్వంద్వంగా ప్రకటించింది అమ్మ.

ఈ సంస్థ ద్వారానే అమ్మ తన సమస్త కార్యక్రమాన్ని నిర్వహిస్తూ, తన దివ్య ప్రణాళికను కొనసాగిస్తూ, తన ఆశలకూ, ఆశయాలకూ, రూపకల్పన జరుపుతున్న విషయం మనకు ప్రత్యక్షానుభవమే.

శరీరమున్నప్పుడు, తన శరీరము తనకు ప్రతినిధి అయినట్లే - ప్రస్తుతం "అమ్మ సంస్థే" తనకు ప్రతినిధి. అమ్మను పూజించడానికి అమ్మ శరీరం మనకు ఆధారమయినట్లే ప్రస్తుతము అమ్మ సంస్థే మన పూజకు ప్రతీక

భౌతికంగా అమ్మ మనకు కనుమరుగై, దాదాపు ఒక సంవత్సరం కన్నీటి యేటిలో నేను కొట్టుకుపోయిన తరువాత - పై భావన గట్టులాగ నాకు దొరికింది. కొంత ఉపశమనం కలిగింది. ఆలోచించగా, ఆలోచించగా ఈ సంస్థే సర్వాంగ సుందరమైన అమ్మగా, సద్భావభరణ భూషితమైన అమ్మగా కరుణామయిగా, భగవతిగా, నాకు సాక్షాత్కరించింది. నా కన్నీళ్ళు ఆవిరైపోయాయి. నాకు కొత్త ఊపిరి వచ్చినట్లయింది. కంటికి కొత్తచూపు వచ్చింది. ఏటికి కొత్తనీరు వచ్చింది.

"సంస్థ"ను పూజించటమంటే ? సంస్థను సేవించటమే.

సేవించడమంటే ?

సంస్థ నిర్వహణకు, అభివృద్ధికి దోహదం చేసే కార్యక్రమాలను చేపట్టడమే. అంతే.

ఈ ఆలోచనతో నాలో అమృతం కురిసింది. సంజీవని స్పర్శ తగిలింది. దిగంబరియై, దీన వదనయై నిలబడ్డ నాలోపలిచెట్టు పచ్చచీరకట్టి ఫక్కుమంది. పడిపోయిన పిల్లవాడు లేచి పరిగెత్తినట్లు, ఎండిపోయిన ఏటికి పోటిచ్చింది. ఆకాశవల్లరి మబ్బుల చిగుళ్ళు తొడిగింది. నా మనస్సు వేణువై కొత్తపాటలు పాడింది. నాకు కొత్త పిలుపు వినిపించింది. బ్రతుకు బాట కొత్త మలుపు తిరిగింది

అమ్మను కొలవడమంటే అందుబాటులో వుంటే పాదాలను పూజించడం లాగానే, ఆ రోజుల్లో మాతృశ్రీ విద్యాపరిషత్ నాకు అందుబాటులోకి వచ్చింది. దృష్టినంతా ఆపాదాలపై కేంద్రీ కరించాను. ఆ పాదాలకు పారాణి పెట్టాను. ఆ పాదాలను సుగంధ భరితాలైన వివిధ జాతి పుష్పాలతో అలంకరించుకున్నాను. అర్చించుకున్నాను.

ఆ పూజలో మనస్సు కరిగింది.

ఆ సేవలో హృదయం పరవశించింది.

పూజ సేవగా పరిణమించి, పరిమళించి --- నా సమస్త శక్తులనూ, త్రికరణాలనూ, సర్వేంద్రియాలనూ వశపరుచుకుంది.

జీవితంలో మరో మెట్టు అధిరోహించిన అద్భుతానుభూతి నాకు కలిగింది.

అనుభూతికి హద్దు లేదు. మనస్సుకు తృప్తి లేదు. ఆలోచన ననలు వేయడం సహజం.

జగన్మాతను నిర్వచిస్తూ --- అమ్మ చెప్పిన కొత్త మాట సాధకులకు గమనార్హం.

జగన్మాత అంటే, జగత్తుకు మాత కాదట, జగత్తు ఐన మాతట ! ఓహ్ ! ఏమి నిర్వచనం ! ఏమి దర్శనం !

"మీదంతా నేనే, మీరంతా నేనే, ఇదంతా నేనే" -- అన్న అపూర్వమైన ప్రకటన అమ్మ అనంతత్వానికి మణిదర్పణం.

"నేనే నేనైన నేను" అంటే అన్ని నేనులు నేనే అని మధురంగా పలికిన అమ్మ మాటలు లోకానికి మహా మంత్రం.

పై వాక్యాల ద్వారా అమ్మ -- తన విశ్వ విరాట్ స్వరూపాన్ని మనకు సాక్షాత్కరింప చేసింది. కనిపించే జగత్తు కనిపించని అమ్మ వేరుకాదు -- అని అమ్మ మనకు స్పష్టపరిచింది.

అందుకే ఇప్పుడు సృష్టిలోని ప్రతి వస్తువునూ, ప్రతి వ్యక్తినీ, అమ్మగా దర్శించాలని అభిలాష. ఆరాటం, తపన, తపస్సు. వ్యక్తావ్యక్తమైన జగత్తునంతనూ అమ్మగా అవగాహన చేసుకోవాలని నిరంతర అధ్యయనం.

అదే నేటి నా సాధన. నా గమనంలో ప్రతికదలిక అమ్మకు నేచేసే ప్రదక్షిణగా, నా ప్రతిశ్వాస అమ్మ మెడలో పూదండగా, భావిస్తున్నాను.

'రెండుగా కనిపిస్తున్నది; ఒకటిగా అనిపిస్తున్నది' - అన్న అమ్మ పలుకుల వెలుగులో...

"ఎంత వెదికినా 'అది' కానిది నాకు కనిపించడం లేదు" అని తత్త్వగిరి శిఖరాగ్రం నుండి ఎలుగెత్తి చాటిన అమ్మ 'పూర్ణదర్శనం' గమ్యంగా. పరమ లక్ష్యంగా.

"చీమలో, దోమలో కాదు -- చీమగా, దోమగా పరబ్రహ్మను చూడ్డా"లనే కొత్త పాఠం చెప్పిన అమ్మను విశ్వంలో ప్రత్యణువునా చూడాలనే భావనమే సాధవగా ముందుకు నడుస్తున్నాను.

నిన్న - అయిదడుగుల అమ్మ శరీరం నాకు ఆరాధ్యం.

నేడు - అమ్మ ఆశయాలకు నెలవు అయిన సంస్థ ఆరాధ్యం.

రేపు - సృష్టికీ అమ్మకూ అభేదదర్శనం నా లక్ష్యం. ఈ సాధన సోపాన త్రయాన్ని నిర్విఘ్నంగా జయప్రదంగా అధిరోహిస్తే -- లక్ష్యం చేరినట్లే !

అమ్మ భక్తులకూ, అమ్మ శిష్యులకూ, అమ్మ అనుచరులకూ, అమ్మ బిడ్డలకూ నాదొక మనవి... అమ్మ స్థాపించిన సంస్థ అమ్మకు ప్రతిరూపం, ప్రతీక.

ప్రతీకోపాసన తత్త్వోపాసనే.

అమ్మ సంస్థను సేవిస్తే -
అమ్మను పూజించి నట్లే.
సంస్థను సేవిస్తే -
అమ్మ సంతృప్తి చెందుతుంది.
సంస్థను సేవిస్తే -
అమ్మ అనుగ్రహిస్తుంది.
సంస్థను సేవిస్తే - మనకు
అవసరమయిన వన్నీ ప్రసాదిస్తుంది.
మన యోగక్షేమాల బాధ్యతను
అమ్మే స్వయంగా స్వీకరిస్తుంది.
అమ్మ దుఃఖ నాశిని
అమ్మ దురిత నివారిణి
అమ్మ వాంఛితార్థ ప్రదాయిని
అమ్మ కైవల్య పద దాయిని.

(ఏప్రిల్ 1987)



# 206
# అమ్మ - విశ్వ జనీనత

విశ్వ సంక్షేమ సంధాయక గుణోజ్జ్వలా !

విశ్వ ప్రేమమయీ ! విశ్వ జననీ !

విశ్వ కుటుంబినీ ! విశ్వరూపిణీ !

విశ్వ వందితా ! అమ్మా ! అభివాదములు...... .

ఏకం సత్ విప్రా బహుధా వదన్తి - అని ఋషి వాక్యం !

అమ్మ విషయంలో ఈ ప్రవచనం అక్షరాలా సత్యం.

అమ్మ తనను గురించి తానే ఒక సత్యాన్ని మనకు అందించింది. "రూపం పరిమితం, శక్తి అనంతం" అని. ఈ నాలుగు పదాల్లోనే అమ్మ చరిత్ర అంతా ఇమిడి ఉంది. పరిమిత రూపం అంటే మానవత్వం. అనంత శక్తి అంటే దైవత్వం. ఈ మానవతా మాధవత్వ మధుర సమ్మేళనమే నేడు మనం దర్శిస్తున్న అర్చిస్తున్న అమ్మ.

అందువల్లనే కొందరు అమ్మను అనురాగ మూర్తిగా, వాత్సల్య స్వరూపిణిగా, కరుణారస సాగరగా, త్యాగమయిగా భావించి ప్రేమిస్తున్నారు. ప్రేమించబడుతున్నారు. వాత్సల్యామృత పానం చేస్తున్నారు. కరుణారస సాగరంలో స్నానం చేస్తున్నారు, ఆనందిస్తున్నారు.

కొందరు జ్ఞానిగా, గురువుగా సంభావన చేసి సమాశ్రయిస్తున్నారు. వారు అమ్మ నుండి జ్ఞాన భిక్షను పొందుతున్నారు. ఉపన్యాసాలు ఇవ్వక పోయినప్పటికీ, ఉద్గ్రంథ రచన చేయకపోయినప్పటికీ సంభాషణల్లో అవకాశం వచ్చినప్పుడు అమ్మ అనేక సమాధానాలను అనుగ్రహిస్తున్నది. సందేహాలను నివారిస్తున్నది. పరిష్కారాలను ప్రసాదిస్తున్నది. అవే సూక్తులూ, సూత్రాలూ అయి అనేకుల మేధలకు

పదునుబెట్టి, ఆలోచనలను క్రొత్త పుంతల నడిపి, అనేక విషయాలపై వెలుగును ప్రసారం చేస్తున్నాయి.

శక్తి స్వరూపిణిగా, పరాశక్తిగా, పరమేశ్వరిగా, పరాభట్టారికగా కొందరు అమ్మను విశ్వసించి ఉపాసిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. వారికి అమ్మ ఎన్నో దర్శనాలనూ, నిదర్శనాలనూ ప్రసాదిస్తున్నది. ఎవరే భావంతో ఆరాధిస్తే వారికి అమ్మ ఆ రూపంలో సాక్షాత్కారిస్తున్నది. కామితార్థ ప్రదానం చేస్తున్నది.

20 సంవత్సరాలకు పైగా అమ్మ సన్నిధిలో, అదీ, అహర్నిశం నివసించగలిగే మహా అదృష్టాన్ని అమ్మ నాకు ప్రసాదించింది.

అయితే పాయసపు గిన్నెలో ఉండే గరిటెకు పాయసపు రుచి తెలియాల్సిన పని లేదు. అట్లాగే కమలం చుట్టూ తిరిగే కప్పకు ఆ సుగంధంతోనూ పనిలేదు. ఆ మకరంద పానమూ చేయలేదు.

కానీ, కరుణామయి అమ్మ నాకు చెవులనూ, కళ్ళనూ ప్రసాదించింది. అందుకు అమ్మకు కృతజ్ఞతను ఎట్లా అభివ్యక్తం చేయాలో అర్థం కావడం లేదు. తల్లీ బిడ్డల మధ్య కృతజ్ఞత, ఋణమూ వంటి పదాలకు తావు లేదన్నది అమ్మ.

అమ్మ జీవిత చరిత్ర రచన చేసినపుడు ఆ జీవితాన్ని మహోదధిగా సంభావన చేశాను.

ఆ జీవితంలో ఎన్ని రాగాలు విన్నానో -

ఆ మహోదధిలో ఎన్ని తరంగాలు కన్నానో -

ఆ పలుకుల్లో ఎన్ని రంగులో, ఎన్ని రాగాలో ఎన్ని సొబగులో....

ఆ చేతల్లో ఏమి పాలపొంగులో, ఏమి అనురాగాలో, ఏమి సోయగాలో....

అందువల్లనే అమ్మ సన్నిధిలో ఎన్నాళ్ళున్నా, ఎన్నేళ్ళున్నా, ఏ క్షణానికి ఆ క్షణం నిత్యనూతనంగానే ఉంటుంది. అనుక్షణమూ మనకు క్రొత్త లోకాలు కనిపిస్తూనే ఉంటాయి. క్రొంగొత్త అనుభవాలు, భావాలు ప్రభవిస్తూనే ఉంటాయి.

కనుకనే కాలం గడిచిన కొద్దీ అమ్మ యెడల ఆకర్షణ పెరుగుతుందీ, ఆరాధన పెరుగుతుందీ.

అర్థమవుతున్న కొద్దీ అమ్మ వామనమూర్తివలె పెరిగి పెరిగి భూమ్యాకాశాలు ఆవరిస్తుంది.

ఈ అనుభవం నాకు అమ్మ మాటల్లో, చేతల్లో అమ్మ యొక్క అపరిమిత తత్వం అర్థం అయింది. అది సర్వ పరిధులనూ, అవధులనూ, విభేదాలనూ అధిగమించి విశాల విశ్వాన్ని తనదిగా చేసుకున్న, తనలోకి తీసుకున్న, తానే అయిన విశిష్ట తత్వంగా విరాడ్రూప సందర్శనం ఇచ్చింది.

అమ్మ త్రివేణీ సంగమం. అమ్మ ఆలోచనా, మాటా, క్రియా అన్నీ ఒకటిగానే ఉంటాయి. వాటిలో ఎక్కడా ఎప్పుడూ వైరం కనుపించదు.

ఒకసారి అమ్మ అన్నది "నా భావమే నా మాట" అని. మరొకమారు అన్నది. "నేను ఏం చెప్పినా నా అనుభవంలోంచే చెబుతాను" అని

కనుక మనం అమ్మ జీవితం నుంచి ఒక సంఘటనను తీసుకున్నా, ఒక ప్రవచనాన్ని తీసుకున్నా ఏమీ భేదం లేదు.

చెరకు గడను ఎక్కడ కొరికినా తియ్యగానే ఉన్నట్లు, పాలకుండలో నుండి ఏ ఒక చెంచా పాలు తాగినా ఒకే రుచి ఉన్నట్లు, సముద్రంలో ఏ రేవులో స్నానం చేసినా ఒకే ఫలితం అయినట్లు అమ్మ పలుకులు, చేతలు, ఏది, ఎప్పుడు, ఎక్కడ మనకు అందినా అది అమ్మ తత్వాన్నే మనకు అందిస్తుంది.

అమ్మ అతి బాల్యంలోనే "నేను అమ్మనై ఉంటాగా" అన్నది. "అమ్మ పేరు ఆధారం అంటే భూమి" అని వివరించింది అమ్మ.

ఈ మూడు మాటల్లోనే అమ్మ 'అపారతత్వం' మనకు అర్థమవుతున్నది.

అమ్మకు నాలుగో సంవత్సరంలోనే "నీవెవరమ్మాయివి ?" - అని ఒకరు అడిగారు. "ఎప్పుడు ఎవరి దగ్గర ఉంటే వారి అమ్మాయిని" అని చెప్పిన జవాబులో అమ్మ సర్వసంబందాలకూ అతీతయై అత్యున్నతంగా ఎదిగిపోయింది. ఆ సమాధానం ఆనాడు వారినేకాక నేటికీ మనలందరినీ సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తుతుంది.

- మరి, ఈ నాటికీ అమ్మ ఎవరికని ? నీకా ? నాకా ?

చిన్నతనంనుండి అమ్మకు కులభేదం, గుణభేదం లేదు.

అమ్మ అయిదవ సంవత్సరంలో తెనాలిలో ఉన్నది. ఆనాడు అమ్మకు జ్వరంగా కూడా ఉన్నది. తాతగారి వాకిట్లో ఇతర బంధువులతోపాటు కూర్చున్నది. అపుడు ఒక పాకీబండి ఆ దారిన పోతున్నది. ఆ బండి వెనక పాకీది నడుస్తున్నది. ఆ వెనక ఆమె పిల్లవాడు పరుగెత్తుతూ పడ్డాడు. అంతలో ఒక గేదె అటు

పరుగెత్తుతూ వస్తున్నది. అమ్మ ఆ దృశ్యం చూచింది. చివాలున లేచి పరిగెత్తుకు వెళ్ళి - ఆ పిల్లవాడిని ఎత్తుకుని ఇవతలకు తీసుకుని వచ్చి ప్రమాదం నుండి కాపాడింది.

తన పిల్లవాడిని బ్రాహ్మణులు ఎత్తుకున్నందుకు ఆ పాకీది బ్రహ్మానంద భరితురాలవుతుంటే అమ్మ అమ్మమ్మ గారైన జానకమ్మగారు "ఆఁ. ఎత్తుకుని మా బ్రాహ్మణత్వం మట్టి గలిపింది" అని వెటకారం చేసింది.

అప్పుడు అమ్మ వెంటనే అన్నది "ఔను - మీ బ్రాహ్మణత్వం మట్టి కలిపింది కనుకనే మీరు ఎత్తుకోలేదు" అని.

ఆ సమయంలో అక్కడనే ఉన్న వారి నౌకరు అంకాలు అమ్మ ఒకనాడు ఇడ్లీతింటూ తనకు నోట్లో పెట్టిన సంఘటనను వివరిస్తూ "అమ్మాయి గోరికి కులం పట్టింపు లేదండి" అన్నాడు. అపుడు అమ్మ అన్నది "కులభేదం లేదు కనుక నీకు ఇడ్లీ పెట్టానంటున్నావు. గుణభేదమే ఉంటే వీళ్ళ ఇంట్లో ఉండేదాన్ని కాదు" అంది.

"శుక్ల శోణితాల కేది కులమో అదే నాకులం" అన్నది అమ్మ. "గుణభేదమే లేని నాకు కులభేదమేమిటీ ?" అని మరొకమారు ప్రశ్నించింది.

"గుణ భేదమే నాకుంటే మీలో ఒక్కరూ ఏడవమైలు దాటి రాలేరు" అన్నది ఇంకొకసారి.

ఇప్పటికీ మనందరం ఇంత చొరవగా, ఇంత చనువుగా అమ్మ వొడి జేరుతున్నా మంటే అమ్మలోని ఈ ఔదార్యమే.

ఒకరు మీరు "హిందూ సంప్రదాయాన్ని పాటిస్తారా?" అని అడిగితే "ఒకటంటూ నేను ఏదీ పాటించను నాన్నా" అని చెప్పింది అమ్మ. "సర్వసమ్మతమే నా మతం" అన్నది. మరొకసారి "క్రైస్తవ మతం నా మతం కాకపోతే గదా" - అన్నది. "చర్చలంటే ఇష్టంలేదు. కానీ చర్చి అంటే ఇష్టమే" నన్నది ఒకసారి. ఈవాక్యం అమ్మ పదప్రీతిని తెలియజేయడమే కాదు, అమ్మ హృదయానికి ప్రతిబింబం కూడ. అమ్మ పర్యటనల్లో చర్చిలకు వెళ్ళింది. నేడు క్రైస్తవు లెందరో అమ్మను ఆరాధిస్తున్నారు. అమ్మ సన్నిధిలో క్రైస్తవులున్నారు.

అమ్మ చిన్నతనంలో చిదంబరరావు తాతగారింటిలో పనిచేసే నల్లి అమ్మలో 'మరియా'ను చూసింది. 1962లో అమ్మ బాపట్లలో కుష్టు ఆసుపత్రికి వెళ్ళినపుడు

అక్కడి కుష్టువారికి పరిచర్యలు చేస్తుండగా "అమ్మా - నీవు క్రీస్తువా ? క్రీస్తును కన్నమేరీవా ?" అని ఒక క్రైస్తవ స్త్రీ అడిగింది.

అమ్మ సన్నిధిలో ప్రతి సంవత్సరం 'క్రిస్మస్' పండుగ జరుగుతుంది. జనవరి ఫస్టున మంచి ఉత్సవం జరుగుతుంది. ఒకరు "మనకు ఈ జనవరి పండుగ ఏమిటమ్మా ?" అని అడిగారు.

అపుడు అమ్మ,

"ఎందుకీ పండగ అంటారేమిటి ? నిద్ర లేచిన దగ్గర నుండీ మనం తారీఖులు చూసుకోవడం లేదూ ? తిధులు చూస్తున్నామా ? నిమిషాలు, గంటలు వాడుకుంటున్నాం కానీ, ఘడియలు, విఘడియలు వాడుకుంటున్నామా ?" అని మందలించింది.

అమ్మ జీవిత చరిత్రలో ముస్లిములకూ ఎంతో ప్రాధాన్యం ఉంది. అమ్మ చిన్నతనంలోనే మస్తానూ రహీ, మౌలాలీ అన్న ముస్లిములు అమ్మ వాత్సల్యాన్ని అనుభవించిన అదృష్టవంతులు.

అమ్మ పర్యటనలో మసీదులను కూడా దర్శించింది. గుడివాడలో ఒక ముస్లిం అమ్మకు సలాం చేయగా అక్కడి కార్యకర్తలు అమ్మకు - ఇతను ముసల్మాను అని పరిచయం చేశారు. అమ్మ వెంటనే నేనూ "ముసలమ్మనేలే" అని నవ్వుతూ అతడిపై వాత్సల్యామృతం కురిపించింది.

ఒకసారి ఒక సోదరుడు ముస్లిములను పరిహాసంచేస్తూ "వాళ్లు మక్కా నుండి ఒక రాయి తీసుకువచ్చి ఈ దేశంలో మసీదు కట్టుకుని, దానికి మక్కా మసీదు అని పేరు పెట్టుకుంటారు" అన్నాడు అమ్మ వెంటనే అతన్ని వారిస్తూ "వాళ్ళ నుండి నీవు నేర్చుకోవలసింది ఉన్నది. మక్కా నుండి తెచ్చిన రాయికి కూడా వాళ్లు అంత విలువను ఇస్తున్నారు" అన్నది.

ఎందరో ముస్లిములు అమ్మ దర్శనం చేసుకుంటారు. అమ్మ స్వర్ణోత్సవాల్లో ఎందరో ముస్లింలు సంతోషంగా ఆ ఉత్సవాల్లో పాల్గొని భోజనం చేయడమేగాక వడ్డనలో కూడా పాల్గొని ఆనందించారు.

అమ్మ ఒక సందర్భంలో అన్నది "ఆచరించే వాడికి - బైబిలు, ఖురాను, గీత ఏదయినా ఒకటే" నని.

అమ్మ తాను ప్రత్యేకంగా ఏ మత సంప్రదాయమూ పాటించకపోయినప్పటికి అన్ని మతాలనూ అంగీకరిస్తుంది. అన్ని సాధనా మార్గాలనూ సమ్మతిస్తుంది. ఎవరికేది ఇష్టమో దానినే అనుసరించవచ్చునూ అంటుంది ఒకటి మంచీ, మరొకటి చెడూ అనరు. ఎవరికే మతములో విశ్వాసముంటే ఆ మతమే మంచిది అంటుంది. 'విశ్వాసమే దైవం' అన్న అమ్మ వాక్యం అన్ని మతాలకూ, అన్ని కులాలకూ వర్తిస్తుంది.

ఏ మతాన్నీ విశ్వసించని నాస్తికులను కూడా అమ్మ అంగీకరిస్తుంది. "వాడూ నా బిడ్డేగా" అంటుంది. దేవుణ్ణి అంగీకరించనివాడినేకాదు. దూషించేవాడినీ అమ్మ ప్రేమిస్తుంది. "దూషణ కూడా ఒక విధమైన అరాధనయే" నంటుంది అమ్మ.

అమ్మ తనను విమర్శించే వారినీ, ద్వేషించే వారినీ, హింసించే వారిని కూడా ప్రేమించడం విశేషం.

అమ్మకు తొమ్మిదిన సంవత్సరంలో ఒకనాడు ప్రఖ్యాత పండితులు, పరివ్రాజకాచార్యులు అయిన శ్రీ వాసుదాసస్వామివారి దర్శనం చేసుకుంది అప్పటికే అమ్మ "తల్లిని కోల్పోయిన బిడ్డ" అయినందువల్ల వారు అమ్మపై సానుభూతిని కనబరుస్తూ "అందరూ నిన్ను ప్రేమించేటట్లు ఆశీర్వదించేదా ?" అవి అడిగారు.

అమ్మ అపుడు పలికిన మాటలు ఆణిముత్యాలు. అమ్మ చరిత్రకే అలంకారాలు. మానవ జాతికే మేలు బంతి, వెలుగు బాట.

"స్వామీ - నన్ను అందరూ ప్రేమించేటట్లు ఎందుకూ ? నేను అందరినీ ప్రేమించేటట్లు వరం ఇవ్వండి. నన్ను ప్రేమించినా, ప్రేమించకున్నా నన్ను దూషించినా, ద్వేషించినా, నన్ను ఎట్లా హింసించినా, అందరినీ నేను సమానంగా ప్రేమించేటట్లు నన్ను ఆశీర్వదించండి" అని వేడుకుంటూ 'మరి నేను ప్రేమిస్తేనేగదా, ప్రేమ నాకు తెలిపేది" అన్నది అమ్మ..

అమ్మ అప్పుడు స్వామివారిని అలా ప్రార్థించింది కానీ అమ్మకు ఆ తత్వం ఉగ్గుతో పెట్టిన విద్యా వెన్నతో బెట్టిన విద్యా కాదు. ఆజన్మ సిద్ధమే.

అసలు, అమ్మ జీవితమంతా వస్త్ర కాగితం పట్టినా. కంచుకాగడాలువేసి వెతికినా, ఈ కోరికకు భిన్నమయిన సంఘటన మచ్చుకయినా కనిపించదు.

అమ్మ తన నివాసానికి "అందరిల్లు" అని నామకరణం చేయడంలో కూడా అమ్మ విశ్వ భావన అభివ్యక్తం అవుతుంది.

ఈనాడు అందరింటిలో పలు మతాలవాళ్లు, పలుకులాలవాళ్లు, పలు భాషల వాళ్లు పలు దేశాలవాళ్లు అతి సహజంగా ఉంటూ సహజీవనం చేస్తున్నారు.

అందరింటిలో అందరూ కలిసి నివసిస్తూ కలిసి భోజనం చేయడం చూసిన ఒక స్వాములవారు అమ్మ వర్ణసంకరం చేస్తున్నదని బాధపడుతూ లలితా సహస్రనామాల్లోని "వర్ణాశ్రమ విధాయిని" అన్న నామం జ్ఞాపకం చేశారు. అమ్మ వెంటనే "ఏకాకినీ, భీమరూపా, నిర్ద్వైయితా, ద్వైతవర్జితా...." అన్న నామాలను స్మరించింది.

అందరింటిలో భాగమయిన అన్నపూర్ణాలయంలో అన్నం ఎవరికి పెట్టాలీ - అన్న విచికిత్స జరిగినప్పుడు అమ్మ - అన్నపూర్ణాలయంలో భోజనానికి ఆకలే అర్హత. వాడి డ్రస్సును బట్టీ, అడ్రసునుబట్టీ కాదు, అన్నం పెట్టాల్సింది" అని వివరించింది.

అమ్మ అందరింటిని గురించి వివరిస్తూ "ఈ గేట్లు ఎప్పుడూ తెరిచే ఉంటాయి, రావడానికీ పోవడానికీ, విశ్వకుటుంబం కనుక రకరకాల ప్రవృత్తులుంటాయి' అన్నది.

మరో సందర్భంలో "నా సంసారానికి మొదలూ చివరా లేదు. నాది విశ్వ సంసారం" అని ప్రకటించింది.

ఒక అక్కయ్య. అమ్మతో తన బిడ్డల విషయం చెబుతూ వాళ్ళమనస్తత్వాల్లోని విభిన్నత్వాన్ని గురించి బాధపడుతుంటే అమ్మ అన్నది "నీవు ఇంత మాత్రానికే బాధపడితే ఎలా ? నా బిడ్డలు చూడూ - వాళ్ళల్లో ఎంత వైవిధ్యమో ఎంత వైరుధ్యమో !" అని.

అమ్మ ప్రేమ కేవలం మానవజాతి వరకే పరిమితమై లేదు. అది పశుపక్ష్యాదులనూ క్రిమికీటకాదులనూ కూడా పరివేష్టించింది.

చిన్నతనం నుండీ అమ్మ తనకు పెట్టిన అన్నాన్ని పందులకూ, కుక్కలకూ, పిల్లులకూ పెట్టి ఆనందించేది.

ఈ అపరిమిత మయిన, విశ్వ వ్యాప్తమయిన అనురాగమూ, అనుకంపనయే అమ్మను అత్యున్నత సింహాసనంపై అధిష్టింపజేసింది.

అసలు - ఈ ప్రేమను గురించీ మనిషికీ మనిషికీ మధ్యగల ఈ అనుబంధాన్ని గురించీ ఆలోచిస్తే.... తల్లీ బిడ్డల మధ్యగల "మమతాను బంధం" అంత బలవత్తరవ ఎయిందీ, సన్నిహితమయిందీ, మధురమయిందీ, మహత్తరమయిందీ మరొకటి కనిపించదు

అందుకే అమ్మ "నేను అమ్మను, మీరు బిడ్డలు" అంది. ఈ భావాన్ని అమ్మ ఎన్ని రీతుల్లో ఎన్ని సందర్భాల్లో ప్రకటించిందో.

అమ్మ సర్వ సృష్టినీ తన బిడ్డగానే కంటున్నది, ప్రేమిస్తున్నది. ఈ ప్రేమకు హద్దులు లేవు. షరతులు లేవు. కారణాలులేవు. ప్రతిఫలాపేక్ష లేదు.

దీనికే అమ్మ సర్వత్రానురాగం అని నామకరణం చేసింది.

అమ్మకు ఎవరినీ చూసినా తన బిడ్డయే అనిపిస్తుంది.

ఒకసారి అచ్యుతుని రామకృష్ణశర్మగారు అమ్మను "నీ వెవరివి ?" అని అడిగారు.

"అమ్మ"ను అన్నది.

'ఎవరికి ?'

"నీకూ, మీకూ, అందరికీ... పశుపక్ష్యాదులకూ, క్రిమికీటకాదులకూ..." అని అమ్మ సమాధానం.

అమ్మ అందరినీ వాళ్ళ యోగ్యతా యోగ్యతలూ అర్హతానర్హతలూ గమనించ కుండా ప్రేమించినట్లేగానే పశువులనూ పక్షులనూ అన్నిటినీ ప్రేమిస్తున్నది. బిడ్డలు గానే భావిస్తున్నది.

ఒకనాడు ఒక ఆబ్దిక సమయంలో ఒక పిల్లి అన్నం ముట్టుకోగా ఆమె బాధపడుతున్నది. అపుడు అమ్మ అన్నది 'పిల్లి కాదమ్మా, పిల్లముట్టుకున్నది' అని.

పర్యటనలో అమ్మ పాలకొల్లు వెళ్ళింది. అక్కడ కార్యకర్త అయిన శ్రీ గోపి అమ్మతో అన్నాడు. "పాపాల కొల్లు వచ్చావమ్మా -" అని. అమ్మ అన్నది "పాపాల కొల్లుకాదు, నాన్నా - పాపలకొల్లు" అని. వారు ఆమాటకు దిగ్భ్రమచెందారు. మూర్ఛ పోయినంత పని అయింది. అమ్మలో ఆ మధుర భావన నిత్యజాగరితమయ్యే ఉంటుంది. ఆ భావానికి ఏమరుపాటు లేదు

అమ్మ దృష్టిలో నాస్తికుడూ బిడ్డే, నాగుబామూ బిడ్డే, నక్సలైటూ బిడ్డే.

అమ్మకు వాగూ బిడ్డే, వరదా బిడ్డే. తాపసీ బిడ్డే తామసీ బిడ్డే.

చివరకు తనకు లేచిన 'గడ్డ కూడా బిడ్డే' ఔను నిజమే. మనకంటే అదే నిజమైన బిడ్డ. అది అక్షరాలా అమ్మ తనువు నుండి రక్తమాంసాలను పంచుకుని పుట్టింది.

పరిమితమయిన మమకారం మానవత్వాన్నీ సూచిస్తే, సర్వత్రానిండిన మమకారం మాధవత్వమే అవుతుంది.

తన పిల్లల వరకే ఉంటే పామరత్వం !

అందరియందూ ఉంటే భగవంతుడు !

మన బిడ్డయందు ఏమి చూస్తున్నాయో అందరి యందూ దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం కదా !

కనుకనే అమ్మ సర్వ జగతికి నేడు ఆరాధ్యమయింది.

ఈ మాతా శిశుబంధానికి అతీతమై మరో అత్యున్నతమయిన స్థితి అమ్మను పరంజ్యోతిగా ప్రకాశింప జేస్తున్నది.

అది విశ్వతాదాత్మ్య స్థితి !

"మీరు నాబిడ్డలే కాదు, నా అవయవాలు కూడా" నన్నది.

చెయ్యి నొప్పి కాలికి తెలియదు. కాలి నొప్పి కంటికి తెలియదు. అందరినొప్పీ నాకు తెలుస్తుంది' అన్నది.

"మీరంతా నేననుకోవడమే" నా ప్రార్థన అన్నది.

"మీరు సాక్షాత్తూ రాజరాజేశ్వరి అమ్మా' - అంటే "మీరు కానిది నేనేమీ కాను నాయనా" అన్నది.

"మీరు తింటే నేను తిన్నట్లే" అన్నది. మనకు అన్నం పెడుతూ అమ్మ తాను త్రేన్చడం మనందరికీ అనుభవమే.

"అడేది మీరు - చెమటలు నాకు" అన్నది మరొక సందర్భంలో

"బాధ ఎవరిదయినా అనుభవం నాదే" అన్నది మరొకరితో.

ఒక సోదరుడు "మమ్మల్ని అంటున్నట్లా ? మిమ్మల్ని అనుకుంటున్నట్లా ?" "అంటే మీరు నేను కాకపోతే గదా ?" అని ప్రశ్నించింది అమ్మ.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారితో "మీలో నన్ను చూసుకోనప్పుడు గదా చిక్కు, అన్నది. "అంతా నేనే అనుకుంటున్నప్పుడు ప్రత్యేకించి భక్తులెవరు?" అన్నది.

"మాలో ఒకరిపై మాట్లాడుతావేమిటమ్మా ?" అంటే "మీరు కాకుండా నేను లేను" అన్నది.

"మావన్నీ నీ కెట్లా తెలుస్తాయమ్మా ?" అన్న వారికి "నా ప్రవర్తన నాకు తెలీదు ?" అన్నది.

"మేము మాట్లాడుతున్నది నీ కెట్లా వినిపించిందీ ?" అని అడిగిన వారికి "మీరు మాట్లాడుకునేది మీకు వినపడ్డం లేదూ ? అట్లాగే అన్నీ వినపడుతాయి. అన్నీ కనపడుతాయి" అన్నది అమ్మ సమాధానం.

ఒక విషయంలో "మేము ముగ్గురమూ కలిసే వచ్చాము కదమ్మా ! నీ కెప్పుడు చెప్పారు ? ఎవరు చెప్పారు ?" అంటే మీ ముగ్గురితోపాటు నాలుగో దాన్ని నేను లేనూ ? అన్నది అమ్మ.

"మీ దృష్టిలో మనుషులూ, ఇతర జంతువులూ ఒకటేనా ?" అని అడిగిన వారితో "అది ఇతరం అనిపించడం లేదు. అన్నీ నేనే అనిపిస్తున్నది' అన్నది అమ్మ.

ఒక సందర్భంలో అమ్మ అన్నది. "మీరే నయం మీకు ఇంట్లో వాళ్ళనీ, ఇతరులనీ తెలుస్తున్నది నాకు అదీ తెలీడం లేదు" అని.

అమ్మ తనను గురించి తానే వివరిస్తూ "నేను నేనైన నేను" అంటే అన్ని నేనులు నేనైన నేను అన్నది.

అన్నీ తానే అనే మనస్తత్వమే భగవంతుడు !

భిన్నత్వం లేని మనస్తత్వమే దైవత్వం.

విశ్వజనీనత్వమూ, విశ్వజననీత్వమూ, విశ్వతాదాత్మ్య స్థితీ కలిసి అమ్మ త్రిపురసుందరియై విశ్వమంతకూ ఆదర్శమై, అనురాగపాత్రమై ఆరాధ్యమయింది.

ఇంతవరకూ చరిత్రలో విశ్వజనీనమయిన హృదయం కలవాళ్ళుండవచ్చును.

మరి పూర్వ ఋషులు "సర్వేజనా ! సుఖినో భవంతు" అనీ, "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అనీ ఆకాంక్షించారు కదా !

విశ్వతాదాత్మ్య స్థితి పొందినవాళ్ళూ ఉండవచ్చునూ.

"అహం బ్రహ్మాస్మి" అన్న భావన చేసి సిద్ధి పొందిన మహాత్ములూ ఉన్నారు కదా !

కానీ సృష్టి నంతనూ తన కన్నబిడ్డగా ప్రేమించిన సర్వ మాతృత్వం మనకెక్కడా చరిత్రలో కనుపించదు.

'నేను అమ్మను అనడంలో భగవత్తత్వం అందరికీ అతిసన్నిహితమై పోయింది. అందులో అమ్మ "మీరు బురద పూసుకున్నా మరెట్లా ఉన్నా బాగు చేయవలసిన బాధ్యత" ఉన్నది. "తల్లి అంటే తరింపజేసేది" అన్నది.

"నిన్ను కడతేర్చవలసింది అమ్మ ఆ బాధ్యత నీది కాదు" హామీ నిచ్చింది.

"చేస్తున్నా పాట్లాడేది కుమారుడు పాట్లాడుతన్నా చేసేది తల్లి"

"పెట్టినా విమర్శించేవాడు బిడ్డ. విమర్శించినా పెట్టేది తల్లి"

"బిడ్డ తల్లిని నిరాకరించినా, తల్లి బిడ్డను నిరాకరించదు"

"బిడ్డ తల్లికి ఎప్పుడూ సరెండర్ కాలేదు. తల్లే బిడ్డకు సరెండర్ అవుతుంది. అదే తల్లికి ఇష్టం. అదే తల్లితత్త్వం"

అని అనేకరీతుల్లో తల్లీ - బిడ్డల బాంధవ్యాన్నీ అమ్మ వివరించింది.

అమ్మ ప్రవచిస్తున్నది - మార్జాల కిశోరన్యాయం. అందువల్లనే అమ్మను అనేకులు ఆశ్రయిస్తున్నారు.

అమ్మ మాత్రం "నా ఒడి విడిచి ఎవరూలేదు. అందరూ నా ఒడిలోనే ఉన్నారు" అని చెబుతూ -

"అందరికీ సుగతే" నని నిర్నిబంధంగా ప్రకటిస్తున్న పరమోదార అయిన అమ్మ ఈ మహీతలంపై మసలేకాలంలో మనగలుగుతున్న మనందరమూ ఎంతో అదృష్టవంతులమని నా విశ్వాసం.

మనకీ అదృష్టాన్ని అనుగ్రహించిన అమ్మకు మరోసారి మనసార ప్రణతులర్పిస్తున్నాను.

(మే 1987)



# 207
# ప్రశ్న ఒకరిదీ; జవాబు మరొకరికీ

జనవరి 5వ తేదీ సాయంకాలం. గుంటూరు నుండి రెండు కార్లలో దిగి జనం బిలబిలా పైకి వచ్చారు. వారందరిదీ విజయనగరమట. రోటరీ క్లబ్బుకు చెందినవాళ్ళు. గుంటూరులో ఒక మీటింగుకు హాజరై అక్కడి నుండి జిల్లెళ్ళమూడి వచ్చారు.

వారందరూ అమ్మకు నమస్కరించుకుని ప్రసాదాలు తీసుకున్నారు. వారందరూ భోజనం చేసి రావడం వలన అందరికీ అమ్మ కాఫీ ఇప్పించింది. అందులో ఒకరు "మానవ ధర్మ మేమిటమ్మా ?" అని అడిగారు. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ఉత్సుకత చూపనట్లు కనుపిస్తూ - వారి నోటికి అమ్మ అరటి పండ్లు అందిస్తూ "జరిగేదంతా మానవ ధర్మమే" నన్నది. అది వారికేమీ అర్థమూ కాలేదు; తృప్తినీ ఇవ్వలేదు.

కొద్ది క్షణాలు గడిచాయి.

"రోటరీక్లబ్బు తరఫున మీరేమి చేస్తారు ?" అని అమ్మ అడిగింది.

"సమాజసేవ" అన్నారు ఒకరు.

"మా కేదయినా సెలవివ్వమ్మా...... ఏం చేయ మంటారు ?" అని మరొకరు అడిగారు.

"చేయవలసింది చాలా ఉంది నాన్నా. అనాథలై అనేకులు ఉన్నారు. వికలాంగులయిన వాళ్ళు, ఆధారమేమీ లేనివాళ్ళు లోకంలో ఎందరో ఉన్నారు. వారందరినీ ప్రేమగా చూడండి. వారందరిపై ఆదరణను చూపండి. లోకంలో ఎవరూ తాము అనాథులమనీ, ఆధారం లేని వాళ్ళమనీ, తాము భూమికి భారమయిన వాళ్ళమనీ నిరాశపడకూడదు. అందరూ ఒకరి కొకరు తోడుగా బ్రతుకును పండగ్గా చేసుకోవాలి..." అమ్మ మానవ ధర్మాన్ని ప్రవచించడం మొదలు పెట్టింది.

అంతా ఆసక్తిగా వింటున్నారు.

"తమ బతుకును తాము బతకలేని అనేక విధాల బలహీనులు ఉన్నారు. తమ కాళ్ళ మీద నిలబడలేని వారికేగదా - కర్ర ఆసరా ! వారికి తోడు పడండి ! అయితే అది వారిపై జాలితో చేసే సహాయమని అనుకోక వారిని భగవత్స్వరూపులుగా భావించి వారికి సేవ చేయండి. కనుపించని దేవునిపై మనసు నిలపడం లేదనీ, ఏకాగ్రత కుదరడం లేదనీ బాధపడక - కనిపించే ఈ దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి. ఆ సేవలో కలిగే తృప్తే ముక్తి" అమ్మ మాట్లాడుతుంటే కారుణ్యం వర్షిస్తున్నట్లున్నది.

"కాలంతోపాటు మనమూ మారాలి. పూర్వం మనిషి ఒక రూపమో, నామమో, భావమో ఆధారం చేసుకుని సాధనచేసి తరించేవాడు. ఎప్పుడూ విధానం ఒక్క లాగానే ఉండాల్సిన అవసరం లేదు. అది వ్యక్తిగతమయిన సాధన. అందులో ఎంతో కష్టం ఉంది; స్వార్థం ఉంది. దాన్ని కాదనను. కానీ అంతకంటే సులభమయిన మార్గం ఉంది. అది పదిమందితో కలిసి పనిచేయడం; పదిమంది కోసం పనిచేయడం. మమకారాల్ని చంపుకోవడం కాక పెంచుకోవడం. పరిమిత మయిన ప్రేమను విస్తృతం చేసుకోవడం. నేటి మానవ ధర్మం ఇదే ననుకుంటున్నాను. ఇదే మానవుడు మాధవుడుగా మారడానికి మంచి దారి...."

గంభీర స్వరంతో చెబుతున్న అమ్మ మాటలు వింటుంటే - అందరి హృదయాల్లో స్పందన, ఉత్తేజం, చైతన్యం కలిగాయేమో అందరి ముఖాల్లో, కళ్ళల్లో ఏదో మెరుపు మిలమిల లాడింది.

ఇదంతా వింటున్న కుమారస్వామిగారు "అమ్మా ప్రశ్న ఒకరు వేస్తే, జవాబు మరొకరికి చెప్పావే మమ్మా ?" అని అడిగారు.

"చెప్పింది ఒక్కరికే అయినా అది అందరికీ వినిపించిందిగదా" అన్నది అమ్మ.

(జనవరి 1981)



# 208
# అద్వైత మూర్తి అమ్మ

"నేను మీలో దైవత్వం చూస్తాను. మీరు నాలో మానవత్వం చూస్తారు" అని జిల్లెళ్ళమూడి అమ్మ చెప్పింది.

అమ్మ దృష్టిలో సృష్టి అంతా దైవ స్వరూపమే. ఈ భావాన్ని అమ్మ అనేక ^సందర్భాలల్లో సుస్పష్టం చేసింది.

ఒక సాధకుడు అమ్మను అడిగాడు 'అమ్మా రామకృష్ణ పరమహంస వివేకానందుడికి భగవంతుణ్ణి చూపించారు కదా. మీరు కూడా నాకు చూపించరూ?' అని అప్పుడు అమ్మ వెంటనే అన్నది నాన్నా కనిపించే దంతా అదే 'అయినప్పుడు భగవంతుడు ఇది' అని దేన్ని చూపించనూ ?" అని

అమ్మ దృష్టిలో కనిపించేదీ, కనిపించనిదీ అంతా దైవమే.

చిత్తు అనీ, అచిత్తు అనీ వేరుగా లేవు అంటుంది అమ్మ ప్రజ్ఞానం బ్రహ్మ - అన్న మహావాక్యం ప్రస్తావన వచ్చినప్పుడు జ్ఞానం బ్రహ్మ అయితే అజ్ఞానం మాత్రం బ్రహ్మ ఎందుకు కాదూ ?" అని అమ్మ సిద్ధాంతం చేసింది.

ఆనందో బ్రహ్మ - అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తుంటే - "బాధ కూడా భగవంతుడే" అన్నది అమ్మ. అమ్మ దృష్టిలో కష్టసుఖాలు అన్నవి విభిన్న అనుభవాలు మాత్రమే.

'అన్నం పరబ్రహ్మ' మయితే అశుద్ధం ఎందుకు పరబ్రహ్మ కాదూ ? - అని అమ్మ అడిగినప్పుడు ముందుగా మనకు వింతగా ఉంటుంది కానీ - గోమయం తెచ్చి గొబ్బెమ్మను చేసి దాన్ని అలంకరించి మనం పూజ చేసే విషయం అమ్మ మనకు జ్ఞాపకం చేస్తే "ఎంత నిజం !" అనుకుంటారు

మనం భగవంతుణ్ణి సచ్చిదానంద స్వరూపుడుగా సంభావన చేస్తుంటే - అమ్మ సర్వస్వరూపుడుగా ప్రబోధిస్తున్నది.

త్యాగరాజ కీర్తనలో "చీమలో దోమలో - ఉన్న రాముణ్ణి గానం చేస్తున్నప్పుడు అమ్మ "చీమలో దోమలో కాదు నాన్నా - చీమగా దోమగా ఉన్న రాముడు -' అని సవరిస్తుంటే అమ్మ నిత్య జాగరూకత మనను విస్మితులను చేస్తుంది.

మన దృష్టిలో దేవాలయం భగవంతుడు కాదు. గర్భాలయంలో సుప్రతిష్టితుడైన వాడే భగవంతుడు. కానీ అమ్మ - దేవాలయమే కాదు. దేవాలయం ప్రహరీగోడ కూడా భగవంతుడే అంటుంది.

మన దృష్టిలో - దేముడు మానవ దేహంలో హృదయ పీఠంపై అంగుష్ఠ మాత్రుడై జ్యోతిస్వరూపుడై విరాజిల్లుతుంటాడు. కానీ అమ్మ అంటుందీ "శరీరం కూడా ఆత్మ కాకపోలేదు నాన్నా -" అని అమ్మ ప్రవచించిన ఈ వాక్యం ఎందరో సాంప్రదాయక వేదాంతులను కలవరపరచింది.

అమ్మకు అంతా చైతన్యమే. జడమేమీ లేదు. పదార్థమూ, శక్తీ ఒకటే. ఎందువల్లనంటే పదార్థం శక్తిగా శక్తిపదార్థంగా పరిణామం పొందటం సహజమే కదా !

ఎంత వెతికినా నాకు అది (సత్) కానిది కనిపించడం లేదు" అన్నది అమ్మ అనుభవ పూర్వ వాక్యం.

అమ్మ అవలోకనం ఎంత విశాలమైనది !

ఈ సమగ్ర దృష్టితోనే అమ్మ ఎన్నో కొత్త నిర్వచనాలను లోకానికి అనుగ్రహించింది.

ఆత్మ సాక్షాత్కారం అంటే - సర్వమూ ఆత్మగా అంటే సర్వమూ దైవంగా కనిపించడంట !

జగన్మాత అంటే - జగత్తుకు మాత కాదు. జగత్తే మాత అట !

"నేను నేనైన నేను" అని అమ్మ అపూర్వంగా పలికిన మహాకావ్యం సంకుచిత స్వార్థ భావ, బంధుర లోకంలో తత్త్వకాంతి కిరణ పుంజాలు వెదజల్లే అమూల్య మణిదీపస్తంభం !

"మీరు కానిది నేనేమీ కాను" "మీ రెక్కడో నేనక్కడే" అన్న అమ్మ వాక్యాలు అమ్మకు సర్వ సృష్టితో గల తాదాత్మ్య స్థితిని తెలియజేస్తాయి.

"మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలు కూడా" "మీరు తింటే నేను తిన్నట్లే" అన్న వాక్యాలు అమ్మ విశ్వ విరాట్ స్వరూపానికి దర్పణం పడతాయి.

మీ అందరినీ నేనే , మీమీ తల్లులకు పెంపుడిచ్చాను" అన్న అమ్మ వాక్యం గీతాకారుడిని మనకు జ్ఞాపకం చేస్తుంది.

జ్ఞాన భూమిలో పుట్టి - సర్వ విభేదరహితంగా సర్వ సృష్టికీ ఆశ్రయ మిచ్చిన ప్రేమ వటవృక్షం అమ్మ.

అమ్మ 1923 మార్చి 28వ తేదీ రుధిరోద్గారి చైత్ర శుద్ధ ఏకాదశి నాడు జన్మించి 1985 జూన్ 12వ తేదీన శరీర పరిత్యాగం చేసింది

ఆ క్రితం రోజున అమ్మ చారిత్రాత్మకమైన ఒక ప్రకటన చేసిన విషయం మనందరికీ తెలిసిందే !

శరీరం లేకపోయినా తన కార్యక్రమానికి భంగం లేదట భంగం రాదట !

లోకానికి తన చల్లని వెన్నెలను ప్రసారం చేయడానికి అమ్మ ఎన్నుకున్న నెలవు జిల్లెళ్ళమూడి. అక్కడి నుండే తన జీవిత కాలమంతా ప్రేమశరచ్చంద్రికలను భూమిపైకి ప్రసారం చేసింది

రమణ మహర్షిలాగా, షిర్డీసాయి బాబాలాగా, రాఘవేంద్రుడిలాగా - సమాధి నుండే తాను రక్షణ కార్యక్రమాన్ని కొనసాగిస్తానని వాగ్దానం చేస్తూ - ఇకనుండి జిల్లెళ్ళమూడి మహాక్షేత్రమై విలసిల్లగలదని అమ్మ చెప్పింది.

అడిగిన వాళ్లకు అడిగినదే ఇస్తాను. అడగని వాళ్ళకు అవసరమైనది ఇస్తాను. అని చేసిన అపూర్వ ప్రకటనతో అమ్మ కామధేనువు కంటె, కల్పవృక్షం కంటె మరింత ఎత్తుకు ఎదిగింది.

ఈనాటికీ జిల్లెళ్లమూడిలో అందరికీ అన్ని వేళలా అన్నదానం. ఉచిత విద్యాబోధన, ఉచిత వైద్య సదుపాయం అమలులో ఉన్నాయి. ఆర్థిక స్థితి ఏమైనా - తన బిడ్డ లెవరికీ ప్రాథమిక అవసరాలకు లోటురాకూడదని అమ్మ అభిమతం.

"శుక్ల శోణితాలకు ఏది కులమో - అదే నా కులం'.

"గుణ భేదమేలేని నాకు కుల భేదమేమిటి ? - అని నిర్ద్వంద్వంగా ప్రకటించిన అద్వైతమూర్తి అమ్మ శతధా శకలీకృతమైన జగతికి పరమాదర్శం.

"ఈ సృష్టి అనాది, నాది" అని అమ్మ చేసిన అద్భుత ప్రకటన ఎల్లలు ఎరుగని అమ్మ హృదయ సామ్రాజ్యాన్ని మనకు చూపిస్తుంది.

నా ఊరు; నా రాష్ట్రం; నా దేశం - అన్న వాళ్ళున్నారు కానీ 'నా ప్రపంచం' అన్న వాళ్ళు జగచ్చరిత్రలో ఎందరున్నారు ?

"వాళ్ళను గుడ్డి వాళ్ళుగా, కుంటి వాళ్ళుగా చూడకండి అట్లా చూస్తే - మీలో కలిగే జాలి, దయ మీలో అహంకారాన్ని రెచ్చగొడతాయి. మీ ముందుకు నడిచి వచ్చిన దైవాలుగా వాళ్ళను దర్శించండి. అపారమైన భక్తితో అంటే అపాంతమైన ప్రేమతో వాళ్ళను సేవించండి. వాళ్ళను ఆరాధించండి.

మన బిడ్డలకు ఏమి చూస్తున్నావో - అందరిలో దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందటం - అన్న అమ్మ వాక్యం లోకానికే మహోపదేశం.



## అన్నం !

అన్నం తిని రమ్మన్నది అమ్మ
అర్థ మేమిటి ఓ మనసా ?
అన్నమన్న పరబ్రహ్మ స్వరూపం
బన్న యధార్థం బిది తెలుసా ?

నూరేళ్ళు జీవించగ మనవి
నోరారా దీవించెను జనని
అంతరార్థ మిది అమ్మస్వార్థ మిది
అమ్మతత్త్వ మిది అమృతత్వ మిది !

ప్రసాద మది మన ప్రమాదములను
పారద్రోలగలదో మనసా
ప్రగాఢ నిగూఢ ప్రేమతత్వముల
ప్రచండబల మిదియే తెలుసా ?

అన్నం తిని.......

- నదీరా

# 209
# వర్గరహితమైనదే స్వర్గం

అమ్మను చూసేందుకు రోజూ అనేకులు జిల్లెళ్ళమూడి వస్తుంటారు. వీరిలో అనేకవిధాలయిన వాళ్ళుంటారు.

కొందరు ఏవేవో కోరికలతో వస్తారు. వారు అమ్మను దైవమనీ, అవతార వ్యక్తి అనీ నమ్ముతారు. అదే దృష్టితో అమ్మను అర్పించుకుంటారు. ఏవైద్యుడూ, ఏ మందులూ నయం చేయలేని వ్యాధులు తగ్గి పోయాయంటారు. చిరకాలంగా పరిష్కారంకాని సమస్యలు చిటికెలో సమసి పోయాయంటారు.

ఇష్టకామ్యార్థ సిద్ధిని పొందిన వ్యక్తి కృతజ్ఞతాభావాన్ని ప్రకటిస్తే అమ్మ అంగీకరించదు. వాళ్ళకోరికలు తీరడమనేది కాకతాళీయం అంటుంది. ఆ తరుణం వచ్చిందీ. ఆ పని జరిగిందీ అని చెబుతుంది. అందుకు తన అనుగ్రహం అంటూ ఏమీలేదని స్పష్టంగా వినిపిస్తుంది. జిల్లెళ్ళమూడి రాకపోయినా, తనను చూడక పోయినా ఆ శుభం జరిగే వుండేదనీ చెపుతూ ఎందుకయినా తరుణం రావాలి అని ఉద్ఘాటిస్తుంది.

అమ్మ దైవాన్ని కూడా అంగీకరించదు. దైవం అంటూ ఒకమూర్తి ఎక్కడో ఉండి ఈ సృష్టిస్థితి లయాలను నడుపుతూ ఉంటాడనే భావం అమ్మ దృష్టిలో హాస్యాస్పదమయింది.

మనకు అర్థంకాని అనంతమయిన శక్తి యొక్క భిన్నత్వమే ఈ సృష్టి అని అమ్మ చెపుతుంది. ఈ శక్తి పదార్థంగాను, పదార్థం శక్తిగాను పరిణామం చెందుతూ ఉంటుందని,ఈ ఏ పదార్థానికయినా రూపారంభమే కాని రూపనాశం లేదనీ అమ్మ ఉద్ఘాటిస్తున్నది. అమ్మ దృష్టిలో జగత్తు సత్యమయింది - ఆద్యంత రహితమయింది.

"మీరు దైవం జగత్తుకంటే వేరు అంటారు. నేను ఈ జగత్తే దైవం అంటాను. మలయమారుతాలు, కోయిల కూజితాలు, విరబూసిన పూల సరోవరాలే కాదు,

పెంట, పేడ, చీము, నెత్తురు, అన్నీ కలిపిన ప్రకృతినే పరమేశ్వరుడు అనుకుంటున్నాను".

నాలుగు చేతులూ, కాళ్ళతో వేరుగా ఎక్కడో దైవం లేడు. అన్నీ అయి వున్నాడు. గులాబీ పువ్వుగా, తమలపాకుగా, మంచంగా, కిటికీగా అన్నీ తానే అయి వున్నాడు.

మీరు శరీరం ఆత్మకాదు అంటారు. కాని శరీరము ఆత్మ కాక పోలేదు.

ఈ వాక్యం ఆధ్యాత్మిక సాహిత్యంలోనే అపూర్వమయిన సత్యం.

అమ్మ దృష్టిలో అంతా చైతన్యమే జడమే లేదు. కనుపించేదంతా దైవ స్వరూపమే నన్న విషయాన్ని అమ్మ పలురీతుల్లో ఉద్ఘాటిస్తున్నది.

"జగన్మిథ్య బ్రహ్మ సత్యం" అన్న పూర్వోక్తిని తిరగేసి "జగత్తు సత్యం" అని చెపుతూ జగత్తుకూ జగన్నాథునికీ అభేదాన్ని ప్రబోధిస్తున్నది.

అందువల్లనే "జగన్మాత' అనే పదానికి వివరణ ఇస్తూ "జగత్తే మాతకానీ జగత్తుకు మాతకాదు' అని అపూర్వమయిన నిర్వచనాన్ని ప్రసాదించింది.

'ఆత్మసాక్షాత్కారం' అంటే సర్వమూ ఆత్మగా (అంటే దైవంగా) కనుపించడ మట! అందువల్లనే అమ్మ ----

"నేను దేనికోసమూ ఏదీ చేసిది లేదు. ఆరాధన కూడా ప్రత్యేకంగా దైవ మొకదాంట్లో ఉన్నాడని ఆరాధించలేదు. మీ అందరినీ ఆరాధించడమూ మీ రందరూ దైవమను కోవడమే....

సాధన చెయ్యాలనీ నాకు లేదు. చేసిందీ లేదు. నేను ఏనాడూ పూజచేసి ఎరగను. దీపారాధనకూడా చేసి ఎరగను" అని ఘంటా పథంగా చెప్పింది.

విచిత్రమయిన విషయం ఏమిటంటే అమ్మను చూసేందుకు వచ్చే వాళ్ళలో అత్యధికులు అమ్మను పూజిస్తారు. అమ్మను ఎవరి ఇష్టదైవ రూపంలో వారు భావిస్తారు.

అమ్మ మాత్రం "నేను దైవాన్ని కాదు. నేనూ మీలాంటి దాన్నే" సర్వసామాన్య వ్యక్తిని అంటుంది.

"మరి, ఈ పూజలు ఎందుకు అంగీకరిస్తున్నారమ్మా ?" అని ప్రశ్నిస్తే.

"మీరు మాత్రం పూజలు నాకనిచేస్తున్నారా ! ఏ లక్ష్మిఅనో, పార్వతి అనో, సరస్వతి అనో చేసుకుంటున్నారుకానీ" అని సమాధానం చెబుతుంది.

పూజల విషయంలో అమ్మ చెప్పే మరో కారణం ఉంది.

మనస్సుకు అత్యంత ఉన్నతమయిన స్థానాన్ని ఇస్తున్నది అమ్మ. శరీరమూ, మనస్సు యొక్క కలయిక మాత్రమే మనిషి అంటున్నది ! ఆధ్యాత్మిక సంప్రదాయవాదులు చెప్పే జీవాత్మను అమ్మ చెప్పడం లేదు.

"దయలేని మనస్సులే దయ్యాలు" అని ఒక సందర్భంలో చమత్కారంగా ప్రవచిస్తూ "అస్వతంత్రమయిన మనస్సే' మానవత్వం, స్వతంత్రమయిన మనస్సే దైవత్వం" అని వివరించింది. "భిన్నత్వం లేని మనస్సే దైవత్వం" అని మరోసారి ప్రకటించింది.

ఈ పూజలు మనస్సుకు ఏకాగ్రతను కలిగించడం కోసమూ, పరిశుద్ధం చేయడంకోసమూ దోహదం కలిగిస్తాయని అమ్మ అభిప్రాయం.

ఆ దృష్టితోనే పూజలను, ధ్యానాలను, జప తపాలను అమ్మ అంగీకరిస్తున్నది. అమ్మ ఒకసారి చెప్పింది తపస్సంటే ఒళ్ళుమరచిపోవడంకాదు. వచ్చే ఒడిదుడుకులను సమంగా అనుభవించడమేనని.

అమ్మ తన ప్రబోధాల్లో సమచిత్తానికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నది. పరిపక్వ మయిన మనసన్నా, పరిపూర్ణమయిన మనసన్నా అదేనని అమ్మ చెబుతున్నది. పరిపూర్ణమయిన మానవత్వమంటే కూడా అదేనని అమ్మ ప్రవచిస్తున్నది.

మానవతకు పరాకాష్టస్థితి కూడా 'సమ దర్శనమే'నని అమ్మ నిరంతర ప్రబోధం.

ఈ ప్రబోధం అమ్మ కేవలం వాక్కు ద్వారానే మనకు అందించడం లేదు. మనసా తాను అదే శిఖరాగ్రస్థితిలో అధివసించి కర్మణా మనకు ఆదర్శంగా ప్రవర్తిస్తున్నది.

ఈ త్రికరణ శుద్ధి నేడు లోకంలో మృగ్యమై పోయింది. ఎక్కడయినా అది కనబడితే చాలు లోకానికి ఆరాధ్యమై పోతున్నది.

"నేను ఏమి చెప్పినా నా అనుభవంతోనే చెబుతాను" అంటుంది అమ్మ.

అమ్మ అనుభవం అపారమయినదిగానూ, అమ్మ జ్ఞానం అనంతంగానూ, అగాధంగానూ కనుపిస్తుంది.

అందువల్లనే అనేకులు జిజ్ఞాసువులు అమ్మను దర్శిస్తారు.

మామూలుగా అమ్మ ప్రాథమిక పాఠశాలకు కూడా వెళ్ళలేదు. ఏమీ చదువుకో లేదు. గ్రంథ పరిచయం లేదు. ఏ శాస్త్రవాసనా లేదు.

అందువల్లనే అమ్మ ఏ విషయం మాట్లాడుతున్నా ఏ శాస్త్రాల్లో నుంచీ ఏ ప్రమాణ వాక్యాలనూ ఉదహరించదు. తన అనుభవమే తనకు ప్రమాణం. అనుభవం శాస్త్రాన్నిస్తుందికానీ, శాస్త్రం అనుభవాన్నివ్వదు కదా !

అమ్మకు గురువుకూడా ఎవరూలేరు. ఎవరికయినా వాళ్ళమనసే వాళ్ళకు అసలైన గురువు అని అమ్మ ప్రవచనం. పరిస్థితులు బోధించినట్లుగా మరెవరూ బోధించలేదని అమ్మ పదే పదే చెబుతున్నది.

అందువల్లనే అమ్మకు లోకమే పాఠశాలట తన అనుభవమే శాస్త్రమట.

కనకనే అమ్మ ఏం చెప్పినా, ఎప్పుడు చెప్పినా ఆ వాక్యాలు కొత్త కాంతులతో, సహజమయిన సౌందర్యంతో అలరారుతుంటాయి. అవి ఎంతో పరిపుష్టంగానూ, పరిమళ భరితంగానూ ఉంటాయి. అవి గుండెలోయల్లోంచి ప్రభవిస్తాయి కనక మన గుండెలను స్పృశించ గలుగుతాయి.

అమ్మ మాటల మేలుకొలుపులు మనకు కొంగ్రొత్త పాఠాలను బోధిస్తాయి. మనను కొత్త దారిన నడిపిస్తాయి, అది పూలబాట, పాలపుంత కాకపోవచ్చును. కాని ఆ మార్గం విలక్షణమైనదే. వినూత్నమైనదే.

అమ్మ అనుభవసారం ఈ కనిపించేదంతా దైవమేనని, దైవం కానిదేదీ లేదని ఎంత వెదికినా నాకు అది కానిది, కనుపించడంలేదు అని అమ్మ ఘంటాపథంగా చెప్పింది.

అందువల్లనే

అమ్మ దృష్టిలో అసత్తులేదు. జడం లేదు.

అన్నం పరబ్రహ్మ స్వరూపమయితే మరి, అశుద్ధమో ? అని అమ్మ ప్రశ్నిస్తే, వినగానే మనకు విడ్డూరంగా ఉంటుంది. కాని గోమయాన్ని తీసుకవచ్చి గొబ్బెమ్మను తయారు చేసి గౌరీదేవిగా మనం అర్చించటాన్ని జ్ఞాపకం చేస్తే మనం విస్తుపోతాము.

అట్లాగే ప్రజ్ఞానం బ్రహ్మ అయితే, అజ్ఞానం సంగతి ఏమిటి ? అని అడుగుతుంది అమ్మ.

ఆనందో బ్రహ్మ అన్న వాక్యాన్ని 'బాధా భగవంతుడే" నని పరిపూర్ణం చేస్తుంది.

తేజస్సే కాదు తిమిరమూ దైవమేనట !

"మాతృదేవోభవ", "పితృదేవోభవ" అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తుంటే, అమ్మ తల్లిదండ్రులకు పిల్లలూ అర్చా స్వరూపులే నని కొత్త సందేశం ఇస్తున్నది.

మరి, గురువుకు శిష్యుడూ భగవంతుడేనట !

వైద్యునికి రోగులూ దైవ స్వరూపులేనట !

అమ్మ వైద్యులకు సలహా ఇచ్చింది -- రోగిపై జాలితో కాదు, నాన్నా ! భక్తితో సేవించూ' అని. భగవంతుడు తనను సేవించుకోవడానికి వైద్యులకు అనుగ్రహించిన ఒక అవకాశం రోగి !

భర్త భార్యకు దేవుడట ! భార్య భర్తకు దేవతట !

త్యాగరాజు కీర్తనలో 'చిమలో, దోమలో' అని వింటూ "చీమగా - దోమగా" అని సవరించింది.

అమ్మ దృష్టిలో దైవం సర్వాంతర్యామి కాదు. దైవం స్వరూపుడు.

నిరాకారుడు అంటే అన్ని ఆకారాలూ అయిన వాడట ! నిర్గుణుడు అంటే అన్ని గుణములూ కలవాడట !

ఈ సృష్టి సర్వమూ దైవస్వరూపమే కనుక అంతా అర్చనీయమేనని అమ్మ భావన, అర్చించడమంటే ప్రేమించడమేనట ?

సామాన్యంగా మన ఆధ్యాత్మిక సిద్ధాంతాలు ఈ లోకమూ, సంసారమూ, మమకారాలూ బంధహేతువులనీ, ఇవన్నీ త్యజించాలని కనీసం వీటికి దూరం గానయినా ఉండాలనీ హెచ్చరిస్తుంటే, అమ్మ మరో మార్గాన్ని ఉపదేశిస్తున్నది.

ఈ లోకంకాక లోకేశుడంటూ వేరే లేడు కనుక లోకాన్ని ఆరాధించమంటున్నది. లోకంలోని ప్రత్యణువునూ ప్రేమించమంటున్నది.

సంసారమంటే భర్తా, భార్యా, బిడ్డలూ కారట. సంసారమంటే సంకల్పమట! సంకల్ప రాహిత్య మనేది గగన కుసుమం. సంకల్ప రాహిత్యానికి అమ్మ ఒక క్రొత్త నిర్వచనం ఇచ్చింది. మనకు వచ్చే సంకల్పం మనది కాదు. ఈ జగత్తు నంతనూ నడిపే ఒక మహాశక్తి ననుసరించిన స్పందన మాత్రమేనని తెలుసుకోవడమట ?

ఇక, ఈ మమకారం విషయానికి వస్తే ఇదొక మహత్తరమయిన మార్గం. అమ్మ కూడా చెప్పింది. "సౌఖ్యానికి దారిగా కనబడుతూ దుఃఖాన్ని కలిగిస్తుంది. 'నాది' అనేది" అని.

అయితే ఈ మమకారమే మానవుణ్ణి మాధవుణ్ణిగా రూపొందించగల అమృతమూ, దివ్యసాధనమూ.

పరిమితమయిన మమకారం మానవత్వమూ, దుఃఖభాజనమూ, కానీ పరిమితులూ పరిధులూ దాటి అపరిమితమూ, అపరిచ్ఛిన్నమూ అయినప్పుడు అదే దివ్యత్వం !

"మన బిడ్డలయందు ఏమేం చూస్తున్నామో, అందరియందు దానిని చూడటమే బ్రహ్మస్థితిని పొందడం"

"నీ బిడ్డ బాధను చూసి నీవెట్లా దుఃఖపడతావో, అందరి బాధల్లోనూ నీ దుఃఖం నివారణ అవుతుంది".

ఇది విశ్వజనీన ప్రేమ. ఇది సర్వత్రానురాగం. ఇది నిజమయిన మమకారం. స్వపర భేద మెరుగని నిస్సీమ స్థితి అయిన వాళ్ళు, కాని వాళ్ళు అంటూ తెలియని అత్యద్భుత అద్వైత పరాకాష్ట.

అందుకనే అమ్మ సృష్టిని గురించి వివరిస్తూ "సృష్టి అనాది, నాది" అని చెప్పింది.

ఇది అపూర్వమయిన భావన. అపారమయిన అమ్మ హృదయానికి దర్పణ మనదగిన ప్రకటన ఇంతవరకు చరిత్రలో 'ఈ వూరు నాది' 'ఈ రాష్ట్రం నాది', 'ఈ దేశం నాది, అన్న వాళ్లున్నారే గానీ, 'ఈ సృష్టినాది' అన్న మహా మహీతాత్ములు జగచ్చరిత్రలోనే కనుపించరు.

ఆపాత మధురమయిన ఈ మమకారంతోనే అమ్మ మనల నందరినీ ప్రేమిస్తున్నది. నేను అమ్మను, మీరు బిడ్డలు అంటున్నది. ఎవరిని చూసినా నాకు నా బిడ్డే అనిపిస్తుంది అంటున్నది. మిమ్మల్నందరినీ నేనే కన్నాను. మీమీ తల్లులకు పెంపుడిచ్చా ననిపిస్తుంది అని అందరినీ అనురాగమృతపారావారంలో ముంచెత్తు తున్నది.

అలౌకికమయిన, అసాధారణమయిన, అతి మానవమయిన ఈ వాత్సల్యం వల్లనే ఎందరో అమ్మవద్దకు ఆకర్షితులవుతున్నారు.

అక్కడొక ఆశ్రమం ఏర్పడింది. అమ్మ అందరిల్లు, అని నామకరణం చేసింది. ఈ పేరు లోనే కాదు, ఆశ్రమ నిర్వహణలో ఏ అంశంలో చూసినా అమ్మ విశ్వజననీ విశాల హృదయపరిస్పందనలో ఉత్పన్నమయ్యే విమలానురాగ మధుర సంగీతమే మనలను వివశులను చేస్తుంది.

అక్కడొక అన్నపూర్ణాలయం.

ఎప్పుడు వచ్చినా, ఎందరు వచ్చినా ఇక్కడ ఉచితంగా భోజనం పెట్టబడు తుంది. ఇక్కడ అన్నం పెట్టటానికి ఆకలి మాత్రమే అర్హత ! వాడి ద్రస్సునూ, అడ్రస్సునూ బట్టికాదు. ఎవరయినాసరే, జిల్లెళ్ళమూడికి ఆకలితో రావచ్చునుగాని, ఆకలితో వెళ్ళగూడదట. అమ్మ ఆకలికి అత్యంత ప్రాధాన్య మిస్తున్నది. అక్కడ రోజూ వేయిమందికి పైగా భోజనం చేస్తారు. అందరూ ఒకే పంక్తిన కూర్చుంటారు. కుల, మత, జాతి భేదం లేదు. పేద, ధనిక వ్యత్యాసం లేదు. దుర్జనుడని విభజన లేదు. ఈ నిరతాన్న దానాన్ని 'దానం' అనడానికి అమ్మ అంగీకరించదు. తల్లి బిడ్డలకు అన్నం పెట్టుకోవడమేనంటుంది.

అమ్మకు అందరూ సమానమే.

వర్గరహిత సమాజానికి అదొక చిహ్నరూపం.

'వర్గరహితమైనదే స్వర్గం' అన్నది అమ్మ.

సంస్కృత పాఠశాల ఉన్నది. కళాశాల వున్నది. విద్యార్థులందరికి ఉచిత భోజన వసతి సౌకర్యాలున్నవి. అవి కేవలం విద్యాలయాలే కాదు సత్పాదులకూ, ఉత్తమ మానవులకూ రూపకల్పనచేసే ఆదర్శ సంస్థలు.

ఉచిత వైద్యాలయం ఉన్నది.

ఆదరణాలయం ఉన్నది. వృద్ధులకూ, వికలాంగులకూ, అనాధలకూ ఆశ్రయ మిస్తున్నది.

"అనాధ" లెవరూ లేరు. అందరూ - 'శ్రీనాధు' లే నంటున్నది అమ్మ.

అదొక అద్భుతమైన ఆశ్రమం. ఎన్నో జగద్ధిత కార్యక్రమాలతో, మతోద్ధరణకు కాక మానవోద్ధరణకు సహాయంచేసే ప్రబోధాలతో అలరారుతుంటుంది. అమ్మ భవిష్యత్తుకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పదు. ఉపన్యాసాలివ్వదు. ఉపదేశాలు చేయదు. మహిమలు ప్రకటించదు. మంత్ర ప్రభావం చేయదు.

మంత్రమంటూ శక్తిమంత మయిన ప్రత్యేక అక్షరాలు ఏవీ లేవంటుంది. మనస్సిద్ధివుంటే అన్ని అక్షరాలూ మంత్రాలేనంటుంది.

అమ్మ మనను ప్రేమిస్తూ ప్రేమించటం మనకు నేర్పుతున్నది. ప్రతిఫలాపేక్ష రహితమైన నిర్మల ప్రేమ యొక్క విరాట్ స్వరూపాన్ని మనం జిల్లెళ్ళమూడిలో చూడగలుగుతాం.

అమ్మ అనుసరిస్తున్న విధానం ఈ నాటి జగత్తుకే ఆదర్శమయింది. అమ్మ ప్రబోధిస్తున్న "సర్వత్రానురాగం" ఈ కాలానికి ఎంతో ావసరమయింది.

భరించలేనిదే బాధ

సహించలేనిదే హింస

ఇష్టం లేనిదే కష్టం.

వర్గం లేనిదే స్వర్గం

వైకల్యం లేనిదే కైవల్యం

అనుకున్నది జరగదు

మనకున్నది తప్పదు

అప్పులు, తప్పులు ఎవరికైనా తప్పవు,

తల్లికి తప్పే అనుపించదు

పంచిపెట్టని కాడికి ఉండడం దేనికి !

తృప్తే ముక్తి

-- అన్న అపూర్వమయిన నిర్వచనాలతో, ప్రవచనాలతో అమ్మ అనుదినం అసంఖ్యాకులకు క్రొత్త పాఠాలు గరుపుతుంటుంది.



# 210
# ఆకాంక్ష

ఆత్మసాక్షాత్కారమే ఆధ్యాత్మికానుభవాలకు పరాకాష్ఠ. ఆ స్థితి ఎవరికి ఏ మార్గాన లభిస్తుందో స్పష్టంగా ఎవరికీ తెలియదు. ఆ స్థితి ఈ మార్గాన వచ్చిందని కాని, ఇట్లా ఉంటుందని కాని, ఏ సిద్ధపురుషుడు అభివ్యక్తం చేయలేదు. ఆ సిద్ధిని పొందిన తరువాతవారి లక్షణాలను బట్టి వారిని గుర్తించ వలసినదే. ఆ స్థితి భక్తివల్ల రావచ్చు. యోగంవల్ల రావచ్చు, జ్ఞానంవల్ల రావచ్చు. ఏ సాధనలేకనూ రావచ్చును.

వారికి సృష్టివిధానం కరతలామలకమవుతుంది. విశ్వచరిత్ర వారికి తెరిచిన పుస్తకమవుతుంది. పంచభూతాలు వారి కనుసైగల్లో మెలుగుతాయి. అష్టసిద్ధులు వారు పిలిస్తే పలుకుతాయి.

వారికి మూడుకాలాలు లేవు. అంతా వర్తమానమే. వారు తలుచుకుంటే కానిపని ఉండదు. వారు సంకల్పసిద్ధులు. ఏ పరిస్థితులలోను వారు ఆందోళనపడరు. వారికి కోపతాపాలుండవు. వారు నిరంతరం ప్రశాంత చిత్తులయి అత్యంత నిర్లిప్తంగా కనిపిస్తారు. రాగద్వేషాలు వారి దరికి చేరవు. వారికందరూ ప్రేమాస్పదులే.

వారిదృష్టిలో జడం ఉండదు. అంతా చైతన్యమే. వారికి అసత్తులేదు. అంతా సత్తే. వారికి తమస్సు లేదు. అంతా తేజస్సే. జనన మరణాలు వారికి పరిణామ మాత్రాలు.

వారికి "అసాధ్య" మంటూ ఉండదు. వారు సర్వశక్తి సంపన్నులు. వారికి "తెలియనిది" ఉండదు. వారు సర్వజ్ఞులు. వారు చూడలేని దూరం ఉండదు. వారు సర్వవ్యాపకులు.

వారికి వాళ్ళ మనోవాక్కాయ కర్మలమీదనే కాక ఇతరుల త్రికరణాల మీదకూడ అధికారం ఉంటుంది. ఇతరుల మనోరథాలను ప్రబోధించటంలో వారికి గల నైపుణ్యం ఆశ్చర్యకరం.

ఏ సైనికశక్తి వారిని ఏమీ చేయలేదు. ఏ ధనరాసులు వారిని ఆకర్షించలేవు. వారికి ఒకరు ఎక్కువ కాదు, మరొకరు తక్కువ కాదు. అందరూ సమానమే. వారిది "సర్వసామాన్య స్థితి". వారికి సర్వమూ సామాన్యమే. వారి దృష్టిలో విశేషమేలేదు. అవసరమయితే శివలింగంతో కుంకుడుకాయలు కొడతారు. కుష్టువాడి మీదకూడ వారికి అసహ్యం ఉండదు. గుడిలో అభిషేకం చేసేవాడు, పాకీదొడ్డి కడిగేవాడు వారికి సమానమే.

వారికి ఎప్పుడు ఏమి కావాలంటే - అది కనిపిస్తుంది. ఏది కావాలంటే అది వినిపిస్తుంది. అందరి మనుసులు వారికి స్వంతమే. సృష్టిలో వారిది కాని వస్తువే కనిపించదు. ఎవ్వరు పరాయివారుగా తోచరు. అందరిని తమ ప్రతిబింబాలుగానే దర్శిస్తారు. వారు సృష్టినంతనూ తనదిగానూ, తానుగానూ మాత్రమే చూస్తారు. "ఈ సృష్టినాది" అనుకొనగలిగిన విశాలహృదయులు వారు.

పిల్లల ఏడుపుల్లోనూ, కుక్కల అరుపుల్లో కూడ ప్రణవాన్ని వింటారు. పూలగంపలు, ముళ్ళకంపలు వారికి సమానమే. పెద్దపులిని చూచినా, బుసలు కొట్టే త్రాచుపాము యెదురయినా వారికి భయం ఉండదు. భయం అనేది వారి నిఘంటువులోనే ఉండదు. వారికి శత్రువులే ఉండరు. అందరూ మిత్రులే. వారికి దగ్గరనీ, దూరమనీ లేదు. కావాలనుకుంటే అంతా సమీపమే. వద్దనుకుంటే అంతా సుదూరమే. వారికి నిద్రాహారాలు తప్పనిసరి కాదు. ఏది తినవలసి వచ్చినా చివరకు అవి దెబ్బలయినా, తిట్లు అయినా వద్దనిపించవు. దూషణను కూడ స్తుతిగానే వారు స్వీకరిస్తారు. వారికి - యేమీ కావాలనేది అక్కరలేని నిరీహస్థితి. వారికి ఆరాటాలు ఆశాభంగాలు ఉండవు. వారికి వయోభేదం ఉండదు. వారికి లింగభేదం ఉండదు. వారు సర్వాతీతులు. పరుల సౌఖ్యమే ధ్యేయంగా వారు జీవిస్తారు. వారు సర్వత్రా దైవత్వాన్నే దర్శిస్తారు. వారు సౌఖ్యంలో పొంగిపోరు. దుఃఖంలో కృంగిపోరు. తమవంతుకు ఏమివచ్చినా నవ్వుతూ అనుభవిస్తారు. పుత్తడిని, మృత్తికను ఒక్కటిగానే పరిగణిస్తారు.

వారి దర్శనం మనకు పుణ్యం కలిగిస్తుంది. ఆహ్లాదాన్ని అందిస్తుంది. ఆందోళనతో కూడిన మన మనస్సులకు శాంతిని చేకూరుస్తుంది. ఎంతసేపు చూసినా ఇంకా చూడాలనిపిస్తుంది. ఎన్నిసార్లు చూసినా మరల చూడాలనిపిస్తుంది. వారి స్పర్శ మనలోని సమస్తతాపాలను హరిస్తుంది. వారి హస్తాలలో, పాదాలలో, చూపులలో, మాటలలో హరిచందనాలు వెదజల్లబడ్డాయా - అనిపిస్తుంది. వారి పలుకులు సత్యాలై, సంజీవనులై, కలకండ పలుకులై వుంటాయి. వారి వాక్కులు, వారి దృక్కులు రత్నదీపాల్లాగా, మబ్బుల్లో మెరుపుల్లాగా ప్రకాశిస్తుంటాయి.

అవసరం లేనపుడు వారికి ఏమీ తెలియదు. అవసరమైతే తెలియనిది ఉండదు. వారిది తెలిసీ, తెలియని స్థితి. అంటే అన్ని తెలిసీ, ఏమి తెలియనట్లు కనిపించే విచిత్రస్థితి

వారి ప్రమేయం లేకుండానే వారి సమక్షంలో మన కోరికలు నెరవేరుతాయి. ఒక్కొక్కపుడు కోరికలే నిర్మూలం కావడం కద్దు. వారివద్ద సందేహాలు నివృత్తి అవుతాయి. ఒక్కొక్కపుడు సందేహాలే తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. ఎప్పుడూ అర్ధనిమీలతాలై ఉండే వారి కళ్ళ నుండి వీచే ప్రభంజనాలకు మన ప్రశ్నాపత్రాలే తమ చిరునామాలు కోల్పోతాయి.

సామాన్యుడికి వారి సందర్శనం మహాభాగ్యం. వారితో సంభాషణ బహుగ్రంథ పఠనముయొక్క ప్రయోజనాన్ని అందిస్తుంది. వారి సంస్పర్శ సర్వ శుభకరం.

నాగుపాములు వారితో ఆడుకుంటాయి. "అద్వేష్టా సర్వభూతానాం"కు వారు ప్రతీకలు. తమను హింసించేవారికి కూడా వారు అపకారం చేయరు. వారు అజాతశత్రువులు.

అజాత శత్రువులంటే - వారికి శత్రువులు లేకపోవడం కాదట - వారు ఎవ్వరికీ శత్రువులు కారట - అమ్మ చెప్పిన కొత్త వివరణ ఇది.

వారిలో అహం నిత్య జాగృతమై ఉంటుంది కాని, అహంకారం ఏ క్షణానా అణుమాత్రమైనా కనిపించదు.

వారు లోకోత్తర చరిత్రులు. వారు యుగానికి ఒకరిగా ఉద్భవిస్తారు. వారు సృష్టికే రత్నఖచిత మకుటాలు. వారు లోకానికి దీపస్తంభాలు.

ఆత్మ సాక్షాత్కారమంటే - లోకమంతా ఆత్మ (తానుగా) కనిపించటమేనని ఒక్కచక్కని సరికొత్త నిర్వచనం చేసింది అమ్మ,

ఆత్మ సాక్షాత్కారం ఎంత అద్భుతమైంది ! ఎంత మహిమాన్వితమైంది !

అమ్మవద్ద 23 సం॥రాలు రేబవళ్ళు ఉండి - ఈ లక్షణాలన్నీ అమ్మలో పూర్ణవికాసం పొందటం ప్రత్యక్షంగా గమనించగలిగాను. అది నాకు అమ్మ ప్రసాదించిన గొప్ప వరం.

ఈ స్థితి అమ్మలో మరో పారిజాతాన్ని ప్రసవించింది. అది - విశ్వమాతృస్థితి. జగజ్జనని అన్న పదబంధం మనం పురాణాల్లో చదువుతాం, కాని రక్తమాంసాలతో వున్న ఒకవ్యక్తిలో ఆ స్థితి గుబాళించటం లోకం ఎప్పుడూ చూచిన దాఖలాలు లేవు.

లోకాన్ని దైవంగా, తానుగా దర్శించటమే కాక - తన బిడ్డగా చూడటం అమ్మలో విరిసిన కొత్తచూపు. అమ్మలో వెల్లువలై ఉప్పొంగిన మాతృవాత్సల్య సుధాస్రవంతుల్లో లోకం - సర్వ విభేదరహితంగా పులకించి పరవశించటం మానవేతిహాసంలో కొత్త అధ్యాయం.

"మీ అందర్ని నేనే కని - మీ మీ తల్లులకు పెంపుడిచ్చాను".

"ఎవరిని చూచినా - నా బిడ్డే అనిపిస్తుంది"

"మీ అందరు నా బిడ్డలే"

-- ఈ వాక్యాలు విశ్వ సాహిత్యవల్లరి తొడిగిన కొత్త చిగుళ్ళు.

"నేను నేనైన నేను" - అన్న ప్రవచనం అమ్మ హృదయానికి మణి దర్పణం. అమ్మ విశ్వతాదాత్మ్య స్థితికి మహనీయ శబ్దరూపం. అందరిలో మంచి వాడిలోను, చెడ్డ వాడిలోను, గొప్పవాడిలోను, తక్కువవాడిలోను, పండితుడిలోను - పామరుడిలోను, "నేను"గా వెలుగుతున్న చైతన్యమంతా తానేనని పలు సందర్భాల్లో అమ్మ స్పష్టంచేసి మనను ఆశ్చర్యచకితులను చేసింది.

"మీరంతా నేనే మీదంతా నేనే ఇదంతా నేనే" తాలుమాట రానటువంటి తోలు నోరుకాని అమ్మ బంగారు నోటివెంట వెలుబడ్డ వెలుగుముద్ద ఈ మహావాక్యం.

నాలుగు వేదాల నుంచి నాలుగు మహావాక్యాలను బయటకు తీసి లోకానికి అందించారు మన రుషిపుంగవులు. ఆ నాలుగువాక్యాలు తత్వసార మందిరానికి నాలుగు వాకిళ్ళు. వేదసారం ఎవరికి అనుభూతమయినా, ఎవరికి జీర్ణమైనా, ఎవరికి రక్తగతమయినా, వారి హృదయవీణ చిరుగాలి తాకిడికి సరియైనంత మాత్రానే ఈ వాక్యాలసారాన్ని మధురంగా నినదించవలసిందే.

ఆ నాలుగు మహావాక్యాలు అమ్మలో సరళ సుందరంగా ప్రతిధ్వనించి లోకాన్ని ఆనంద తరంగితం చేశాయి. తత్వవేదికపై అమ్మకు ఒక అద్భుత సింహాసనాన్ని యేర్పరచాయి.

"అహం బ్రహ్మాస్మి" - అన్నది ఒక వేదవాక్యం "నేను నేనైన నేను" - అన్ని నేనులు నేనే - అని అమ్మ పలికినపుడు పై వేదవాక్యం స్ఫురణకురావడం లేదూ ?

"తత్వమసి" - అన్నది మరో వేదవాక్యం.

ఒకనాడు ఒక సోదరుడు అమ్మకు పాదసంవాహనం చేస్తూ - "అమ్మా - బ్రహ్మ కడిగిన పాదాలు ఇవేనా" ? అని అడిగితే, అమ్మ అన్నది "మీరంతా బ్రహ్మలే

కదా నాన్నా, మీరు రోజూ కడుగుతూనే ఉన్నారుగా ఎంత దివ్య దర్శనం" ! దివ్యదర్శనం అంటే - అంతా దివ్యంగా కనపడటమట - ఈ నిర్వచనం లోగడ ఏ నిఘంటుకారులు ఇచ్చారు ?

ఒకనాడు పూజ జరుగుతూ ఉండగా - డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు - "అమ్మా ! నీవు అంతర్ముఖివై, నీవై ఉండవలసిన సమయములో మేము పూజలుచేసి, ప్రార్థనలుచేసి నీ దృష్టిని మా వైపుకు తిప్పుకుంటున్నాము" అంటే

"నాన్నా ! మీలో నన్ను చూసుకోనపుడు కదా చిక్కు," అని ప్రశ్నించి తన యదార్థస్థితిని సూచించింది అమ్మ. అన్ని రూపాలు, అన్ని నామాలు, అన్ని క్రియలు తనవేనని పలు సందర్భాలలో స్పష్టంగా చెప్పింది అమ్మ.

ఒకరు "మీరు రాజరాజేశ్వరి అవతారమా" - అని అడిగితే, "మీరు కానిది నేను యేమి కాదు నాన్నా" - అన్నది అమ్మ.

నేనే మీలో దైవత్వాన్ని, మీరు నాలో మానవత్వాన్ని చూస్తారని పలుమార్లు అమ్మ ఉద్ఘాటించింది.

అమ్మ తాను బ్రహ్మమేనని మనమంతా దైవ స్వరూపాలమేనన్న స్ఫృహను అనేక పర్యాయాలు ప్రకటించింది.

"మీరంతా పరిపూర్ణ జ్ఞాన స్వరూపులు"

"మీరే నా ఆరాధ్యమూర్తులు"

--- ఇటువంటివి ఎన్నో వాక్యాలు "తత్వమసి'కి సారూప్యాలు.

"అయం ఆత్మా" - ఇది ఇంకొక వేదవాక్యం.

"ఎంత వెదికినా అది కానిది నాకు కనిపించం లేదు"

"నా దృష్టిలో అందరూ దైవ స్వరూపులే"

"అంతా అదే"

-- అని అమ్మ పలుకుల వెన్నెలలో ప్రపంచమంతా దివ్యమై, మనుషులందరూ దేవతా స్వరూపులై వెలిగిపోవడం లేదూ !

"ప్రజ్ఞానం బ్రహ్మ" - మహా వాక్యములలో నాలుగవది.

ఇక్కడ - అమ్మ మన వేదాలు, మన శాస్త్రాలు, మన సాంప్రదాయం చెప్పిన భావంతో ఏకీభవించలేదు. హృదయం మరింత విశాలమై, దృష్టి మరింత తేజోవంతమై

బోధ మరింత సంపన్నమై, అమ్మ మరింత ముందుకు సాగి ఆధ్యాత్మికరంగంలో మరొక సంప్రదాయానికి మరొక క్రొత్త వాదానికి, మరొక క్రొత్త సిద్ధాంతానికి పురుడుపోసింది. నెరవిచ్చిన క్రొత్తచూపుతో లోకాన్ని దర్శించిన అమ్మ నవసందేశాన్ని వినిపించి తత్వశిఖరం అధిరోహించి ఆధ్యాత్మిక ఆకాశంలో నవపతాకను యెగురవేసింది.

"ప్రజ్ఞానం బ్రహ్మ అయితే - అజ్ఞానమో ..."

"అన్నం పరబ్రహ్మమయితే - అశుద్ధమో....."

"ఆనందమే బ్రహ్మమయితే - దుఃఖమో.... "

"సత్యం దైవ స్వరూపమయితే - అసత్యం మాట ఏమిటి . ."

"అధిక్యమే దైవత్వమైతే - అల్పత్వమో.. ..."

మన సంప్రదాయ వేదాంతం సృష్టిలోని అర్ధభాగాన్ని మాత్రమే సత్తుగాను, మిగతా భాగాన్ని అసత్తుగాను వివరిస్తే - ప్రపంచంలో అసత్తు అనేదే లేదు అంతా సత్పదార్థమేననీ, జడమే లేదు. అంతా చైతన్యమేననీ అమ్మ సుస్పష్టంగా పలికి ఆధ్యాత్మిక గగనంలో పూర్వమెన్నడు కనిపించని పూర్ణచంద్రుడిని చూపించింది

మన సంప్రదాయ వేదాంతం ప్రకారం మనం చేసుకొనే పుణ్యాపుణ్యాలని బట్టే భగవంతుడు మనకు ఫలితాలను ఇచ్చే వాడయితే ---

"అందరికి సుగతే" - అని అమ్మ కొత్త తీర్పునిచ్చి మానవలోకాన్నే సంభ్రమాశ్చర్యాలలో ముంచింది.

"అమ్మ దృష్టిలో - మానవుడికి కర్తృత్వము లేదు మనిషి కేవలం పరాధీనుడు అంటే పరాశక్తికి అధీనుడని" ఒకసారి అమ్మ స్పష్టంచేసింది. "మీరు అనుకునేదైనా, అనేదైనా, ఆచరించేదైనా - నేను అనుకుంటేనే" అని మరొకచోట అమ్మ అన్నది. "ఒకరు గొప్పవాళ్ళని, మరొకరు తక్కువ వాళ్ళని నాకు అనిపించదు, మీ చర్యలకు, మీరు కర్తలని నాకు అనిపించదు"

పాపమని, నరకమని, భయపెట్టే శాస్త్రాల నుండి, శాసనాల నుండి మనిషికి శాశ్వతముక్తిని ప్రసాదించలేదూ - పరమదయాళువు అయిన అమ్మ ! లోకానికి అమ్మ అనుగ్రహించిన అభయహస్తం, ఈ అపూర్వ ప్రకటన. భవబంధాలలో చిక్కుకున్న మనిషికి ఇంతకంటే గొప్పవరం యేముంది ? లలితా సహస్రనామావళిలో "పుణ్యా పుణ్య ఫలప్రద" అన్న నామం చదువు కుంటున్నప్పుడు, మన జీవిత అధ్యాయాలు గుర్తుకువస్తే మన శరీరం భయముతో స్వేదసిక్తం కాదూ.

ఎన్నో విలక్షణమైన, వినూతనమైన, విశిష్టమైన తాత్త్విక ప్రవచనాలు చేసి ఒక కొత్త ఆధ్యాత్మికలోకానికి పునాదివేసి "ప్రవక్త" కాగలిగింది అమ్మ. సనాతన విషయాలను సులభంగాను, సరళంగాను, మృదువుగాను, మంజులంగాను, చెప్పడం గాక - ఎన్నో అపూర్వ విషయాలను వెల్లడించి ఆధ్యాత్మిక సారస్వతాన్ని అమ్మ సుసంపన్నం చేసింది అనడంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు

లోకంలో సిద్ధవ్యక్తులు అనేకులు ఆవిర్భవించినా వారందరూ వాళ్ళ అనుభవాలను, అనుభూతులను, వాళ్ళ దర్శనాలను, బోధనలను, ఇంత తేట తెల్లంగా, సూటిగా, సుందరంగా, అభివ్యక్తం చేయకపోవడం లోకంయొక్క దురదృష్టం

అమ్మ అనుభవం - అపారం. మేధ సునిశితం, వాక్కు సరళం. హృదయం దయార్ద్రం కనుక అమ్మనుండి మనకు ఆధ్యాత్మిక విజ్ఞానభాండం అందింది. పైగా అమ్మ ఒక సందర్భములో అన్నది - "తెలియనిది తెలియచేయటానికే నా రాక" అని

అందుకే - భగవద్గీతను ప్రవచించిన శ్రీకృష్ణపరమాత్మ, ఆధ్యాత్మిక జగత్తులో అద్వైతానికి ఊపిరులూదిన ఆదిశంకరాచార్యులు, భగవాన్ రమణమహర్షి ప్రభృతులువలే అమ్మను జగద్గురువుగా సంభావిస్తాను.

లోకంలో చాలామందికి - ప్రేమమూర్తిగా, కరుణామయిగా, మహిమాన్వితగా, అవతారమూర్తిగా, జగన్మాతగా వాంఛితార్థప్రదాయినిగా అమ్మ సువిదితయేగాని - జ్ఞానసింధువుగా, కొద్దిమందికి మాత్రమే అమ్మ తెలుసును అందువల్లనే ఆర్తులు - అర్థార్థులు అమ్మవద్దకు పరిగెత్తివచ్చినట్లు జిజ్ఞాసువులు - జ్ఞానులు రాలేదేమో !

సృష్టిని గురించి, దైవాన్ని గురించి, మనిషిని గురించి పుంఖాను పుంఖంగా క్రొత్త క్రొత్త నిర్వచనాలను, ప్రవచనాలను అమ్మవెలువరించింది అన్ని వాక్యాలు అమ్మ అనుభవసాగరంలో ఉద్భవించిన భావతరంగాలే

ఆ వాక్యాల వెలుగులో మనం లోకాన్ని వీక్షించగలిగితే లోకమంతా వైకుంఠంగానో, కైలాసంగానో కనిపిస్తుంది

అమ్మ ఏం చెప్పినా హేతుబద్ధంగా ఉంటుంది. ప్రతి విషయాన్ని వాస్తవ దృష్టిలో పరిశీలిస్తుంది ఏం బోధించినా వివరంగా, విపులంగా, సరళంగా, సూటిగా చెపుతుంది.

"ఇది ఏమిటి", "అసలు ఇది ఏమిటి", - అమ్మ ఉపదేశించిన పంచాక్షరీ, అష్టాక్షరీ మంత్రాలు. అమ్మ పునర్జన్మ వాదాన్ని, కర్మసిద్ధాంతాన్ని అంగీకరించలేదు.

ఆత్మకు లేని పాప, పుణ్యాలు జీవునికి యెక్కడ నుండి సంక్రమిస్తాయి - అని అమ్మ సంప్రదాయ మూల వేదాంతాన్ని కదలించింది. మొదటిజన్మకు లేని పాపపుణ్యాలు తరవాత యెక్కడ నుండి వచ్చాయి.

ఆబ్దికాల ప్రసక్తి వచ్చినపుడు - చనిపోయిన జీవుడు ఆ రోజునవచ్చి, మనం పెట్టే భోజనం చేస్తాడని అమ్మ నమ్మలేదు కాని ఆబ్దికం నిర్వహించడం మనకృతజ్ఞతకు చిహ్నంగా అమ్మ భావించింది.

సంప్రదాయం - భగవంతుడు అన్నిటా, అంతటా, అందరిలోనూ సర్వాంతర్యామియై ఉంటాడు - అని చెబితే - అమ్మ "అంతా భగవంతుడే" అని సంపూర్ణత్వాన్ని చెప్పింది.

ఆ భావన నుండి వెలువడ్డ వాక్యమే -

"శరీరం కూడా ఆత్మ కాకపోలేదు".

"పిపీలికాది బ్రహ్మ పర్యంతం" అన్న వేదాంత పదబంధ ప్రస్తావన వచ్చినప్పుడల్లా అమ్మ అన్నది -

"పిపీలిక బ్రహ్మ కాకపోతే కదా" !

ఒకనాడు అమ్మ సమక్షంలో ఒక గాయకుడు త్యాగరాయకీర్తన గానం చేస్తూ "చీమలో, దోమలో ఉన్న పరమాత్ముని స్తుతిస్తుంటే అమ్మ కలుగచేసుకొని చీమగా, దోమగా ఉన్న పరమాత్మ ఉనికిని తెలియచేసింది.

అంతా దైవమే అన్న అమ్మ దర్శనానికి ఏమాత్రం భంగంకలిగే మాట వినిపించినా దానిని అమ్మ వెంటనే సరిదిద్దేది. అమ్మ దృష్టిలో దేవాలయమేలేదు. అంతా దైవమే. అయితే దేవాలయాలు అవసరమేనన్నది. ఎందుకంటే "మనకు దాహమున్నా, నదినిండా నీళ్ళున్నా, దాహం తీర్చుకోవటానికి రేవులుండాలి" అన్నది అమ్మ. అమ్మ దృష్టిలో ఆ రేవులే దేవాలయాలు.

సాధకులకు అమ్మ చూపించిన మంచి మార్గం -

"సామాన్యం నుంచి విశేషాన్ని విడదీసుకొని మళ్ళీ విశేషాన్ని సామాన్యం చేసుకోవాలి" అని.

ఒకచోట దేవుడిని గురించి వివరిస్తూ - "దేవుడిని గురించి తెలుసు కోవడం అంటే దేవుడులేడని తెలుసుకోవడమే" అని అన్నది అమ్మ. ఈ వాక్యం వినగానే అమ్మ నాస్తికురాలా ? - అని అనిపిస్తుంది. కాని ఇంకా ఇతర సందర్భాలలో

అమ్మ వ్యక్తంచేసిన అభిప్రాయాలను వింటే అమ్మ హృదయం ఏమిటో మనకు అవగతం అవుతుంది.

ఒకసారి ఒక జిజ్ఞాసువు అమ్మ వద్దకు వచ్చి - "అమ్మా, రామకృష్ణ పరమహంస, వివేకానందునికి దైవానిన చూపించినట్లు మీరు నాకు చూపించండి" అని అడిగితే - అమ్మ చుట్టూ వున్న పరిసరాలను కలయచూస్తూ - "నాన్నా, ఉన్నది అంతా అదే అయినపుడు దేనిని ప్రత్యేకంగా చూపించమంటావు" అని ప్రశ్నించింది. "కనిపించే దంతా అదే అయినపుడు, ప్రత్యేకించి కళ్ళు మూతలెందుకు" అని మరొకమారు ప్రశ్నించింది.

అమ్మ బోధనా సారాంశం - కనిపించేది, కనిపించనిది అంతా బ్రహ్మ స్వరూపమే - నని.

సంకల్పరాహిత్యమంటే వివరిస్తూ అమ్మ అన్నది - "మనస్సున్నవాడే కదా మనిషి, మనస్సువుంటే సంకల్పం లేకుండా ఎలా ఉంటుంది. అలలు లేని సముద్రం వుంటుందా ? సంకల్ప రాహిత్యం అంటే, సంకల్పం లేని స్థితికాదు, మనకువచ్చే ప్రతి సంకల్పమూ దైవము ఇచ్చినదేనని భావించడమేనని చెప్పి" అమ్మ తన వాస్తవ దృష్టికి రూపకల్పన చేసింది.

మృత్యుంజయత్వమంటే - మృత్యువు రాకపోవడం కాదట, జాతస్య మరణం ధృవం కదా ! మృత్యువుని గురించి భయం లేకపోవడం, మృత్యువు ఎప్పుడు వచ్చినా నిర్లిప్తంగా, నిర్భయంగా స్వాగతం చెప్పగలగడమే మృత్యుంజయత్వమని", కొత్త అర్థం చెప్పింది అమ్మ.

ఇవన్నీ అమ్మ హేతువాదానికీ, వాస్తవదృష్టికీ నిదర్శనాలు కావా ?

"నీకున్నది నీవు తృప్తిగా తిని - ఇతరులకు ఆదరంగా పెట్టుకో" - అన్నది అమ్మ సందేశం. ఈనాటి సమాజానికి ఇంతకంటే మంచి బోధ మరి యేమికావాలి?

"నీ బిడ్డలో యేమి చూస్తున్నావో, అందరియందు దానిని చూడటమే బ్రహ్మ స్థితిని పొందడం" - అన్నది అమ్మ ఉపదేశం. ఈ వాక్యం ఆధ్యాత్మిక మహామంత్రంలా ధ్వనిస్తుంది. కాని ఇది సమాజశ్రేయస్సుకై అమ్మ చేసిన ప్రబోధమేగా ! ప్రతి సాధకుడు తన బిడ్డలవలె ఇతరులను ప్రేమించగలిగితే ప్రపంచంలో, కక్షలకు, కార్పణ్యాలకు, దౌర్జన్యాలకు, దురాగతాలకు, దహన కాండలకు, మారణహోమాలకు తావేది ? లోకమంతా ప్రేమమందిరం, శాంతినిలయం అయిపోదూ ?

అమ్మ ప్రవచించిన మరో మహనీయు వాక్యం - "ప్రాపంచకమని. పారమార్థకమని రెండు లేవు" అమ్మ దృష్టిలో దైవారాధన, సమాజసేవ వేరు కావు. కనిపించే సృష్టికంటే దైవం వేరే 'యెక్కడ ఉంది ? అన్నది అమ్మ భావన. "కనిపించే లోకాన్ని ఆరాధించక, కనిపించని దైవంకోసం ఆరాటమెందుకు అని ?" అమ్మ పలుమార్లు ప్రశ్నించింది.

ఈ భావంతోనే "జగజ్జనని"కి అర్థం చెబుతూ. "జగత్‌కు జనని" కాదు, "జగత్ అనే జనని" అని సరిక్రొత్త వ్యాఖ్యానం చేసి లోకంయెడల మనకు క్రొత్త చూపు నిచ్చి, లోకాన్ని మనకు సమారాధ్యం చేసింది.

ఆధ్యాత్మికం అనే క్యాప్సూల్‌లో అమ్మ మనకు అందించినది సాటి మానవుడికి ప్రేమించమనే ఔషధాన్ని.

లోగడ లోకంలో ---

"లోకాన్ని తనవలే చూడటం" - "లోకాన్ని దైవంగా పూజించడం" - రెండే మార్గాలు ఉన్నవి. అమ్మ ఆ రెండాకులకు మూడవ ఆకును చేర్చి ఒక కొత్త విధానానికి శ్రీకారం చుట్టింది. అది - "లోకాన్ని బిడ్డగా ప్రేమించడం" ఈ దృక్పధం సాధకలోకానికి అమ్మ ప్రసాదించిన సరికొత్త కానుక.

యశోదాదులు బాలకృష్ణుడిలో భగవంతుణ్ణి చూశారు ాని, లోగడ లోకంలో ఎవ్వరూ అమ్మలాగా ప్రతివ్యక్తిలోను తమ బిడ్డను చూసి ప్రేమించ లేదు. లోకంలో ఇదొక మధురమైన భావన; మనోహరమైన ఆరాధన.

అమ్మ మౌనముద్రాంకిత అనుకుంటారు, అమ్మను దర్శించినవారు. మౌనానికి అమ్మ చక్కని నిర్వచనం ఇచ్చింది - మౌనం అంటే మాట్లాడక పోవడం కాదట. అనవసరంగా మాట్లాడకపోవడం

అమ్మ సంభాషణాచతుర. వాదకుశల అమ్మ చాల మృదువుగా మాట్లాడు తుంది. చాలా స్ఫుటంగా మాట్లాడుతుంది.

అమ్మ యే విషయం వివరిస్తున్నా - విషయం గంభీరంగా, అర్థవంతముగా, ఉండటమేగాక ఆ వాక్కులోని సౌందర్యగరిమ మనను మంత్ర ముగ్ధలను చేస్తుంది.

మనకు సమ్మతం కానిది చెబుతూ కూడా - "మనచేత" అవును, అంతేకదా, అని తల పంకింపచేయగల వాదనా పటిమ అమ్మది.

అమ్మ లౌకిక విషయాల మీద చెప్పిందీ, అలౌకిక విషయాల గురించి చెప్పిందీ, ప్రహతమయిన వేద, వేదాంత విషయాలను చెప్పింది; క్లిష్టంగా ఉన్న

ఉపనిషత్ సూత్రాలను సరళసుందరంగా చెప్పింది. ఉపనిషత్తులను, శాస్త్రాలను అధిగమించి కొత్త విషయాలనూ వెల్లడించింది.

చమత్కారంగానూ చెప్పింది.

సమర్థంగానూ చెప్పింది

వింటే - "అమ్మ చెబితేనే వినాలి" - అన్నట్లుగానూ చెప్పింది.

ఒకసారి డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు రాజమండ్రిలో ఒక సభలో - అమ్మ పునర్జన్మలు లేవన్నది అని చెప్పారు. ఆ సభలోని పండితులు వెంటనే వారిపైకి దెబ్బలాటకు వచ్చారు డాక్టరుగారు వారిని అమ్మ వద్దకు ఆహ్వానిస్తే, అమ్మను దర్శించుకొనేందుకు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ వద్ద మళ్ళీ పునర్జన్మ ప్రస్తావన రానేవచ్చింది. అమ్మ తన వాదాన్ని తన సహజ సుందరమైన శైలిలో వినిపించింది. వారు ఆసక్తిగా విని "అంతేకదా అమ్మా, పునర్జన్మలు ఎక్కడ వున్నాయి. ఉండటానికి అవకాశం లేదు" అంటుంటే డాక్టరుగారు ముసిముసిగా నవ్వుకున్నారు

అటువంటి ఎన్నో మధురాతి మధురమయిన సంఘటనలు అమ్మ వాక్చాతుర్యానికి తార్కాణాలు.

ఒకసారి ప్రొద్దుటూరులో ఒక సంప్రదాయ వేదాంతి. అమ్మతో వాదన చేసి అమ్మను ఓడించి అవహేళన చేయాలని ఉత్సాహపడుతుంటే అమ్మ అన్నది "తల్లీ బిడ్డల నడుమ పోటీ యేమిటి ? నీకు తెలిసింది నీవు చెప్పు, నేను తెలుసుకుంటాను, నేను చూసింది నేను చెబుతాను. అందులో నీకు తెలియనిది ఉంటే నీవు తెలుసుకో" - అని.

చర్చ జరిగింది. రసవంతంగా జరిగింది. తుదకు ఆ వితండవాది తల వంచి అన్నారు "అమ్మది సమాధి భాష, అనుభవమే అమ్మకు ఆధారం అమ్మకు శాస్త్ర పరిచయం కనిపించడం లేదు. నాకు అనుభవం లేదు, నాది శాస్త్ర పాండిత్యం, ఈ రెంటికి మధ్య పోటీ కుదరదు, మందారపువ్వుకు, మామిడికాయకు పోటీయేమిటి?" అమ్మ మాటల్లోని మర్మాలు అర్థం చేసుకోవడానికి నాకు కొంత వ్యవధి కావాలి. కొంతకాలం తరువాత జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించు కుంటాను - అని చెబుతుంటే మాకు ఆనందం ఆశ్చర్యం కలిగాయి

ఎందరో అమ్మతో శాస్త్ర చర్చలు చేశారు. అందరి అనుభవాలు ఈ విధంగానే ఉన్నాయి. ఒకరయితే "శాస్త్రం చదువుకో" అని గద్దించారు కూడా.

అమ్మకు ప్రాథమిక పాఠశాల చదువు కూడా లేదు. శాస్త్రాలు వల్లించ లేదు. వేదాంత గ్రంథాలు పఠించలేరు. అమ్మకు స్వానుభవమే ప్రమాణం. అందుకే అమ్మ అంటుంది - "శాస్త్రం అనుభవాన్ని ఇవ్వలేదు నాన్నా. అనుభవమే శాస్త్రాన్ని ఇస్తుంది" -- అని.

అమ్మ - అనుభవ ఖని.
వాగమృత ధుని.

అమ్మ గురించి, అమ్మ తత్వబోధన గురించి తగినంత సాహిత్యం లోకానికి ఇంతవరకు అందకపోవడం దురదృష్టకరం. అమ్మ సాహిత్యపు లోతులకు వెళ్ళి అమ్మను అధ్యయనం చేసిన ఎవరికైనా అమ్మ ప్రవచనం చేసిన వేదాంతసారాన్ని, లోకానికి అందించాలని అభిలాష కలగడం సహజం, ఇక అమ్మవద్ద ఎంతోకాలం ఉండి, ఎన్నో రాత్రులు అమ్మసన్నిధిలో నిద్రలేకుండా గడిపి, ఎన్నో అర్థవంతమైన సంభాషణలు విన్న జిజ్ఞాసువు శ్రీ కోన వెంకటేశ్వరరావు అమ్మను గురించి ఈ గ్రంథం వెలువరించడంలో ఆశ్చర్యం ఏముంది ?

ఈ గ్రంథం లోకానికి ఒక కానుక. ఆధ్యాత్మిక సరస్వతి. ఒక రత్నహారం.

అమ్మ సేవకు, సంస్థ సేవకు తన జీవితాన్నే ముడుపు కట్టిన త్యాగశీలి, నిర్మలచిత్తుడు, నిరాడంబరుడు, జిజ్ఞాసువు, మేధావి, దృఢదీక్షాపరుడు, పరోపకార పరాయణుడు శ్రీ వెంకటేశ్వరరావు, ఈ ఉత్తమ గ్రంథరచనకు ఎంతైనా అర్హుడు.

ఏ విషయాన్నైనా, పక్షపాత రహితంగా, లోతుగా అధ్యయనం చేసి, కూలంకషంగా పరిశీలనచేసి, నిర్దుష్టంగా విశ్లేషించి, సూటిగా వివరించగల్గిన ఈ యువకుని పదునైన పచ్చని కలం నుండి ఎన్నో ఉత్తమ రచనలు వెలువడాలని మనసారా కోరుకుందాం. శ్రీ కోనా వెంకటేశ్వరరావు రచించిన గ్రంథానికి ఇది పీఠిక.

(ఫిబ్రవరి 1996)



# 211
# సహకార వాద్యం

అమ్మ - మమతల సమవాటిక
మహిమల మణిపేటిక

అమ్మ - మమతల కలకండ
మహిమల విరిదండ

"మహిమలనే రవ్వలు పొదిగిన మమతల బంగారు గొలుసు - అమ్మ జీవితం" అనిపిస్తుంది.

అమ్మ జీవితం అపార మమకార పారావారమైతే అందులో ఉవ్వెత్తున లేచిన కెరటాలు అమ్మ మహిమలు. సాగరంలో కెరటాలు పుట్టటం ఎంత సహజమో అమ్మ వల్ల మహిమలు కూడా అంత సహజసుందరంగా జరుగుతాయి. కొందరు మహాత్ములు తప్పుదారిన నడిచే ప్రజలను తమవద్దకు ఆకర్షించి వారిని దైవాభిముఖం చేయటంకోసం మహిమలు ప్రకటిస్తే - అమ్మ కేవలం తన సంతానం కష్టాల సుడిగుండంలో చిక్కి గిలగిలా తన్నుకునే సమయాల్లో మాత్రమే పరమ దయతో వారిని ఒడ్డు చేర్చటం కోసమే మహిమలను చేసినట్లుగా అమ్మ చరిత్ర మనకు చెబుతున్నది. విలాసంగా, వినోదం కొరకు ఇతరులను తన వైపుకు తిప్పుకోవటం కొరకు గానీ, ఇతరుల నుండి తాను మెప్పును పొందటంకోసం కానీ అమ్మ ఎప్పుడూ ఏ అసాధారణ క్రియనుగానీ, మానవాతీత చర్యనుగానీ, ప్రదర్శించక పోవటం గమనార్హం.

మహిమల ప్రకటనకు అమ్మ వ్యతిరేకి. ఒకసారి ఒక సాధువు అమ్మ వద్దకు వచ్చి అరచేతిలో కర్పూరాన్ని సృష్టించి, హారతి ఇచ్చినప్పుడు అన్నది "పావలా పెడితే కర్పూరం వస్తుంటే ఈ ప్రదర్శనలు ఎందుకూ ?" అని.

ఆధ్యాత్మిక శక్తి ముందు ఈ మహిమలు అత్యల్పాలు'' అని అమ్మ భావన అమ్మ ఆధ్యాత్మిక శక్తి సాగరం అమ్మ వల్ల అద్భుతాలు జరిగాయి కానీ, అమ్మ అద్భుతాలు చేయలేదు.అమ్మ వల్ల మనమేదయినా, ప్రకృతి నైజానికి అతీతమైన ప్రయోజనం పొందినపుడు అమ్మకు మన కృతజ్ఞత తెలుపుకుంటే - అమ్మ నుండి వెంటనే వినిపించే వాక్యం ఏమిటంటే ''నాదేముంది నాన్నా ? ఆ తరుణం వచ్చింది ఆపని జరిగింది. ఇందులో నాగొప్పఏముంది ? నాకేమీ తెలీదు'' అని అతి నిర్లిప్తంగా, అత్యంత నిరాడంబరంగా అంటుంది.

సూర్యోదయం కాగానే కమలం విచ్చుతుంది. ఆ సంగతి సూర్యునికి తెలియాలా ? చంద్రోదయం కాగానే కలువ వికసిస్తుంది. ఆ విషయం చంద్రునికి తెలియాలా ? దీపం వెలిగితే చీకటి పారిపోతుంది. ఆ పరిణామం దీపానికి తెలియాలా ? అవసరం లేదు. అమ్మ మహిమల సంబంధమూ అంతే.

అమ్మ స్పర్శవల్ల, అమ్మ ఉనికివల్ల, అమ్మ దృష్టిపాతంవల్ల, అమ్మ వాక్యంవల్ల, అమ్మ సంకల్పంవల్ల అనేక అద్భుతాలు వాటంతట అవే జరుగుతుంటాయి 1974 జనవరిలో వసుంధరక్కయ్య తన అనారోగ్యకారణంగా గుంటూరులో ఉన్నని. ఆ సమయంలో అమ్మ రాయలసీమ పర్యటనలో ఉన్నది. దురదృష్టవశాత్తు అక్కయ్యకు మంచంలో నుండి లేవలేని దుర్భరస్థితి వచ్చింది. డా. ఎస్.వి. సుబ్బారావుగారి సలహాననుసరించి అక్కయ్యను గవర్నమెంటు ఆసుపత్రిలో న్యూరోసర్జన్‌కు చూపిస్తే అక్కయ్య పూర్తి విశ్రాంతి తీసుకోవాలని చెప్పాడు. అంతలో పరిస్థితి మరింత విషమించింది. ఆర్థోపెడిషీయన్‌కి చూపిస్తే - కాలి ఎముకలకు క్షయ వచ్చిందని చెప్పి, వెంటనే ఆపరేషన్ చేయించకపోతే రెండవ కాలికి కూడా ఆ జబ్బు వ్యాపిస్తుందని, ఇక అక్కయ్య శాశ్వతంగా మంచంలో ఉండిపోవాలని హెచ్చరించారు. అక్కయ్య భయపడి పోయింది డాక్టరు సుబ్బారావు గారికి తెలిసి ఆందోళన చెందారు అమ్మకు చెప్పకుండా ఆపరేషన్ చేయించుకోవటానికి అక్కయ్య ఇష్టపడలేదు కారులో పడుకోబెట్టుకుని డాక్టరుగారు ఆమెను మదనపల్లెకు తీసుకువచ్చారు. అపుడు అమ్మ మదనపల్లెలో ఉంది. నడవలేని అక్కయ్యను తీసుకువచ్చి లోపల పడుకోబెట్టారు.

మదనపల్లెనుండి హార్సిలీ కొండలకు వెళ్ళే ముందు అమ్మ స్నానం చేస్తున్నది. మేము అక్కయ్య వచ్చిన వార్తను అమ్మకు తెలియజేశాము అక్కయ్య అమ్మకు అంతరంగిక పరిచారిక. అమ్మకు కావలసిన సేవలన్నీ స్వయంగా చేస్తూ - తనను

తాను అమ్మ పాదాలకు అంకితం చేసుకున్న నిస్వార్థమహోన్నతవ్యక్తి. అందువల్లనే అమ్మ 1966 మే 5వ తేదీన - ఆమెను వేలాది జనం సమక్షంలో మంగళవాద్యాల నడుమ, ఆమె మెడలో మంగళసూత్రం కట్టి, తలంబ్రాలు పోసి శాస్త్రబద్ధమైన కల్యాణం చేసుకుని లోకాన్నే సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తింది

కళంకరహితమైన మనస్సును కళంకరహితంగా మరొకరికి అర్పణ చేయటమే కల్యాణమని కదా - అమ్మ అపూర్వనిర్వచనం !

అక్కయ్య ఉన్న గదిలోకి వచ్చింది అమ్మ. లేచి నిలుచోవటానికి ఆమె ప్రయత్నం చేసి విఫలమైంది. అమ్మ ఆమె వద్దకు వచ్చి - చేతిని పట్టుకుంది. ఆమెలేచి నిలుచున్నది అమ్మ ముందుకు సాగింది, అక్కయ్య చెయ్యి వదిలి పెట్టకుండా 'నేను నడవలేనమ్మా' అని ఆమె చెబుతున్నా - చెయ్యి విడవకుండా అమ్మ - కారు వద్దకు వెళ్ళింది. అక్కయ్యను కూడా కారు ఎక్కమంది అమ్మ. ఆమె ఎదురు మాట్లాడలేక కారు ఎక్కి కూర్చుంది.

హార్సలీ కొండల్లో ఎగుడు దిగుడు రోడ్లపై - అమ్మ వెంట అక్కయ్య కూడా నడవక తప్పలేదు. ఆ నడకలో ఆ ఎముకుల ఏమి స్థితి పొందాయో, ఎలా బలోపేతం అయ్యాయో - అదొక విచిత్రమైన, ఎవరికీ అర్థంకాని దివ్యమయిన చికిత్స

ఈ సంఘటన జరిగింది - 1974 ఫిబ్రవరి 4వ తేదీ, ప్రఖ్యాతమైన వైద్యులు ఆపరేషన్ చేసినా అక్కయ్య మామూలుగా నడవగలుగుతుందని హామీ ఇవ్వలేదు ఇక, ఏ చికిత్స, ఏ ఆపరేషన్ అవసరం లేకపోయింది. అమ్మ స్పర్శతో, లేక సంకల్పంతో అక్కయ్యకు పూర్తి స్వస్థత చిక్కింది. ఈ రోజుకూ అక్కయ్య - ఆ విషయంలో మరే కంప్లయింటూ లేకుండా హాయిగా నడుస్తూ, తన పనులు తాను చేసుకుంటూ ఇతరులెందరికో సేవచేస్తూ - అమ్మ అనంత శక్తికి ఉదాహరణయై నిలిచింది.

విశాఖపట్నం నివాసి శ్రీ కె. శేషసాయి. అతనికి కడుపులో అల్సర్ పుట్టింది కె.జి. హాస్పిటల్లో ప్రసాదరావుగారనే ఒక సర్జన్‌కు చూపించారు. వారు ఆపరేషన్‌కు తేదీ నిర్ణయించారు.

శ్రీ శేషశాయి అమ్మ భక్తుడు. అమ్మకు చెప్పి అనుమతి తీసుకుని వస్తానని జిల్లెళ్ళమూడి వచ్చాడు. అమ్మ శేషశాయి పొట్టను చేత్తో తడిమి చూసి ''నాన్నా - నీకు అల్సర్ లేదు. ఆపరేషన్ వద్దు'' అని సలహాయిచ్చింది అతను సంతోషంగా విశాఖ తిరిగి వెళ్ళాడు. అమ్మ చెప్పిన మాట డాక్టరుగారికి వివరించాడు.

"ఆమె ఎట్లా పరీక్షించింది ? ఎట్లా చెప్పగలిగింది ?" అని డాక్టరుగారు అడిగారు. "అమ్మ ఏ పరీక్షా చేయలేదు. కంటితో చూసింది చేత్తో తడిమింది" అని శేషశాయి చెప్పాడు.

"అమ్మలూ, బాబాలూ ఇలాగే చెబుతారు ఆధారం లేకుండా వాళ్ళమాటలు నమ్మితే మీరు ప్రాణాలు పోగొట్టుకుంటారు. అలా చెప్పగలిగితే - మా ఖరీదైన చదువులూ, మావిలువైన పరికరాలూ ఎందుకు ? బ్రతకదల్చుకుంటే, ఆపరేషన్ చేయించుకో అని డాక్టరుగారు కఠినంగా సలహా ఇచ్చారు.

శేషశాయి ఆపరేషన్‌కి అంగీకరించాడు ఆపరేషన్ జరిగింది డాక్టరుగారు కడుపుకోసి కంచుకాగడాలు వేసి వెదికారు. అల్సర్ ఏదీ ? ఎక్కడా కనిపించలేదు. దాని తాలూకు ఏ చిహ్నమూ కనిపించలేదు.

డాక్టరుగారు విభ్రాంతి చెందారు. పాత ఎక్సురే పరిశీలించారు. దానిలో సుస్పష్టంగా అల్సర్ దర్శనమిస్తున్నది. మరి, ఇప్పుడేమయింది ? వాక్కే ఆపరేషన్‌గా, అమ్మ అనుగ్రహమే ఔషధంగా పనిచేసి - ఆ అల్సర్‌ను నామరూపాలు లేకుండా మాయం చేశాయి. అమ్మ దివ్యశక్తిని స్వయంగా పరికించి, ప్రత్యక్షంగా గ్రహించిన డాక్టరుగారు తర్వాత జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించి, క్షమాపణ కోరి అమ్మ కృపకు పాత్రులయ్యారు.

1980 సెప్టెంబరులో అమ్మకు ఆరోగ్యం సరిగాలేక చికిత్సకోసం హైద్రాబాద్ తీసుకువెళ్ళాము. సత్యా ఎక్సురే క్లినిక్‌లో అమ్మకు ఎక్సురే తీయించగా - ఊపిరితిత్తులో నారింజపండు పరిమాణంలో క్యాన్సర్‌గడ్డ కనిపించింది. ఆ ఎక్సురే చేత పట్టుకొని సోదరులు శ్రీ దినకర్, నేను హైద్రాబాద్‌లోని ప్రఖ్యాత డాక్టర్లెందరినో సంప్రతించాము. అందరూ ఒకే మాట చెప్పారు. వెంటనే అమ్మను అమెరికా తీసుకువెళ్ళి ఆపరేషన్ చేయిస్తే - అమ్మ కొంత కాలం బ్రతుకుతుందేమో కానీ లేకపోతే బ్రతకటానికి ఏమాత్రం అవకాశాలు లేవని బల్లగుద్ది చెప్పారు.

మేము అమ్మను అమెరికా తీసుకుని వెళ్ళగలమా ? అందుకు ఎంత డబ్బు కావాలి ? దానిని మేము సమకూర్చుకోగలమా ? అశక్తులమై మేమిద్దరము ఒకరాత్రి పూర్తిగా కంటికి కడివెడు కన్నీళ్ళుగా దుఃఖించాము.

మరునాటి ఉదయం అమ్మ మమ్మల్ని అడిగింది గతరాత్రి కనిపించలేదేమని, మేమేదో అసత్యాలు చెప్పాము. కానీ అమ్మ వాటిని విశ్వసించక మమ్మల్ని నిలవేసింది. అపుడు మేము మా భయాందోళనలనూ, మా అశక్తతనూ వ్యక్తం చేశాము. అపుడు

అమ్మ వెంటనే అన్నది- "నాకు క్యాన్సర్ లేదు; రాదు. మీరేమీ భయపడకండి" అని. నేను రాత్రి డాక్టర్లందరినీ సంప్రతించిన సంగతీ, వారి స్థిర అభిప్రాయం చెప్పాను

వాటిని అమ్మ నిర్ద్వంద్వంగా ఖండించింది. ఈ విధంగా రెండు రోజులు చర్చల్లో గడిచాయి. మా వాదనను బలపరుచుకోవటం కోసం అమ్మకు ఎక్సురే చూపించాము. అది తప్పు అన్నది అమ్మ. అయితే మళ్ళీ తీయిద్దాము - అన్నాము. అమ్మ 'స' నన్నది. ఎక్సురే తీయించాము అందులో ఏ క్యాన్సరూ కనిపించలేదు మరి ముందటి ఎక్సురేలో ఉన్న క్యాన్సరు గడ్డ ఏమైనట్టు' గడ్డ అమ్మ సంకల్పబలం వల్ల చికిత్స లేకుండానే మాయమైంది.

అమ్మ యోగేశ్వరి. అమ్మకు తన శరీరం మీదా ఇతరుల శరీరం మీద కూడా అనిర్వచనీయమైన ఆధికారం ఉన్నట్లు అనేక సంఘటనల్లో రుజువయింది. శరీరం మీదేకాదు. తన మనస్సుమీద, ఇతరుల మనస్సుమీద కూడా అంతే. ఆ యోగశక్తి అనేక రూపాల్లో, అనేక సమయాల్లో మహిమలుగా, అద్భుతాలుగా, వింతలుగా, విచిత్రాలుగా, ప్రకృతిపై విజయాలుగా అభివ్యక్తమై అనేకులకు అనేక ఉపకారాలు చేసి లోకాన్నే విస్మయపరచింది. అమ్మ పంచభూతాత్మకమైన ప్రకృతిపై కూడా ఎదురులేని తన అధికారాన్ని ప్రదర్శించింది.

ఏలూరు సోదరుడు శ్రీ టి.టి. అప్పారావుగారి ఆహ్వానంపై శ్రీ పద్మనాభుని వెంకటరత్నంగారు 1974 జనవరి 1వ తేదీన జిల్లెళ్ళమూడి వచ్చారు. వారు అమ్మను దర్శించుకుని వెనుతిరిగి వెళుతుంటే ఆ రాత్రికి ఉండమని చెప్పాడు అప్పారావు మరునాడు ఉదయం అభిషేకం చేసుకొనటానికి, అమ్మ కూడా "ఉండు నాన్నా" అన్నది. వెంకటరత్నంగారికి చన్నీళ్ళస్నానం అలవాటు లేదు. మరునాడు ఉదయం ఆశ్రమంలో వేడినీళ్ళు ఎవరిస్తారు ? ఆ విషయమై ఆయన ఆలోచనలో పడటం గమనించిన అమ్మ "పర్వాలేదు లే నాన్నా - ఉండు" అన్నది మళ్ళీ ఆ కంఠంలో శాసనం ధ్వనించగా ఆయనకు ఉండక తప్పలేదు.

మరునాడు ఉదయం లేచి స్నానం చేయటానికి నీటి పంపులవద్దకు అప్పారావు అన్నయ్యతో కలిసి వెంకటరత్నంగారు వెళ్ళారు. చన్నీళ్ళను తలుచుకుంటూ, గజగజ వణుకుతూ, పంపువద్ద బకెట్ పెట్టారు. బకెట్‌లో పడేనీళ్ళు ఆవిరి కక్కుతున్నాయి. చెయ్యి పెట్టి చూశారు. నీళ్ళు వెచ్చగా మసిలిపోతున్నాయి. "అప్పారావూ ? నాకోసం వేడి నీళ్ళు ఏర్పాటుచేశావే !" అన్నారు. వెంకటరత్నంగారు, కృతజ్ఞతనిండిన కంఠంతో

వేడినీళ్ళు ఏమిటి ? అని అదిరిపడ్డాడు అప్పారావు అన్నయ్య.

"పంపులో వేడినీళ్ళు వస్తున్నాయి" అని వెంకటరత్నంగారు అన్నారు

నిజమే - వెంకటరత్నంగారి పంపులో వేడినీళ్ళు వచ్చాయి. అప్పారావుగారి పంపులో చన్నీళ్ళే వచ్చాఇయ. రెండు పంపులు ఒకే నీటి గొట్టానికి అమర్చబడి ఉన్నాయి. పక్క పక్కనే ఉన్న ఒక పంపులో వేడినీళ్ళూ, మరొక పంపులో చన్నీళ్ళూ రావటం లా సాధ్యం ? కానీ - ఆనాడు అవింత జరిగింది.

1960కి పూర్వం అమ్మ ఒక పాదం వెచ్చగా ఒక పాదం చల్లగా ఉడటం కొమ్మూరు డాక్టరు శ్రీ అనంత శీతాచలంగారు అనేక పర్యాయాలు గమనించారు.

1958 ఫిబ్రవరి 4వ తేదీ మాఘపర్ణిమ. దేశిరాజు రాజమ్మగారి కోరికమేరకు - ఆనాడు ఉపదేశం చేయటానికి సంకల్పించింది. అందుకోసం ఆనాడు వెయ్యి మంది భక్తులు వచ్చారు. ఆ తెల్లవారు జామున అమ్మతోపాటు కాలినడకన అందరూ జిల్లెళ్ళమూడి గ్రామానికి దక్షిణదిశలో ప్రవహించే ఓంకారనదికి వెళ్ళారు. ఉపదేశం చేయటం షుమారు 4 గంటలకు ప్రారంభమయింది. ఆ రోజున అమ్మ 600 మందికి ఉపదేశం చేసింది. ప్రతి ఒక్కరికీ ప్రార్ధన. ధ్యానశ్లోకం చెప్పి మంత్రం చెప్పింది అవసరమయిన వాళ్ళకు మంత్రార్ధాన్ని వివరించింది అంటే ఒక్కొక్కరి కోసం అమ్మ సుమారుగా ఒక నిముసం తీసుకుందని అంచనా ఆ కార్యక్రమం మొత్తానికి 10 గం॥లు పట్టి ఉండాలి. మామూలుగా మధ్యాహ్నం 2 గంటలకు అమ్మ వాగు ఒడ్డుకు చేరి ఇంటికి తిరిగి వచ్చింది.

ఆ రోజున అక్కడ ఉన్న వెయ్యి మంది - అమ్మ సూర్యోదయాన్నే ఆపివేసింది అని ఆశ్చర్యపోయారు మహాపతివ్రత సుమతి కథను జ్ఞాపకం చేసున్నారు.

పతిని ఆధారం చేసుకుని పంచభూతాలను జయించినదే పతివ్రత - అని అమ్మ నిర్వచనం.

సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి - అని మరొక ప్రవచనం.

ఆ రెండు వాక్యాలు అమ్మ కిరీటంలో మెరిసే రెండు మాణిక్యాలు.

ఆ సంఘటనకు నేటికీ ఎందరో ప్రత్యక్షసాక్షులున్నారు. వారిలో వసుంధరక్కయ్య, రుక్మిణక్కయ్యకూడా ఉన్నారు.

1970 జనవరిలో గుంటూరు హిందూకాలేజీ ప్రాంగణంలో అమ్మ దర్శనం ఏర్పాటయింది. ఆనాడు చంద్రమౌళి నగర్‌నుండి హిందూకాలేజీ వరకు ప్రత్యేకంగా

అలంకరింపబడ్డ రథంపై అమ్మకు ఊరేగింపు. ఊరేగింపులో దాదాపు లక్షమంది పాల్గొన్నారు. ఊరేగింపు అమరావతి రోడ్డు వరకు వచ్చేసరికి తీవ్రమైన ఎండ వచ్చింది. రథంపై కూర్చున్న అమ్మకు ఎండ చురుకుగా తగలటం గమనించిన ఒక స్థానిక సోదరుడు గొడుగు తెచ్చివాకు ఇచ్చాడు. నేను అమ్మ పక్కనే నిల్చుని గొడుగు పట్టడానికి ప్రయత్నిస్తున్నాను. ఏమిటి - అన్నది అమ్మ. నాప్రయత్నం వివరించాను.

మరి, ఈ లక్షమందికి గొడుగులు తెప్పిస్తావా ? - అని నవ్వింది అమ్మ

లక్షగొడుగులా - అంటు నేను నివ్వెరపోయాను. అమ్మ ఆకాశం వంక చల్లగా చూసింది. ఎండ మాయమయింది. ఆకాశం విప్పిన గొడుగయింది. ఊరేగింపులో పాల్గొన్న నరనారీ జనసందోహం వెన్నెల్లో కలువలైపోయారు.

హైదరాబాద్ వద్ద గల బి.హెచ్.ఇ.ఎల్. రామచంద్రాపురంలో సోదరులు శ్రీ కొండేపూడి సూర్యానారాయణగారి అధ్వర్యంలో ప్రతిశుక్రవారం రాత్రి వారానికి ఒక భక్తుని ఇంట్లో అమ్మకు పూజ, భజన, నివేదన జరుగుతాయి.

ఒకసారి సర్వశ్రీ శాస్త్రి, సుబ్బారావు, రామమూర్తి ప్రభు సోదరులు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ వద్ద మూడురోజులు గడిపి అనందానుభూతిని పొందాలనే కోరికతో.

వారికి దర్శనం చెయించి - ఆ రాత్రికి అమ్మ పడుకున్న వరండాలోనే వారిని కూడా పడుకోమని చాపలు ఇచ్చాను. అమ్మతో మాట్లాడాలని వారికి కుతూహలం కలిగింది.

వారిలో ఒకరు అన్నారు - ఇప్పుడు మా ఊళ్ళో అమ్మ పూజ జరుగుతూ ఉంటుందమ్మా అని. అప్పుడు రాత్రి 10 గంటలయింది.

వెంటనే అమ్మ లేచి కూర్చుని "కాదు నాన్నా - ఇవ్వాళ తొమ్మిదిన్నరకే పూజ, భజన అయిపోయినయి అన్నది.

"ఇవ్వాళ సూర్యనారాయణకు ఒంట్లో బాగాలేదు. బాగా టెంపరేచర్ వచ్చింది. అందువల్ల త్వరగానే ముగించారు" అన్నది అమ్మ.

అమ్మ మాటలను నమ్మలేనట్లుగా వారు అమ్మ వంక చూశారు.

"ఇవ్వాళ శనగగుగ్గిళ్ళ చేశారు. వాటిలో ఉప్పు ఎక్కువయింది అందువల్ల వాటిని తినలేక రోడ్డుమీద ఉమ్మేస్తూ అందరు వెళుతున్నారు" - అని వివరించింది అమ్మ.

అమ్మ తమకు కాశీమజిలీకథలు చెబుతున్నట్లు భావించారు. ఒకరి చెవులు ఒకరు కొరుక్కున్నారు.

మూడురోజులు ఉందామని ఆసక్తితో వచ్చిన ఆ సోదరులు మరునాడు ఉదయమే ప్రయాణమైనారు

ఎందువల్ల ? - అని అడిగాను.

అమ్మ అసత్యాలు తమకు రుచించలేదు. అని వెళ్ళిపోయారు.

రామచంద్రపురం వెళ్ళగానే, అమ్మ యెడల తమ నిరసన ప్రకటించటానికి వారు సూర్యనారాయణగారి ఇంటికి వెళ్లారు. శుక్రవారం రాత్రి జరిగిన పూజను ప్రస్తావించారు.

విచిత్రం ! అమ్మ ఏ అక్షరాలు పలికిందో, సూర్యనారాయణ ఆ అక్షరాలనే పలికాడు.

వాళ్ళనెత్తిన ఒక్కసారి వెయ్యి పిడుగులు పడినట్లు అయింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. శరీరాలు భయకంపితులై స్వేదంతో తడిసిపోయాయి.

ఎదురుగా గోడనున్న అమ్మ ఫోటో వద్ద వారు సాగిలపడి చెంపలు వాయించుకుని క్షమాపణ చెప్పుకున్నారు.

ఒకనాడు శేషగిరిరావు అన్నయ్య అమ్మను, అడిగాడు "మద్రాసు మవుంట్ రోడ్డులో నీ నామం స్మరిస్తూ వెళుతున్న భక్తుడు నీకు ఏమనిపిస్తాడు ?" అని.

అమ్మ అన్నది - "నా ఎదురుగా నడిచి వెళుతున్నట్లు ఉంటుంది" అని.

అమ్మకు దగ్గర, దూరం లేదు. అమ్మ సర్వవ్యాపిని కదా !

ఒకసారి వసుంధరక్కయ్య అమ్మను అడిగింది - మా ఆలోచనలు నీకెట్లా తెలుస్తాయమ్మా ? - అని.

"మీరు నేను కాకపోతే గదా" అని ఒకసారి "నా ఆలోచనలు నాకు తెలియటంలో విశేషం ఏముందీ ?" అని మరొకసారి పలికిన అమ్మ సమాధానంలో అమ్మ సర్వజ్ఞత్వం రహస్యం నిక్షిప్తమై ఉంది.

అమ్మ భావజ్ఞ, కృతజ్ఞ. మనందరి అన్ని చేతలూ, అన్ని ఆలోచనలూ అమ్మకు తెలుసు. అందుకు కారణం - అందరితో అమ్మకు గల తాదాత్మ్యస్థితియే. దీనినే

విశ్వతాదాత్మ్యస్థితి అంటున్నాం. ఇదే యోగానికి పరాకాష్ఠ! అమ్మ యోగపరమేశ్వరి. ఆ స్థితిలో పలికిన పదబంధమే - "నేను నేనైన నేను" అని. ఈ అపూర్వ ప్రకటన పరంజ్యోతి నుండి వెలువడ్డ తేజఃపుంజం.

1973 ఏప్రిల్ 12వ తేదీ అమ్మ స్వర్ణోత్సవం. లక్షమందికి - ఆ రోజున ఒక్క పంక్తిలో భోజనం ఏర్పాటయింది కానీ ఉదయం 10 గం.కు అవిచ్ఛిన్నంగా జనప్రవాహాలు వస్తూ కార్యనిర్వాహకులకు ఆలోచనను, ఆందోళనను రేకెత్తించాయి. నేల ఈనిందా అన్నట్లు ఎటుచూసినా క్రిక్కిరిసిన జనసమూహాలు. ఉన్న బియ్యం వండాము. వచ్చే జనానికి అన్నం సరిపోయేటట్లు లేదు. శ్రీ అన్నం రాజు రామకృష్ణారావుగారిని పిలిచి బాపట్ల నుండి ఒక లారీ బియ్యం తీసుకురమ్మని చెబుతున్నాను. మా సంభాషణను అమ్మ గమనించి, మమ్మల్ని దగ్గరకు పిలిచి ఏమిటీ ? అని అడిగింది. నేను విషయం చెప్పాను. వెంటనే అమ్మ అన్నది - "మనుషులను చూసి బియ్యం కొంటే మనం ఉత్సవం చెయ్యగలమా ? వంట చేసినంత వరకు చాలులే. నేను స్నానం చేసి వస్తాను. పద -" అన్నది. ఆ రోజున లక్షా ఎనభైవేలమంది తృప్తిగా భోజనం చేశారు. ఇంకా అన్నంరాసులు మిగిలాయి. పశువులు, పక్షులు, క్రిమికీటకాలు తిన్నాయి. అవీ అమ్మకు బిడ్డలే వాటికీ ఇవ్వాళ పండగే కదా. అని అమ్మ మురిసిపోవటం మనం మరిచిపోలేని సంఘటన.

1960కి పూర్వం - తనను చూడటానికి వచ్చిన జనానికి అమ్మ స్వయంగా వండి పెట్టేది. రోజూ నలభై యాభై మంది వచ్చినా అమ్మ చిన్న గిన్నెతో మాత్రమే వండి అందరకు పెట్టేది. అది ఎట్లా సాధ్యం ? - అని అమ్మను ప్రశ్నిస్తే "వాళ్ళు కడుపునిండా తినక కొద్దిగా మాత్రమే తింటున్నారు. అందువల్ల ఎక్కువమందికి తక్కువ అన్నం మాత్రమే ఖర్చవుతున్నది" అని చెప్పి అమ్మ నవ్వేసేది. వచ్చిన వాళ్ళను అడిగితే, "మేము మా ఇళ్ల వద్దకంటే ఇక్కడనే ఎక్కువ తింటున్నాము. అమ్మ స్వయంగా వడ్డిస్తుంటే" అని సమాధానం చెబుతారు.

ఇట్లా ఎన్ని సంఘటనలు జ్ఞాసకం చేసుకుంటూపోతున్నా - అవి అనంతంగానే ఉంటాయి.

అమ్మను ఆరాధించే వ్యక్తులు, కుటుంబాలు అసంఖ్యాకంగా ఉన్నట్లు మనకు తెలుసు. అందరి జీవితాల్లో ఇటువంటి మహిమోపేత సంఘటనలు ఎన్నో ఉన్నాయి. వాటిని సంపాదించి ఒక బృహత్ గ్రంథాన్ని ప్రచురించాలని నాకు చాలాకాలం నుండి గాఢమయిన ఆకాంక్ష. కానీ నా కాంక్ష కార్యరూపం ధరించకుండానే కాలం పరుగెత్తి పోతున్నది.

ఇంతలో సోదరి శ్రీమతి అయ్యగారి కుసుమ 'దివ్యానుభూతులు' అన్న నామంతో ఒక గ్రంథాన్ని వెలువరించటానికి ప్రయత్నించటం నాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది.

శ్రీమతి కుసుమ ఈ పుస్తకాన్ని వెలువరించటంలో ఎంతో ఔచిత్యం ఉన్నది. సోదరి కుసుమ టీచరుగా పనిచేస్తున్నది. తాను పొందిన అనుభవాన్ని అభివ్యక్తీక రించటంలో సిద్ధహస్తురాలు. అనుభవాలు ఉండటం వేరు. వాటిని నలుగురికీ అర్థయ్యేటట్లు విశదీకరించటం వేరు. ఈ కళలో మంచినైపుణ్యాన్ని ప్రదర్శించింది.

శ్రీ అయ్యగారి చక్రవర్తి - కుసుమ కోమల హృదయ సామ్రాజ్య చక్రవర్తి. వాళ్ళది అన్యోన్య దాంపత్యం. వాళ్ళది ఆదర్శమయిన కుటుంబం. వాళ్ళిద్దరూ పూతావులవలె, శబ్దార్థాలవలె, పాలూనీరూవలె కలిసిపోయిన జంట. ఒకరు రాగమై, ఒకరు తాళమై పరవశులై పాడుకున్న భక్తి గీతం ఆ జంట, ఒకరు అమ్మ గుడిలో మౌనంగా వెలిగే దీపమయితే, మరొకరు మృదుమధురంగా నినదించే గుడిగంట.

వారి కుటుంబం ఆర్థికపరమైన సుడిగుండంలో చిక్కినప్పుడు - వారు కనపర్చిన స్థిరచిత్తం, స్థితప్రజ్ఞ అరుదైనవి. అటువంటి క్లిష్ట పరిస్థితిలో వారి వెంట ఉండి అడుగడుగునా వారికి చేయూతనిచ్చి, వారిని ఒడ్డుకు చేర్చిన అమ్మ ఆకుంటుంబానికి ఆరాధ్యదైవం - కూర్మినెచ్చెలి, మార్గదర్శిని. మంచి చెడ్డలను ఎప్పటి కప్పుడు తెలియచెప్పిన గురువు.

వాళ్ళ జీవితాల్లో అమ్మ పడుగుపేకలవలె పెనవేసుకుపోయిందనటంలో అతిశయోక్తి లేదు. వాళ్ళ జీవితాలనుండి అమ్మను విడదీయలేని మధురమయిన బంధం వాళ్ళది. అమ్మ స్ఫురణ, అమ్మ స్మరణ లేకుండా వాళ్ళ ఇంట్లో ఒక్క గడియ గడవదు. అమ్మ భక్తులకు వారిల్లు దేవాలయం.

కష్టాల్లో ఎవరయినా - భగవంతుడి యందు భక్తి శ్రద్ధలతోనే మెలుగుతారు. ఏరుదాటిన తర్వాత తెప్పను మరిచి పోనివాళ్ళే ఉత్తములు.

ఇన్నాళ్ళు అమ్మ దివ్యత్వపు వెలుగులో పులకించి పోయిన ఆ జంట - ఇప్పుడు అమ్మ ఆదేశాన్ని - ఉపదేశాన్ని తమ జీవితాల్లోకి అనువదించుకుని తమ జీవితకేదారాల్లో పుణ్యసస్యాలను పండించుకుని మరింత అమ్మ అనుగ్రహానికి పాత్రులు కావటానికి వారు చేసే నిరంతర ప్రయత్నం లోకానికే మార్గదర్శకం.

నీకున్నది తృప్తిగా తిని - ఇతరులకు ఆదరంగా పెట్టుకో - అని కదా అమ్మ ఉపదేశం !

ఈ గ్రంధాన్ని అలంకరించిన వ్యాసాలే కాక మరెన్నో మహిమాన్వితమయిన సంఘటనలు సోదరీ కుసుమ జీవితంలో ఉండవచ్చు. వాటన్నిటినీ కూడా శ్రద్ధాభక్తులతో అక్షరాల్లో నిబంధించి లోకానికి అందిస్తే ఎందరో భక్తులకు మహోపకారంగా ఉంటుందని భావిస్తున్నాను.

సోదరి కుసుమ 'మహతిని' చేత ధరించి తన దివ్యానుభూతులను రమణీయగీతాలుగా మలిచి మధుర మనోజ్ఞంగా, సరళ సుందరంగా, కుసుమ కోమలంగా ఆలపిస్తుంటే - సహకారాన్ని అందిస్తే బాగుంటుందని ఉబలాటపడ్డాను, తత్ఫలితమే ఈ రచన.

నాకు ఈ అవకాశాన్ని అందించిన సోదరికి కృతజ్ఞుడను.

పరమదయాళువైన అమ్మ - తన అనుగుబిడ్డ అయిన కుసుమపై, వారి కుటుంబ సభ్యులందరిపై - ఎల్లవేళలా తన శుభాశీస్సుల అమృతవర్షం కురిపించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. శ్రీమతి అయ్యగారి కుసుమ రచించిన దివ్యాను భూతులు గ్రంధానికి ఇది పీఠిక.

(28-1-1997)



## అదే ఇది

ఇది (ఈ లోకం) కాకుండా వేరే (దైవం) ఇంకొకటి ఉందని నేననుకోవటం లేదు. ఎక్కడో దేన్నో సాధించాలనే ప్రయత్నం నాకు లేదు. ఈ కనపడుతున్న దంతా, ఈ అందమైన సృష్టి అంతా దైవమే. ఈ కనపడుతున్న అందాన్నంతా చూడకుండా కళ్ళు మూసుకుని ఇంకేదో చూడాలనే దృష్టి నాకు లేదు. అందుచేత మీరందరూ, ఈ కనపడేదంతా అదే నని నా ఉద్దేశం.

\- అమ్మ

# 212
# "ఉన్నదంతా అదే !"

"అమ్మా ! రామకృష్ణ పరమహంస వివేకానందస్వామికి భగవంతుడ్ని చూపించారుట కదా ! మీరూ నాకు చూపించకూడదు ?" అని ఒక సోదరుడు అమ్మను అడిగాడుట.

దానికి అమ్మ సమాధాన మేమిటో గమనించారా !

"కనపడేదంతా వాడే అయినపుడు దేనినని ప్రత్యేకంగా వేలుపెట్టి చూపించమంటావు - నాన్నా !" ఇదీ అమ్మ సమాధానం.

భగవత్ సాక్షాత్కారం కోరిన భక్తుడికి, సత్యదర్శనం కోసంతపించే అన్వేషికి ఇంతకన్నా కావల్సిన సమాధానం మరేమి ఉంటుంది? అమ్మ ఇచ్చిన ఈ సమాధానంలో ఎంతో సౌలభ్యం ఉంది. కనపడేదంతా దైవమే అన్నది

మీకు చీమ కనిపిస్తున్నది, దోమ కనిపిస్తున్నది. బల్లా, కుర్చీ కనిపిస్తున్నాయి. వాటిలో దైవం ఉంది, దానికోసం వెతుక్కోండి - అని మనను ఇబ్బంది పెట్టటం లేదు అమ్మ. అరటిపండు చేతికి ఇచ్చి, వలుచుకుని తినమనలేదు. అరటిపండు తనే వలిచి, మన చేతిలో పెట్టి తినమన్నది. చీమలో, దోమలో కాదు. బల్లలోకాదు; చీమనే, దోమనే, బల్లనే, కుర్చీనే దైవంగా చూడమన్నది. ఇది చాలా సులభం గదా!

ఒక సోదరి - "మీరు మాలో దైవాన్ని చూస్తారమ్మా !" అని అంటే "మీలో కాదు - మీరుగా చూస్తాను" అని సవరణ చేసింది అమ్మ.

"మీరంతా నేనే, మీదంతా నేనే" అని వివరించింది అమ్మ. ఈ సర్వమూ "నేను నేనైన నేను" అంటూ సర్వాత్మభావం ప్రకటించింది అమ్మ.

ఇంతవరకు ఏ ఆచార్యులూ, ఏ ప్రవక్తా, ఇంత తేటతెల్లంగా చెప్పలేదేమో! దైవాన్ని ఇలా అంతటా చూడమని సూచించలేదేమో ! అందుకనే సోదరులు డాక్టర్ శ్రీపాద ఇది అమ్మ సూచించే కొత్తదారి అన్నారు.

అవును - దైవమంటే ఏమిటో అమ్మ కొత్తపద్ధతిలో చెప్పింది.

సంప్రదాయ వేదాంతులు "తత్‌సత్" అన్నారు సత్యమూ, నిత్యమూ అయిన పదార్థం ఇది కాదు, మన కళ్ళముందు కన్పించే చీమా, దోమా, బల్లా, కుర్చీ అనిత్యం, కాబట్టి ఇదంతా సత్యంకాదు అన్నారు. కాని అమ్మ బల్లా, కుర్చీ, చీమా, దోమా అనిత్యం కాదు, నిత్యమే అంటుంది రూపాంతరమే కాని, రూపనాశనం లేదు అంటుంది అమ్మ.

బల్ల విరిగిపోతే కుర్చీ చేయవచ్చు, కుర్చీను చెడగొట్టి బల్లా చేయవచ్చు. ఇది రూపాంతరమే కాని, రూపనాశనం కాదు కదా ! చీమా దోమా చనిపోతే పంచభూతాల్లో కలిపిపోతాయి కాని, నాశం కావు. అందుకే అమ్మ మరణమంటే పరిణామం" అన్నది.

అమ్మ చెప్పే ఈ సత్యం శాస్త్రబద్ధం, విశ్వజనీనం.

విజ్ఞాన శాస్త్రంలోని శక్తి నిత్యత్వ సిద్ధాంతం - శక్తిని సృష్టించలేమూ, నాశనమూ చేయలేము. కాని ఒక రూపంలో ఉన్న శక్తిని మరొక రూపంలోకి మార్చవచ్చును - అని చెప్తుంది. స్విచ్ వేస్తే విద్యుద్దీపం వెలిగి, కాంతి నిస్తుంది. అంతమాత్రాన కాంతిని సృష్టించామని కాదు విద్యుచ్ఛక్తి, కాంతిశక్తిగా మారింది. అలాగే డైనమోలో యాంత్రికశక్తి విద్యుచ్ఛక్తిగా మారితే, మోటారులో విద్యుచ్ఛక్తి యాంత్రిక శక్తిగా మారుతున్నది. ఇలా ఎన్నైనా ఉదాహరణలు చెప్పుకుంటూ పోవచ్చు.

ఈ నిత్యత్వసిద్ధాంతం శక్తికేకాదు; పదార్థానికి వర్తిస్తుంది. ఆ మాటకు వస్తే పదార్థమూ - శక్తీ వేరుకాదు. ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ ప్రవచించిన ద్రవ్య, శక్తి తులత్యతా నియమం ప్రకారం పదార్థమూ శక్తీ ఒకటే ! ఆటంబాంబు హైడ్రోజన్ బాంబులలో పదార్థం శక్తిగా మారి విడుదలవుతుంది, విశ్వకిరణాల జల్లులో శక్తి ద్రవ్యకణాలుగా పరిణామం చెందుతుంది.

కాబట్టి శాస్త్రీయ దృష్టితో చూస్తే జగత్తులోని పదార్థమూ, శక్తీ సర్వము నిత్యమేకాని నశ్వరంకాదు. అమ్మ చెప్పేదీ అదే ! జగత్తు మార్పుచెందుతున్నదే కాని, నాశనం కావటంలేదు. అందుకనే మారుతూఉండే ఈ జగత్తే నిత్యమన్నది. గాలి, నీరూ, బల్లా, కుర్చీ, నీవు, నేను మొదలైన వివిధ రూపాలు ఈ జగత్తు. ఇదే సత్యం. నిత్యము, సత్యము అయినది ఇదేకాని మరొకటి కాదు అన్నది. ఇదంతా అదే ! ఎప్పుడున్నదైనా అంతా తానే అయిన ఒకటి అన్నది సిసలైన అద్వైతమూర్తి అమ్మ.

ఎప్పుడున్న దైనా ఆ ఒకటే, అదే అనటంలో అది ఈ నాటిదికాదు అన్న ధ్వని ఉంది. ఆ భావంలోనే "సృష్టి అనాది" అన్నది అమ్మ. అంతేకాదు, సృష్టికి ఆద్యంతాలు లేవు - అనీ చెప్పింది అమ్మ.

ఇలా అమ్మ సృష్టిని గురించి చెప్పిన మాటలకూ, ఆధునిక విజ్ఞాన శాస్త్రం విశ్వసృష్టిగురించి వచ్చిన అవగాహనకూ ఎంతో అన్వయం కుదురుతున్నది.

అయితే విశ్వసృష్టిని గురించి విజ్ఞానశాస్త్రపు అవగాహన ఏమిటి ?

మనం నివసిస్తున్న ఈ భూగోళం ఒక గ్రహం. తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తున్నది. ఇట్టి గ్రహాలు ఇంకా 8 ఉన్నాయి. ఇవేకాక 50 ఉపగ్రహాలూ ఉన్నాయి. గ్రహం చుట్టూ తిరిగే దానిని ఉపగ్రహం అంటారు. చందమామ ఒక ఉపగ్రహమే. ఇలాగ గ్రహాలు, ఉపగ్రహాలు కాక సూర్యుని చుట్టూ తిరిగే గ్రహశకలాలు కొన్ని వేలు ఉన్నాయి. అంతేకాక తోకచుక్కలు కొన్ని వందలున్నాయి. ఇవన్నీ కలుపుకుని సౌరకుటుంబం - అంటే సూర్యుడు ఆధారంగా మనుగడ సాగించే కుటుంబం. సూర్యుడు ఒక నక్షత్రం. ఇటువంటి నక్షత్రాలు 10 వేల కోట్లు ఉన్నాయి అది ఒక కుటుంబం. దానిని గాలక్సీ అంటారు. మన గాలక్సీని మిల్కీవే (పాలపుంత) అంటారు. ఇట్లా గాలక్సీలు కొన్ని లక్షలతో కూడినది ఈ మహా విశ్వం.

ఇదీ విశ్వరూపం అయితే ఈ విశ్వం ఎప్పుడు, ఎలా సృష్టింప బడినది ?

విశ్వసృష్టి గురించి మహా విస్ఫోటనం లేదా పెద్ద పేలుడు సిద్ధాంతం (బిగ్ బాంగ్ థియరీ) వివరిస్తున్నది. దీని ప్రకారం దాదాపు వేయికోట్ల సంవత్సరాల క్రితం విశ్వంలోని పదార్థమంతా ఒకచోట కుదించుకుపోయి ఉంది. అది ఆదికాలపు బ్రహ్మాణువు ప్రిమివల్ ఆటం అది ఎంతగా కుదించుపోయిందీ అంటే ఒక టీ స్పూన్ పదార్థం కొన్ని కోట్ల టన్నుల బరువు తూగి ఉంటుంది. ఇక ఉష్ణోగ్రత గురించి ఆలోచిస్తే 1500 కోట్ల డిగ్రీల స్థాయికి చేరి ఉంటుంది. పీడనం కూడా బాగా పెరిగి ఉంటుంది. ఆ అధికాధిక ఉష్ణోగ్రత పీడనాలకు తట్టుకోలేక బ్రహ్మాణువు బద్దలైంది. అదే పెద్ద పేలుడు

అలా విస్ఫోటనం చెందిన పదార్థం నాలుగు దిక్కులకు అమితమైన వేగంతో విరజిమ్మబడింది. ఆ పదార్థం ప్రాథమిక కణాలుగానూ, శక్తిగానూ ఉండి, ఖండ ఖండాలుగా విస్తరించసాగింది. అంతేకాదు, పదార్థం శక్తిగానూ శక్తి పదార్థంగానూ పరస్పరం మారుతూ విస్తరించసాగింది. ఆ విస్తరణలో ముందు హైడ్రోజన్,

హీలియం, నైట్రోజన్, ఆక్సిజన్ మొదలైన తేలిక మూలకాలు, తదుపరి వాటిమధ్య గురుత్వాకర్షణ ఏర్పడటంవలన నక్షత్రాలు, గ్రహాలు, ఉపగ్రహాలు మొదలైన గోళాలుగా రూపొందాయి.

ఇలా విశ్వసృష్టి జరిగిందని ఆధునిక శాస్త్రవేత్తల ప్రగాఢ విశ్వాసం. దానికి రుజువులూ లభించాయి. దీనిని బట్టి అర్థమయేది వేయికోట్ల సంవత్సరాల క్రితం బ్రహ్మాణువు ఒకటి ఉన్నది. అదే ఇప్పుడు ఇన్నిగా మారింది.

ఇప్పుడు సృష్టిని గురించి అమ్మ చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకోండి. సృష్టి అనాది అన్నది అమ్మ అవును సృష్టి ఎప్పటిదని చెప్పగలము ? 1000 కోట్ల సంవత్సరాల క్రితం మహా విస్ఫోటనంతో ప్రారంభమై ఇప్పటికీ విస్తరణ చెందుతున్న ఈ మహావిశ్వం అంతకు ముందు ఎన్నిసార్లు ఇలా విస్ఫోటనానికిలోనైందో ? అంటే అమ్మ చెప్పినట్లుగా సృష్టి అనాది అనేగా అర్థం.

అంతేకాక అమ్మ 'ఆది' అనే పదానికి కొత్త నిర్వచనం ఇచ్చింది. "ఆది అంటే మొదలనే కాదు, ఉన్నదే" అని నిర్వచనం.

ఆది అంటే సామాన్యంగా మనం అర్థంచేసుకొనేది మొదలనే. కాని అమ్మ ఆది అంటే మొదలనేకాదు, ఇప్పుడు ఉన్నది కూడా అనే అంటారు. అమ్మ ఇచ్చిన ఈ నిర్వచనంలో వినూత్నమేకాక, విశ్వజనీనతకూడా చోటు చేసుకుంది.

అదెలాగూ అంటే ---

మీ స్నేహితుడు కొత్తగా ఇల్లుకట్టుకుని గృహప్రవేశానికి మిమ్మల్ని ఆహ్వానించాడు. వెలుపలినుంచి ఇల్లు చూడముచ్చగటా ఉంది. లోపల చూస్తే సకల సౌకర్యాలూ సమకూర్చి ఉన్నాయి. అతని ప్రయోజకత్వాన్ని ప్రశంసిస్తూ "ఇల్లు ఎప్పుడు మొదలు పెట్టావు ?" అని అడిగితే, శంకుస్థాపన చేసిన సుముహూర్తం చెప్పి, అదీ ఇంటికి మొదలు అంటాడు. అంతవరకు ఆ సమాధానం బాగానే ఉంది.

మీకు అలా చక్కగా ఇల్లుకట్టు కోవాలనిపించి "ఇల్లు కట్టడం ఎలా మొదలు పెట్టావు ? అసలు ఆది ఏమిటి ? అని తరచి అడిగితే, రెండు నిమిషాలు ఆలోచించి, గతం గుర్తుకు తెచ్చుకుని, శంకుస్థాపన రోజున ఉపయోగించిన - పునాదిరాయి, గమేళా సున్నంతో కట్టుబడి ప్రారంభమయింది. అదే ఈ ఇంటికి ఆది అంటాడు.

అయితే కేవలం ఒక పునాదిరాయి, ఒక గమేళా సున్నంతో ఇంత ఇంటి నిర్మాణం జరిగిందా ? కొన్ని టన్నుల ఉక్కు, కొన్ని వందల కట్టల సిమెంటు, కొన్ని వేల ఇటుక, కొన్ని లారీల ఇసుక, కొన్ని లారీల కంకర, కొన్ని వేల రూపాయల కలప - ఇలా ఎంతో పదార్థంతో, నిర్మాణం జరిగితేనే ఈ ఆకారంలో ఇల్లు తయారయింది.

కాబట్టి ఈ ఇంటికి ఆది ఏమిటి అంటే, ఈ ఇంటి నిర్మాణానికి ఉపయోగించిన పదార్థం అంతా అనేకదా ? అయితే పదార్థం ఇప్పుడు మొదట్లో ఉన్న రూపంలో లేదు. ఇంటి రూపంలో ఉన్నది కాని అప్పుడు ఆరంభంలో ఉన్నదే ఇప్పుడు ఉన్నది. అందుకనే ఆది అంటే మొదలేకాదు, ఉన్నదే అంటుంది అమ్మ.

ఇలా ఒక గృహానికి అన్వయించిన ఈ భావాన్ని మహావిశ్వానికి అనువర్తింప జేయవచ్చు. విశ్వానికి ఆది ఏమిటి ? అని ప్రశ్నిస్తే మహా విస్ఫోటనం జరగకముందు పెద్దముద్దగా ఉన్న బ్రహ్మాణువు అని చెప్తే సరిపోదూ ? సరిపోతుంది.

కాని ఇప్పుడు భూమి మీద చూస్తున్న బల్లా, కుర్చీ, చీమా, దోమా మొదలైన సకల చరాచరాలు, ఆకాశంలో చూస్తున్న నక్షత్రాలు గ్రహాలు మొదలైన గోళాలు - ఆ బ్రహ్మాణువు యొక్క రూపాంతరమే కదా ? కాబట్టి విశ్వానికి ఆది ఇప్పుడు ఉన్న ఈ సర్వజగత్తు అని చెప్పినా సరిపోతుంది. అందుకే అమ్మ - ఆది అంటే మొదలనే కాదు, ఉన్నదే - అంటుంది.

ఒక సోదరుడు అమ్మను అడిగాడు - సృష్టి ఎందుకు ఏర్పడింది ? అని

"నిప్పు ఎందుకు కాలుతుంది నాన్నా ?" అని అమ్మ ప్రశ్నించింది.

దాని స్వభావం అది - సోదరుని సమాధానం.

ఇదీ అంతే నాన్నా - అమ్మ ప్రవచనం.

సృష్టి ఏర్పడటానికి కారణం - దాని స్వభావమే అంటుంది అమ్మ

"దైవం సృష్టి చేయటం కాదు. దైవమే సృష్టిగామారింది అదే ఇన్ని రూపాలుగా వచ్చింది ఇదంతా అదే. భగవంతుడు - అన్నది మీరు పెట్టిన పేరు భగవంతునికి స్త్రీ, పురుష, భేదం లేదు దానికి భగవంతుడని కాదు, ఏపేరైనా పెట్టు ఉన్నది ఒకటి. దానిని సైన్స్ శక్తి అంటే ఆధ్యాత్మికం దైవం అంటున్నది" - అని అమ్మ దైవం గురించి కుండ బద్దలు కొట్టినట్లు చెప్పింది.

సృష్టికర్త వేరే ఒకడు ఉండి సృష్టి చేయటం కాదు, సృష్టితోనే సృష్టి అయింది. ఆ ఉన్నదే ఇన్నిగా మారింది కాబట్టి ఈ కన్పించేదంతా దైవమే.

సృష్టియొక్క ఈ విరాట్ స్వరూపానికి, సృష్టిలోని వైవిధ్యానికి అచ్చెరువొందిన ఒకసోదరుడు - చివరకు ఇదంతా ఏమవుతుందమ్మా ? అని అడిగితే అమ్మ ఏం సమాధానం చెప్పిందో చూశారా ?

"దేనికి చివర ? ఎక్కడికి చివర ? సృష్టికి ఆద్యంతాలు లేవు" అని నిష్కర్షగా చెప్పింది.

అవును - దేనికి చివర ? ఎక్కడికి చివర? దేనికి మొదలు ? ఏది మొదలు? ఇంతకు ముందు ప్రస్తావించినట్లుగా సైన్సు ప్రకారం మహా విస్ఫోటనం జరగటంతో విశ్వవిస్తరణ ప్రారంభమవుతుంది. అలా కొన్ని వేల కోట్ల సంవత్సరాలపాటు సాగుతుంది. తిరిగి గురుత్వాకర్షణవలన ముకుళించుకుంటుంది. బ్రహ్మాణువు ఏర్పడుతుంది. ఉష్ణోగ్రతా పీడనాలు అధికాధికంగా పెరుగుతాయి. మళ్ళీ ప్రేలుడు జరుగుతుంది. మానవహృదయంలాగా విశ్వపదార్థంకూడా స్పందనకు లోనవుతున్నది. అయితే ఈ విశ్వస్పందనకు ఆది ఏమిటి ? అంతం ఎక్కడ ? అనంతంగా సాగేదే ఈ స్పందన. అందుకే అమ్మ - సృష్టికి ఆద్యంతాలు లేవు అనీ, సృష్టికి రూపాంతరం తప్ప నాశనం లేదు - అనీ అంటుంది.

అమ్మ అంటే ఏమిటో కూడా చక్కగా నిర్వచించటం జరిగింది. "దేనికైతే ఆది అంతమూ లేదో, ఏది సర్వానికి ఆది అంతమో అదే అమ్మ, అమ్మ అంటే తల్లి, తల్లి అంటే తాలి".

ఆది అంతమూ లేనిది ఏమిటి ! ఈ సృష్టేకదా ! కాబట్టి సృష్టే అమ్మ. ఈ జగత్తే అమ్మ

"జగజ్జనని" అన్న పదానికి అర్థం చెప్తూ కూడా - జగజ్జనని అంటే జగత్తుకు జనని అని కాదు, జగత్తే జనని - అని వివరించటంలో ఉద్దేశం అదే.

సర్వానికీ ఆదీ అంతమూ ఏది - ఆది అంటే అమ్మ నిర్వచనం ప్రకారం ఇప్పుడున్నదే కదా ! ఇప్పుడున్నది - మారుతూ ఉన్న ఈ జగత్తే అలాగే అంతంలో ఉండేది ఏమిటి - ఈ జగత్తే ! లేకపోతే రూపంలో తేడా ఉండవచ్చు కాబట్టి సర్వానికీ ఆదీ, అంతమూ - జగత్తే. ఆ జగత్తే అమ్మ.

"సృష్టి అనాది" అవటమేకాక "సృష్టి నాది" అనీ అమ్మ ప్రకటించింది. ఈ ప్రకటన చేసిన అమ్మ హృదయ వైశాల్యం ఏ కొలబద్దకు అందుతుంది.

రామకృష్ణ అన్నయ్య పలికినట్లుగా - ఈ ఊరునాది, ఈ రాష్ట్రం నాది, ఈ దేశం నాది - అన్నవాళ్ళు ఉన్నారుకాని, "ఈ సృష్టినాది" అని ప్రకటించిన వాళ్ళు చరిత్రలో కన్పించరు. సృష్టితో తాదాత్మ్యం చెందిన అమ్మకే సరి పోయింది ఆ విధంగా ప్రవచించటం.

ఇలా సర్వమూ తానే అయిన అమ్మ దృష్టిలో ద్వంద్వం అంటూ లేదు, కాగడా వేసి వెతికినా కనిపించదు.

ప్రజ్ఞానం బ్రహ్మయితే అజ్ఞానం ఎందుకు కాదు ?

అన్నం పరబ్రహ్మమయితే అశుద్ధం ఎందుకు కాదు ?

శబ్దం బ్రహ్మయితే సైలెన్సూ బ్రహ్మే !

సర్వమూ బ్రహ్మే అన్నది అమ్మ. వెలుగూ - చీకటీ, మంచీ - చెడు అంతా బ్రహ్మే అన్నది. కంటికి కన్పించే బల్లా, కుర్చీ, చీమా, దోమా మొదలైన చరా చరాలే కాదు, కన్పించని ఎక్స్ కిరణాలు, రేడియో తరంగాలు ఉష్ణశక్తీ - అంతా బ్రహ్మ పదార్థమే.

అన్ని ఆకారాలు - బల్లా, కుర్చీ, పక్షీ, జంతువూ, మీరు నేనూ - వాడివే కాబట్టి నిరాకారుడు.

అన్ని గుణాలూ - తీపీ, చేదూ, వేడీ, వెలుతురూ, విద్యుత్తూ, రేడియో వాడివే కాబట్టి నిర్గుణుడు.

దైవం యొక్క నిరాకారత్వం, నిర్గుణత్వం, విప్లవాత్మకంగా నిర్వచించింది అమ్మ.

ఒక్క మాటలో - కన్పించేదీ, కన్పించనిది అది పదార్థం కావచ్చు, శక్తి కావచ్చు - సర్వమూ, ఈ ఉన్నదంతా అదే, దైవమే !

(రచన : కొండముది హనుమంతరావు)



# 213
# అమ్మ - రిపువాత్సల్యం

అమ్మను మనం 'ప్రేమ స్వరూపిణి'గా అభివర్ణిస్తున్నాం, ఆరాధిస్తున్నాం ఎందువల్ల ?

సామాన్య జనులకూ ప్రేమించే గుణం ఉంటున్నది. మరి - అందరినీ ప్రేమస్వరూపులుగా మనం భావించటం లేదు, సంభాషించటమూలేదు.

మన ప్రేమ పరిమితమై ఉంటుంది. కారణాలకు కట్టుబడి ఉంటుంది. కానీ - అమ్మ ప్రేమ అవ్యాజమయింది. అపారమయింది. అమలినమయింది. అవసరాలతో ముడిపడిన ప్రేమ మలినమయింది - అన్నారు పెద్దలు.

మనం సహజంగా మనను ప్రేమించే వారిని, గౌరవించేవారిని సేవించేవారిని మాత్రమే ప్రేమిస్తాము. వాళ్ళనైనా, అందరినీ సమానంగా ప్రేమించలేము. వాళ్లకూ మనకూ ఉన్న అనుబంధాన్ని బట్టి మన ప్రేమలో తరతమ భేదాలుంటాయి. వాళ్ళతో మనకున్న అవసరాన్ని బట్టి మన ప్రేమయొక్క సాంద్రత మారుతూ ఉంటుంది

తనను ద్వేషించే వారిని, దూషించే వారిని, హింసించే వారిని, తన గౌరవ ప్రతిష్ఠలను, భగ్నంచేయ ప్రయత్నించిన వారిని, చివరకు తనపై హత్యాప్రయత్నం చేసినవారిని కూడా ప్రేమించే వారిని ఏమని అభివర్ణించాలి ?

అసలు అటువంటివారు లోకంలో ఉన్నారా ? అన్న ప్రశ్నకు - 'ఉన్నారు' అని జవాబు ఇవ్వగలగటానికి జిల్లెళ్ళమూడి అమ్మే నిదర్శనం.

అతి బాల్యంలో అమ్మకు చినతాతగారైన శ్రీ చంద్రమౌళి చిదంబర రావుగారి వద్ద అమ్మ పెరిగింది. ఒకనాడు తాతగారి సమక్షంలోనే వారమ్మాయి భారతి అమ్మ జడపట్టుకుని లాగింది. అమ్మ వెనక్కు పడ్డది. ఏమిటి ? అని తాతగారు అరిచారు. వెనక్కు తూలాను తాతగారూ - అన్నది అమ్మ - ఏమీ తవుడుకోకుండా, కానీ జరిగిన సంఘటనను ఊహించలేని వెఱ్ఱివెంగళప్పకాదు తాతగారు. ఆ క్షణంలోనే తాతగారు అనుకున్నారు "ఈ పిల్ల అసామాన్య గుణాలకు ఆటపట్టు కాగలదు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది కదా" అని. "సహనశీలి అయిన ఈ పిల్ల ముందు ముందు ఎన్ని దుర్భరమైన కష్టాలకు లోనౌతుందో" - అని కూడా అనుకుంటూ గజగజ లాడిపోయారు

అమ్మ పెద్దయ్యాక - లోకంలో దైవంగా గుర్తించబడి పూజలు అందుకునే కాలంలో... ఒకనాడు స్నానానికి సన్నద్ధయై స్నానాల గదిలో ఒక పీటపై అమ్మ ఆశీన అయ్యింది. అంతలో అమ్మకు ఏదో అవసరమై లేచి నిలుచున్నది అక్కడనే ఉన్న అమ్మ భక్తురాలైన శాయమ్మగారు ఆ పీటను వేరేచోటకు కదిలించింది. అమ్మ ఆ విషయాన్ని గమనించలేదు. పీట పూర్వం చోటనే ఉన్నదనుకుని కూర్చుంది. ఇంకేముంది ? అమ్మ వెల్లకిలా పడిపోయింది. తీవ్రమయిన బాధకు గురి అయింది. అక్కడున్న మేమందరం శాయమ్మగారిపై విరుచుకుపడ్డాం. ఎంతపని చేశావూ అంటూ

మమ్మల్ని వారిస్తూ అమ్మ మెల్లగా అన్నది - "ఆమె నేమీ అనకండి. ఆమె ఏమి చేస్తుంది ? ఆ మార్పును గమనించకపోవటం నా తప్పు. నాకు పడే యోగం ఉన్నది, నేను పడ్డాను. పడే తరుణం వచ్చినపపడు ఆ పీటను ఆమె తీయకపోయినా నేను పడేదాన్నే. ఎవ్వరూ తప్పించలేరు".

1975 డిసెంబరు 30వ తేదీన నక్సలైట్లు అమ్మ ఆశ్రమం మీద దాడి చేశారు. నగలు, నగదు దొరికినంత దోచుకున్నారు. ఆశ్రమాన్ని అల్లకల్లోలం చేశారు. బాంబులు వేశారు.

మరునాడు పోలీసువారు ఆశ్రమంలో హింసాకాండకు పాల్పడిన నక్సలైట్లను గుర్తించి పట్టుకువచ్చి అమ్మ ముందు నిలబెట్టారు.

"ముందు వాళ్ళ భోజనం సంగతి చూడండి ఆలస్యముంటే ఈ లోపల టిఫిన్ పెట్టించండి, తర్వాత మీ విచారణ చేసుకొనండి." అని ఆదేశిస్తూ జగన్మాతృత్వ పరిమళాలను వెదజల్లే ఒక ప్రకటనను చేసింది అమ్మ.

"ఒకే తల్లి పిల్లలందరూ ఒకే విధంగా ఉండరు. కొందరు అడిగి తీసుకుంటారు. కొందరు ఆకతాయి పిల్లలు ఆగడం చేసి తీసుకుంటారు. వీళ్ళు ఆ కోవకు చెందినవాళ్ళు. అయినా తల్లికి అందరూ సమానమే. వాళ్ళను హింసించకండి" అని పోలీసులకు సలహా ఇచ్చింది అమ్మ

దొంగ చేతికి దొరికితే ఆ అవకాశాన్ని ఎవ్వరు వృధా చేసుకుంటారు ? వాళ్ళను దండించడానికి ప్రయత్నిస్తారు కానీ, వాళ్ళ ఆకలిదప్పులు గురించి ఎవరు చింతిస్తారు ? అంత ఔదార్యం, ప్రేమ ఎవరికుంటాయి ?

ఒకనాటి సాయంకాలం జిల్లెళ్ళమూడి వాస్తవ్యుడు అమ్మ వద్దకు వచ్చాడు. అతడు - అమ్మ యవ్వనంలో ఉండగా అమ్మ శీలాన్ని హరించటానికి పలు ప్రయత్నాలు చేసిన దుర్మార్గుడు. రావణ జాతికి చెందినవాడు. కానీ - అతడు సన్నిధానానికి రాగానే - అమ్మ అతన్ని సాదరంగా ఆహ్వానించింది. దగ్గర కూర్చో బెట్టుకుంది తల నిమిరింది వీపు నిమిరింది. కుశల ప్రశ్నలు వేసింది. అరటిపండు ఒలిచి గోముగా అతని నోటికి అందించింది. బొట్టు పెట్టింది. కొత్త బట్టలు పెట్టింది. నిరవధికమూ, నిరవద్యమూ అయిన ఆ ప్రేమ వెల్లువలో అతడు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. అతడి చెక్కిళ్ళు అశ్రుధారలతో తడిసిపోయాయి.

చూస్తూ ఉన్న మేము విచకితులమై, విచలితులమైనాము

అమ్మ ప్రేమకు హద్దులు లేవు.

అమ్మ ప్రేమకు స్వపర భేదం లేదు. సజ్జనులని - దుర్జనులని తేడాలేదు. అధికులని - అల్పులని విచక్షణలేదు. పండితుడని - పామరుడని, ధనవంతుడని - దరిద్రుడని వ్యత్యాసంలేదు. శత్రువని - మిత్రుడని విభజన లేదు.

ఒక రోజున అమ్మ భక్తుడొకడు అమ్మ వద్దకు వచ్చి - "ఆ వెంకయ్య నిన్ను నోటికి వచ్చినట్టల్లా తిట్టాడమ్మా. నాకు చాలా బాధ కలిగింది" అని కన్నీళ్ళు పెట్టుకుంటే "మీరు అష్టోత్తరాలతో, సహస్ర నామాలతో స్తోత్రం చేయటం లేదూ ? అదీ అంతే, వాళ్ళు ఆ విధంగా పూజిస్తున్నారు. దూషణ కూడా ఒక విధమైన ఆరాధనే, నాన్నా, నువ్వు బాధ పడకు" - అని అమ్మ అతడిని ఓదార్చింది. ఆ అనిర్వచనీయమైన, క్షమను మేము జీర్ణం చేసుకోలేక ఉక్కిరి బిక్కిరయ్యాము.

శీతోష్ణాలను, కష్టసుఖాలను, తేజస్తిమిరాలను, మానావమానాలను, జయాపజయాలను, నిందాస్తుతులను సమంగా ఎవరు అనుభవించగలరు ?

వారినే లోకం "స్థితప్రజ్ఞులు"గా శ్లాఘిస్తున్నది.

రాగద్వేషాలకు అతీతంగా, నిష్కల్మషంగా, నిర్లిప్తంగా, నిర్వికారంగా, ప్రశాంతచిత్తులై, ప్రేమైకమూర్తులై ఎవరు ప్రవర్తించగలరు ?

వారే 'పూర్ణమానవులు'గా ప్రపంచంచేత ప్రస్తుతింపబడుతున్నారు.

పరిమితమైన మమకారం మానవత్వమైతే - అపరిమితమైన మమకారం మాధవత్వమేనని అమ్మ సరికొత్త ప్రవచనం చేసింది.

సామాన్యుడి మమకారం - నా గ్రామం, నా రాష్ట్రం, నా దేశం అంటూ ఆగిపోతే అమ్మ మమకారం సర్వసృష్టినీ తన ఒడిలోకి తీసుకుని మురిసిపోయింది. ఈ సృష్టి నాది, అనాది'' అని అమ్మ చేసిన మహోన్నతమైన ప్రకటన యావజ్జగతినీ సంభ్రమాశ్చర్యాల్లో ముంచేసింది.

భిన్నత్వంలేని మనస్తత్వమే దైవత్వం - అని అమ్మ పలుసార్లు ఉద్ఘాటించింది.

అందువల్లనే - సమతామమతల మేలు కలయిక అయిన అమ్మ ''జగదారాధ్య'' అయి అశేష నరనారీ జన హృదయ సీమల్లో సింహాసనాధీన అయి వేయికాంతులతో వెలుగొందుతున్నది.

జయహోమాత !



## అమ్మ - స్వరూప స్వభావాలు

మనోహరం మహావరం ! మాతృశ్రీ రూపం !<br>
మహిమాన్విత రూపం మహోజ్జ్వల మణిదీపం !

నిరుపమ ప్రేమార్ద్రతకు నిర్వచనంబమ్మ<br>
నిలువెత్తున నిలచిన నిజమౌ బంగరుబొమ్మ ॥ మ ॥

కర్మసాక్షి అమ్మనొసట కస్తూరి తిలకం<br>
ధర్మదీక్షయందె సదా కల్పవల్లి జలకం ॥ మ ॥

నీవూ నే నను నీతిని నీటగలిపె నమ్మ<br>
వీరూ వా రను రీతిని నీడ మంది సుమ్మా ॥ మ ॥

మనుజు లందరు ఏకోదరులని మనల తెలియు దన్నది<br>
మాయా మర్మముల విడచి మనల బ్రతక మన్నది<br>
అమ్మ 'అనసూయ' పేరె ! అందరి జపమాల !<br>
అమ్మను మరచి అన్యుల గొలిచెడి తన మేల ? ॥ మ ॥

- నదీరా

# 214
# అమృత కలశం

వాత్సల్యపు ఉగ్గుపాలను పోసి ---

మానవజాతి చేత

విజ్ఞానపు గోరుముద్దలను తినిపించిన --

జగదీశ్వరీ, జగజ్జనని, జగద్గురువు అమ్మ

ప్రసిద్ధులందరు సిద్ధులు కానట్లే - వక్తలందరు ప్రవక్తలు కానవసరం లేదు. ప్రవక్తలందరు వక్తలూ కానవసరం లేదు.

అప్పటిదాకా వెలుగులోకి వచ్చిన శాస్త్ర సారాంశాన్ని తమ సరికొత్త అనుభవాల వెలుగుతో మేళవించి - లోక సముద్ధరణ కొరకు, సమాజ శ్రేయస్సు కొరకు, వ్యక్తి వికాసం కొరకు, తమ జీవితాలనే అంకితం చేసిన మహానుభావులూ, మహాత్ములే ప్రవక్తలు. తమ వాక్కుతో, దృష్టితో, స్పర్శతో, సంకల్పంతో అవతలి వారి అంతరంగాన్ని వ్యష్టిగా, సమిష్టిగా స్పృశించి స్పందింపజేయ గలిగిన సర్వజ్ఞులు, సమర్థులు అయిన ప్రతిభావంతులే ప్రవక్తలు.

అటువంటి ప్రవక్తలలో అమ్మ 'మహాప్రవక్త' అని నా అభిప్రాయం.

అమ్మకు గ్రంథ పరమైన పాండిత్యం లేదు కానీ అపారము, అపూర్వము అయిన తన అనుభవంతో అనేక అద్భుత విషయ సముదాయాన్ని అమృతకలశాన్ని లోకానికి అమ్మ అందించింది.

అందువల్లనే 'అమ్మ' సర్వజ్ఞగా, సద్గురువుగా విజ్ఞాన ప్రపంచ సామ్రాజ్ఞిగా సుప్రసిద్ధ అయింది.

అమ్మ వక్తకాదు. ఎక్కడా, ఎప్పుడూ ఏ వేదికల నుండి ఏ విధమైన ప్రసంగాలు చేయలేదు.

వాంఛితార్థ ప్రదాయినిగా, భక్త సౌభాగ్యదాయినిగా, మోక్షదాత్రిగా - 'అమ్మ' సుప్రసిద్ధ అయినందువల్ల, నిత్యము ఎందరో ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు అమ్మను దర్శించు కొనేందుకు. అర్చించు కొనేందుకు వేలాదిగా వచ్చేవారు.

వాళ్ళు అనేక విధాల అమ్మను ప్రశ్నిస్తుండేవారు. లౌకికమూ, ఆధ్యాత్మికమూ అయినా వాళ్ళ సమస్యలను, అమ్మ సన్నిధిన నివేదించేవాళ్ళు. సంసారంలోగానీ, సాధనలోగానీ వాళ్ళకు అడ్డు వచ్చిన సందేహాలను అమ్మ ముందుంచేవాళ్ళు. అందరి వేదనలనూ, నివేదనలనూ ఓర్పుగా విని అందరికీ సంతృప్తికరంగా - ప్రశ్నలకు సమాధానాలనూ, సమస్యలకు పరిష్కారాలనూ, సందేహాలకు నివృత్తులనూ, కష్టాలకు విముక్తులను - ప్రసాదించేది 'అమ్మ'.

అట్లా అమ్మ అప్పుడప్పుడు సంభాషణల్లో చెప్పిన సూక్తులే - నేడు తత్త్వ గగనతలంలో తారకలై మనకు ఎంతో వెలుగును ప్రసరిస్తున్నాయి.

అట్లా అమ్మ నుండి వెలువడ్డ వాక్యాల్లో కొన్ని - లోగడ పెద్దలూ శాస్త్రాలూ చెప్పిన విషయాలతో సరిపో వచ్చు. కొన్ని అంతకంటే భిన్నంగా, అంతకంటే నిండుగా, అంతకంటే మెరుగ్గా అంతకంటే బరువుగా ఉండవచ్చు. అవి సరి తూగినా, ఒక అడుగు ముందుకు వేసినా అన్నీ - అమ్మ అనుభవ సంజనితాలే. అందుకనే అవి సర్వోత్కృష్టమై, సముజ్జ్వలమై భాసిస్తుంటాయి.

"అంతా అదే"

"కనిపించేదీ, కనిపించనిదీ - అంతాదైవమే"

"ఎంత వెదికినా నాకు అది కానిది కనిపించటం లేదు" - అని తాను పొందిన దర్శనాన్ని ఉద్ఘాటించినా -

"నేను నేనైన నేను'

"అన్ని నేనులూ నేనే" "మీరంతా నేనే, మీదంతా నేనే, ఇదంతా నేనే" అని ఎన్ని విధాలుగా తనకు లోకంతో కలతాదాత్మ్య వైభవాన్ని ప్రకటించినా -

ఈ రెండు స్థితులూ పూర్వ ఋషులకూ, పూర్వ సాధకులకూ సిద్ధిరూపమైన అనుభవాలే.

అమ్మ ఈ రెండు స్థితులను అనుభవిస్తూ, ప్రకటిస్తూనే -

మరో అపూర్వమైన స్థితిని అనుభవించి, మనోహరమైన తన ప్రత్యేక శైలిలో సర్వ జన హృదయంగమంగా ప్రవచించి - లోకాన్ని వాత్సల్య క్షీరజలధిలో నిలువునా ముంచెత్తి, ఆనంద పరవశం చేసింది.

"నేను అమ్మను - మీరు బిడ్డలు"

"ఎవర్ని చూసినా, నాకు నాబిడ్డే అనిపిస్తుంది"

"నేనే మిమ్మల్నందరినీ కని, మీమీ తల్లులకు పెంపుడిచ్చాను" - అన్న మధుర మధుర మమతాపూర్ణ మహిత వాక్యాలు ఆధ్యాత్మిక సారస్వత చరిత్రలోనే అపూర్వాలు. ప్రపంచ సాహిత్య వల్లరి తొడిగిన కొల్విరులు గుబాళింపులు. లోగడ ఆధ్యాత్మిక వేత్తలు లోకాన్ని సగం సత్తుగాను, సగం అసత్తుగానూ విబజించారు.

"ప్రజ్ఞానం బ్రహ్మ అయితే - అజ్ఞానమూ బ్రహ్మే".

"అన్నం పరబ్రహ్మమైతే అశుద్ధమూ అంతే"

"శబ్దం బ్రహ్మయితే నిశ్శబ్దమూ బ్రహ్మే"

"ఆనందం బ్రహ్మమయితే దుఃఖమూ బ్రహ్మయే".

"గంగా నదే కాదు - మురుగు కాలువకూడా దైవమే" - అని ఒక సంపూర్ణతా వాదాన్ని, సరికొత్త నినాదాన్ని ఎలుగెత్తి చాటింది అమ్మ.

లోగడ శాస్త్రాలు జడమనీ - చేతనమనీ, సజీవమనీ - నిర్జీవమనీ లోకాన్ని రెండుగా నిలువునా చీలిస్తే -

"నా దృష్టిలో అంతా సజీవమే"

"నా దృష్టిలో జడమనేదే లేదు. అంతా చైతన్యమే"

"శరీరం ఆత్మ కాక పోలేదు"

"ఎందరో మహానుభావులు కాదు, అందరూ మహానుభావులే" - అన్న ప్రసిద్ధ ప్రకటనలతో నాణెమునకు రెండవ వైపు కూడా చూపి మానవ మస్తిష్కంలో సంచలనాన్ని సృజించింది అమ్మ.

ఎక్కడో మిణుకు మిణుకు మనే దీపంలాగా - "సర్వం ఖల్విదం బ్రహ్మ" - అన్న మంత్రాన్ని దర్శించి నప్పటికీ - పూర్వ ఋషుల తత్వాధ్యయనంలో -

దైవం "సర్వాంతర్యామి" గానే మిగిలిపోయాడు.

ఆ వాదాన్ని అమ్మ తిరస్కరించి - దైవం సర్వరూపుడని వక్కాణించడం పండితుల దృష్టిని కూడా ఆకర్షించింది.

నిరాకారుడంటే - "అన్ని ఆకారములు కలవాడు"

నిర్గుణుడంటే - "అన్ని గుణాలుకలవాడు" - అన్న వాక్యాలు ఆ కడలికెరటాలే.

"చీమలో', 'దోమలో' ఉన్న దైవాన్ని మాత్రమే త్యాగరాయ ప్రభృతులు ప్రస్తుతిస్తుంటే, 'చీమగా,' 'దోమగా' అని అమ్మ సరిజేయటం గమనార్హం.

భగవంతుణ్ణి 'తాపసమందార' అని పోతనాదులు సంబోధిస్తే -

భగవంతుడు 'తామసమందారుడు' కూడా అని సరిదిద్దింది అమ్మ

ఎన్నో అపూర్వ సత్యాలను అత్యంత మనోజ్ఞంగా, ప్రతిభావంతంగా వివరించి ఆధ్యాత్మిక సీమలో కొత్త పుంతలు వేసింది అమ్మ

సాధకులకు మార్గదర్శిని అయి చేయి పట్టి నడిపంచడమే కాక - వారిని ఒడిలో కూర్చో బెట్టుకుని, అమ్మ - కైవల్య పద సింహాసనాసీన అయింది. అమ్మది మార్జాలకిశోర న్యాయం.

"నాకు భక్తులెవరూ లేరు అంతా బిడ్డలే".

"నాకు శిష్యులెవరూ లేరు అంతా శిశువులే"

"నేను గురువునుకాను మీరు శిష్యులు కారు"

"నేను మార్గదర్శికాను మీరు బాటసారులు కారు,"

"నేను అమ్మను మీరు బిడ్డలు". ఈ వాక్యాలు అమ్మ అద్భుత చరిత్రలో అమృతాక్షరాలు, ఈ వాక్యాల్లో ఉన్న అతిలోక భావాలు మరెక్కడా కనిపించని కోహినూరులు.

సాధకుల చరిత్రలు పఠిస్తే అందరికి సిద్ధి లభించినట్లు, భక్తుల కథలు వింటే అందరికీ మోక్షం ప్రాప్తించినట్లు మనకు గోచరించు

"అందరికీ సుగతే" అని ఘంటాపథంగా చెప్పింది అమ్మ మాత్రమే.

మనం చేసుకున్న పాప పుణ్యాలనూ, మన అర్హతలనూ అనుసరించి భగవంతుడు మనకు ఫలితాన్ని ప్రసాదిస్తాడు. అని మన పురాణ ప్రపంచం ఉద్ఘోషిస్తుంటే -

"పుణ్యపాపాలనేవే లేవు" అవి ఏవైనా వుంటే భగవంతుడికే" అని చెబుతూ-

"మనిషికి కర్తృత్వమే లేదు" అని విశదీకరిస్తూ "తోచిందేదో చెయ్యి తోపింపచేసేదీ వాడేగా" - అని సుస్పష్టంగా, నిర్ద్వంద్వంగా ఉద్ఘాటించి - సాలెగూడిలో చిక్కుకున్న మనిషికి విముక్తిని ప్రసాదించిన 'అమ్మ కారుణ్యం' లోకాతీతమూ అమేయమూ.

వేదాంత లోకమంతా పునర్జన్మను గురించి అనేకమైన కథలనూ, గాథలనూ వినిపిస్తుంటే, మనిషికి పునర్జన్మ అనేదీ ఊహాజనితం అని చెబుతూ కడలి కెరటాలను ఉదాహరణగా చూపించి పండితులను నిరుత్తరులను చేయటం - అమ్మ లోకోత్తర మేధో విభవానికి నిదర్శనం

భూత కాలమనీ, భవిష్యత్కాలమనీ - ఇన్ని నాకు లేవు. నాకు అంతా వర్తమానమే. అని ప్రవచించిన అమ్మ ఆది మధ్యాంతరహిత, కాలాతీత.

అమ్మ వాక్యాలు సార్వకాలికాలు, సార్వ జనీనాలు.

ఆధ్యాత్మికరంగంలో ప్రప్రథమంగా సంపూర్ణతత్వాన్ని సందర్శించి సామ్యవాదాన్ని ప్రవేశపెట్టి - అనర్ఘ రత్నాలను వెదజల్లిన అమ్మ క్రాంత దర్శిని, తత్త్వ వేదిని, సద్గురువూ, మహాప్రవక్త

అమ్మ దగ్గరకు వచ్చేవారందరూ జిజ్ఞాసువులు కాదు. అల్ప సంఖ్యాకులకు మాత్రమే జిజ్ఞాస ఉంటుంది. ఆ కొద్ది మందిలో ఈ గ్రంథ రచయిత శ్రీ ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం ఒకరు. అమ్మ - నాన్నగార్ల పూర్ణ ప్రేమను పొందిన అదృష్టవంతుడు శ్రీ సుబ్రహ్మణ్యం.

ఆ ప్రేమ వల్ల అమ్మతో సాన్నిహిత్యం సంపాదించి దానిని సార్థకం చేసుకొన్న సుబ్రహ్మణ్యం, అమ్మతో ఎన్నో సంభాషణలు చేసి, అమ్మ నుండి ఎంతో పరిజ్ఞానాన్ని మూలగట్టుకున్న అధ్యయనశీలి, ప్రతిభాశాలి శ్రీ సుబ్రహ్మణ్యం.

అమ్మ చెప్పిన కొత్త పాఠాలను, కొత్త శాస్త్రాన్ని స్వయంగా ఆలించి అధ్యయనం చేసి, అవగాహన చేసుకొని, ప్రభావితుడై పులకితాంగుడైన నిర్మల చిత్తుడు, అమ్మ తత్త్వ మధుపాన మత్తుడు శ్రీ సుబ్రహ్మణ్యం.

ఆ ఆనంద సంపదను తనలోనే దాచుకొనక - అమ్మ వాక్యాల్లో కొన్నింటికి వివరణలనిచ్చి లోకానికి అమ్మ అపూర్వ తత్త్వాన్ని సుబోధం చేయాలనే రచయిత మంచి తలంపుకు ఫలితమే ఈ ఉత్తమ గ్రంథం.

ఈ గ్రంథం అమ్మ వాక్యాలకు వివరణ మాత్రమేకాక - అమ్మ వాక్యాల పట్ల శ్రీ సుబ్రహ్మణ్యం స్పందించిన తీరుకు అతని ఆధ్యాత్మిక దృష్టికీ దర్పణం పడుతున్నది.

ఈ వాక్యాలు కాక, ఇంకా వేల సంఖ్యలో అమ్మ సూక్తులు ఉన్నాయి. క్రమశః వాటన్నిటికీ శ్రీ సుబ్రహ్మణ్యం వ్యాఖ్యానం సంతరిస్తే - అది జిజ్ఞాసు లోకానికి ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

అమ్మ వాక్యాలు ఎంతో సరళంగా ఉన్నట్లు మనకు భ్రమను కలిగిస్తాయి. ఎన్నో వాక్యాలకు వివరణలు ఉంటేగానీ మనకు అర్థం కాని మాట - నిజం.

ఇంకా ఇటువంటి ఉత్తమ గ్రంథాలను శ్రీ సుబ్రహ్మణ్యం లోకానికి అందించాలని సర్వేశ్వరి అయిన అమ్మను ప్రార్థిస్తున్నాను.

రెండు చేతలు కలయికతో నమస్కారమయినట్లు ఒక చెయ్యి అయిన శ్రీ సుబ్రహ్మణ్యానికి - ఉదారులూ, ఉత్తమ సంస్కారులూ, భిషగ్వర్యులు అయిన డా. ఆచంట కేశవరావుగారు అమ్మ వరప్రసాదంగా లభ్యమై, రెండవ చేయి అయి అమ్మకు నమస్కారం కాగలగడం పూర్వపుణ్య విశేషం. లౌకిక పారలౌకికమైన అన్ని కార్యక్రమాల్లో డాక్టరు గారికి చేదోడు వాదోడుగా నిలిచిన వారి సతీమణి శ్రీమతి అన్నపూర్ణక్కయ్య అమ్మకు ప్రియ పుత్రిక.

1973 నవంబరులో అమ్మ చేసిన వాత్సల్య యాత్రలో భాగంగా అమ్మ డాక్టరుగారి నివాస, వైద్యాలయ ప్రాంగణాలను తన పావన పాద ధూళితో పరిపూతం చేసిన సుసంఘటన నేనెన్నడూ మరువలేను. శ్రీ ఏ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం రచించిన గ్రంథానికి ఇది పీఠిక.

(20.3.1996)



# 215
# మహాసరస్వతి - అమ్మ

వసుంధరక్కయ్య రాసిన "వాత్సల్యామృత వర్షిణి'లో శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు, శ్రీశ్రీశ్రీ రఘువరదాసుగార్ల గురించి వివరణ తెలియచేయమని అడిగిన వెంటనే రామకృష్ణ అన్నయ్య ఇచ్చిన వివరణ.

శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు ఉత్తరప్రదేశ్ అలహాబాద్‌లోని ప్రఖ్యాత 'సంకీర్తన భవన్'కు వ్యవస్థాపకులు. వీరు ఋషి, జితేంద్రియులు, తత్త్వవేది, తపస్వి, సాధు మహారజ్, మంత్ర సిద్ధిపొందిన రాధోపాసకులు, భక్తి జ్ఞాన వైరాగ్యాల త్రివేణి సంగమం. ముక్తి మార్గాల్లో నామ సంకీర్తనకు పెద్దపీట వేసిన మహనీయులు వీరు మూర్తీభవించిన ఆర్షధర్మం 'భాగవత కథ' అన్న 108 భాగాల బృహత్ గ్రంథ రచయిత. ఉపనిషత్తులకు వ్యాఖ్యానాలు, చైతన్య చరితావళి మొదలైన అనేక ఆధ్యాత్మిక గ్రంథ రాజాలను లోకానికి అందించిన యశస్వి.

వీరి ప్రధాన శిష్యులే శ్రీ శ్రీ శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ, సన్యాసాశ్రమం స్వీకరించక ముందు వారు శ్రీ శియారఘువరదాస్‌గా సుప్రసిద్ధులు. ఆంధ్రదేశాన్ని 1950వ సం॥ నుంచి 1975 వరకు "హరేరామ" నామ సంకీర్తనతో ఉర్రూతలూగించిన నామయోగి ఆంధ్ర, తమిళనాడు, కర్నాటక, కేరళ అన్ని దక్షిణాది రాష్ట్రాల్లో విరివిగా పర్యటించి నామ సంకీర్తనను అత్యధికంగా ప్రచారం చేసిన నామావతారులు. తాను భక్తి పారవశ్యంలో మునిగిపోయి ప్రజలను ఆనందరసామృత సాగరంలో ముంచెత్తిన మరో చైతన్య ప్రభువు సన్యాసాశ్రమం స్వీకరించి నప్పటికీ నామప్రచారం కొరకై చేసే విస్తృత దేశపర్యటనలో అడ్డుగా నిలిచిన దండకమండలాలను పరిత్యజించిన ధీరోదాత్త పరివ్రాజకపుంగవులు. సంకీర్తనమే ఊపిరిగా జీవించిన సంకీర్తనా తత్పరులు వీరు ఆకృతి దాల్చిన 'నామ సంకీర్తనం' అనటం అతిశయోక్తి కాదు. భక్త తులసీదాస్ విరచిత "హనుమాన్ చాలీసా"ను గానం చేసి, లక్షలాది మందిచేత చేయించి చాలీసాస్థాపాలను వందలాది నిర్మించిన పూత చరిత్రుడు.

అమ్మను పరాశక్తిగా దర్శించి - 'జయహో మాతా శ్రీ అనసూయా' అన్న అమ్మ నామాన్ని మధురాతిమధురంగా గానం చేసి పరవశించిపోయిన భాగవతోత్తములు వీరు.

సాహిత్యానికి, సంగీతానికి ప్రతీకలై నిలిచిన ఆ ఇద్దరు మహనీయులు అమ్మకు ఇరువైపుల ఆసీనులయితే అమ్మ సరస్వతీ దేవియై శోభిల్లిన ఆ కమనీయ దృశ్యం చిరస్మరణీయం.



## మురళీ రవాలు

అమ్మ అన్నదీ అందరికి పెన్నిధి - ఆ
అమ్మ సన్నిధి అమృతమె వున్నది - ఆ
అమ్మ కన్న మిన్నయైన దేవుడు లేడు
అమ్మలేక పుట్టినట్టి జీవుడు లేడు

మాతృసేవ మరచిపోని మనిషే మనిషి - ఆ
మాతృసేవ మరచినట్టి మనిషిక దోషి ॥ అ ॥

అందరినీ ప్రేమించుట అమ్మ మతమురా
అందరినీ దీవించుట అభిమతమ్మురా
అమ్మల గన్నమ్మ అనసూయమ్మరా
అనసూయ నామమే అమృతమ్మురా ॥ అ ॥

అమ్మ అను మాట అది కమ్మని మాట
అది చక్కని పాట అదె చక్కెర మూట
జననిసేవ సద్గతులను చక్కని హామీ - జగ
జ్జనని అనసూయ సర్వాంతర్యామి ! ॥ అ ॥

- నదీరా

# 216
# దీపారాధన

మనిషి కష్టంలో పడ్డప్పుడు -- దైవాన్ని ప్రార్థిస్తాడు. సుఖాన్ని కోరి - దైవాన్ని పూజిస్తాడు. దైవకృపను పొందాలనే బలమైన ఆకాంక్షతో దైవాన్ని స్తుతిస్తాడు. సర్వార్థ సాధకమైన దైవసహాయాన్ని అర్థిస్తూ దైవం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తాడు.

ఎక్కడో ఒక్కడు. . దుఃఖ విముక్తిని కల్గించమనీ, సుఖప్రాప్తిని ప్రసాదించమనీ వేడుకొనకుండా నిస్వార్థంగా, నిర్లిప్తంగా, నిర్మలంగా దైవాన్ని కొలవడం కద్దు. మరొక్కడు - పరతత్వ జ్ఞానంకోసమే, మోక్షం కోసమో మాత్రమే దైవారాధన చేయవచ్చు.

దైవం యందు విశ్వాసంకల ప్రతివాడూ ఏదో విధంగా, ఏదో మార్గంలో దైవారాధన చేస్తున్నాడు. అనేక సుమాలను ప్రసవించిన 'దైవారాధన' వల్లరికి పరిమళాలు వెదజల్లే ప్రఫుల్లకుసుమం 'వ్రతం'.

మనకు ప్రస్తుతం వాడుకలో కనిపిస్తున్నది - మాంగల్య బలం కోసం సువాసినులు నోచుకొనే అనేకమైన నోములు కాక - ప్రఖ్యాతమైన, సుప్రసిద్ధమైన శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం. అలాగే ఇటీవల బహుళ ప్రచారంలోకి వచ్చినవి... శ్రీ అనసూయావ్రతం, శ్రీ సత్యసాయిబాబా వ్రతం మొదలైనవి. ఏరూపంలో ఏనామంతో ఉన్నప్పటికీ వ్రతాలన్నిటికీ ప్రయోజనం మాత్రం... వ్రతాన్ని చేసుకునే వాళ్ళకూ, చూసే వాళ్ళకూ శుభప్రదమైన జీవితాన్ని అందించటం, చుట్టుముట్టి చెలరేగిన చెడును తొలగించడమే.

నేను మొట్టమొదట 1969వ సంవత్సరంలో శ్రీ అనసూయావ్రతానికి రూపకల్పన చెయ్యడం తమాషాగా జరిగింది. రేపల్లె తాలూకా సజావారి పాలెంలో అమ్మ యందు అచంచలమైన భక్తి విశ్వాసాలు గల కుటుంబం ఒకటి వుంది. అకస్మాత్తుగా వారి కుటుంబం కష్టాల ఊబిలో చిక్కుకుంది. వాళ్ళు ఆర్తితో అమ్మవద్దకు వచ్చి సత్యనారాయణస్వామి వ్రతం చేసుకుంటా మన్నారు. ఆ సమయంలో అక్కడనేవున్న సోదరుడు శ్రీ కాసు రాధాకృష్ణ రెడ్డి -- 'అమ్మవ్రతం' చేసుకొనండి అని వాళ్ళను ఆదేశించి 'అమ్మవ్రతం చేయించు' - అని నన్ను ఆజ్ఞాపించాడు.

నేను అమ్మ పూజారిని కదా ! ఆ మాటను అమ్మశాసనంగానే స్వీకరించాను. ఆమాటే సిద్ధవాక్కై అమోఘ సంకల్పమై అనసూయా వ్రతంగా అందమైన రూపుదిద్దుకుంది.

ఆ కుటుంబంచే అనసూయావ్రతం చేయించాను. ఆ కుటుంబం అత్యంత భక్తి శ్రద్ధలతో వ్రతం చేసుకుంది. వారిగండం గడిచింది. వారి కష్టాలు ప్రళయ వాతోపహత మేఘాలై చెల్లాచెదరై పోయాయి.

ఇంకేమి - తర్వాత ఎందరో, ఎందరెందరో అమ్మవ్రతం చేసుకుని అనేక లాభాలనూ, శుభాలనూ పొందారు. ఆపదలనుండి బైటపడ్డారు.

'అనసూయావ్రతకల్పము' అన్న పేరున ఆ గ్రంథాన్ని శ్రీ విశ్వజననీ పరిషత్ ప్రచురించింది. మద్రాసు వాస్తవ్యులు శ్రీ కరూరి సూర్యనారాయణ గారు దానిని సంక్షిప్తంచేసి ఆడియో క్యాసెట్టును విడుదల చేశారు. ఇప్పుడు అనసూయావ్రతం చేసుకొనడం అందరికీ సులభసాధ్యమైపోయింది.

ఈ నేపథ్యంలో సోదరుడు శ్రీ ఏ.వి.ఆర్. సుబ్రహ్మణ్యంకు హైమవతీ వ్రతకల్పాన్ని రూపొందించాలన్న అత్యద్భుతమైన ఆలోచన కలగడం కేవలం అమ్మ సంకల్పమే. శ్రీ సుబ్రహ్మణ్యం కలం ద్వారా ప్రవహించింది అమ్మ అనుగ్రహామృతమే. కనుకనే అనతి కాలంలోనే హైమవతీ వ్రతకల్ప గ్రంథం రమణీయాకృతితో అమ్మ శ్రీ చరణ సరోజాలను చేరింది.

ఈ రచన అంతటిలో శ్రీ సుబ్రహ్మణ్యం సునిశితమైన మేధ. శిరీష కుసుమ పేశలమైన హృదయం అవిచ్ఛిన్నంగా, అవిభాజ్యంగా అభివ్యక్తమవుతూ ఈ వ్రత గ్రంధానికి ఒక విలక్షణ సౌందర్యాన్ని సమకూర్చాయి.

శ్రీ సుబ్రహ్మణ్యం 1970 నుంచి జిల్లెళ్ళమూడి వస్తూ అమ్మ తత్త్వాన్ని ఆకళించుకున్న ప్రజ్ఞాధురీణుడు. అమ్మ కృపా పాదోదధిలో స్నానమాడిన సచ్చరిత్రుపాడు. అమ్మ అనురాగ మలయమారుతంలో పరవశించిన సుహృదయుడు. అమ్మ చింతనలో చివురిస్తూ, అమ్మ సేవలో పులకిస్తున్న పుణ్యాత్ముడు.

అమ్మకు సన్నిహితుడైన అనేక విధాల సేవలందిస్తూ అమ్మ నుండి సూక్తి సుధనూ, రమణీయ వాక్య వజ్రాలనూ సంగ్రహించుకొన గల్గిన కుశలుడు శ్రీ సుబ్రహ్మణ్యం. శారదా స్వరూపిణి అమ్మ పూర్ణానుగ్రహం లేక పోతే - సాధారణ విద్యావంతుడైన శ్రీ సుబ్రహ్మణ్యం సంస్కృతంలో హైమనామాలూ, బహుపరాకులూ ఇంత అందంగా వ్రాయగలిగే వాడా ? శృతి లయల స్వరూప స్వభావాలను ఏమాత్రం ఎరుగని సుబ్రహ్మణ్యం మంగళహారతి పాటను ఇంత నిర్దుష్టంగా నిసర్గ సుందరంగా రచించ గలిగేవాడా ?

శ్రీ సుబ్రహ్మణ్యం సంకలనం చేసిన హైమవతీ అష్టోత్తర శతనామావళి చదువుతుంటే - మందగమన, మందస్మిత వదన, స్మిత పూర్వాభిభాషిణి వగైరా నామాలు దృగ్గోచరమౌతాయి. 1968లో హైమ పార్థివ శరీరం అదృశ్యంకాగా, 1970లో జిల్లెళ్ళమూడిలో అడుగిడిన సుబ్రహ్మణ్యం ఆ నామాలను ఎలా వ్రాయగలిగాడు ? "శ్రీ హైమవతీ దర్శనం" పొందినవాడు మాత్రమే ఆ నామాలను పలకగలడు.

వ్రాసే అదృష్టం శ్రీ సుబ్రహ్మణ్యాన్ని ఎలా వరించిందో ఈ గ్రంథాన్ని వెలుగులోకి తీసుకు వచ్చే అదృష్టం డాక్టరు ఆచంట కేశవరావు శ్రీమతి అన్నపూర్ణ దంపతులను వరించింది. ఆ దంపతులు అమ్మకు ముద్దు బిడ్డలు. ఎల్లప్పుడూ అమ్మ ఒడిలో ఆడుకునే పసివాళ్ళు. కల్లాకపటం ఎరుగని నిర్మల హృదయులు. అమ్మ నుండి ఆశ్రిత 'వాత్సల్యం' వారసత్వంగా పొందిన గుణ సంపన్నులు. డాక్టరు కేశవరావుగారు శ్రీరామనవమినాడే జన్మించి అమ్మనే శ్రీరామచంద్రునిగా సంభావించి అమ్మను ఆరాధించుకుంటున్న భక్తాగ్రేసరుడు.

ఆ దంపతుల ఔదార్యంతో చేయూతతో ఇంకా ఇటువంటి గ్రంథాలు అనేకం వెలుగులోకి రావాలనీ.... తీసుకు రావాలనీ అక్షర రూపిణి అమ్మను అర్థిస్తున్నాను.

రచయిత శ్రీ సుబ్రహ్మణ్యం బలమైన పదునైన కలం ఇంకా అనేక రచనలకు కారణం కావాలని అమ్మను వేడుకొందాము

ఈ గ్రంథం మానవాళికి మహోపకారమై ఆపదల్లో చిక్కుకున్న జనసందోహాలను సముద్ధరించి -- వారికి అమ్మ, హైమల అనుగ్రహాన్ని అందించాలనీ, వారివారి జీవిత ఆకాశంలో అమ్మా, హైమల సూర్యచంద్రుల మహోదయానికి మూలకారణం కావాలనీ ప్రగాఢంగా ఆశిస్తున్నాను.

అమ్మా హైమల కారుణ్య సాధనకు బలమైన ఉపకరణం ఈ వ్రతం అని నా విశ్వాసం.

ఈ గ్రంథం వెలుగులోకి రావటానికి కారణభూతులైన శ్రీ సుబ్రహ్మణ్యం, డాక్టరు కేశవరావు, శ్రీమతి అన్నపూర్ణమ్మగార్లను మనసారా అభినందిస్తూ అమ్మాహైమల పరిపూర్ణమైన అనుగ్రహం వారిపై సదా ప్రసరించాలని అమ్మను మరీ మరీ ప్రార్థిస్తున్నాను. శ్రీ ఏ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం రచించిన హైమవతి వ్రతకల్పం గ్రంథానికి ఇది పీఠిక.

(5.5 1994)



# 217
# అమ్మ - అన్నసూక్తము

1. అమ్మకు ఇష్టమైన అర్చన ధాన్యాభిషేకం.
2 అమ్మకు ఇష్టమైన కార్యం బిడ్డలకు అన్నం పెట్టుకోవటం.
3. అమ్మకు ఇష్టమైన వాళ్ళు అన్నదాతలు.
4. ప్రేమసాగర అయిన అమ్మకు ఆజన్మ విరోధి బిడ్డల ఆకలి.
5. అమ్మ ఆయుధాలు గిన్నెలు, గరిటలు
6. అమ్మ గుండె అన్నపూర్ణాలయం.
7. అమ్మ గుండెచప్పుళ్ళు అన్నపూర్ణాలయంలోని గుండిగల మోతలు.
8. ఒక ఉత్సవంలో వంటవాడు అడిగాడు - అమ్మా ఏం స్వీటు చేయమంటావూ? అని అపుడు అమ్మ చెప్పింది - చేసిన పదార్థం అందరికీ అందటంకంటే స్వీట్ ఏముంటుంది ? అది చేయండి !!
9. అమ్మ సన్నిధిలో చండీయాగం చేసుకున్న యజమాని ఆ హోమగుండంలో ఏమైనా వెయ్యమని అమ్మను అడిగితే - అమ్మ అన్నది "నేనేమి వెయ్యవలసి వచ్చినా - గాడి పొయ్యిలోనే వేస్తాను".
10. అమ్మ ప్రారంభించిన "అన్నపూర్ణాలయంలో - ఎవరికి భోజనం పెట్టాలి ? అన్న మీమాంస వచ్చినపుడు అమ్మ ప్రవచించింది -- "ద్రస్సూ, అడ్రస్సూ చూసి కాదు, ఆకలే అర్హతగా, ఆదరణే అనుపాకంగా పెట్టండి" -
11. అమ్మ అవతారనామం అన్నావతారం.
12. నారాశి బియ్యపురాశి - అమ్మ

# 218
# "అంతా"

ఆకృతి దాల్చిన లావణ్యం
మృదు మధురమైన అమోఘ వచనం
అనుగ్రహపూర్ణమైన ప్రసన్న వీక్షణం
మహనీయమైన జగన్మాతృ భావన
పరిణతి చెందిన మనస్సు
పరిపక్వమైన హృదయం
పరిపూర్ణమైన జ్ఞానం
పరమోన్నతిని చేరిన యోగం
సర్వసమదృష్టి
సర్వత్రానురాగం
వాత్సల్యామృత వర్షం
మహిమాన్విత చరితం
సరిహద్దులు లేని సహనం
కన్ను నిండా తొణికిసలాడే కారుణ్యం
ఆకలీ అలసట ఎరుగని నిత్య చైతన్య స్థితి
చూడగానే ఎవరినైనా ఆహ్లాదపరిచే బ్రహ్మవర్చస్సు --
- ఈ షోడశ దివ్య కళలకూ మానవరూపమే అమ్మ
మానవ వరీరంలో శోభిల్లే మాధవత్వమే అమ్మ.

భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ చేత ప్రవచింపబడ్డ స్థితప్రజ్ఞలక్షణాలకు సజీవోదాహరణమే అమ్మ.

వేదవేదాంగాల్లో అభివర్ణితమైన తత్త్వసారానికి మానవాంగన రూపమే అమ్మ

ఆ పరమాద్భుత వ్యక్తికి సమకాలికులై ఆ పుణ్యమూర్తిని దర్శించి ఆ దివ్య ప్రేమను అనుభవించిన వాళ్ళు పరమ ధన్యులు. కనీసం ఆ లోకోత్తర చరిత్రను చదివి ఆనందించగలిగినవాళ్ళూ ధన్యులే



# శ్రీకరి ! శంకరి !

శ్రీకరి ! శంకరి ! గౌరి ! పరాత్పరి ! అర్కపురీశ్వరి ! అనసూయే !

భక్త వశంకరి దైత్య లయంకరి సర్వ శివంకరి శ్రీ సదనే
షడ్గుణ మంజరి సద్గుణ నిర్ఝరి చిద్ఘన సుందరి శ్రీ చరణే !

జ్ఞాన వికాసిని దాన వినోదిని రమ్య యశస్విని నిత్య సుఖే
తత్త్వ సుబోధిని మేరు నివాసిని వేద విహారిణి ఇందు ముఖే !

మత్స్య సులోచని సత్య సుభాషిణి నిత్య విరాగిణి ప్రేమ ముఖే
భేద విభేదిని ధర్మ వివర్ధిని విశ్వ విమోహిని దీప్త సఖే !

పార్వతి పావని దుర్గతి నాశిని సద్గతి దాయిని హంస వతే
సంకట హారిణి సంశయ వారిణి సంసృతి తారిణి సర్వ జితే !

సద్గుణ మండిత పండిత సంస్తుత సచ్చరి తాన్విత కీర్తి యుతే
రాగ విభూషిత త్యాగ విరాజిత యోగ విభాసిత భూత హితే !

సజ్జన రంజని దుర్జన భంజని పూర్ణ నిరంజని ధర్మ యుతే
సూనృత భాషిణి ఆదృతి రూపిణి జాగృతి కారిణి వేద నుతే !

నిత్య వినూతన సత్య సనాతన శాంతి నికేతన మోద కరే
జీవన పావన పావన భావన భావన కారణ జ్ఞాన ఝరే !

పాశ వినాశక పాప విదారక తాప నివారక పాద యుతే
బుద్ధి వివర్ధక మృత్యు కుఠారిక ముక్తి విధాయక సత్య గతే !

మంగళ రూపిణి మంజుల భాషిణి సర్వ హితైషిణి చారు మతే
ఆశ్రిత తోషిణి, అమృత వర్షిణి అంధ విమోచని చంద్ర మతే !

- కొండముది రామకృష్ణ



# స్వర్ణోత్సవ వర్ణచిత్రం!

ఉదయమిదే . ..
ఉదయ మిదే స్వర్ణోదయం శుభోదయం సుధామయం
మాతృశ్రీ స్వర్ణోత్సవ మహోదయం !

ఆలయమును వదిలె అన్నపూర్ణ కదిలె
అమరప్రేమ నదులే ఆ తల్లి కనుల మెదిలె
ఏబదేండ్ల తల్లియో ఏ పదేండ్ల పిల్లయో
అనిపించెను జనని కనిపెంచెను మనని ! ఉదయమిదే ......

అటు జనములు ! అటు జనములు ! ఎటు జూచిన యోజనములు !
జనగణముల భోజనములు ! జననికి నీరాజనములు !
జగతిప్రగతిసుగతికి సమభావమే నిదర్శనం
జయప్రదం శుభప్రదం జగజ్జననిదర్శనం ! ఉదయమిదే ......

అంతులేని జగతికి అనంతమైన ప్రగతికి
అనాదియైన అమ్మ ! పునాదియేను సుమ్మా !
విశ్వములను తొల్లి ! విరజల్లిన తల్లి !
పుడమి వెలసె మళ్ళీ పరిఫుల్ల కల్పవల్లి !! ఉదయమిదే ......

అసూయయే నరకమని అసూయను నరుకమని
ఆచరించె జనని అనుసరించమంది మనని
స్వ పర భేద మెరుగని సహజీవనమే మెరుగని
చాటివేసె జనని పూలబాట వేసె నవని ! ఉదయమిదే ......

జగజగాల యుగయుగాల నరనారీ హృదయేశ్వరి
జగదీశ్వరి యోగేశ్వరి నాగేశ్వరభాగేశ్వరి
జనని స్వర్ణోత్సవం జగతికే నేత్రోత్సవం !!
సమతా మహోత్సవం ! మమతామధురోత్సవం !!!

ఉదయ మిదే స్వర్ణోదయం శుభోదయం సుధామయం
మాతృశ్రీ స్వర్ణోత్సవ మహోత్సవం

\- నదీరా



# అంబికా మంగళా శాసనమ్

అనసూయే ! జగన్మాతః ! అర్కగ్రామ నివాసిని !
శ్రీమన్నాగేశదయితే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 1

నిత్యాన్నప్రదే ! నిత్యే ! నిత్యానంద ప్రదాయిని !
దివ్యజ్ఞానయుతే ! మాతః ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 2

ఆబాల వృద్ధలోకేషు కృపాపీయూష వర్షిణీ !
సమస్త జగదారాధ్యే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 3

మహామోహాన్ధకారస్య మధ్యందిన రవిప్రభే !
జగన్మంగళ సద్రూపే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 4

శాశ్వతే ! సచ్చిదానన్దే ! సన్మునీంద్రాభివందితే !
సమస్తజగతామాద్యే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 5

యోగినామపి దుర్గ్రాహ్యే ! యోగనిద్రా మధిశ్రితే !
యుక్తి యుక్త మహాలాపే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 6

సుగుణే ! సులభే ! శుభ్రే ! శుద్ధాద్వైత స్వరూపిణి !
సూక్తి మౌక్తిక సచ్ఛుక్తే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 7

రాజరాజేశ్వరీరూపే ! రేణుకే ! ఛిన్నమస్తకే !
కామధేనో ! కళారూపే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 8

పాపాభ్రపటలీఝ్వాత్యే ! బ్రహ్మాండాన్వయదీపికే !
శివేనసూయే ! చిచ్ఛక్తే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ ॥ 9

విశ్వమానవ కళ్యాణ కారిణి ! ప్రియదర్శనే !
శివే[illegible] ! సిద్ధార్థే ! తుభ్యం దేవ్యస్తు మంగళమ్ 10

సమస్త జగదాధారశక్తి [illegible]మే ! పరే !
మహామాయేనసూయే ! తే మాత రస్తు సుమంగళమ్ ॥ 11

- పన్నాల రాధాకృష్ణశర్మ

